శ్రీ

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః

# పోతన చరిత్రము

## మహాకావ్యము.



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారి ప్రోత్సాహముతో
ముద్రితము.



రచయిత

వానమామలై వరదాచార్యులు



ఉ. "కాటుక కంటినీరు చనుగట్టు పయింబడ
నేలయేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలి కోడల! యో
మదంబ! యో
హాటక గర్భురాణి! నిను నాఁకటికిం
గొనిపోయి యల్లక
ర్ణాట కిరాట కీచకుల కమ్మఁ త్రిశుద్ధిగ
నమ్ము భారతీ!"





# అంకితము.

ఏతనిచేత భాగవతమిప్డు రహిన్మను తెన్గుబాసలోఁ
పేతము లాంధ్రజాతికి రసింపవచింపఁగఁ జేసి, కొంటివా
పోతన సచ్చరిత్రమిదె పుణ్య ప్రబంధముగూర్చి భక్తిమైఁ
జేతు సమర్పణంబు కృతి స్వీకృతి చేయుము శ్రీరఘూత్తమా.

## గ్రంథకర్త జననీజనకులు.



శ్రీమాన్ బిక్కయ్య శాస్త్రిగారు

శ్రీమతి సీతాంబగారు

"బ్రతికి 'బిక్కయ్యశాస్త్రి'
పురాణము వినవలెను
చచ్చి స్వర్గమ్ము పోవలెననుచును
ప్రజయె లోకోక్తినొందు
కలినమొనరె"

"మాతల్లి 'సీత' బ్రహ్మజ్ఞ జనకజాత
అఘదైత్యభీత, జ్ఞానాగ్నిపూత"



శ్రీ వరదాచార్యులు                శ్రీమతి వైదేహి.

# కృతజ్ఞతలు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ శాఖనుండి, ఈ గ్రంథమునకు 10,000 రూ॥
గ్రాంటు మంజూరుచేసి యీ ముద్రణకు కారకులైన ఆంధ్రప్రదేశ్
ప్రభుత్వమునకు, ముఖ్యమంత్రివర్యులు.

**గౌ॥ శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డిగారికి**

ఆర్థిక పారిశ్రామిక శాఖామాత్యులు

**గౌ॥ శ్రీ మర్రి చెన్నారెడ్డిగారికి**

విద్యాశాఖామాత్యులు

**గౌ॥ శ్రీ పి. బలరామ రెడ్డిగారికి**

నా హృదయపూర్వక కృతజ్ఞత లర్పించుకొను చున్నాను.

ఈ గ్రంథ ముద్రణమునకై అన్నివిధాల సహాయ
సహకారము లొనర్చిన

---

మాన్యవరులు "ఆ. ప్ర. ప్రధానన్యాయమూర్తులు"

**గౌ॥ శ్రీ పింగలి జగన్మోహన రెడ్డిగారికిని**

నాహార్దిక కృతజ్ఞతల నర్పించుకొను చున్నాను.

ఇట్లు

**గ్రంథ రచయిత.**

# తొలిపలుకు

ఆధునికాంధ్ర కవిత్వ మనఁగనే భావకవిత్వము, గేయకవిత్వము, అభ్యుదయ కవిత్వము, వచన కవిత్వము అను ప్రముఖ నూత్న కవితారీతులు మానసమున స్ఫురించును. దీనికిఁ గారణము బహుసంఖ్యాకులైన యువకు లా రీతుల నాదరించి యందుఁ జక్కని కవిత్వము వెలయించుటయే. ఈ రీతిగా నూత్న కవితా మార్గములలో సంచరించువారితో పాటు ప్రాఁత సంప్రదాయములను యథా తథముగా ననుసరించియుఁ బ్రాఁత మార్గముతో నూతన రీతుల మేళవించియుఁ గవిత్వము వ్రాయువారుకూడ నిప్పుడు కొందఱున్నారు. వీరి రచనలలోఁ బురాణములు, మహాకావ్యములు, ప్రబంధములు, లఘుకావ్యములుకూడఁ గానిపించును. శివభారతము, రాణాప్రతాపసింహ చరిత్రము, శ్రీమద్రామాయణ కల్పవృక్షము, ఆంధ్ర పురాణము, సౌందర నందము మున్నగు కావ్యములు 'నూతనముం బ్రాగ్గుణ శోభితమ్ము'నగు రచనా విశేషముతోఁ గూడిన యుత్తమ కృతులు. వీనిలోఁ గొన్నింట వస్తువునందుఁ గొన్నింట శైలీభావవ్యక్తీకరణములందు నవ్యత గోచరించును, మరల నీ నవ్యతా ప్రాచీనతల పాళ్ళ నిష్పత్తిలో హెచ్చుతగ్గు లుండుటయుఁ గలదు. నవ్యతా శోభితమయ్యుఁ బ్రాచీనతా పరిమళముల గుబాళింపులఁ బుక్కిలించిన యాధునికాంధ్ర మహాకావ్య రత్నములలో శ్రీ వానమామలై వరదాచార్యులవారి పోతనచరిత్ర మొకటి.

పూర్వాంధ్ర మహాకవుల జీవిత చరిత్రలఁ దెలిసికొని యానందించు భాగ్యమునకు మనమంతగా నోచుకొని యుండలేదు. వారి రచనలందలి సౌందర్యమునువలె వారి జీవితములందలి సౌష్ఠవము నాస్వాదించి యలరుట కాధారము లత్యల్పములు. కొందఱు కవుల జీవిత విశేషములు కొన్ని తెలిసినను అవి చరిత్రనికషోపల పరీక్ష కెంతవఱకు నిల్చునో చెప్పఁజాలము. అందుఁ గొన్ని పుక్కిటి పురాణము లనుటకును అవకాశమున్నది. కాని యా పురాణముల నుండియే శ్రమపడి చారిత్రిక సత్యములను సేకరించుకొనవలయును. ఆంధ్ర వాఙ్మయమునందలి పురాణ ప్రబంధసంధి యుగమునకు సూర్య చంద్రులని చెప్పఁదగినవారు శ్రీనాథ పోతన మహాకవులు. వీరి జీవితములనుగూర్చి, సంబంధ బాంధవ్యములనుగూర్చి చెప్పు కథలు పెక్కు మన దేశమునఁ బ్రచారమున నున్నవి. ఆ మహాకవు లందలి యాదరాభిమానములచే నాంధ్రులు వానినే మరల మరలఁ జదివి యానందించుచుందురు. శ్రీ వరదాచార్యులవారు వాని నన్నిటిని జదివి, చారిత్రికాంశములతో మేళవించి, యెడనెడఁ గావ్యోచితములైన వర్ణనలను గథాంశములను గల్పించి యీ మహాకావ్యమును సర్వాంగ సౌష్ఠవముగాఁ దీర్చిదిద్దినారు. ఒక మహాకవి జీవిత చరిత్రామృతమును మఱొక మహాకవి కమ్ర కవితారసాయనమును గలిపి యాంధ్రుల కందిచ్చి యానంద పారవశ్యమును గల్పించు నవ్య సువర్ణపాత్ర మీ పోతనచరిత్ర మహాకావ్యము.

పోతనగారి జీవిత మెంత విచిత్రమైనదో యంత విశిష్టమైనది. అది యంద ఱెఱింగినదే. ఆవరించిన దారిద్ర్య కాళరాత్రిలో నల్పలౌకిక భోగభాగ్యకాంతి ప్రలోభనములకు

వశుఁడై తడబడక భాగవత తేజఃపుంజమును సృష్టించి దివ్యదర్శనము పొందఁజాలిన మహానుభావుఁడు బమ్మెరపోతన. అతఁడు గురుశిక్షణము నొందకయు సహజ ప్రతిభా భాసురుఁడగుటచే నఖిలశాస్త్ర నిపుణుఁడును సహజ పాండిత్య విభ్రాజితుఁడునై తేనెలొలుకు తెలుఁగు భాషలో మహాభాగవతమును రచించి యెన్ని యిక్కట్లు కలిగినను లెక్కసేయక దానిని దైవమున కంకితముచేసి తాను దరించుటయేకాక తెలుఁగువారి కందఱికిని దరణోపాయమును జూపించెను. అతని భక్తిభావమున కలరియే చిదానందయోగి యతనికి రామతారక శారదా మంత్రముల నుపదేశించెను. ఆ యుపదేశమే తెలుఁగువాణి కొక యపూర్వాలంకారమును దెలుఁగు వారికి సుగమమైన యొక తారకమార్గమును బ్రసాదించెను. పోతన యన్నమాట కెదురాడలేక దానిని గర్ణాట ప్రభువున కంకితముసేయ నంగీకరించినను భగవంతుని యభిప్రాయము భిన్నమగుటచే నది యట్లు జరుగుట కవకాశము లేకపోయెను. 'కూర్చుట నూత్నరత్నమునకుం గనకంబునకుం దగు'నన్నట్లా మహాకావ్య రత్నమునకుఁ గృతిపతిత్వము వహించు నర్హత పురుషోత్తముఁడైన శ్రీరామచంద్రుని కొక్కనికే కలదు. అతఁడు వెదకి వెదకి పోతరాజు నరసి యాతని నభ్యర్థించి యా కావ్యము వ్రాయించుకొనెను. అది యన్యుల పాలగుట కాతఁ డంగీకరించునా?

శ్రీమద్భాగవతము తెలుఁగున వెలసిన పరిస్థితులను వివరించు నుదంతముతో నీ కావ్య మారంభించు చున్నది. తత్త్వమును దెల్పి మోక్ష మొసంగు భాగవతము వేదపురాణాదుల యావిష్కారమున కాలంబమైన దేవభాషలోఁగాక యన్యభాషలో వెలయుట దేవతలకెల్ల నవజ్ఞయౌనని భావించి యింద్రుఁడు "ఇది వేఱొకభాష రచింప నా దృతిందనరిన నట్టి బాసలకు దాసుఁడనయ్యెద మూఁడు జన్మముల్" అని ప్రతిన గావించెను. ఈ విషయము నారదుఁడు వ్యాసుని కెఱిఁగించెను. వ్యాసుఁడు కాశికేగి భాగవతము వెలయుటకై సంస్కృతమ్ము వలె సారవంతమ్మగు బాస నొసంగుమని పరమేశ్వరుని ప్రార్థించెను. పరమేశ్వరుఁడు త్రిలింగ భాషలో పోతన యనుకవి దానిని రచించునని పల్కెను. వాయు వీ వార్త మోసి కొనిపోయి యింద్రుని చెవిలో నూదెను. ఇంద్రాదులు విష్ణుని దర్శించి దేవవాణికిఁ దెలుఁగుతోఁగల్గు పోటిని వారింపుమని వేఁడుకొనిరి. విష్ణువు మొదట తప్పుకొనఁ జూచెనుగాని పిమ్మట దేవతల నిర్బంధముచేఁ గవులు తపస్సమాధివినా కావ్యరచన చేయుట కవకాశ ముండదు కావునఁ బోతన తపము చెఱుచుట కుపాయము లాలోచింపుఁడని సూచించెను. ఇంద్రాదులు సింగభూపాదులై జనించి ఆంధ్ర భాగవతమును నరాంకితమగునట్లొనర్చి దాని మోక్షప్రదత్వమునకు భంగము కలిగింప యత్నించిరి. విష్ణువున కింద్రుఁడు సోదరుఁడౌట నిజమైనను భక్తుఁ డాత్మతుల్యుఁడైన పుత్రుఁడగుటచే నా మహానుభావుఁడు భక్తునిఁ గాపాడి ధర్మసంపద నుద్ధరించెను. ఈ కథ పోతన జీవితమున జరిగిన కొన్ని యంశముల కతిలోకమైన పూర్వరంగమును నిర్మించుటతోపాటు తెలుఁగుభాష మాహాత్మ్యమును గీర్వాణ భాషా తుల్యత్వమునుగూడఁ జాటుచున్నది.

వఖుఁడై తడబడక భాగవత తేజఃపుంజమును సృష్టించి దివ్యదర్శనము పొందఁజాలిన మహాను భావుఁడు బమ్మెరపోతన. అతఁడు గురుశిక్షణము నొందకయు సహజ ప్రతిభా భాసురుఁ డగుటచే నఖిలశాస్త్ర నిపుణుఁడును సహజ పాండిత్య విభ్రాజితుఁడునై తేనెలొలుకు తెలుఁగు భాషలో మహాభాగవతమును రచించి యెన్ని యిక్కట్లు కలిగినను లెక్కసేయక దానిని దైవమున కంకితముచేసి తాను దరించుటయేకాక తెలుఁగువారి కందటికిని దరణోపాయమును జూపించెను. అతని భక్తిభావమున కలరియే చిదానందయోగి యతనికి రామతారక శారదా మంత్రముల నుపదేశించెను. ఆ యుపదేశమే తెలుఁగువాణి కొక యపూర్వాలంకారమును దెలుఁగు వారికి సుగమమైన యొక తారకమార్గమును బ్రసాదించెను. పోతన యన్నమాట కెదురాడలేక దానిని గర్ణాట ప్రభువున కంకితముసేయ నంగీకరించినను భగవంతుని యభి ప్రాయము భిన్నమగుటచే నది యట్లు జరుగుట కవకాశము లేకపోయెను. 'కూర్చుట నూత్నరత్నమునకుం గనకంబునకుం దగు'నన్నట్లా మహాకావ్య రత్నమునకుఁ గృతి పతిత్వము వహించు నర్హత పురుషోత్తముఁడైన శ్రీరామచంద్రుని కొక్కనికే కలదు. అతఁడు వెదకి వెదకి పోతరాజు నరసి యాతని నభ్యర్థించి యా కావ్యము వ్రాయించుకొనెను. అది యన్యుల పాలగుట కాతఁ డంగీకరించునా ?

శ్రీమద్భాగవతము తెలుఁగున వెలసిన పరిస్థితులను వివరించు నుదంతముతో నీ కావ్య మారంభించు చున్నది. తత్త్వమును దెల్పి మోక్ష మొసంగు భాగవతము వేదపురాణాదుల యావిష్కారమున కాలంబమైన దేవభాషలోఁగాక యన్యభాషలో వెలయుట దేవతలకెల్ల నవజ్ఞయౌనని భావించి యింద్రుఁడు "ఇది వేఱొకభాష రచింప నా దృతిందనరిన నట్టి బాస లకు దాసుఁడనయ్యెద మూఁడు జన్మముల్'' అని ప్రతిన గావించెను. ఈ విషయము నార దుఁడు వ్యాసుని కెఱిఁగించెను. వ్యాసుఁడు కాశికేగి భాగవతము వెలయుటకై సంస్కృతమ్ము వలె సారవంతమ్మగు బాస నొసంగుమని పరమేశ్వరుని ప్రార్థించెను. పరమేశ్వరుఁడు త్రిలింగ భాషలో పోతన యనుకవి దానిని రచించునని పల్కెను. వాయు వీ వార్త మోసి కొనిపోయి యింద్రుని చెవిలో నూదెను. ఇంద్రాదులు విష్ణుని దర్శించి దేవవాణికిఁ దెలుఁ గుతోఁగల్గు పోటిని వారింపుమని వేఁడుకొనిరి. విష్ణువు మొదట తప్పుకొనఁ జూచెనుగాని పిమ్మట దేవతల నిర్బంధముచేఁ గవులు తపస్సమాధివినా కావ్యరచన చేయుట కవకాశ ముండదు కావునఁ బోతన తపము చెఱుచుట కుపాయము లాలోచింపుఁడని సూచించెను. ఇంద్రాదులు సింగభూపాదులై జనించి ఆంధ్ర భాగవతమును నరాంకితమగున ట్లొనర్చి దాని మోక్షప్రదత్వమునకు భంగము కలిగింప యత్నించిరి. విష్ణువున కింద్రుఁడు సోదరుఁడౌట నిజమైనను భక్తుఁ డాత్మతుల్యుఁడైన పుత్రుఁడగుటచే నా మహానుభావుఁడు భక్తునిఁ గాపాడి ధర్మసంపద నుద్ధరించెను. ఈ కథ పోతన జీవితమున జరిగిన కొన్ని యంశముల కతిలోక మైన పూర్వరంగమును నిర్మించుటతోపాటు తెలుఁగుభాష మాహాత్మ్యమును గీర్వాణ భాషా తుల్యత్వమునుగూడఁ జాటుచున్నది.

# IV

"శ్రీరామాకృతి సీతాభామిని సొమ్మగుట నిట్టి భాగవత కృతిన్
మామక కృష్ణాకృతిగాను సోమస్థితినిశినిబొందు సూర్యార్చివలెన్"

అని పలికి యాతని కూఱట కలిగించెను. అందుచేఁ బోతన గ్రంథాదిని శ్రీకృష్ణునే స్తుతించి యాశ్వాసాద్యంతములందు శ్రీరాముని సంబోధించెను. ఈ సమన్వయము చాల రమ్యమై శ్రీరామకృష్ణుల యద్వైత భావముతోపాటు జగత్ప్రసిద్ధమైన శ్రీరాముని యేకపత్నీ వ్రతమునుగూడ దెల్పగాఁ బ్రకటము చేయుచున్నది. ఆంధ్ర భాగవతమునకుఁ గృతిపతి గోపాలుఁడే శ్రోతమాత్రము శ్రీరామచంద్రుఁడు.

శ్రీరాముఁడు స్వప్నమున సాక్షాత్కరించి తన్ను శిక్షించిన పిమ్మట సింగనృపాలుఁడు భాగవతమును దెప్పించి పరిశీలింప నందలి కొన్ని భాగములు క్రిమిదష్టములై యుండెను. ఆతఁడు విచారించి యా శిథిలిత భాగములను బూరించునట్లు చేయుటకై భాగవతమును శ్రీనాథునిద్వారా బమ్మెరకుఁ బంపెను. బమ్మెరలోఁ బోతన లేకుండెను శ్రీనాథుఁడు భాగవతమునఁ గొంతభాగము శిథిలమైపోయిన విషయము మల్లనకుఁ దెల్పి దాని నతఁడు పూరింపవలెనని కోరెను. మల్లన "మజ్జనకులులేని యీ వెలితి స్వాంతమునుం గబళించు, గ్రంథలేఖన మొనరింప నోపనిఁక గంగన సింగన నారయాళి వక్కణ లిఖియించి పంచి త్వరగాఁ బిలిపించెదనంచు వాకొనెన్." తరువాత శ్రీనాథుఁ డొంటిమిట్ట కరిగి పోతనను దర్శించి యతనినే శిథిలభాగ పూరణ మొనరింపుమని కోరెను. పోతన శ్రీరాము నాజ్ఞలేనిదే కృతిరచించుట తనవలనఁ గాదని పల్కి, తానొకప్పుడు భాగవతము రచించు భాగ్య మబ్బెనని సంతసించుతఱి శిష్యులు తన్ను సమీపించి 'ఓ గురువరేణ్యా : యా యదృష్టము మా బోంట్ల కబ్బునె యనఁ" దాను దైవకృపా విశేషమునఁ దప్పక వారికిఁగూడ నట్టి భాగ్య మబ్బునని పల్కియుండెననియు, నది యట్లే యయ్యెననియుఁ దెల్పి యానందించెను. అందుచే శిథిల భాగములను నారయాదులే పూరించుట తటస్థించెను 'శిథిల భాగములను మరల నెవ్వరో పూరింప నేల? ఏకసంథాగ్రాహియైన పోతనయే యా భాగములను స్మృతి ననుసరించి మరల వ్రాయలేక పోయెనా' యన్న దాని కారంభముననే కవిగారొక కారణమును సూచించి యున్నారు. చిదానందయోగి పోతనకు శ్రీరామ మంత్రముతోపాటు శారదా మంత్రమునుగూడ నుపదేశించి దానిని బ్రహ్మచర్య వ్రతముతోఁ బండ్రెండేండ్లు జపింపవలెననియు నట్లు చేసినచో నతఁడు కావ్యాదులను బఠించునప్పుడు వాణి వీణాపాణియై యాతనియందు వసించుననియు, నెట్టి గ్రంథమైన నొకసారి చూచినంతనే నోటికి వచ్చుననియు, బ్రహ్మచర్య వ్రతదీక్షకు విఘ్నము వాటిల్లినచోఁ "గావ్యకల్పనాధార యొక్కటియె దక్కి ధారణాశక్తి తరలిపోవుననియు నెఱింగించెను. పోతన వివాహమాడిన పిమ్మటఁగూడఁ బదకొండేండ్లు బ్రహ్మచర్య వ్రతదీక్ష నిర్విఘ్నముగా సాగించెను. కాని పండ్రెండవయేటఁ దల్లిదండ్రులు తీర్థాటనమున కరిగిన సందర్భమున దానికి భంగము వాటిల్లెను. అది కారణముగా చిదానందయోగి చెప్పిన ట్లాతనికిఁ గావ్యకల్పనాధార యొక్కటియే మిగులుటయు ధారణాశక్తి తరలిపోవుటయు సంభ

వించెను. పోతన శిథిలిత భాగములను జ్ఞాపకము చేసికొని మరల వ్రాయలేమి కివియే హేతువు. మఱియు శిష్యులకుఁగూడ భాగవత రచనాభాగ్య మబ్బునని యతఁ డాశీర్వదించి యుండెను. సిద్ధవాక్సంపన్నుఁడైన యాతని యాశీస్సునకు వైఫల్యము చేకూరునా ?

శ్రీనాథ పోతన లిరువురు నొకే యుగమునకుఁ జెందినవారనుట యెల్లరకు సమ్మతమే కాని వా రిరువురును సమకాలముననే జీవించిరని చెప్పుటకుఁ జారిత్రి కాధారములులేవు. మఱియు శ్రీనాథుఁడు తన కవితా పాండితీ శౌండీర్యములచే సర్వజ్ఞసింగమనీనిఁగూడ మెప్పించెననుట కాధారము లున్నవికాని యాతని కొల్వుననే యాస్థానకవిగా నుండెననుటకు సాక్ష్యములేదు. బహుశః శ్రీనాథుని వార్ధకమున పోతన యువకుఁడై యుండవచ్చును. వా రిరువురికిని బాంధవ్యముండెనను విషయముకూడ సందేహాస్పదమే. కాని లోకమున నట్టి కథలు ప్రచారములో నున్నవి. శ్రీ మదాచార్యుల వారి కావ్యమున వారి సమకాలికత్వమును బాంధవ్యమునుగూడఁ బ్రకటించి యుండిరి. శ్రీనాథుని చెల్లెలు పోతన భార్య. శ్రీనాథుని కూఁతురు శారద పోతన కుమారుడైన మల్లన భార్య. ఈ రెండు తెఱఁగుల బాంధవ్యము కావ్యమున యథోచితముగా వర్ణింపఁబడినది.

పోతన భాగవతము రచించిన పిమ్మట నాతని శిష్యులు శారదలేఖను శ్రీనాథునికిచ్చుట కరిగి సింగభూపాలుని కొల్వులో గురువుగారి భాగవతము నందలికొన్ని పద్యములు విన్పించిరి. శ్రీనాథ సింగభూపాలు రిరువురును వానిని విని యపారానందము చెందిరి. సింగభూపాలుని కా కావ్యము నంకితముగాఁ గొనవలెనను కోరిక పుట్టెను. సేనా సహితుఁడై యరిగిన సేనాపతి వరాహ విఘ్నిత ప్రయత్నుఁడై తిరిగి వచ్చెను. తరువాత శ్రీనాథుఁడే స్వయముగాఁ బోతనకడ కరుదెంచి పలువిధముల బోధించెను. కాని పోతన మనస్సున మార్పు కలుగలేదు. వా రిరువురును తిప్పన్నను దర్శించుటకై యోరుగంటి కరుదెంచిరి. కర్ణాటభూపతి భాగవతకృతి తనకీయ వేఁడుచు నుత్తరము పంపించెను. శ్రీనాథుఁడు తిప్పనకుఁ దాను వచ్చినపని తెల్పి యది నెఱవేరినఁగాని భోజనము చేయనని పట్టుపట్టెను. తిప్పన చేయునదిలేక కృతిని కర్ణాట భూపాలుని కిమ్మని పోతనతోఁ జెప్పెను. పోతన్న యన్న యానతి మీఱఁజాలక యందు కంగీకరించెను. ప్రయత్నములు జరుగుచుండెను. పోతనకు మెట్టకుధరమున సరస్వతి విలపించుచు దర్శన మిచ్చెను. పోతన "కర్నాట కిరాట కీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్మ భారతీ!" యని వాగ్దాన మొనరించి యామె నోదార్చెను. లోకమున సింగభూపాలుని వృత్తాంతమున కున్నంత ప్రచార మీ కర్ణాట రాజవృత్తాంతమునకు లేదు.

పోతన పరోపకార తత్పరతను భగవంతుని భక్తపరాధీనతను బ్రదర్శించుటకై కవిగారీ కావ్యమునఁ గొన్ని రమణీయములైన సన్నివేశములను గల్పించి యున్నారు. పోతన కవితా లేఖన మొనర్చి యన్నకు వినిపింప గృహోన్ముఖుండగుచు మార్గమధ్యమున నిరుపేద యగు నొక జవరాలిని అమె భర్తనుగాంచి వారి కష్టములు విచారించి వారికి బత్తెమిచ్చి పంపుట, పోచయ్యాయను కాపు పోతనను జంపఁదలంచి చెఱువుకడ కరిగి సర్పదష్టుఁడై

నేలఁగూల పోతన విరోధియని భావింపక పసరుపిండి యతనిఁ జీవింపఁ జేయుట, ధాన్యము బదులుకొని వచ్చుటకై పోతన గ్రామములోని కేగుచుఁ గోమటి యొక భిక్షుకునిఁ గొట్టఁబోవ నడ్డముగా నరిగి క్షతగాత్రుఁడయ్యు విస్మృతిఁగొన్న యా భిక్షుకునికిఁ బరిచర్య లొనర్చుట, మున్నగునవి పోతన త్యాగశీలమునకును బరోపకార పరాయణతకును దార్కాణములు. ఆ భిక్షుకుఁడు కృతజ్ఞతా పూర్వకముగా పోతనకొక గంటమునిచ్చి తరువాతఁ జీఁకటిలో బయటి కరుదెంచి యదృశ్యుఁడయ్యెను పిమ్మట శ్రీరాముఁడే యట్లువచ్చి యా గంటమును దన కర్పించెనని పోతన యెఱింగెను. ఆ గంటముతోనే పోతన శ్రీమద్భాగవతమును లిఖించెను పోతన అల వైకుంఠపురంబులో" అను పద్యమును ముగింపకయే యట్లుంచి పల్లెకేగ శ్రీరాముఁడు రామశర్మయను బ్రాహ్మణుని వేషముతోఁ బోతనయింటి కతిథిగావచ్చి యా పద్యమును బూరించి యేగెను. సింగభూపాలుని సేనాని భాగవత గ్రంథము నపహరించికొని పోవుచుండ రాముఁడే వరాహరూపమున రాజభటులతోఁబోరి గ్రంథము మరలఁ బోతనకు దక్కున ట్లొనరించెను. గోదావరీ తీరమున పోతన రామధ్యాన నిష్ఠాగరిష్ఠుఁడై యుండ శ్రీరాముఁ డాతనికి సాక్షాత్కరించి యాంధ్ర భాగవతమును దన కంకితము చేయుమని యడిగి యుండెను ఇంకను బెక్కు క్లిష్ట పరిస్థితులలో రాముఁడాతనికిఁ దోడ్పడి క్లేశమును బాపియుండెను. ఇవన్నియు శ్రీరామచంద్రుని భక్త రక్షణ పరాధీనతకుఁ దార్కాణములు.

పోతన శ్రీనాథాదులనుగూర్చి లోకమునఁ బ్రచారమునన్న కొన్ని యతిలోక విషయములనుగూడఁ గవిగారిందుఁ జొప్పించి యున్నారు. బోయీలు లేకుండనే శ్రీనాథుని పల్లకి నడచుటయు, నెద్దు లేకుండనే మల్లన హలము సాగిపోవుటయు నిట్టివాని కుదాహరణములు, రుక్మిణీ కల్యాణ సందర్భమున 'బాలకమరె'నని పోతన వ్రాయఁగనే అతని కూఁతురు కుంపటిలోఁబడి కమరుటయు "నెలఁత యౌవనంబు వింటివెల్గె"నను వాక్యము వ్రాయఁగనే యామె తెలివిగొని పల్కుటయు పోతన ఋషితుల్యతను సిద్ధవాక్సంపన్నతను జెప్పక చెప్పుచున్నవి. శ్రీనాథుఁడు పోతనతో వరనిశ్చయమునకు బహు సహస్ర పరిమితులైన రాజ పరివార జనులతో వచ్చినట్లు తెల్ప పోతన వారికిఁ దగినట్లు విందుచేయుట యెట్లని కుందుచుండ జ్యోతిపుర రాజ్ఞివచ్చి సహస్ర భోజనమునకై భోజ్య పదార్థముల సమకూర్చుటకూడ దైవ ప్రేరిత కార్యమే. శ్రీనాథుఁడు భాగవత కృతిని సింగభూపాలుని కిప్పింపనెంచి బమ్మెర కరుదెంచుచు నుద్యానవనమున విడిసినప్పు డొక యువతి యాతని కడ కరుదెంచి పోతన వరకృతి యొసంగఁడని నిర్ధారణ మొనరించి చెప్పి యాతని వ్రేలికి రత్నాంగుళీయకము నర్పించిన వృత్తాంతమున్నది. ఈ యువతి శ్రీనాథునితోఁ జెప్పినట్లు జంగమ మఠపతి కూఁతురు కాదు. ఆమె సాక్షాచ్ఛారదయే. ఈ వృత్తాంతము ముందు జరుగఁబోవు కథాంశమునకు సూచనగా నీ కావ్యమునఁ జేర్పఁబడినది.

భాగవతమునందలి గజేంద్రమోక్షములోని 'సిరికింజెప్పఁ'డను పద్యమువిని శ్రీనాథుఁ డాక్షేపించుటయు, పోతన శ్రీనాథుఁడు భోజనము చేయుచుండఁగా రాయి నూతవిసరి యాతని బిడ్డ నూతఁబడెనని కేక వేయ శ్రీనాథుఁడు చేయికడుగుకొనకుండఁగనే నూతి దగ్గఱకుఁ

బరుగెత్తుకొని వచ్చుటయు, పోతన యప్పుడు సత్యము తెల్పి తన పద్యమును సమర్థించు కొనుటయు లోకమునఁ బ్రచారమందున్న కథలోని విశేషములు. శ్రీ మదాచార్యుల వారష్ట మాశ్వాసమున నీ వృత్తాంతము నించుక మార్పుతో రమ్యముగా వర్ణించినారు. శారద పూల మొక్కలకు నీరు తోడుచుండగాఁ దాడుతెగి చేద నూతిలోఁబడెననియు, శారదయే వడి పోయెనని శ్రీనాథుఁ డన్నము తినుచున్న చేతితోనే నూతికడకుఁ బరువెత్తుకొని వచ్చెననియు వారు కల్పించినారు. తన పద్యమునందలి యౌచిత్యమును సమర్థించుకొనుటకై యిందు పోతన కృత్రిమముగా నేమియుఁ జేయవలసిన యక్కఱ లేకపోయినది. సహజముగ సంఘటిల్లిన సన్నివేశమే యాతని కట్టి యవకాశ మొసంగినది. లోకమునఁ బ్రచారమందున్న కథకంటెఁ గావ్యమునందలి కథ యెక్కువ నిసర్గసుందరముగా నున్నది.

శ్రీ వరదాచార్యులవారు పోతననుగూర్చి లభ్యమైన కథాంశముల నన్నిటిని సేకరించు కొని వానిని బూర్వాపర సందర్భము చెడకుండునట్లుగను, గావ్యోచితములైన వర్ణనల కాను కూల్యము కల్గునట్లుగను, సమకూర్చుకొని కథను విస్తరింపఁ జేసినారు. సుందర వర్ణన శోభితమై కావ్యమునం దాదినుండి తుదివఱకుఁ బ్రధాన కథ సాగిపోయినది. కథా కథనము నందును వస్తు విస్తరణము నందును వారు ప్రదర్శించిన కౌశలమున కిది తార్కాణము. నిజమునకు పోతన కావ్యము దశమాశ్వాసముతోనే ముగిసిపోయినది. అయ్యును వారు మఱి రెండాశ్వాసములను జేర్చి పోతనచే నాలువుగా నొంటిమిట్ట రఘునాథునకు మోహినీ నృసింహ వరాహావతార గాథలను గజేంద్రమోక్షణ కృష్ణావతార రుక్మిణీ కల్యాణ వృత్తాంతములను జెప్పించినారు. ప్రతి కథ యారంభమునను "స్వామీ! ప్రహ్లాద బాధలడఁచి హిరణ్యకశిపు నంతమొందింప స్తంభోద్భవుండవై వెలసితి వీవకాదె. నేఁడును మత్కృతి ప్రహ్లాదుం గాపాడుమని నిన్ బాడుదు"నను విధముగాఁ దన కథకును దానికి నొక సంబంధము సమకూర్చినారు. శ్రీమద్భాగవతమునఁ బండ్రెండు స్కంధములున్నవి. ఈ తుది రెండాశ్వాసములతో పోతన చరిత్రయుఁ బండ్రెండాశ్వసముల కావ్యమై భాగవత తుల్యమైనది. ఈ కథలను జెప్పుటలో శ్రీ మదాచార్యులవారు భాగవత కథా విధానమునే యనుసరించినను కథన శిల్పమున నప్రతిమానమైన కౌశలము ప్రదర్శించినారు. కథలో, తత్త్వములో, పద్యముల నడకలో, భావసంపదలో నవి భాగవతమునందలి కథల కెందును దీసిపోవు. కావ్యైక దృష్టితోఁ జూచినచో నవి యనావశ్యకము లనిపించినను గథా కథన దృష్టితోఁ జూచినచో నద్భుతావహములై యలరారును.

కథాకథనమున శ్రీ మదాచార్యులవారు ప్రదర్శించిన నైపుణమును వివరించుటకై కావ్యమునందలి యొక్క సన్నివేశమును మాత్ర ముదాహరింతును. ఇది తృతీయాశ్వాసము నందున్నది. చిదానందయోగి యుపదేశము ననుసరించి వివాహితుఁడయ్యును పోతన నిగ్రహ చిత్తుఁడై కాలము పుచ్చుచుండెను. అతని తల్లిదండ్రు లా తరుణ దంపతుల నింటనుంచి తీర్థయాత్రల కరిగిరి. చేలు కోయవలసిన యదనరుదెంచెను. పోతన భార్యతోఁగూడ వన భోజనమునకై వెడలి చేలకోఁత యారంభింపఁజేసెను. ఆకసము మేఘావృతమయ్యెను.

పోతన భార్య వంటకములను దుర్గకు నివేదింపఁజని దుర్గాస్తవ మొనర్చెను. వర్షము కురిసెను. ఆమె తడిసిన వస్త్రములతో భర్తను సమీపించి స్నానార్థమై తటాకమున కరిగెను. అప్పుడు పోతన యపూర్వమైన విరహ వేదన ననుభవించెను. భార్యవచ్చి యతనికి భోజనము పెట్టెను. పాలేరు తాను గాపలా కాయుటకై వచ్చి పోతన నింటికిఁ బంపెను శరదృతు వరుదెంచెను. పోతనకుఁ దపోభంగ మాయెను. ఈ సన్నివేశమునందలి కథా సంగ్రహమిది. విరక్త చిత్తుఁడు తపోనిష్ఠుఁడునైన పోతన రక్తచిత్తుఁడు భార్యా సౌందర్య ముగ్ధుఁడునైన వృత్తాంతమిం దత్యంత రసబంధురముగా వర్ణింపఁబడినది. ఒక్కొక్క సౌందర్య భంగిమ, ఒక్కొక్క మనోహర విన్యాసము - ఎంతటి దృఢచిత్తులనైనఁ బరవశుల నొనరించును గాఁబోలును. ఇచ్చటి కథా కథనము, సన్నివేశాది వర్ణనము పింగళి సూరనార్యుని సుగాత్రీ శాలీనుల కథా విధానమందలి సౌందర్య సంపదను బుడికి పుచ్చుకొన్నది. విస్తరభీతిచే నింత కంటెఁ గవిగారి కథా కథన శిల్పమునుగూర్చి యెక్కువగాఁ జెప్పలేక పోవుచున్నాను

ఈ కావ్యమున, సముద్రము, ద్యూతము మున్నగు నే రెండు మూఁడో తప్ప మిగి లిన యష్టాదశ వర్ణనములను బ్రసక్తాను ప్రసక్తముగాఁ బ్రవేశపెట్టఁ బడినవి. ఈ వర్ణన లన్నియు శ్రీ మదాచార్యులవారి ప్రకృతి పరిశీలనమును, భావనాశక్తిని, పూర్వ మహాకవి కావ్య పరిచయమును వ్యక్తము చేయుచున్నవి. కావ్యారంభముననే బమ్మెర గ్రామ వర్ణన మున్నది. అచ్చట పెంకుటిండ్లతోపాటు పూరిగుడిసెలుకూడ నున్నవి. పెంకుటిండ్లు పెంకు చాళ్ళఁదల ధరించి యుండుటచే సంస్కృతి భారమెంచి బాధఁదనరు పెన్గుటుంబుల వలెను, బూరియిండ్లెద నాశవీడినచో నీ బదుపే తృణతుల్య మౌనని చెప్పునట్లుగను గోచరించు చున్న వఁట. శ్రీనాథ పోతనలను బ్రధానముగా వర్ణించు నీ కావ్యమునఁ బై భావమెంతో సుందర ముగా నున్నది. కుటీరములపైనున్న గుమ్మడిపాదులు, గుడిసెలవెనుకనున్న పిడుకగూండ్లు, కుటీర శిఖరమునెక్కి కూయు కుక్కుటములు, కర్షక శ్రమబిందు ఘనతఁదెల్పు జొన్నచేలు కవిగారి విశిత పరిశీలనమును జాటుచున్నవి. ఇవన్నియు గ్రామ వాతావరణమును బాఠకు నెదుట నిల్పునట్టివి. ఇట్లే చతుర్థ సప్తమాశ్వాసము లందలి రాచకొండ నగర వర్ణనమును దిలకించిన వైభవోపేతమైన పట్టణ సౌందర్యము కన్నులపండు వొనరించును. నవమాశ్వాస మందలి సంక్రాంతి వర్ణనము సహజమై భారతీయ సంప్రదాయముల యందచందముల నత్యంత విశదముగా వ్యక్తము చేయుచున్నది.

"పండుగయనధని భాగ్యము పండుఁగదా పంచభక్ష్య పరమాన్నాప్తిన్
బండుగ యనరిక్తువిపని పండుఁగదానాఁడు వస్త్ర పండుట నవియెన్"

అను పద్యము కవిగారికి బీదలయెడఁగల సానుభూతిని దెల్పుచున్నది. ద్వాదశాశ్వాస మున గజము విష్ణువును బ్రార్థించి ప్రార్థించి, యింక నాతఁడు వచ్చి రక్షించుట కల్లయని భావించి

"పిలిచినఁ బలుకరు, కాంచన్ వలనుపడదు, చనఁగరాదు వద్దకు లక్ష్మీ
లలనాధీశులభాగ్యులఁ దిలకించెదరొక్కొ వారి తీరిది వేజే"

యని గుండె రాయిచేసికొనెను. ఇందు 'లక్ష్మీ లలనాధీశు' లైన ధనికు లభాగ్యుల యెడ వర్తించువిధము లెస్సగా సూచింపఁ బడినది. పంచమాశ్వాసమునఁ గవిగారు తెలుఁగు నాఁటి జాహ్నవియైన గోదావరిని వర్ణించిరి. పోతన సింగభూపాలుని కొల్వున భోగినిని వర్ణించుచు దండకము రచించెను, అందుచే నాతఁడు తన రసన పంకకళంకితమై పోయెనని భావించి మరల నది పూతయగుటకై గోదావరీ వర్ణనము గావించెను.

శ్రీశుపద సరోజమ్ముంటి చిఱుకుతేనె నీశుపృథు శిరోజములైన యెఱుపు తేంట్లు
తెచ్చి తెట్టెగానిడికొనఁ దెరువరియయి కాచిపోసె భగీరథ ఘనతపోగ్ని

అను పద్యము గోదావరి పవిత్రతను, మధుమధురవారి పరిపూర్ణతను, భాగీరథీత్వమును మనోహరముగాఁ బ్రకటించు చున్నది. "కలశ పాథోరాశి క్రాగు పొంగును దోసి యుటికి వచ్చిన పాల నురువవేమొ" అను పద్యమునఁ గవిగారు కురియించిన యుత్ప్రేక్షలు వారి కా నదీమతల్లిపైఁగల భక్తి భావమును లెస్సగా వ్యక్తము చేయుచున్నవి. పంచమాశ్వాసము నందలి "తెగమాసి పిట్టగూడగు తలంగల చింపి గొంగడిలో శనిగూరుచుండ" నను సీస పద్యము కట్ట గుడ్డలేక తిన తిండిలేక దైన్యము మూర్తీభవించినట్లున్న యా ముసలి భిక్షువును బఠితల యెదుట సాక్షాత్కరింపఁ జేయుచున్నది. ఇట్లే వేసవి, వసంతము, శరత్తు, సంధ్యా కాలము, చంద్రుడు, ప్రాతఃకాలము, గుడులందలి శిల్పములు, సస్యసంపద, మున్నగు వానిని వర్ణించుటలోఁ గవిగారు ప్రదర్శించిన నేర్పు శ్లాఘాపాత్రముగా నున్నది. గ్రామీణ సౌందర్య సంపదను వర్ణించుటలో వారికిఁగల యభిమాన మీ కావ్యమునఁ బెక్కుచోట్లఁ గానవచ్చును. పోతరాజు విరక్తుఁడై తీర్థయాత్రలకేగిన సందర్భమున వారు వైష్ణవ క్షేత్రములను, అందలి దైవములను దనివితీర వర్ణించినారు. అట్లని వారు శివునిమాట పూర్తిగా విస్మరించిన వీరవైష్ణవులుకారు. సందర్భము కలిగినప్పుడు వారు విష్ణువును వలెనే శివునిఁగూడ భక్తిభావ సంభరితముగా వర్ణించి యున్నారు.

ఈ కావ్యమునందలి వర్ణనలలోనికెల్ల ముఖ్యముగాఁ బేర్కొనఁదగినది భోగిని నాట్య వర్ణనము. ఈ వర్ణన సందర్భమునఁ గవిగారు తమకాకళయందుఁగల యభిమానమును బాండిత్యమును సర్వతోముఖముగా వ్యక్తము చేసినారు. ఆ భాగము చదువుచున్నప్పుడు పఠితలకు సంగీత నాట్య విశారదయైన యొక నాట్యకత్తె మనోహరముగా నెదుట నాట్యము చేయుచున్నట్లు స్ఫురించును. భోగిని ప్రదర్శించిన వివిధముద్రలను, వివిధ భావస్ఫోరకము లైన నాట్య విన్యాసములను, ఒయ్యారములను గవిగారు విశదముగా వర్ణించి యున్నారు. "పవన డోలికల జంపాల లూగుచు సరస్వతీనాడు కెరటాల సొరుదోఁచ" అను సీసమున వా రామె నాట్యము చేయుచు నెన్ని యెన్ని యందముల నెట్టి యెట్టి యొడుపులఁ బ్రదర్శిం చెనో సూచించియున్నారు. వారు చెప్పిన ట్లామె నాట్యము చేయుచుండఁగా,

"అందము చిందులు ద్రొక్కెను విందగు జవ్వనము భువన విజయ మొనర్చెన్
కుందనమున జీవము పడెఁ జెందామర లుఱుకులాడె చెలి నృత్యములన్"

భోగిని సరసుఁడైన సింగనృపాలుని హృదయమునఁ బ్రేమించెను. ఆ విరహతాప మామె చిత్తమున నిండారి యున్నది. అందుచే నామె రాధా విరహమును బ్రదర్శించునప్పు డెక్కువ ప్రయత్నము చేయవలసిన యక్కఱ లేకపోయెను. అప్పుడా భావవిన్యాసము లన్నియు నామెకు సహజ సిద్ధములై యుండెను. అందుచేఁ గవిగారు

నటన నిజమొనర్చి నాతికృష్ణుని విరహంపు రాధపాత్ర నభినయించె
నాటవెలఁది యొక్క యసమాన ప్రతిభకు మురిసిపోయి రాజు ముగ్ధుఁడయ్యె

నని వ్రాసియుండిరి. పైని రాధా విరహ నాట్యాభినయమంతయుఁ బదియాట వెలఁది పద్యములలో వర్ణింపఁబడినది. ఇచ్చట 'నాటవెలఁది' శబ్ద ప్రయోగము చమత్కార శోభితమై యున్నది. రాజా యాటవెలఁది ప్రతిభ కెంత మురిసి ముగ్ధుఁడయ్యెనో చదువరులు కవిగారిచ్చట రమ్యాతి రమ్యముగా రచించిన యాటవెలఁది పద్యముల ప్రతిభ కంతగా మురిసి ముగ్ధులై పోవుదురు. పోతన భోగినీ నాట్యమును జూచి

భోగమిండ్లలోపల నీమె పుట్టవలసినదియెకాదు శ్రీహరిభక్తి నటనయందు
దాఁ గరఁగి యేడ్చి యేడ్పించెఁ దక్కునరుల, వ్రాయదండకమగు నీమె వర్తనమని

యనుకొనెను. ఇచ్చట దండకమగుననఁగా విస్తృతమగునని సాధారణార్థము. ఇది "యా విషయము చెప్పినచో భారతమగు" ననిలోకమున ననుటవంటిది. కాని తరువాత పోతన దాని నాట్య సౌందర్యమును వర్ణించుచు నిజముగా నొక దండకమే రచించెను. అది విని సభలోని వారందఱును ముగ్ధులై తలలూపిరి. పై పద్యమునందలి దండకశబ్ద ప్రయోగము కూడ పూర్వపు ఆటవెలది శబ్ద ప్రయోగమువలెఁ జమత్కార శోభితమై యున్నది.

రసపోషణమున శ్రీ వరదాచార్యులవా రారితేరినవారు. ఈ కావ్యమున పలు ఘట్టము లందు భక్తిరసము చక్కగాఁ బోషింపఁబడినది పోతనకువలె శ్రీ మదాచార్యుల వారికిని భక్తి యాజన్మ సిద్ధమైనది షష్ఠాశ్వాసమున వారు భక్తిని వివిధ రీతుల నిర్వచించి యున్నారు. "శౌరి రూపశీల సద్గుణవిచ్ఛిన్న తైలధారవంటి తలఁపుభక్తి – ముక్తికాంత భోగమునకు సర్వస్వము త్యాగమొనఁగు ప్రేమధనము భక్తి" యనునవి వారొసంగిన రెండు నిర్వచనములు. రామశర్మ వచ్చి పద్యమును బూరించి యేగెనని విన్నపిమ్మట పోతన్న యాతఁడు శ్రీరాముఁడే యని యెఱింగి వెల్వరించిన భావములు భక్తిరస బంధురమ్ములై యున్నవి దివ్యక్షేత్రములను దర్శించు సందర్భమునను ఒంటిమిట్టలో శ్రీ రఘు నాథుని దర్శించునప్పుడును పోతన భక్తిరస ప్రవాహమున నోలలాడి యున్నాఁడు. తృతీయా శ్వాసమున పోతన తపోభంగమైన సన్నివేశము శృంగార రసమునకు రంగము. కవిగా

రచ్చట పోతన దంపతుల సౌఖ్యవసంత వీథీ విహారమును లలిత మధురముగా వర్ణించి యున్నారు. అప్పుడువారు దేశ కాలస్థితు లెఱుంగక తనువు లుండియు లేనటులైన యపూర్వ సమాధి యోగము ననుభవించిరి. శ్రీనాథుఁడు భార్య మరణించిన పిమ్మటఁ దన కూఁతురు శారదను బమ్మెరకుఁ గొనివచ్చి చెప్పడిన లొజ్జుఁదనమునఁ దప్పుకొనన్ లేక కంట తడివిడి పలికిన పలుకు లందును (III–310–321) రాచకొండలోనున్న తజీ తల్లి మరణవార్త విన్న సందర్భ మందును, సప్తమాశ్వాసమునఁ దండ్రి తన్నుఁ జూచుటకు రాలేదని శారద యేడ్చు సందర్భమునందును గరుణరసము వెల్లివిరియు చున్నది అందును పోతన తల్లిమరణమునకై విలపించిన సన్నివేశము రాతిగుండెలనుగూడఁ గరఁగించునట్టిది. "ఆ నిశిన్ విధిలేక యాఁగె నొక్కెడఁగాని తల్లికై మనమందుఁ దల్లడిల్లు" అను పద్యము పోతన తల్లిమరణమునకు సూచనగా నున్నది. శ్రీనాథుఁడు పోతన కళ్వయానము సమాకూర్పవలెనని సింగభూపాలునితోఁ జెప్పఁగా నాతఁడన్న యధిక్షేప వాక్యములు పరమ శాంతుఁడైన పోతన్ననుగూడ రౌద్ర మూర్తిని గావించినవి. సింగనరపతి సేనలకును ఒంటరి వీరునకును, వరాహమునకును జరిగిన పోరాటము సందర్భమునను, కన్నడ రాయల సేనలకును, సింగభూపాలుని సేనలకును మెట్టుగిరివద్ద జరిగిన సంఘర్షణము సందర్భమునను వీర రౌద్ర భయానక రసములు స్ఫురించుచున్నవి. శ్రీ మదాచార్యులవారేరసమును వర్ణింపఁ దలఁచినను దానికిఁ దగిన విభావానుభావాదుల వర్ణించి పఠితలకు రసానందానుభూతి చూఱయిచ్చు చుందురు.

ఈ కావ్యమునందలి పాత్రలను సుస్పష్ట రేఖలతోఁ దీర్చిదిద్దుటలో శ్రీ మదాచార్యుల వారు చూపిన నేర్పు ప్రశంసా పాత్రమైనది. పోతన భక్తి వినయములను, పితృ మాతృ భ్రాతృ భక్తిని, పరోపకార పరాయణతను, వైరాగ్యమును వారు చక్కఁగా వర్ణించి యున్నారు. "నా తల్లి మేన్దవ్వనంపుఁ గ్రొంజిగిచాయ చిగిరించె నా కాలు సేతులందు...... నా కెదేన్ రోగపున్నీడ సోకనాపె నగుమొగము చంద్రునకుఁ గ్రహణమ్ముపట్టు" నను పద్య మాతని మాతృభక్తి కక్షరమూర్తి. పోతనభార్య యతనికిఁ దగిన యిల్లాలు. ఆమె పాతి వ్రత్యము, అతిథి సేవాతత్పరత అప్రతిమానములైనవి. ఆమె పూర్వజన్మమున రతియే యైనను కావ్యమున మాత్రము సతిగానే గోచరించును. లక్ష్మి, మల్లన ఆ పవిత్ర దంపతుల గుణగణము లన్నియుఁ బుడికి పుచ్చుకొన్నవారు. శ్రీనాథుఁడు రక్తచిత్తుఁడు; భోగ తత్ప రుఁడు, రాజసేవ వలన గల్గు కీర్తి సౌఖ్యములనే కాని నైచ్యావమానముల నాతఁడు పాటిం పఁడు. అతఁడు శారదను బాలకాలమువఱకుఁ జూడరామికి హృదయలోపము కారణము కాదు. శారదను బమ్మెరలో నుంచుటకై వచ్చినప్పు డాతఁడు పల్కిన పల్కులు వాత్సల్య నిధానములు. శారదకు పోతన యింటివారి సాహచర్యముచే వారి గుణములన్నియు నచ్చినవి. కాని యామె సహజమైన రజస్తత్త్వమునడంచుకొనలేక తండ్రికి తీవ్ర భావములతోఁ గూడిన యుత్తరము వ్రాసినది. తిప్పన సోదరప్రేమ యపారము. సింగభూపాలుఁడు సర్వజ్ఞ చక్రవర్తియే రసజ్ఞ చక్రవర్తి కూడను. భోగినివంటి కళా సౌందర్య సేవధి తనంతఁ దా నతని వలచుటయే యతని సరసత్వమునకుఁ దార్కాణ. కవిత్వమన్నను

గవులన్నను ఇతనికిఁగల యభిమాన మవధి యెఱుంగనిది. పోతనను దన యాస్థానము నందలి కవుల కధ్యక్షుఁడుగా నుండుమని యితఁడు వేఁడినప్పు డతఁడు

"ఈ కవీంద్రుజన్మ మీశ్వరునికె తక్క నొరుల కెప్డు చేతులొగ్గి యడుగ
దాఁడుబిడ్డ దేహ మమ్ముకతినునట్లు కృతుల నమ్ముకొనుటె బ్రతుకు తెరువు"

అని నిరసించుట యితనికిఁ గోపకారణ మయ్యెను. అందుచేతనే అతఁడు బమ్మెర వెళ్ళుట కితఁ డశ్వయానము నీయ నిరాకరించెను. మరల భాగవతమునందలి పద్యములు విని నప్పుడీతని మనసు మెత్తపడెను. భాగవతకృతి నందుటకై యీతఁడు వేవిధములఁ బ్రయత్నించెను. కాని లాభము లేకపోయెను. రామదాసు మూలమున తానీషాకువలెఁ బోతన మూలమున నీతనికిఁ గలలోనైన శ్రీరామ దర్శనభాగ్య మబ్బెను. ఇతఁడు పశ్చాత్తప్తుఁడై భాగవత శిథిల భాగపూరణమునకుఁ దగిన యత్నము లొనరించుటయేకాక ధనముకూడ నొసంగెను. ఇతఁడు కావ్యమునఁ జూపిన యించుక కాఠిన్యము తాత్కాలిక కోపజన్యమైనదే కాని స్థిరమైనదికాదు. నరాంకితమగునట్లు చేసి భాగవతము మోక్ష ప్రదత్వమునకు భంగము కలిగించుటకై జనించిన యిందుప్రిని కుండవలసినంత తీవ్రత యితనియందుఁ గానరాదు.

కవిగారు ప్రధానపాత్రలఁ బోషించుటలోవలెనే యప్రధాన పాత్రలఁ బోషించుటలోఁ గూడ నమితమైన శ్రద్ధ ప్రదర్శించినవారు. ఇందుకుఁ బోతన సాయమును బొందిన పేద వనితయు, ఒంటరి వీరుఁడును, కోమటిసెట్టియునిదర్శనములు. వీరి కావ్యమునఁ జూపిన కృతజ్ఞత సాటిలేనిది. ఆ పేదపైదలి తోలుకొని వచ్చిన పందులలోనిదే సింగనృపతి సేనల నెదిరించిన వరాహము పాముకాటువకు గుఱియై చచ్చి పోతనచేఁ బునరుజ్జీవితుఁడైన కాపు కుమారుఁడే యీ యసహాయ వీరుఁడు. భిక్షుకుని దయయింతయు లేక కొట్టిన కోమటి సెట్టి పోతన సంపర్కముచేఁ బరమ భక్తాగ్రేసరుఁడుగా మాఱినాఁడు. ఇక పోతన శిష్యులైన గంగయ సింగయ వారయలు గురుభక్తి సేవధులు. ఆ భక్తిచే గురువును మెప్పించి వారు భాగవత కావ్యకర్తృత్వమున భాగము పంచుకొన్నారు. కేవల భక్తియే కాక కవితా పటుత్వముగల దిట్టలుకూడ నగుటచే వారు సభలో శ్రీనాథ సింగభూపాలుర మెప్పించుటయు, భాగవతము నుచితరీతి పూరించి లోకమును మెప్పించుటయు, జరిగినది.

ఇప్పటికే చాల అధిక ప్రసంగము కావించితినని కొందును. ఇంక శ్రీ మదాచార్యుల వారి కవితా కౌశలమునుగూర్చి రెండుమాటలు చెప్పి విరమింతును. ఇంత మహాకావ్యమును రచింపవలెనని పూని దానిని నిర్విఘ్నముగాఁ బూర్తిచేయుటయే వారి 'మహాకవిత్వ'మునకు సాక్ష్యము. కావ్యమాద్యంతము ధారాశుద్ధి శోభితమై లలిత మధుర పదప్రయోగ ప్రచురమై, ప్రసాదగుణ భూయిష్ఠమై, రసభావ బంధురమై చదివినకొలంది చదువవలెనను నుత్కంఠను రేకెత్తించుచున్నది కవిగారికిఁ బూర్వాంధ్ర మహాకవులలో శ్రీనాథుఁడు, పోతన, భట్టు,

మూర్తి, చేమకూర వేంకటకవి మున్నగువారి కవిత్వమునెడ నభిమాన మధికమని తోఁచును ఈ కావ్యమున శ్రీనాథుని పద్యములందలి ప్రౌఢగంభీర గమనము, పోతన రచనయందలి మాధుర్య సౌష్ఠవములు, భట్టుమూర్తి కావ్యమందలి ధ్వన్యలంకార సౌందర్యము, చేమకూర వేంకటకవి కవిత్వమందలి శబ్దాలంకార చమత్కారము పుష్కలముగా గోచరించును. “ఎవ్వాని యానతినే ప్రొద్దు రవిబుధుల్ సరివేళఁ దప్పక సంచరింతురు” వంటి సీసములు తిక్కనగారి “ఎవ్వానివాకిట నిభమద పంకంబు రాజభూషణ రజోరాజి నడఁగు”నను సీసమును దలంపునకుఁ దెచ్చుచున్నవి. చివరి రెండాశ్వాసములలోని భాగవత కథాసంగ్రహములలోఁ బోతనగారి కవితా ఛాయలు పెక్కుచోట్లఁ గనవచ్చుచున్నవి “వైకుంఠుఁ బొగడని వక్త్రమ్ము ఢక్కా నానది దేవళమ్ములో నదమొనర్చు (11–324) పద్మాక్ష దర్శనభాగ్య హీనములైన కన్నులంధవరాటకములుగావె (V–75) పరమదయాళువై మకరిఁబట్టి వధింపఁగఁ బంపె వేగ శ్రీహరి...చక్రమున్....వక్రమున్ (12–80)” మున్నగు పద్యము లందుకు నిదర్శనములు. పోతనవలెనే కవిగారును ఎడనెడ ననుప్రాసములను అంత్యానుప్రాసములను గూర్చుచుందురు, “మానిత సూన సౌరభరమాకృత –(IV–123) విగతాడంబరవేషి (VII–98)”

బెడిదపు టడిదములగుడము విడివడి కడుఁ బోరుచుండ వెసలగుడము తా
నడిదపుఁ బిడికిటి ముడిపైఁ గడువడిఁ దాఁకుటయు నొచ్చి కత్తిని జార్చెన్

అను పద్యము డకార వృత్త్యనుప్రాసముఁ గూడి పోతనగారి రచనయా యనిపించు చున్నది. గజేంద్ర మోక్షము చెప్పుచు కవిగారు “అల వైకుంఠ పురంబులో” ‘సిరికిం జెప్పఁడు’ అను పోతనగారి పద్యములనే యా సందర్భమునఁ జొప్పించి యుండిరి. అచ్చట నవి పూర్వాపర పద్యములతో నతికి కవిగారి రచనలోఁ గలసిపోవుటయే వారు పోతనగారి కవితారీతి నెంత చక్కగా నలవఱచుకొని యుండిరో సూచించు చున్నది. గోపికలు శ్రీకృష్ణుని దుడుకుఁ జేఁతల యశోదకుఁ దెలుపు సందర్భ మీ విషయమును బలపఱుచు చున్నది. అష్టమాశ్వాసమున పోతన శ్రీనాథులకు జరిగిన సంభాషణ, సప్తమాశ్వాసమున పోతన శిష్యులకును ద్వారపాలకునికిని జరిగిన సంభాషణ కవిగారి సంభాషణ రచనా చాతుర్యమును దెలుపుచున్నవి. చతుర్థాశ్వాసమున శ్రీనాథుఁడు పుష్పలావికలతోఁ జేసిన సంభాషణ ఆముక్తమాల్యద యందలి “వెలది యీ నీ దండ వెలయెంత” యను పద్యభాగమును బోలి యున్నది. “కాళ్ళులేక చరింపఁ గల్గువాఁడననెప్పు డాందోళికాగామి యగుచునేగు” VIII–193 అను సీసమున ధనిక రాజన్య ఫణులకుఁగల పోలిక చక్కగా వ్యక్తము చేయఁబడినది.

నూత్న యౌవనపు మనోజ్ఞ వాసనలేవొ కుంజపుష్పితయగు కొమ్మకెఱుక
తానె వలచి కలయు దాంపత్యరుచి మ్రాఁకుగడియ విడని తీవగరిత తెలియు

అను పద్యము పోతన దంపతుల శృంగార విహార సందర్భము (III–241) లోనిది. ఇందలి సమాసోక్తి రామణీయక మనిర్వచనీయమై యున్నది. ఇట్టి వీ కావ్యమున ననేకము

బున్నవి. (IX–112) వసుచరిత్రి విజయ విలాసములందలి పద్యములవంటి పద్యములను కవిగారీ కావ్యమునఁ బెక్కుచోట్ల రచించియున్నారు. "నెలగుండియలఁబిండి సెలయేటి యెలబోటి యిలక్షీర వారాశి నౌలుకఁబోయ" యను సీసము వసుచరిత్రను. (III–192) "మీనంబు పొలసుల మేన్వడి స్నిగ్ధతంగాంచ దానీ లేమ కనులఁబడియె (XI–133) నను పద్యము విజయ విలాసమును స్ఫురింపఁజేయు చున్నవి.

కలవాఁడైనం జాలునె చెలువుఁడు రసికుండుగామి జీవిత మేలా
చెలువలు కలువలు సరసుల చలువ వలన నిబువ గలుగు జలజ దళాక్షీ!

అను పద్యమునందలి 'సరసుల' యందుఁగల చమత్కారమును,

భ్రమరాభుల సరసులఁగని యమితోత్సాహమ్ము మెఱయ హసియించుచు వా
గమృతము నర్పించుట లోకశ్రీమమే సుమనస్సులకును సౌజన్య నిధీ!

అను పద్యమందలి 'సుమనస్సుల' యందలి చమత్కారమును మిక్కిలి ప్రశంసా పాత్రములుగా నున్నవి. "గొంతులోఁ గోకికలుకూసెఁ గొసరి కొసరి నడల రాజహంసలు కాళ్ళఁ బడుచు డాసె. (II–246) అంబికా సతియట్టు లాత్మేశ్వరున కెప్పు డర్ధాంగివై ప్రేమ వలరుచుండి (II–281) కనుగీటుటకు నైనఁగాని చక్కగ రానియ నిమిషాంగనలఁట యప్సరసలు (IV–72) కమ్మ విలుకాని యమ్మ లజ్జమ్ము లెందు (IV–265) నీ పేర్విన భవాబ్ధి పీళ్ళు మ్రింగునదేల జలధి బంధన ఘట్టముల వినియెనొ (V–100) మున్నగు పద్యములు విజయ విలాసమందలి పద్యములతోఁ బోటీ చేయుచున్నవి.

ఇవ్వవియె జవ్వవింబోలి యెలమి మీఱఁ బుష్పవతి యౌటచే భృంగ భోగ్యయయ్యెఁ
నేత దారామ మారామ నృపతివోలె నలరిద్విజ వాంఛితమ్ము సఫల మొనర్చె
(IV–110)

ఇందలి శ్లేష మనోహరముగా నున్నది "అమృత మొల్కించు దేవావతారంబన్న అలనిశాచరవృత్తిఁ జెలఁగుచుండు." (IV–194) అను సీసము రాజు చంచలత్వమును, అవిశ్వాస్యతమ వర్ణించుచుఁ జంద్రునిఁగూడ స్మృతికిఁ దార్చుచున్నది. "బ్రాహ్మణుం డావీట బహుళ విజ్ఞానియై ప్రథిత విద్యానాథ పదవిఁ బడసె" ౧–80 అను సీసపద్య మోరుగంటి వర్ణనము నందలిది. ఇందలి విద్యానాథ, రుద్రావతార, తిప్పయ, కాపయ్య పదములందలి యర్థద్వయ స్ఫూర్తి విద్యానాథ ప్రతాప రుద్రాదులఁ దలఁపించుచుఁ బద్యమున కెనలేని సౌందర్యమును సమకూర్చుచున్నది. "వదయాడన్ భవదీయ కాయమయి సౌందర్యార్ణవం బీకటిన్ (III–131)" అను పద్యము రూపకాలంకార విరాజితమై దుర్గాదేవి సౌందర్య సర్వస్వమును వ్యంగ్యముగాఁ బ్రదర్శించుచున్నది.

అనుట నా యెమ్మెలాడి తా నతనిఁ గాంచి మధుర దరహాసములు మొల్లమాల లల్ల దాడిమఫలాలగిల్ల నేత్రములు చలువ కలువ పూరేకులం జల్లఁ బలికె నిటులు (IV-37)

అను పద్యము ధ్వని సౌందర్యమునకు నిధానము. ఇది యామె హాస వికాసముఖియై దాడిమీబీజములవంటి దంతములు గోచరింపఁ గలువరేకులవంటి వీక్షణములు ప్రసరింపఁ జేయుచు నెట్లు పల్కెనో విశదము చేయుచున్నది. నవమాశ్వాసమున పోతన భక్తి తత్పరుఁడై రామునుపాలంభించిన పద్యములు (38-43) తీవ్రములయ్యు నత్యంత మనోహరములై యలరారుచున్నవి. కవిగారి యనన్య సామాన్యమైన యుపమాలంకార ఘటనమున కీ క్రింది కొన్ని యుదాహరణములు.

తాళపత్రమందుఁ దనరు నక్షరమును క్షరమొనర్చు చెదలపురువు భంగి (III-303)

తాను బోతనయువచ్చెఁ గర్మ వెనుకనె జ్ఞానమ్ము గ్రాలుకరణి (IV-63)

క్ష్మాపతి పల్లెరుకాయ చాడ్పునన్ (IV-394)

తమములోనఁ దోఁచు తత్త్వోప దేశమ్ము తనువుగొన్న యట్లు చనియె సుకవి (V-160)

కవిగా రీ కావ్యమున సందర్భోచితముగా నెన్నో సామెతలను లోకోక్తులను గూర్చినారు. "ముక్కు ముడిబెట్టక పదానముల్లు నాటకుండ వచ్చిరి హరి రక్షకుండుగాఁగ (III-255)

లక్ష్మిరాఁ దడక నడ్డము పెట్టుకొనంగఁ జెల్లునే (VIII-183)

పాము పగయుఁ దోఁక బంధువు నా కనువాఁడు జగతి వెఱ్ఱివాఁడు (X-102)

తలయె పోవునవఁ జెవుల పోగులకు నేడ్చువాని నేమి యనఁగ వలయుఁ బుడమి (X-103)

మున్నగునవి నిదర్శనములు. "విచ్చెడి తమ్మి మొగ్గ తొలివిందునకే యళిపెట్టి పుట్టునో'' (IV-313) అను పాదము "నజానే భోక్తారం కమిహసము పస్థాస్యతి విధిః" అను కవి కులగురువు శ్లోక పాదమును స్మరింపఁ జేయుచున్నది.

కవిగారి పద ప్రయోగము సలక్షణమై మృదుమధురమై యింపు నింపుచున్నది. సంస్కృత సమాసముల వాడినను తెలుఁగు పదముల వాడినను వారి రచన ప్రౌఢమయ్యు సర్వ సుబోధమై వీనులవిందు చేకూర్చు చుండును. తెలంగాణమున వాడుకయందున్న పదములను జాతీయములను వారు పెక్కుచోట్ల వాడియున్నారు. "మీ బంటుకు బానిసను గింత బారెయ్యవ్వా - కుంటోణ్ణి పున్నెముంటది" యనునది తెలంగాణము నందలి పల్లె ప్రజల పలుకుబడి. ప్రహ్లాదుని తొక్కు పల్కులను గవిగారు యథా తథముగాఁ బ్రయోగించి

యున్నారు. వా రెడనెడ వ్రాసిన శ్లోకములు, తెలుఁగు పద్యములలోఁ గీలించిన సంస్కృత వాక్యములు లోకోక్తులు వారి కా భాషయందలి నిశిత పాండిత్యమును జాటుచున్నవి.

హరిరాక కల్ల యిఁక నీకరి జీవితమిల్ల యామకరి యాకటికై
యెరయనిన కొల్ల ధర నెవ్వరికిం గావలె ననాధ బాధల వెల్లన్ (XII–51)

అను పద్యమున నంత్యప్రాసాను గుణముగ కల్ల, ఇల్ల, కొల్ల, ఎల్లన్ అను పద ములు ప్రయోగింపఁబడినవి. ఇందలి 'యిల్ల' తమిళ పదము

పాలోవేణివి మెఱపుల చాలో చూపుల ప్రసూన చయ వర్షాలో
బాలిక నవ్వుల రాల్ముత్యాలో మోదాబ్ధి శీకరాంబు శ్రీలో (II–254)

ఇందు 'లో'తో ముగియు పదములకూర్పు హృద్యమై పద్యమున కెనలేని సొంపు కూర్చుచున్నది.

ఈ కావ్యమున నచ్చటచ్చటఁ జక్కని గద్యభాగములున్నవి. ఇవన్నియు నను ప్రాసా లంకార పూరితములును భావబంధురములును బౌఢములునై పూర్వ ప్రబంధము లందలి గద్యభాగములను బోలియున్నవి. సప్తమాశ్వాసమునందలి దశావతార వర్ణన గద్యయు, నేకా దశాశ్వాసమునందుఁ బ్రహ్లాదుఁడు తండ్రికిఁ జెప్పిన తాత్త్విక గద్యయు, ద్వాదశాశ్వాసము నందలి సరోవర వర్ణన గద్యయు గమనింపఁ దగినవి. ఈ గద్యభాగములు శ్రీ మదాచార్యుల వారి పాండితీ విజ్ఞాన గరిమలను జాటుచున్నవి. ఛందో విషయమున నీ కావ్యమునఁ జెప్పఁ దగిన విశేషము లేవియునులేవు. ఆశ్వాసాంతములందు మాత్రము మాలిని మున్నగు వింత వృత్తములు వాడఁబడినవి. భోగిని నాట్యమును వర్ణించు సందర్భమున కళికోత్కళికలు, తోహరలు, అదితిపుట తాళములు, ముక్తాయులు, మంగళ మహా శ్రీవృత్తము కలవు. చివరి యాశ్వాసములలోఁగూడ వర్ణన సందర్భమున నచ్చటచ్చట రగడ భేదములైన కళికో త్కళికలు వ్రాయఁబడినవి. సప్తమాశ్వాసమున 313 వ సీసమున నొక్కొక్క సీస పాదము నొక్కొక్క గీతపాదము వెనువెంటనే యనుసరించు చున్నది.

పవన కుమార సంస్పర్శ మ్మదెట్టిదో యరనవ్వి మరియు నీ విరిపడంతి
అనుట నామె కన్నుల సిగ్గు పెనఁగులాడె.

శ్రీ వరదా చార్యులవారి నాట్యకళా కౌశలమును గూర్చి యిదివఱకే కొంత సూచించి తిని. వారికి జ్యోతిర్వేదాంత శాస్త్రములతోఁగూడఁ జక్కని పరిచయము గలదు. "అరయ రాశిద్వయమ్ము నేకాధిపత్య గతిఁ జెలంగుచు" (II–236) అను పద్యమును, "శ్రీరాక్షసం వత్సరమ్ము" మ్మాదిగాఁగల వాక్యములును వారి జ్యోతిర్విశారదత్వమునకుఁ దార్కాణములు. "పూర్ణమునుండి పెక్కు లిలఁబూర్ణము లున్నవమంది" (III–335) "గోపిక లెల్లరున్

నయన గోచరులైన మునీంద్రులైరి" (XII–165) మొదలైన పద్యములు వారి వేదాంత శాస్త్ర పాండిత్యమును సూచించుచున్నవి. కావ్యమున పోతన కావించిన తాత్త్విక ప్రసంగములును, భక్తి బంధురోపన్యాసములును వారి కా విషయము లనుభవసిద్ధములని వెల్లడి చేయుచున్నవి.

కావ్యారంభమున నాచార్యులవారు పూర్వాధునిక కవులనెల్లరను భక్తి స్నేహ పూర్వకముగా స్మరించి యుండిరి. కావ్యము నడుమ భాగవత రచనారంభ సందర్భమునఁగూడఁ బూర్వకవిస్తుతి యున్నది. పూర్వకవిస్తుతి యెల్ల కావ్యములందుఁ గానిపించును. కాని యాధునిక కవిపండిత విమర్శకుల నింతగాఁ బేరు పేరుపెట్టి సంభావించిన వా రెవ్వరును గానిపింపరు. ఇది శ్రీమదాచార్యులవారి నిరహంకారతను సర్వ కవిపండిత సామరస్యమును జాటుచున్నది.

ఎక్కడనున్న సద్గుణము లేనియు నొందలఁ దాల్చుటందు వే
త్తొక్కరిఁగాంచి ముందర నహోయని వెన్కల వెక్కిరింప కే
మక్కువ భాత్రిత్ఫవత్సలత మత్సర మన్నిడనాడి యుంటలో
నిక్కపు టొజ్జ బంతులయి నిల్చెద రీ తెలగాణ సత్కవుల్

సరళ హృదయు లాత్మస్తుతి పరాఙ్ముఖులు గర్వరహిత ప్రీతిభాష్యులు దం
భరహితు లీ తెలగాణన్ వెలయు కవుల్ తొనకనట్టి నిండు ఘటమ్ముల్

అని పోతన తెలంగాణమునందలి కవుల గుణగణములు విశదీకరించెను. ఇతరుల మాట యేమోకాని యీ గుణములన్నియుఁ బోతనయందును వరదాచార్యులవారి యందును మాత్రము సమగ్రముగాఁ గానిపించును. స్వభావముచే సదాచార సంపదచే వా రిరువురును ఋషితుల్యులు. శ్రీమద్భాగవతాంధ్రీకరణము పోతన చేతఁబడుట యెట్టిదో పోతనచరిత్ర ప్రబంధీకరణ మాచార్యులవారి చేతఁబడుట యట్టిది. వారి చరిత్ర పోతన చరిత్రకుఁ బ్రతిబింబము. అందుచేతనే వారీ చరిత్రము ననుభవ సిద్ధము నట్లింత మధుర సుందరముగా వెలయింపఁ జాలినారు. సప్తమాశ్వాసమున శ్రీనాధుఁడు పోతన కవిత్వమునుగూర్చి

అచ్చపు సంస్కృతాంధ్ర మహదబ్ధుల మందరముల్ మథింపఁగా
వచ్చు సుధారసమ్ములకు వన్నెలు దిద్దెడి కావ్యధార క
మ్మచ్చునఁ దీయు తీవియల మచ్చులనిచ్చు మనోజ్ఞశైలి పూ
ల్విచ్చిన నందనోప వనవీధులఁ గాదను పద్య గద్యముల్ (VII–118)

అని కావించిన ప్రశంస శ్రీ వరదాచార్యులవారి కవిత్వమునకును అన్వయించును. ఈ పోతనకావ్యము వారి చిరతపఃఫలము. వా రెంత శ్రమపడి దానిని రచించిరో యంత శ్రమపడి దానిని బ్రచురించిరి. శ్రమయంతయు వారిది; ఫలము మాత్రము రసాస్వాదన పరాయణులైన యాంధ్రులది.

XVIII

మహినస్తమింపని మార్తాండ బింబమ్ము క్షయమెఱుంగని పూర్ణచంద్రముండు
దేవమానవస్థావర తిర్యగాళిసమత నిజకావ్యకృత పర్ణశాలనుంచి
యక్షరామర పదవుల నందజేయు వరదుఁడె కవీంద్రుఁడన వేయివాక్కులేల
(II–164)

ఇందలి 'వరదుఁడె' యను పదమునకు 'వరము లొసంగువాఁడె' యనుటకంటె 'శ్రీ వరదాచార్యుఁడే'యని చెప్పుట యుక్తముగా నుండునని నా యభిప్రాయము. ఏతత్కావ్యామృత రసము నాస్వాదించిన పిమ్మట సహృదయులు నా యభిప్రాయముతో నేకీభవింపక పోరని విశ్వసించుచు నింతటితో విరమించుచున్నాను.

ఆచార్య, డా॥ దివాకర్ల వేంకటావధాని
ఆంధ్రశాఖాధ్యక్షులు
ఉస్మానియా విశ్వవిద్యాలయము

14-6-1966
హైదరాబాద్

# కవి - కావ్య పరిచయము

పోతనచరిత్ర మొక మహాకావ్యము. చరిత్రములను పేర్లతో ఆధునిక కాలమున సాంఘిక, సాహిత్య దేశచరిత్రలు మాత్రమే తఱచు రచింపబడుచున్నవి. కాని యిట్టి నామములతో ప్రాచీనకవులు కావ్యములను రచించుచుండిరనుట ఆంధ్ర సాహిత్యముతో బరిచయము గలవారికి సువిదితమే. పండితారాధ్య చరిత్రము, ఉద్భటారాధ్య చరిత్రము, విప్రనారాయణ చరిత్రము, మల్హణ చరిత్రము, మనుచరిత్రము, వసుచరిత్రము, రాజశేఖర చరిత్రము, యయాతి చరిత్రము మఱియు వాల్మీకి చరిత్రమువంటివి యిట్టివానిలో సుప్రసిద్ధములు. పండితారాధ్య ఉద్భటారాధ్యులు మతగురువులు, మల్హణ విప్రనారాయణులు, భక్తశిఖామణులు, మన్వాదులు రాజశేఖరులు; వాల్మీకి సంస్కృత మహాకవి. శివతత్త్వ సారమను మొట్టమొదటి శతకమును తెలుఁగులో వ్రాసిన పండితుఁడుకూడ కవిప్రసిద్ధిని గన్నవాడయినను, కవిత్వముకంటె గురుత్వముచేతనే వారు మన కారాధ్యులయినారు. రాజనాయక ప్రబంధములు తఱచు నిబంధింపబడు కాలమున, కవిజీవితమును ఇతివృత్తముగా గ్రహించి తెలుఁగులో కావ్యము రచించినవారిలో తంజాపూరు రఘునాథభూపాలుఁడే ఆద్యుఁడనవలె.

ఈ శతాబ్ద్యారంభమున జగన్నాథ పండితరాయల జీవితమును తిరుపతి వేంకట కవీశ్వరులు నాటకముగా వ్రాసిరి. పండితరాయ లాంధ్రుఁడేకాని సంస్కృతకవిగా, లాక్షణికుఁడుగా సుప్రసిద్ధుఁడు. ఇట్లే యిటీవల శ్రీ చెలమచర్ల రంగాచార్యులుకూడ పోతన చరిత్రమును దృశ్యకావ్యముగా రచించిరి. సుప్రసిద్ధ నవలాకారులు శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు నారాయణభట్టు, రుద్రమదేవి, మల్లారెడ్డియను పేర్లతో కవిత్రయ చరిత్రమును మఱియు శ్రీనాథ కవిసార్వభౌముని చరిత్రమును నవలలుగా రచించుట సువిదితము. ఇట్లాధునిక కవులదృష్టి ప్రాచీన మహాకవులపై బ్రసరించుచుంట ఈ యుగలక్షణములలో నొకటిగా గోచరించును. కవి కవిని ద్వేషించు నవలక్షణమును త్యజించి నేటి కవులు ప్రాచీన మహాకవులనయిన భూషించి వారి కీర్తి నజరామర మొనరింప సంకల్పించుచుండుట యొక నవ లక్షణము. ఇట్టి పవిత్రోద్దేశ ఫలితమే ఈ పోతన చరిత్రము. ఒక యాంధ్ర మహాకవి జీవితగాథను ఆంధ్రభాషలో తొలుదొల్త ప్రబంధీకరించిన కీర్తి శ్రీ వరదాచార్యులవారికే దక్కినది.

ప్రాచీనాంధ్రకవులలో నూటికి తొంబదిమంది దైవభక్తి సంపన్నులే. భక్తశిఖామణి పోతనామాత్యుఁడు, రామదాసు, త్యాగరాజు మున్నగు రామభక్తాగ్రేసరుల కోవకు జెందినవాఁడు. రామదాసాదులును కవులేకాని కీర్తనకారులు. రామదాసు కీర్తనలు సకలాంధ్రము నందలి పండిత పామరజనమును భక్తిభావమునందు ముంచెత్తుచున్నవి. త్యాగరాజు కీర్తనలు తమిళదేశమునందును విశేష ప్రచారము గాంచినవి. కర్ణాటక సంగీతమునకు త్యాగరాజ

కీ ర్తనలే జీవగఱ్ఱ. ఇవి ఇంతటి ప్రాచుర్యము నందుటకు వీనియందలి సంగీతశాస్త్రపు పడి కట్టులతోపాటు, భావభాషామాధుర్యములును భక్తిభావమును ప్రధాన హేతువులు. ఈ మహానుభావులు తమ రామభక్తిచే దాము తరించుటేకాక తమ కీర్తనలచే నితరులకును దరణోపాయమును గల్పించిరి. పోతన మహాకవియును ఆంధ్రుల పాలికి నిట్టివాఁడే. తన యపార రామభక్తిచే తాను తరించుటేకాక అష్టాదశ మహా పురాణములం దుత్తమోత్తమమై, విష్ణుభక్తి ప్రబోధకమై, సులభ మోక్షప్రదమై, వ్యాసప్రోక్తమయిన శ్రీమద్భాగవత పురాణ మును భక్తిరస ఘుటికగా, భవ్య సాహితీరీతిని మధురాతి మధురఫణితి నాంధ్రీకరించి ముముక్షు లోకమునకు మోక్షభిక్షను బ్రసాదించినాఁడు. పోతన భాగవతమువలె తెలుఁగు దేశమునందలి అబాల గోపాలమునకు నత్యంతాదర పాత్రమయిన యుద్గ్రంథము మఱిలేదు. ఆంధ్రుల కాయన యెడాటమునగల ప్రేమాదరములే, పోతన భాగవత జీవితమునకు సంబం ధించిన వివిధగాథలను గాలక్రమమున దేశమున వెలయించి విస్తరింప జేసినవి. ఇట్టి గాథ లను కొందఱు పుక్కిటి పురాణములనియు, మఱికొందఱు యథార్థము లనియు విశ్వసించు చున్నారు. భక్తపోతననుగూర్చి చేయబడిన నాటకమునకు, వ్రాయబడిన హరికథకును, తీయబడిన సినిమాచిత్రమునకువలెనే ఈ పోతనచరిత్ర రచనకును, పై గాథలనే ప్రధా నాధారముగా శ్రీ వరదాచార్యులు గ్రహించిరి. ఇట్టిగాథ లౌకవేళ చరిత్రాత్మకమయిన విమర్శనా దృష్టికివి. ఆధునికుల లోకానుభవ జ్ఞానమునకును గొంత యెబ్బెట్టుగా దోప వచ్చును. కాని వానిని వదలినచో పోతన చరిత్రమే హుళక్కి. పోతన భాగవతము నాంధ్రీక రించెనను చారిత్రిక సత్యము నొకదానిని మాత్రము గ్రహించి కావ్యకల్పన కుపక్రమింప యత్నించుట నేలవిడిచిన సామువలె యసంభవ మగుననుట సత్యము. కావున ఆచార్యులవా రిట్టి ప్రాచీన గాథలను బ్రోవుచేసి, వానిని గొన్నిచోట్ల గొంత సంస్కరించి, కొన్ని నూత్న కల్పనలను జేసియు నీ కావ్యమును రసౌచితీ బంధురముగ సృష్టించుట కడుంగడు శ్లాఘ్యము. 'ప్రబంధ కల్పనామ్ స్తోకసత్యాం ప్రాజ్ఞాః కథాం విదుః' అనుటచే కావ్యమునం దయథార్థ విషయములు నుండవచ్చును అవి యథార్థములవలె భాసించు రీతిని వర్ణింపబడెనేని గుణము లయి కావ్యమునకు శోభగూర్చును. పోతన కావ్యమున నతనికి సంబంధించిన గాథలను బ్రశంస నీయముగా వర్ణించి శ్రీ వరదాచార్యులవా రీ కావ్యమునకు వన్నెపెట్టిరి.

వానమామలై వరదాచార్యులది పండిత వంశము. 'వానమామలై' యను వీరి గృహ నామము పింగళి సూరనగారు చెప్పినట్లు గ్రామ నామమునుబట్టి కలిగినదికాదు. కొండొక కారణమున 'వానమామలై' యను శ్రీరామానుజ గురు పీఠనామమే వీరికి గృహనామమయి యొప్పెనందురు. వీరి తాతగారు వెంకయశాస్త్రి తర్క వ్యాకరణములందు గొప్ప పండితులు. సరస్వతీదేవి వీరియింట చిరనివాసము ననుగ్రహించెనందురు. వీరి పుత్రులు శ్రీ బక్కయ శాస్త్రిగారు కవిజనకులు. సంస్కృత ద్రావిడాంధ్రభాషా సాహిత్యములందు నిష్ణాతులగుటయే కాక వేదాంత జ్యోతిర్విద్యా కోవిదులు; గొప్ప పౌరాణికులు. వాల్మీకి రామాయణార్థమును బురాణ పద్ధతిలో వ్యాఖ్యానించుట వీరిసొత్తు. ఉచ్చైస్స్వరమున వీరు రామాయణ శ్లోకములను

బాడుచుండగా వినుటయే యొక యానందము. వీరి పురాణము వినుభాగ్యము చిన్నతనమున నాకును గలిగినది. ఒక్కొక శ్లోకము నొక గంటకాలము వివిధ విషయములతో వ్యాఖ్యానించి చెప్పెడివారు. "బ్రదికి బక్కయశాస్త్రి పురాణము వినవలె"నని వీరినిగూర్చి పుట్టిన నా నుడి సార్థకము. వీరి పుత్రులలో జ్యేష్ఠుఁడు శ్రీ వేంకటాచార్యులు. వీరు నానాశాస్త్ర కోవిదులు, బహు భాషావేత్తలు. ఉర్దూ ఆంగ్లభాషలను ఆధునిక గణితశాస్త్రమును వీరు స్వయం కృషిచేత సాధించిరి వీరి జన్మస్థలమగు మడికొండ గ్రామమునందలి వీరి నివాసమే ఒక గురుకులముగా నుండెడిది. ఇది నా చిన్ననాటిమాట. కొందఱకు సంస్కృతము, కొందఱకు తెనుఁగు, కొందఱకు ఉర్దూ, కొందఱకు ఆంగ్లము మఱి కొందఱకు గణితమును వీరు విసువులేక బోధించువారు. వీరియొద్ద ప్రైవేటు చదివి నాటి 'ఉస్మానియా మేట్రిక్' పరీక్షయందు త్తీర్ణులయినవారును గలరు. కవికి మాత్రమే వీరు పెద్దన్నగారుకాదు. అప్పటివా రనేకులు వీరిని 'పెద్దన్న' అనియే పిలిచెడివారు. వీరు పరమ సాత్త్వికులు, నిరహంకారులు. అప్పటికిని ఇప్పటికిని ఒక ఖద్దరుధోవతి, ఒక కండువా మాత్రమే వీరు ధరించు దుస్తులు. ఇక్కడ వీరినిగూర్చి యొక విషయము చెప్పుట అసమంజసము కాదను కొందును ఇప్పటికి. సుమారు ముప్పది సంవత్సరములు గడచినవి. వరంగల్ కళాశాలలో 'ఇంటర్మీడియేట్' తరగతులకు సంస్కృతాంధ్రములు బోధించు పండితుఁడు కావలసియుండెను. అట్టి పదవికి శ్రీ వేంకటాచార్యులవారు సర్వవిధముల యోగ్యులని భావించిన వారి మిత్రులును శిష్యులును ఇంటర్వ్యూకు వెళ్ళవలసినదని వెంకటాచార్యులవారిని నిర్బంధించిరి. మొదట వా రిందుకు నిరాకరించినను చివరకు ఆంగీకరింపక తప్పలేదు. కోటు, చెప్పులు బలవంతముమీద తొడిగించి అప్పటి కవసరమగు వేషము శిష్యులే వారికి వేయించి ప్రయాణము చేయించిరి. మిత్ర, శిష్యవర్గము వెంబడింపగా వా రిల్లుబయలుదేరివచ్చి, గ్రామములో నొకచోట గూర్చుండి యాలోచింప దొడగిరి. ఇంతలో మిత్రులు వారిని తలకు 'పాగా' చుట్టుకొనుటకై ప్రార్థించిరి. ఒకరు పాగా చుట్టుచుండిరి. వారి కేమనిపించినదోకాని వెంటనే తలపాగా, కోటు, చెప్పులు తీసి యచ్చటనుంచి, మిత్రుల కొక నమస్కారముచేసి యింటిదారి పట్టిరి. అంతే, తిరిగి వా రా యుద్యోగమునుగూర్చి తలపెట్టినదిలేదు. ఇట్టిది వారి స్వభావము. వీరు Bhandarker Sanskrit Grammar యొక్క రెండు భాగములను గూడ తెనుఁగించిరి. కాని వాని వ్రాతప్రతులుకూడ యిప్పుడు లభించుటలేదు. కొంతకాలము నుండి వీరు గట్లనరసింగాపురమునందు సకుటుంబముగా నివసించుచున్నారు. ఇప్పుడు వీరి వయస్సు డెబ్బదియేండ్లపై చిల్లర. వీరినే కవి ఈ కావ్యపీఠికలో దమ గురువుగా బ్రశంసించిరి. వీరి ద్వితీయ సోదరులు శ్రీ లక్ష్మణాచార్యులు. ఈయన తర్కశాస్త్రమునం దుద్దండ పండితుఁడు, వాగ్మి, వాదప్రియుఁడు. వీరును బహుభాషా కోవిదుఁ లగుటయేకాక, ఆ యా బాషలయం దనేక రచనలు కావించిరి. అట్టివానిలో భక్తి, తత్త్వము, స్తుతిత్రయీ, విరహవేదన, ఆత్మసౌఖ్యము, ప్రకృతి రాగము, ప్రణయాభిజ్ఞానమను ఖండకావ్యములును మఱియు సతీ అనసూయ, తిక్కన చరిత్రమను మహాకావ్యములును వీరి తెనుఁగు రచనలు. పతి సంజీవిని, రామాశ్వ మేధము, ఆముక్త మాల్యద, యను నాటకములు, సంస్కృతీః

అను నవల, లౌకికశిక్ష యను సూత్రగ్రంథమును మఱియు ననేక స్తోత్రగ్రంథములును వీరి సంస్కృత భాషాకృతులు. 'రామాయణకే భక్త్' అను ఖండకావ్యము వీరి హిందీ రచన. వీరి కవితలు కొన్ని అరవభాషా గ్రథితములయి యున్నవి. తెనుఁగు ఖండకావ్యములు దక్క వీరి తక్కిన గ్రంథము లముద్రితములు. వీరు మత వేదాంత విషయములపై గంటల కొలది నుపన్యసించు సామర్థ్యము కలవారు. ఆహిరీ రాజావారి సంస్థాన విద్వాంసులుగా చిరకాలముండిరి. ఈ కాలమున వీరు 'కోయ'భాషకు లిపి, సారస్వతములను సృష్టించి యుండిరి. ఈ భాషకు ఆచార్యులవా రొనరించిన సేవ శ్రీరామమూర్తి పంతులుగారు శబర భాషకు చేసిన సేవవంటిదని చెప్పుట యతిశయోక్తి కాదు. ప్రచారాభావముచేత ఈ విషయము పలువురకు తెలియదు. వీరు పరమపదించి రెండ్లేండ్లయినది. ఈ సోదరవర్గమున తృతీయుఁడు శ్రీ జగన్నాథాచార్యులు. తక్కిన సోదరులవలెనే వీరును సంస్కృతాంధ్ర ద్రావిడభాషలయందు పండితులు. పెద్దన్నగారియొద్ద చదివి మెట్రిక్యులేషను పరీక్షయందు త్తీర్ణులయిరి. తమ నివాసమును పోతారెడ్డిపేటకు మార్చుకొని యచ్చట కొన్ని సంవత్సరములపాటు వ్యవసాయవృత్తి నవలంబించిరి. ఈ కాలమున వీరు రైతులకు కడు సన్నిహితులుగా మెలగి, ఆ వృత్తికి సంబంధించిన పదములను వందలకొలది సేకరించుటేకాక, అట్టి పదజాలమును తాము వ్రాసిన 'రైతు రామాయణ' మను పద్యకావ్యమునందు ప్రయోగించిరి. రైతు కుటుంబ కథలో రామాయణగాథ ధ్వనించునట్లు కల్పించి వందలకొలది పద్యములలో వ్రాయబడిన నవ్యకావ్యము రైతు రామాయణము. ఈ కావ్యమనిదంపూర్వమన్న నతిశయోక్తి కాదు. ఇట్టి చక్కని కావ్యము ద్రవ్యాభావమువలన మూలబడి యుండుట దేశ దౌర్భాగ్యమనవలెను. వీరు 'కార్పాసలక్ష్మి' యను పేరుతో నొక వైష్ణవ భక్తునిగాధను నాటకముగా రచించి మిత్రుల కనేక పర్యాయములు వినిపించిరి. కాని ముద్రణాభాగ్యమునందక కొంతకాలమునకు వ్రాతప్రతికూడ లుప్తమయిపోవుట శోచనీయము. ఈ నాటకమునందలి యొక పద్యము 1934 సంగులో ప్రకటితమైన గోలకొండ కవుల సంచికలో చూడవచ్చును. వీరు హాయిగా పాడగలరు, హరికథలు చెప్పగలరు. ప్రస్తుతము వీరు కరీంనగరమునందలి యున్నత పాఠశాలలో ఆంధ్రభాషా పండితులుగా నున్నారు.

పోతనచరిత్రకర్త శ్రీ వరదాచార్యులిట్టి సోదరత్రయమునకు అవరజుఁడయి పుట్టి మాతృస్తన్యముతోపాటు అన్నల గుణములనుగూడ నంది పుచ్చుకొనిరి. మడికొండగ్రామ పాఠశాలలో నాల్గవ తరగతివఱకు విద్య నభ్యసించిరి. పిమ్మట నింటిలోనే అన్నలయొద్ద జదివి యప్పటి మిడిల్ పరీక్షయందు త్తీర్ణులయిరి. అది మొదలు సంస్కృతాంధ్రభాషా సాహిత్యములయందు కృషిచేయుచు క్రమముగా నీ రెంటియందును పాండిత్యము సంపాదించిరి. ఈ కాలమున వీరు సంస్కృత పంచకావ్యములును శాకుంతలాది నాటకములును, ఆంధ్రభారత భాగవత రామాయణములును మను వసుచరిత్రాది ప్రబంధములును శ్రద్ధాసక్తులతో బఠించి వారివారి కవితా మార్గముల నవగాహనము చేసికొనిరి. మొదటినుండియు నాచార్యులవారికి కవిత్వము, సంగీతము, చిత్రలేఖనము మున్నగు లలిత కళలయందాసక్తి పుష్కలము. వీరి యన్న జగన్నాథాచార్యులకును వీరికిని మధుర కిన్నర కంఠస్వరము

'పిత్రాస్తి'గా సంక్రమించినది. అప్పటి కింకను మన దేశములో 'సినిమాలు' పుట్టలేదు. మైలవరం కంపెనీవంటి ప్రసిద్ధ నాటక సమాజములు కొన్ని దేశమం దంతటను నాటకములను ప్రదర్శించుచుండెను. వరంగల్లు నగరమునందును ఏటేట ఈ కంపెనీలు కొన్ని నాటకములను ప్రదర్శించు చుండెను. కపిలవాయి రామనాథశాస్త్రి, విడిముక్కల సుబ్బారావు మున్నగువారి పాటల 'గ్రామోఫోను రికార్డులు' క్రొత్తగా రాదొడగిన కాలమది. భగవద్దత్తమగు గాత్రముండుటచే శ్రీ వరదాచార్యులవారు, వీరి యన్నగారు ఈ రికార్డులు పదేపదే విని సంగీతము నభివృద్ధి చేసికొనిరి ఊహ చేతనే కవిగారు హార్మోనియము, తబలా, మృదంగ వాద్యములు నేర్చిరి. అటుపిమ్మట వీరు తమ గ్రామయువకులు ప్రదర్శించిన నరకాసురవధ, గయోపాఖ్యానము మొదలగు నాటకములలో ముఖ్యపాత్రలు ధరించి పలుమారు ప్రేక్షకుల ప్రశంసల నందుకొనిరి నాకు జ్ఞాపకమున్నంతవరకు ఆచార్యులవారు 'మంగళహారతులు వ్రాయుటతో కవిత్వరచన కుపక్రమించిరి. పిమ్మట పద్యరచన ప్రారంభించి దాగురింతలు అను ఖండకావ్యమును రచించిరి. రవీంద్ర కవీంద్రుని గీతాంజలి యనువాదమును, ఆంగ్లకవి వర్డ్స్వర్త్ పద్యములను వీ రాసక్తితో చదువువారు. కావున వారి కవితాపద్ధతినిగూడ వీరు కొన్ని పద్య ఖండికలను రచించిరి. వేదాంతము, ప్రకృతి, పేదల కష్టములు మున్నగు విషయ వర్ణన భాగములలో పోతన చరిత్రలోగూడ పై కవుల భావచ్ఛాయలు కొన్ని గోచరించకపోవు. తాము వ్రాసిన పద్య ఖండికలను సుమారు 20 సంవత్సరముల క్రిందట 'మణిమాల' యను పేరుతో ప్రచురించిరి. ఈ మణిమాల వీరికి కవికీర్తి నార్జించి పెట్టినది. ఇందలి కవిత్వమును మెచ్చి కీ. శే. శ్రీ చెళ్ళపిళ్ళ వేంకట కవీశ్వరులు, కళా ప్రపూర్ణ శ్రీ విశ్వనాథ కవిసామ్రాట్టు, శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణ దాసుగారు మున్నగు ప్రముఖులెందరో వీరిని బ్రశంసించిరి. తర్వాత గొంతకాలమునకు 'ఆహ్వాన'మను పేరుతో నొక 'గేయ' సంపుటిని బ్రకటించిరి. ఈ గేయసంపుటిని వరదాచార్యులవారు మడికొండ గ్రామవాసులేయగు శ్రీకాళోజీ రంగారావుగారికి గృతియిచ్చిరి. శ్రీ రంగారావు పంతులుగారు తెలంగాణ ప్రజాకవి శ్రీ నారాయణరావు, రామేశ్వరరావుగారల పితృపాదులు. అసాధారణ ప్రజ్ఞావిధులు, బహుభాషా నిష్ణాతులు, రామభక్తాగ్రేసరులు, సత్యసంధులు, సాధుశీలురు. మడికొండగ్రామ యువకులు పలువు రానాడు వీరియొద్ద జదివినవారే. గ్రామమునందు విద్యాభివృద్ధికి వీరు కావించిన నిష్కామసేవ అమూల్యము. వరదాచార్యులవారుకూడ వీరి శిష్యవర్గములోనివారే. ఆహ్వానమును వారి కంకితమొనర్చి తమ గురుభక్తిని బ్రకటించి కృతార్థులయిరి. పద్యములవలెనే గేయములుకూడ జిగిబిగితో రచించుటయందు వీరు కడు సమర్థులనుటకు ఈ 'ఆహ్వాన'మే నిదర్శనము. ఇంతకు బూర్వమే వీరు 'వైశాలిని' యను పేరుతో బ్రాచీనపద్ధతి నొక్క యుత్తమ నాటకమునుగూడ విరచించిరి. దీనిని వినుచున్నప్పుడడుగడుగునకు మన కభిజ్ఞాన శాకుంతలము స్మరణకు వచ్చుచుండును. ఇందలి భావములు, ఉపమాద్యలంకారములు నట్టివి. కాని యీ నాటక మిప్పటికిని ముద్రితము కాకుండుట శోచనీయము. పై కృతులు మాత్రమే కాక ఆచార్యులవారు ఉద్యోగరీత్యా దోమకొండ బేసిక్ పాఠశాలలోనున్న కాలమున సమకాలిక సాంఘిక, రాజకీయ, వ్యావసాయి కేతివృత్తములతో

వనేక నాటకములు, యేకాంకికలు, బుఱ్ఱకథలు వ్రాసి వానిని తమ శిష్యబృందముచేత నాడించి పాడించిరి. ఇవి ప్రచారదృష్టితో వ్రాయబడినప్పటికిని ఉత్తమ సాహిత్యపు విలువలతో నలరారు చున్నవి. ప్రస్తుతము వీరు చెన్నూరునందలి ప్రభుత్వపు పాఠశాలలో నాంధ్ర భాషా పండితులుగా నున్నారు.

పోతనచరిత్రము వీరి ప్రస్తుత కావ్యము. ప్రాచీనాంధ్ర మహాకవులు పలువురుండగా వీరు ప్రత్యేకముగా బమ్మెరపోతన జీవితగాధనే తమ కావ్యవస్తువుగా గ్రహించుటకు గొన్ని కారణము లూహింపవచ్చును. సారస్వత జీవితమువలెనే పోతన సాంసారిక జీవితముకూడ విశిష్టమయి పవిత్రతమముగా భాసించుట మొదటిది. ఆచార్యులవారి జీవితమును నిరాడంబరమును నిర్మలమునయి యొప్పుచుండుట రెండవది. ఆంధ్రభాగవతము వీరి కత్యంత ప్రీతిపాత్రమయి యభిమాన గ్రంథముగా నుండుట మూడవది. పోతనవలెనే వీరుకూడ తెలంగాణమువా రగుటయేకాక, ఏకశిలా నగరమునకును బమ్మెరకును మధ్యలోనున్న మడికొండ (మణిగిరి) గ్రామమునందు పుట్టి పెరిగి పెద్దవారగుట నాల్గవది. ఈ కొన్ని హేతువులే వీరి నీ కావ్యరచనకు ప్రోత్సహించియుండు ననవచ్చును. ఇచట మడికొండ గ్రామమును గూర్చి కొన్నిమాటలు వ్రాయుట యసమంజసముకాదు. మడికొండకు ప్రాచీనచరిత్ర కలదని కీ. శే. శ్రీ దూపాటి వేంకటరమణాచార్యులు తఱచు చెప్పుచుండువారు. కాకతీయుల కాలమున నిదియొక ప్రసిద్ధ దుర్గముగా నుండినట్లు తెలియుచున్నది. పశ్చిమ చాళుక్యుల సామంతుఁడును వేములవాడ, కొలనుపాకలకు మహా మండలాధిపతియునగు జగద్దేవునకు రెండవ కాకతి ప్రోలరాజునకును ఇప్పటికి 800 సం॥ పూర్వ మీ మడికొండ సమీపమునందే ఘోర యుద్ధము జరిగినట్లు చరిత్ర వాకొనుచున్నది. సుమారు 30 సం॥ పూర్వ మీ గ్రామమునందు ప్రాచీనకాలపు బంగారు నాణెములు కొన్ని లభించినవి. ఈ విషయ మప్పటి వార్తా పత్రికలలో ప్రచురింపబడినది. ఈ గ్రామపు ప్రాచీన చరిత్రనుగూర్చి తగు పరిశోధన మింకను జరుగవలసియున్నది. కాకతీయుల కాలమునం దిది కడు ప్రసిద్ధమయి విద్వాంసులకును కవులకును నాలవాలముగ నుండెననుట మాత్రము నిస్సందేహము. మడికొండకు ముదికొండ నామాంతర ముండును. వరంగల్లు నగరమునందు పూర్వమునుండియు ముదిగొండయను గృహనామముగల ఆరాధ్యపండిత కుటుంబములుకలవు. వీరు మొదట మడికొండ వాస్తవ్యులుగా నుండిరేమో ? మడికొండ గ్రామమున బూర్వమునుండియు 'పింగళి'యను గృహనామముగల నియోగి బ్రాహ్మణ ప్రభువు లిప్పటికిని గలరు. ఇప్పుడీ వంశమునకు భూషణమై యొప్పు వేంకటేశ్వరరావుగారు చక్కని సరస సౌజన్యములు గలవారు. ఈ గ్రామమునకు వీరు దేశముఖులు. నిజాంప్రభుత్వకాలమున వీరు 'రుసుముదార్లు'. ఇక్కడకూడ పింగళివారి 'పేకి'కథ నేటికిని బ్రచారమున గలదు. 'పింగళి పీకమ్మ' యతిమానుష చర్యలను గొన్నింటి నిట వింతకథలుగా జెప్పుకొందురు. హనుమకొండయందును వీరి దాయాదులు కలరు. వీరు పింగళి సూరనకవికి బూర్వులో లేక యతని యనంతర మీ ప్రాంతమునకు వచ్చి స్థిరనివాసమును కల్పించుకొనిరో విచారింపవలసియున్నది. ఈ గ్రామమునందలి

రెడ్డిపల్లి ప్రభువు కీ. శే. తొటిరెడ్డి గోపాలరెడ్డిగారు గొప్ప సంస్కృత విద్వాంసుఁడు. వాల్మీకి రామాయణమును బహువారములు పఠించి యందలి రహస్యము లనేకము నవగాహన మొన రించుకొనిరి. సంస్కృతభాషలో ధారాళముగా సంభాషించువారు. ఇరువది ముప్పది సంవత్స రములకు పూర్వమువరకు ఆంధ్ర, తెలంగాణ ప్రాంతములందు పే రెన్నికగన్న కవిపండిత లలో వీరిని దర్శించి బహూకరింపబడనివారరుదు. తిరుపతి వేంకటేశ్వరకవులు, కొప్పరపు కవులు మున్నగు పలువురు వీరి సన్మానముల నందికొనిరి. ఆంధ్రప్రదేశ ప్రభుత్వపు ఆస్థాన కవీశ్వరులలో నొక్కరగు కీ. శే. శ్రీ పాద కృష్ణమూర్తి కవిసార్వభౌములు 'కుముద్వతీ కల్యాణ' (?) కావ్యమును రచించి రెడ్డిగారికి కృతి యొసంగి వారి సత్కృతికి పాత్రులయిరి. ఇరువది సం॥ క్రిందటి వరకును వీరు జీవించియుండిరి వీరి పుత్రులొకరు 'అమెరికా'లో 13 సంవత్సరము లుండివచ్చిరి. సుమారు 140 సం॥ పూర్వ మీ మడికొండ వాస్తవ్యుఁడగు నియోగి బ్రాహ్మణుడు మోతుకూరి పండరినాథకవి 'అధ్యాత్మ రామాయణ' కావ్యమును దాదాపు పదివేల పద్యములలో రచించెను. ఇది అముద్రితము. కవి స్వహస్త లిఖితప్రతి యిప్పటికిని వారి వంశీయులయొద్ద కలదు. (ఇంతకు గొంతపూర్వము కాణాదము పెద్దనసోమయాజి రచించిన అధ్యాత్మ రామాయణము ముద్రితము). ఈ కావ్యము నెవరు ముద్రింపదలచినను వా రిచ్చుటకు సిద్ధముగా నున్నారు. ఈ కవియే 'రామకథా కల్పలత' యను పేరుతో గీర్వాణభాషలో రామాయణ కథను 2400 శ్లోకములలో రచించెను. కొంత కాలముక్రిందటి వఱకును నిది జీర్ణదశలోనుండి యిపుడు లుప్తమయినది. ఇటీవలి కాలమున అవధానములు పెక్కుచేసి 'నిజాం రాష్ట్రప్రథమ శతావధాని' బిరుదాంచితులయిన కీ. శే. వీరవల్లి నృసింహాచార్యు లిక్కడివారే. ఈ గ్రామమున బుట్టుటనో, పెరుగుటనో కవి ప్రసిద్ధిగన్న కాళోజీ ప్రభృతులు కొంద ఱిపుడు కారణాంతరములచే వరదాచార్యులవలెనే గ్రామాంతరములందు నివసించుచున్నారు. వేదశాస్త్ర పురాణ జ్యోతిషాది విద్యా సంపన్నులగు బ్రాహ్మణోత్తములు మొన్న మొన్నటి వఱకును నీ గ్రామమందుండిరి. వారి తరము గడచి పోయినది. వేదశాస్త్రములకును నాదరము తగ్గి కాలము మారుటచే పాశ్చాత్య విద్యలకు ప్రాభవము కలుగుటచే నీ తరమువారు వీని యభ్యాసమునకు దొరకొనిరి. ఇప్పుడీ గ్రామము వారిలో పి. హెచ్. డి, ఎం. బి. బి. యస్; వెటర్నరీ, ఆయుర్వేద డాక్టర్లు; ఇంజనీయర్లు, లాయర్లు, లీడర్లు, న్యాయాధిపతులు, తహసీల్దార్లు, కళాశాలాధ్యాపకులు, ఉన్నత పాఠశా లాధ్యక్షులు, ఉపాధ్యాయులు పలువురు కలరు. ఎం. ఏ., బి. ఏ. లును ఎందరో కలరు. కళాశాలా విద్యార్థులసంఖ్య ఈ గ్రామమునందు నానాటికి పెచ్చు పెరుగుచున్నది. ఇట్టిది యీ కవిజన్మస్థలము. ఇట్టి గ్రామమునందే పోతన కావ్యరచన కుపక్రమించి యించుమించుగా ముగించిరి. జన్మస్థలాభిమానాధిక్యముచేతనే మడికొండ గ్రామమును వీరు పోతన కథలో జేర్చి. యచ్చటి పండితులను పోతనదర్శించి ప్రశంసించినట్లును. వారు పోతన భాగవతమును విని యగ్గించినట్లును కావ్యములో కల్పించిరి. పై విషయమును బట్టిచూడ పోతన కాలమున మడికొండలో నంతటి పండితు లుండియుందురనుట యథార్థమునకు సన్నిహితముగా గోచ రించును. కావున నీ కథాంశ కల్పనము సముచితమయి కథలో చక్కగా నతుకుచున్నది.

మడికొండకు సమీపమున 'మెట్టుగుట్ట'యను నొక కొండకలదు. కొండమీద ఈశ్వరాలయము రామాలయమును ప్రక్కప్రక్కన గలవు. ఇక్కడి ఈశ్వరునకు మెట్టురామప్ప యనియు మెట్టు రామలింగేశ్వరస్వామి యనియు ప్రసిద్ధి. పాలగుండము, రామగుండము, జీడిగుండములను మూడు ముఖ్యగుండములిట గలవు. వీనిలో పాలగుండము మిగుల పెద్దది, లోతైనది. ఇందలి నీరు చూచుటకు పచ్చగా నుండునుకాని పాలవలె రుచ్యముగా నుండును. ఇది సర్వకాలములందును ఎండక నీటితో నిండుకొనియుండును. ఈ కొండ కొక చివరనొక చిన్న గుడియున్నది. దీనిని 'దొంతులమ్మగుడి' యందురు. ఈ గుడి నానుకొని వెనుకవైపు రెండు పెద్ద రాతిగుండ్ల పేర్పులు చాల యెత్తుగా నొకదాని ప్రక్క నొకటి కలవు. వీనికి 'దొంతులమ్మగుండ్లు' అని ప్రసిద్ధి. ఈ గుండ్ల దొంతులు పూర్వము దొంతులమ్మయను దేవత కచ్చకాయ (అచ్చనగండ్లాట) లాడి పెట్టినదని కొందఱును భీమునిభార్య హిడింబి పెట్టినదని మఱికొందఱు చెప్పుదురు. మెట్టుగుట్టకు 'హిడింబాశ్రమ' మను ప్రసిద్ధి కలదు. కాకతి రుద్రమదేవుని మంత్రి వెల్లకి గంగాధరుఁడు తాను స్వయముగా వ్రాసిన కరీంనగర శాసన పద్యములలో నీ క్షేత్రమును 'హిడింబతీర్థ'మని పేర్కొనుటచే దీనికీ పేరు కడు ప్రాచీనమని తెలియుచున్నది. ఈ కొండమీద శివరాత్రికిని, శ్రీరామనవమికిని ఏఁటేట తీర్థము (జాతర) సాగుచుండును. 'మగడు గొట్టగా మెట్టుతీర్థ'మను సామెత ఈ తీర్థ ప్రసిద్ధి వెల్లడించును. ఈ మెట్టుగుట్టకుగూడ శ్రీ వరదాచార్యులవారు కావ్యకథలో స్థానమును గల్పించి 8, 9 ఆశ్వాసములలో దీని మహిమ నుత్సాహముతో వర్ణించుటేకాక, పోతన యీ కొండకువచ్చి కొన్ని వాసరము లుండినట్లును మఱికొంత కథను గల్పించిరి. ఓరుగంటికిని బమ్మెరకును మధ్య దారిలోనిది యుండుట, పోతన కొండపైకేగి శ్రీరాముని సందర్శించె ననుట కడు సహజముగను విశ్వసనీయముగను నున్నది కావ్యములో నీ మెట్టుగుట్టను బ్రశంసించుటకు గారణాంతరమును లేకపోలేదు. ఆచార్యుల వారీ పోతన కావ్యమును బ్రారంభింపక పూర్వము, వారి షోడశ వర్షప్రాయమున నీ గుట్టమీది గుడిలో, గుండములో, గుహలలో నొక సంవత్సరముపాటు దీక్షతో గురూపదిష్ట మార్గమున వాగీశ్వరీ మంత్రము నుపాసించుట ప్రత్యక్షముగా నే నెఱుగుదును. ఇట్టి మెట్టుక్షేత్ర మహాత్మ్యము చేతను, తీవ్ర ప్రయత్నముచేతను ఆచార్యులవారు మంత్ర సిద్ధితోపాటు దేవీ కటాక్షము నకును శీఘ్రకాలముననే పాత్రులయిరి. పోతన కథతో మెట్టుక్షేత్రమునకుగూడ నొక విధమగు సంబంధము కల్పించి కవి వర్ణించుటకు ఇదియునొక కారణమని యూహింప వచ్చును. వీరిట్లు వాగ్దేవీ కటాక్ష పాత్రులయిన యనంతరము కొంతకాలము పద్యఖండికలు, నాటక రచనావ్యాసంగముచేతను స్వీయ పాండిత్యము నభివృద్ధి కావించుకొను ప్రయత్నము నందును గడపి పిమ్మట నీ 'పోతన చరిత్ర' రచన కుపక్రమించిరి. కావుననే యిందలి ఆశ్వాసాంత గద్యలో వీరు 'వాగీశ్వరీ సమాసాదిత (వైదేహీ వరవివేదిత) సరస కవితా విలాస, సహజ పాండిత్యభాస'యని తమ్ముగూర్చి వ్రాసికొనిరి. చిరకాలదీక్షతో వీరీ కావ్య నిర్మాణము సాగించు కాలముననే ఈ కావ్య ప్రసిద్ధి తెలంగాణమం దంతటను వ్యాపించెను. గ్రంథ పరిసమాప్తికి బూర్వమును దర్వాతను ఇందలి యనేక రసవద్ఘట్టములను పలు సభా

వేదికలనుండి గానముచేసి పండిత పామరశ్రోతల ప్రశంసలకు పాత్రులయిరి. ద్రవ్యరూప సన్మానములచేతనే కాక 'అభినవ పోతన' బిరుదము చేతను వీరు బహూకృతులయిరి. కాని పీఠికలోగాని ఆశ్వాసాంతగద్యలోగాని యిట్టి బిరుద నామమును వ్రాసికొనకుండుట ఆచార్యులవారి నిరాడంబర స్వభావమునకు నిదర్శనము. పోతన భాగవత కావ్యరచనకు గొంత నిరోధము కలిగి శ్రీరామ కటాక్షముచేత తన్నివారణము కలిగినట్లే, శ్రీ వరదాచార్యులవారి 'పోతనచరిత్ర' కావ్యరచనకును గొంత నిరోధము కలిగి తన్నివారణము కలిగినది. ఈ విషయమును కవిగారు కావ్యపీఠికలో 'కావ్యనిరోధ'మను పేరుతో స్వయముగా దెలిపిరి. కావ్య సంపూర్తికి పూర్వమే వారిని గబళింప యత్నించిన క్షయవ్యాధిరూప మృత్యువును వారెట్లు ప్రతిఘటించి "యముని 'పోగ్రాము'ను మార్చి"రో తెలుపుచు ఈ క్లిష్టసమయమున దమకు వాగ్రూప, ధనరూపముగ సాయమొనర్చిన కవిమిత్రులు శ్రీకాళోజి, దాశరథి, నారాయణరెడ్డిగార్లకును, పెద్దలు శ్రీ బూర్గుల రామకృష్ణామాత్యులకును హార్దిక కృతజ్ఞతలను వెల్లడించి కొంత ఋణవిముక్తులయిరి. హైదరాబాదు నిజాంరాష్ట్రమున 'పోలీసుచర్య' జరుగుచుండిన కాలమున మైసూరులో చికిత్స పొందుచున్న వరదాచార్యులు మృత్యువుకు గుఱియయిరను వార్తవిని వారి మిత్రులు పలువురు దుఃఖితులయిరి. పోలీసు చర్యజరిగిన యనంతరము కవిగారు జీవించియే యున్నట్లువిని పునర్జన్మించిరని హర్షించిరి. ఈ విషయమును పీఠికలో సూచించుచు కవి "వరదన! నాకు మోదకర వార్తలు జీవితమందు రెండె, నిన్ బొరసినవ్యాధి దూరమయిపోవుట, పోలీసుచర్య యిద్ధరన్" అను దాశరథి మహాకవి వాక్యములను (ప. 123) పునరుద్ధరించి యున్నారు, పిమ్మట అయిదారు సంవత్సరములకు అనగా 4954 నాటికి వీరీ కావ్యరచన నొక విధముగా దేవీ కటాక్షముచే ముగించిరి. ధనాభావముచే నిది ముద్రణభాగ్యము పొందుటకు సరిగా నొక 'తపము' పట్టినది. ఇట్లీ కావ్య రచనకు బూర్వము, రచనా కాలమున (వాఙ్మయం తపఉచ్యతే) తదనంతరమునకు ఆచార్యుల వారికి 'తపము' తప్పకుండుట చిత్రము. అనేక వ్యయప్రయాసల యనంతర మిప్పటికైననేదో యొక విధమున నిది వెలుగులోనికి రాగలుగుటచేత కవిగారి తపము మాత్రమే కాక సాహిత్య రసపిపాసువుల తపమునుగూడ ఫలించినట్లయినది. ఆచార్యులవారి రచనలో 'పోతన చరిత్ర' సర్వోత్తమ మయినది. వీరి యీ ప్రయత్నము కాలమున కెదురీతవంటిది. కాలము మార్పువలన నేడు పాఠకుల సాహిత్యాభిరుచులలోగూడ పెద్ద మార్పువచ్చినది. ప్రబంధకాలమునాటి పాఠకులవలె, ఓపికగాని తీరికగాని కల పాఠకుల సంఖ్య నేడతి స్వల్పము. ఇది గుణమయినను దోషమయినను కాలముదే. ఇంతయేల! "ఊహ తెలియం కల లేఖక పాఠకోత్తముల్ దొరికినగాక యూరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే"యని పెద్దనగా రానాడే వాపోయినాడు. నాలుగువందల యేండ్ల తరువాత నేడు మన మామాటనే పునరుచ్చరించుట నిష్ప్రయోజనము. జటిలమయిన తత్సమాచ్ఛిక భాషలలో రచింపబడిన బృహద్గ్రంథ మెంత యుత్తమమయిన దయినను జదువువారి సంఖ్య యేకాలము నందును స్వల్పమే యనుట స్పష్టము. ఈ రహస్యమును మొట్టమొదట కనుగొన్న మేధాశాలి పాల్కురికి సోమనాథుడే కాబట్టియే బసవపురాణము నతడు జాను తెలుఁగులో ద్విపదలుగా

గూర్చెను. ఈనాడు మిగుల వ్యాప్తిలోనున్న గేయకవితకు ద్విపదకవిత దగ్గఱి చుట్టము. నేటి వ్యావహారి కాంధ్రమునకు జానుతెనుఁగును నట్టిదే యనవచ్చును. కాని సోముని తరువాతి కవులు తిరిగి నన్నయ కావ్యమార్గమునే ప్రచారమునకు దెచ్చిరి. ప్రబంధకవు లా మార్గ మును జటిలతర మొనరించి సామాన్యులకు దుర్గమము కావించిరి. అట్లయ్యు నధికారులగు సహృదయుల కీ మార్గముకూడ రమ్యమును రసవత్తరము నయ్యుండుట నీ మార్గము ననుస రించి వచ్చిన, వచ్చుచున్న మహాకావ్యము లీనాడును లేకపోలేదు కాని వీని సంఖ్య వ్రేళ్ళపై లెక్కింపదగిన మాత్రమే. సౌందరనందము, రాణాప్రతాప చరిత్ర, శివభారతము, రామా యణ కల్పవృక్షములు కొన్ని యిట్టివి కావ్యగుణముచేతను వైపుల్యమునుబట్టియు బయి మహాకావ్యముల పంక్తిని నిలువదగిన దీ పోతనచరిత్ర మహా ప్రబంధము.

ఎట్టి కావ్యరచనకేని మొట్టమొదట కావలసినది కథ. కళా పూర్ణోదయమువంటి కల్పిత కావ్యమునకు దక్క తక్కిన ప్రాచీన కావ్యములకు మూలగ్రంథములు గోచరించును. సోమనాథుని బసవపురాణ పండితారాధ్య చరిత్రము లిందుల కపవాదములు. ఈ కావ్యనాయ కులు పురాణ పురుషులు కాకుండుటే యిందులకు ముఖ్యకారణము. ఇందు బసవేశ్వరుడు మతప్రవక్త వంటివాడు. పండితారాధ్యుఁడు, మతప్రచారకుఁడు. వీరి చరిత్రమును సోమ నాథుఁడు చాలవఱకు లోకమునుండి వారి మహాత్మ్యములను దెలుపు గాథల రూపమున సేక రించవలసిన వాఁడయ్యెను. పోతన చరిత్రమును దెలుపు ప్రాచీన గ్రంథములులేవు. కావున వరదాచార్యులు భాగవత పీఠికలో స్వయముగా పోతనయే చెప్పిన స్వవిషయమును మఱియు నతనిగూర్చి దేశమున వ్యాప్తిలోనున్న గాధలను, వీనినిగూర్చిన విమర్శకుల యభిప్రాయ ములను తమ కావ్యవస్తువున కాధారముగా గ్రహింపవలసిన వారయిరి. యథాతథముగ గాక యిట్టి వానిని గొన్నిటిని దమ బుద్ధికి దోచిన విధమున నౌచిత్యదృష్టితో సంస్కరించి వీరు గ్రహించిరి. ఈ విషయమును వారు కావ్యమున నిట్లు తెలిపిరి.

[1]విన్న దొకింత, భాగవత విశ్రుత పీఠికలోనఁ దాను పో
తన్న వచించి నంతయు, యథార్థ మిదేయను మా చరిత్ర తి
క్కన్నలవాద ధోరణిరవంత, మనమ్మునఁ దోచినంత, నీ
సన్నిధిలోన నే మనవి సల్పెద నల్పమతిన్ మహాదృతిన్. (ఆ. 1., ప. 3)

---

[1]ఎఱ్ఱన, పోతనలును నిట్లే చెప్పిరి. ఇది ప్రాచీన సంప్రదాయ మార్గమనుట స్పష్టము.

'ఏనును బెద్దలచేమును, వీనులలర దరతరంబు విన్న విధంబున్
మానసమున నున్న తెఱఁగు, గానుపునం గన్నక్రమము గతన మొనర్తున్'
(నృసింహపురాణము ఆ. 1. ప. 24)

'భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు, శూలికైనఁ దమ్మి చూలికైన
విబుధజనులవలన విన్నంత కన్నంత, తెలియవచ్చినంత తేటపఱుతు.'
(భాగవతము, స్కం. 1 ప. 17)

పైవానిలో భాగవత పీఠికలో పోతన చెప్పినది స్వల్పమే యైనను యథార్థము. శ్రీమన్నారాయణుని కథను ప్రపంచించి రచించు కుతూహలుఁడై యొకనాటి చంద్రగ్రహణ కాలమునకు గంగకేగి స్నానమాడి ముకుళిత నయనుడై మహేశ్వరుని ధ్యానించుచుండగా శ్రీరామచంద్రుఁడు సాక్షాత్కరించి తన్నెఱింగించి, తన కంకితముగా భాగవతము నాంధ్రీకరించి భవబంధముల బాయుమని యానతిచ్చి తిరోహితుఁడు కాగా పోతన యట్లే చేయుటకు నిశ్చయించి పిమ్మట ఏకశిలా నగరంబునకరిగి యచటి పెద్దల యనుమతి పడసి భాగవత రచన కుపక్రమించినట్లుమాత్రమే కాక తన కులగోత్రాదులను, పూర్వులయు జననీ జనక సోదరులయు నామము లెఱిగించెను. గద్యలో సహజ పాండిత్య. విశేషమును వేసికొనెను. ఇంతకుమించి పోతన తెలిపిన ముఖ్యవిషయములు లేవు ఇంటిపేరు 'బమ్మెర' వారనియు దన కృతిని సొమ్ముల కాసించి రాజుల కంకితము సేయక భాగవతమును శ్రీహరికిచ్చి చెప్పెననియు నింకొక (11) పద్యమువలన దెలియుచున్నది. కాని ఈ విషయ మొక మహాకావ్య రచనకు జాలదు. తక్కిన గాథలన్నియు వివాద గ్రస్తములు. పోతన దేశకాలమును గూర్చియు నితర గాథలను గూర్చియు నభిప్రాయ భేదములు కలవు.

పోతన కడప మండలములోని 'ఒంటిమిట్ట'వాడని యొక వాదము తెలంగాణము నందలి ఏకశిలానగర సమీపమునగల బమ్మెరవాడని రెండవ వాదము. ఈ రెండవదే సరియైనదని చారిత్రకు లంగీకరించిరి. కావున కవి దీనినే గ్రహించియు నీ యుభయ వాదములను సమన్వయపఱచు నుద్దేశముతో పోతన తన చరమ జీవితము నొంటిమిట్టలో గడపెననియు భాగవతకృతి శ్రీరామచంద్రున కచ్చటనే సమర్పించెననియు కల్పించెను. ఈ కల్పన సముచితమైనది.

పోతన శ్రీనాథుని సమకాలికుఁడనియు బావమఱదియనియు గాథలు. ఇది సత్యము కాదనియు విమర్శకులు. సుదూర బంధుత్వ మా కాలమున నసాధ్యమని వీరి యభిప్రాయము. కాని యీ వాదము నంగీకరించినచో వీరిరువురకు సంబంధించిన కథయంతయు పోవును. కావున ఆచార్యులవారు వీరి బంధుత్వ గాథను గ్రహించి దూరబంధుత్వము వీరికి సుసాధ్యమయ్యెననుటకు శ్రీనాథుని తీర్థయాత్రా గమనమును కల్పించుటేకాక ఈ సంబంధమును దన తల్లి యంగీకరించిన యెడల బమ్మెరకు తఱచు వచ్చు సౌకర్యముకొఱకు శ్రీనాథుఁడు తాను సింగభూపాలుని యాస్థానకవిగా నుండదలచినట్లు వీరు సూచించిరి. (ఆ. 2 ప. 208)

భోగినీదండకము పోతనరచన కాదనియు, అది యతని యౌవనరచనయనియు, సింగభూపాలుని ప్రేరణచే నతని యుంపుడు గత్తెయగు వేశ్యపై పోతన రచించెననియు పెక్కువిధముల చెప్పబడుచున్నది. కవిగారు దీనిని పోతన కృతముగనే గ్రహించిరి. కాని యిట్టి రచనవలన పోతనకు న్యూనత కలుగకుండునట్లు, పూర్వజన్మమున భోగిని రంభయైనట్లును, పూర్వజన్మమున ఇంద్రుఁడయిన సింగభూపుని వలచివచ్చినట్లును మఱియు నామె నాట్యకళా

కౌశలమునకు మెచ్చి, సింగభూపాలుని ప్రేరణచేగాక స్వయముగనే పోతన దండకమును రచించినట్లును కల్పించుట యుక్తియుక్తము.

భాగవత శైథిల్య వృత్తాంత విషయమునను భిన్నమతములుకలవు. వారిలో తన కంకితమీయ నిరాకరించుటచే సింగభూపాలుఁడు దానిని పాతిపెట్టించుటచే భాగవత ముత్సన్న మయ్యెననుట ముఖ్యమయినది. కాని యీ గాథవలన సర్వజ్ఞ బిరుదాంకితుఁడగు సింగభూపాలునకు లోకమున నపఖ్యాతి శాశ్వతమయినది. కవి దీనినే గ్రహించినను గొంత సంస్కరించెను. ఆంధ్రభాగవత మోక్షప్రదత్వమును భంగముచేయు పంతముతో నింద్రుఁడు సింగ భూపుఁడుగా జన్మించినట్లును, భాగవతము నపహరించినది యతని దళపతియైనట్లును, ఆ విషయ మయినను గ్రంథశైథిల్యానంతరము స్వప్నమున శ్రీరాముఁడు శిక్షించి చెప్పు వఱకును సర్వజ్ఞునకు దెలియనట్లును, తెలిసినపిమ్మట నతఁడు పశ్చాత్తప్తుఁడై తదుద్ధరణకు ధన సహాయముతో దానిని బమ్మెరకు బంపించినట్లు మార్పుచేసి కవి సింగభూపాలుని శీల మును మెఱుగు పఱచెను. శ్రీరామచంద్రుని చపేటముతో సింగభూపాలుఁడైన దేవేంద్రుని పంతము సడలి 'కావ్యోపక్రమము'లో తెలుపబడిన విధమున ఆంధ్రభాషకు 'దాసోహ'మ్మని యనంతర జన్మల యందును శ్రీకృష్ణదేవరాయలుగా, రఘునాథరాయలుగా నీ భాషకు సేవ జేసినట్లును ఇందు సంకల్పింప బడినది.

చిదానందయోగి పోతనకు రామమంత్రోపదేశ మొనరించుట, మల్లన పోతన కుమారుఁ డనుటయు కల్పిత కథలని కొందఱు. కాని యీ రెంటినిగూడ కవిగారు తమ కావ్యములో గ్రహించిరి. తారక మంత్రమునే కాక శారదా మంత్రమునుగూడ నుపదేశింపజేసి పోతనకు ద్వాదశ వార్షిక బ్రహ్మచర్య నియమపాలనమునుగూడ చిదానందులచేత నాదేశింపజేసి, తద్భంగము ధారణాశక్తికి భంగము కల్గించునని దీనిని కథతో గట్టిగా ముడిపెట్టిరి. భాగవత శిథిల భాగమును పోతనయే తిరిగి స్వయముగా బూరింపకుండుటకు దీని నొక ప్రబల కారణముగా నీ కవి కల్పించెను. పితృవిరహముచే మల్లనయు దానిని బూరింప నొల్లకుండెననియు, శిష్యుల కొకప్పుడు భాగవతము రచించు భాగ్యము పట్టవచ్చుననునట్టి పోతన వాగ్బలముచే గంగ నాదులే దానిని పూరించినట్లును కవి యిందు సమర్థించుచు కథా కల్పనా చాతుర్యమును బ్రదర్శించెను.

ఇవిగాక పోతనామాత్యుని రామభక్తి మహత్వాదులకు సంబంధించిన కథలు పదివఱకు వ్యాప్తిలో గలవు. వీని నన్నింటిని కవి యీ కావ్యములో సరసముగా వర్ణించి పాఠకుల హృదయములో వెనుకటినుండియు బాదుకొనియున్న గౌరవాదరములను జెదరనీక పోషించిరి. ఈ గాథలలో పోతన హాలికజీవితమును శ్రీనాథుఁ డెత్తిపొడువగా 'బాలరసాలసాల'యను పద్యముచే పోతన (మల్లన) సమాధానము చెప్పుట, – శ్రీనాథుఁడు తన మహిమ ప్రదర్శించుటకై బోయీలు లేకయే పల్లకి నడ్లే నడిపింపజేయుట చూచి మల్లన ఎద్దులు లేకయే నాగలిచే దున్నించుట, – గజేంద్రమోక్షకథ వ్రాయునపుడు పోతన 'అలవైకుంఠ పురంబులో

నగరిలో నామూల' యను పద్యమును బ్రారంభించి యవ్వల దోచక చింతిల్లుచు వెలుపలి కేగి నప్పుడు రాముఁడేవచ్చి 'సౌధంబు దాపల...' యని పూరించి పోవుట, – భాగవతమును రచించునప్పుడు పోతన చెప్పినదెల్లను బ్రత్యక్షముగా జరుగుచుండెననుటకు నిదర్శనముగా రుక్మిణీ కళ్యాణములోని "దేవకీసుతు కోర్కి తీగలు వీడంగ"నను పద్యములో 'బాలకమరె' నని చెప్పగా పోతన కుమార్తె కుంపటిలోబడి కమరిపోయెననియు, 'పద్మనయనువలన బ్రమదంబు నిండారె' నని చెప్పగానే ఆ బిడ్డ మరల జీవించి సుఖముగా నుండెననుట, — భాగవతమును కర్ణాటనృపాలున కంకిత మిచ్చుటకు బోవుచుండగా సరస్వతీదేవి దర్శనమిచ్చి విలపించుచుండగా పోతన 'కాటుక కంటినీరు చనుకట్టుపయిం బడనేల యేడ్చెదో హాటక గర్భురాణి'యని యోదార్చి భాగవతమును నరాంకితముగా జేయనని వాగ్దానము చేయుట, — అను గాథల నీ కవి యథా తథముగా గ్రహించెను. తక్కిన రెండు మూఁడు కథలలో కొద్ది మార్పు చేయబడినది. శ్రీనాథుఁడు సపరివారముగా పోతన యింటికి వచ్చినపుడు విందు చేయుటకు దగిన భోజన పదార్థములను పోతన రూపమున విష్ణుమూర్తి వచ్చి యిచ్చిపోయె నను దానిని 'జ్యోతిపుర మహారాజ్ఞి' తెచ్చి సమర్పించినట్లు వ్రాయబడినది. ఈమెను సరస్వతీదేవికి సంకేతముగా కల్పించినట్లు జ్యోతిపురరాజ్ఞియను పేరునుబట్టి యూహింపవచ్చును. ఇట్లే భాగవతమును తన కింకితమీయ నంగీకరింపని పోతనను బాధించి కట్టితెచ్చుటకై పంపిన కర్ణాటాధీశ్వరుని భటులను విష్ణుమూర్తి శ్వేతవరాహ రూపమునవచ్చి పాఱదోలెనను కథ యొకటి కలదు. భాగవతము నపహరించి కొనిపోవుచున్న సింగభూపాలుని సేనలతో బోరాడి యొక మేటి వరాహము భాగవతమును విడిపించినట్లు పై కథను వీరు కొంత మార్చి వ్రాసిరి. ఈ సమయమున గ్రామయువకుఁ డొకడును సైనలతో బోరినట్లును వర్ణింపబడినది. మఱియు భాగవతమున కపచారము కావించిన సింగభూపాలుని భార్యకు స్వప్నమున శ్రీరామచంద్రుఁడు కనుపించి, భర్తతో జెప్పి భాగవతమును వ్యాప్తిలోనికి దెప్పింపుమని చెప్పెనను గాథను గ్రహించి, సింగభూపాలునికే స్వప్నదర్శనమిచ్చి శ్రీరాము డతని శిక్షించి యట్లు చెప్పి తిరోహితుఁడయినట్లు వీరు కొంత మార్చిరి. పై మార్పు లన్నింటికంటెను గజేంద్ర మోక్షములోని 'సిరికింజెప్పడు శంఖచక్ర యుగముం జేదోయి సంధింప'డను పద్యమును శ్రీనాథుఁ డాక్షేపింపగా, పిమ్మట నొకనాడు పోతన యతని కొడుకును దాచియుంచి వచ్చి, శ్రీనాథుఁడు భోజనముచేయు సమయమున నూతిలో నొక పెద్ద ఱాయివైచి కేకవేయగా శ్రీనాథుఁడట్లే లేచి పరుగెత్తి వచ్చెనను కథలో; శ్రీనాథుని కూతురు శారద యొకనాడు పూల మొక్కలకు బావినుండి త్వరత్వరగా నీరు తోడుచుండగా బొక్కెన బావిలో బడి నట్లు, శారద బావి సమీపమున బడినట్లును, అప్పుడు పోతన పుత్రిక లక్ష్మి 'వదినెచచ్చె'నని కేకవేయగా శ్రీనాథుఁడు తినుచున్నవాఁ డట్లే పరువెత్తి వచ్చినట్లు వీరు చేసిన కల్పన ఔచితీ శోభితము.

శ్రీ వరదాచార్యులవారు పోతన జీవితము నొక మహా ప్రబంధముగా వర్ణింపదలచిన వారగుటచే మీఁద దెలుపబడిన బూర్వగాథలతోపాటు మఱికొన్ని నూత్న కథాంశములను

సన్నివేశముల నిందు స్వబుద్ధిచేత కల్పించుకొనవలసిన వాఁడయ్యెను. ఇట్టివానిలో, ద్వితీయాశ్వాసమునందలి నిరుపేద జవరాలి మానహరణ వృత్తాంతము, పంచమాశ్వాసమునందలి పోచయ్యయను కాపు పోతనను జంపబూనిన వృత్తాంతమును, భిక్షుకునికిని లోభిసెట్టికిని సంబంధించిన కథాంశమును, సప్తమాశ్వాసములోని బమ్మెర మార్గమధ్యమున విడిసిన శ్రీనాథునిగాంచి పోతన భాగవతమును నరాంకితము చేయఁడని నిర్ధారణముచేసి చెప్పిన జంగమకన్య వృత్తాంతము మఱియు సపరివారముగా శ్రీనాథుఁడు పోతన యింటనున్న సమయమున భాగవత శ్రవణము నర్థించి పోతన గృహమున కేతెంచిన జ్యోతిపురరాజ్ఞి వృత్తాంతములు ముఖ్యములు. వీనిలో ననేకములకు బైపైదృష్టితో జూచిన నేరుగా వీనికి ప్రధాన కథతో సంబంధ మున్నట్లు వెంటనే గోచరింపదు. కాని వీనిలో నే యొక్కటియును నిష్ప్రయోజనము కాదని పరిశీలనము వలనఁ దెలియును.

తన శీలమును బలవంతముగా హరింప యత్నించు యువక భూస్వామినుండి యెట్లో తప్పించుకొని వీధినిఁబడి 'పొంగు యౌవనమును గొంగుచాటొనరించు మాత్రమ్ము ముదుపులేక శోకమెదుట దిరుగ లోలోన గుమ్రింగెడి శీలవతియగు నిరుపేద కాపు జవరాలిని గాంచి పోతన జాలినొంది మానరక్షణమునకై తనమీఁది యుత్తరీయమును దీసి యామెపై వైచి 'నీవు నా చెల్లెలివంటిదాన'వని పలికి యామె దుఃఖకారణమును విచారించును. ఆమె యా యంగవస్త్రమును గొన సందేహించుచుండ నామె భర్తవచ్చి 'అయ్య దేవునివంటివాఁడు, వస్త్రమును గైకొనుమని చెప్పగా నామె దానిని గ్రహించును, పిమ్మట నామె విషాదగాథను విని పోతన వారిని తన యింటికి దోడ్కొనిపోయి గ్రాసమిచ్చి పంపివేయును. ఈ వృత్తాంతమువలన గ్రామీణస్త్రీల సౌశీల్యమును దెలుపుటయేగాక, కథానాయకుఁడును భావి భాగవత కర్త కానున్న పోతనయొక్క శీల సంపదను, దయార్ద్ర హృదయతను దెల్లము చేసెను. తరువాత నీ యువతి కూలిపనిమాని స్వతంత్రముగా పండులను బెంచుచు జీవింప దొడగెను. పోతన భాగవతమును సింగనృపతి సైనికులు బలవంతముగా హరించిన సమయమున నీమె మందమందియే యొక మేటి వరాహము విజృంభించి వచ్చి సైనికునితో బోరాడి భాగవతమును రక్షించినట్లును కల్పించి కవి యీ వృత్తాంతమునకు ప్రధాన కథతో సంబంధము కలిగించెను. ఇంతేకాక యీ కాపుజవ్వని శీలమును హరింప యత్నించిన యువకుఁడు పోతరాజు బాల్యమిత్రుఁ డగుటచే నీ యిరువురి మిత్రుల శీల తారతమ్యమును జూపి కవి పోతనపాత్ర కుత్కర్షనాపాదించెను. మఱియు పోతన పద్యరూపమున వ్యంగ్యముగా జేసిన హితబోధవిని యతనికి వెంటనే హృదయ పరివర్తన గలిగి పశ్చాత్తప్తుఁ డయినట్లు కవి వర్ణించి పోతన కవిత్వము శక్తివంతమనియు ఆంధ్రభాగవత రచనకు సమర్థుఁడైనవాఁడనియు సూచించెను. పోతన పద్యములను విన్నపిదప "నైషధకావ్యర మాగండూషన్ మధుపాన మత్తడోలాయిత దృగ్దోషుఁడనా, నా కొక పవిత్ర్యాషా కృతియయ్యెఁ దావకోక్త కృతిరుచుల్" (ఆ. 2. 123) అన్న మిత్ర వాక్యములే యిందుకు ప్రమాణములు.

ఆ సంవత్సరము కరువు విజృంభించెను తొలకరి వానలు గురిసినను చెఱువులో నున్న చేరెడు నీరుకొఱకు బమ్మెర కాపులు జగడము లాడుకొన జొచ్చిరి. అట్టియెడ పోచయ్యయను నొక త్రాగుబోతురైతు తన పొలమునకు గ్రామకరణము పోతనయే నీరు రానిచ్చుట లేదని పగబూని యా రాత్రి యతనిని జంపదలంచెను. ఈ సంగతి నీరటి పోతన కెఱిగించి రాత్రికి పొలము పొంతకు పోవలదని వారించును. కాని మేరు నగధైర్యుఁడగు పోతన 'తమస్సు సత్వమ్మునకన్న నధిక సత్వయుతంబే ?' యని పలికి రామునిపై భార ముంచి యొంటరిగా చీకటిరాత్రి పొలముపొంత కేగెను చీకటిలో సర్పదష్టుడై పడియున్న తన్ను జంపదలంచిన పోచయ్యకు మందువేసి బ్రదికించును. తనను రక్షించినవాడు తాను ద్వేషించిన పోతనయే యని తెలిసికొని తన్ను మన్నింపుమని వేడుకొనును. ఈ వృత్తాంతము వలన కవి పోతన ధీరశాంత గుణమును నిరూపించుటేకాక తన సత్వగుణ మహిమచే తామ సులకుగూడ హృదయ పరివర్తన గలిగించు శక్తిని వ్యక్తపఱచి నాయకునకు దీప్తి నాపాదిం చెను. అనంతర కథలో నితని పుత్రుఁడే యసాహాయ వీరుఁడై సింగభూపతి సేనలతో పోరాడినట్లు కల్పించి కవి పోచయ్య వృత్తాంతమును బ్రధానకథతో ముడిపెట్టెను.

పోతన భాగవతము నరాంకితము చేయడని నిర్ధారణచేసి చెప్పిపోయిన జంగమకన్య కయే శారదాదేవి యైనట్లు తర్వాత కల్పించి శ్రీనాథుని ప్రయత్న విఫలము కాగలదను భావి కథాంశము నీ వృత్తాంతముచే ధ్వనింపజేయుట మాత్రమే కాక పోతన యుపాస్య దేవత యగు వాణి యతని నెప్పుడు నొకకంట గనిపెట్టు చుండుటను సూచించెను. మఱియు రామా ర్పితమయిన పవిత్ర భాగవతమును రాజు మెప్పునుగోరి నరాంకితము చేయింపబోవు నస త్ప్రయత్నమున శ్రీనాథునకు నిరుత్సాహము కలిగించుటకు నీ కల్పన ముద్దేశింప బడినట్లుమ గ్రహింపవచ్చును. జ్యోతిపురరాణి కల్పనమును నిట్టిదే. జ్యోతియనగా జ్ఞానజ్యోతి. అట్టి జ్ఞానపురికి రాణియనగా జ్ఞానసామ్రాజ్య పట్టమహిషియగు వాణియే. సరస్వతియే యా రూప మున నేతెంచి శ్రీనాథుని పరివారమునకు వలయు భోజ్య పదార్థముల నొసగి యాపదనుండి పోతనను గాపాడిపోయినట్లు కల్పించి యతనిపైగల సరస్వతీ కటాక్షమును మఱొకమారు కవి రుజువుచేసెను.

పోతన భాగవత సప్తాహముచేసి పిమ్మట నాంధ్రభాగవత లేఖనమున కుపక్రమింప నిశ్చయించెను. కాని సప్తాహమున కవసరమగు ధన మాతనియొద్దలేదు. ఇంట పిల్లలు పస్తుండుటచే నాటికి వలయు బియ్యమును నెటనేని తేదలంచి పోతన యూరిలోని కేగెను. ఆ సమయమున నొక బిచ్చగాడికి పిడికెడు ముష్టిపెట్ట మనసొప్పని లోభిసెట్టి వానిపై గఱ్ఱ విసరెను. అప్పుడతని గాపాడ నడ్డముబోయిన పోతనకది దాకి గాయపఱచి రక్తము స్రవింప దొడగెను. రక్తము జూడలేక భిక్షకుఁడు మూర్ఛితుఁడాయెను. తన గాయమును లెక్కసేయక పోతన భిక్షుకుని దన గృహమునకు గొనిపోయి యుపచారము చేయగా గొంత సేపున కతఁడు సేదదీరి కృతజ్ఞతా సూచకముగా తనకు దారిలో లభించినదని యొక గంటము నొసగి పిదప

సందడిలో బయటకేగి యదృశ్యుఁడయి యెంతవెదకిన నగుపించఁడు. లోభిసెట్టియు తానటుల కారణముగా పోతనను గాయపఱచినందుకు పశ్చాత్తాపమునంది పోతనయింటికేగి తన పాప పరిహారార్థము భాగవత సప్తాహమునకు వలయు ధనము నొసగుదునని వాగ్దానముచేసి క్షమాపణ మర్థించి, యట్లే యొసగును, ఈ కథాంశ కల్పనచే భాగవత సప్తాహమునకు గావలసిన ధనమును, భాగవత లేఖనమున కవసరమగు గంటమును పోతనకు అయాచిత సంపన్నమ్ములయ్యెను. భిక్షుకుఁ డదృశ్యుఁడయిన పిమ్మట నతఁడు శ్రీరామచంద్రుఁడేయయి యుండునని పోతనయు దిప్పనయు నూహింతురు కాని కవి యిట్లెచ్చటను వాచ్యము చేయలేదు. కావున శ్రీరామచంద్రుఁడే యట్లు భిక్షుక రూపమునవచ్చి భాగవత సప్తాహమునకగు వ్యయమును భరింపగల లోభిసెట్టినిజేరి తాను నిమిత్తమాత్రుఁడుగానుండి యట్లొక నాటకమాడి లోభికి హృదయ పరివర్తనము కలిగించి సప్తాహమునకువలయు ధనమును, వ్రాయుటకు గంటము నొసంగి పోయెనను రామకటాక్షగాథను కవి యిందు ధ్వనింపజేసెను మఱియు నీ వృత్తాంతము కథానాయకుని క్షమా గుణమునకును, దయార్ద్ర హృదయమునకును వన్నెపెట్టినది. ఇట్లీ కవి కల్పిత యవాంతర వృత్తాంతము లన్నియు ప్రధాన కథను రసవంతముగా విస్తృతి పఱచుచు నౌచితీ శోభితములయి కథా కల్పనమున నీ కవికిగల మెల్పును దెల్పుచున్నవి. ఇవిగాక ఈ కావ్యమునం దంతటను కవిచేసిన పెద్ద కల్పన లన్నియు, కథాకథన శిల్పమునకో, నాయకుని పాత్ర పోషణమునకో, కావ్య రసవ్యంజకత్వమునకో ఉపస్కారములుగా నున్నవి. అట్టివి క్రిందఁ బేర్కొనబడుచున్నవి. (1) తల్లిదండ్రులతో బాల్యమున పోతన పాలకుర్కి జాతరకేగుట, (2) రామ తారకముతోబాటు చిదానందయోగి పోతనకు శారదా మంత్రమునుగూడ నొసగి ద్వాదశ వర్షపర్యంత బ్రహ్మచర్య వ్రతదీక్ష నాదేశించుట, (3) శ్రీనాథునకు భార్యవియోగ కథనము, (4) తృతీయాశ్వాసమునందలి పోతన దంపతుల సమాగమమునకు సంబంధించిన సకల వృత్తాంతము; (5) తిప్పనతో లక్కమ కేసనల తీర్థయాత్రి గమనము, (6) పోతనకు పితరుల మరణకల్పనము, (7) శ్రీనాథుని కూతురు శారదకు దుస్స్వప్న కథనము వంటివి.

సాధారణ దృష్టికి నీపై సామాన్య విషయములు కథకు నవసరములుగ దోపవు. కాని కథలో చాల భాగమును కవి స్వయముగా జెప్పక పాత్రల ముఖముననే కథను నడిపింప దలచిన వాఁడగుటచే శిల్పదృష్టితో పై విషయములను కల్పించిన ట్లూహింపదగును. వీనిలో పాల్కురికి జాతరలో దల్లిదండ్రులు పోతనకు జూపించిన వినోదములు ముఖ్యములుగావు. చివరలో కేసన యచట ప్రదర్శింపబడిన వీథి భాగవతమునకు గావించిన వేదాంతవ్యాఖ్య, ప్రకృతి పురుషులకును జీవులకునుగల జననీ జనక సంబంధ వివరణము, చావుపుట్టుకల స్వరూప నిరూపణమును మఱియు కవితా స్వరూపమును. పోతన జ్ఞానవికాసనము కొఱకు జేయుట ముఖ్యము. ఈ విషయ మన్యత్ర కొంత వివరింపబడినది. ఈ యప్రధాన కథ లన్నియు ప్రధాన కథతో సమన్వయించి కావ్యమున వస్త్వైక్యము నాపాదించుచున్నవి.

చిదానందయోగి యుపదేశించిన తారకమంత్రమువలన పోతనకు మోక్షసిద్ధి సుగమ మగుననుటలో సందేహములేదు. కాని దీనివలన కవిత్వసిద్ధికూడ కలుగుననుట నియమితము కాదు. కావున మోక్షసిద్ధికి తారకమును, కవిత్వసిద్ధికి శారదమంత్రము నుపదేశించినట్లు కల్పింపబడినది. ఇక ద్వాదశవర్ష బ్రహ్మచర్య నియమ పాలనమువలన ధారణాసిద్ధియు, తద్భంగమున ధారణాశక్తి భంగమునను ఫలమునుజెప్పి, దీనిచే కవి భవిష్యత్ కథౌచితిని పోషించెను. విధిప్రేరణమున బ్రహ్మచర్యవ్రతము పండ్రెండవయేట భంగమయి పోతనకు ధారణాశక్తి భాగవత రచనకు బూర్వమే లుప్తమయ్యెను. కావుననే పోతన జీవిత కాలము ననే శైథిల్యము నందిన భాగవత భాగములను తిరిగి స్వయముగా బూరింపకుండుటకు శక్తుఁడు కాకుండెననుట కుపబలముగా కవి ఈ వ్రతనియమ భంగమును ముందుగనే కల్పించి పోతనయే భాగవతమును తిరిగి యేల పూరింప కుండెనను ప్రశ్న కెడము లేకుండ జేసెను. భాగవత రచనముకే కాని తత్పూరణకు రామాజ్ఞ లేకుండుటయు రెండవ కారణ ముగా కూడ నిట చెప్పబడుటయు సమంజసమే.

శ్రీనాథునకు భార్యావియోగము కలుగుటచేత నతఁడు తన కూతురు శారదను పోతన యింట చెల్లెలికడ నుంచవలసిన వాఁ డయ్యెను. దీనిచే నామె మల్లనభార్య కాగలదనుట సూచితము. ఇదిగాక 'సిరికింజెప్పఁ'డను పద్యమును శ్రీనాథుఁ డాక్షేపించినపుడు శారద నూతి చెంతబడినట్లు చెప్పుటకును నిది వీలొసగెను. ఆమె కిప్పటికి మల్లనతో వివాహము కాలేదు. తల్లియే యుండిన నామె యిచ్చట నుండవలసిన యగత్యములేదు.

ఇట్లే శారద దుస్స్వప్నమును గనుట నామె తండ్రికొఱకు బెంగగొనెను. శ్రీనాథుని బిలుచుకొని వచ్చుటకై యామె లేఖతో పోతన శిష్యులు రాచకొండకేగు నవసర మేర్పడెను. శ్రీనాథునకు లేఖయిచ్చి సభలోవారు భాగవతాంధ్రీకరణమునుగూర్చి తెలుపుటేకాక యందుండి కొన్ని ఘట్టములను గానముచేసి వినిపించిరి. ఆ కవిత్వమునకు మురిసిన సింగభూపతికి భాగవతము నంకితముగొను నిచ్ఛజనించెను. రాచకొండకు బుత్రికను జూడబో నువ్విళు లూరు శ్రీనాథుని వారించి రాజు పోతనను భాగవతముతో శారదతోగూడ నచ్చటికే రప్పింతు నని సేనా పరివారమును బంపెను. కాని యత్నము ఫలించలేదు. అపుడు శ్రీనాథుఁడే బమ్మెరకేగుటకు రాజాజ్ఞతోబాటు పుత్రికనుజూచు కోరికయు బలవత్తర మగుటచే నతఁడు వెంటనే బమ్మెరకు బయలుదేరెను. ఇట్లు శారద దుస్స్వప్న వృత్తాంతము కావ్యమున వింత కథను నడపించినది.

కొద్ది వ్యవధిలో పోతన తలిదండ్రుల మరణమును కవి యిందు కల్పించెను. పోతన భాగవత (శ్రీమన్నారాయణకథ) రచనా కుతూహలుఁడై గోదావరీ గంగా స్నానమునకు గ్రహణ కాలమున నేగినట్లు భాగవత పీఠికయందు పోతన తెలిపెను. కాని గ్రంథరచ నార్థము గంగా స్నానము విధిగాచేయ నక్కరలేదు. కావున తలిదండ్రుల యస్థులను

పవిత్రగంగా జలముల నిమజ్జనముచేసి శ్రాద్ధవిధి నాచరించుట కేగినట్లొక కారణాంతరమును కవి యిట కల్పించుట మిగుల విశ్వసనీయమై సమంజసముగ నున్నది.

తృతీయాశ్వాసము కేసనాదులకు తీర్థయాత్రాకల్పనమునకు ప్రయోజనము బ్రహ్మచర్య వ్రతభంగ భయమున భార్యను బరిగ్రహింపని పోతనను భార్యతోమాత్ర మింట వదలిపోవుట వారి కేకాంతవాసముతోబాటు సాన్నిహిత్యమును పెంపొందించుటయే. పోతన దుర్దైవముచే వ్రతభంగము వాటిల్లి పితరుల జతనము ఫలించినది.

ఈ తృతీయాశ్వాస ప్రారంభమునుండి పోతన తపోభంగ పర్యంత సమస్త కథాకల్పన మీ కావ్యమునందు శృంగార రసపోషకమై మకుటాయ మానముగ నున్నది. పోతన యేకాంతమున భార్యతోనేమియు బల్కకుండుట, ఆమెను స్నేహితురాం డ్రూరడించుట, పోతన సతి పొలముపొంత వానలోనాని భర్తకగుపించుటయను కొన్ని సన్నివేశముల వలన నీ ఘట్టమునకు కళా పూర్ణోదయమునందలి సుగాత్రీ శాలీనుల కథతో గొంత కల్పనా సాదృశ్యము గోచరించును. కాని సామ్య మేతావన్మాత్రమే. తక్కు విషయములు రెంటియందును బ్రత్యేకములై భిన్నమార్గముల ననుసరించినవి. భార్యావిముఖత రెండింటను సమానమే యైనను, ఇట్టి వైముఖ్యమునకు కృత్రిమాలంకారములు కళా పూర్ణోదయమునందును, బ్రహ్మచర్య వ్రతభంగ భయము పోతన చరిత్రమునందును గారణములు. ఒకనాటి వర్ష సమయమున భర్తక్షేమము నరయదలచి తోటపనులను సలుపుచున్న పతికడకు వానలో దడియుచు వేగి తన యాభరణముల దొలగించి తనతోబాటు తోటపనులకు దొరకొనిన సుగాత్రి సహజ సౌందర్యముచేత నాకృష్టుడై శాలీనుడు సతి ననుగ్రహించును. కాని తిరిగి యింట నానాభరణాలంకృతయై వచ్చిన సతికి శాలీనుడు మరల విముఖుడగును. కాని పోతనకావ్యమున నీ సన్నివేశ మన్యథా కల్పితము. పోతనచేలు పండి కోతలకు వచ్చెను. మేఘములు వర్షాగమమును సూచించుచుండెను. వర్షములు పంటలను పాడుచేయునను భయమున పోతన మరుసటి దినమే దుర్గాపూజ చేయించి పోలేరమ్మకు బోనమర్పించి చేలు కోతపట్టింప నిశ్చయించెను. వంటవారుకూడ తలిదండ్రులతో యాత్రలకేగియుంట భార్యతోగూడ పోతన పొలము చెంతకు బోవలసివచ్చెను. పోతన పొలముపని చేయించుటలో నిమగ్నుడయి యుండెను భార్య వంటకములతో పతికొఱకు నిరీక్షించు చుండెను. అప్పటికే మూడు జాములు కడచెను. వంటలు దుర్గకు స్తుతిపూర్వకముగా నివేదించి, దారిలో వానలో దడిసి పతియున్నచోటు జేరును. కాని బురదకు కాలుజారి పడిపోగా పోతన వెంటనేపోయి వానలో వచ్చినా వనుచు జాలితో లేవనెత్తును. ఇట్లు అప్రయత్నముగా వారికి మాటలు కలియును. పిమ్మట నామె తటాకమునకేగి స్నానముచేసి వస్త్రధారణము చేసికొను నప్పటి సొగసు కంటబడి యతనిని ముగ్ధుని జేయును. పిదప భార్య వడ్డింప భుజియించి యా రాత్రి కింటి కేగుదురు. ఈ పరిచయ మనురాగముగ బరిణమించి పోతన వ్రతభంగ హేతువయ్యెను—ఇట్లీ రెండు కావ్యములయందలి పై కల్పనకు సామ్యముకంటె భేదమే యెక్కువనుట నిక్కము. ఈ ఘట్టమునందు శ్రీ వరదాచార్యులు శృంగార రసమును గడు నిపుణముగ బోషించిరి.

గ్రహణస్నానమునకు గంగకేగి స్నానానంతర ధ్యానమున సాక్షాత్కరించి వ్యాస భాగవతమును దెనుఁగించి తనకు గృతి యిమ్మనిన శ్రీరామచంద్రుని యాజ్ఞను దలదాల్చి పోతన భాగవతము నాంధ్రీకరించి రామున కంకితమిచ్చెనను సామాన్య విషయమునకు పరంపరాగత గాథలను వించుక సంస్కరించి జోడించి, యందు పైనజూపిన యనేక నూత్న కల్పనల నతి సహజముగ నతుకునట్లు జేర్చి పోతన జీవితకథ నొక మహా ప్రబంధ నిర్మాణమునకు సరిపోవునట్లు కవి విస్తరించెను. వీరి యీ కథా కల్పనా శిల్ప మనల్పమనుట కల్పనగాదు.

ఈ కథ నొక ప్రబంధముగ నిబంధించుటకు ముందు ప్రథమాశ్వాసమున దీని కంతకును 'కావ్యోపక్రమ'మను పేర బూర్వరంగము నొకదాని నపూర్వముగ గల్పించిరి. ఈ విషయము ప్రథమాశ్వాసమునందు 6_77 వఱకుగల 72 పద్యములలో నుక్తమయి యున్నది. దీని సారాంశ మిట్లుండును.

నైమిశారణ్యమునందలి శౌనకాదిమునులు సూతునిగాంచి నమస్కరించి, కలికాలమున మనుజులకు నర్థకామములు రెండే పురుషార్థములుగనుండి విష్ణుభక్తి శూన్యమయి ధర్మదేవత యొంటిపాదముతో నడువలేక మూలబడు నందురు, ఆ యుగమున సకలధర్మ మూలమగు విష్ణుభక్తిని వ్యాపింపజేయు మహాత్ములు పుట్టరా ? యని జిజ్ఞాసువులయి ప్రశ్నించిరి. అపుడు సూతుఁడు భాగవతకర్తయగు నొక భాగవతోత్తమునికథ వినిపించును. మున్ను నారదుఁడు శ్రీ మహావిష్ణువును కలిప్రజలకు విష్ణువును ప్రాపించు సులభోపాయమును బోధింపుమని యడుగగా నాతఁడు నారదునకు 'కలిలో భాగవతమ్మె మోక్షప్రద సౌఖ్య ప్రాపకమంచు' దెలిపి తద్రహస్యమును బోధించి దీనిని వ్యాపింపజేయుమనెను. నారదుఁడు దానిని వ్యాసునకు బోధించి లోకమున వ్యాపింపజేయుమనెను. ఆయన భాగవతమును దేవభాషలో రచించెను. దానిని సేవించి పరీక్షితుఁడు విష్ణు పదప్రాప్తుఁ డయ్యెను. వ్యాసునకు 'వ్యాసో నారాయణో హరి'యను బిరుదు ప్రసిద్ధమయ్యెను. కలహ భోజనుఁడు నారదుఁడు దేవేంద్రున కీ విషయము దెలిపెను ఇంద్రుఁడు మత్సరించి 'హరి' యను బిరుద మింద్రోపేంద్రులకు దక్క నరులకు జెల్లదనియు, వ్యాసప్రోక్తమగుటచేతగాక నది దేవభాషయం దుంటవలన భాగవతము మోక్షప్రదమయ్యె ననియు, నితరభాషలలో వ్రాయబడియు నట్టిదగునేని తా నట్టి బాసకు మూడు జన్మలలో దాసుఁడగా నుందుననెను. నారదుఁ డింద్రుని ప్రగల్భము వ్యాసున కెఱిగించును. వ్యాసుఁడు కాశికేగి ఈశుని స్త్రీ, పురుష, చేతనములను 'త్రిలింగ' రూపునిగా స్తుతించి 'సంస్కృతమ్ముఁబోలె సారవంతమ్మగు బాస యీవె భాగవతము వెలయ' అని ప్రార్థించును. అతని త్రిలింగరూప స్తుతికి మెచ్చి ఈశ్వరుఁడు త్రిలింగ ప్రాంతమునందలి భాష తెలుంగన దనరును. అందు పోతనయను కవి భాగవతము రచించుననియు, అతఁడు వివాహితుఁడయ్యు బ్రహ్మచర్యమూని సిద్ధివడసి భాగవతమును రచించును. అట్టి తెనుగు కృతి గీర్వాణ భాగవతముతో సరిదూగునని తెలిపెను. అట్టి తెనుఁగుభాషా గంగా ప్రవాహమును సపరివారుఁడై తానే యొలికింతుననియు వ్యాసున కీశ్వరుఁడు వచించెను. ఈ సందర్భ

మున తెనుఁగులిపి పుట్టుకనుగూర్చి చేసిన కల్పన (ఆ. 1.51) చదువ దగినది. దేవతలే తెనుఁగు కవులయి పుట్టినట్లు తర్వాతి పద్యమున కవి వర్ణించెను. ఈ విషయము సమస్తము వినిన వాయుదేవుఁడు దానిని దేవేంద్రున కెఱిగించెను అది దేవభాష కవమానముగ భావించి ఇంద్రుఁడు దేవగణములతో నుపేంద్రుని దర్శించి విషయము విన్నవించి 'తల్లిబాసల తల్లి మందారవల్లి దేవవాణి, దాని కదేటి తెల్గుపోటి' యను మొఱబెట్టి యట్టి భాషా జననిని రక్షింప వేడును. అదివిని కుత్సితబుద్ధి కూడదనియు, 'శౌరి పదభక్తులాసురీ శక్తి నణఁచి విశ్వ కల్యాణమును గూర్చు విబుధు' లనియు, నట్టి విబుధులకును దనకు వేఱు లేదని తెలిపియు, నింద్రుని తృప్తి పఱచుటకు 'ఏదేని ప్రతిచర్య నాచరింపఁబూనుఁ డాత్మబుద్ధి' నని నర్మ గర్భముగా బలికి తప్పుకొనును. కాని యింద్రుని ప్రార్థనమున నిట్లుపాయమును బోధించును. కవి తపస్సమాధిజెంది భాగవతమును రచించు గావున పోతన తపస్సును 'ధన దార సుత' రూపములగు ఈషణత్రయములచేత భంగము చేయవలెననియు,

'స్వర్గాధిపత్య భాస్వద్భవ్యశక్రాంశ మవని సింగనృపాలుఁడై జనించు
భావజాత మనోజ్ఞ లావణ్యరూప రత్యంశమ్ము సుకవిభార్య న్వసించు
వేదశాస్త్ర పురాణ విజ్ఞానదీప్త విఘ్నేశ్వరాంశ సుతాత్మ నెసఁగుచుండు
ఇందిరా హృదయాబ్జ మందిరమ్మగు మామకాంశమ్ము శ్రీనాథునందు నుండు
నాగభూషణాంశము చిదానందుఁడగును, రంభ భోగినిగా భువి న్సంభవించు
దాశరథినయి నేనును దత్కవీంద్రుగాంచి యాచింతు నాంధ్ర భాగవతకృతిని.
(ఆ 1-69)

'సురపతి తద్భాగవతము, నరాంకిత మొసంగు నటు లొనర్పగవలె, నీ
పరివారముఁగొని, యపుడది ధరమోక్ష ప్రదముగాక తనుతను బొందున్'. (ఆ 1-70)

అని యొక కార్యక్రమము నేర్పఱచెను. ఆ సమయమునకే నారదుఁడువచ్చి హరిని గాంచి 'నీ లీలలు వాఙ్మనములకు నతీత'మని నమస్కరించును. హరి నారదుని గని నవ్వును, నారదుఁడు హరి మొగము చూచి హసించును. వీరి హాసములోని రహస్యమును దెలియలేక ఇంద్రాదు లొకరి మొగ మొక్కరు ప్రశ్నార్థముగ గనుగొందురు. విష్ణువు దేవేంద్రున కొక కార్యక్రమము నెఱిగించెనే కాని దానిని మనస్ఫూర్తిగా జెప్పలేదు. ఈ విషయమునే 'స్వభక్తతతినేచు క్రమమ్ములె సానరాళ్ళుగా నరసి, సురాళిగాంచి యిటులాడెను శ్రీహరి బాహిరంబుగన్' (ఆ 1-66) అని కవి తెలిపెను. ఈ సంగతిని సురలు గ్రహింప నేర కుండిరి. ఇదియే నారద నలినాక్షుల నవ్వుల నర్మభాషణలు. కావుననే ఇంద్రుఁడైన సింగ భూపతి (విష్ణు సంకల్పమునకు విరుద్ధముగా నుండుటచే) పోతన భాగవతమును నరాంకితము కావించు విషయమున ప్రబల ప్రయత్నుఁడు కాజాలకుండెను. ఇంద్రున కోటమియు విష్ణు భక్తుఁడగు పోతనకు విజయము తప్పదయ్యెను. ఈ ఫలితాంశమునుగూడ కవి యిచటనే క్రింది పద్యమున ధ్వనింపఁ జేసెను.

"స్వీయ గౌరవమ్ము చెన్నారుటకుఁగాను, ప్రక్కవారిఁ గింజపఱుప జకుఁడు
ఒరుల దీపమార్చి యొప్పారఁ గలనను, శలభరాజు కెవటి జయ, మటంచు."
(ఆ 1_73)

ఇచట (ల, ర)ల కభేద మార్గమున శలభరాజనగా శరభ రాజనియు, శరభ శబ్దము చేత సింహశబ్ద స్ఫురణమువలని సింగరాజనగా సింగభూపతి జయము పొందఁడని శబ్దము వలనను దెలియవచ్చును. కావ్యాంతమున పశ్చాత్తప్తుఁడగు సింగభూపతి "జ్యోతినిగాంచి మ్రింగఁజనుచో శలభమ్ము ఫలమ్ము నొందునే?" (ఆ. 9_317) యనుట పై యూహ కాధారము.

ఈ పూర్వకథా కల్పనము ననుసరించియే కావ్యకథ యంతయు నడచినది. ఈ కల్పన మునకు సంస్కృత భాగవతమువలెనే యాంధ్రభాగవతమును భక్తిజ్ఞాన వైరాగ్య మోక్షప్రద మనియు, సంస్కృతమువలెనే ఈశ్వర నిర్మితమైన తెలుఁగుభాష తత్తుల్య మనియు, ఇంద్రుఁడేయైన సింగభూపతి యపకీర్తి భాజనుఁడు కాడనియు, రంభయై భోగినిపై దండక రచనముచేయుట పోతనకు దోషావహము కాదను మొదలగునవి ప్రయోజనములు. కావ్యము నందలి ప్రధాన పాత్రలయందు దైవాంశ మారోపితమగుట కావ్యవస్తుగౌరవమున కాధి క్యము కలుగును. ఇంతేకాక దీనికి మఱియొక ప్రయోజనము గలదు. ఆంధ్ర భాగవత రచ నము నైమిశారణ్యమునందలి శౌనకాది ఋషులు సూతునిగాంచి ఈ కలికాలమున పురుషులు సుకర్మలు చేయజాలరు. కావున అట్టివారి కెయ్యది సర్వసౌఖ్యమై యలవడు? ఏమిట ఆత్మ శాంతి బొడము? నని ప్రశ్నించి, వసుదేవ దేవకుల కుదయించిన కృష్ణు కథలు వినిపింపు మని కోరుదురు. ఈ విధముననే 'కావ్యోపక్రమ' ప్రారంభమున శ్రీ వరదాచార్యులును 'మును నైమిశవని సూతునిఁగని శౌనకముని వరాది గణముత్కంఠన్' (ఆ. 1_5) అని యుపక్రమించి కలియుగజనుల దుస్థితిని వివరించి 'శ్రీ దనుజహరు భక్తి వ్యాప్తిం బొనరించు మహాత్ము లెందుఁ బుట్టరో కలిలో?' నని ప్రశ్నింపగా నత్తరి పరాశర సూనసమాను లిద్ద వింతురను సూతునిమాట లాలించి 'కలిజనముల సద్గుణ వర్తనులు బుట్టుదురు ధరనన్నన్' మా మనములు విన గుతూహల పడునందురు. వారికి సూతుఁడు భాగవత కర్తయగు నొక భాగవతోత్తముని చరిత్ర బ్రవచింతు'నని పోతన చరితము నెఱిఁగించినట్లు కవి కల్పించి, భాగవత కర్తయగు 'పోతన చరిత్ర' మను మహాకావ్యమునందు భాగవత వాతావరణమును పౌరాణిక గౌరమును పావిత్ర్యమును సృష్టించిన వాఁడయ్యెను కావ్యోపక్రమమువలెనే గ్రంథాంతమున కావ్యోప సంహారమునుకూడ వ్రాయబడినది. కావ్యోప సంహార రచనా సంప్రదాయము శృంగార నైషధాదులందు గలదుగాని కావ్యోపక్రమ రచనము ప్రాచీనాంధ్ర కావ్యములందైన నున్నట్లు స్ఫురింపదు.

ఈ పోతన చరితను ఆచార్యులవారు భాగవత తుల్యమగు నొక 'దివ్య ప్రబంధము'గా నిర్మింప దలపెట్టినట్లు దీని నాద్యంతము బఠించిన వారికి వెంటనే స్ఫురింపకపోదు. రామభక్తా

గ్రేసరుఁడగు పోతనయందు బరాశరాంశను, దక్కిన పాత్రలగు సింగభూపాలాదులందు ఇంద్రాది దేవతాంశలను ఈ కవి నిరూపించుట వెనుక గమనించితిమి. వీరితోపాటు శ్రీరామ శారదలను స్వప్నధ్యానాదులందుఁ బరోక్షముగను, బ్రాహ్మణ, శూద్రభిక్షుక, జంగమకన్యక జ్యోతిపుర రాజ్ఞీ రూపముల బ్రత్యక్షముగను నీ కావ్యపాత్రలుగా వ్యవహరింతురు. 'పోతన చరిత్ర' కావ్యము దశమాశ్వాసముతో సమాప్తియగుచున్నను కవి మఱి రెండాశ్వాసములను అనుబంధముగా రచించి వానియందు శ్రీరామ, మోహినీ, వరాహ, నరసింహ, శ్రీకృష్ణావతారములను మఱియు గజేంద్రమోక్షణ, రుక్మిణీ కల్యాణములను నేడు భాగవత ప్రసిద్ధ గాథలను గొంచె మెచ్చుతచ్చుగా నేడు వందల పద్యగద్యములలో పోతన శైలిని రచించి యిందుఁ జేర్చిరి. ఈ యనుబంధ భాగములే విస్తృతియందు మను వసు చరిత్రాదులకంటె పెద్దవి కావున నివి యత్రవానములను కొన వీలులేదు. ఈ భాగములందలి పై గాథలలోనే శ్రీరామ జననాది పట్టాభిషేక పర్యంత కథను వంద పద్యము (ఆ. 11; 6–109) లలో సంగ్రహ రామాయణమునుగాఁ జేర్చిరి. ఈ కావ్యమునందలి దశమాశ్వాసమునందలి ఫలశ్రుతిలోని 60 పద్యములలో పరీక్షిత్తు భాగవత శ్రవణమున ముక్తినందిన వృత్తాంతము మొదట పాండవుల చరిత్ర కొంత తెలుపబడినది. దీనిని భారతసంగ్రహమన వీలులేకున్నను భారత వాతావరణముకూడ ఈ కావ్యమున గల్పింపఁబడె ననవచ్చును. కవి యిట్లీ కావ్యమును రామాయణ, భారత, భాగవత పుణ్యకథలకును నాలవాల మొనరించెను. ఇంతమాత్రమేకాదు. ఈ కావ్యమునందలి ప్రధాన కథా కార్య క్షేత్రములు బమ్మెర, రాచకొండ, ఒంటిమిట్ట మున్నగు ఆంధ్ర తెలంగాణ ప్రాంత ప్రదేశములేయైనను, సమస్త భారతదేశ పుణ్య క్షేత్రముల నిందలి పాత్రలకు విహార రంగముగా జేయ నెంచికాబోలు ! కవి యిందలి పాత్రలో ముఖ్యులగు పోతనకు, నతని జననీజనక సోదరులకును మఱియు శ్రీనాథునకును గథలో వతుకు వటులు తీర్థయాత్రాగమనమును గల్పించి, యా యవకాశమును బురస్కరించుకొని క్రమముగా నవమ, తృతీయ ద్వితీయాశ్వాసములందు ఉత్తర దక్షిణ భారతమునందలి ప్రసిద్ధ పుణ్యక్షేత్రములను నచ్చటి తీర్థదైవతములను హృద్యముగ వర్ణించెను. ఇట్టివానిలోఁ దెలంగాణమునందలి పాల్కురికి, మంథెనలును, ఆంధ్ర ప్రాంతమునందలి శ్రీశైలము, తిరుపతి, ఒంటిమిట్టలును మరియు దక్షిణదేశమునందలి కంచి, శ్రీరంగము, పెరుంబుదూరు, విల్లిబుత్తూరులను; ఉత్తరదేశ స్థలములైన కాశి, గయ, ప్రయాగాది పుణ్యక్షేత్రములు. ప్రాచీన మహాప్రబంధముల యందొక్క కళాపూర్ణోదయమునందు మాత్రము మణికంధరుని తీర్థయాత్రా సందర్భమున నిట్టి పుణ్యతీర్థ వర్ణనము కలదు. కాశీఖండ, పాండురంగ మాహాత్మ్యములవంటి క్షేత్ర మాహాత్మ్యకావ్యముల నిట్టివుండుట సహజమే. ఈ సందర్భమున నీ కవి రచించిన దేవతా స్తోత్రములు భక్తి భావపూరితములై ప్రతివార పఠన యోగ్యములు. ఈ పయి ప్రమాణములవలన పోతనకావ్య మొక దివ్యప్రబంధమనుట స్పష్టము. ఆచార్యులవారు దీనికి 'పోతన భాగవత'మని పేరిడినను దగియుండెడిదేమో ! కాని దానిచే పోతన వ్రాసిన భాగవతమను అర్థమే ముఖ్యముగా స్ఫురించు నవకాశముండుట చేత దీనికి వారు పోతనచరితమని పేరిడియుండుట సమంజసమే.

ఈ కావ్య గౌరవము హెచ్చించుట కీకవి మఱియొక నూత్నపద్ధతినిగూడ నవలంబించెను. ఇందలి ప్రతి యాశ్వాసము మొదట నా యాశ్వాసమునందలి ప్రధాన కథాంశమును పోతన జననము – బాల్యము అను విధమున. ఈ గ్రంథము పెద్దదగుటచేతఁ గాబోలు తాము చదువబోవు విషయమును పాఠకులకు ముందే సులభముగా గ్రహించుట కిట్లు చేసియుందురు. ఇందు విశేషములేదు కాని యీ తెలుఁగు శీర్షికలతోఁబాటు ఒక్క చతుర్థాశ్వాసాదిలో దక్క తక్కిన తొమ్మిది యాశ్వాసముల మొదట తెలుఁగు శీర్షికలక్రింద వీరు శ్రీమద్భగవద్గీత నుండికూడ నా యా కథాంశములను సూచించు శ్లోకభాగములను నెత్తివ్రాయుట చూడనగును. వారుద్ధరించిన యీ గీతావాక్యములు తెలుఁగు సూచనలకన్న నర్థవత్తరములయి పోతన జీవితమునే వివరింపజాలి యుండుట విశేషము. ప్రథమాశ్వాసాదినిగల 'పోతన జననము – బాల్యము' అను వానివలనఁ దెలియరాని యర్థవిశేషము "శుచీనాం శ్రీమతాంగేహే యోగభ్రష్టోఽభి జాయతే." యను వాక్యమువలన పోతన తలిదండ్రులు పరిశుద్ధాత్ములనియు భగవద్భక్త్యైశ్వర సంపన్నులనియు, ఇట్టి పవిత్ర దంపతుల కుదయింపనున్న శిశువు (పోతన) సామాన్య మానవుఁడు కాఁడనియు, నతఁడు యోగభ్రష్టుఁడయిన జ్ఞానియనియు భాగవతాంధ్రీకరణార్థ మీ లోకమున జనింపనున్న 'కారణజన్ముఁడనియు వెంటనే స్ఫురింపక మానదు ఇట్లే తక్కినవి యూహింపనగు. కాని నాల్గవ యాశ్వాసము మొదట 'రాజ సందర్శనము – భోగినీ దండక రచనము' అని తెలుఁగున మాత్రము సూచించి మిన్నకుండిరి దీనివలన నీ విషయమునదప్ప తక్కిన పోతన జీవితమంతయు గీతయందు ప్రవచింపబడిన కర్మ, భక్తి, జ్ఞాన, వైరాగ్యముల నడచినదను పరమార్థమును సూచించుట కవి యభిప్రాయము. ఆంధ్ర కావ్యములలో నీ పద్ధతి నవ్యము. ఈ గీతా వాక్యములును దీని దివ్య ప్రబంధ గుణమునకే పోషకములు.

ఇదియొక దివ్య ప్రబంధమని చెప్పుటవలన వృద్ధులకు, భక్తులకు ముముక్షువులకు మాత్రమే పఠన యోగ్యమని భావింపగాదు. రుచిభేదము, దృష్టిభేదము, వయో భేదమును గల పాఠక సహృదయులకు హృదయ తర్పణము చేయువిధమున నీ కథను మలచుకొని, యిందు సందర్భానుసారముగను సరసముగను వాస్తవిక ప్రపంచమునందలి వైవిధ్యము వ్యక్తమగు భంగిని వివిధ విషయ వర్ణనలతో కావ్యవస్తువును కవి విస్తరించెను. ఈ కావ్యమును జదువుకొలదిని, బ్రాహ్మణులు, వైశ్యులు, శూద్రులు. రాజులు పేదలు, కాపులు కరణములు, ధనికులు భిక్షుకులు, వివాహితులు అవివాహితులు, త్యాగులు లుబ్ధులు. యోగులు భోగులు, బాలురు వృద్ధులు; కవులు గాయకులు, నట్టువలు జెట్టులును, ఆటలు పాటలు, సభలు సత్కారములు, సప్తాహములు సంతర్పణములు, పస్తులు పండుగలు, సుఖములు దుఃఖములు, పెండ్లిండ్లు పేరంటములు, విందులు వియ్యములు, కఱవులు కాటకములు, నెయ్యములు కయ్యములు, శోభనములు సుతోదయములు మఱియు పల్లెలు పట్టణములు, పూరిండ్లు పెంకుటిండ్లు, మిద్దెలు మేడలు, పేటలు కోటలు, తోటలు మోటలు, మడులు మాన్యములు, పొలములు హలములు, ఎడ్లు బండ్లు, బోయీలు పల్లకీలు, వారువములు వరా

హములు, పోతులు కోతులు, కాలువలు కాసారములు, వాగులు వంతలు, దొరువులు చెఱువులు, కూపారములు అకూపారములు, అటవులు ఆఖేటములు, చెట్లు చేమలు, తీవలు తీవబోదెలు, గిరులు ఝరులు మున్నగు వివిధవ్యక్తులు, ప్రాణులు, విషయములు ప్రకృతి దృశ్యములును వాని వర్ణనములును పఠితల నడుగడుగున కాకర్షించి పంచేంద్రియ పరితోషణము నాపాదించును. పోతన చరిత్రమును జదువుచున్నంతకాలము మనము కావ్య ప్రపంచమున గాక వాస్తవిక ప్రపంచమున సజీవ వ్యక్తులమధ్య సంచరించుచుండునట్లే కావ్యవస్తువు కల్పింపబడి ప్రపంచింపబడె ననుటకంటె నీ కవివరుని కథా కథన శిల్పచాతురి యిట్టిదని వేఱుగా జెప్పనేల? ఇంతటి వస్తు వైవిధ్య వైపుల్యమును గలిగి వస్త్వైక్య శోభితములయిన కావ్యములు తెలుఁగున నెన్నియో లేవు.

ఈ పెద్ద కథను శ్రీ వరదాచార్యులు ప్రాచీన మార్గము ననుసరించి యొక మహా ప్రబంధముగా వ్రాయదలచిరి. ఈ విషయమును వారు '...శ్రీ బమ్మెర పోతరాజతని భవ్య చరిత్రమునే మహా ప్రబంధమ్ము నొనర్చి నిన్ను కృతినాథునిగా నొనరించి చెప్పెదన్.' అని శ్రీరామచంద్రుని సంబోధించి ప్రతినచేసిరి. (ఆ. 1 ప. 2) కావ్యపీఠిక యందలి 'ప్రబంధ స్తుతి' యను శీర్షిక క్రింద

"వర్ణనాదులం గృతికెంతొ వన్నెగూర్పఁ
గల్గునవి ప్రబంధాఖ్య సత్కావ్యభేద
గతిని దీర్చిరి నిజకళా ప్రతిభ మెఱయ
మను, వసుచరిత్రముల్ వ్రాసి మను సుకవులు." (పీఠిక. 51)

పెద్దనాదులు వర్ణనా ప్రధానములుగా వ్రాసిన కావ్యములే ప్రబంధములని తెలుపుచు, దామును 'అవ్విధి సత్ప్రబంధ రచనాశయ మొప్పఁ గృతిన్ రచింతు' ననిరి. మఱియు

ప్రాకృతి కాంతరంగ బహిరంగ ప్రవృత్తుల వాస్తవ స్థితిన్
లోకము ముందు దర్పణములోవలెఁ జూపుటలే కవిత్వ, మా
ప్రాకృతి కాంతరంగ పరివర్తనమే రసరూప మొందు, బా
హ్యాకృతిలోని మార్పులె రసాంగ ప్రకాశక వర్ణనాదులౌ.' (ఆ. 2-125)

అని కావ్య, రస, వర్ణనల పరస్పర సంబంధమును వాని స్వరూపమును చతురముగ నిర్వచించి, తర్వాతి పద్యములలో నట్టి కవిత (కావ్యము) సత్యమయి, సుందరమై శివంబునై నపుడే యది 'కావ్యకళా విలాసోన్నతివెల్గి బ్రహ్మసుఖ సోదరమై తిరమై రహించు' ననియు, 'ధ్వన్యంతర్గర్భిత భావపూర్ణ రమణీయార్థ ప్రపంచమై, విశ్వ శ్రేయమునై యుండవలెన'నిరి. మఱియు 'అకలంకంబయి, యత్యుదాత్తమయి, లోకాదర్శ విజ్ఞాన దాయకమై, దివ్యకథా ప్రపూతమయి, పాత్రౌచిత్య సల్లాపదీపకమై, ప్రాజ్ఞమనోను రంజక రసప్రస్ఫో

టహో కావ్యమున్ సుకవీంద్రుండు రచించు'ననుట వీరి యభిప్రాయము. కవి, కవిత్వము, కావ్యమునుగూర్చిన తమ యభిప్రాయముల నీ కవి తమ కావ్యమం దెడనెడ కథలో హృద్యముగ బ్రకటించియున్నారు. వీనివలన శ్రీ వరదాచార్యులు 'పోతన చరిత్ర'ము నుపర్యుక్త లక్షణ లక్షితముగా రచింపబూనిరనుట స్పష్టము. వీరు తమ ప్రయత్నమునందు గృతకృత్యులయిరనుటకు సహృదయ పాఠక మహాశయులే ప్రమాణము.

ప్రబంధమని వ్యవహరింపబడుచున్న కావ్యభేదమునుగూర్చి ఆంధ్ర విమర్శకుల యభిప్రాయము లొక్కవిధముగా లేవు. ఆంధ్ర సాహిత్యమునఁ 'బ్రబంధము' మౌళిక రచనమని విశ్వసించువారును తద్వ్యతి రేకాభిప్రాయులును గలరు. ఐనను అష్టదిగ్గజములను ఖ్యాతిగన్న పెద్దనాదుల ప్రబంధము లుత్తమోత్తములను విషయమున మాత్రము రెండభిప్రాయములు లేవు. నాయకరాజుల కాలపు బ్రబంధములలో చేమకూర వేంకట కవివంటి కొందఱ కృతులను దక్క, తక్కిన వానిలో శృంగార మతివేలమనియు, బ్రాచీనుల యను కరణము లధికమనియు గొందఱు వారిని మెచ్చరు. వీనియందలి శైలీ రామణీయకతను భాషా మార్దవమును బ్రశంసించుచు నైతిక దృష్టితో మాత్రము వీనిని నిరసించు వారును గలరు. ఇట్టివి పోషకులగు ప్రభువుల ప్రీత్యర్థము వారి భోగలాలసత్వమున కనుగుణముగా నాటి కవులు రచించి రందురు. ఇట్టివానిని శ్రీ వరదాచార్యులును 'ధరణీపాలుర రాజ్య వైభవముల్ దత్ప్రేయసీ నాయికా విరహోన్మాదకృతు'లని యొకచో పేర్కొనిరి. కావ్యము విజ్ఞానదాయకమై యుదాత్తమయి దివ్యకథా ప్రపూతమయి యుండవలెనను వీరి మతము వెనుక దెలుపబడెను.

మన ప్రాచీన సాహిత్య విమర్శకులును చరిత్రకారులును మను చరిత్రాదులకే ప్రబంధములని నామకరణము చేసిరి. శ్రీనాథయుగ కావ్యము లనేకములును, శ్రీనాథుని శృంగార నైషధాదులును వస్తునాయక రస రచనాదుల ననుసరించి ప్రబంధము లనదగియున్నను అవి యాంధ్రకవుల స్వతంత్ర కావ్యములుకాక చాలవఱకు ననువాదములగుటయే వాని బహిష్కరణములకు బ్రధాన హేతువన నొప్పును. ఇవి కావ్యములనియే వ్యవహరింపబడుచున్నవి. వీనిని 'అనువాద ప్రబంధము' లనినచో నుదారహృదయులకు నెట్టి యాక్షేపణము నుండదు. దీనినిబట్టి ఇతిహాస పురాణాదులనుండి గ్రహింపబడిన కథావస్తువును స్వకపోల కల్పిత వర్ణనాదులచే నలంకరించుచు రసవంతముగా రచించిన అనువాదముకాని స్వతంత్ర కావ్యమే ప్రబంధమనుట స్పష్టము. అనగా వాల్మీకివ్యాసుల రామాయణ భాగవతాదులయందలి కథలతో కాళిదాసాది మహాకవులు సంస్కృత భాషలో రచించిన పంచకావ్యముల బోలినవే మార్కండేయ పురాణాదులలోని కథలతో నాంధ్రమున స్వతంత్రముగా వెలసిన పెద్దనాదుల ప్రబంధములన జెల్లును కాని యివి సంస్కృత కుమార సంభవాదులవలె కేవల పద్యకావ్య ఫక్కిని గాక చంపూపద్ధతిని నడచినవి. ఆంధ్ర ప్రబంధములను వస్తువునుబట్టి ప్రసిద్ధములనియు, కల్పితములనియు, మిశ్రములనియు బ్రాచీనులు మూడుతెఱఁగుల వచించిరి. రసదృష్టితో నివి శృంగార ప్రబంధములనియు భక్తి ప్రబంధములనియు నిరుతెఱఁగులు. వీర రసకావ్యము

లొక కొన్ని కలవేమో ! ధీరలలిత ధీరశాంతు లిద్దఱే ప్రబంధముల గనవచ్చు ప్రధాన నాయకులు. రచనా విషయమున నాంధ్ర ప్రబంధములు ప్రాయికముగా ప్రౌఢములు. భక్తి ప్రబంధములకే పుణ్యప్రబంధములనియు దివ్యప్రబంధములనియు దెలుఁగున నామాంతరము. ప్రస్తుత పోతనకావ్య మీ కోవకు జెందినదే. ఇందలి సమస్త కథయును కవి కల్పితము కాకుండుట విది కేవల కల్పిత ప్రబంధముకాదు. ఇందలి కథ పురాణేతి హాసాంతర్గతము కాకుంటచే దీనివి ప్రసిద్ధ మనవచ్చునేమో చింత్యము. పోతన జీవితగాధ లోకమున మిగుల బ్రసిద్ధము కావునను, కొంతకథ కవికల్పితము కావునను దీనిని మిశ్ర ప్రబంధమనుటయే సమంజసము. ఇఁక యిందలి రచన ప్రౌఢమని ప్రత్యేకముగా జెప్పనవసరములేదు

పోతన సామాన్యకవిగా గాక వ్యాసభాగవతము నాంధ్రభాషలో వెలయించి సంసార బద్ధుల బుద్ధుల భక్తిభావమును బాదుకొల్పి యుద్ధరింపవచ్చిన కారణజన్మునిగా నీ కవి యిందు చిత్రించెను. 'తెన్గు భాగవతకన్య నొసంగు మటంచు వేడె తానెవనినిగాంచి శ్రీరమణుఁ, డిట్టిఁడు మానవమాత్రుఁడౌ నొకో !' (పీఠిక. 59), 'ఉదయించె నాంధ్ర శారద యదృష్టమున నొక్క పావఁడల వ్యాసాంశన్' (ఆ. 1-112), 'ఈతఁడే పరమోత్కృష్ట మహాపురాణకృతి విర్మాణార్థమై పుట్టెనో ! (ఆ. 2-170) 'యివ్వటుని జన్మము కారణ గర్భితంబిలన్ (ఆ. 2-27)

"సూత శుకులను గరఁగి యచ్చునను బోయు పోఁతనా వెలుగొందె నీ పోతనకవి
భయద భవవార్ధి తార ణోపాయమైన పోతరూపమై పోతన పుట్టె ననిరి"

(ఆ. 9-67)

'పోతనార్యుఁ డొక కారణ జన్ముఁడు పూజ్యుఁడు...' (ఆ. 9-317), అను మొదలగు వాక్యముల వలన నీ కవి గ్రంథాదినుండియు నంతము వఱకును బోతనను కారణ జన్మునిగా జిత్రించెననుట స్పష్టము. పోతనను గూర్చి చేసిన యితర వర్ణనలు కవి పై భాగమున కనుగుణముగనే చేయుచు వచ్చెను. పోతన బాల్యమునుండియే శ్రీరామ భక్తుఁడయి 'రామతత్వ సంశోధియై వ్రాయుముందు భాగవతమున శ్రీరామభజన సేయు'నఁట ! (ఆ 1-121). ఇతఁడు కుశాగ్రబుద్ధియై 'తిప్పన జదివెడు పద్యముఁ జప్పున నొకసారి వినినసరి' పోతన యద్దాని నొప్పం జెప్పునట ! ఇట్లు పోతన చిన్నతనమునుండియు సాధు సజ్జన దర్శనోత్సాహమతితో, హరికథా పురాణ శ్రవణాభిరతితో మఱియు శంభు పదసరోజార్చ నాసక్తమతితో బెరుగసాగెను. ఇంతలో నీ బాలుని దలిదండ్రులతో సమీపమునను్న పాల్కురికి జాతరకు బంపును. పాల్కురికి సోమనాథకవి జన్మక్షేత్రమనుట, సువిదితము. సోమేశ్వరస్వామి యాలయము నిట నుండుటచే నిది నాడు ప్రసిద్ధ యాత్రాస్థలముగ నుండెను. పై రెండు కారణములచేత కవి యీ కావ్యమున పాల్కురికికి గొంత ప్రాధాన్యము నొసంగెను. చిదానంద యోగి యీ పాల్కురికి కేగు సమయముననే పొలముకడనున్న పోతనకు దర్శనమొసగి తారకమంత్ర శారదామంత్రముల నుపదేశించెను. శ్రీనాథ మహాకవియు నుత్తరదేశయాత్ర

లొనరించి దక్షిణమున శ్రీశైలాదుల దర్శించి పాల్కురికి ప్రయాణ సందర్భముననే పొలముపొంతనున్న పోతనను గలసికొని యతని యింటికేగి బాంధవ్యము నందుట తటస్థ పడెను. జ్యోతిపుర రాజ్ఞియు నిట్లే పాల్కురికిలో పోతన భాగవత ప్రశంసవిని తదాకర్ణ నాసక్తయై బమ్మెరకువచ్చి పోతన పరువు ప్రతిష్ఠలను భద్రమొనరించినట్లు కవి కల్పించెను. ఈ కల్పనలు మిగుల సమంజసములు. లేనిచో బైవారెల్లరును పోతనను గలసిరని చెప్పుట సహేతుకముగా దోపదు. కాదంబరియం దచ్ఛోద సరోవరమునకును కళాపూర్ణోదయమున మృగేంద్ర వాహనాలయమునకుగల ప్రాధాన్యము నిందు కొంతవరకు పాల్కురికి కాపాదింప బడినట్లు తోచును. అట్టి పాల్కురికి జాతరకు బోయిన పోతన బాలుఁడగుట తండ్రి కొని పెట్టిన చిఱుదిండ్లు నములుచు నచటి వినోదములు జూచుచుండెను. అంతలో మృదంగతాళ ములతోడి 'వీధి భాగవత' ప్రదర్శన మతని కంటబడెను. జిజ్ఞాసువై భాగవత నాటకమును గూర్చిన బాలపోతన ప్రశ్నలకు లక్కమాంబా కేసనలు జగన్నాటకముతో సామ్యకల్పనముచేసి వేదాంత పరముగా సమాధానము లొసగుదురు. ఆ ప్రదర్శనమునకు భాగవతమనునామ మేల కలిగెనను బాలునకా కథలు భాగవతమను సంస్కృత గ్రంథములోని వగుటచేతనని తల్లి తెలుపును. తనకా గ్రంధమిమ్మని బాలుఁ డడుగగా నది సంస్కృతభాష నుండుటచేత తెలియ దనియు, దెలుఁగు పలుకుల వెలసిన దెలియుననఁగా తెలుఁగున వ్రాసియిమ్మనును. తల్లి వ్రాయరాదనును. భాగవతమును నేను దెలుఁగున వ్రాతునని పోతన పలికెను! తల్లి యా మాట కేసన కెఱిగించెను. 'వీని జూచి నే డుదయమె యోగియొక్కఁ డితడుర్వి మహాకవి సార్వభౌముఁ' డౌనని తెలిపెనని కేసన చెప్పి యానందించెను. పోతన యిట్లు తాను భాగ వతము తెలుఁగున వ్రాతుననుటకు దగు హంగుల నీ కవి పోతన జననమునకు కొంతముందే సిద్ధము చేసియుండెను. పోతన లక్కమాంబ గర్భమున నుండగా పొద్దుల సమయమునకు బమ్మెరకొక పౌరాణికుఁడువచ్చి భాగవత పురాణము చెప్పుచుండెను. (వర్ణనమునుబట్టి చూడ నీయన శ్రీరాముడేయనితోచును. పూర్ణగర్భవతి లక్కమ సప్తాహములు భక్తితో బురాణశ్రవణ మొన రించి; భాగవతమును నెవరు రచించిరని ప్రశ్నింపగా నా పౌరాణికుఁడు నీ పొట్టనే యట్టివాఁడు నేఁడోరేపో యుదయించునని పలికి 'సుతనయావాప్తిర' స్తని పోయిన మూఁడవనాఁడే పోతన పుట్టెనఁట। కావుననే యిట పోతన భాగవతము దెలుఁగున వ్రాతునని పలుక గలిగెనని యూహింపదగును. అతఁడు మహాకవి యగునను యోగి వాక్కులను బురస్కరించుకొని యతనిలోని కవితాత్మ నుద్బోధింపదలచి కేసన దారిలో మామిడితోటను మనోహరముగా బాలునకు వర్ణించి చూపును. పోతనయు కవులుచేయు వర్ణన విధానమును గ్రహించి తాను నొక పద్దెమును నుడివి మామిడిపండును చూచి వృక్ష సమీపమున కురుగగా 'శుకుఁ డొసంగు భాగవత ఫల రసాయనం బోయన' శుకము రాల్చగా నది బాలుని పదములందు బడెనట. (ఆ. 1-177). భవిష్యద్భాగవత రచనము నిట కవి వ్యంగ్యముగా సూచించెను. అనంతరము కేసన సుతునకు 'ప్రకృతి మన కెల్లరకు మాత, పరమ పురుషుఁడగు మహేశ్వరుఁడే పిత యనుచుఁ దెలియుమని' ప్రకృతి పురుషులకును జీవులకును గల సంబంధ బాంధవ్యమును బోధించి, 'భూతగణ వృత్తమొక కమ్మ బొమ్మలాట, ధరఁ జావు పుట్టకల్ దాఁగురింత'

(ఆ. 1-186) యని చెప్పి మానవ జీవితమునకును బొమ్మలాటకును, దాగురింత లాటకును జావుపుట్టుకలకును గల సామ్యమును పలుతెఱగుల వివరించి తెలిపెను. ఇట్లు కవి కల్పించిన ఈ పాలకుర్కి యాత్రవలన పోతనకు తండ్రి బోధలచే వేదాంత విషయ విజ్ఞానమును కవిత్వ స్వరూప జ్ఞానమును కొంత సమకూడి యది భావిభాగవత రచనకు దోహదకారి యయ్యెననవొప్పు. పోతన పాత్ర నిట్లీ కవి బాల్యమునుండియే కడు జాగ్రత్తతో దిద్ది తీర్చుచు వచ్చెను.

పోతన పరమ భాగవతోత్తముఁడగు ధీరశాంతుఁడు. ప్రథమాంధ్ర ప్రబంధ నాయకుఁ డనఁదగు ప్రవరుఁడును, విష్ణుచిత్తీయ నాయకుఁ డనఁదగు విష్ణుచిత్తుఁడును మఱియు పాండురంగ మహాత్మ్యమునందలి పుండరీకుఁడను భక్తుఁడును గొంతవఱకీ ప్రబంధ నాయకుఁడగు పోతనతో సరితూగుదు రనవచ్చును. ఐనను పోతనవలె ననేక క్లిష్ట పరిస్థితు లను మనస్థైర్యముతో నెదుర్కొని యచంచల రామభక్తిచే నిగ్గుదీరినది పోతన భాగవత జీవితము. తలపని తలంపుగా తనంత తావలచి పైబడిన దేవ వనితను కాదని పోయిన ఆ కాముకుఁడు ప్రవరుఁడు. ఇది సామాన్య విషయముకాదు. ఈషణత్రయములతో ధనే షణ గొప్పదందురు. ఆగర్భశ్రీమంతుఁడై మాన్యక్షేత్రములు పెక్కు చందముల బండుచుండ పాఁడిపంటలింట నొకప్పుడుం దఱుగకుండు ప్రవరాఖ్యుఁడు పరదత్తములగు సాలగ్రామ దానాదులనేని గొనకుండుట వేఱు. సామాన్య గ్రామకరణపు కుటుంబమునజనించి సంసార భారమున సతమతమగు పోతన యడుగడుగున కర్థావసర మధికముగ నున్నను, శ్రీనాథకవి సార్వభౌమునివంటి యుదాత్తబంధు వొక వైపున, సింగభూపాలునివంటి సర్వజ్ఞుఁడయిన ప్రభు వొక ప్రక్కను, కవిసార్వభౌముని కనకాభిషేక మాడించిన కర్ణాటకాధీశుఁడు వేఱొక దిక్కునను లెక్కలేని ధనాశ గొల్పుచుండినను ధైర్య స్థైర్యములతో దారిద్ర్యము నాదరించి, ధనాశను ధిక్కరించి, రాజాజ్ఞకన్న రామాజ్ఞ మిన్నయని నమ్మి సిరికి మోఁకాలొడ్డి సిలుగులను జిఱునవ్వుతో స్వీకరించిన ధీరస్వభావుఁడు పోతన మనీషి. ఇంతేకాదు, రత్యంశ సంభవయు, ముగ్ధయు, స్వీయయునగు ధర్మపత్నితో నేకాంత శయనమందిరమున మున్మాపులు "నాతి గల బ్రహ్మచర్యము" నడపిన మనోనిగ్రహము కత్తిమీఁది సాముకంటెను కష్టతరముగదా! ఇతర గుణములగు మాతృ, పితృ, భాతృభక్తి, గురుభక్తి, దైవభక్తి, పెద్దలయెడ వినయ విధేయతలు, బంధుస్నేహము, పుత్ర, శిష్యవాత్సల్యము, ఆపన్నులగు దీనులయెడ దయా దాక్షిణ్యములు, సత్య సంధత, శమదమ వైరాగ్యాదులు కథలో సందర్భాను సారముగా నాయ కునకు వర్ణింపబడినవి. పరంపరగా నాంధ్రుల హృదయములందు మూర్తీభవించియున్న పోతన యాకార గుణగణాదుల కీషన్మాత్రము లోపమురాకుండ యీ కవి యతని పాత్ర నుదాత్తముగా పోషించెను.

పోతనార్యుఁడు కర్మవశమున గొంతకాలము సంసార సుఖముల ననుభవించినను పుత్రోదయానంతర మతని చిత్తము మఱల వైరాగ్యా యత్తమయ్యెను. అతఁడు తిరిగి

తపముజేయ బూనుకొనెనుగాని 'విఘ్నేశ్వరాంశ'తో జనించి తన తపమునకు విఘ్న మూర్తియౌ కొమరుగాంచి ముద్దు గొవినంతనే మమతగప్పి పోతన మనసు కరిగి తపము మాటయే మఱచెను. అతఁడు 'గజయాతగాని' విధమున సంసార సాగరమున మునిగియు దేలియాడుచు 'భవపంకము నంటక' తామరాకుమీఁద జలబిందువు భాతి సంసార ధర్మమును నెఱపుచుండెను. ఆయన తన జీవితమును సేద్యము, పద్యములను రెంటికే యంకితము చేసినట్లు కవి యీ క్రింది పద్యమున హృద్యముగ వర్ణించెను.

"చెఱువు మానస సరోవరముతోఁ గవగూడి నవరస పూర్ణమై నాట్యమాడ
క్షేత్రమ్ములన్ దాళ పత్రమ్ములంగూడి శ్రీ సంపదలతోడఁ జెంగలింప
నాఁగేటికఱ్ఱు గంటపు మొనన్ జతగూడి క్షోణిమేలిమి వర్ణశోభలీన
సస్యముల్ స్వకవితోద్దేశ్యమ్ములంగూడి బహుఫల ప్రదములై రహిఁ జెలంగ
గోగణము వృత్తగణములంగూడి కృషిని నాల్గు పాదముల్ ధర్మము న్నడుపుచుండ
సేద్యమునఁ బద్యమున జడచేతనములఁ బెంచసాగెను పోతన్న ప్రియసయములు.
(ఆ. 3 ప. 297)

పోతన కవిత్వ పాండిత్యములను, వేదాంత వైరాగ్యములను కవి గ్రంథమందంతటను సందర్భాను సారముగ వివరించెను. సింగభూపాలుని యాస్థానమును శ్రీనాథునితోగూడ పోతన ప్రవేశించు సమయమున 'కర్మవెనుకనె జ్ఞానమ్ము గ్రాలుకరణి'నను వాక్యమువలన పోతన మూర్తీభవించిన జ్ఞానమువలె నుండెనని తెలుపుటమాత్రమేకాక రెండు సీసపద్యముల (ఆ. 4 62_63) లో నిరువుర గుణరూప తారతమ్యములను కవి చతురముగ ప్రత్యక్షీకరింప జేసెను.

ఆంధ్రభాగవత పీఠికలో 'మానిను లీడుగారు బహుమాన నివారిత దీన మానసగ్లానికి ...బమ్మెర కేసయ లక్కసానికిన్' (ఆ. భా. పీ. 26)

'లలితమూర్తి బహు కళానిధి కేసన, దాన మాన నీతి ధనుఁడు ఘనుఁడు
దనకు లక్కమాంబ ధర్మగేహినిగాఁగ; మనియె శైవశాస్త్ర మతముఁ గనియె'
(ఆ. భా. పీ 24)

అని ఆంధ్ర భాగవత పీఠికలోని పోతన వర్ణనము ననుసరించి శ్రీ వరదాచార్యులు నీ కావ్యమున దజ్జననీ జనకుల గుణశీలములను నోదంతముగా నభివర్ణించెను. ఇట్లే 'అనఘ గుణులు సోదరుల్ రామలక్ష్మణులు మణులు' (ఆ. 1_125) తిప్పన పోతనల సరస సౌభ్రాత్రము స్పష్టీకరింపబడినది. రాముఁడు లక్ష్మణునివలె తిప్పన పోతనను ప్రేమించెను. పోతన యెడబాటును తిప్పన యించుకయు సహించువాఁడుకాఁడు. ఇట్లయ్యును కాలాంతరమున దిప్పన కీ కవి యేకశిలా నగరవాసమును కల్పించెను. ఈ వేఱు సంసారములకుఁ గారణము

తిప్పన భార్యచేసిన ప్రబోధమయినట్లు కవి మొదట చెప్పెను. అట్లామె భర్త నుద్బోధించుటకు హేతువు కఱవుకాలమునందును పోతన అతి దాతృత్వ గుణమేయని తెలియును. (ఆ. 5-197). ఆమె బోధలో గొంత స్త్రీ సహజమైన చాపల్యము గోచరించినను నిజమున కామె

"ఇరువురము మనమయ్యెడ కేగు(నెడల(, దమ్మునకు గృహభారము తలపయి(బడి
తెలిసివచ్చు నే యెడుపున మెల(గవలెనొ, యటులుగామి ముందతనికె యగు
శ్రమమ్ము" (ఆ. 5-2?6)

పోతన మేలుకోరియే యట్లు చెప్పినట్లు కల్పించి యామె శీలమున కుదాత్తత చేకూర్చెను. తిప్పనయు భార్యమాటలనువిని మందస్మితముచేసి,

'వేఱు పడుమన నాకెట్లు నోరువచ్చు?' (ఆ. 5-209)
'లలన! యేకోదరుల వీడుపెటులో చెపుమ' (ఆ. 5-212)
'మనకేటికి వేఱు తలంపు మానినీ! (ఆ. 5-216)

అని పలువిధముల సతికిఁ బ్రీతిబోధ కావించుటే కాక,

"కఱవులో విడు దాన మొక(డు ఫలించు( దగిన కాలాన నా(టు విత్తనము వోలె
నవసరము లేనియెడ నిడునట్టి యీవి, యది యకాలపు వర్షతుల్యమయి చనును.
అతిథి సత్కారమనిన మాయన్న వాయమున ధరణి( బెట్టినది పేరు మొదటినుండి
యట్టి యాచారమున వన్నె(బెట్టు తమ్ము(డౌర! నాసొత్తు తానేమి యపహరించె?"
(ఆ. 5-219, 20).

అని భార్యమాటలను ఖండించి, పోతన దానగుణము నెంతయు సమర్థించి వేఱుపడుట కంగీకరింప( డయ్యెను. కాని యది కఱవుకాల మగుటచేతను, నతిథి సత్కారములు తప్పకుండుటచేతను నింట పిల్లలు (వీరు పోతన పిల్లలే) పస్తుండవలసి వచ్చుచుండెను, కావున తాము దన భార్యయు నింటినుండి పోయిన పిల్లలకయిన భుక్తి లభింపగలదని భావించి,

"ఏ విధివో కఱవు కాలము( దావెడలంద్రోయు నింట తమ్ము(డు, మనమున్
నీ వనినటు లీ దినముల జీవన మోర్గంట( గడప( జేయుద మబలా!"
(ఆ. 5-222)

భార్యతో నోరుగంటి కేగుట కెట్టకేల కంగీకరించెను ఈ పై పద్యమునందు 'నీ వనినటు' లను మాటకు

'మీకు నొక రాజకీ యాప్తోకోద్యోగ మ్మిడంగ సుగుణాకరు( డా
యేకశిలా నగరేశుం డేకట( గబురంపెనంట నేగందగదే?' (ఆ. 5-205)

ఉద్యోగరీత్యా నోరుగంటికేగి జీవయాత్ర గడపుటయని కవి భావము. బమ్మెరలోని పొలముపంట పోతనకును పిల్లలకు నెట్లో సరిపడునను సద్భావముతో తిప్పన పోతనను విడిచి పోయెనను కారణాంతర కథనముచే కవి, తిప్పన సౌభ్రాత్రమున కపకర్షమును వారించెను. అనంతరకథయందును శ్రీనాథుఁడు పోతనతో నోరుగంటి కేగినపుడు రామార్పణము చేయనెంచిన భాగవతమును సింగభూపతికి గృతియిమ్మని తిప్పన పోతనకు జెప్పినట్లును పోతన యందుల కంగీకరించినట్లును కవి వ్రాసెను. తమ్మునకు తిప్పన యట్లు చెప్పుట కొంత విచిత్రముగ దోపవచ్చును. కాని యీ కల్పనము తిప్పన పోతనల పాత్రలకు మెఱుగు పెట్టుటకే చేయబడినది. శ్రీనాథుడు భాగవతమును సింగభూపాలున కంకితము చేయుమని పోతననుగోరి విఫలుఁడయ్యెను. తన సోదరిభర్తయగు పోతనకు ధనలాభమును దనకు రాజు మెప్పును తప్పిపోయెను. తిప్పనతో జెప్పించియైన దానిని శ్రీనాథుడు రాజున కిప్పింపదలచి పోతనతో నోరుగంటి కేగెను. తిప్పనకూడ దాని కంగీకరింపడని శ్రీనాథుఁ డెఱుంగును. కావున నతఁడొక యుక్తిఁ బన్నెను. పోతన చెంతలేని సమయముచూచి మల్లన పెండ్లి ప్రసంగమునుదెచ్చి ధనావసరమును బ్రకటించెను. ధనాభావమువలన మేనరికము తప్పిపోవు ప్రమాదమును సూచించి తన కోరికయేమో తెలుపకయే,

'నీదువాంఛ యనుజునితో నెఱపఁజేతుననుచు మీరలు నేఁడు నా కభయమిడిన
నమృత మస్తునియందు మీ యాలయమున, నటులఁగామి నీరానక యరుగువాఁడ'
(ఆ. 8-275)

అని తిప్పనను బెదిరించెను. ప్రసంగము ననుసరించి యది శారద మల్లనల వివాహ విషయమే కానోపునని తలంచి తిప్పన మాటయిచ్చెను. అప్పుడు శ్రీనాథుఁడు తన యభీష్టమును 'అతనికెకాదు నాకును మహాశయ ! మీరలె యన్నలంచు' తిప్పనకు దయపుట్టునట్లు యుక్తియుక్తముగ జెప్పెను. తిప్పన మనసు ద్రవించెను. చేయునదిలేక యతఁడును తమ్మునితో నేకాంతమున

'రామున కొసంగు కృతిని భూరమణునకిడ, సురల కిడనెంచు హవినెందు శునకమునకు
నొసఁగుట లటంచుఁ దెలియుదు, విసపువేళ వచ్చిపడె, నేమి చేయంగవలయు ననఘ !

బ్రహ్మ మా రాఘవుఁడు, కవి బ్రహ్మయితఁడొ, యెఱుఁగకయె మాటయిచ్చితి నితనికేను
నా యొసఁగుమాట పూర్తి యొనర్చువాఁడ వీవెయని నమ్మినాఁడ నీ యిష్టమింక.'
(ఆ. 8-281, 90)

అని హృదయ భారముతో నెమ్మదిగా బలికెను. ఇది యంతయును దన కసత్య దోషము రాకుండుటకు తిప్పనచేసిన యత్నము. భాగవతమును రాజునకు గృతియిచ్చుట యతని యభిమతమునుగాదు. పోతన మనోబాధ నతఁడెఱుగును. కావుననే దేవేంద్రునకు

పోతన తపోభంగ విధము బోధించుటకు పూర్వము శ్రీ విష్ణువు తన మనమున భావించిన విధముననే (ఆ. 1-66 పి) తుదకు తిప్పనయు

"ఘనుల జీవితములు కష్టమయమ్మౌట, వారి శీలములకు వన్నె యిడును
జాతి మణులకెల్ల సానలయొరపిడుల్, నృపుని శిరముకెక్కు నెపముతోనె.

కావునన్ నీవు చింతింపగా వలవదు మాన్యుఁడగు రాముఁడుండ, సమర్థుఁడతఁడు,
ఏది యెట్లు కావలయునో యెఱుఁగు భక్తరక్షకుఁ డనారతము సత్య పక్షపాతి."
(ఆ 8. 292-93)

పోతన కెట్టి సంకటమును, నసత్య దోషమును రాకుండ రాముఁడే తప్పక రక్షింప గలడని ధైర్యము గొలిపెను. ఇది క్లిష్టపరిస్థితిలో తిప్పన తన తమ్మున కొసగిన యాశీర్వచ నముగాగూడ గ్రహింపదగి యున్నది. పోతన యెదురాడ నోడెను. తిప్పన సత్యసంధత కును పోతన భ్రాతృభక్తికిని యీ ఘట్టము వ్యాఖ్యానమగుచు కవికిగల పాత్రపోషణ నైపుణ్య మును నిరూపించు చున్నది.

పోతన పుత్రుఁడగు మల్లన తండ్రికి దగిన పుత్రుఁడు. ఇతఁడు బాలుఁడయ్యును, దనకు గాబోవు మామయగు శ్రీనాథుఁడు 'హాలికుఁ'డని తన తండ్రినిగూర్చి చేసిన యెత్తి పొడుపును సహింపలేక వెంటనే 'బాలరసాలసాల...'యను పద్యమును జదివి కవిసార్వ భౌమునకు వాకట్టు కలిగించెను. శ్రీనాథుఁడు తన మహిమ గనబఱచినపు డతఁడు నల్లే కావించి యతని నాశ్చర్య పఱచెను. అతని పితృప్రేమ యత్యంతము తండ్రి యిలు వీడి పోయిన దుఃఖ భారమున నతఁడు సమర్థుఁడయ్యు భాగవతమును పూరింప నిచ్చగింపక కవి కీర్తిని వదలుకొనెను. సింగనాదులచే భాగవత శిథిల భాగములను పూరింపజేసి పితౄణ విముక్తుఁడయ్యెను. సింగనాదుల గురుభక్తిని గవితాశక్తిని కవి సముచితముగా నిందు జిత్రించెను.

సింగభూపాల ప్రౌఢదేవరాయల శీలపోషణమును సముచితముగా జేయబడినది. పోతన భాగవతా పహరణ దోషమునకు బాల్పడినది వారి దళపతులేకాని వారుకారు. భాగవత శైథిల్యమునకు బశ్చాత్తప్తుఁడయి తదుద్ధరణ కవసరమగు ధనముగూడ దానిని సింగభూపా లుఁడు బమ్మెరకు బంపించెను. కాల మీతనిపై నారోపించిన కలుష వర్తనమును కవి యిట్లిందు కొంత సంస్కరించెను. కర్ణాటకాధీశుఁడును నొంటిమిట్టకేగి శ్రీరామ చంద్రునకు భాగవతకృతి సమర్పణోత్సవమును వైభవముగా నిర్వహింపజేసి భాగవత పరిచార పాప పరిష్కృతిని బడసెను.

ఈ కావ్యమునందు శ్రీనాథ కవిసార్వభౌమునకు ఈషదూనముగా పోతనార్యునితో సమాన ప్రతిపత్తి సమకూర్చబడినది. ద్వితీయాశ్వాసమునుండి దశమాశ్వాసాంతము వఱ కును నతఁ డందందు దర్శన మిచ్చుచుండును. అతని చరమ జీవితావస్థ యిం దెందును

స్పృశింప బడకుండుట ముదావహము. భాగవతమును నరాంకితము చేయింపవచ్చిన విష్ణ్వంశగా నిందు కవి యతని సూచించెను. ఈ విషయమున శ్రీనాథుని ప్రయత్నలోప మెందును గనిపింపదు. కాని రామానుగ్రహము పోతనయందే బలవత్తరముగ నుండుటచే, కృతి సమర్పణోత్సవ సమయమున నతఁడు పోతనతో పొందుచేసికొనక తప్పినదికాదు. 'శ్రీలీను కొండవీటి నృపాలుర సంస్థానకవి' శీవిని కవి యిందు చక్కఁగా బోషించెను.

'శరదాస్థ పూర్ణిమా తిథి వెలుఁగొందు చందురుని తీరులు గేరుకళా ప్రపూర్ణుఁ'డుగా శ్రీనాథుఁడు బమ్మెర పరిసరమున పోతనకు బ్రథమ దర్శనము గజ్జెల కచ్చలమునం దాసీనుఁడయి ప్రసాదించెను. వాచ్యముగ గాక ఆశు కవిత నుడివి తాను కవియగుట పోతనకు సూచించెను. పిమ్మట 'శ్రీలీను కొండవీటి నృపాలుర సంస్థానకవిని...శ్రీనాథుఁడనని' కేసన నాశ్చర్య చకితుని జేసెను. పోతన పద్యముల కొన్ని చదివి యతఁడే మహా పురాణ కృతి నిర్మాణార్థమో పుట్టిన విద్వద్వంద్యుఁడుగాని సామాన్యుఁడు కాఁడని గ్రహించి తన సోదరి నతని కొసగి వివాహముచేయ నిశ్చయించుకొని తన తల్లి యామోదమును గైకొనెను. ఈ బాంధవ్యముకొఱకే పిమ్మట నతఁడు బమ్మెరకు వచ్చిపోవుట కనువుగా నుండునట్లు సింగభూపాలుని యాస్థానకవిగా నుండ నిశ్చయించుకొనెను (అ. 2-208). కావుననే కవి యతఁడు రాచకొండయం దున్నట్లే కావ్యమున వర్ణించెను. పోతన శ్రీనాథులను సమకాలికులుగా గ్రహించినను వీ రిరువుర వయోభేదమును పోతన బాల్యముననే శృంగార నైషధ ప్రసిద్ధిని వర్ణించి సూచించెను. ఇతర సందర్భములందును శ్రీనాథుని ఐహిక భోగ వాంఛాదులు సమయోచితముగా నిం దభివర్ణితములు. శ్రీనాథ పోతనల వేషగుణశీల తారతమ్యములను పలు సందర్భములందు కవి నిపుణముగ నిందు వ్యక్తీకరించెను. సింగభూపాలుని యాస్థాన ప్రవేశ సమయపు శ్రీనాథుని యాకార విశేషమును గమనించితిమేని ఈ కవి యతని పాత్రను పోషించిన విధము నూహింపవచ్చును. ఆ పద్యముక్రింద నుదహరింపబడు చున్నది.

'శ్రీశైల శిఖర సంస్పృష్ట సాంధ్యారాగ గతిని కాశ్మీర రాంకవము మేన
నైరావణ కరాప్త హరిశరాసనలీల మణిమయ స్వర్ణకంకణముకేల
శశధరోభయ పార్శ్వ సందీప్త గురుశుక్రులయి రత్నకుండల ద్వయముచెవుల
మేరు గోత్రాధృత క్షీరవారాన్నిధి ప్రక్రియన్ గౌశేయపటము కటిని
పంచ శీర్షోరగ ఫణాగ్ర భాసమాన మణులనగ నంగుళీయకమైత్రి వేళ్ళ
వరల, లక్ష్మి సమర్చితవాణి యగుచు వచ్చె శ్రీనాథుఁ డచటి వారచ్చెరు వడ.
(అ. 4-62)

ఈ కావ్యమునందలి స్త్రీ పాత్రలలో లక్కమాంబనుగూర్చి వెనుక సూచింపబడినది. పోతనభార్య నర్సమాంబ, తత్పుత్రి లక్ష్మి, శ్రీనాథుని పుత్రికయగు శారద మఱియు భోగి

వియు నిందలి యితర స్త్రీ పాత్రలు. వివాహము మొదలు పోతన వ్రతభంగ పర్యంతమే యీ కథలో నర్సమాంబకు ప్రాముఖ్యము. అధీరయగు ముగ్ధ నాయికగా కవి యామె శృంగారమును వర్ణించిన విధ మద్భుతము. సర్వవిధముల పోతనకును గుణమునకు కూల పతియగు గృహిణిగా కవి యామెను చిత్రించెను. లక్ష్మీ శారద లిద్దఱును సమవయస్కలు గను, ఉదయ ద్యౌవనలుగను నిందు గోచరింతురు. ఆటపాటలలో నింటి తోటపనులలో వీ రెండురుల తోడునీడలుగ గోచరింతురు. విగత మాతృకయైన శారద దుఃఖభారమును దన చెలికారముతో లక్ష్మి కొంత తగ్గించినది. భోగిని నాట్యకత్తెయయినను 'ఉమ్మెత్తవనము లోని తులసిమొక్క'గా కవి యామెను జిత్రించెను. యామె యీ శీలమే యామెపై పోతనను దండక రచనకు పురికొల్పినదికాని సింగభూపాలుని ప్రేరణ ధనకాంక్షగాని యిందుకు గారణములుకావు. రంభాంశ సంభవ యగుట నామె ఇంద్రాంశ సంభూతుఁడేయయిన సింగభూపాలుని వలచెననుట సహేతుకముగా గన్పట్టును. ఆంధ్రకావ్యములలో నిందలి భోగిని పాత్ర విశిష్టము. ఇట్లిందు ప్రధానా ప్రధాన స్త్రీ పురుష పాత్రములు చిత్రముగ బోషింపబడినవి.

శాంత రసాంతర్భూతమయిన భక్తి ప్రధాన రసముగను, శృంగారాదు లంగరసములు గను నిందు బోషింపబడినవి. భక్తిజ్ఞాన వేదాంత వైరాగ్యములును, భగవద్వైభవమును గావ్యమం దంతటను బ్రబోధితము లయియున్నవి. దేవతా గురుస్తుతులును. పుణ్యక్షేత్ర తీర్థ ప్రశంసలును ప్రకరణాను సారముగ నిందు బ్రవేశపెట్ట బడినవి. పోతన దంపతుల ప్రథమ సమాగమ ఘట్టమున విప్రలంభ సంభోగ శృంగారములు సముచితముగా బోషింపబడినవి. ఇట్లే భోగినీ (ఆ. 4), మోహినీ (ఆ. 11) వృత్తాంతములును శృంగార భరితములే. ఇందు మొదటిదగు పోతన దంపతుల సమాగమ ఘట్టమును కవి విభావాను భావాదులచే బెంచి కడు దీర్ఘముగా (ఆ. 4-254) వర్ణించెను. తపోభంగ భయమున నింద్రియములను దృఢ ప్రయత్నమున నిరోధించిన పోతనకు మనశ్చాంచల్యము గలిగింపవలెనన్న ఇది యిట్లే వర్ణింపబడవలె నుగదా! ఇది యీ కవికిగల శృంగార రసపోషణ సామర్థ్యమునకు గీటురాయి. ఆంధ్ర కర్ణాటక సైన్యముల యుద్ధవర్ణనము వీరరౌద్ర భీభత్స భయానకాద్భుత రసముల కాటపట్టు. వరాహాదుల పోరాటముల తీరములును కలవు. బోయీలులేక పల్లకి, ఎద్దులులేక నాగలియు నడచుట, వరాహము రాజభటులతో బోరి భాగవతమును విడిపించుట మున్నగు సన్నివేశములును అద్భుతావహములు. రాచకొండలో పుష్పలావికతోడి శ్రీనాథుని నర్మోక్తులు, కూతురు నూతబడెనని తలంచి శ్రీనాథుఁడు నూతికడకు పరువెత్తుట మున్నగునవి హాస్యరస విలసితములు. నిరుపేద కాపుజవరాలి విషాదగాథ, శ్రీనాథకవి భార్యావియోగ దుఃఖాదులు కరుణరసమున కాలవాలములు. ఇట్లీ కావ్యము నవరస నిర్భరమగు కవితారస ఖండముగ దీర్పబడినది.

మహాకావ్యమునకు విధింపబడిన అష్టాదశ వర్ణనలలో నీ పోతన చరిత్ర మహాప్రబంధమునందు నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయోద్యాన విహారములును, విప్రలంభ

సంభోగ వివాహ కుమారోదయములును, ప్రియాణాజీ నాయకాభ్యుదయము లనునవి సంద ర్భాను సారముగ వర్ణింపబడియున్నవి. వర్ణనా బాహుళ్యమునకు వాసికెక్కిన ప్రాచీన ప్రబంధములందైన నిందలి వర్ణన ప్రాచుర్యము గోచరింప దనవచ్చును. ఇందలి కావ్య వర్ణనలకు సంబంధించిన వివరములు కొన్ని ఈ దిగువ క్రోడీకరించి చూపబడుచున్నవి.

నగర వర్ణనలు :— రాచకొండ పురవర్ణనలు. (ఆ. 4. 7–18)
మంత్రిపురి (మంథెన) వర్ణనలు. (ఆ. 5. 4–10)
ఓరుగల్లుపుర వర్ణనలు. (ఆ. 9. 74–79)
ఓరుగంటిలోని శిల్ప సౌందర్య వర్ణనలు. (ఆ. 7. 240–252)
ద్వారకాపుర వర్ణనలు. (ఆ. 12. 255–56)

గ్రామ వర్ణనలు :— బమ్మెరగ్రామ వర్ణనలు. (ఆ. 1. 79–87)

ఇవిగాక పాల్కురికి, మడికొండ, ఒంటిమిట్ట గ్రామముల ప్రసక్తియు, పల్లెటూళ్ళ వర్ణనలను కవి యిందు కావించెను. తన జన్మస్థానమగు తెలంగాణమును కవి యిందు భక్తితో బ్రశంసించియున్నాడు.

సముద్ర వర్ణనము :— శ్రీరామ చరితమున సముద్ర వర్ణనము (ఆ. 11–70) కూర్పబడి నది. కాసార (ఆ. 12. 9–10), ప్రవాహ (ఆ. 7–50)

వర్ణనము లితరములు. మఱియు తెనుఁగునాటి జాహ్నవియన నొప్పు గోదావరిస్తుతి (ఆ. 5. 37–62) నీ కవి దీర్ఘముగను హృద్యముగను రచించెను. ఈ వర్ణనమునందలి సీస ములును వృత్తములును భావములో నడకలో గోదావరీ ఝరీ గాంభీర్యముతో నడచినవి.

శైల వర్ణనలు :— మెట్టుకుధర వర్ణనము. (ఆ. 9. 3–12) మెట్టుగుట్టయని దీనికి వ్యవ హార నామము. హిడింబాశ్రమమను ప్రసిద్ధి దీనికి నేడును గలదు. ఈ పర్వతమును వర్ణించుచు "బానలపైన బానలను బాగుగఁ జేర్చిన జంటదొంతులై కానఁగనౌ మహా శిలలుగట్టిన యీ శిఖరాలరెంటఁ" జివ రలఁ దేనెపెరలు వ్రేలు నననది కడు యథార్థము. కాని పద్యము 10 లోని 'కరవీర తరువు' రామకుండమున గాక పాల గుండమునందు కలదు.

ఋతు వర్ణనలు :— వసంత వర్ణనలు. (ఆ. 6. 2–12)
గ్రీష్మ వర్ణనలు. (ఆ. 7. 39–43)
శరద్వర్ణనలు. (ఆ. 3. 191–203)
వర్ష వర్ణనలు. (ఆ. 3. 137–139)
హేమంత వర్ణనలు. ఆశ్వా 49–(340–349)

| | | |
|---|---|---|
| చంద్రార్కోదయకాల వర్ణనలు :— | చంద్రి వర్ణనలు | (ఆ. 5. 24–31) |
| | ప్రాతఃకాల వర్ణనలు | (ఆ. 2 3–8) |
| | ,, ,, | (ఆ. 4. 216–19) |
| | ,, ,, | (ఆ. 7. 3–7) |
| | మధ్యాహ్న వర్ణనలు | (ఆ. 7. 39–43) |
| | సాయం వర్ణనలు | (ఆ. 2. 148–53) |
| | ,, ,, | (ఆ. 5. 17–22) |
| | ,, ,, | (ఆ. 8. 37–39) |

| | | |
|---|---|---|
| ఉద్యాన వర్ణనలు :— | రాచకొండ పురోద్యాన వర్ణనలు | (ఆ. 4. 14–10) |
| | శ్రీనాథకృత రాజోద్యాన వర్ణనలు | (ఆ. 4. 110–119) |
| | పోతనకృత రాజోద్యాన వర్ణనలు | (ఆ. 4. 122–133) |
| | మాలితోఁట వర్ణనలు | (ఆ. 1. 167–70) |

సింగభూపాలునితోగూడ రాజోద్యానమున కేగిన శ్రీనాథ పోతనలు రాజాభ్యర్థితులయి తద్వినోదమునకు నుద్యానమును వర్ణించినట్లు కవి యీ వర్ణనలను గూర్చెను. ఈ వర్ణన భావ చమత్కార గర్భితము, రమణీయము. ఈ పద్యములు జదివినవారికివి శ్రీనాథ పోతనల రుచి స్వభావ తారతమ్యమును స్పష్టీకరించుటకును, తమ వర్ణనా చాతుర్యమును బ్రకటించుటకును రచింపబడెనని తోపకపోదు. వీరి పద్యములనుండి ఆద్యంత పద్యములు మచ్చునకు జూపబడుచున్నవి.

శ్రీనాథుడు :—

ఇవ్వనియొ జవ్వనింబోలి యెలమిమీఱఁ బుష్పవతి యౌటచేభృంగ భోగ్యమయ్యె
నే తదారామ మారామ నృపతివోలె నలరి ద్విజవాంఛితమ్ము సఫల మొనర్చె (110)

తొలిమబ్బు తెరనుండి తిలకించు చుక్కల దొరఁగాంచి కనుగీటు తొవపడంతి
... ... ... ... ... ...
ప్రియవసంత సమాగమ వేళయగుట వనవిలాసిని నూత్న యౌవన మనోజ్ఞ
శోభ పెంపొందఁ దీరైన సొమ్ముఁబెట్టి వలపొలయ రాగమాధురుల్ చిలుక
నవ్వు (119)

పోతన :—

దళపుష్ప ఫలజలమ్ముల నలఘుమతిన్ విశ్వరూపి నర్చించుచు ని
శ్చలవృత్తిఁ బొల్చుజన్మ సఫలతన్ గనునంచు ననుభవముఁ దెల్పఁ దరుల్. (122)

అనుచున్ భూరుహనివహమ్మనుదిత జీవితరహస్య మామూ లాగ్ర
మ్మనుభూతిఁబొంది సకలము కనులకుఁ బ్రత్యక్ష పఱచుఁగాదె నృపాలా ! (133)

శ్రీనాథుని శృంగార దృష్టిని, పోతన భక్తి వేదాంతదృష్టి నీ పద్యములు చెప్పక చెప్పుచున్నవి. ఇట్లే పుష్పలావికతోడి వీరి సంభాషణలు (ఆ. 4) నందును వీరి దృష్టి భేదమును కవి స్పష్టపఱచెను. ఈ సందర్భమున చేసిన పోతన యింటి పెరటితోట వర్ణనము (ఆ. 8. 210-22) పేర్కొనదగియున్నది. ఇందు పొట్ల, గుమ్మడి, చిక్కుడు, బీర పాదులును, బంతి, కట్ల, నీలాంబరములు మున్నగు పూలమొక్కలను పెంక్లీడు వచ్చిన లక్ష్మి శారదల నర్మోక్తి రూపమున చమత్కారముగ వర్ణించినాఁడు. పొట్లకన్నె సమర్తాడుట, పిచ్చుకలు ముచ్చటాడుట, సీతాకోక చిలుకలు పేరంటమునకు వచ్చుట, రాచగుమ్మడి పూబాల పసిఁడిగిన్నెలఁ బారాణి పసుపుదెచ్చుట, గునుగు పూసారసాక్షి రవలజోతి హారతు లొసఁగుట, కట్ల పూలేమ కుంకుమబొట్లు దిద్దుట, చిక్కుడుతీవ పందిళుల మేడపై నీలాంబరాల పూలపాన్పు వేయుట, అలికులపతి గర్భాదాన మాచరించుట మఱియు బీర బిడ్డలనెత్తి చన్ను గుడుపుట మున్నగు స్త్రీల సాంసారిక విషయము లీవర్ణనాంశములు. వీనిని లక్ష్మి శారదల చేత ముచ్చటింపజేసి వారి భావిజీవితా కాంక్షలను కవి సూచించెను. శారద మల్లనల వివాహ మీ యాశ్వాసాంతముననే జరుపబడుట గమనింపదగును. మహాకావ్యములం దిట్టి పెరటి తోటల వర్ణనము మృగ్యము.

వివాహ వర్ణనలు :— పోతన వివాహ వర్ణనలు (ఆ. 2. 241-72)
ఈ వివాహము సంప్రదాయ సిద్ధముగా సరసముగ వర్ణింపబడినది.

విప్రలంభ సమాగమ వర్ణనలు :— పోతన విరహ వర్ణనలు (ఆ. 3. 161-176; 265-216)
పోతన దంపతుల సమాగమ వర్ణనలు (ఆ. 3. 242-46)

పుత్రోదయ వర్ణనలు :— పోతన జనన వర్ణనలు (ఆ. 1. 88-110)

ప్రయాణ వర్ణనలు :— సింగభూపాలుని సేనలు కర్ణాటక సేనలపై దండెత్తివచ్చుట (ఆ. 7. 158-64)

నారయాదుల రాచకొండ ప్రయాణము, బమ్మెరకు శ్రీనాథుని సపరివార ప్రయాణము వంటి సామాన్య ప్రయాణ వర్ణనలిం దింకను గలవు.

యుద్ధ వర్ణనలు :— కన్నడ తెలుఁగువీరుల యుద్ధవర్ణనము (ఆ. 9. 165-81)
రామరావణ యుద్ధము (ఆ. 11. 85-90)
యజ్ఞవరాహ హిరణ్యాక్షుల యుద్ధము (ఆ. 11. 190-99)

ఇవికాక వరాహము, యువక వీరుడు సింగభూపాలుని సేనలతో పోరుట మఱియు కరిమకరముల పోరాటము (ఆ. 12. 25-35) లితరములు.

ఈ యువక వీరుఁడు రాజసైన్యములతో 'కఱ్ఱసాము' సేయుచు పోరాడినట్లు (ఆ. 7. 201-24) శ్రీ ఆచార్యులవారు అద్భుతముగ వర్ణించిరి. ఈ యొంటరి వీరుఁడు లగుడమాత్రి

సహాయుఁడై మహా సైన్యముతో బోరాడుట మన కాశ్చర్యమును గలిగింపకపోదు. కాని యది పోతనకుగల రామానుగ్రహ ప్రభావమని యూహింపదగును. అతని కఱ్ఱసాము నేర్పును దెలుపు (211-17) పద్యములు చదువదగినవి. మహాకావ్యములలో 'కఱ్ఱసాము' వర్ణన మపూర్వము.

నాయకాభ్యుదయము :— భాగవతకృతి సమర్పణోత్సవము. (ఆ. 10. 51-65)

"భావుకా ! సకలరాజన్య లోకంబునకు నీ యకళంక చరిత్రంబు కనువిప్పు గల్గించెను. తమ బలంబుకన్న దైవబలం బెక్కువయని గ్రహింప గలిగిరి. దైవభక్తుని దేవేంద్రుఁడేని నిర్జింపలేఁడను నిజము నెఱింగిరి." అను శ్రీనాథకవి వాక్యములే కావ్యనాయకుఁడగు పోతన విజయమునకును దత్ప్రత్యర్థులగు సింగభూపాల (దేవేంద్ర) పరాజయమునకును దార్కాణములు.

"పోతనార్యుఁ డానందాశ్రు పూరమొల్క వరదు పాదసన్నిధినుంచె భాగవతము
రామ గళసూనహార మా గ్రంథముపయి నూడిపడెఁ గృతికాంతఁ బెండ్లాడెననఁగ"

అని వర్ణించి కవి యీ కావ్యమును మంగళాంతముగ దీర్చెను.

ఈ కావ్యమునందు పైన దెలుపబడిన ప్రాబంధిక వర్ణనలకు అంగోపాంగములుగా కథా సందర్భాను సారముగ వెలసిన మనోజ్ఞ వర్ణన లెన్నేనియు గోచరించును. అట్టివి కొన్ని యిచట తెలుపబడును.

పోతన శిష్యులు రాచకొండకేఁగుచు మార్గమధ్యమున గావించిన అరణ్య, వృక్ష మధ్యాహ్నాది వర్ణనము (ఆ. 7. 36-52) నందలి పద్యము లనేకములు హృద్యములు.

'గగన మంటప వాహక స్తంభ గణమన సూటినభమ్మునే చూపు తరులు (36) అను వన వర్ణనమును,

'బడినోళ్ళఁ దెఱచెడి వడదాక శోషిల్లి వృక్షశాఖల నహో ! పక్షిచయము (43) అను మధ్యాహ్న వర్ణనమును,

'బచ్చల పర్వతమ్మో ధరబట్టిన చల్లని యాతపత్రమో' యను మొదలగు మఱ్ఱిచెట్టు వర్ణనలును (47-49) మఱియు

'నెఱియలన్ డొంకలన్నెఱి విభిన్నాకృతి నిరువంక లంటుచు దరులెసంగ
.... .... .... .... .... ....

భుజంగంబు భంగి మెఱుకు, విద్యుల్లతాంగి భాతి పరువులిడు, శ్వేతపటము రీతిఁ జను ప్రవాహ వర్ణనములు చదువదగినవి.

ఇతర కావ్యములందు తఱచు గనరాని సుందర ప్రకృతి దృశ్యములు పలుభంగుల వర్ణింపఁ బడియున్నవి. వీనిలో ననేకములు స్వభావ రమణీయములు, సహజములు. బమ్మెర వర్ణనమునందలి యీ పల్లె ప్రకృతి సౌభాగ్యమును తిలకింపుడు.

"ముత్యాల చెండ్లెత్తి మురిపించు జొన్నచేల్ కర్షకశ్రమబిందు ఘనతఁదెల్పు
బంగారు గొలుసుల బరువుల తలవంచు 'వరిలక్ష్మి' పాలేఱు వరుసవిప్పు
వెండికొండలు చెట్లఁ బండించు ప్రత్తిచేల్ పశుపతిత్వము రైతుసర మొనర్చుఁ
జంకబిడ్డలఁగొంచు సాకెడు మొక్కచేల్ ప్రజకాఁపు చంకపాపలని చూపు
మేలిపంట పొలాల నాఁగేలు చాలు శ్రీ మహాలక్ష్మియైన యీ సీత నేలు
నేల నవధాన్యరత్న భూషాళిదాల్చి, పాడిపంటలముల్లె యీ పల్లె యనఁగ."
(ఆ. 1-87)

కేసన చేసిన 'వియత్తలమునఁ బైఁడి పండించెడు రసాల బాలలీల' (ఆ. 1-170) మనోహరము. మఱియు

'మోటఁదోలు చొకింత మ్రొగ్గి దండెడతంత్రి శ్రుతిచేసి పాఁడెడి చోఱకాఁపు
మిరెపతోఁటల నలింబెఱుకు గాజులచేతఁ జిటుకు తాళముగొట్టు చిన్న పడుచు
పచ్చికన్ లేఁగల భరతనాట్యముప్రక్కఁ బిల్లఁ గ్రోవిని నూఁదు గొల్లబుడుత
రాత్రింబవళ్ళు విశ్రాంతిగానక తోఁట గాపాడుచుండెడి గడ్డిబొమ్మ.
పసరు చాయలనీను మేల్వరి పొలాలు, పచ్చ 'మఖమలు'పట్టు తివాచి గాఁగఁ
దెల్లవస్త్రాలమను దొరపిల్లలట్లు కొంగగుంపు లాయొడ్ల మధ్యం గనఁబడు.'(ఆ. 2-10)

'కట్టుపిఱుందాని కంబళి ముసుగుతో నీరెండ గ్రాఁగుచు నిఱచు గొల్ల
... ... ... ... ... (11)

అను వర్ణనల పల్లె పట్టులు నిజముగనే మన కన్నులఁ గట్టుచున్నవికదా ! అంతే కాక యీ గ్రామ పరిసరములందు 'గొఱ్ఱెమందగోల, గొల్లని యాలయుఁ, బసుల కాలిధూళి విసరణంబు, మంచెవారికేక మంద కుక్కలఢాక' ప్రత్యక్ష మగుచుండుననుట కదు సహజము. ఇట్లే యీ కావ్యమునందు, కర్షకులయు, తమ మూపుల పల్లకీపయి శశిరేఖవంటి కొడవళ్ళ నెక్కించుకొని పొలము గోయబోవు పల్లెపడుచుల వర్ణన లందందు సందడించును. మఱియు

'హరుని పేరురమునా నలరారు ముఖసీమఁ బనత్రాళ్ళు ఫణులయి పెనఁగులాడ
... ... ... ... ... ...

నురువుల వెలార్చు క్షీరాబ్ధి తరఁగలనఁగ (ఆ. 2-157) బరువిడు శ్రీనాథుని బండి యెద్దుల వర్ణనము ముద్దు లొలికించును.

ఇట్టి నిసర్గ ప్రకృతి వర్ణనములేకాక కవి యిందలి ప్రధానాప్రధాన పాత్రల రూప రేఖాదులను కన్నుల గట్టునట్లు వర్ణించెను. చిదానందయోగి (ఆ. 2. 15–17): శ్రీనాథుఁడు (ఆ. 4–62; 7. 289), పోతన (ఆ. 4–63), భిక్షుకుఁడు (ఆ. 5. 233–34), భూసురుఁడు (ఆ. 6–123). మున్నగునవి యిట్టివి. శ్రీనాథుని రూపవర్ణనము వెనుక తెలుపబడినది. ఇఁక నీ భిక్షుకుని వీక్షింపుడు. ఎంత దయనీయముగా నున్నాఁడో !

"తెగమాసి పిట్టగూడగు తలంగల చింపి గొంగడిలో శని గూరుచుండఁ
బెరిగి పెన్పొచిగాఁ బరఁగు మీసముల గడ్డముల నంటుకొని వంటకము మెఱయ
గడుపుమంటకుఁ ద్రావు గంజిచుక్కలురాలి పొట్టపైఁ జారికల్‌కట్టి మెఱయఁ
జీర పేల్పొడి మాసి చిల్లులు పడుగోఁచి వేనోళ్ళ దైన్యమున్ విశద పఱుప
వెంటఁబడి పిల్లబొమరాళ్ళు విసరుచుండఁ గొసరి మొఱ్ఱిక్కుచు, నెగఁబడు కుక్కదాడిఁ
దద్దఁ దప్పించుకొనుచు, జేత నొకచిప్ప, పేలికలు వ్రేల్మొలను వచ్చె భిక్షువొకఁడు"

ఇట్టి పద్యములందలి వాక్చిత్రము లనేకములు. వీనిని ప్రసిద్ధ చిత్రకారుడు కొండపల్లి శేషగిరిరావుగారు త్రివర్ణ చిత్రములలో వ్రాసినారు. కాని ద్రవ్యా భావముచే చిత్రింప బడలేదు. పోతన యీతని నిరుపేద తనములో గాంచిన బ్రహ్మత్వమును (ఆ. 5–264) గాంచుడు.

"కనవశమ్ము గాదీతని గతిదలంపఁ
జెప్పవశము గాదీతని స్థితినిగాంచ
నితని లక్ష్యమ్మునిడువార లెవరు గలరు
మానినీ ! తా నితఁడు నొక్కమానవుండె"

కనవశముగాని గతి చెప్పతరముగానిస్థితి, నెవరు లక్ష్యమున నిడగలరు. ఇట్టిఁడు మానవు డెట్లగును. ఇందు పరబ్రహ్మత్వము ధ్వనింపజేయు వైఖరి ప్రశంసా పాత్రము.

"క్రతు ధూమములమాఁగి కడు చెమర్చెడి మేన వెలిబూది పూఁతలు మఱుగు నూప
... ... ... ... ... ...

తే. కుశలు సమిధలు కట్టగాఁ గూర్చికట్టి చంక నిఱికించి బ్రహ్మ తేజంపుఁగళలు
దాఁగక మొగమ్ముపై నట్టె తాండవింప దరియవచ్చెను భూసురవరుఁ డొకండు."

అను భూసుర వర్ణనమున బ్రహ్మవర్చస్సు తొణికిస లాడుచున్నది. అట్లే అష్టమా శ్వాసములో శారద పీఁదుదోడువప్పటి రూపచిత్రము (ఁ. 8–222) పద్యము తిలకింపుడు.

"కంకణ కింకిణీ క్వాణరుణంకృతుల్ గిరక గానములకు స్వరము లల్ల
మంజుల మంజీర శింజాని నాదముల్ జలఘటమ్ముల దాఁకి జగడమాడ

కాంచీగుణాంచిత సంచలత్తనుమధ్య మసియాడు చేఁత్రాడు ననుకరింప
స్రంసదుత్తుంగకుచాంశో త్తరీయంబు స్రవదంబు పాతచిత్రము రచింప
భ్రష్టఘర్మంబు మౌక్తికవృష్టిఁ గురియఁగ్రాలు బుసలమైఁ డీవియ సోలియాడ
కరయుగముజంట నాగులై సరసమాడ జలముఁ జేఁదె నుల్లాసాతిశయము మెఱయ"

ఆంధ్రకావ్యములయం దిదియు నొక యపూర్వ వర్ణనము.

ఈ విధముగానే కవి యిందు అంగడికత్తె (ఆ. 4_24), కళావతి (ఆ. 7_308), మోహిని (ఆ. 11. 122_24 మఱియు 133); మున్నగు స్త్రీల వర్ణనములనుగూడ చతురముగ గావించియున్నాడు. ఈ క్రింది మోహిని వర్ణనము గమనింపుఁడు

"మీనంబు పొలసుల మేన్వీడి స్నిగ్ధతంగాంచఁదానీలేమ కనులఁ బడియె
కమఠంబు మృదుతను గడియింపనెంచి యీ వనిత శ్రీపాదాలు పట్టుకొనియె
కిటి యీమె మైకాంతి ఘటియింప స్వర్ణనిష్కవరాహగా మారుజన్మమెత్తె
హరి సర్వభూత దయాభ్యాసమునకు నీ పడఁతి లోనికివచ్చి నడుముగట్టె
వామనుఁడు మెడంబడి ధనస్వామియయ్యె, రహిని రామత్రియమ్ము నీ రామ రూపు
బూని సుప్త పంచశరుఁ బ్రబుద్ధుఁ జేసె, ఘన జగన్మోహనాకృతిఁగల్కి యిదన."

ఇందు కవి చతురముగ దశావతారములనుగూడ స్ఫురింపజేసెను. వ్యక్తుల రూప వర్ణనమువలెనే బాల్య, యౌవన వార్ధక్యాది వివిధ వయోదశలును నిందు వర్ణితములు. పోతన (ఆ. 1) శ్రీకృష్ణుల (ఆ. 12) బాల్యవర్ణనము, కంచుకి (ఆ. 1), వార్ధక్య వర్ణనమును మఱియు శారద (ఆ. 8. 202_206), రుక్మిణి (ఆ. 12) మున్నగు యౌవన వర్ణనలు పేర్కొనదగినవి.

'అతిబాల్యమున భూమి నడుగిడలేకుంటి వార్ధక్యమున నట్లె వఱలుచుంటి' (ఆ 7_79)

అను పద్యమున బాల్య వార్ధక్యములకు సామ్య మరయబడినది. ఇట్టి వర్ణన లింతకు బూర్వము లేవనరాదు. ఇఁక శారద నూత్న యౌవన వర్ణనమును బరామర్శింపుఁడు.

"నివ్వాళు లిడఁగ లజ్జకు నవ్వనిత విలోల మోహనాక్షులు, మేనన్
జవ్వనము నిండుకొన, నెదఁ బువ్విల్తుని కేదొ కొఱఁత పూర్ణంబయ్యెన్." (202)

ఇందు శారద యౌవనోద్గమము చక్కని ధ్వనిరూపమున బ్రస్ఫుటము చేయబడినది. ఈ వర్ణన మెంతయు నౌచిత్యవంతము. దీని తర్వాతి పద్యమును విశ్లే యంగాంగ వర్ణనా రహితమయ్యును, శారదయొక్క సకలాంగ సౌష్ఠవమును వయోనుసార భావపరిణతిని, ఇంగితజ్ఞతను వాచ్యాతిరిక్త చమత్కార మార్గమున ధ్వనింప జేయుచున్నది చూడుఁడు.

తే. "చిన్నతన మల్ల జాఱుటన్ సిగ్గుమీఱెఁ, బరికిణీ చీరగా మాఱి పయఁటఁగోరె
ఆడమగ భేదమేర్పడె, నంతకంతకేమొ తెలిసినట్టులు భావ మేర్పడియెను." (203)

ఇట్టి ధ్వని ప్రధాన రచనతోగూడిన పట్టులిం దింకను ననేకములు కలవు. ఈ కావ్యము నందు వీరు సచేతన వ్యక్తుల యనురాగమునేకాక, తిర్యగ్జడములగు కపోత మిథునములయు (ఆ. 3-166), వృక్షలతాదులయు ననురాగమును (ఆ 3. 207-14) కూడ నిపుణముగ వర్ణించిరి.

ఈ క్రింది పద్యములను బరిశీలింపుఁడు.

'అంతికమందుఁ బుష్పవతియైమను కమ్మని కొమ్మయైన చే
మంతి పడంతి వక్షమున మైకపు బంగరు బొంగరాల గి
ల్గింతలువెట్టి, చెక్కుటల గిల్లినఁ బల్లురిపించు జొన్న బా
లెంతలఁ గౌఁగిటన్ బరిమళించుచు వీచెను గమ్మ తెమ్మెరల్.' (207)
'చిన్న తనమింక విడకయొ సిగ్గుమెయినొ వచ్చుటకుఁ జిక్కులిడు లతా వనితఁగాంచి
సూటినడయె తెలియు వృక్షసుందరుండు మునువెనుక దోఁచక నిలిచి ముగ్ధుఁ
డగును.' (212)

ఇవికాక యిందింకను క్షామ (ఆ. 5. 137-44), సంక్రాంతి (ఆ. 9. 340-47), వేట (ఆ. 10. 82-84), త్రివేణి (ఆ. 7-311), వరాహ (ఆ 7-226), యజ్ఞవరాహ (ఆ 11. 185-06), అశ్వగమనము (ఆ. 9. 159-62) మఱియు కీరరాయభారము (ఆ. 12. 231-44), రుక్మిణీ సందేశహరణము (ఆ. 12. 251-275) వంటి వర్ణన లెన్నియేని గలవు. ఇవన్నియు వేనికవే మనోజ్ఞములు. తజ్ఞులగు రసజ్ఞులే వీని రసవత్తతకు బ్రామాణికులు !

ఇట్టి లౌకిక వర్ణనములనేకాక శ్రీ ఆచార్యులవా రిందు కథా సందర్భము ననుసరించి, అలౌకిక వర్ణనము లనేకములు స్తోత్ర, వర్ణన, ఉపదేశాదుల రూపమున సంధానించి తమకు గల వేదాంత విజ్ఞానమునుగూడ ప్రకటించి యున్నారు. మృత్యు స్వరూపము (ఆ. 3. 325-35), మానవజీవిత స్వరూపము (ఆ. 5. 67-75), జీవితమునందలి సుఖదుఃఖములు (ఆ. 9. 227-32), దుర్గాదేవి ప్రార్థన (ఆ. 3. 126-33), తిరుపతి వేంకటేశ్వరస్తుతి (ఆ. 9. 234-42) రంగనాయక స్తోత్రము (ఆ. 9. 254-63), భాష్యకారస్తుతి (ఆ. 9. 266-77) గోదాస్తుతి (ఆ. 279-86); చిదానంద గురుస్తుతి (ఆ. 6. 29-43), శ్రీరాముని విశ్వరూపము (ఆ. 5-88), ఈశ్వరశక్తి (ఆ. 8. 169-72); దశావతారములు (ఆ. 7. 256 వచనము ఆ. 4. 239, గేయము) మఱియు భాగవత తత్త్వోపదేశము (ఆ. 6. 51-70), భక్తి స్వరూపకథనము (ఆ. 6. 186-190), శ్రీ శుకుడు పరిక్షిత్తునకు జేసిన జ్ఞానబోధ (ఆ. 10 95-118), మున్నగు వానికి సంబంధించిన వర్ణనలన్నియు భక్తి, జ్ఞాన, వైరాగ్య

ప్రబోధకములయి యొప్పారుచున్నవి. అతిగహనములయిన వేదాంత విషయముల నీ భాగ ములం దాచార్యులవారు సరళ పద్ధతిని వర్ణించియున్నారు. వీనిలో గొన్నింటి రచనా విధాన మునుగూర్చి మాత్రము రెండు మాటలు.

శ్రీ చిదానంద గురుస్తుతి నీ కవివరుఁడు సంస్కృతశ్లోకములలో రచించెను. ఈ శ్లోక ములయందు గురువునకు త్రిమూర్తుల సామ్యము శ్లేషరూపమున గల్పింపఁబడినది. ఇవి యీయన యుభయభాషా కవిత్వ దక్షతను నిరూపింప జాలియున్నవి. ఇట్లే భోగినీ నాట్య మున దశావతార, రాధ పాత్రాభినయము నద్భుతముగ వర్ణించుటేకాక యీ సందర్భమున వీరు అష్టపదుల ఫక్కికిజెందిన లయతాళ యుక్తములగు 'పదము'లనుగూడ రచించిరి. ఈ పద్ధతి యాంధ్ర కావ్యములయందు నవ్యము. కళికలు, ఉత్కళికలు, రగడలు, మఱికొన్ని విశేష వృత్తములను వ్రాసిరి. వీనిలో 'తొహర' అనునది పూర్వ కావ్యములందు గనరాదు. వీరు 'మంగళ మహాశ్రీ' వృత్తమాలిక నొకదానిని గూర్చిరి. ఇందు వీరు స్వతంత్రించి 'ప్రాసయతి'ని విశేషముగా పాటించిరి. కావ్య మంతయును ప్రాచీన కవుల ఒరవడిలో ప్రౌఢముగా రచింపబడినను, శ్రీ శుకుఁడు పరీక్షిత్తునకు జ్ఞానబోధయందును, నారద హిరణ్య కశిపుల సంభాషణమునందును, వీరు చక్కని సరళశైలిలో 'ఆటవెలది' లనేకములు వేమన బాణిలో హృద్యముగగూర్చిరి. మచ్చునకు కొన్ని పద్యములు,

'నాల్గు నాళులుండి నాశమౌ మేనికై సకల సుఖవసతులు సంతరించు
నద్దెకొంపనెంత దిద్దితీర్చిననేమి వెడలుమనినదినము విడువ వలెను.' (ఆ. 10_97)

'తనకుఁ దెలియనంత దైవంబెలేఁడని వచ్చినట్టులెల్ల వాగుచుండుఁ
బురుటిబిడ్డ యయ్యె నెఱుఁగని మాత్రాన జనకునునికి యెం దసత్యమగునె?
(ఆ. 10_107)

'తాను ముందు పిదపఁ దత్త్వమ్మనెడి సూక్తు లాత్మసౌఖ్యకరము లవవినెందు
శాంత సత్యశౌచ శమదమా చరణలు, దుర్బలత్వమునకుఁ దోడు సఖులు.'
(ఆ. 1_219)

'ముల్లు పెఱికివేయ ముల్లు కావలెనని యగ్నితోడ నగ్ని నార్పవశమె?
ఒక్కసూత్ర మెప్పు డుపయోగపడదెందు. సాధనమ్ము గొందు సమయ మెఱిఁగి.'
(ఆ. 11_226)

ఈ విధముననే యీ కవి యిందలి యనేక కథలలో ఆటవెలదులు, గీతములు, కంద ములు అధిక సంఖ్యలో సరళశైలిలో రచించిరి. ఈ కావ్యమునందు 7, 9, 11, 12 ఆశ్వాసము లలో వీరు సుమారొక పది వచనములను రచించిరి. ఇందు కొన్ని చిన్నవి, కొన్ని పెద్దవి, కొన్ని ప్రౌఢ సంస్కృత సమాస ఘటితములు. మఱికొన్ని అల్ప సమాస యుక్తములు. ఈ వచనములను కథాకథనముకంటె వర్ణనలకే వీ రధికముగ నుపయోగించిరి. ఇందలి ప్రతి

వచనము నొక ప్రత్యేక శైలిలో నడచినది. నన్నయనుండి చిన్నయ వఱకుగల భిన్నవచన శైలుల విందలి వచనములు తలపించును. వీనిలో భాగవత రచనాహేతు వివరణము (ఆ. 7_11) గల వచనము మఱియు శ్రీకృష్ణాంతః పురవర్ణనము (ఆ. 12_258) గల వచనములు 20 పంక్తులకు మించు ఏకైక వాక్యములు. అలతియలతి వాక్యములతోడి వచన రచనయు గొన్నింటగలదు. మొత్తముమీద నివి యీ కవి వచన రచనా సామర్థ్యమును దెలుపజాలియున్నవి.

ఈ కావ్యమునందు కొంత కథను ఆచార్యులవారు చక్కని సంభాషణలతో నడిపించిరి. దండనాథ పోతనల సంభాషణము (ఆ 7. 167_97), శ్రీనాథ పోతనల సంభాషణలు (ఆ. 8. 110_46), నారద హిరణ్య కశిపుల సంభాషణము (ఆ. 11. 210_28); మున్నగు నవి కొన్ని యుదాహరణములు. ఇట్టి సంభాషణలు సరసములగుటేకాక ఈ కావ్యమున రీతు లనుగూడ వెలయించిన వనవచ్చును. భోగినీ నాట్యవర్ణన మంతయును ముఖ్యముగా నాటకీయత కుదాహరణము. ఆంధ్రకావ్యములలో నాట్యవర్ణనమిట్లు హృద్యముగను దీర్ఘముగా వర్ణింపబడిన ఘట్టము లరుదు. ప్రాచీన కావ్యములలో గొన్నింట రంభాదుల నాట్యము సూచింపబడెనేకాని వర్ణింపబడినట్లు లేదు. సింహాసన ద్వాత్రింశికయందు మాత్రము కొఱవి గోపరాజు రంభాదుల నాట్యమును కొలది పద్యములలో మనోహరముగా వర్ణించెను. ఆధునికులలో శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు 'శివతాండవ'మను గేయకావ్యమును రచించిరి. కాని యిది ప్రత్యేకముగా శివతాండవ వర్ణనమునకే యుద్దేశింపబడినది. కవిసామ్రాట్టుగారి 'కిన్నెరసానిపాట'లో నదీకుమారి నాట్యము వర్ణితము. కర్పూర వసంతరాయ'లను గేయ కావ్యమునందు శ్రీ సి. నారాయణరెడ్డిగారును 'లకుమాదేవి' నాట్యమును కావ్యమున సరసముగ గూర్చిరి. భోగినీ నాట్యమును శ్రీ ఆచార్యులవారు మహాకావ్యములోజేర్చి కడు దీర్ఘముగను శాస్త్రీయముగను వర్ణించియున్నారు. మహాకావ్యములోని నాట్యవర్ణనకిది మకుటాయమానము. ఇది ప్రత్యేకముగా నెంతేని వివరింపఁదగినది. ఇందు కవి యనన్య సాధారణ ప్రతిభ విదితమగుచున్నది.

ఈ పోతన చరిత్రమునందలి వర్ణనలు శబ్దార్థాలంకార విలసితములు. శబ్దాలంకారముల వృత్త్యనుప్రాస, అంత్యాను ప్రాసములు, యమక శబ్దశ్లేషలును, అర్థాలంకారములలో ఉపమ, రూపకము, ఉత్ప్రేక్ష, స్వభావోక్తి, అర్థశ్లేష, అర్థాంతరన్యాసాదులు కావ్యమునకు విశేష శోభను సమకూర్చినవి. శబ్దచమత్కారమో, అర్థచమత్కారమో, భావచమత్కారమో సర్వత్ర వెల్లివిరియుచు నీ మహాకావ్యము 'ప్రతిపద్య చమత్కృతి'తో నొప్పారుచున్నదనిన నతిశయోక్తి కాజాలదు. కవితాధార నిరర్గళమై, మృదుమధుర పదసమాస బంధమై, లోకోక్తులకు, ఉక్తి వైచిత్రికి, ధ్వన్యర్థ విశేషముల కాలవాలమైన యొక రసబంధుర నిర్మితి యీ కృతి.

యమకము :— 'దాని దాని దాని దానమ్ముగా గాంచి' (ఆ. 12_21)
'నాకవనముమించు నాకవనమ్మన' (పీఠిక. 36)

'తోరణమ్ములు లేమి తోరణమ్ములు సల్ప' (ఆ. 6-3)

'వాలమ్మ వాలమ్మువలెఁ దిప్పియాడుచు' (ఆ. 7-226)

శ్లేష :— 'తమమును జేరు చోరుఁగని తద్దయు సత్వ సముద్ధతిన్ పదోద్గమిత రజమ్మ నంటక ప్రధావితులై చనుదెంచి ముక్తసంగమునఁ జరించి మాతృ పద కంజములన్ స్పృశియించి ముక్తులౌ సుమహిత సిద్ధులెందరొకొ, చోరవశం గత బుద్ధు లెందఱో.' (ఆ. 1-19)

ఇందే తమ + మును జేరుచో అని విడదీసినపు డిచ్చట అర్థశ్లేషకూడ.

'దీప్తిమత్ కావ్య పత్రాలఁ దినుచెదలన' (ఆ. 2-70)

దీప్తిమత్ + కావ్య...అనియు, దీప్తి + మత్కావ్య పత్రాలని విభుపులు, కావున శబ్దార్థ ద్వివిధశ్లేషలు.

'తెలి గగనంపుఁ బయ్యెద నదృష్ట పయోధరయై........' (ఆ. 72-194)

'గురువునకేని ద్రోహ మొనగూర్చుటకై మనమం దొకింతయున్

వెఱవడురాజు.........' (ఆ. 4-195)

'అలఘుదోషాతిరేకమ్మ కలననెప్పు డంతరించును రాజత్వమవనియందు(ఆ. 9-117)

ఉపమ :—'తనువంటు చాయపోలిక వెనువెంటం బయలుదేతె విబుధగణమ్మున్'(ఆ. 1-74)

'కురిసిన మేఘమై యరసికుంబలెఁ దెల్లమొగమ్ముతై చె మేల్తురులవి'(ఆ. 6-67)

'వెనువెంటఁ దాను పోతనయువచ్చెఁ గర్మవెనుకనె జ్ఞానమ్ము గ్రాలుకరణి' (ఆ. 3-63)

'వేఁకటి నొదిగిన శిశువటు చీఁకటిలోఁ బడుచు నిదురఁజెందెను జగముల్.' (ఆ. 5-162)

'బ్రహ్మణ్యులట్లు హసింతురపుడె' (ఆ. 3-148)

'వయసొక కోడె త్రాఁచువలె వచ్చి' (ఆ. 7-70)

రూపకము:—'ధాత్రియై సస్యసంతానమ్ము నొడిఁగట్టి జీవన స్తన్యమ్ముఁ జేపికుడిపి.' (ఆ. 2-162)

'వింతసింగిణిరంగుల పెట్టెవిప్పి, యాకసపుఁ బళ్ళెరంబున వరుగఁదీపి (ఆ. 2-65)

"యామినితీవ, దాని కొనలందునఁ జుక్కలురేపురాత్రికిన్ మోములువిచ్చుచున్న పసిమొగ్గలు......" (ఆ. 3-197)

'మబ్బుకన్నియలు చెల్వంబొప్పఁగా తారకా తిలకంబుల్ ధరియింప'(ఆ.4-112)

"రథము మందరముగ రాజన్యజలనిధి మథనపరచి జయము మధుర సుధగ
సైన్యమునకుఁబంచి సరసిజాలయగాగ హరి విదర్భతనయ నపహరించె"

ఉత్ప్రేక్ష :— మధురసాభోగ హేమకుంభములపైన నీలమణి పాలికల మూఁతగ్రాలు నవఁగఁ దమ్మిమొగ్గలపై వ్రాలి తుమ్మెదలును బద్మినీకుచ చూచుక ప్రభలు జిమ్మ. (ఆ. 4-114)

'ముకుళముద్రల భుజలతల్ మొగ్గదొడుగు
బూర్ణ వికసితముద్రిలఁ బూఁబుపూయు
వంపులగు వ్రేళ్ళఁ బూరేకు సొంపులీను
క్షితిఁ గదలియాడులత యీ నెలఁత యనంగ.' (ఆ. 4-248)

స్వభావోక్తి :— 'తలల గొంగడి ముసుఁగులు వెలుఁగ
ముడుత గట్టుకొనిన చేతులఁ దమ కట్టులూని
గద్దువలకొని యట్టిటుఁ గదలకుండ
అలగొని నిల్చిరచటి గోపార్భకులును.' (ఆ. 3-143)

'మెఱపుటీకల నిండుమెడ ముందువెన్కకుఁ గునిసియాఁడగఁ దోడఁగూడి నడచు'
(ఆ 3-166)

'సిగ్గు వెనుకకీడ్వఁ జెలినెందుఁబ్రేమంపుఁ గాంక్షముందునెట్టఁ గలఁతఁజెందు (ఆ.3-23)
'జాడించిరి మడిపంచెల జోడించిరి కేల్విభావసున కడుకులకున్'
'దోడుంచి గుడమునిఁక నోరాడించిరి రుచికి శిరము లాడించిరొగిన్.' (ఆ. 7-53)

అర్థాంతరన్యాసము :—

'సంకునఁబోయఁ దీర్థమయి సత్కృతిఁ గాంచదె కూపనీరమున్ (ఆ. 1-35)
'ఏమి సేయంగలుగు నాఁడ డింతకన్న ?' (ఆ. 3-50)
'వింద మునిఁగినఁ జలి యింకనుండ గలదె ? (ఆ. 4-405)
'భువి బాలవిఘాతికి శ్రేయమబ్బునే ? (ఆ. 7-70)
'భాగవత పాణితోఁగాని పనియుఁ గలదె ? (ఆ. 8-49)
'ఏనుఁగు లెక్కనైనబుణ మేకుల రాటముతోడఁ దీఱునే ? (ఆ. 8-122)

అంత్యాను ప్రాసము :—

వేదనినాద సారముల వీనుల విందిడు తేనెతేటలో
శ్రీదయితా మనోహరుని చిత్త మెలర్చెడి పూలతోఁటలో
మోదతఁ జేతనోద్ధరణముం బొనరించెడి పైఁడి కోటలో
గోద రచించినట్టి యదు గోపకుమారునిఁ బాడు పాటలో. (ఆ. 9-283)

'పాయక సేయు తెల్గుల తపమ్ముల పంట మహాంధ్రభారతీ
స్వీయ పదోల్లసద్వలయసింహాస దజ్జయ ఘంట సాహితీ
ప్రేయసి కావ్యలక్ష్మి కనువేసిన చక్కనిదంట, పోతరా
జ్ఞాయకుఁడంట యెల్ల కవినాథుల సత్కృతిఁగొంట గోద్యమే.' (ఆ. 9-93)

లోకోక్త్యాదులు :— 'యద్భావం తద్భవతిహి' (ఆ-5-136), 'అన్నదాతా సుఖీభవ' (ఆ-2-203), 'వచ్చునట్టిపని వాకిటదీప' (ఆ-4-379).

'అశ్రుశస్త్రముల్ గుర్రింగెఁ బోతన్న కపుడు' (ఆ-4-374), 'విన్ననే పోయినది (మరణించినది) యనెఁ జిన్నవోయి' (ఆ-4-398), చెంపఁగొట్టి దాఁగఁగవచ్చు చీఁకటి (ఆ-5-16), 'ఓ యనిన నా యనరాని' (ఆ-5-153) 'రెండంచులకత్తికోఁత' (ఆ-2-239), 'కన్నుం బోగల్గునంత కాటుక తగునే' (ఆ-5-201), తేళ్ళుపాములు ప్రాకినగతి (ఆ-5-227) కడుపున వాంతి (ఆ-5-267), తల ముగ్గు గుల్లయయ్యె (ఆ-7-71), 'బ్రాహ్మణస్యక్షణం కోప'మ్మని (ఆ-7-268), 'బెండ్లు దేలను వాహినిన్ గుండ్లు మునుఁగు' (ఆ-7-262), మణినా వలయం వలయేనమణి' (ఆ-267), త్యాగవర్తనల నచ్చోఁ జూచుకుంజెక్కి (ఆ. 7-325), 'ఎదగాలము గుచ్చినట్లు' (ఆ-8-15), 'ఈ సంసారము పండ్లులేని పులి' (ఆ-8-121), 'విత్తొక టిడినఁ జెట్టొకటి మొల్చు నెటుల్' (ఆ-8-145), మొదలే మొగురము లావనఁదుదు దూలమ్మనిన నిజము దోచునె? (ఆ-8-145), 'పొలపుఁగట్టె తా గొడ్డలి పొట్టఁజొచ్చి, కులపుఁ గట్టెల నన్నింటిఁ గూల్చినట్లు' (ఆ-8-250), 'పంగువు పైకి గంగ యరుదెంచినది' (ఆ-2-110) గాంజ దుర్వనిన్ ఘనతులసీ ప్రరోహము (ఆ-4-159) ఇట్టివింకెన్నియుఁ గలవు. ఈ క్రింది పద్యమున సామాన్య నుడికారములేకాక తెలంగాణపు నుడికారముకూడ కనవచ్చును. ఇది లోభి, భిక్షుకునితో పలికినది.

"కుక్కను బిల్వనా ? యనుచుఁ గోమటి యొక్కఁడు వచ్చి, తాత నో
మ్మిక్కడ దాఁచఁ బెట్టినటు లేమొ పదేపది 'బుక్కెడేయి కా
ల్మొక్కెద నవ్వ' యంచు నిలుముంగిటఁ బాతినయట్లు లుంటి, పో
మ్మెక్కడికే నటంచు బిగియించుకొనెన్ దలుపుల్ ధడాలనన్." (ఆ-5-238)

ఇట్లే యీ కవి ఇల్లెడు రాజులు, చౌకోసులు, బెక్కెను, పలుగాండ్లు మ్రానుకాయ, పిడుకగూండ్లు, ముండ్లదడులు, పలుకాడి (= మాటలాడి), సాపడబిల్లు, అన్నముంచు (= అన్నము వడ్డించు) మున్నగు పదములను మఱియు చివ్వతిండి. బాసవాలు, విడుపు విడిది, నిరాబారి, తీవంచ మోములదిట్ట చేపట్టిన జాణ, ఇవము సూడును నెలయున్ జత కనులఁ జేయువేలుపు, కడుపు బంగారు బొక్కసముంజేసిన మేటివనిత, కరువలి చిఱుతగమి చెలువ విరియు వెతికుయులు, సగవుల నొక్కలుదేలు చెక్కల వ్రాలివేల, వంటి అచ్చ తెనుఁగు పద సమాసముల నందందు జక్కఁగ బ్రయోగించెను.

ఉక్తి చమత్కృతి :— 'నన్నయ్యని తెలియుమనెడి నన్నయ నెంతున్ (పీఠిక 20)

'అరయగం కంటిపాపఁడే యనఁబడుచును
సరసగతి రామచరిత కుత్తరము వ్రాసె' (పీఠిక 24)

అరయ కంకటి పాపఁడనియు, అరయగం, కంటిపాపఁడనియు చమత్కారము. ఉత్తర రామచరితము వ్రాసెననుటకు రామచరిత కుత్తరము వ్రాసెననుట చమత్కారము.

"ఎవఁడు రామాయణ కల్పవృక్ష వినుత కాండాలి
దివికి నిచ్చెనలై చె యమరకవిమతిన్ దెలచి రాజని వెలింగె" (పీఠిక 30)

స్వర్గానికి నిచ్చెనలు, తెలచిరాజు అను రెండు నవలలిందు బేర్కొనబడినవి.

"విపంచిఁ గరశాఖల మీటుచు దూరమేఁగు నమ్మునిఁగని శారదాభ్రిమని, పూర్ణవిధుండని, తారయంచెదో ధ్వనియని, శూన్యమంచు నొగిఁ బల్కిరి విష్ణు పదాలయస్థితుల్"

వీణ వాయించుచు గ్రిమక్రిమముగా నారదుఁ డాకాశమున నదృశ్యుం డగుట యిందు చమత్కారముగా వర్ణింపబడినది.

'పూరిగుడిసెలెక్కి పోయిరాజెనని యగ్నిసాక్షిఁ బల్క
ధూమ సంఘమొకట'......(ఆ-1-86)
'కాసులయాస మానమును గంపల గాసము జేసికొందునే ? (ఆ-2-99)
పాదరసమ్ములు సొమ్ము లిమ్మహిన్ (ఆ-2-222)
మబ్బు పచ్చికదవై తోచెన్. (ఆ-3-137)
"ఒకటితో నొక్కటింగూర్ప నొక్కటియగు, లేక మూఁడేని యగునని
లోకమెఱుఁగ గాలుసేతుల వ్రేళ్ళ లెక్కనిడమడచి, యురక సరిదిద్దు
గణితశాస్త్రోక్త విధికి.'' (ఆ-3-285)

మల్లన శిశువు గణిత శాస్త్రమును సరిదిద్దు చున్నట్లు కవి చమత్కరించెను. సామాన్య గణితము ననుసరించి 'ఒకటితో నొక్కటింగూర్ప' రెండగును. కాని మల్లన గణితశాస్త్ర ప్రకారము ఇది ఒక్కటి యగునట, లేదేని మూఁడగునట ; భార్యా భర్తలను గూర్చుటకు 'ఒక్కటి చేయుట'యని వ్యవహారము కావున సంతాన ప్రాప్తికి పూర్వము ఈ యిద్దఱు 'ఒక్కటి'గానుండి తదనంతరము శిశువుతో ముగ్గురగుదురని చమత్కారము.

సీ 'చికిలి చూపులలోన శృంగార రసవల్లి పూలుపూయుచుఁ దోరణాలు గట్టి
... ... ... ... ...

గీ. నాతి కలకంఠ రుతము సన్నాయిఁబాడ, లజ్జ తెరపటమగుచు విలాస మీనఁ
ద్రిణయ సితదృక్ప్రభలు తలఁబ్రాలువోయ నారి నృపతి మనమ్ము లగ్నమ్మొనర్చె.
(ఆ_4_306)

ఇందు భోగిని సింగభూపాలుని మనస్సును లగ్నమొనర్చిన విధము వైవాహిక సంప్రదాయముతో జమత్కారముగ వర్ణింపబడినది.

'వనిత యర్ధాంగియయ్యు నా మనసు నేచుఁ
గుడియెడమ పార్శ్వముల కింత యెడమదేల ? (ఆ_3_224)

ఇందలి శబ్దార్థ చమత్కారము స్పష్టము.

'కమల కోమల సతీ హస్త పాశ
బద్ధుఁడై ముక్తిగనె మారు బారినుండి.' (ఆ_3_243)

బద్ధుఁడగుట, ముక్తుఁడగుట అన రెండును పరస్పర విరుద్ధ భావములు, వీనిని కవి 'బద్ధుఁడై ముక్తిగనె'నని యేకత్రిగూర్చి చమత్కారము కలిగించెను.

"అన్నపూర్ణా మనోహరుఁడని పేర్వడ్డ కాశివిస్సయయింట గంగద్రావి. (ఆ_3_251)
... ... ... ... ... ...

అను సీసపద్యపు తక్కిన పాదములలోని కూడుగుడిచి, పదముపాడి మఱియు వేంకట రెడ్డి రొక్కమునకు వడ్డిగట్టి, యనునవి కడు చమత్కారముగను విశేషార్థ వంతముగను గూర్పబడినవి. 'కాశి విస్సయయింట గంగద్రావి' అనుదానికి కాశికేఁగినవారు గంగ ద్రావుటయను నాచారమును మఱియు నీశ్వరుఁడు అన్నపూర్ణా మనోహరుఁడేకావి స్వయముగా నతఁ డాదిభిక్షువు గావున నతనియింట గంగకంటె మిక్కిలి యుండదమట విశేషము. జగన్న అన్నసత్రమున కులభేద మెంచబడదు కావున నచటి యన్నము కేసనకు కూడుగుడిచి నట్లయ్యెనని చమత్కారము. వేంకటరెడ్డి యిచట తిరుపతి వేంకటేశ్వరస్వామి ఈయన భక్తులనుండి రొక్కము మిక్కుటముగ గడించి రెడ్డి దొరయై కొండెక్కి కూర్చుండెనని చమత్కృతి.

"రామభక్తుఁడై హనుమఁడు రాఁడదేల, మార భక్తుఁడై తలకిందు మాఱిపోఁడె
రామయను శబ్దమున కెందు రమణియంచు, నర్థము వచింపఁడే శుకునంతవాఁడు"
(ఆ_4_165)

ఇందు రామ శబ్దములోని అక్షరములను వ్యత్యస్తముచేసి చమత్కారము కల్పింపబడినది. ఈ క్రిందివికూడ నిట్టివే.

'అవును గసాయి కిత్తునం బాడితప్పు ముఖము క్రిందైన మీఁదైన ముఖము ముఖము'
(ఆ_9_115)

'ధరణిపతి ప్రజాకంట కత్వము వహింప పురియె తలక్రిందులై రిపు సరణివఅలు.'
(ఆ_9_117)

ఈ క్రింది పద్యములలో నారికేళఫలము బహు చమత్కారముగను సాలంకారముగను వర్ణింపబడినది.

"స్వచ్ఛ మందాకినీవారి సంగ్రహించి, తల ధరింపఁగ నెండవానల సహించి
మూఁడు కనుల మూసియు మీసములను గడ్డములఁ బెంచు నారికేళ సత్ఫలతపస్వి."

"పొంగి కైలాసగిరివాఱు గంగనీరు, కామధేనువు పాలమీగడల తీరు
మూతకళల మూసి, ముక్కంటి ముద్రవేసి, తీర్థము ప్రసాదమని యిందు డింపిరెవరొ?
(ఆ_4_015_17)

పుష్పలావిక నర్మోక్తులు చమత్కార బంధురములని చెప్ప నవసరములేదు.

ఒక్క పద్యము

'దండయిద్ది యెవరి దండఁ జెల్వారునో యట్టివారి ఘనతఁబట్టి దీని
విలువ యెదుగు, వట్టి చిలిపి యూసించిన దండతాడనమ్మె దండవిలువ.'

ఇట్టి శబ్దార్థ చమత్కార వంతములగు పద్యములిం దింకను గలవు. ఇప్పుడు చతురోక్తులవంటివి కొన్ని పరికింపుఁడు.

'స్వర్గమ్మును గాలఁదన్నుదును కావ్య జగత్తునుబట్టి దున్నుదున్.' (ఆ_2_72)

ఇవి పోతన వాక్యములు

'ఈనిన పులియై, సిగమున్ బూనిన కాళియయి, యగ్గి పొగమంటలు కన్గోనల
గ్రక్కుచు" (ఆ_2_90)

కూడె నా బాయమగండు పశ్చిమ దిశాసతి, నాయమయిల్లు పైఁడియైపోయెను.
(ఆ_2_150)

'కొడవళ్ళు తాము పల్లెపడుచుల మూఁపుల పల్లకీల నెక్కివచ్చెను' (ఆ_3_103)

'మన్మథుని హత్యయొనర్చిన కొండవీటి సన్యాసివిటాల వహ్నిశిఖలార్పి' (ఆ_3_142)

'పిడికెడునులేని నడుమునఁ గడుపేర్పడె' (ఆ_3_267)

'ప్రక్కలు నిండెను జను మక్కలు నలుపెక్కె......
దంపతుల గుట్టు లీవలఁ బడియెన్.' (అ_3_265)

'భూవిభుని మోవి చిఱునవ్వు పూలుగురిసె. (ఆ-4-213)

'చీఁకటింటికిఁ దొలిసంజ చిచ్చుపెట్టె' (ఆ-4-216)

'ఆ లతాంగి యొకొక్క యవయవమ్మె యొయ్యారముల నిధి కవనజలధి శిల్పకళల కవధి' (ఆ-4-244)

'కడము ద్రొక్కెడి మారుగజ్జెల గుజ్జుమై యాటలాడెడు (ఆ-4-258)

'దినమ్ముపై నిశలు నిప్పులు గ్రక్కెను దారకాకృతిన్' (ఆ-8-38)

మామ పాలకుల బోయిలకై బరువౌట గొప్పయే? (ఆ-8-14)

ఇది మల్లన శ్రీనాథునిగూర్చి హేళనగా బలికినది. ఇందు పాలకుల బోయిలనఁగా పాలకులు మోసెడు బోయీలనియు, ప్రభువులకు చెందిన బోయిలనియుఁ జమత్కారము; బోయిలకై బరువౌట యనఁగా బోయీల కొఱకనియు, బోయీల చేతులకు బరువౌటయనియు జమత్కారము స్ఫురించును. దీనివలన శ్రీనాథుఁడు పాలకుల పాలకులయందు సుఖముగా నూరేఁగుచుండునని వెక్కిరింపు.

'తఱుము కొనివచ్చు నవ్వును బొరెఁబయ్యెద కొనలఁ గఱచి పోనడచి.' (ఆ-4-33)

'ప్రజ మీయకళంక కీర్తి సామమునకు ఘనజట లల్లుచుండె' (ఆ-9-101)

"శ్రీకారము చీకాలము, టాకున్ తా, రాకులాలు, డాకున్ దా వ
ర్ణైకాదేశపు బాల వ్యాకరణము మెచ్చుకొనని పండితుఁడున్నే? (ఆ-11-238)

ఇందు బాలుఁడయిన ప్రహ్లాదుఁడు తండ్రితో మాటలాడుచు శ్రీహరి యనుటకు బాలుఁడగుటచే 'చీయలి' యనును. దానిని శ్రీహరియని అర్థము చేసికొని తండ్రి కోపించి బెదిరించును తల్లి 'ఛీహరి' యనం బోలునని సవరించును. ఈ సందర్భమున కవి పై పద్యమునువ్రాసి 'బాలవ్యాకరణ' సూత్రమును చమత్కారముగా వివరించెను. అనఁగా చిన్నయసూరిగారి 'బాలవ్యాకరణము'ను ఆక్షేపించు పండితులుండిన నుందురుగాని బాలుర వ్యాకరణమును మెచ్చుకొననివా రుండరని చమత్కరించిరి. ఇట్టి చతురవాక్యములిం దింకను ననేకములు కలవు (ఆ ౧ పద్యం ౫.౧) తెలుగులిపి ఉత్పత్తినిగూర్చిన పద్యముగూడ నిట్టి కల్పనా చాతుర్యము చమత్కృతి గలిగినదే.

కొన్ని సూక్తులు :—

'ఇసుకను జక్కెరం గనఁగ నేకవిధమ్ముగఁ గానిపించు నా
యిసుక జలమ్ములన్ గరఁగ దేండ్లకొలందిగ నాని పొత్తు తాఁ
బొసఁగిన యంత నీరమయి పోవును జక్కెర, మానవాళి రూ
పసమత నుండనేమి? రస భావవిలీనుఁడె సజ్జనుం డిలన్.' (ఆ-2-69)

ఇది 'ఉప్పుకప్పురం'బను వేమన పద్యమునకు బ్రతిధ్వని. ధ్వంగ్యంతర[illegible] గూర్చ బడినది.

'ధరనుపాధ్యాయుఁ డెదొయొక్క తరుణమందు
గొంత పరిమిత జనులకుఁ బాఠమిడును
గావి సత్కవివాణి శిక్షణ మొసంగు
సకల కాలమ్ములందు విశ్వ ప్రజలకు.' (ఆ_2_131)

'ఒక్కవిత్తునాఁటఁ బెక్కుగింజలు వెన్నునంటియున్న ఫలిత మబ్బునట్టు
లొక్కపాపకర్మ పెక్కింతల ఫలమ్ము వెన్నునంటి కుడుపు విన్నరునకు' (ఆ_2_135)

'పిల్ల ప్రియమును గోరును బితరులెందు హితము గోరుదురు...(ఆ_2_210)
కన్యా వరయతే రూపమ్ వంటిది యిది.

'పొటమరిలనె ప్రాయము తీవబోఁడు లాది సంతరంగము విప్పి మాటాడరెందుఁ
బూఁతఁబట్టనెమును లతా ముఖములందు, మూతివిప్పవి మొగ్గలే మొలచునట్లు.'
(ఆ_3_82)

'చెప్పుకున్నను నరుదెంచుఁ జెడుగుణములు, పట్టి బోధింప సుగుణముల్ పట్టువడవు
మట్టియంటును గుమ్మరి మవికిఁజేర, పసిడియంటునె కమసాలి వసతి కేఁగ.'
(ఆ_4_209)

'విలువగల రత్నమునుదానె వెదకికొంచు మానవుఁడెవచ్చు, రత్నమ్ము మనుజకతతు
వెదకు చుంబోవదీ విశ్వవీథి, నదియుఁదా సువర్ణమైత్రినె శిరోధార్యమగును.'
(ఆ_8_109)

ఇది 'నరత్న మన్విష్యతి మృగ్యతేహితత్' అను కాళిదాసు వాక్యమున కనుసరణము.

'అధికవిషయ సంసేవనమ్మగు వినోద మవసరాకృతింగొని వ్యసనాఖ్యనలరి
తనను సేవింపకున్న ఖేదమొనగూర్చు, నతి వినోద సేవనము దుఃఖాకరమ్ము'
(ఆ_8_127)

ఇట్టి సూక్తు లీ కావ్యమున శతాధికములు. వీనిలో గొన్ని ప్రాచీనుల ననుసరించియుఁ గొన్ని స్వతంత్రించియుఁ జెప్పబడెననుట పై యుదాహరణములవలన స్పష్టము. ఇట్టి సూక్తులు సార్వకాలిక సత్యములు. లౌకిక జ్ఞానప్రదములయి వేమన, సుమతి పద్యములవలె కంఠస్థము చేయదగియున్నవి. వీనితోపాటు కవి యిందు భక్తి, జ్ఞాన, వైరాగ్య వేదాంతాదులకు సంబంధించిన ఉపదేశములను సందర్భాను సారముగాఁ గావించియున్నారు. మఱియు కవిత్వము, కావ్యము, నాట్యము మున్నగువానిని గూర్చిన దమ యభిప్రాయముల నందందు

పొందుపరచుటేకాక, స్త్రీల ఆటలు, ఆభరణములు, వివాహాది సంప్రదాయములను, యోగ శాస్త్ర, జ్యోతిశ్శాస్త్రాలకు సంబంధించిన కొన్ని విషయములనుగూడ నెడనెడ వివరించి యున్నారు. మచ్చునకు పూర్వకాలపు స్త్రీల ఆభరణముల వర్ణన పద్యముమాత్ర ముదహ రింపబడుచున్నది.

'రాకిణి, పింపిణీ, రావిరేకయుఁగుప్పె, కోరకొప్పుల తలం దారలీన
నరిగ పట్టెడ, గుండ్లసరము. పూసలపేర్లు, పాలిండ్లఁ దూగుటుయ్యేలలూగ
బిగువు టొడ్డాణముల్, బిళ్ళల మొలనూళ్ళు; జవ్వాదు నడుముతో సరసమాడ
మట్టెలు, పిల్లాండ్లు, మఱి వీరమద్దియల్, లావణ్య గతులకు లయలువేయ
జిలుగు టద్దాలకట్టు పోఁతలు వెలుంగు, పూలయంచుల కుత్తంపు చోలములును
నీలి నింబోళి కెంపువన్నియల నలరు సరిగ పట్టంచుకోకల సవదరించి. (అ-12-98)

పై ఆభరణాదులలో గొన్ని యిపుడు నామా వశిష్టములు మాత్రమే. తక్కిన వయి నను బల్లెలలో గ్వాచిత్కముగా గానవచ్చును.

ఈ 'పోతనచరిత్ర'మున కనుబంధముగా రచించి చేర్పబడిన ఏకాదశ ద్వాదశాశ్వాస ములలోని భాగవత గాధలలో పోతన శైలినే కవి చాలవఱకు అనుసరింపదలంచి కృత కృత్యుఁడయ్యెను. ప్రహ్లాద చరిత్రమునుండి యొక పద్యమును తిలకింపుఁడు.

'వైకుంఠుఁ బొగడని వక్త్రమ్ము ఢక్కానాదది దేవళమ్ములో నద మొనర్చు
హరిపూజనములేని హస్తంబు దర్వినా వది యన్నపూర్ణ హస్తాయుధమ్ము
విష్ణుభక్తి యెలేని విబుధుండు పశువన్న నది మహాదేవు వాహనము సతము
కంజాక్షునకుఁగాని కాయంబు భస్త్రినా నది రాగిఁగరఁగి దేవాకృతినిడు
చక్రిచింతలేని జన్మంబుద్బుదమన విష్ణుపాదవారి వెలయు నదియు
శ్రీపుఁగననికనులు శిఖిపించ నేత్రమ్ములనిన దేవసన్నిధినవి యలరు.' (అ-11-324)

పై పద్యమున కవి 'వైకుంఠుఁ బొగడని వక్త్రమ్ము వక్త్రమే ఢమఢమ ధ్వనులతో ఢక్కగాక' యను పోతన పద్యము ననుసరించుచునే తన వ్యక్తిత్వమునుగూడ బ్రకటించెను. గజేంద్రమోక్షణ కథనుండి యొకటిరెం డుదాహరణములు.

'మూలం బెవ్వఁడు విశ్వభూత గణమున్ బుట్టింపఁ బోషింపఁ ను
న్మూలింపన్ సకలాంత రాత్ముఁడయి యే ముఖ్యుండు మిన్నట్టు ది
క్కాలాబాధితుఁడై వెలుంగు భువనాకారైక వృక్షాకృతిన్
మూలంబై కనరాఁడెవండు శరణంబున్ వేఁడు దా యీశ్వరున్.' (అ-12-41)

'ప్రాణనశించె, నా వశముదప్పెను దేహము, తావుదప్పెనా
ప్రాణము, లాత్మధైర్య మెడఁబాసెను, గన్నుల మూర్ఛగ్రమ్మె, నీ

ప్రాణికి నీ వినామరి యుపాయము సాయములేదు, రావె గీ
ర్వాణపతీ! క్షమించి నను రక్షణ సేయఁగదే కృపామతీ! (ఆ-12-47)

'కలఁడట చరాచరంబులఁ గలఁడఁట దశదిశల భక్తకల్ప ద్రుమమై
కలఁడు కలఁడనెడు మాటలు కలలో, లేకున్న విలువ గలవో తెలియన్ (53)

'హరి వెనువెంట భార్గవి, రమాంగన వెంబడి రాణివాస, మా
పరిజనమంటి తార్క్ష్యుఁడు, సుపర్ణుని వెంబడి శంఖచక్రముల్
వరుసగ దండనాథుఁడును వారును వీరననేల? నింత కా
పరమ పదంబె తాఁగదలివచ్చెను జెచ్చెర నంతకంతయున్.'

'పరమ దయాళువై మకరిబట్టి వధింపఁగఁ బంపె వేగ శ్రీ
హరి, కరభీషణోరగ ఫణాగ్రమణి ప్రభలీను చక్రమున్
వరసురవైరి నాశ పరిపాలిత శక్రమునైక కోటి భా
స్కర కిరణచ్ఛటాచ్ఛవి ధగద్ధగి తాంబరచుంబి వక్రమున్. (80)

'కరవిభ్రాజిత పాంచజన్య ఘన శంఖధ్వాన గర్జా కృతిన్
వరశోభావిల సత్సుదర్శన తటిద్వ్యాప్తి నక్షీణ స
త్కరుణా మేఘ కళేబరుండగుచు నక్రధ్వంసియై చక్రి స
త్వర మార్పెన్ బదబాధనొందు కరిహృత్తాపానల జ్వాలలన్.' (82)

తక్కిన భాగవత కథలను కవి చాలవఱకు భాగవతశైలినే నడపెనవచ్చును. పోతన కథయందును నెడనెడ కవి యిట్లే పోతనశైలిని చాటించెను. మచ్చుకు గొన్ని పద్యములు.

'ఇంతింతై వడు గింతయైనగతి మభ్బీక్షించు చున్నంతలో
నంతై, యాకసమంతయై విరిసి నీలాకార మేపారనా
శాంతమ్ముల్ గ్రసియించి మించి ఘన గర్జార్భాటధాటిన్ బ్రజా
స్వాంతమ్ముల్ పెకలించె నుద్ధతి నిరాశా కంధిలో ముంచఁగన్' (ఆ-3-113)

'పద్మాక్ష దర్శనభాగ్య హీనములైన కన్నులం ధవరాటకములు గావె
జగదీశ సత్కథా శ్రవణ దూరంబైన శ్రుతులు కోటర బిలాకృతులుగావె
యచ్యుతగుణ కీర్తనామృతంబానని నాలుక ప్రేతాగ్ని కీలగాదె
వనమాలి నిర్మాల్యవరగంధ మెఱుఁగని నాస యుమ్మెత కసుప్రాసగాదె
విష్ణు పదసేవనా విరహితమగు కరము ధరమొల్చు నుప్పలి కరముగాదె
పరమ పదనాథు విషయ సద్భక్తిలేనిమేను బడిసెంపుపెరమ్రింగు మీనుగాదె!'
(ఆ-5-75)

'హిమకర స్పర్శచే( జెమరించు చందుకా ఖద్యోతమునుగాంచి కర(గ(గలదె
ఓషధీపతి(గాంచి యుప్పొంగు క్రొందీవ యంచనుగని పులకించ(గలదె
కుముద బాంధవ దర్శనమున నవ్వెడి కల్వ చంచలంగాంచి హసించ(గలదె
వరసుధాకరరుచుల్ మరగు చకోరమ్ము కరదీపికా కాంతి( గర(గ(గలదె
చంద్రికాంతాననయు లతాచారుగాత్రి కువలయదళాక్షి మృదుల చకోర హృదయ
రాజదర్శనస్పర్శన రక్తిలేమి కర(గి పులకించి తులకించి కాంచినగునె?' (ఆ-4-188)

'మండిత కరధృత దండకమండలు హసదాననేందు మండలుని జటా
మండల ఖేలత్సుందర గండస్థలు లంబితాక్ష ఘనకుండలునిన్' (ఆ-2-16)
కాషాయాంబర కవచిత వేషన్ జ్ఞానాగ్నిదగ్ధ నిజకృతదోషన్ (ఆ-2-17)

మహాకవి పోతన జీవితకావ్యమునందు పోతన భాగవత కవితా వాతావరణమును గల్పించు నుద్దేశముతో నీ కవి పలుతావుల నిట్టి శైలి నవలంబించెను. ఇతర ప్రాచీన కవులలో శ్రీనాథ, పెద్దన, రామరాజభూషణ చేమకూర వేంకటకవులును సంస్కృత మహాకవి కాళిదాసును ఈ కవి కభిమాన పాత్రులుగా గోచరింతురు. ఈ మహాకవుల కవిత్వశైలీ శయ్యలఛాయ లందందు భాసించి యీ కవిశైలికి ప్రౌఢిమ నాపాదించినవి. ప్రాచీనకవుల భావ గాంభీర్యమును రచనా శిల్పమును వీరు పుడికి పుచ్చుకొనిరేకాని, భావానుకరణమునకు పాల్పడలేదు. వీరి భావములు స్వతంత్రములు.

ఈ క్రింది పద్యముల గమనింపు(డు.

'వప్రాట్టాలక శృంగమూర్ధ విలస ద్వాల్లభ్య చిహ్నధ్వజా
ధిప్రేంఖన్మసృణారుణాంశుక సముద్దీప్త స్వరూపమ్ము తా
విప్ర ప్రాజ్ఞకవీంద్ర గాయకనటీ విశ్వమ్ముకై స్వాగ తా
భిప్రాయ ప్రకటత్కరాగ్రమయి పంపెన్ యుష్మదాహ్వానముల్' (ఆ-4-68)

ఈ పై పద్యము కథలో శ్రీనాథ మహాకవి సింగభూపాలుని దర్శించినపుడు చెప్పినది. ఇది శ్రీనాథుని ప్రౌఢశైలిని ఆక్షరాక్షరము తలపించుచున్నది. ఈ క్రింది పద్యములలో రామరాజ భూషణుని కంఠధ్వని వినవచ్చును.

'నెలగుండియల(బిండి సెలయేటి యెలబోటి యిలక్షీరవారాశి నొలుకబోయ
వెలగల్గు చలివెల్గు తెలిమించు తులకించి మలినాంబరమునంత( జలువసేయ(
గళలీను నెలజేని చలువవెన్నెలలతల్ భూరుహచ్ఛాయలం బూలుపూయ(
దెలికౌముదులు యామినులుదాల్చు చేరుచుక్కల ముత్తెముల పులుంగడిగివేయ
గొలకులన్ విల్వటద్దాల తళుకుమీఱ నలుగడల్ పచ్చిపాల్గాఱ( జలువరాల
మలకర(గి వచ్చికబయళ్ళనిలిచి పాఱనన శుచిస్మితయై శరద్వనితచేరె' (ఆ-3-192)

'సౌందర్యామృత సింధువున్ ద్రుహిణశీర్షశ్రేణి మంథానమా
కందంబై నవనీతముప్పతిల వీఁకన్ ద్రిప్పఁగా నద్ది క
ల్పించెదో పీ తరుణీలలామమయి రాజించెన్ బళీ! దీనివా
కందమ్ముల్ రమణీయతాగగన రాకాచంద్ర బాలార్కులో' (ఆ_11_132)

'ధూర్తనాగారూఢ దుందుభిస్వనభీతి మార్తాండ బింబమ్ము మఱుఁగుసొచ్చె
గగన సంగరనటద్ఘన తటిత్కరవాల సమతి కన్నులలోన సాముసేసె
నీలాద్రి శిఖర సంధిత వారిశతఘ్నులదురు దెబ్బలు గుండెలందువైచె
శక్రచాపవిముక్త శరపరంపరలచే దశదిశా జాండమ్ము వశమొనర్పఁ
గలుష విషయుక్త గర్వాంధకారసార వపువులొలయఁ గాదంబినీ వాహినులును
భీత దీనమానవ వినిర్భిన్న భిన్నచిత్తముల నొంప వడకింపఁ జేరవచ్చె' (ఆ_8_114)

'వాసన యొంతయున్న విజవర్ణము లెట్టివియైనఁ గ్రింద న
గ్రాసనమందుఁ గ్రాలియు మదాకృతి నవ్వుచునుండి రెండునా
శ్రీ సుమజాతిజన్మ ధరియిత్రి సమర్చల నేలవ్రాలి నౌ
రా! సురరాజి పీనిని శిరమ్మునఁ దాల్చుట పూజ్యతన్ గనున్' (ఆ_4_128)

ఇట్టిశైలి కివి కొన్ని దిఙ్మాత్రోదాహరణములు.

ఇఁక ఈ కావ్యమునందలి ధ్వని విశేషములకు గొన్ని యుదాహరణములు చూపబడు చున్నవి.

'సురపతి సోదరుండు, పరిశుద్ధమనస్కత భక్తుఁ డాత్మయై
వరలెడి పుత్రుఁడింద నొక వైపునవీపు, మరొక్క వైపునం
బరఁగెను పొట్ట, రెండిటను బాధయె చేకురె, ధర్మసంప దు
ద్ధరణ మొనర్ప కంకణము దాల్చిన నీకు వచించు వాఁడనే! (పీఠిక_76)

ఇది కావ్యోపక్రమ భాగములోనిది. భక్తునకు హానికలిగించుట కిష్టములేకున్నను సోదరుఁడగు ఇంద్రునకు పోతన తపోభంగ మార్గము నెఱింగింపఁగా నతఁడు సంతృప్తితో వెడలిపోయెను. అప్పు డొంటరిగానున్న విష్ణువుతో నారదుఁడు పై వాక్యములు పలికెను. సోదరుఁడగు ఇంద్రుఁడు వీపువంటి వాఁడనియు, భక్తుఁడు పొట్టవంటివాఁడనియు, రెండెవరికి బాధకలిగినను కష్టమేయని నుడివి. 'ధర్మ సంపదుద్ధరణ మొనర్ప కంకణముదాల్చిన నీకు వచింపువాఁడనే' యని మిన్నకుండెనేకాని తన మనోగతాభిప్రాయమును దెలుపఁదయ్యెను. కాని యతఁడు మాటలతో జెప్పకున్నను, ఇందలి 'వీపు, పొట్ట మఱియు ధర్మసంపదుద్ధరణము' అనునవి నారదుని యభిప్రాయమును ధ్వనించుచున్నవి. లోకమున సామాన్యముగా వీపుమీద గొట్టవచ్చునుగాని పొట్టమీద గొట్టరాదను న్యాయము ప్రసిద్ధము. పైగా భక్తుఁడు

(పుత్రుఁడు) తపమొనరించి భాగవత రచనచే లోకమున ధర్మవ్యాప్తి చేయనున్నాఁడు. ఇతనిది ధర్మమార్గము. ఇందుచేఁ దన్యాయముగ ఇతని తపమును భంగము కలిగించి ధర్మ విఘ్నమునకు దలపెట్టి యున్నాఁడు. విష్ణువు ధర్మరక్షణకే కంకణము కట్టినవాఁ డనుటచే నీనివలన సాముదాయికముగా పీపువంటివాఁడును అధర్మ వర్తనుఁడునగు తమ్ముఁడగు ఇంద్రునకు అపజయము కలిగించి, పొట్టవంటివాఁడును ధర్మవర్తనుఁడునగు భక్తుఁడగు పుత్రుని (పోతనను) రక్షింపుమని నారదుఁడు చమత్కారముగా తన యభిప్రాయమును శ్రీమన్నారాయణునకు ధ్వనిమార్గమున దెలిపినట్లయ్యెను. ఇట్లు చెప్పుట ఉత్తమ కవిత్వ లక్షణమని యాలంకారికుల మతము.

"బిడలగు ప్రాణుల బ్రదుకులు గడచుట లెట్లనుచుఁ బ్రకృతి కలకాలములన్
వడఁకున్, మదినుడుకున్, వెతఁదడుపున్ బాష్పాంబుధార ధారుణి నెల్లన్."
(ఆ_1_185)

ఈ పద్యమునకు గొంతపైన (183) 'ఈ యఖిలభూత సంతతిని రొమ్మునకుఁ గట్టి సాకుఁబ్రకృతి' యని చెప్పబడినది. తన పిల్లలగు ప్రాణులను ఎంతటి అనురాగముతో సాకునో దీనికిముందు (184) పద్యమున దెలుపబడినది. ఇఁక ఈ పద్యమునందు ఏ విధమున తన బిడ్డలగు ప్రాణుల సాకునో కవి తెలిపియున్నాఁడు. పద్యమునందలి మాటలనుబట్టి చూచిన బిడ్డలెట్లు బ్రదుకగలరోయని ప్రకృతి కలకాలమును వడఁకును, ఉడుకును, కన్నీటిఁతో ధారుణిని దడుపునని మాత్రము తెలియుచున్నది. కాని వడఁకుట మున్నగువానిచే బిడ్డలెట్లు బ్రదుకగలరు ? కావున ఇట వడఁకు మున్నగు పదములు శీత, గ్రీష్మ వర్షఋతు ధర్మములను ధ్వనింపజేయుచు వర్షాదులవలన భూమిని సస్యవంత మొనర్చి ప్రకృతి తన బిడ్డలయిన ప్రాణులను పోషించుననుట ధ్వనివిశేషము.

"సూర్యభగవాను వదనమ్ముఁ జూచినవ్వి, యాత్మనర్పించుకొనిన యీ యంబుజమును
ఖలుఁడు గజరాజు సింగమ్ము కరణివచ్చి తుంచి తలమోదు కొనునఁట తుచ్ఛబుద్ధి."
(ఆ_2_69)

సూర్యుఁడు కమలబాంధవుఁడు. అతని రాకచే కమలము వికసించును. మదగజము లట్టి పద్మములను తుంచి తలమోదుకొనుట (గజ) స్వభావముఁ కాని ఇది తుచ్ఛము. సామాన్యార్థము. కాని యిందింతకంటె విశేషముగా ఇనవంశమునం దవతరించిన భగవానుఁడగు రాముని దర్శించి, యతనికి మనసా అర్పితముచేసిన భాగవతమును ఖలుఁడగు సింగభూపాలుఁడు శిథిలావస్థకుదెచ్చి పాడుచేయ గలడను భవిష్యద్వాణి పై పోతన వాక్యమువలన ధ్వనించుచున్నది. దీని తర్వాతిదగు 70 వ పద్యమును నిట్టిదే. ఈ ఆశ్వాసమునందే పల్లె పడుచు మానభంగమునకు బ్రయత్నించిన యువక భూస్వామికి హితోపదేశముగా చెప్పిన (112_18) పద్యములును ఇట్టివే.

'పద్దుగ మేడలెక్కి కనుసైగ లొనర్చెడి మేఘు సంగతిన్
వద్దని సస్యకాంతతల వ్రాలిచె గర్భభరాల సొంగియై
వద్దననేని త్రాగి పయివచ్చిపడెన్ బ్రజనష్టమౌట తా
నద్దియెఱుంగఁ డెంతటి ఘనాహ్వయుఁడైనను ద్రాగుబోతనన్. (ఆ-3-138)

ఇందు ఈనుటకు సిద్ధముగానున్న వరియందు పూర్ణగర్భిణీ స్త్రీత్వమును, సముద్రజలములు త్రాగివచ్చిన మేఘునియందు త్రాగుబోతు గుణమును ఆరోపించి, ప్రజయను శ్లిష్టపదముచే అర్థద్వయకల్పనము అలంకార ధ్వనిరూపమున చమత్కారముగా కావించెను.

'మీలతో, నాఁచుపెనఁగు పద్మాలతోడఁ దడలు జడనల్లి సుడిగొని బుడగలెగయ
స్వర్ణ సౌందర్య దివ్యశోభాస్రవంతి పాఱునేఱులై సొంపారు పడతిమేన.'
(ఆ-3-177)

ఇందు పోతనకు అప్పుడే తటాకమున స్నానముచేసి ఆర్ద్ర వస్త్రములు దేహమునకు హత్తుకొన నిలచిన తన భార్యమేన స్వర్ణ సౌందర్యదివ్య శోభాస్రవంతి ఏఱులయి పాఱినట్లు గోచరించినట్లు కవి యిందు వ్యక్తంచెను. దీనివలన నామె శరీర లావణ్యము బంగారు చాయ గలదనియు, ఆమె కన్నులు మీలఁబోలుననియు, శిరోజములు శైవాల సదృశములనియు, ఆ పొంతనున్న మోము నాచతోఁబెనగు పద్మమువంటిదనియు, త్రివళులు జడలల్లు తడలవంటి వనియు, నాభి యా తడలవలన గలిగిన సుడివంటిదనియు, వక్షోజములు ఆ సుడినుండి పైకెగసిన బుడగలవంటి వనియు నిందు చమత్కారము. ఇది వస్తురూప ధ్వని కల్పనము.

'ప్రకట శరత్కలా విభవ భాసురమౌ ఋతుకాల మందునన్
బకపక నవ్వసాగెను విభావరి. తారకలీను మల్లికా
నికర వికీర్ణరమ్య శయనీయ సితాంబరసీమ వాయుడో
లికల, నిశాపతిన్‌గలిసి లీలఁజెలంగి సుఖాశఁదేలుచున్. (ఆ-3-193)

ఇందు ఋతుకాలమునందు కళలచేత పెంపొందుచున్న (కళాశాస్త్రమునందు స్త్రీలకు జెప్పబడు కళలు) చక్కగా నలంకరింపబడిన పూసెజ్జయందు వేచి తన్నుద్దేశించి వచ్చిన స్వనాథునితో సుఖముల దేలియాడు వాసక సజ్జికయను శృంగార నాయిక శృంగార క్రీడ యిందు ధ్వనితము.

'ఆ వనజాక్షి నూత్న ప్రణయాంకురముల్ వరరాగ వృష్టిలోఁ
దీవలుసాచి, యల్లుకొని, తీరగు పూవులుపూచి, కమ్మ నె
త్తావులు చిమ్మఁదేఁటులు సుధామధుమత్తత వ్రాలఁగా ఫల
శ్రీ విభవోన్ముఖమ్మయి చరించెను సౌఖ్యవసంత వీధులన్.' (ఆ-3-246)

దీని పై పద్యమునందును పోతన దంపతుల ప్రథమ సమాగమము వర్ణింపబడినది. ఈ పద్యమునందు ఆమె ప్రణయమెట్లు క్రమముగా ఫలోన్ముఖమయినది వర్ణింపబడినది. ఆమె యొక్క నూత్నప్రణయము వరునియొక్క అనురాగముచేత అభివృద్ధినొంది, ఆలింగనాదుల పడసి, వివిధ శృంగార భావములను ప్రకటించి, కమ్మని యనుభవములు ముమ్మరింప సుఖపారవశ్యమున కనీనికలు (చూపులు) దుముకులిడుచు నగుచుండ సంతాన ఫలశ్రీ విభవోన్ముఖమగు దాంపత్య సౌఖ్యముల ననుభవించెనని ధ్వని. ఈ పద్యమును జదివినంతనే ఈ క్రింది వసుచరిత్ర పద్యము తలంపునకు దట్టును.

'అనుపమ కాంతివైభవ సమన్వితు నా వసురాజుఁ గాంచు ప
ద్మిని సరసాంతరంగమున మించె వినూతనరాగ కందళం
బొనరె నఖండవాసనలు నుత్కలికల్ విలసిల్లె నల్లన
ల్లన నిగిడెం బ్రమోద తరళస్థితులై తమిఁజూపు తుమ్మెదల్' (ఆ-3-48)

కాని యిక్కడ చక్షుఃప్రీతిచే నుదయించిన గిరికాను రాగమును, సాత్త్వికాది భావములను ఇంకను రసస్థాయి నందుకొనలేదు. పోతన దాంపత్య సుఖవర్ణనమున ఫలోన్ముఖతయు వెంటనే చెప్పబడుటవలన వారు 'ప్రజాయై గృహమేధినాం' అను కోవకుచెందిన వారని తెలియును.

ఈ పోతనచరిత్ర యిట్లు ఉదాత్త కథా కల్పనతో, ఉత్తమ పాత్రపోషణౌచితితో, అపూర్వ వర్ణనా పౌష్కల్యముతో, అలంకార బాహుళ్యముతో, అనిదం పూర్వకావ్య సంప్రదాయ విశేషముతో, నాటకీయ రీతులతో, ప్రాచీనాధునాతన కవితా శిల్పముతో, ధ్వని వైభవముతో, శబ్దపుష్టి, అర్థపుష్టి, రసపుష్టి కెందును గొఱతరాని యకుంఠిత ధారతో బ్రబంధీకరింపబడినది.

ఆంధ్ర భాగవత కర్తయగు పోతన చరిత్రమగుటచే కాబోలు వీరు తచ్చరిత్రమును గూడ పండ్రెండాశ్వాసముల మహా ప్రబంధముగా నిబంధించిరి. ప్రాచీనాంధ్ర ప్రబంధములలో నన్నెచోడుని కుమార సంభవమొక్కటి దక్క ద్వాదశాశ్వాస విస్తృతిగలది వేఱొకటి యున్నట్లు తోపదు. కుమార సంభవమునందలి పద్య గద్యసంఖ్య మొత్తము 2006. ఇతరములగు శ్రీనాథకృతులేమి, అష్టదిగ్గజాదుల ప్రబంధములేమి? విస్తృతిలో కుమారసంభవముకంటెను చిన్నవి. పోతన చరిత్రమునందలి పద్య గద్యసంఖ్య 3333 ప్రాచీన కావ్యములే పెద్దవని సాధారణముగ తలంచు కాలమున శ్రీ వరదాచార్య కవివరు లింతపెద్ద కావ్యమును వ్రాయ తలపెట్టి, భాగవత రచనమున పోతనకువలెనే సంభవించిన యిక్కట్టుల నెట్టులో దైవ, మిత్రాది సహాయమున దట్టుకొని, పట్టువిడక తుట్టతుదివఱకు నేకధారతో రచించి ముగించుటయు, దానిని పోతనవలెనే శ్రీరామార్పణ మొనర్చుటయు మిగుల ప్రశంసనీయము. ఈ కావ్యరచనమును వీరు దాదాపు పదేండ్లక్రిందనే పూర్తిచేసినను, ఇది యిప్ప

టికి ముద్రిణకు నోచుకొనుటయును భాగ్యమే. కీర్తికాంక్షగల శ్రీనాథకవి సార్వభౌమునో మఱెవరినో కథానాయకునిగా గ్రిహింపక ఈ కవి అకీర్తికాముఁడయి రాజులనే తెఱచి రాజ విన కీర్తికాయుఁడయిన భక్తపోతనను బమ్మెరనుండి బలవంతముగలాగి రానన రచ్చ కెక్కింపదలచుటయు నీ కాల విలంబమున నొక కారణముగా నోపును। కాని యిది రాజా హ్వానముగాక కవికలపు స్వాగతము గావున కాదనలేక నెమ్మదిగ కదలివచ్చి కావ్యమునకు ప్రాణప్రతిష్ఠ కావింపక తప్పినదికాదు। ఎట్లయిననేమి? పోతనకు ఒక్క శ్రీరాముని కటాక్ష మందమై కాపాడినది. శ్రీ ఆచార్యులవారికిని శ్రీ దాశరథి, రామకృష్ణ నారాయణరెడ్డి రావుల అండదండ యిప్పటికి లభించుటచే నిది గండమును గడచి యిప్పటికిట్లు కన్నుల పండువుగా చెన్నారెడి భాగ్యమునకు నోచినది. ఇదియే పదివేలు। సవతితల్లి బాసచేతులలో పుట్టి పెరిగియు స్వకీయ భాషామతల్లికి ఒక మహా కవికుమారుఁడు భక్తితో సమర్పించు బంగారు మొల్లలహార మీ కావ్యరాజము. ఆంధ్రి సరస్వతికిది మంగళ నీరాజనము। కవితా లోకమున కొక వన్నెల వల్లకి. భాగవత కర్తకొక పచ్చల పల్లకి.

ఈ కవి నిరాడంబరుఁడు, నిరహంకారి, నిష్కపటి, విశేష వినయశీలి, వాగీశ్వరీ వరప్రసాదితుఁడు.

'చదివినవానివోలె గురుసాహసినైచు మహా ప్రబంధ మిం
పొదవఁగ వ్రాయఁబూనితిని 'ఓ'యన 'నా'యన 'రాదు' గాని త్వ
త్పద కమలాశ్రితుండ, రసభావ పదార్థ మహా కవిత్వ సం
పదల నొసంగి యేలవె కృపామతి, జ్ఞానరతీ సరస్వతీ!, (పీఠిక. 7)

అను పద్యమే పై గుణములకు తార్కాణ.

కృత్యాదిలోని పూర్వకవిస్తుతిలో నీకవి వ్యాస వాల్మీక కాళిదాసాదులను, ప్రాచీ నాంధ్రి కవులలో నన్నయాదుల పలువురను మరియు నాధునిక కవులలో వీరేశలింగ తిరుపతి వేంకటేశ్వర విశ్వనాథ సత్యనారాయణ కవిరాట్టులను, నవ్య కవులలో రాయప్రోలు శివశంకరాదులను, అభ్యుదయ కవులలో గురిజాడ, శ్రీశ్రీ, ఆరుద్రి, దాశరథి, నారాయణ కాళోజీలను మఱియు తెలంగాణ కవులలో దనకు దెలిసినవారిని, కన్న, విన్నవారి నందఱను నమ్రితతో పేరు పేరున స్తుతించియున్నాడు.

ఇంతేగాదు. '...ఇతర పూర్వకవి సంభావనంబు గావించి, వర్తమాన కవులకుం బ్రియంబుఁ జలికి భావికవుల బహూకరించి' యను పోతన మార్గము ననుసరించి,

మరచినట్టి సత్కవులకు మదికొకింత గుఱుతులేని సత్కవులకు కొంచెమింక
చిఱుతలైన సత్కవులకు ధరణిబుట్టు వొందవోవు సత్కవులకు వందనములు.

పుట్టని కవులకును వందన మొనరించినాఁడు.

పోతన కుకవి నిందచేయలేదు. కాని యీ విషయమున ఈ కవి పోతనకంటె నొక యడుగు ముందు కేగి

'అర్హతయెలేక యిటుల మహాప్రబంధ నిర్మితినొనర్చ చపలునినే౼ జెలంగ
నొకరి ననవేల యాత౼డు కుకవియనుచు ? అకట నాదు సాహసకృతికొక నమస్సు.'

ఆ బిరుదమును తనకే తగిలించుకున్నా౼డు. కుకవినింద నిట్లు చేసినకవి 'నభూతో నభవిష్యతి' వినయ సంపదకిది తుదిమెట్టు.

రెండు ప్రయోజనముల నుద్దేశించి యీ కావ్యమును రచించినట్లు కవి వాక్యమువలన స్పష్టమగుచున్నది.

'అక్షరపద సంపదకై యక్షరపదముల వెలుంగు నవ్యయ కవితా
లక్షణ లక్ష్యైకృతుల ముముక్షువు గతి౼గొల్చి వ్రాయ౼బూనెద సుకృతిన్.'
(పీఠిక. 14)

ఇది 'శ్రీ కైవల్య పదంబు౼ జేరుటకునై జింతించెదన్', 'పలికిన భవహర మగునట పలికెద...' అను పోతనగారి ఉద్దేశమువంటిది. ఈ మోక్షాపేక్ష అను ప్రయోజనము కవికి మాత్రము చెందినది.

"చిన్ననటంచు నెంచకయె సిగ్గొక యించుకలేక భక్త పో
తన్ననుగూడి భాగవత తత్త్వము౼బాడ గళమ్ము విప్పితిన్
నన్నిక౼ దిట్టిపొందు కరుణంగని దీవెనలిండు, నాల్గు కో
ట్లన్నల మంగళార్థమయి యాంధ్ర పదాల నివాళి పట్టితిన్." పీఠిక. 10)

ఇది రెండవ ప్రయోజనము. ఇది నాల్గుకోట్ల ఆంధ్ర జనానీకమునకు సంబంధించినది. సకలాంధ్ర సోదరుల మంగళార్థమయి భాగవత తత్త్వమును మేళవించి పాడిన దివ్య ప్రబంధ మీ పోతనచరిత్రము. కావున నిది సకలాంధ్ర రసికలోకపు మన్ననల నంది పుచ్చుకొనగలదనుట నిస్సందేహము. 'పోతనార్యు౼ డాంధ్ర భాగవతమును రచించి శ్రీరామ పాద సన్నిధి నుంచినట్లే వీరును 'పోతనచరిత్రము'ను రచించి శ్రీరామ పాదసన్నిధినే సమర్పించిరి. 'వరద హస్తమ్ములో౼బుట్టి పెరిగి తిరిగి లేచి'వచ్చిన కర్మయోగియగు కర్షక సత్కవి వృత్తమను 'రవ్వల హారమందు౼ గృతిరమ్యత చాలమివిల్వ' తగ్గదనియు, రంధ్ర సమన్వితమగు తేనెపెరను నీరసమని ప్రాజ్ఞులు త్రోసిపుచ్చునటులే 'రసమయ కావ్య దివ్య సుమరాజమునం దొసగుల్ ప్రమాదతన్ మసలిన౼ దత్ప్రబంధమును మాన్యులు మెచ్చక' యుండరనియు నీ కవివరుని విశ్వాసము. తథాస్తు !!

శ్రీ వరదాచార్యులును నేనును బాల్యమున నొకకంచమున దిని యొకమంచమున బరుండితిమి, ఒక గ్రంథమున జదివితిమి, ఒక్కయాట ఆడితిమి, ఒక్కచోట పాడితిమి, ఒకే

నాటకమున వేసములను వేసితిమి, గుట్ట లెక్కితిమి, చెట్లుదిగితిమి. అవి చిన్ననాటి దినములు. అట్టివి తిరిగిరావు ! ఉద్యోగవశమున నెవరికి వారయితిమి. ఐనను మా మడికొండ వారల యన్నదమ్ముల సరాగము లెప్పటికిని వరదన్న, దుర్గన్న, కాళన్న (కాళోజి), రామన్న యనియే. ఈ చిరస్నేహ సంబంధమును శాశ్వతబంధ మొనరించుటకే తమ 'ఆహ్వాన'మను గేయకావ్యమునకు వలెనే, ఈ 'పోతనచరిత్ర' మహాకావ్యమునకును పరిచయ వాక్యములు వ్రాయుమని వారు కోరుటయు శక్యాశక్యములు విచారింపక నేను 'ఊఁ' యనుటయు జరిగినది. నిజమున కీ మహాకావ్యమునుగూర్చి ముచ్చటించుటకు నావంటివాఁడు చాలఁడు. ఐన నీ వాక్చాపల్యమునకు మా స్నేహదోషమేకాక యీ కావ్య గుణసంపదయు నొక హేతువేఁ యన వచ్చును ఇది యెట్టిదయినను మఱల నొకమారు మే మిరువురమును జిన్ననాటివలె దేహరూపమున గాకున్నను నామరూపముననైనను, వాస్తవ జగత్తున గాకున్న కావ్యజగత్తు నందైనను విడిపోని విధమున గలసియుండుట కేర్పడిన ఈ యవకాశమును అదృష్టముగ నేను భావించుచున్నాను.

డా. పల్లా దుర్గయ్య (రీడర్)
తెలుఁగు శాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయము

నారాయణగూడ
హైదరాబాద్

# చిత్రమయకావ్యము

శ్రీమాన్ వరదాచార్యులవారి పోతన కావ్యము చిత్రమయము. కావ్యము చిత్రమయముగానిచోఁ గన్నులగట్టినట్లుండదు. మహాకావ్యము లన్నియు చిత్రమయములే, చిత్రమయములనగా శబ్దదృశ్యమయములు, దృశ్యములు ద్వైమానములైనచో (Two Dimenviona!) చిత్రము లనబడును.

చిత్రములు ప్రత్యక్షములు. కావ్యచిత్రములు శ్రవణేంద్రియముద్వారా హృద్భాసితములు. భావగోచరములు. "కన్గవకును నద్దమెట్లటులు గ్రంథ చమత్కృతినేర్పు పెంపునన్ బ్రవిమల వస్తుతత్వమును భాసిలఁజేయుచె"యని నట్లు కావ్యము కనులగట్టినట్లు కనుల గట్టిన చిత్రములు పలుకుచున్నట్లు సృష్టించినచో, వాని ప్రతిభ, ఔన్నత్యము ఇనుమడించి ఆబాల గోపాలమునకు నందుబాటులోనుండి యానంద పారవశ్యమును గల్గించగలవు. పోతన కావ్యములో నీ లక్షణములన్నియుగలవు.

రామాయణ మహాభారత భాగవతములోని కథలన్నియు, తత్వబోధనార్థమై, వాస్తవిక, అతివాస్తవిక, పాత్రలు, దృశ్యములు, గల్పింపబడి ఆబాల గోపాలమునకు నందుబాటులో నుండునట్లు సృష్టింపబడిన చిత్రసంపుటాలని భావించుచున్నాను. కాళిదాసుచే రచింపబడిన శాకుంతలములో ననేక దృశ్యములు సవివరముగా కన్నుల గట్టునట్లున్నవి. ప్రకృతి దృశ్యములోని వివరములు (Details) ఎక్కడ యేయే చెట్లున్నవి; ఏ యే పుష్పము లొప్పుచున్నవి; పృష్ఠభూమి (Back ground) మృగశాబకము లెచ్చట నేమిచేయుచున్నవి; భయ కంపిత స్వరూపముతో పరువిడు కృష్ణసారంగము (Buck) పరువులు భంగిమలు, దాని నోటినుండి గాలిలో నెగురుచున్న నవతృణాలు, దారిలో సగము కొఱుక మిగిలిన దర్భల పతనము, చెట్ల తొఱటలనుండి శిలా ఫలకములపై పక్షుల ముక్కులనుండి పడుచున్న ధాన్యపుపొట్టు మొదలగునవి చిత్రింపబడినవంటే కాళిదాసు ప్రకృతిని పరిసరాలను ఎంత సూక్ష్మముగా పరిశీలించి, ఆనందానుభూతినిపొంది వ్రాసిన చిత్రకారుడోయను నూహపొడమును.

శ్రీ వరదాచార్యులవారి ప్రస్తుత పోతనకావ్యములో నిట్టి దృశ్యములు కొల్లలుగా గోచరించును. కాని ఇవి ఆశ్రమ పరిసరాలుకావు. కథానాయకుడగు పోతన కాశ్రమములైన పల్లెపట్టులు. అందలి పెంకుటిండ్లు, పూరిగుడిసెలు, గుడిసె కొప్పులపై గుమ్మళ్ళు ముంగిళ్ళ ముగ్గులు, ముంగాళ్ళపైలేచి దళ్ళపైబ్రాకు తీగలలాగు మేకలు, కుటి శిఖాగ్రములనెక్కి కుంపటివలెనున్న కూయుచున్న కుక్కుట రాజములు. ఈ చిత్రములు చైనా జాపానులోని చెయితిరిగిన చిత్రకారులు బ్రహ్మాండముగా తీర్చిదిద్దిన బ్రష్ డ్రాయింగ్‌లవలె కనుపండువౌనర్పుననుట లతిశయోక్తికాదు. (ద్వితీయాశ్వాసము పద్యము 12)

"క్రిక్కిరిసియున్న పొదుగున నొక్కుమ్మడి తలనుగుచ్చి యొగి కర్ణములుం
జక్కని వాలమునిక్కిడి గ్రుక్కనమేన్సాచి చన్నుగుడిచెడి లేగల్"

(ద్వితీయాశ్వాసము 11 వ పద్యం)

"కట్టపిఱుందాని కంబళిముసుగుతో నీ రెండగాగ్రుచు నిల్చుగొల్ల
..................దురదవోద్రాటి మాగ్రుకుల నొరయుగేదె"

మొదలగు ననేక దృశ్యాలు శ్రీ నందలాల్ బోస్‌గారి కార్డుస్కెచ్ (Card Sketches) లను జ్ఞాపకం చేయుచున్నవి. ఇక (Land Scapes) దృశ్యాలు. ఇవి కావ్య మంతటా నిండియున్నవనిన నేమాత్రము అతిశయోక్తి కాజాలదు. వీనిలో గోదావరీ వర్ణన టర్నర్ (Turner) వేస్తునదీ చిత్రిలను మరపింపజేయుచున్నది. 5 వ ఆశ్వాసము పద్య (20-21-45) సంఖ్యల లోనివి

"పారెన్ బక్షుల తోరణమ్మది నభోభాగాన గోదావరీ నీరాంతః ప్రతిబింబి తమ్మయి
......సువర్ణ శోభల.........ఎండపొడ నర్తించున్ దుమ్రాగ్రమ్ములన్"

ఇందులో నెండపొడ నర్తించు చెట్లకొమ్మలపై బడిన నారింజకిరణ వర్ణము వెంటనే దృగ్గోచర మగునట్లు చిత్రించినాడు. ఈతనిని కవి యనవలెనో లేక గొప్ప చిత్రకారు డనవలెనో తోచదు. వరదాచార్యులవారి హృదయమే గోదావరి. దానిలో నీ గోదావరి యామూలాగ్రముగా ప్రతిబింబితమ్మయినది. (ఆ. 5ప. 17 నుండి 21 వరకు)గల పద్య ముల జదివిన నీ మహాకవి హృదయ ప్రపంచములో ఇంకను బహిర్గతములుగాని మహానదు లెన్ని ప్రవహించుచున్నవో నే నూహింపజాలకున్నాను.

పోతన కావ్యములో ప్రతిబింబ దృశ్యాల వర్ణన చాలా అమోఘముగా గోచరించు చున్నది. మచ్చునకు తృతీయాశ్వాసమునందలి (145-146) పద్యముల తిలకింపుడు. కురిసి కురిసి యాగిన వర్షముచే నాకాశమంతయు మైలగడిగిన ముకురముమాడ్కి గనుపించునట, వర్షము కురియుటచే మడుగులందలి జలము పగిలిన యద్దపు ముక్కలభాతి భాసిల్లి, యట్టి శుభ్రాకాశమును ప్రతిబింబింప జేయుచున్నదట. అట్లే (3 ఆ 154 ప)లో పోతన భార్య వర్షములో తడిసినది. అమె చీర యా సుందరగాత్ర వల్లిపై నద్దిన యట్లొప్పినది. లోనున్న అంగసౌష్ఠవము అద్దముచాటుననున్న చిత్రపటములాగున్నది. సన్నని చీరమాటున్న ఆమె యొడలు అర్ధనగ్న చిత్రము (Seminude) ఒకానొక సుప్రసిద్ధ యూరోపియన్ మాస్టర్ పీస్ నగ్నచిత్రము (Nude paint Ding)ను గుర్తుకు దెచ్చుచున్నది. శ్రీ ఆచార్యులవా రిచ్చట చీరచాటువనే యర్ధనగ్న మొనర్చుట, భారతీయ నైతిక సంప్రదాయమును, (Aesthetic sense) సౌందర్యదృష్టిని జాటుచున్నది. (A bathing lady) యను చిత్రము కన్నను ఏది సహజ సన్నివేశములో నర్ధనగ్నమైనది. అర్ధనగ్నత్వము, మన చిత్ర శిల్ప

సంప్రదాయములో విరివిగా గలదు. ఎల్లోరా అజంతాలోని మానవుల దేవతల శిల్ప చిత్రాలన్ని యీ విధముగానే యున్నవి.

ఈ కావ్యములో శృంగార ఘట్టము లనేకములు గలవు. వానిలో నొకటగు కపోత మిథున వర్ణనము (3 వ ఆశ్వాసము 166 ప)లో నిది సహజ సుందరమై సజీవమైయున్నది. (4 వ, ఆ, 24. 25 పద్యములు) పుష్పలావికా వర్ణనమొక మధురమైన శృంగార ఘట్టము. దీనిని చిత్రించినచో నిది యొక రమ్యాతి రమ్యమైన (Composition) చిత్రమై రూపొంద గలదు. ప్రౌఢయైన ఆ పుష్పలావిక వర్ణనములో, "విందగు యౌవనమ్ము" అవగానే ఎత్తైన నారంగ ఫలములవంటి వక్షోజములు, "సిగయందు నమర్చిన పూసరము" అనినంత తలకు రెండింతలయెత్తుగల నల్లని నిగనిగలాడు సిగ దానిలో చంద్రవంకవలె నమర్చబడిన పూమాల పుల్లగల్లపుట భూషణమై వెలువారుచు స్మితపుష్ప సుగంధితమైన విడెమ్ముతో నిగ్గగు బుగ్గల కెంపు వర్ణములు, మొల్లమాలలనల్లి దాడిమ ఫలాలగిల్లి చిరునగవులు చలువ కలువ పూరేకులజల్లు వీక్షణములుగాంచిన, లేపాక్షికుడ్య చిత్రములోని మీనాక్షుల చపలవీక్షణములు పలకము తైముల సరములవంటి పలువరుసలు చిత్రముదాల్చి దృష్టిగోచరమై యొప్పును. చిత్రకళలో భావప్రకటనమునకును, ఊహలకు స్వప్న సాక్షాత్కారమగు దృశ్యాలకు అనుకూలమైనది అతివాస్తవికత (Sur Realism) అత్యంత ఉపకారకముగా నుండును. శ్రీ వరదాచార్యులవారి ప్రస్తుత కావ్యములో ఈ అతివాస్తవికత అనేక భంగిములలో గోచరించును. ఉదాహరణమునకు (1 ఆ. 167-168 ప) మామిడిచెట్టు వర్ణనము తిలకింపుడు. రసాలమును మనోజ్ఞగతి నొక యొంటిస్తంభపు మేడజేసి, ఆ మేడపై కులుకాడు రామచిలుకలను రమ్యమగు నాట్యమొనర్చు రంభలుగా నొనర్చి కుహూయని కలధ్వనులొనర్చు కోయిలలను దేవగాయకులుగా దిద్దితీర్చి, భ్రమర ఝుంకృతులకు కిన్నెరశ్రుతుల రూపమిచ్చి, ఒక దివ్యగాన సభాకృతిగా సృష్టించినాడీ కవి. ఈ పద్యచిత్రములో వాస్తవతకు ఊహల జోడించి, రూపసామ్యతలు, వర్ణసామ్యతలు జతగూర్చి సాదృశ్యమును సాధించి ఒక సౌందర్య రాశియైన స్వర్లోక సౌధరాజమును భూలోకమునకుదించి భూలోక వస్తువులను ప్రాణులను దేవతలుగా కైలాస వాసులుగా రూపొందించి రసాలయమునకు ప్రాణప్రతిష్ఠ గావించి గొప్పస్థపతిగా గానుపించుచున్నారీ చిత్రనిర్మాణ కౌశలమున శ్రీ వరదాచార్యులవారు. (2 ఆ. 156, నుండి 158) పద్యములలో కచ్చడమునకుగట్టిన గిత్తలను వర్ణించినారు. ఆనందీశ్వరుల ఆస్యములే హరునిపేరురముగా నందలి పనత్రాళ్లే ఫణులుగా పెనగులాడుచున్నవి. వెండితొడవులుగల శృంగము లందాలశశి మౌళి నచ్చుబోయుచున్నవి. మూపున గునిసియాడు కకుదమ్ము లింగాకృతివెల్గ హరవాహనత్వ మన్వర్థపడు చున్నది. మెడలో వేల్రాడు గంగడోలు శివచీర కుచ్చెళ్ళ ననుకరించుచున్నది. గమనమొనరించు హిమవన్నగమ్ములనగ నా బసవయ్యలను సవర్చి శివుని, శివునిలో నందీశ్వరుని, నందీశ్వరునిలో హిమవంతుని కైలాసమును అతివాస్తవిక రూపములో ప్రత్యక్ష పరచినారు. దీనిలోనే 158 వ పద్యమును తిలకింపుడు.

"చకచక గిత్తల కదముకు త్రికిట, ధికిట, ధకిట, ధా, మృదంగధ్వని టక్,
టికు, మనుకేదారాహతి, నికట తటిని శకట మొకటి నిల్చిన యంతన్"

ఈ పద్యములోని లయగతి చక్కని శబ్ద చిత్రమును స్ఫురింపజేయును. ఇది ప్రధానముగా శబ్దచిత్రమేయైనను, ఈ లయ, గిత్తల కదముల వేగము పదభంగిమములు, తకిట, ధాం...యనుచోట బాటనున్న పలుగుఱాయి బండి చక్రముక్రిందపడి నలిగి ధడాలుమనిన శబ్ద దృశ్యము కనుల గట్టినట్లుండి ఆ యొరపిడికి గిత్తల బొత్తలు అటునిటు కదలుచున్న ట్లొకసారి గానిపించును. ఈ కదలికలను (Movement) తీసికొని దానికి తగిన లయగతి రేఖలతో నొక యుత్తమ రేఖా చిత్రాన్ని సృష్టింప వచ్చును.

వరదాచార్యులవారి మేఘవర్ణనలు, శరచ్చంద్రికా వర్ణనలు బహు ముఖప్రజ్ఞా ప్రాభవాలతో సాగినవి వీనిలో మచ్చునకు, చిత్ర పరిమితమైన శరచ్చంద్రికా వర్ణనమును చిత్తగింపుడు. (111 ఆ 192 ప)లోని శరచ్చంద్రికలు సునిశిత హృదయ ఫలకాలపై పూల వర్షము గురిపించి యుల్లము జల్లుమనున ట్లొనర్చును. ఈ వెన్నెల చిత్రములో నిమ్నోన్నతము(Contrasts)లుండవు. ఈదృశ్యములో వర్ణవైవిధ్యముగాని, గురుతర చ్ఛాయాభేదములు గాని యుండవు. కావున నివి యందరికి నానందయోగ్యములుకావు. ప్రపంచములోని యుత్తమ చిత్రాలలో మనకీ విషయము తరచుగా నగుపడదు. కాని ఒకానొక జాపాను చిత్రకారుడు Moon light ను, నలుపు తెలుపులో నత్యంత మనోహరముగా చిత్రించినాడు. ఇది ప్రపంచములోని యుత్తమ చిత్రాలలో నెన్నికైనది. దీనిలోని సౌందర్యమంతయు నలుపు తెలుపు ఛాయలలోని సూక్ష్మ వ్యత్యాసముల జోడింపు(Combination) మాత్రమే. అవి యే చిత్రకారుడు సరియైన పాళములలో (Proportions) సృష్టించగలడో వాని చిత్ర ముత్తమమైనదిగా నగును. ప్రపంచ ప్రఖ్యాతకవులు, వాగ్గేయకారులు, చిత్రకారులు చంద్రికా వర్ణనము చేయుటకు పాట్లుపడినారు. వీరిలో నేకొందరో సాఫల్యము చెందినారు. వరదాచార్యులవారు వర్ణించిన వెన్నెల వర్ణనములోని ఈ భావము మహోన్నత పథములనడచి మకుటాయమానమై ప్రపంచము మెప్పుగాంచిన చంద్రికా వర్ణనమునకు నొక నూలుపోగును సమర్పించినది. దాని నీ క్రింది పద్యమున తిలకింపుడు. (111 ఆ. 192 ప)

"వెలగుండియలబండి వెలయేటి యెలబోటి...............
కళలీను నెలతేని చలువ వెన్నెల లతల్ భూరుహచ్ఛాయల పూలుబూయు

ఈ పద్యభాగంలో ఆకాశవీధుల్లో నలముకొను వెన్నెల తీగెలతో, భూమాత పాద పచ్ఛాయా పదముల పూలపూజ నొనర్పగై సేసినారు. భూరుహచ్ఛాయలలోని పుష్పాల పోల్కి చంద్రికలు ప్రిదులుచున్న చిత్రము ఒకానొక (All over pattern) ఆక్రమ పరివ్యాప్తాలంకరణమును జ్ఞప్తికి దెచ్చును. ఈ అలంకరణము ఆధునిక తివాచీల డిజైన్లపై

ముఖ్యముగా అమెరికా, ఫ్రాన్సు, మొదలగు యూరోపియన్ దేశాలలో జాపాన్ దేశములో విరివిగా నగుపించును.

ఈ కావ్యరాజములో రూప, వర్ణ, సాదృశ్యము లనేకములు గలవు. 1 ఆ. 167 వ పద్యములో రసాల వృక్షశాఖల నర్తించు చిలుకల తలలను శలాటువులతో, (కాయలు) నీకల నాకులతో ముక్కుల చిగురురిక్కలతోఁ బోల్చి రూప, వర్ణసామ్యతను ప్రశంసనీయముగా సిద్ధింప జేసినారు. అందులో చిలుకలు రసాలములోనభిన్నమై సారూప్యసిద్ధి నందెను.

మరొక పద్యములో "మోటదోలు చొకింత మ్రొగ్గి దండెడతంత్రి శ్రుతిజేసి పాడెడి చోరకాపు" అన్నారు, దండెడతంత్రి తంబుర తీగెలను మోటబొక్కెన తుంబీఫలమునుబోలి గిరకచప్పుడు శ్రుతిగా చక్కని సాదృశ్యమును గల్గియున్నది. (2 ఆ. 6 ప)లో "పాత్రిం నుప్పొంగు పాలధారలతోడఁ బ్రాగ్దిశన్ వెలుతురుల్ బ్రాకి కొనియె" దీనిలో నంధకార బంధురమైనపాత్రి గర్భములో నిండుచున్నపాలు బ్రహ్మాండ భాండములోని ప్రాగ్దిశన ప్రాకు చున్న వెల్తురుల ధవళిమలకు ముద్దొసంగు వర్ణసామ్యతను చేకూర్చి స్థూలసూక్ష్మ విభేదాల విడదీసియు సమైక్యతను సాధించినది. (1 ఆ. 55 ప)లో అక్షర పదములోని ప్రథమాక్షర మైన 'అ' శేషశాయి చిత్రపటమును, 'క్ష' కారములో బ్రహ్మరూపమును, 'ర' కారములో రుద్రరూప, చిత్రాలను దర్శించి వర్ణించిన వర్ణన కడుంగడు వినూత్నమై ఎనలేని సామ్య మును రూపించుచున్నది. 'అ' కారములోని అడ్డగీత శయనించిన విష్ణువునకు సంకేతముగా మరియు 'అ'లోని మొదటి వక్రము విష్ణువునకు నీడనొసంగ వంగిన శేషుని శిరాలను 'అ'లోని చివరి వక్రమును విష్ణువు పాదములఁగొల్చు లక్ష్మిరూపముగను కన్నులకు గట్టునట్లు స్ఫురింపజేసినారు. 'క్ష' కారములోని 'క' బ్రహ్మరూపముగాను, 'ு' 'క' క్రింది ష కారము కమలముగాను ష కారములోనిగీత కాడగను, స్ఫురింపజేయుచు వర్ణించుట కడు సహజమైన దిగా గనుపించును. 'ర' కారములోని సున్న (౦) లింగాకారముగను తలకట్టు '✓' తలపై నున్న నెలవంకగను రుద్రుని యాకృతిని పోలియున్నది. ఇట్లు, ఈ అక్షర శబ్దములోని మూడక్షరములలో అక్షరాల ముమ్మూర్తులు సాక్షాత్కరించుచున్నారు. అందును. అ, కారము విష్ణుపరముగ, క, కారము బ్రహ్మపరముగను, ర, కారము రుద్రపరముగను అర్థము నిచ్చుటఁజూడ, శ్రీ వరదాచార్యులవారి నిశితమైన సూక్ష్మదృష్టికి త్రిమూర్తులు తెలుగక్షరము లలోనే దర్శన మిచ్చినారు. "కవిః క్రాంత దర్శీ" యనినట్లు దివ్యదృష్టికి కనబడని లోబడని దేవతలు లేరుగదా! తెలుగులిపి చిత్రలిపియని నిరూపించుటకు ఇది చక్కని యుదాహరణమై యొప్పుచున్నది.

పోతన కావ్యములో బమ్మెరగ్రామ వర్ణనము రాచకొండ నగరవర్ణనము కండ్ల గట్టు నట్లు చిత్రించినారు. (1 ఆ. 82-86 వ)లోని గ్రామవర్ణనము ప్రత్యక్షముగా ననుభూతి నొంది వ్రాసినట్లే పద్యములే నిదర్శనములు. ఇది ఒక చక్కని కాంపోజిషన్‌గా వేయ నను వగు దృశ్యచిత్రము. బరువుచే కృంగిన పెంకుటిళ్ళు, వాని దాపున మౌనులవోలె గడ్డి

యిండ్లు వెలయుచున్నవట. మౌని యనగానే తెల్లని జటాజూటములు జ్ఞప్తికివచ్చి గడ్డి కప్పులు జటాజూటములను బోలినట్లుండును. యింటికిముందు మట్టిగోడలకు రెండు గవాక్షములు నేత్రములవలె కనుపించును. ఇట్టి పెంకుటిండ్లను గుడిసెలను రాగ, విరాగముల దెలుపుటకు యుక్తమైన చిహ్నములుగా చిత్రించి కావ్యకథా స్వరూపమును సూక్ష్మీకరించి భవిష్యత్ కథాకల్పనా ఫలితపుజోస్యమును జెప్పుచున్నారు. 83 వ పద్యములో సున్నముతో చిత్రింపబడిన, అలంకారచిత్రములు ముగ్గులు, చిలుకలు, పొన్నలు, చంద్రవంకలు, లతా చిత్రములు, పల్లెపట్టులప్రవృద్ధినందిన చక్కని జానపదకళను స్ఫురింపజేయును. తిన్నెలు ఓడికలతో వాకిళ్ళు పచ్చని బంతిపూలతో, గుమ్మడులు ఇండ్ల కొప్పులపై ప్రాకి పూచి బంగారు కొప్పుబిళ్ళలవలె శోభించుచున్నవట. ఇది తెలుగు దేశములోని పల్లెలందు బీదకుటుంబములు వసించు ఇంటి రూపచిత్రణము. (Portraiture) ఇదే ఆశ్వాసంలో 83 నుండి 87 పద్యములలో గ్రామ చిత్రణానంతరము గ్రామ పరిసరాలు వర్ణింపబడినవి. బంగారు గొలుసుల బరువుల మెడ వంచు వరిచేలు, ముత్యాల చెంగల్తి మురిపించు జొన్నచేలు, వెండికొండల పండించు ప్రత్తిచేలు, కవల పిల్లలను చంకనెత్తుకొనినట్లున్న మొక్కచేలు, ఈ విధముగా పల్లెటూరు సౌభాగ్యమునకు, పెరళ్ళలో, చేలలో, రూపురేఖలు దిద్దినారు. 85వ పద్యములో కుంపటివంటి కోడిపుంజు కుటిశిఖాగ్రమునెక్కి కూయుచున్నటులు, పిల్లలకోడి ఎరువుకుప్పల పురువుల దోడుచున్నట్లు, ముంగాళ్ళపై లేచి ప్రాకు తీవలలాగు మేకలున్నట్లు, కుంచితగతి కుంచెతో చిత్రాలు దీసినట్లు, చీనా, జాపాన్ చిత్రకళా వేత్తలు బ్రష్ డ్రాయింగులను స్మరణకు దెచ్చినారు.

కుడితి గోలెముచక్కి గోష్ఠములలో పడుకొని నెమరువేయుచున్న పాడియావు, నిశ్చింతతో విశ్రాంతిగొను శాంతిసుఖ జీవనమునకు మహోన్నత రూపకల్పన, ప్రపంచ శాంతిధ్వజముపై పరమోత్కృష్ట చిహ్నముగా నెన్నుకొనదగిన రూపకల్పనమీ పాడియావు. స్వర్గీయ నందలాల్ బోస్‌గారు, ఇట్టి రసవత్తరమైనకార్డు చిత్రాలు అనేకము వేసినారు. అట్లే శ్రీ వరదాచార్యులవారి కావ్యములో నీ కార్డు చిత్రాలు వందలాదిగ గలవు.

వావిలో పచ్చ మఖమలు పట్టు తివాచీవలెనున్న వరిపొలాల యొడ్లలో దొరపిల్లం తీవితో మల్లెపూవులవంటి తెల్లవస్త్రములదాల్చి ఒయ్యారమొల్కు నడకల నొప్పుచున్న కొంగల రూపకల్పన మధురితావహము. తెల్లని కొంగల తెల్లరంగు మచ్చలవెనుక పచ్చని పచ్చిక వర్ణలేపనము చిత్రకళలో ఛాయావాదము (Impressionism)ను జ్ఞప్తికి దెచ్చుచున్నది. పంచమాశ్వాసములోని 19 పద్యములో నీటిపక్షుల విలాసమును. ఇసుక తిన్నెలలోని తుంగ గుంపులలో (4 ఆ 127 వ పద్యము)లోని కాసారములోని తరంగ మాలికలనుయ్యెలలూగుచువచ్చి గర్భిణీస్త్రీలవలె నడయాడు బాతుల చిత్రాలు మిక్కిలి రమణీయముగా చిత్రించినారు. ఇట్టి చిత్రరాజములు మనకు ప్రసిద్ధ చీనా, జపాన్ చిత్రాలలో విరివిగా గానిపించును.

అలాగే (9 ఆ 158 పద్యము)లో పరువులుదీయు తురంగవర్ణన గనబడును. అది పరువిడెడి భంగిమలు దాని జూలు, వాలము, కర్ణములు మొదలగువాని విలాసములు, గుఱ్ఱముల చిత్రములు వేయుటలో ప్రపంచ ప్రఖ్యాతి వహించిన సుప్రసిద్ధ చైనా చిత్రకారుడగు జూపియాన్ చిత్రములలో గాంచనగును. మృగపక్షి పశుగణ స్వభావ భంగిమల కనుల గట్టునట్లు చిత్రించుటలో గీతలలో సుప్రసిద్ధ చైనా జాపాన్ చిత్రకారులవలె కైతలలో కాళిదాస, భవభూతులు చిత్రించుట గనబడును. తిరిగి అట్టి సిద్ధహస్తత భావింప శ్రీ వరదాచార్యుల వారి కవిత్వ చిత్రాలలో గానవచ్చుననుట ఏమాత్రము సత్యదూరము గాజాలదు. శ్రీ వరదాచార్యులవారు చెన్నూరు సిరివంచ ప్రాంతములలోనున్న గోదావరీ, ప్రాణహితానదీ పరిసరాలలో నైసర్గిక ప్రకృతి విలాస మనోజ్ఞ వాతావరణములో బహుకాలము విహరించి ఆనందించి బహుభంగుల దర్శించి యా విలాసముల హృదయపేటికలో భద్రపరచి యుంచినారు. పోతన కావ్యరచనకు పూనుకొనగానే యా సువర్ణపేటిక విప్పుకొని గోదావరీమతల్లి రసవాహినియై యుప్పొంగి విప్పారి వెల్లువలై ప్రవహించినది. ఆ రసప్రవాహములో జలవిహంగములు, బాతులు, కొంగలు, మీనములు, మీనాక్షులు, సంధ్యారాగములు, పడవలు, బెస్తలు, సమస్త వస్తువులు కొట్టుకొని వచ్చినవి. మనోజ్ఞమగు ప్రకృతి సహజ సౌందర్యమును, కవి, చిత్రకారుడు, శిల్పి, సన్నిహితత్వముగల్గి ధ్యానమగ్న దృష్టితో ఎంత పరిశీలించునో యంతటి మహానందమును పొందగల్గును. అట్టి యానందమే ఛందమై పదబంధమై కవితాకృతి దాల్చును. రంగు రూపుల సవరించుకొని చిత్రకళయగును. కవికి చిత్రకారునికి మూలద్రవ్య మొకటేయైనను, ప్రకటనా సామగ్రివేరు. (Medium of Expression) పోతన కావ్యములో ప్రకృతి వర్ణనలేగాక, (Portraiture) రూపపటములు అనేకము గానవచ్చును. (2 ఆ. 15 నుండి 17) పద్యములలో దండకమండలుధారియై జటావల్కలముల దాల్చి రుద్రాక్షలుదాల్చిన యొక యోగిపుంగవుని చక్కని రూప చిత్రణము 77 ప. నుండి 80 పద్యమువరకు ఒక బీద జవరాలి వర్ణనము ముద్దులొలికించును. 5 వ ఆ. 233 వ పద్యములో ఒక బిచ్చగాని రూపవర్ణన మొక మహోన్నత చిత్రరాజముగా గానిపించును. తెగమాసి పిట్టగూడగు తలంగల చింపిగొంగడి. ఆకలితో లావెక్కిన పొట్టపైగల గంజిచారలు మీసములలో జిక్కికొనిన మెతుకు. చేతిలో చిప్ప, పేలికల గోచి కుక్కబెదరింపు, బడిపిల్లలు రాళ్ళు విసరుచుండుట మనము ప్రత్యక్షముగా గాంతుము. ఈ భిక్షుకు దర్గోన్మత్తుడు, పిచ్చివానివలె నగపడు నీ భిక్షులు దయనీయులుగను, నిత్యయాచనతో విసిగించువారుగను, పిల్లలకు వినోద వస్తువులుగను నుందురు. నేనిట్టివారిని నా కనులార దర్శించితిని. వీరిలో దారిద్ర్యము మూర్తీభవించినట్లుండుట పై చిత్రములో మనము గనవచ్చును.

కావ్యమునకు నాయకులైన శ్రీనాథ పోతనల వర్ణనములందు వారివారి (Characters) గుణములకు సరిపోవునట్లు చక్కని రూపకల్పన మొనర్చినారు, (4 వ ఆ62_63) పద్యములు తిలికింపుడు. వీరి ఆహార్యము వీరివీరి ప్రత్యేక వ్యక్తిత్వమును మూర్తీభవింప జేయుచున్నవి. శ్రీనాథుడు గిరిశిఖరమువంటి ఒడ్డుపొడవు గల్గిన దేహముగలవాడు. కాశ్మీరశాలువ, మణిమయాభరణములు, కంకణములు, రత్నకుండలములు, నవరత్నములు దాపిన అంగుళీయక

ము లు తెల్లని జరీఅంచు పట్టుదోవతి గల్గియున్నట్లు వర్ణింపబడి శృంగారము రంగరించి చేసిన మూర్తిగా భాసించుచున్నాడు. పోతన విభూతిపుండ్రములదాల్చి రుద్రాక్షమాలికలు మాత్రమే ధరించి, యే అలంకారములేక తెల్లని ఉత్తరీయపు దోవతిమాత్రము ధరించి సత్వగుణము సర్వము పోతపోసిన మూర్తిగా భాసించుచున్నాడు. శ్రీనాథుడు రజోగుణమునకు రూపకల్ప నగా గానబడుచున్నాడు. వరదాచార్యులవారు నిజముగా చిత్రకారులేయైనచో, పోతన వివి ధావయవములను ఏ ప్రమాణములో చిత్రించెడివారో? ఏవిధముగా రూపకల్పన చేసెడివారో? తెలియదుకాని పై వర్ణనలుమాత్రము ఏ చిత్రకారునికినైనను రూపచిత్రణ మొనర్చుటలో నత్యంత సహాయకారులుగా నున్నవనుటలో సందేహింప బనిలేదు. శ్రీమాన్ వరదాచార్యుల వారు సంగీత సాహిత్యములందు సాధన చేసినవారు. చక్కగా కావ్యగానము చేయగలరు. పురాణ కాలక్షేపము వీ రొనర్చినట్లు మనోరంజకముగా చేయువారి నే నిదివరలో దర్శించలేదు. వారికి చిత్రకళపై యాసక్తి మెండు. నాకు కవిత్వమన పిచ్చి ప్రేమ. ఈ రెండు పరస్పరా సక్తులు మమ్ములను చండూరిలో జరిగిన మహాసభలో సన్నిహితుల నొనర్చి మిత్రులుగా నొనర్చినవి. అవి నిజాము నిరంకుశపు రోజులు. ప్రజాకవి కాళోజీని ప్రభుత్వము వరంగలు మండలమున నుండ వీలులేదని నిషేధించినది. శ్రీ అంబటిపూడివారు నాటిన సాహిత్యో ద్యానము చండూరిలో పులిజాల, ధవళా, సిరిప్రగడల రూపములో తనపరిమళములు వెదజల్లు చున్నది. ఈసాహిత్యోద్యానలక్ష్మి ప్రజాకవి కాళోజీని ఘనముగా సన్మానించుకొనినది. సుమారు 4000 ప్రజాసభలో క్రిక్కిరిసియున్నది. కాళోజి మొదలుగాగల కవులు తమ కావ్యగానము లతో 2 గంటలు సభను ఆనందపరవశులను జేసినారు. తరువాత అధ్యక్షపీఠము నలంకరించి యున్న శ్రీ వరదాచార్యులవారు తమ కావ్యామృతము జిలికినాడు. సుమారు 5 గంటలు సభి కులను మంత్రముగ్ధుల నొనర్చినారు. వారు కావ్యగాన కోకిలమై నిర్వహించిన ఆ కార్య క్రమ మపూర్వమై మరువరానిదిగా నుండెననుట మాడపాటి, దేవులపల్లి మొదలగు పెద్ద లెరిగినదే. అప్పట్లె నేను వారికవితచే నాకర్షితుడనై చెన్నూరికివెడలి వారింటిలో 6 మాసము లుండి కావ్యమునెల్లెడల వారి నోటనేవిని చిత్రముల వేయుటకు ప్రారంభించి వారి పోతన కావ్యములోని దాదాపు 14 ఘట్టములను చిత్రములుగా వేసితిని. మా మిత్రులెల్లనవి వారి పద్యములకు చక్కని యనువాదములని శ్లాఘించిరి. పోతన కావ్యములో ముద్రింపజేసిన బంగారమునకు పరిమళ మబ్బినట్లుండునని తమ ప్రగాఢవాంఛను వెలిబుచ్చిరి. కాని కారణాంత రములచే వానిని ప్రచురించు భాగ్యము కలుగలేదు. ఈ కావ్యమును చిత్రింప బూనుకొనినచో కొన్ని వందల చిత్రాలువేయ వీలున్నదని గ్రహించితిని. భోగినీ నాట్యఘట్టములోని వివిధ పన్నివేశము లొక మనోజ్ఞ చిత్రసమీ కరణము. అవి ఈ కావ్యములో మకుటాయ మాన ములై యొప్పుచున్నవి ఆచార్యులవారి కవిత నా చిత్రములు వియ్యము నందినవి. కాని ఏక రూపముతో ప్రచురణావకాశము నొందలేకుంట మా దురదృష్టమేకాదు, ముక్కోటి యాంధ్రుల దురదృష్టమని నొక్కి వక్కాణింపగలనని ఇంతటితో విరమించుచున్నాను.

కొండపల్లి శేషగిరిరావు
ఉపన్యాసకులు, ఫైనార్ట్సుకాలేజి – హైదాబాద్

# విజ్ఞప్తి

తేనెయగు తెనుంగు మాతృభాషగా గల్గియుండుట మహాతపఃఫలము. అందు నా భాషయందు కవియై పుట్టుటలన నెన్నిజన్మముల పుణ్యము లేకమైననోకాక యా యదృష్ట మబ్బదు. ఆంధ్రదేశ మాదినుండి యనర్ఘ కవిరత్నముల కాలవాలమై యలరారుచున్నది.

సంస్కృత కవితా సౌందర్య సంపదలనెల్ల సాంగోపాంగముగాఁ దనలో జీర్ణించుకొని ద్రావిడభాషా సంప్రదాయముల తనవి యొర్చుకొని, వివిధ దేశీయులకు విస్మయముగొల్పు వెల్గుల వెదజల్లు తెల్గు ఆర్య ద్రావిడ సంస్కృతు లైక్యమై ప్రవహించు ఘనతర గంగా యమునా సంగమువలె విశిష్ట వైలక్షణ్యము గల్గియున్నదనుట సముచితమైనది.

తెన్గు కవితలోని ప్రతి పద్యము తత్సమాచ్ఛిక శబ్దముల మేలి కలయికతో ముత్యాలు పవడాలు గలిసి ముద్దొసంగు తావడమువలె మురువుసూపుచు ఆంధ్ర భారతీకంఠహారమై భాసిలుచుండును. తెలుగు కవు లుభయభాషలయందును కూలంకషమగు పాండిత్యముగల్గి వివిధ శాస్త్రీయ విజ్ఞాన విలసితులైన ప్రతిభా సంపన్నులనుటకు వారి సత్కావ్య నిర్మాణ ములే తార్కాణములు. నన్నయ మొదలు చిన్నయ పర్యంతముగల మహాకవు లెల్లరును ముక్కు ముత్యములే. ఒకరిని తీసి మరియొకరిని పెట్టవలను పడదు. ఎవరికివారే ప్రత్యేక వ్యక్తిత్వమునుగల్గి నేను ముందన నేను ముందని గణనకు వత్తురు. నన్నయ, తిక్కన, పోతన, శ్రీనాథాదులవంటి కవులును అన్నమయ్య, త్యాగయ్య, క్షేత్రయ్యలవంటి వాగ్గేయ కారులును జన్మించి సంగీత సాహిత్యకళా కల్పవృక్షములనాటి నందనవన వాటినిగా తెలుగు గడ్డను దీర్చిదిద్దినారు. పలురీతుల బ్రకాశించు సాహిత్య శాఖలలో నారితేరినవారని యద్వి తీయులని యసమానయశము గాంచినారు. నాడేకాక నేడును, బహు ముఖప్రజ్ఞా ప్రాభవము గల కవిపండిత ప్రకాండులు వివిధ రీతులలో రసవత్కృతుల వెలయింపజేసి తెలుఁగుజాతికి గర్వకారణులైనారు.

సత్కవితకు స్వర్ణమునకువలెనే పాత క్రొత్తలులేవు. ఆ క్రొత్త ప్రాతలు రుచి భేదముల నొప్పారెడి యాభరణ విశేషములే తప్ప మూలద్రవ్యమగు ప్రతిభ తాను స్వర్ణమే యనుట శంకింపరానిది. కవితాకాంతకు ఛందోరీతులు భావప్రకటనలోని తీరుతెన్నులు నేటివి రేపటికి పాతబడిపోవచ్చును. వస్త్రరూప వైవిధ్యములవలె అంతమాత్ర కవితా కన్యకకు క్రొత్తపాత లంటవు.

కాళిదా సెన్నియుగములు మారినను కవికుల తిలకుడే. ఇప్పుడును నానాటికి క్రొత్త పుంతలుద్రొక్కి క్రొత్తబలము పుంజుకొని సహృదయుల చిత్తముల రసానంద పరాయత్త ముల నొనర్చు నవయువకవి సింహకిశోరముల ప్రతిభయనాదరణీయమనుట మాత్సర్య ద్వేషములమారురూప మనవలదా! నవరత్నము లెన్నాళ్ళు గడచినను నవరత్నములే

యనుట మరువరాని సత్యము. అవి తా మెన్నడును శిరోధార్యములై దేశకాలాబాధ్యము లనై, సజీవములనై సౌభాగ్య ప్రదములనగు నక్షర ధనములు.

కృతి మానవజాతి పరమార్థమును పట్టియిచ్చి రసబ్రహ్మానందానుభూతిలో సద్యఃపర నిర్వృతిని సమకూర్చు సమస్త లోకకల్యాణ ప్రదమైన రమణీయ ప్రయోజనము. కాంతా సమ్మితోపదేశములతో, వింతగతుల ప్రియములగు హితసత్యముల గఱపును.

ఖండకావ్యము లేకైక ప్రయోజన ప్రదములు. మహాకావ్యములు సకలపురుషార్థ సాధకములు. బహుళ ప్రయోజన ప్రదములు. పృథగవయవము లేకైక ప్రయోజన ప్రద ములే యయ్యును, సకలేంద్రియ కేంద్రమనబడు శరీరముతో సారూప్యము నొందినపుడు పరస్పర సహకార సహజీవన భావబంధముగల్గి సమష్టి స్వరూపముతో సకలార్థ సాధకములై భాసించును. ఇట్టి అంగాంగిభావమే ఖండకావ్య మహాకావ్యములకు అవినాభావ సంబంధమును గూర్చి నవరసానుభూతియను పరమ ప్రయోజన సాధకమగుచున్నది. మహాకావ్యము మాన వత్వపు టానందపు టంచులనుదట్టి పూర్ణరసానుభూతి నొసంగి పొంగిపొరలు మహానది.

మానవుని విజ్ఞానానుభవము పరిణతినందనివినా మహాకావ్య నిర్మాణము సాధ్యపడ దేమో ? ఈ మహాకావ్యకర్తయే మహాకవి యనబడునేమో ? ఈ మహాకవి కీర్తినందుటకు కాళిదాసంతటి ప్రతిభాశాలి పొట్టివాడు పొడువగు చెట్టుపండ్ల నాసించుటవలె నపహాస్య భాజక మని యాత్మలో జంకినాడు. ఈ 20 వ శతాబ్దిలో మహాకావ్యము లాంధ్రభాషలో పలువురు మహాకవులు వ్రాసిరి. బుద్ధచరిత్రము, సౌందరనందము, దేవీ భాగవతము, రామాయణ కల్పవృక్షము, శివభారతము, రాణాప్రతాపసింహ చరిత్రము, ఆంధ్రపురాణము మొదలగు కృతులు తామీ కోవకు జెందినవే. వీనిలో కొన్ని సర్కారు జిల్లాలకు మరికొన్ని రాయల సీమకుజెందిన కవివరులు వ్రాసినవి. కాని ఈ శతాబ్దిలో తెలంగాణమునుండి మహాకావ్య నిర్మాణము జరుగలేదేమోయని నాహృదయము శంకించినది. ఇట్లని నేను విశాలాంధ్రనుండి తెలంగాణమును వేరుజేయుటలను కొనరాదు. ఆంధ్రదేశపు ప్రతివిడి భాగము విద్యా వివేక ముల కాలవాలమై కళాఖండ నిర్మాణమునకు సమర్థమైనదిగా నుండవలెననియే. అంగము లలో ఏ అంగము బలహీనము కారాదని ఈ వెలితిని పూరింప నుద్యమించినది. కాని సము చితమైన ఇతివృత్త ముపలభ్యమగుటకై చాలకాల మన్వేషించవలసి వచ్చినది.

నేను ఒకమారు ఫిరదౌసీ చరిత్రమును బఠించి రాజులుసేయు దుర్ణయముల కెంతయు ఖేదించితిని. ఆ సమయము నిజాము తెలంగాణముపై తన నిరంకుశప్రభుత్వము నెరపుచున్న దినములు. నా కప్పుడు రాజులను ధిక్కరించి వారి నిరంకుశ చర్యల నసహ్యించుకొని కవితా కన్యకు కర్షకవృత్తితో నుపజీవికను గల్పించి యాత్మాభిమానము రక్షించుకొనిన మహా కవి శేఖరుడు, పోతనార్యుడు కండ్లగట్టెను. ఆశకు లొంగనివానికి, ఈశిత్వము లొంగునని చూపించిన పోతరాజే నిజమైన రాజని తలంచితిని.

మనశ్శాంతి ప్రదమగు హరిభక్తి భావమరంద పానమత్త చిత్తుఁడగువాఁడు క్షణికము లగు విషయసుఖములఁ ద్యజించగలఁ డనుటకు తార్కాణము తానయై యొప్పిన మహా భాగవతోత్తముఁడు పోతన. పార లౌకిక సుఖముల నొసంగు భాగవత ప్రబంధము నతి భాసుర గతి రచించి పునర్జన్మ రహితమగు వైకుంఠవాసమునుగోరి హరినర్పించి యమరత్వమునందిన ధన్యజీవి పోతన. అనర్థలస్తుతిలో దుర్వినియోగపడువాణి కన్నుల నీరుగాంచి కరిగిన నవనీత హృదయుఁడు పోతన. అంబా ! ఆకలికైనను మలమల మాడిచచ్చుటగాని నిన్నా కర్ణాట కిరాట కీచకుల కమ్మనని శపథమొనర్చి భారతి కాటుక కంటి కన్నీరుదుడిచి భవబంధము నడచిన త్యాగశీలి పోతన. ప్రబంధ ముఖముల రాజుల నభివర్ణించి యష్టైశ్వర్యముల ననుభవింపజేయు నగ్రహారములకై యాత్మ స్వాతంత్ర్యము నమ్ముకొని జీవించు కవుల దైన్యమునుగాంచి కష్టపడినవాడు పోతన. "నిరంకుశాః కవయః" అను సూక్తిని నిల్పుటకై నిరంతర కృషిసల్పి సఫలీకృత మనోరథుండై యాత్మాభిమానముతో నలరారు మహా కవి వీరుఁడు పోతన.

క్షోణీకోణ శతాంశ పాలకులగు నృపు లనవధికమగు కాలజలధిలో నరనిమేషము స్ఫురించి యంతరించు బుద్బుదప్రాయులను వాస్తవికతను గుర్తెరింగినవాడు పోతన. నిత్యానపాయినియగు శ్రీదేవి సేవింప నిఖిలహేయ గుణరహితుఁడును. సకల కల్యాణ గుణసహితుడునునై యెప్పుడును రెప్పపాటులేక నిత్య సూరివర్గము సేవింపనొప్పు సౌందర్య మహోదధి యునై యైహికాముష్మిక సుఖప్రదుడునై యలరారు శ్రీహరిని సేవించి తద్దివ్యగుణాభివర్ణనము నొనర్చి యజహరామ రాదులకందరాని సుఖసంపదల కధికారియైన ముక్తాత్మ పోతన. పండిత పామరులనక, ఆంధ్రుల కందరికి నభిమాన పాత్రుడై కవిజాతికి మార్గదర్శకుడైనాడు పోతన. ఆంధ్రులచేగాక ఆంధ్రేతరులతోగూడ స్తుతింపబడిన భక్త కవిలోక శిరోమణి పోతన. తన వాక్కులు ధరణీ జనముల తలదాల్ప భక్తిపథములలో నడపించి యాంధ్ర హృదయ పీఠముల నధివసించి శాసించు మకుటములేని మహా కవిసార్వభౌముడు పోతరాజామాత్యుడు. వాల్మీకి తర్వాత రామాయణకథ తన దేశభాషలోవ్రాసి ప్రజల మెప్పు బొందినవా డొక తులసీదాసుడే. వ్యాసుని తరువాత భాగవతమును తన దేశభాషలో వ్రాసి మెప్పుబొందినవా డొక పోతనయే.

ఈ పోతనకవిరాజుతోపాటు తెలుఁగునాట నింకను నిరువురు రాజులుగలరు. అందులో నొకరు త్యాగరాజు. రెండవవారు గోపరాజు. ఈ ముగ్గురి రాజుల నభివర్ణించి భక్తిముక్తుల నాస్వాదింపగోరిన నాకు "మద్వంద నాచ్యుతగుణం మద్దా సస్యచవందనం" అను భగవద్వాక్యము స్మృతికివచ్చి నా సంకల్పమునకు బలము చేకూర్చినది. వెంటనే శ్రీ పోతనకవి రాజు జీవితేతి వృత్తమును మహా ప్రబంధరూపముగా నారంభించి యత్యంత భక్తిశ్రద్ధలతో ముగించితిని.

ఆంధ్ర కవితాకన్య పురాణేతిహాస కావ్యమార్గముల విహరించుచు వచ్చి పెద్దనాదుల కాలమందు రమణీయార్థ ప్రతిపాద్యములగు సుందరపదరీతులతో వినూత్న ప్రబంధ ప్రపంచోద్యానముల వెనుకటి కన్నమిన్నలగు వింతవిలసనమ్ముల, విహరించి సహృదయుల సమ్మానముల నందుకొని జయధ్వజ మెత్తినది. రసవత్కావ్య కళావిశ్వ వీధులలో సీమా భూమిగఁ జెలువొందినది. ఈ ప్రబంధపద్ధతి నన్ను మిక్కిలిగా నాకర్షించినది. అటులని నేను నూతన కవితా మార్గములకును దూరుఁడగా నెంచలేదు. నా కవితలో నేను రెంటిలోని సౌందర్యముల శక్తివంచనలేక యారాధించి నాడనని సహృదయులు తెలిసికొనకపోరు. నాకు కావలసినది నవీన ప్రాచీన పాక్షికత్వములుగావు. నేను కోరునదెల్లను, యేకాలమునకు జెందిన మార్గమైనను "సత్యం, శివం, సుందరం" అను కళా సౌందర్యోపాసనమును మాత్రమే. సంకుచిత స్వభావము వీడి చూచు హృదయమునకది సర్వకాలముల నుపలభ్యమగును. సహజ సౌందర్యముగల స్త్రీ పురాత నాధునాతన వేషభాషలలో వెలసినను, సరస హృదయుల సమాకర్షించును. సహజ సుందరిగాని స్త్రీ నవీనాలంకారముల నెంతగా నాలంబన మొనర్చికొనినను నవమన్మథుని రతీదేవిగా మనజాలదుగదా! కావున సరసకావ్యత్వమునకు పరిణత దశను సమకూర్చిన యలనాటి ప్రబంధ ఫక్కిలో నేనీ కావ్యరచనకు దొరకొంటిని. ఈ మార్గమున నే నెంతవరకు కృతకృత్యుడ నైతినో సహృదయైకవేద్యము.

ఇంచుమించు నేనీ ప్రబంధ రచన మొనర్చుచు ముగించి ప్రకటించుటకు 20 సంవత్సరములు పట్టినవి. నేనీ కావ్యరచనా కాలమున నేమి ప్రకటనోద్యమములో నేమి హిమవత్పర్వతమంతటి విఘ్నముల నెదుర్కొనవలసి వచ్చినది. ఐనను దీనిని ముగించి ముద్రించుట లీశ్వరానుగ్రహ మేకాని నా సామర్థ్యముకాదని మనవిజేసికొందును. "పలికెడిది భాగవతమట పలికించెడివాఁడు రామభద్రుండట" యను పోతన సూక్తి నాకును నన్వయించినవి. "తేన వినాతృణాగ్ర మపినచలతి" అనుట విబుధు లెరిగినదే! ఏతత్ప్రబంధ రచనమునందు నే నతుకులబొంతల నసమగ్రములగు చారిత్రిక సిద్ధాంతముల- కొన్ని రూఢిలోనున్న ప్రసిద్ధేతివృత్తములతో జతపరచితినని సవినయముగ మనవిఁజేసికొను చున్నాను.

పోతన యోరుగల్లువాడన నొంటిమిట్టవాడను వివాదగ్రస్త విషయములలో విమర్శకుల విజిగీష విపరీత ధోరణికి దిగినది సకలాంధ్ర లోకమునకు సుపరిచితమే. కొఱవి గోపరాజు, విద్యానాథుడు మున్నగు కవు లేకశిలా నగరము నోరుగంటికే ప్రసిద్ధముగాను వ్యవహరించుట జేసియు 'ఓరుకల్లు - ఏకశిల' అను పదముల యందలి సరియైన పోలికనరసి, పోతన బమ్మెరదగ్గరి యోరుగల్లువాడేయను చారిత్రక సిద్ధాంతమును విశ్వసించి నేను నటులే వ్రాసితిని. కాని యాంధ్ర భాగవతకృతినిగూర్చి యావదాంధ్రుల కభిమాన పాత్రుడగు పోతన మహాకవి తా నాంధ్రభూమిలోని యే ప్రాంతమునకు జెందినవాఁడైనను నాకు సమ్మతమే.

దానిలోని సత్యా సత్యముల చారిత్రికులకే వదలిపైచి, ప్రజా సామాన్యముచే ప్రస్తుతింపబడు ప్రసిద్ధేతి వృత్తమనే గ్రహించి గ్రంధరచనమున కుద్యమించితిని. నేను వ్రాయునది శుష్కచరిత్రముకాదు. నాకు పోతన చరిత్రమును వ్రాయుటకన్న నతని యుదాత్తాశయముల ప్రజా హృదయముల బ్రతిబింబింపజేయుట ముఖ్య కర్తవ్యము.

సందర్భాను గుణ్యముగ నాకు నచ్చినరీతి కొంతకథను కల్పించుకొనుటయు జరిగినది. పోతన తా నాంధ్రులందరివాడని యెంచి యీ కృతి కుద్యమించితిని. నేటికిని, చారిత్రికు లెంద రెంత పరిశోధించినను తా నీతని చరిత్రములోని యాథార్థ్యమంధులు తడవుకొనుచు నభివర్ణించు హస్తిరూపమువలె నసమగ్రమనియే యెంచబడ వలసినది. ఇందు కావ్యానుబంధమని రెండాశ్వాసములు చివరివి వ్రాసితిని. ఇవన్నియు భాగవతకథలే. ఇవి కథకు సంబంధించనివనే అనుబంధకావ్యముగా గూర్చితిని. దీనికి ప్రబలమైనకారణ మొక్కటే. అది పోతరాజు తావ్రాసిన భాగవతములోని హరిఆర్తరక్షణము ఆశ్రితపక్షపాతమును ఋజువుపరచుకొనుటలే. భాగవత భక్తరక్షణమును స్మృతికి దార్చుచు నీ భక్తుడనగు నా భాగవత రక్షణమేల సేయ లేవని ఆర్తిజెందుటే ఈ గాథల ముఖ్యలక్ష్యము. కాని యతనిపై పోటీకి వ్రాసినాననుట దుస్సాహసము, అపచారము.

ఈ నా రచనమును శుద్ధప్రతి వ్రాసి యెంతేని తోడ్పడిన యుత్తమకవిసత్తముడగు అందె వేంకటరాజముగారికి నే నెంతయు ఋణపడి యున్నాను. వారికి కృతిపతి రామచంద్రుడాయురారోగ్య భాగ్య సమృద్ధిని ప్రసాదించుగాతయని ప్రార్థించుచున్నాను. కోరినదే తడవుగా దీనికిగా నుత్తమచిత్రముల వ్రాసియిచ్చిన రసమూర్తి మిత్రులు బలరామాచార్యులుగారికి నా కృతజ్ఞతా పూర్వక మంగళా శాసనము లర్పింతును. వానిని బ్లాకులు జేయుటలో నాకు విశేషముగా తోడ్పడిన శ్రీరామమూర్తిగారికిని హృదయపూర్వక కృతజ్ఞతలు. దీనిలోని నాట్య ఘట్టమునుగూర్చి తమ అమూల్యాభిప్రాయము దెల్పిన శ్రీ నటరాజుగారికి నా కృతజ్ఞతలు.

ఇంకొక ముఖ్యమైన మనవి. నేను దీనికి తొలిపల్కు మలిపల్కు వ్రాసియిచ్చుటకు శ్రీయుతులు పూజ్యులు దివాకర్ల వేంకటావధానిగారిని, నాకు ఆబాల్య ప్రాణమిత్రులు శ్రీయుత పల్లా దుర్గయ్యగారిని యాచించితిని. వారు బహు కార్యమగ్నులై యుండెడివారు. వారికి వ్యవధి బహు స్వల్పమయ్యును, నా మనవిని త్రోసిపుచ్చలేక నెలలకొలది నా యీ బృహత్కావ్యమును సవిమర్శగా పఠించి చక్కని చిక్కని పీఠికలు వ్రాసియిచ్చిరి. వీ రిరువురికిని నా కృతజ్ఞతా పూర్వక ప్రణామము లాచరించుటదక్క మరేమి ప్రతి యొసంగగలను? నా యీ కావ్యముపై తమ యమూల్యాభిప్రాయము లొసంగిన పెద్దలకు ప్రియమిత్రులకు వినమ్రుడనై ప్రణామము లర్పింతును. నా యీ కావ్యములోని వాక్చిత్రములగూర్చి సవిమర్శగా వివరించిన ప్రియమిత్రుడు శేషగిరికి నా కృతజ్ఞతలు.

నా యీ కావ్యరచనకు గల్గినంతశ్రమ ముద్రణకును గల్గినదని తెల్పుటకు విచారించు చున్నాను. మిత్రులు సహృదయాంధ్ర ప్రజానీకము నా కృషి నభినందించి సహస్ర ముఖాల సభా సన్మానముల జరిపి దీని ముద్రణకై సహాయ సంపత్తి నందజేసి తమ యుదారతను ప్రకటించికొనినారు. ఇందుకై భువనగిరి రూ. 2000, కోరుట్ల రూ. 2000, చెన్నూరు రూ. 2000, దోమకొండ రూ. 500 లొసంగిరి. ఇందుల కా గ్రామాలలోని పురప్రముఖులు ప్రజలు నెంతేని యభివందనీయులు. 100 రూపాయ లొసంగిన యనేకమంది మిత్రులకు నా కృతజ్ఞతలు. మంచిరాలలో శ్రీ గంగారెడ్డిగారి కుమారశేఖరులు శ్రీ నారసింహారెడ్డిగారు నా కావ్యగానము విన్నంతనే సంతసించి ఒక వేయినూట పదారు లర్పించి తమ సరసత్వము నౌదార్యమును ప్రకటించుకొని నాకే కాక సాహిత్యాభిమాను లందరికిని నభిమాన పాత్రులైనారు. కవిపండిత పోషకులగు శ్రీ యాదగిరి దేవస్థానమువారును 500 లు సన్మానమొసంగి కృతజ్ఞతకు పాత్రులైరి. ఈ ద్రవ్య సహాయములతో గ్రంథములోని కొంత భాగము మాత్రమే ముద్రణమైనది. శేష భాగ ముద్రణమునకై ప్రభుత్వమునకు వినతి చేయుటసంభవించినది. గౌరవనీయులు ఆర్థిక పారిశ్రామిక శాఖామాత్యులు శ్రీ యం. చెన్నారెడ్డిగారు ప్రభుత్వ పక్షమున రూ. 10,000 విరాళ మిప్పించి తమ యపార భాషా పోషకత్వాభిమానమును ప్రకటించికొనినారు. వారికి నా యనంతకోటి కృతజ్ఞతాభి నందనలు. నా శుభాకాంక్షలు. ఈ విరాళము చేజిక్కుటకై శ్రీయుత కే. వీ. కేశవులుగారెంతో తోడ్పడిరి. వారి ఋణము నే నెన్నటికి దీర్చుకొనలేనని వారికి నా మంగళా శాసనము లర్పింతును. శ్రీ బిర్లా కంపెనీవారు 28 రీములు కాగితమును విరాళమిచ్చిరి. వారికి నా ధన్యవాదములు.

ఎన్ని పనులున్నను నా గ్రంథ ముద్రణకార్యమునకే ప్రాధాన్యమిచ్చి, కావ్యమును ముద్దుగా ముద్రించి యిచ్చినందులకు శ్రీ శ్రీరామా పవర్ ప్రెస్ యజమానులగు పబ్బా శంకరయ్యగారి కీశ్వరుడు సంపూర్ణాయురారోగ్య భాగ్యములు ప్రసాదించుగాక.

"లోకా స్సమస్తా స్సుఖినోభవంతు"

వా॥ వరదాచార్యులు

# పండితాభిప్రాయములు

నాకు చిరమిత్రులును విఖ్యాత యశోవిరాజితులును సుప్రసిద్ధులునునగు శ్రీమాన్ వానమామలై వరదాచార్యులుగారు పండ్రెండు సంవత్సరములకృషితో రచించి ఆంధ్రప్రదేశ విద్యాశాఖవారి పోషణమున ప్రకటించిన పోతనచరిత్రము ఆంధ్ర సారస్వత ప్రపంచమున వెలువడుట నాకత్యంత సంతోషావహమైన విషయము. ముఖ్యముగా ఇట్టి ఉద్గ్రంథమును నాకు నేడనుగ్రహించి దీనిపైన కించిద్జ్ఞుండనగు నా యభిప్రాయమును కోరుట నాకు నిజముగా అత్యంత ధన్యత నాపాదించినది. దీనిపైన ఉపోద్ఘాతము వ్రాసినవారు శ్రీ దివాకర్ల వేంకటావధానిగారును మరియు మలిపలుకువ్రాసిన మహాశయులు శ్రీ పల్లా దుర్గయ్యగారును ఐ యున్నారు. వీ రిద్దఱును ఆంధ్రసారస్వత ప్రపంచమున నిరుపమాన ప్రశస్తివహించిన వా రగుటయేకాక ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు భూషణప్రాయులై యున్నారు. ఇట్టి పండిత ప్రకాండులయెదుట కొఱగాని నావంటివానిని అభిప్రాయముకోరుట నన్ను ధన్యునిగా జేయుటకు, నా పురాతన మిత్రులగు గ్రంథకర్త మహాశయులు సంకల్పించుటయేకాక మరేమియు కాదనియు ఇట్టి అనుగ్రహమును నాపై ప్రసరింపజేసిన శ్రీమాన్ ఆచార్యుల వారికి మఱల మఱల నా వందన సహస్ర మర్పించుచున్నాను. ఇట్టి పుస్తకము బయటబడిన సంగతి నేను నేడే తెలిసికొంటిని. శ్రీ ఆచార్యులవారు ఎంత గొప్ప కవిశేఖరులో అంత నిరాడంబర జీవులని నేను మొదటి నుండియు ఎఱిగియున్నాను. అట్టివారి ఈ కావ్యము అజరామరకీర్తిని గాంచుననుట నా మనో నిశ్చయము. నేటి కాలమున స్వతంత్ర భారతదేశమున మనకవుల యొక్కయును, పండితుల యొక్కయు యోగ్యత భారత ప్రభుత్వాధినేతల వలన ఉదారముగా సన్మానింపబడుచున్నది, అట్టి కవివతంసులలో శ్రీ వరదాచార్యులవారు చేరదగినవారై యున్నారు. కొందఱు ప్రసిద్ధ కవిశేఖరులకు, పండితులకు తెలుగువారిలోగూడ మహోదారమగు విధమున సన్మానము జరుగుట నే నెఱిగియున్నాను.

ఆచార్యులవారు ఇప్పుడు చాల పరిమితమగు మాస వేతనముపైన ఒక పాఠశాలలో ఉద్యోగము చేయుచు జీవయాత్ర సాగించుచున్నారు, ఆంధ్రప్రదేశ ప్రభుత్వ విద్యాశాఖామాత్యులును, పండితాభిమానులునునగు శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు వీరి విషయమున తగిన విధమున సిఫారసుచేసి వీరికి శాశ్వతమగు వర్షాశనమును కేంద్ర ప్రభుత్వము నుండి అంగీకరింప బడునట్లుచేయ మనఃపూర్వకముగా సవినయముగా నేను ప్రార్థించుచున్నాను, ఆర్థిక శాఖామాత్యులగు మంత్రులు శ్రీ చెన్నారెడ్డిగారు ఇంతకు ముందే వీరి విషయమున ఆదరభావము వహించిరని నేను తెలిసికొని యున్నాను. కనుక నా సూచన ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారివలన అంగీకరింపబడుననియు తెలంగాణ వాసులగు నేటి కవులలో అత్యంత గౌరవార్హులగు శ్రీ ఆచార్యుల వారికి తగు సన్మానము లభింపగలదనియు నేను విశ్వసించుచు విరమించుచున్నాను.

ఆంధ్ర సారస్వత సేవకుడు
ఆంధ్ర పితామహ, పద్మభూషణ
మాడపాటి హనుమంతరావు

20-11-1966

శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారు అల్పజ్ఞుడనగు నన్నుగూడఁ గొన్ని పరిచయవాక్యములు వ్రాయుట కాజ్ఞాపించినారు. వారి గౌరవమును నా కొసంగుట వారికి నా యందుగల యాదర భావమును వెల్లడించుచున్నదేకాని నా యర్హత కారణముకాదని వేరుగా చెప్పనవసరములేదు. ఆచార్య, డాక్టరు దివాకర్ల వెంకటావధానిగారి "తొలిపలుకు", డాక్టరు పల్లా దుర్గయ్యగారి "కవి – కావ్యపరిచయము" అను రెండు విపులములైన పీఠికలు ఈ మహా కావ్యముయొక్క యుత్కృష్టతను సోపపత్తికముగా ప్రకటించుటయేగాక కావ్య రసాస్వాదన మునకు పాఠకుల కనేకవిధముల తోడ్పడుచున్నవనుట యతిశయోక్తి కానేరదు. అట్టి తటి గ్రంధముపై విహంగమదృష్టినికూడ ప్రసరించు నవకాశమును, భాగ్యమును లభింపని నేను ఈ మహాకావ్యమునుగురించికాక, మహాకవినిగురించియే మనవిచేయుట పర్యాప్తమగునని భావించుచున్నాను.

ఆచార్యులవారు తెలంగాణాప్రాంతపు వరంగల్లు జిల్లావాసులు. డాక్టరు పల్లా దుర్గయ్యగారి చిన్నతనపు సహాధ్యాయులు. వీరి జీవిత విశేషములు నా కెక్కువ తెలియవు. ఆచార్యుల వారు పూర్వకవుల పద్ధతి ననుసరించి ఆశ్వాసాంతగద్యములో భరద్వాజగోత్ర, ఆపస్తంబ సూత్ర బక్కయ్యశాస్త్రి పుత్రయని మాత్రమే తెలిపిరి. కాని వీరి రచనలను దాదాపు మూడు దశాబ్దములనుండి నేను తెలంగాణాప్రాంతపు పత్రికలలో తరచు చదువుట సంభవించినది. వీరితో ప్రత్యక్ష పరిచయము కీ. శే. సురవరం ప్రతాపరెడ్డి మఱియు మిత్రులు కాళోజీ నారాయణరావు గార్లద్వారా 15 సం॥ల క్రితము కలిగినది. ఆచార్యులవారప్పు డత్యంత రోగ గ్రస్తులై యుండిరి. కొన్ని సంవత్సరముల చికిత్సానంతరము బాగుపడి ఒక యాపిరితిత్తి తోనే, ఆరోగ్యవంతులై ఈ మహాప్రబంధరచన పూర్తిగావించి, ఆంధ్ర సరస్వతి కుపాయన ముగా నొసంగి ధన్యులైరి.

ఆచార్యులవారు భక్తశిఖామణులగు నొక శ్రీవైష్ణవ కుటుంబమునకు చెందినవారు. ఆనువంశికమైన ఈ సంస్కారము వారి పురాకృత పుణ్య విశేషఫలముగా లభించి మహాభక్త శిఖామణియగు పోతనామాత్యుని పవిత్ర జీవితచరిత్రమును ప్రబంధించుటకు పురికొల్పిన దనుట యసమంజసము కానేరదు. భక్తపోతనయొక్క జీవిత చరిత్రమునకు సంబంధించిన కొన్ని యైతిహ్యములు దంతకథలున్నను, వానినొక మహాప్రబంధ సామాగ్రిగామార్చి విస్త రించి కల్పించి ద్వాదశ స్కంధ బంధురమగు మహా భాగవత పురాణమునకు తులదూగు ద్వాదశాశ్వాస విస్తృతమగు మహాప్రబంధమును రచించు శిల్ప మాచార్యులవారి యపూర్వ మైన ప్రతిభను చాటుచున్నది. కథాకథన విధానమునగాని, ప్రకృతి వర్ణనా సౌందర్యమున గాని, రసవదలంకార బంధురత్వమునగాని మహాకావ్య లక్షణములచే సంపూర్ణముగా నలరారు చున్నదనుటకు సాహిత్య సముద్రమథన మొనరించిన దక్షులగు ఉభయపీఠికా రచయితల ప్రశంసా వాక్యములేచాలు.

ఆధునిక కాలములో భావకవిత్వము, గేయకవిత్వము, అభ్యుదయ కవిత్వము ప్రచారములో నున్నవి. వచన కావ్యముల కత్యధిక ప్రాచుర్యమున్నది. ప్రాచీన సంప్రదాయముల ననుసరించి రచింపబడిన మహాకావ్యములు, ప్రబంధములు మిక్కిలి యరుదు. శివభారతము, రామాయణ కల్పవృక్షము మున్నగు కొన్నిమాత్రమే ప్రశస్తినొందినవి. వరదాచార్యులవారి పోతనచరిత్ర క్రొత్తపాతల మేలుకలయికలతో శోభిల్లుచున్ననూ ప్రాచీన మార్గము ననుసరించిన యాధునికాంధ్ర మహాకావ్యములలో రత్నమువంటిది. పోతనను గురించిన వివిధకథలయందు సామంజస్యమును కల్పించుటయందలి చమత్కృతి మిగుల ప్రశంసనీయము. ఆ మహాభాగవతోత్తముని వినయ, సౌజన్య, సౌశీల్యాది గుణగణముల వర్ణనయందలి భక్తిశ్రద్ధలు స్వయము ఆచార్యులవారి వినయ, సౌశీల్యాది సద్గుణములయొక్క స్ఫోరకములు. పోతన మహాభాగవతమునందువలె ఆ మహాకవి చరిత్రమగు నీ మహాకావ్యమునందు భక్తిరస ముప్పతిల్లుచున్నది. వేయేల, డాక్టరు అవధానిగారు వ్రాసినట్లు శ్రీనాధుడు పోతనకవిత్వమునుగూర్చి గావించిన ప్రస్తుతి ఆచార్యులవారి కవిత్వమునకు కూడ సంపూర్ణముగా నన్వయించును. పోతనకు, శ్రీ ఆచార్యులవారికి యనేకవిధముల భావ సమైక్యతగలదని ఈ మహాకావ్యమేకాక, వారి జీవిత విశేషములుకూడ విరూపించుచున్నవి. ఆధునిక తెలంగాణా మహాకవి శ్రీమాన్ వరదాచార్యులవారికి నా యభినందనముల నర్పించుచున్నాను.

డా॥ బూర్గుల రామకృష్ణరావు M. P.

---

పోతన పేరుతలచడమే తడవుగా ఆంధ్రుల హృదయం పులకరిస్తుంది. పండితులు, కవితా పిపాసువులు మాత్రమేకాక మధ్యతరగతి కుటుంబాల్లో విద్యావతులుకాని స్త్రీలకుకూడ గజేంద్రమోక్షం, ప్రహ్లాదచరితం, భ్రమరగీతలు మొదలగు కొన్ని ఘట్టాలైనా తప్పక కంఠస్థమై యుండడం గమనించదగింది. ఈనాటిమాట చెప్పలేముకాని మొన్నమొన్నటివరకు తెలంగాణంలో అక్షరాభ్యాసంతోపాటు "తల్లీ నిన్నుదలంచి పుస్తకము చేతంబూనితిన్" అనే పద్యం నేర్పేవారు. పండిత పామరులకు ఉభయులకూ అభిమానకవి ఎవ్వరని ప్రశ్నిస్తే ఏదృష్టితో చూచినా 'పోతన' అనే చెప్పవలసివస్తుంది.

ఆంధ్రులు పోతన నంతగా ప్రేమించడానికి ఆయన కావ్యమేకాక ఆయన జీవితం కూడ ప్రబల కారణమనక తప్పదు. చేసిన రచనకూ, గడపిన జీవితానికీ, ఇంతటి అవినాభావసంబంధం, ఇంతటి అపూర్వ సారూప్యం, అన్యత్ర దుర్లభమనే చెప్పాలి. చరిత్రకారులు, పరిశోధకులు, ముక్కులు విరిచినాసరే, ఆంధ్రులుమాత్రం పోతన జీవితాన్ని ఇప్పుడు నమ్ముతున్నట్టే ఎల్లప్పుడు నమ్ముతూ ఉండడం కావ్యోత్కర్షదృష్ట్యా శ్రేయస్కరమని నేను భావిస్తున్నాను. పోతన వ్యక్తిత్వాన్నిగురించిన ప్రతిబింబం (Image) లోని అనన్యమైన ఉదాత్తతను చిరస్థాయిగా ఉంచడం మన కర్తవ్యం.

ఈ పవిత్ర కర్తవ్యాన్ని శ్రీ వానమామలై వరదాచార్యులు మా వరదన్న అమోఘంగా నిర్వహించి పోతనచరిత్ర మహాకావ్యం రచించారు. భగవత్సంబంధమైనది భాగవతమైతే భాగవత సంబంధమైన ఈ మహాకావ్యాన్ని "భాగవతీయం" అనవచ్చు.

పోతనగారి జాతకమే ఆయన చరిత్రకారునికికూడ వారసత్వంలో సంక్రమించింది కాబోలు! పోతన్న జీవితానికీ వరదన్న జీవితానికీమధ్య ఎంతో సామ్యంఉంది. నిర్ధనత్వంలో సామ్యంఉంది. అమృతహృదయంలో సామ్యంఉంది. కవితా వైభవంలో సామ్యంఉంది. ఉదాత్త కల్పనల్లో సామ్యంఉంది. పదలాలిత్యంలో సామ్యంఉంది. వేయేల? ఒక్క కృషీ వలత్వంలోతప్ప అన్నివిషయాల్లోనూ సామ్యం ఉందంటే అతిశయోక్తికాదు?

వరదన్న ఈ మహాకావ్యాన్ని ఏ ముహూర్తంలో ప్రారంభించాడోకాని అడుగడుగునా ఆయన మార్గంలో విఘ్నపరంపరలే ఎదురయ్యాయి. ఆర్థిక దుస్థితితోపాటు అస్వాస్థ్యంకూడ సంభవించింది. రాజులకు రావలసిన రాజయక్ష్మ ఈ కవిరాజును వరించింది. వ్యాధి తుదకు కుదిరినా అలనాటి బక్కపలుచని వరదన్న, సుశ్రావ్యకంఠంతో పద్యాలాలపించి పండిత పామరులందరినీ తన్మయత్వంలో ఓలలాడించిన ఆ చుఱుకైన వరదన్న, శాశ్వతంగా అదృశ్యుడైపోయాడు. వరదన్న స్వరూపం, స్వరం, సంగీతం — అంతా మారిపోయింది. ఐతే ప్రాణాలు దక్కడమే పదివేలనుకున్నాము.

ప్రాణాలను దక్కించుకోవడంకన్న, తదుపరిరక్షించుకోవడమే మరొక వికట సమస్యగా పరిణమించింది. దోమకొండ జనతా కళాశాలలో హార్మోనియం, తబలా, తంబురా మొదలగు సకల వాద్యాలను తానొక్కడే వాయించుతూ గ్రామీణ యువకులకు బుఱ్ఱకథలు, భజనలు వగైరా (తానేవ్రాసి) నేర్పే ఉద్యోగం స్వీకరించాడీ మహాకవి! పోతన చరిత్రం వ్రాస్తాడా? బుఱ్ఱకథలు వ్రాస్తాడా? రెంటినీ వ్రాయడం సాగించాలంటే ఎంతటి వాడికైనా బుఱ్ఱ తిరిగిపోదా?... కాని వరదన్న కలం ఉభయదిశల్లోనూ నడిచింది. తన "సాంస్కృతిక" భృత్యోద్యోగాన్ని వచ్చి చూడుమని నన్నెన్నోమార్లు పిలిచాడు. కాని ఆయన దుస్థితిని ప్రత్యక్షంగా చూస్తే భరించజాలనేమోనని నేను వెళ్ళలేదు. భృతికొఱకే బాధపడుతున్న వరదన్నకు ఐరావతంలాంటి ఈ మహాకావ్యం మరొక సమస్యగా తయారైంది. ప్రచురణలో జాప్యం జరిగినకొద్దీ వరదన్న కావ్యానికి మెరుగులుదిద్దుతూపోయాడు. అదేదో ఆయన తహతహ, ఎంత బాగున్నా మరింత బాగుండాలని! ఇలాంటి నిర్దుష్టతా పిపాసువులకు నిద్రపట్టదనుకుంటాను. వరదన్నకేమో కావ్యానికెన్ని మెరుగులుపెట్టినా తృప్తిలేదు. రసజ్ఞులకేమో ఎన్నిమార్లు వినినా తనివితీరదు. ఇదొక ఎడతెగని పోటీగా తయారైంది.

రమారమి పావు శతాబ్దం తరువాత ఈ మహాకావ్యం వెలుగులోకి రావడం మన కవితా భవిష్యత్తుకు శుభసూచకం. ఇందలి పద్యాల ఉద్ధరణలిచ్చి నా అభిప్రాయాలను పాఠకులపై రుద్దడం నా అభిమతంకాదు. రసజ్ఞుని పాత్రతను, వ్యక్తిత్వాన్నిబట్టి రసోత్కర్ష కలుగుతుందతనికి. ఆ భాగాన్ని ఎవరికి వారికే వదిలేస్తాను.

వరదన్న నా సన్నిహిత మిత్రమండలిలోనివాడు. ఆయన కలంనుండి చిందిన ఈ సర్వాంగ సుందర రచనను నాతోపాటు ఆంధ్ర పాఠకలోకం చదివి ఆనందిస్తుందన్న ఉత్సాహమే నన్నీ నాలుగుమాటలు వ్రాయడానికి పురికొల్పింది. పోతన జీవితాన్ని వరదన్న వ్రాస్తే వరదన్న జీవితాన్నెవరైనా వ్రాయబూనితే ఎంత బాగుండేది.

ఇట్లు
పి. వి. నరసింహారావు
న్యాయ, దేవాదాయ శాఖామాత్యులు
ఆంధ్రప్రదేశ్ — హైద్రాబాద్

---

ఇప్పటి కవితకు స్థిరతలేదు. దానికి కారణమేమో తెలిసికొనవలెనను ప్రయత్నము గూడలేదు. ఆత్మకుగల్గిన ఏ యల్పానుభూతినో ప్రకటించుటే యొక ఘనకార్యముగా భావింపబడుచున్నది. కాని మన పూర్వపు కవిపోషక సామ్రాట్ కృష్ణదేవరాయలు పర రాజ జయముచే కీర్తిగాంచినట్లు ప్రబంధ కవితాభివృద్ధిసల్పి యసమాన యశము గాంచినది మన మెరిగినవిషయము. ఇప్పటి కవులు అట్టి ప్రబంధ కవితయెడ ఆసక్తి చూపకపోవుటకు ఆత్మ స్థిరత్వములేకుండుటే హేతువోయేమో తోచకున్నది. కాని ఇప్పటికిని ఆ ప్రబంధ కవితను పునరుజ్జీవింప సాహసించిన ఇట్టి మన కవిని ప్రజలును ప్రభుత్వమును సహకార సన్మానములనిచ్చి ఇట్టిపనికై ఇంకకొందరు కవులకు ప్రోత్సాహ మొసగవలసియున్నది. ఈ కవి ప్రతిభ అతిసహజమై రచనావైఖరి నవీనశైలి సమ్మిశ్రితమును మధురమును ఔచితీ యుక్తమునై యున్నది. ప్రబంధ కవిత్వ నియమములన్నియు పరిపాటింపబడియే యున్నవి. ఇతివృత్తమో ఉత్తమోత్తమమైనదియు భాగవత రచనానిష్ఠాతుడగు బమ్మెరపోతనకు సంబంధించినదియు నగుట ఈ కవి భాగ్యవిశేషము. కొన్నిచోట్ల అతని కవితారీతులును అనుసరించ బడినవి. జ్ఞానభక్తివైరాగ్యసంపూర్ణుడగు పోతన జీవితచరిత్ర మన కాదర్శప్రాయమై యుండునుగదా. భగవంతునిచరిత్ర పఠించి ఆశ్చర్య చకితులమై పోవలయునేగాని దానిని మన మాచరణయందు నిలుపుకోలేము. మొదటినుండియు పెక్కు కవిత్వ మార్గములలో రచనలవలె స్వేచ్ఛగా గాక నియమనిష్ఠ కల్గియుండుట చాల గొప్పపని. ఇట్టి ప్రబంధ కవితకై ఇప్పటి ఇతరకవులు కొంద రెవరైనా ప్రయత్నించ సాహసింతురోలేదో చూడవలసి యున్నది. కనీసము ఇప్పటి కవులందరును ఈ ప్రబంధమును పఠించి రసానుభూతినైనా పొందుదురుగాక. ఈ కవి ఇట్లే తిక్కనచరితముగూడ రచించి మనకు గొప్ప యుపకారము చేయుటకు భగవంతు డీ కవికి దీర్ఘాయురారోగ్యైశ్వర్యముల నొసంగి కృపాదృష్టి గాంచుగాక.

ఇట్లు
వానమామలై వేంకటాచార్యులు

ఉత్తమకావ్య రచయితయగు ఆంధ్ర కవిసత్తమునిగురించి కావ్యము వ్రాయుట మన యాంధ్రలోకమునందున్న ఒక్క జాషువ కవిమాత్రము ఫిర్దోసిని గురించి వ్రాయుటతప్ప ఈ క్రాంతపోకడను గుత్తగొని మహాకావ్యములోని ప్రత్యణువు రసవత్తర ఘట్టముగా గూర్చ యీ మహాకవి ధన్యజీవి. ఈయనకిది యుగ్గుపాలతో నలవడినదేమో యనిపించును. భావ విలసనము, పదగుంభన లాలిత్యము, కల్పనౌచిత్యము, ఉత్ప్రేక్షాపటిమ, కొన్ని భాగముల సహజ సౌందర్య స్వభావోక్తి, విచిత్ర చిత్రరచన, లాస్యకళాభిజ్ఞాన వైదగ్ధ్యము, లౌకిక విజ్ఞాన విశేషము, విశిష్ట సంప్రదాయానుసరణ సరణి, పండిత పామరులను స్నిగ్ధముగ్ధులుగా జేయు మృదుల మధుర సరళ పదవిన్యాస మొక్కొక్కచో, ఘనగంభీర గర్జానము సమస్త భాగ్య భోగ్యమై యలరారుచు నవం నవతాఘటక నిత్య శ్రావ్యమగు కైతనల్లుటకే ఈ కవిని ఆ ఆదిమ నిత్యకవి సృష్టించెనోయను భావము వొడమును. ఈ కవివర్ణనమున విషయ విమర్శనము ఎంతో గహన పరామర్శ గల్గియుండుట శోభాయమానమై నిర్వికారస్థితి విరాజిల్లును. భోగినీ శారదా ఘట్టములు శ్రీనాథకవి రాజవైభవశ్రీ భక్తపోతనవైరాగ్యభక్తి విజ్ఞాన త్యాగాది సద్ధర్మనిష్ఠానుష్ఠానసామ్రాజ్యము కవితాసమాధిని సమకాలికకవి స్వప్రత్యక్ష విషయమట్లు వ్రాయు సిద్ధహస్తత భావించునప్పుడు మనమేకావ్య స్వర్గసీమల నేభావవీథులలో విహరించుచుందుమో నేను వాక్యరచనలో వివరింపగలనా? ఊరక యీ స్తుతి పాఠములు వల్లించుట నా సమ్మతి గాకున్నను, ఈయన కావ్యపాఠము వారంవారము నా వాగ్లేఖినుల ప్రేరేపణ కవళుడనైతిని. ఈ కవి యొక్కొక్క పద్యరత్నమునకు తన పవిత్ర రక్తబిందువుల నెన్నటిని వ్యయపఱచెనో?

కవిత తన యిష్టమగు సిద్ధాంతానుసార ముండవలయునను విమర్శకులు కవి కవితా మార్గములోని యానందము ననుభవింపజాలరు. ఈ కవి యింతకుపూర్వము వ్రాసిన "మణిమాల" మొదలైనవి సర్వ విదితమే. ఈ కవినిగూర్చి విశ్వనాథ సత్యనారాయణకవి పాత్రమాట్లుగారి, చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి సదభిప్రాయములతో నేనేకీభవించుచు నితనికి ఆయురారోగ్యాభివృద్ధిగా ఆశీర్వదించుచున్నాను.

4-12-1964
కుందనపల్లి

వానమామలై లక్ష్మణాచార్యులు

---

క॥ పావన పోతనచరితము
శ్రీ వరదుడె వరదుడయి రచించెననంగా
భావౌన్నత్య ప్రతిభా
శ్రీ విభవాన్వితముగా విశిష్టత నొందెన్॥

ఈతడు నా యనుజుడయ్యు గవితారచనయందు అగ్రజుడు, అగ్రసరుడు. కవితా దృక్పథముతో గాంచితిమేని ఈ కావ్యము మహాకావ్యముల పోకడలో నెందును తీసిపోవిది.

భక్తి దృష్టితో తిలకించితిమేని ఇది భాగవతమునకు సరస నిలుచుననుటలో నత్యుక్తిలేదు. కథాకల్పనా కౌశలమునను, భావౌన్నత్య, రసౌచిత్య, శైలీరామణీయకతలలోను ఈ కృతి ఆంధ్ర భారతీ స్వీకృతికి సర్వవిధాలా సముచితమైనది. ఆధునిక విశాలాంధ్ర సాహితీ సామ్రాజ్యపీఠిపై దీనికిని ఒక పూజ్యస్థానము లభించుననుటలో ఎట్టి సంశయముండదు. నా తమ్ముడగుటచే ఇంతటనే విరమింతును. ఈ వరదుని అఖండాయురారోగ్యసంపద లొసంగి వరదుడు రక్షించుగాత.

## వానమామలై జగన్నాథాచార్యులు

---

శ్రీమదభినవపోతన, మహా కవిశిరోమణి, శ్రీమాన్ వానమామలై వరదాచార్యుల వారు ఈ కావ్యమును ఇరువది సంవత్సరములకు పూర్వము వ్రాయుట కారంభించినప్పటి నుండియు, పలుతావుల, పలు సత్కవిగోష్ఠులలోను ననేక పర్యాయములు విని యానందించు భాగ్యము నాకు గలిగినది. తెలంగాణ ప్రాంతమునకే కాక నిఖిలాంధ్రమునకును నలంకార భూతు డీ కవిరత్నమనుట లతిశయోక్తికాదు.

నైసర్గికముగా విద్వత్కవిత వీరిలోనేకాక వీరి సోదరులలోను వెలయుటకు వీరు సుప్రసిద్ధ విద్వత్కుటుంబములోని వారగుటయే కారణము. మంద్రగంభీరస్వనముతో వీరు పద్యపఠనము చేయుచున్నప్పుడు, అందలి కవితా రసామృతము వినువారి సర్వేంద్రియము లకు సంతృప్తిని, అపరిమితానందమును గల్గించుటయేకాక, వీరి రచనా పాటవము విద్వాంసుల నుబ్బుతలూగించి యిక్కాలమునం దింతటి విద్వత్కవిశేఖరు డితరత్ర మున్నాడాయను నాశ్చర్యమును, ఆనందమును, తన్మయత్వమును గలిగించి, యప్రయత్నముగా ప్రశంసా వాక్యముల గురిపించునటు లొనర్చును. ఈ యానందానుభూతి మున్నగువానిచే శ్రోతల హృదయమునకు భావశబలత యేర్పడుచుండును.

వీరి కావ్యకవితలలోని వస్తుస్థితిని వర్ణించుట నా కలమున కలవిగాదు. భావుకులైన రసికపాఠకజనము ఇందలి రసాస్వాదనము నొనర్చి సహృదయ సదస్సీమల పుక్కిలింతురుగాత.

క॥ విద్వత్కవి తల్లజుడును విద్వత్కవివరుల కల్పవృక్షము బ్రాహ్మీ
చిద్విద్యా విలసదమల సద్వృత్తుడు వరదుడితని సన్నుతిజేతున్.

ఇట్లు
శిరోమణి, ఆంధ్రవిద్వాణ, బ్రాహ్మీభూషణ
కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

18-11-1966
హైద్రాబాదు

## సుస్వాగతము

శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారి పోతనకావ్యము యీనాటికి సర్వాంగ సుందరముగా ముద్రితమై ఆంధ్రపాఠకుల హస్తకమలముల నలంకరించుట అత్యంత ఆనంద కరమైన సంఘటన. ఈ సంఘటనను ఒక సాహిత్య పర్వమని చెప్పినచో అతిశయోక్తి కాజాలదు. ఆచార్యులవారి తొలిరచన మణిమాల. రమారమి రెండు దశాబ్దాలక్రింద ప్రకటిత మైనది. ఈ మధ్య వారు ఒకటిరెండు చిన్న కబ్బములను రచించినప్పటికిని, ఆంధ్ర వాఙ్మయములో వారికి శాశ్వతమైన స్థానము కల్పించిన గ్రంథము పోతనకావ్యమే. పోతన మహా కవికి విహారస్థలమైన ఓరుగల్లులో యిరువది సంవత్సరాలక్రిందట ఆచార్యులవారి తొలి కావ్యము మణిమాల ఒక మహాసభలో ఆవిష్కృతమైనది; ఈ కావ్యమును రచించవలెనను అభిలాషకూడ ఆనాడే వారి హృదయక్షేత్రమున మొలకెత్తి ఉండవచ్చును. తరువాత చాల స్వల్పకాలములోనే యీ గ్రంథరచనను వారు చాలమట్టుకు పూర్తిచేసి యుండిరి. ఈనాడు యీ మహాకావ్యము ముద్రణఅయి, పాఠక లోకానికి అందుబాటులోనికి వచ్చినప్పటికిని, యింతకుముందు అనేక మహాసభలలో వేలకొలది రసికుల సమక్షమున ఒక్కొక్క పర్యాయము గంటలతరబడి ఆచార్యులవారు మధురముగా గానముచేసి, సభాసదులను మంత్రముగ్ధులను గావించిన సంఘటనలు నాకు కొన్ని తెలిసియున్నవి.

పోతన జన్మస్థానమునకు, ఆచార్యులవారి జన్మస్థానమునకు మిక్కిలి దగ్గర. మణిగిరిలో ఉద్భవించిన దివ్యమణి శ్రీమాన్ వరదాచార్యులవారు; వారిది విద్వత్కుటుంబము. గొప్ప పండితులుగా, మహా భక్తులుగా వారి తండ్రిగారు ప్రఖ్యాతి గాంచియుండిరి. సంగీత సాహిత్యములు రెండును తండ్రిగారివద్దనుండి వరదాచార్య సోదర బృందమునకు వారసత్వముగా సంక్రమించిన మహాసంపద. తండ్రిగారికీర్తి జిల్లామట్టుకే పరిమితముకాగ, ఆచార్యుల వారి యశశ్చంద్రికలు సకలాంధ్రముమీద ప్రసరించినవి. వరదాచార్యులవారు జనక సమక్షము లోనే, అన్నగారి అడుగుజాడలలో సంస్కృతాంధ్రములందు కూలంకషమైన పాండిత్యమును సంపాదించిరి. దానితోపాటు ఆధునిక సాహిత్యమునుగూడ వారు వరసముగా అవగాహన గావించుకొనినారు. కావుననే యీనాడు తెలుగుకవులలో వారిది విశిష్టమైన వ్యక్తిత్వము. ప్రాచీన అధునాతన సాహితీపరులకు సర్వవిధాల మధ్యవర్తిగా మండదగిన కవిశిరోమణులు శ్రీ ఆచార్యులవారు.

ఆచార్యులవారి ఆదర్శము పోతనజీవితము. ఆ మహానుభావుని జీవితమువలెనే, ఆచార్యులవారి జీవితము చాల పవిత్రముగా, సంసార పక్షముగా జరుగుచున్నది. శృంగార భక్తి రసములు ఆచార్యులవారికి మిక్కిలి అభిమానాస్పదమని, యీ కావ్యము మరొకమారు ఋజువు చేయుచున్నది.

"యతివిటుడు గాకపోవునే అస్మదీయ
కావ్య శృంగార వర్ణనా కర్ణనమున

విటుడు యతిగాకపోవునే వెసమదీయ
కావ్య వైరాగ్య వర్ణనా కర్ణనమున"

అను కవిసూక్తికి ఆచార్యులవారి కావ్యము ఉత్తమ ఉదాహరణమై యున్నది. కరుణ రసమునుగూడ ఆచార్యులవారు చాల చక్కగా పోషించియున్నారు. పోతనకు శబ్దచిత్రము వలె, ఆచార్యులవారికి శ్లేష మిక్కిలి ప్రీతిపాత్రము. ఈ శ్లేష చాల సహజముగా, సుంద రముగా ఆచార్యులవారి కవిత్వమున ప్రత్యక్షమగుచున్నది. ఈనాటికిని నిఘంటువులకెక్కక, తెలంగాణ ప్రజల నాలుకలమీద నాట్యమాడు నుడికారము ఆచార్యులవారి కవిత్వమున పుష్క లముగా కనుపించుచున్నది. ఈ నుడికారమును వారు చాలనేర్పుగా, మనోహరముగా తమ పద్యాలలో అల్లుకొనినారు.

"పలికెడిది భాగవతమట, పలికించెడివాడు రామభద్రుండట" అను భవ్యమైన ఆవేశ ముతో పోతన ఆంధ్ర మహా భాగవతము పురాణించినాడు. ఇంచుమించుగా, అంతటి ఆవేశముతోనే ఆచార్యులవారు పోతనచరిత్ర కావ్యరూపముగా రచించినారు. పోతనామాత్యుడు భగవంతునిచరిత్ర యితివృత్తముగా తీసికొనగా, ఆచార్యులవారు పరమభాగవతోత్తముని కథను కావ్యవస్తువుగా స్వీకరించినారు. తెలుగు సాహిత్యములో సర్వవిధాల పోతనచెంత నిలువదగిన కవీశ్వరులు ఆచార్యులవారు. స్వయముగా వారు యీ కావ్యమును వినిపించగా వినిన పాఠకుల జన్మము నిస్సందేహముగా చరితార్థమనుసంగతి శ్రోతలకు తెలిసిన సత్యమే. ఈ కావ్యమునకు సుస్వాగతము. ఆచార్యులవారు యింకను యిటువంటి మహాకావ్యము లనేక ములను వ్రాయగలరని ఆంధ్ర ప్రభుత్వము, ఆంధ్రప్రజలు వారిని సముచితముగా ఆదరించ గలరని, పరమేశ్వరుడు ఆచార్యులవారికి దీర్ఘాయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించగలడని నా ప్రార్థన.

దేవులపల్లి రామానుజరావు

7-12-1966

కార్యదర్శి - ఆంధ్రప్రదేశ్, సాహిత్య ఎకాడమీ

---

## సూక్ష్మంలో మోక్షం

1946 కు ముందే పోతనచరిత్ర అచ్చవుతుందని ఆశించి మురిసిపోయినవాణ్ణి. 1966 లోనైనా పోతనచరిత్ర అచ్చుకావడం చూచినవాణ్ణి. అదృష్టవంతుణ్ణి. వరదన్నకు అతి బాల్యపు సంగడికాణ్ణి. పోతనచరిత్ర పుట్టుక ఎఱిగినవాణ్ణి. 'బాల రసాల సాల' బారసాల విందారగించినవాణ్ణి. వరదన్నను, పోతన చరిత్రను, అంగడిగాళ్ళు, (అధినేతలు, మంత్రులు, సామంతులు, రాజనీతి గారడీగాళ్ళు) ఆడించిన తైతిక్కల భాగోతంచూచి అలమటించినవాణ్ణి. అప్తుల. అమాయకుల ఆదరణతో వరదన్న, పోతన్న చరిత్ర బ్రతికి బయటపడటం చూచ

నోచుకున్నవాణ్ణి, నిజంగా అదృష్టవంతుణ్ణి. వరదన్నకూ పోతన్నకూగల పోలికే 'పోతన్న చరిత్ర'కూ తెలుగు భాగవతానికీ గలదు. ఎన్ని ఆటంకాలు ఇబ్బందులూ ఉన్నా కవులు వారి కృతులు బ్రతుకుతాయి. కృతులు అమరకావ్యాలై నిలుస్తాయి. కవులనుకూడా అమరులను చేస్తాయి. పోతన్నవలెనే వరదన్న ఆ మాట ఋజువుచేసినాడు. భాగవతంవలెనే పోతన చరిత్రమూ ఆ మాట నిలబెట్టుకుంటుంది. కవుల జీవితము ధన్యము. కృతులు ధన్యములు.

వరదన్నకు పోతన్నసంగతి, వరదన్నసంగతి కాళన్నకు......ఇది కవికుల మైత్రి. కన్నీటిలో మున్నీటి బస-పస - రెంటిలోనూఉంది ఉప్పన. రెండూ తెస్తాయి ఉప్పెన. ఇసుకదిబ్బల చేస్తాయి శెళన. ఇయ్యది పోతన చరిత్రమున నా గొడవన - మీరందరువిన - కనుపించిన సూక్ష్మంలో మోక్షం.

ప్రజాకవి, అభినవవేమన

కాళోజీ

3-7-1966

---

కవితా కల్పకం

రచనలోనేగాక గుణగణములందును పోతనను బోలినవారు శ్రీ వానమామలై వరదాచార్యులుగారు. కర్కోటకులుగూడ కవులుగా చలామణీ అవుతున్న ఈ రోజుల్లో కమ్మని హృదయంగల వరదన్నవంటి కవి ఉన్నాడని సంతృప్తి చెందుతాను.

నా జీవితంలో అసంభవం అనుకున్న రెండుపనులు జరిగాయి. ఒకటి హైదరాబాదు సంస్థానంలో నైజాం రాచరికం అంతమొందుట; రెండవది వరదన్న మృత్యుముఖంనుండి బయటపడుట; నాకు అపరిమితానందాన్ని కలిగించిన ఈ రెండు ఘటనలను ఏనాడూ మరువజాలను.

వరదన్న రచనలోని విశేషం ఏమిటంటే ఆయన నేలవిడిచి సాముచేయడు. మండు టెండల్లో ఘనంగా వర్షం కురిసినపుడు బయల్వెడలిన ఘ్రాణయోగ్యమైన మృత్సాన్నగంధం మీద వరదన్నకున్న మక్కువ కృత్రిమమైన అత్తరులయందులేదు. కనుకనే పోతన చరిత్ర వ్రాయగలిగాడు. మట్టిలోనుండి వెలువడినమణి వరదన్న.

వేల పద్యాలుగల ఇంత బృహత్కావ్యం వరదన్న 20వ శతాబ్దం రెండవభాగంలో రాశాడంటే ఆయన సంయమం, ఏకాగ్రత అమోఘమని చెప్పాలి. ఆరు పద్యాలురాసి ఏదో పద్యానికి విషయంలేక అంతటితో ఒక కావ్యం పూర్తిచేసినంతగా అలసటపడే ఈనాడు బృహత్కావ్యం వెలయించడం సాధారణ విషయమా!

వరదన్న ఇంతటికావ్యం వ్రాయడం ఒకయెత్తు, ఇది అచ్చుకావడానికి ఈయన పడ్డ పాట్లు ఒకయెత్తు. ఈ శ్రమ లేకుంటే మరో ఇంతకావ్యం రాసేవాడు. కవి, ప్రచురణకోసం కూడా పాట్లు పడవలసిరావడం మన దేశ దౌర్భాగ్యం.

ఏమైనప్పటికీ "పోతన చరిత్రము" అచ్చుకావడంలో వరదన్నకు తోడ్పడ్డ ప్రతివ్యక్తి అభినందనీయుడు.

కవిత్వంపేరిట లొల్లాయపదాలు వెలువడుతున్న ఈ రోజున "కవిత్వం అంటే ఇది" అని ప్రత్యక్షంగా చూపగల మహాకావ్యం "పోతన చరిత్రము" నేడు వరదన్న అఖిలాంధ్ర కవి. వరదన్ననుండి నేను చాలా నేర్చుకోవాలి. పోతన చరిత్రము కవితా కల్పవృక్షము.

"యువకవి చక్రవర్తి" దాశరథి

---

కాళన్న, దుర్గన్న, వరదన్న మాకంటె పెద్దతరానికి చెందినవారు. అనుముల కృష్ణమూర్తి నేను చిన్నవాండ్లం. మా అందరిదీ ఒకేఊరు. అంతపెద్ద గ్రామంలో కుమ్మరివాని బావి – ఒకే మంచినీళ్ళబావి. ఆ నీళ్ళే మే మందరం త్రాగినవి. ఊరిలో వేణుగోపాలస్వామి, ఊరిబయట గుట్టమీద మెట్టురామప్ప; వేణుగోపాలస్వామి ప్రసాదం అందరూ తిన్నవారే. మెట్టు రామప్పగుండంలో అందరూ ఈతలు గొట్టినవాండ్లే. అక్కడి కంచెల్లో సీతాఫలాలు పగటి ఫలాహారాలు. మా మడికొండలో ఊరికి పడమట కోటంత రాతిభవనం తౌటిరెడ్డి గోపాలరెడ్డిగారిది. అందులో వరదన్న తండ్రిగారైన బక్కయ్య శాస్త్రులుగారి పురాణ కాలక్షేపం. "వింటే బక్కయ్యశాస్త్రులుగారి పురాణం వినాలె, తింటే గారెలుతినాలె" అనేది మా ప్రాంతీయం. ఇంకొకచోట సందుల కిష్టయ్యగారింట్లో నిత్యమూ సాహిత్యగోష్ఠులూ, భాగవత కాలక్షేపాలు, శ్రోతలు మా పెదనాయనగారైన రామవరాజుగారు, తౌటిరెడ్డి నరసింగా రెడ్డిగారు, ఆకుల కిష్టయ్యగారు, అవాల కృష్ణారెడ్డిగారు, పింగలి వెంకటేశ్వరరావుగారు మరికొందరు.

వీటి ప్రతిధ్వనులు వేణుగోపాలస్వామిగుడిలో మెట్టురామప్పగుండంలో, ఈనాడా ధ్వనులేవీలేవు. మేమంతా చెట్టుకొకరు పుట్టకొకరు విడిపోయి ఎవరి బ్రతుకులు వాళ్ళు బ్రతుకుతున్నాము. ఈ ధ్వనులన్నీ గుండెల్లో రంగరించుకున్నది వరదన్న. వరదన్నచేసిన అనంత తపఃఫలమీ పోతనచరిత్ర. పోతన్నకూ వరదన్నకూ ఏదో సంబంధం ఉన్నది. ఎన్నో గండాలుగడచి బ్రతికినవాడు వరదన్న; ఎన్నో చీకట్లుచూచి వెలుతురులోనికివచ్చింది పోతనచరిత్ర. తెలుగుభాష ఉన్నంతకాలం భాగవతం నిలుస్తుంది; పోతనచరిత్ర నిలుస్తుంది. అది త్రిలింగ ధాత్రికి రత్నదీపం. ఇది తెలుంగుబాసకు నిజస్వరూపం.

డా. బి. రామరాజు "రీడర్"
ఉస్మానియా యునివర్సిటీ

వ ర ద న్నా !

1

గుండెలోన రసవదర్థ భాండమ్ములు కలవాడా
గొంతులోన పుంస్కోకిల కూజితములు కలవాడా
నిన్నేమని వినుతింతును అన్నా ! వరదన్నా ! నీ
మనసువెన్న, తనువువెన్న, మాటతీరువెన్న.

2

ప్రాణమున్న భావాలకు నీ నుడియే వాణికిగుడి
ఆకుపచ్చ ఊహలకే నీ కావ్యం ఆరవిమడి
చిక్కని కవితకు నిన్నే చెప్పుకొందునో యన్నా !
నిన్నుమించు కవియేడీ ? ఉన్నాడొక పోతన్న.

3

ఎంతటి పుణ్యమ్మును పండించుకొన్న దోరుగల్లు
పోతన్నకె కా దభినవ పోతన్నకు పురుడుపోసె
'రత్నగర్భ'నామము సార్థక మీ తెలగాణమునకు
పూత భాగవతముతోడ పోతనచరితము జనించె.

4

ఒక ఊపిరి తి త్తిని మి త్తికి కబళముగా నొసంగి
విలవిలలాడెడు శబ్దమ్ముల కూపిరి పోసినావు
బువ్వకు సరిపోవునన్ని గవ్వలు లేకున్నగాని
మవ్వపు కైతలు రచించి రవ్వలు రాల్చితివినీవు.

5

కృతులలోన బ్రితుకులోన 'యతి'స్థితిని నిల్పుకొన్న
వరదా ! నీ కందింతును తరుణగేయ కల్హారం
మనుషులకే కాదుసుమా ! అనిమిషులకు సైత మలం
కృతియై వెలుగొందుత నీ మృదులాక్షర మణిహారం.

గేయకవిసామ్రాట్

డా॥ సి. నారాయణరెడ్డి "రీడర్"
ఉస్మానియా యునివర్సిటీ

నమోవాకము

1

వరదాచార్య మహాకవీ ! మధురభావస్ఫూర్తి దీపించు కా
వ్యరమా కీర్తివి వేయినోళ్ళవిని తద్భావ్యస్వదర్శి పైకాత్మ సుం
దరతా సాంద్రిత జాడగోరి మిగులన్ దవ్వున్న గోదావరీ
ఝరిణిన్దాటి భవన్నివాసపురి కుత్సాహంబునన్ వచ్చితిన్.

2

వరదాచార్యుల యింటికేగితిననన్ బ్రహ్మాండమైనంత సం
బరముంబొందితి నాంధ్రదేశ కవితా వారాన్నిధిన్ బోతరా
ట్చరితంబే సుధయై జనించెనన నాశ్చర్యంబె ? యత్యుక్తియే
దరిదాపుల్ కనుగొంటివయ్య కవితోద్యత్ క్షీర పాథోనిధిన్.

3

నీ కావ్యంబును మొన్న మొట్టమొదటన్నే నే సమగ్రంబుగా
నా కర్ణంబులవింటి నప్రతిహతా నందంబునుంగంటి నెం
తో కష్టించి స్వకీయ రక్తమును సంతోషాన జిందించి కా
దే ! కాలున్ బెదరించి వ్రాసితివి తద్దివ్యత్ ప్రబంధంబహో.

4

ఎన్నియుగాలనుండి తపియించుచు వచ్చుచు నుంటివయ్య
యత్యున్నత లక్ష్యమున్మధు మయోక్తుల కావ్యమునందు జూప నీ
హృన్నవనీతమే కరగి యాకృతి యాకృతియై వివిర్గమిం
చె న్నిఖిలాంధ్రలోక కవిశేఖర ! శ్రీ వరదా ! రసాస్పదా !

5

నీవు రచించినట్టి రమణీయ మహాకృతివంటి సత్కృతుల్
లేవని చెప్పుటబ్బురములే మనసుబ్బ వచించునట్టి నా
యీ వచనంబులం దనృతమింతయు లేదని యా రసజ్ఞతా
దేవత గొల్చువారలకు తెల్లము మొల్లము నీదు కీర్తియున్.

6

క్షయనిర్మూలనమయ్యె కావ్యరచనా కాలంబు సొంతంబుగా
జయలక్ష్మి లలన వ్వరించితివి భాషాయోషకున్భూషల
క్షయవిఖ్యాతి నివాసభూములగు సద్గ్రంథముల వ్రాయుచున్
నయనద్వంద్వము ముందునిల్పు వరదన్నా వేయిసంవత్సరాల్.

7

వరదాచార్యులు పోతనం దలపు నన్వర్తింపజేయు న్స్వభ
క్తి రసావేశమునం దటంచు జనముల్ కీర్తించు టాశ్చర్యమే
బిరుదుల్ పొందిన పండితుల్ కవులు సంప్రీతిన్ వినుం బిల్చుచో
"వరదన్నా!"యన మా హృదిన్ వరదలై పారున్ భవద్భక్తియున్.

8

నా హృదయస్థలిన్ దృఢతనాటు కొనెన్భవదీయ ముగ్ధ స
మ్మోహనమూర్తి ఫాలమున ముద్దులుగుల్కెడు నూర్ధ్వ పుండ్రముల్
దేహరతాంతరాత్మరుచి తెల్లముగా మొగమందు వెల్గ నా
నూహకు దట్టు సత్కవికులోత్తమ! దివ్య రసంపు పొత్తమా!

9

బాలకృష్ణాధరన్యస్తవంశ నాళ
రంధ్ర నిర్గత మధురస్వరాల లీల
తావకీన హస్తాబ్జానం సేవితమగు
గంటపు మొగాన జాల్వారు కావ్యసుధలు.

10

నవరత్నంబుల బంపుచుంటి కొనుమన్నా నీదు పోతన్న మా
నవ కల్యాణముగూర్చ లోకమున సంచారమ్ము గావించుచున్
రవిసోముల్ భువివెల్గ నంతవరకున్ రాజిల్లుతన్ జెల్లుతన్
భవదీయోత్తమ కావ్యవాణికి కవిబ్రహ్మా! నమో వాకముల్.

భవద్విధేయుడు

"కవిశేఖర" చెప్యాల రామకృష్ణారావు

మేడిపల్లి

## అభిప్రాయము

సీ॥ వాగనుశాసను వాచావిలాసంబు శంభుదాసుని కళా చతురిమంబు
సోమయాజుల రసస్ఫురణ వాక్యచయంబు పోతన్న ధారాప్రపూర్ణరీతి
శ్రీనాథ కవివర్యు సీసవిన్యాసంబు అల్లసానికవీంద్రు నల్లికజిగి
కూచిమంచి కవీశు గుంఫనాగరిమంబు చేమకూరసుకవి చేవతనము.

గీ॥ పదపదంబునఁ బద్యంబు పద్యమందు రసరసంబున బింబింపనెసగు నీదు
కైత సర్వజ్ఞశిరము లూగంగఁజేయు వానమామల వరదార్య! వాగ్మిధుర్య!

కం॥ పొందమ్మి పూలయందము కుందమ్ముల సోయగంబు గొనకొన వాణీ
మందస్మిత రసములతోఁ గందాదుల నడిపితీవు కవిమూర్ధన్యా!

శా॥ సర్వజ్ఞుండు వహింప నబ్బురము, భాషాస్వామి వాచాలతా
గర్వంబున్ దిగనాడఁగా గురుఁడు ప్రజ్ఞాధుర్యతన్ గోలుపో
నర్వాచీన కవిత్వభావ విలసద్వ్యాహారముల్ గూర్చు నీ
కుర్విన్ సాటియొకండుఁ గల్గనె? ప్రబంధోద్యోగమందున్ సఖా!

మ॥ తలలూపన్ సుకవీంద్రులాప్తతతి మోదంబందఁ బాండిత్యభో
జులు చిత్తంబుల సంతసింప మిగులన్ శోభిల్లు నీ కైతయన్
లలనారత్నము వాగ్వధూరచిత లీలాభూషయై. నీదు పూ
జలు పండించి యశంబుఁగూర్చుఁ గవిరాజా! యెంత ధన్యుండవో!

శా॥ పూవుల్ వెట్టి దిశావధూ శిరములన్ ముద్దాడి జాబిల్లి స
ద్భావా మోదముఁగూర్చి శేషునికడన్ బాంధవ్యముల్ చెప్పి వా
గ్దేవీ సన్నిధి ముద్దు ముచ్చటలచే దివ్యాపగన్ దేల్చి వ
త్ప్రావీణ్యంబు వెలార్చుఁ గాత వరదార్య ప్రౌఢ వాఙ్మల్లికల్.

కం॥ నోచిన నోములుపండుట పూచిన పువులన్ని పిందెఁబొందుట పరిగా
నీ చతుర కావ్యరత్నం బాచంద్రార్కంబు వెలయ నాకాంక్షింతున్.

విద్వాన్ శిరోమణి
**శ్రీ కేశవపంతులు నరసింహశాస్త్రి**
ఆకాశవాణి కార్యక్రమ నిర్వాహణాధికారి
(ప్రోగ్రాం ఎక్జిక్యూటివ్)

హైదరాబాద్
26-11-66

# పోతనచరిత్రము

శ్రీ వానమామలై వరదాచార్యులుగారు రచించిన 'పోతనామాత్యచరిత్ర'ను సభల యందు వారప్పు డప్పుడు చదువగా వినియుంటిని. ఇప్పుడు కొన్ని భాగములను చదివి యానందించితిని. ఈ యుద్గ్రంథము వర్తమాన సాహిత్యరీతులకు ఎదురీతయని చెప్పిన తప్పులేదు. ఈనాడు కవిత్వపు సెలయేళ్ళు, పిల్లకాలువలు, బోదెలుమాత్రము చెల్లుచున్నవి. కవిత్వపు గంగా గౌతములు అపురూపము. కవితావాహినియొక్క పరీవాహ ప్రదేశము అల్పాల్ప పరిధులలో ఇమిడిపోవుచున్న ఈ కాలమున సువిస్తృతమైన ఇతివృత్తమును గైకొని, స్వతంత్రమైన కల్పనలతో ప్రతిభావంతముగ మహాకావ్య ధోరణిలో కవిత్వము నడుపుచున్నవారు ఇద్దఱు నా దృష్టికి వచ్చుచున్నారు. ఆంధ్ర పురాణకర్త శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు, పోతన చరిత్రకారులు శ్రీ వరదాచార్యులవారు.

ఆంధ్ర పురాణమునకు పూర్వరంగముగా ఐతిహాసిక కథానకము కొంతయైనకలదు. పోతనచరిత్రకు ఆ సాయముకూడ కనబడదు. ఇట్టి స్థితిలో విస్తృత ప్రబంధమును నిర్మించ గల వరదాచార్యులవారి భావనాశక్తిని ప్రశంసించకతీరదు. మన భాషలో కవివతంసుల జీవితములు కావ్యవస్తువగుట అరుదు. తంజావూరు రఘునాథ రాయలవారి ధర్మముగా వాల్మీకి మహర్షికి అట్టి ధన్యత తెలుగునందు చేకూరినది. మధురవాణి వాల్మీకిచరిత్రను సంస్కృతీకరించిన బాగుండి యుండును. కృష్ణరాయ విజయమున్నదికాని అచ్చట కృష్ణ రాయలు సమరాంగణ సార్వభౌముడుగానే ప్రకాశించుచున్నాడు. నన్నయ తిక్కనలు అట్టి యదృష్టమునకు నోచుకొననేలేదు. కాగా వానమామలై వారికి పోతనామాత్యునియందుగల అపారమైన భక్తిచే పోతనకావ్య మీనాటికి యవతరించినది.

వరదాచార్యులవారి కవిత్వము సలక్షణమై ద్రాక్షా పాకముగానే యున్నది. పూర్వపు తెలంగాణ కవులకుండిన శ్లేషకవితాప్రీతియు, ఉత్ప్రేక్షారీతియు ఆచార్యులవారి రచనలో కొంచెము కొంచెము తొంగిచూచుచున్నవి. వరదాచార్యులుగారు ప్రకృత్యారాధకులు. తెలంగాణము గ్రామీణ జీవితమును నిపుణముగా ఆకళించుకొని వీరీ గ్రంథమునందు చక్కగా ప్రతిబింబింప చేసినారు. ఇచ్చటి సాంఘిక దృశ్యములు పాల్కురికి జాతర వర్ణనలో ప్రత్యక్షమగుచున్నవి, కాలయవనికాభ్యంతరమునకు నిష్క్రమించుచున్న సాహిత్య సాంఘిక మానవతా ధర్మములకు ఉజ్జ్వల ప్రతీక పోతనచరిత్రము. హరిహరా భేద సందేశమును ఈ కావ్యమునందు నిక్షేపించి మన కవిగారు బమ్మెర పోతరాజుగారికి వరణీయులైనారు. శ్రీశైల తిరుమలక్షేత్రములందు వేంచేసియున్న భగవంతుడు శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారికి పెక్కు సంవత్సరములు 'కావ్యరసముం గొనియాడు' శక్తిని ప్రసాదించుగాక !

ఆచార్య, ఖండవల్లి లక్ష్మీరంజనం
(రిటైర్డు) తెలుగుశాఖాధ్యక్షులు
ఉస్మానియా విశ్వవిద్యాలయము

6-12-1966
విద్యానగరం

స్వానుభవము

మ॥ పరమేష్ఠి ప్రియకామినీ విమల దృగ్ద్వంద్వాంచల ప్రసృవ
త్కరుణాపూర్ణ విశాల శీతల కటాక్ష స్నిగ్ధ పీయూష సు
స్థిరధారా పరిషేచనా నిశవివర్ధీ భూత పాండిత్య ని
ర్భర నిర్మోఘ బలప్రభావకృత గీర్వాణాంధ్ర భాషా ప్రకాం
డ రసప్రాంచిత నవ్య భవ్యకృతి షండ ప్రాభవోద్భాసి కే
సరి, రామానుజ దర్శనాదృత సదాచార ప్రపూత ద్విజో
త్కర మదామణి వానమామల సదాఖ్యా దీప్త సద్వంశ
సాగర సంభూత శరత్స్ఫురత్సమయ రాకాచంద్ర బింబంబు
శ్రీ వరదాచార్య సమాహ్వయాంచిత కవిబ్రహ్మంబు స్వర్గాపగాం
తర రారాజిత జాతరూపమయ పద్మవ్రాత నిష్యంద బం
ధుర సుస్వాదు మరంద పాన పరిసంతుష్టామరీ భ్రామరీ
పరిషత్కల్పిత మేదుర స్వర వరప్రఖ్య స్వరంబొప్ప ని
ర్భర కారుణ్య రసప్రసారమును నాపైఁ బంపి విన్పించె ని
ర్జర దైతేయ సమూహచాలిత పయో రత్నాకరాంత స్థమం
దర భూమీధ్ర పృధుత్వరా పరిలసత్ప్రవ్యా పసవ్యాతి దు
ర్భర దుశ్శక్య నిరంతర భ్రమణ కార్య ప్రోత్థ గంభీర భీ
కర చిత్తాపహర త్రిధాస్ఫుటిత నిక్వాణానురూప ధ్వ
ని స్ఫిరసంరబ్ధము చంద్రశేఖర జటాభిత్యక్త గంగా పగా
శరవేగాత్త శరప్రవాహతులిత స్వచ్ఛంద భావాభియు
గ్వర ధారా పరిశుద్ధి దీప్తము, మరుత్వన్నందనోద్యాన సుం
దర మృద్వీకఫల ప్రసిద్ధ మధురత్వ ప్రస్ఫురత్కల్పనా
దరణ ప్రోద్ధృత శంసనీయ నవనీత ప్రాయ పాకైక వి
స్ఫురితంబుంబ్రతిపద్య సంకలిత వైశద్య ప్రమేయ ప్రభా
కరమున్ తత్క్షణ మోదకృత్తతి దనీక ప్రాభవోపేత భూ
రి రసాంచద్గురు భావ భావిత చతుర్వింశచ్ఛతో ద్యన్మనో
హర పద్యాగ్ర్యమణీ గణాంచితము భావాతీత వైశద్య

ధూర్ధరమా పోతన కావ్యమున్; మదిని మోదంబబ్టి తొల్కొ_త్త(గా
శిరమాడించుచు, నుబ్బుచుం బళిబళీ సేబాసటంచున్ మహ
త్తర పాపంబులు దుల్లెనంచును కవిత్వంబన్న మీదే సుమీ :
వరదాచార్య ! యటంచు వింటిని కథాభాగంబును శ్రద్ధతోన్.

ఇనుగుర్తి
29_10_1954

డా॥ ఒద్దిరాజు సీతారామచంద్రరావు

శ్రీ పోతనామాత్యుల చరిత్రమును శ్రీ వానమామల వరదాచార్యులవారు రచించిరి. దీనిని ప్రత్యేకముగను సమాజ గతముగను రెండుమూడు పర్యాయములు నేను విని తన్మయుడనైతిని. గ్రంథమంతయు సుధా లహరివంటి ధారతో నుండినది. శ్రీ పోతరాజుగారి కవన ముపమానమా ? లేక యుపమేయమా ? అనునంతటి తీరుతోనున్నది. అందరును విన్నవారు జేజేల నెత్తినారు. "విజ్ఞాతారస్తు దుర్లభాః" అను నా నుడి ఇట పనికిరాలేదు. అందరును రసపరీవాహము ననుభవించినవారే. అందును నృత్యఘట్టము శబ్దశక్తిచేతనే అందరిని లోగొన్నది. దీనిని సమగ్రముగా వర్ణించుటకు నాకు శక్తిచాలదు. కేవలముగా నా మాటలు కొంత పరిచయమును గల్గించునవే. ఈ విషయమును పాఠకులందరును వెంటనే గుర్తింపగలరు. సరసములగు శబ్దములలో లాలిత్యముపొదిగి బంగారుతీవెకు పరిమళము మార్దవమును గల్గించినారు శ్రీ ఆచార్యులవారు. ఈ గ్రంథ మన్నివిధముల నుత్తమోత్తమమనుట కన్న నేనిక నేమియు వివరింపలేను. ఇట్టి యుద్గ్రంథముల నింకను శ్రీ యాచార్యులవారి లేఖినినుండి నే నభిలషించుచున్నాను.

6_12_1966

శిరోమణి
శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు

---

అమృత భాగవతానుభూతి తన్మయత జీవితమై
పోతన సుకృతి అవతరింపగా
అమృత భాగవత పోతన జీవిత భాగవతానుభూతి తన్మయత జీవితమై
వరదన సుకృతి అవతరించింది.

ఆంధ్రవాఙ్మయ మహాధ్యక్ష
శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యా

శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారి పోతనచరిత్రంలో కొన్ని పద్యాలు కొన్నేళ్ళక్రితం మొదట విన్నాను కాటూరి మహాకవితో కలిసి ''కావ్యం అంతా వినగలిగితేనా ?'' అనిపించింది మాకు.

ఈమధ్య ఆ గ్రంథం దాదాపు పూర్తిగా చదివాను; చదివి ఎంత ఆనందించానో !

''తారక రసాయనము'' స్వామి కరుణిస్తే, ''కమ్మని కైత'' పోతన్నను వలచిందట; ఈ వరదన్నకు ఏరసాయనం నిజంగా దొరికిందోగాని !

ఈయనది గాఢమైనశక్తి – మహాగట్టిదీక్ష, సంపన్నమైన కల్పన. అవి లేకపోతే ఈ రోజులలో ఇట్టి కావ్యాన్ని రచించగలగడం ఎలాగ ? అసామాన్యమైన ఆవేశం ఈయనను ఆవహించి ఉండాలి !

పీరికావ్యం 'ప్రజా హృదయవీధుల నిర్మల ధర్మదేవతా లోకములన్' సృజింపగలదు.

దేవులపల్లి కృష్ణశాస్త్రి

---

ధన్యవాదాలు

శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారు రచించిన "పోతన జీవితము"లో కొన్ని పద్యాలు వినగల భాగ్యము నాకు లభించింది. విని ఆనందించాననడము ఒక విశేషముకాదు. పూర్వ కవీశ్వరుల పంథాలో సంప్రదాయానుసారంగా సాగిన యీలాంటి కవనము వినగలుగుట ఈ దినాలలో చాల అరుదు; కాబట్టె ఆనందము ఇనుమడించింది.

ఆచార్యులవారు సుప్రసిద్ధమయిన విద్వత్కుటుంబములో జన్మించారు. ఆ కుటుంబములో దాదాపు అందరు బహుభాషా కోవిదులు, శాస్త్ర పారంగతులు, కవి పుంగవులయి, తమ రచనలతో ఆంధ్రసరస్వతి నలంకరించినవారని విన్నాను. అందుచేత ఆయా మెలకువలూ, సంప్రదాయాలూ వరదాచార్యులవారికి సాక్షాత్తు వెన్నతోబెట్టిన విషయాలు. ఆ విషయ పరిజ్ఞానానికి వారు తమ కుశాగ్రబుద్ధినీ, విమర్శనా పాటవాన్ని జోడించి రచనను సాగించినారు. చక్కని ఊహాచాతుర్యముతో గ్రంధములో ఆయా సన్నివేశాలకు మనోహరమయిన రూపకల్పనలు చేయగలిగారు. గ్రామజీవనమును బాగా ఎరిగినవారు, పేదరికాన్ని సానుభూతితో గుర్తించినవారు, కవీశ్వరులకు సహజమయిన స్వాతంత్ర్యాభిలాష తెలిసినవారు, మానవ స్వభావముల పరిణామ వికాసముల పరిశీలనకలవారు కాబట్టి ఆచార్యులవారు పోతన జీవితం రచించడం అన్నివిధాలా సమంజసమే.

మరొక్క విషయము : పోతన తన భాగవతములో చాలినంత సంస్కృత భాషాపద సముదాయాన్ని ఉపయోగించినా, ఆంధ్రపాఠకుడు దాని బరువునుగాని కష్టాన్నిగాని గమనిం

చదు; తన భాషా గ్రంథాన్నే చదువుతున్న ననుకుంటాడు; మరికొందరు కవులుపయోగించే సంస్కృత పదాలలాగా పోతన సంస్కృతం తెలుగుపాఠకులను చీకాకుపెట్టదు కారణ మేమంటే తెలుగుమాటలతో కలిసిపోయి, తెలుగులో లీనమయిపోగల మెత్తని సంస్కృత మనే పోతన ఉపయోగిస్తాడు. అది పోతన సంస్కృత పదప్రయోగ రహస్యము. ఈ రహస్యము మన ఆచార్యులవారు ఉద్దేశపూర్వకంగా అవలంబించారో లేదోగాని, వారి కవిత్వములో అది ప్రత్యక్షంగా కనబడుతూఉంది.

తరువాత ఆచార్యులవారు పోతనవలెనే కవితాధారకోసం అర్థగౌరవాన్ని పాటించకుండ పోయే స్వభావముకలవారుకారు ధార నెక్కడా కుంటుపడనీయకుండానే వారు పదముల విలువలను పాటిస్తూ రసపుష్టిని సాధించగలిగినారు. వసుచరిత్ర విజయవిలాసాలవంటి ఉత్తమ ప్రబంధాలలోని మన హృదయాల నాకర్షించగల పదప్రయోగ సారళ్యమూ, తెలుగు నుడికారమూ లోకోక్తుల అమరికా మొదలైన గుణాలతో "ప్రసన్న గంభీరగతి" నున్న ఈ పోతన జీవితము ఆంధ్ర భాషామతల్లికొక అమూల్యాభరణము కాకమానదు. ఇట్టి గ్రంధాన్ని సమర్పించగల 'అభినవపోతన్న'. ఆచార్యులవారు ధన్యజీవులని వేరే చెప్పనక్కర ఉండదు.

మన ఆచార్యులవారికి ఉభయభాషల కవిత్వమూ, పాండిత్యమూ మాత్రమేకాక అమోఘమైన కల్పనాచాతుర్యము, సంగీత శాస్త్రవిజ్ఞానము, నృత్యాది విషయాల పరిచయము కూడ ఉండడం ఒక విశేషము. "భోగినీదండక" సన్నివేశములో వారు చూపించిన బహుముఖప్రజ్ఞ అసాధారణము. ఈ విషయాలనుబట్టి చూచినట్టయితే ఆది పోతన్నకన్న అభినవ పోతన్నే పైచేయి అవుతుందేమో !

ఇటువంటి ఉద్గ్రంథాన్ని రచించి తన కుటుంబకీర్తితోపాటు ఆంధ్రసాహిత్య కీర్తినిగూడా పోషించిన శ్రీ వరదాచార్యులవారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు. త్వరలోనే సంపూర్ణ గ్రంథాన్ని చదువగలుగుతానని ఆశిస్తున్నాను.

హైదరాబాద్
20-12-66

ఆంధ్ర విశారద
తాపీ ధర్మారావు

---

భోగినీ నర్తన శోభ

.........అలరించి మనసెల్లా నాడించి, పాడించి, మురిపించి, మరపించి, కరగించి, కదలించి, ముదమునిచ్చుచు నట్టె నిదురబుచ్చుచు మించినదీ నట్టువరాలి కళావిన్యాస వర్ణనము. నిజానికీ భాగము రససిద్ధి నందినది. మరి సింగన్నృపాలునంతటివాడు భోగినీవశుడై యుండ నిచో......భోగినీ దండకమే వెల్వడియుండదు.

ఎంత నాట్యకళా పరిశీలనము—ధారణాపటుత్వముగలిగినగాని యింత విశదముగా, కండ్లకు గట్టినట్టులా దృశ్యముల వర్ణింప నలవిగాదు. కవిత వేరు—నాట్యము వేరు. నాట్యము నూహించియో, చూచియో కవితాబద్ధముచేయ సమకట్టుటయే సాహసము. అందునా యిట్టి పసందైన భోగినీ నూహించి దానిని మన కళ్ళకు సాక్షాత్కరింపజేసెదికీతిని, మృదుమధుర పద బంధురోపేతమై—అనర్గళధారా పరిపుష్టమై యొప్పు రచనము సాగించి మెప్పించుటలో కవికృతకృత్యులైనారు. చదివినంతసేపును, సింగభూపాలుని కొల్వున వివిధ నృత్యభంగిమలలో నాట్యమాడుచున్న భోగినియే కండ్లగట్టును.

నట్టువరాలికెట్టి యంగాంగ సౌష్ఠవము వలయునో భోగినీ వర్ణనములో తెలియవచ్చును. రాజనర్తకి సభాప్రవేశము—ఆమె భంగిమ ఎట్లుండవలయునో ప్రత్యక్షమగును. ఆమె ధనమ్మ సత్కళయొకండె; గీర్వాణాభ్యాసము చేసినది; గానశాస్త్ర వైదుష్యము గడించినది; అంతే కాదు — హృదయాహ్లాదకరమైన ఆంధ్రభాషయందును పాండిత్యము నార్జించినది. మరియును జయదేవగేయ సుమవాటీచారు సంచారకృన్నృత్యోపేత మనోహరాభినయములను నేర్చినది.

దివిగులు కురంభకళలను దించివేయు నా భోగిని యర్హతలు నిజముగా గర్వకారణములైనవే! అందులకే తల్లి తనసుగూర్చి తెలుపునపుడు చాలులెమ్మని బొమముడుల్ గ్రాలవిసిని తన ప్రజ్ఞాప్రదర్శనకై యనుమతిగోరినది. సింగభూపాలుడు మాత్రము సరియైన రసికుడు గాకున్నెగదా! అంతటి విద్దెల ప్రోవునకు నేనేమియు నిర్దేశింపగూడదను కొనెనేమో; నీకు తన్మయత్వము గలిగించు నృత్యమే చేయుమనెను. అనవలసిన విధమది — ఆ పల్లవాధరయు నతని సరసవచో విలాసమున కానందించి అంజలించినదట.

చక్కని సన్నివేశము — అంతకన్న మిన్నయైన కవియావేశము — రెండువిద్యలలోను వారికిగల పాండిత్య ప్రవేశముకలిసి బహు రమ్యతర సమావేశమై పాఠకుల కనాయాసముగా భోగినీ నాట్యవిలాసము దృశ్యమానమైనది. బమ్మయు తిమ్మగొన నాట్యాంజలి సమర్పించిన నర్తకి సింగభూపాలుని ప్రస్తుతించితేని పై తనకుగల భక్తి తాత్పర్యముల ప్రకటిత మొనర్చినది. ఇచటి ఆదితాళములో గూర్చిన జతి కవిప్రతిభకు గీటురాయి. లక్షణలక్షితమై భోగినీ నూపురనిక్వణముల నొక్కసారి జ్ఞప్తికి తెచ్చినట్లున్నది. తదుపరి సృష్టికారకుడును జగత్పరిపోషకుడునైన హరిని నుతించిన దా సన్నుతాంగి.

ఇచ్చటనే యాచార్యులవారి కలము ప్రసాదించిన భోగినీ వైశిష్ట్యము విస్పష్టమగును. పోతన యంతటివాని హృదయమునుగదల్చి, రసానంద తరంగముల దూగించిన యా జవ్వని నేర్పు కడుంగడు ప్రశంసనీయము. కొలువుకూటమున — అందును రసికజన సమక్షమున — ఆడవలసిన నృత్యమా అది? ఆ మిసిమి పసిండి మేల్తళుకుల నొలకవోయు సుందరి నాట్యమాడినంతసేపు, శృంగార గంగాప్రవంతుల దేలియాడ నరుదెంచిన రసికావతంసుల మనస్సులు చివుక్కుమనవా? ఎంతసాహసము! తనకు తాదాత్మ్యమును గల్గించునృత్య మదియే

యని చెప్పినట్లు లైనదామె చెయిదము. కంటిరెప్పైనను గదల్చకుండగా జూచుచున్న ప్రేక్షకులు సైత మనిమిషులై యా మోహినీరూపమున విష్ణువు నవతారముల గాంచుచు పరితుష్టాంతరంగులైనారు. నాట్యము కనుకూలమైన సరణిని, పలువురు పండిత ప్రకాండులు బలే. సెభాసను తెరగున – దశావతార వర్ణనము సాగినదిచట.

అలసట నెరుగని లలితాంగి యంతనె ముసిముసినవ్వులు పువ్వులు బూయగా మరల శృంగార భంగిమ లుప్పొంగ సభాసదుల హృదయసదనముల జొరబడినది. భక్తి యెక్కడ? శృంగారమెక్కడ? అయ్యును తన నిష్ణాతృత్వమును నిరూపించుకొనజాలు సత్తరుణము నామె వృథబోనీయలేదు. వివిధ ముద్రిలను, బహుభంగిమలను ప్రదర్శించి సింగన్నపాలుని మనసును రంజింపజేసినది. ప్రేక్షకుల నెల్లరిని చిత్రపటముల నొనర్చురీతిగా సాగినదా భోగినీ నర్తనము. అది జూడనోచని మనబోంట్లకే పొత్తమే నృత్తమైనది. అఖిలనాట్య విషయ విలాసముల నాత్మసాక్షాత్కార మొనర్చికొని, అక్షరాకృతులలో నది మనకు జూపెట్ట సమకట్టిన ఆచార్యులవారి యనన్య సామాన్యప్రతిభ యేంతేని యభినందనీయము. పురాకృత సుకృత విశేషమునగాక యిట్టి భావపటిమ యలవడజాలదు. ఆశ్చర్యకరమైన విషయ మేమనగా రాజులు – రాజనర్తకీమణులు మచ్చుకైనా కానరాని నేటికాలమున ఆచార్యుల వారికీ నృత్యరీతులన్నియు నెట్లవగతమైనవి? యేమో! — పోనీ ఇందులో ఏవైనా అతిశయోక్తులు – అసందర్భములు – ఊహాజనిత నృత్యములు – ఉన్నావా? ఊఁహూఁ! ఇందభివర్ణితములైన ప్రతిగతియు నాడదగినదే అశాస్త్రీయమైనదను మాట మచ్చునకైనా గానరాదు.

ఇట నింతటి తన్మయత్వమునందినది భోగినియా? కవియా? ఇద్దరూకారు – నిజముగా తన్మయత్వమునందినది పాఠకులు.

"తకధిమిత తకఝుణుత తకఝుం తఝుంతరిత
తకిటజతి ప్రకటగతి నొకటొకటి జతపరచి"

నాట్యమాడిన ఆ సుందరీ విలాస లాస్యామృతమును గ్రోలనివా రుండజాలరు. ఆహా! భోగినీ పాత్రయే యీ కవిశేఖరుని కవితలోబడి ధన్యయైవదిగదా! పరిణతినందిన యీ మేహావ భావాభినయ ప్రకటనములు అనన్య సామాన్యములు, అప్రతిమానములు, అవశ్య శ్లాఘనీయములు.

ఆచార్యులవారు హరిహర భేదములు పాటింపకపోవుటకు శివలాస్యములు సైత మా నర్తకిచే చేయించుట యిందులకు నిదర్శనము. అంతశ్శుద్ధి – ఆత్మైక సాక్షాత్కారము కల్గిన వారికీ భేదముమాత్ర మెందులకని నిరూపించుకొనినారు. నటరాజు నాట్యాధిదేవత – శివ తాండవమునకు నాట్యములో నొక విశిష్టస్థానమున్నది. నర్తకులకిది యొక యమృతభాండము. ప్రేక్షకులకిది యొక కన్నులపండువు.

క॥ అందము చిందులు ద్రొక్కెడి సుందరి నాట్యమ్ముగనిన చూపరు లెల్లన్
పొందక యుందురె యమితానందము నవిమిషుల భాతినవ చేతనులై॥

వాద్యవాదన పద్ధతులు సైతము చక్కగా తరచి, వితర్కించి విన్నను వొప్ప విరచించుట యిందొక ప్రత్యేకత. తద్భావాను గుణములైన – ఛందములు – జతులగతులు – గదియించి, ఋతుపక్వములైన రాగతాళముల చేకూర్చి రసానుభూతిని కల్గించు తెరంగున సాగిన భోగిని నాట్యము – మునుముందున కేగినది. నాతి నవరసభరిత సౌందర్య ఫణితి కంటిచూపుల తోనే కావ్యలేఖనమొనర్చి జయదేవగేయవాటీ సురసీమలలో, కలాని, దీనయు విరహ భరో న్మీలిత నేత్రియునైన రాధగా రూపొందినది. రాధావిరహ వర్ణనమున ఆచార్యులవా రందించిన హావభావములు నాట్యమునకే వన్నెలుబెట్టినట్లున్నవి. నాయిక మదనచంద్రదూషణ ములు జేయుచుండుట, చెలికత్తె యుపశమన వాక్యములచే కొంచెమూరటగొల్పుట మొదలగు వర్ణనములు చదివి యానందించ దగినవి. ఒడలు పులకరింపజేయునట్లున్నదీ సన్నివేశము.

నాట్యమంతయు ఒకయెత్తు, రాధా విరహవర్ణన మొకయెత్తు. ఒకవంక వాతావరణము రగిలించు విరహంపు వేడికి భరింపజాలని రాధ వెదకివెదకి, మాధవుని గనజాలక రమ్మని పిలుచుచు – భ్రమగొనుచు – ఉస్సురనుచు యమునా సైకతస్థలిలో దిరుగాడుచు కన్నుల గట్టు చున్నది. నిజముగా నీ భాగమున రచించిన ఉత్కళిక, మాత్రమొక దీపకళిక——

ఎట్టెటో యావలియొడ్డునదోచిన గోపీమానస చోరునిగాంచిన రాధయొక్క ఆ యభినయములు మెరుగులు పెట్టినట్లున్నవి.

రావలె, రావలె! ననుకొవినంత సేపైనా కినుక యాగలేదు. చూచుటతోడనే యతని యెరుపెక్కిన కనులు గంట్లుపడిన పెదవి, చెదరిన శిఖిపింఛము ముక్కుపై కాటుక మరకలు కంటబడినవి మరి – ఈర్ష్యాకలితమతియై ఇది యంతయు నేమిటి యనగానే ఏవో సాకులు, బొంకులు, పేర్చి కూర్చి అమాయికయైన రాధికను మాయజేసి మైకమున ముంచి మాధవుని చిలిపితనమును ప్రకటింపజేయుచో చేసిన యభినయము శృంగార గంగాతరంగములలో దేలియాడినవారి తీరును, ఆమె సరసాభినయచేష్టలా నృపాలుతనువు మరపించి విశ్వేష్టితుని జేయుటలో నాశ్చర్యమేమి? అనిమిషుడైనరాజు భోగినీమాత మేల్కొల్పువరకీ లోకము లోనికి రాలేదట నిజమే. చదువరులే రాలేరు. ఇంక రాజుగతి యేమి?

ఇంత విపులముగా – సులభశైలిని సశాస్త్రీయముగా నాట్య సన్నివేశ వర్ణనము లింత వరకును వెలువడలేదనుట నిస్సందేహము. కోటికొక్కరికీ ప్రజ్ఞోపపత్తులున్నను కావ్యములో – మదాత్త సన్నివేశములో రసపరిపుష్టి నిచ్చునటుల రచించుట దుస్తరము. నేటి కాలాన నేవోకొన్ని గొప్పలు రంగరించికొనుచు తమ ప్రతిభోత్పత్తుల చాటించుకొనువారే మిగిలిరికాని – ఆచార్యులవారు సుగ్రాహ్యపద్ధతులలో – సహజ సుందరశైలిలో నిరాడంబర ముగా భోగినీ విలాసమును వక్కాణించి తాము తాదాత్మ్యముజెంది చదువరుల దృష్టిలో

భోగిని కొక విశిష్టతను గల్పించి అందందే యంతర్లీన మందినారు. సంస్కృతాంధ్రి సాహిత్యములయందు కావ్యాంతర్గతములైన నృత్య సన్నివేశములలో సూచనామాత్రముగా నృత్య దృశ్యము నభివర్ణించుటేగాని, నాటికిని నేటికిని నాట్యమున కింతటి ప్రాధాన్యమును తమ కావ్యములలో గల్పించి కృతకృత్యులైన కవిపుంగవులు లేనేలేరు. మాళవికాగ్ని మిత్రములో సైతము కాళిదాసు ఇంతటి విపులముగా నృత్యమును జూపింపలేదు. మొదట నుదహరించిన విధముగా కవితా నాట్యములలో – వాద్యవాదన పద్ధతులలో ప్రవేశము పరిశోధన యొనర్చిన గాక యిట్టి రచనముసాగదు. ఈ భాగమున నాయిక రాజన ర్తకి – ఆకర్షణకుసాధనము అన్యకావ్యములలోవలె రూపలావణ్యములేకాక – నాట్యము. సమావేశమో రాజదర్బారునందు (ఏకాంతమునగాదు) అందువల్లనే ఇది న ర్తకలోకమునకు గర్వకారణము.

ఆచార్యులవారి నభినందించవలసిన దొక్క రాజన ర్తకియేకాదు. న ర్తకరాజియెల్లను – ఈ కావ్యము ఆచంద్రతారార్కము – అనన్య సాధారణమై – ఆబాలగోపాల ప్రకీ ర్తితమై వర్ధిల్లగలదని యాకాంక్షించు,

బుధజనవిధేయుడు

"నటరాజ" రామకృష్ణ

---

శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారు "పోతనచరిత్రము" అను పోతనజీవితము మహాకావ్యముగా రచించుటలు మిక్కిలి ప్రశంసనీయమైన విషయము. పోతన జీవితములోని యనేకులకు, సంశయాస్పదములైన విషయములను వీరు చక్కగా పరిశోధించి పరిశీలనాత్మకముగా సమన్వయపరచి యథార్థము లనునట్లు చిత్రించినారు. వీరి కవిత్వము, శ్రీనాథ పోతనల కవిత్వమువిని సింగభూపాలుడు ప్రశంసించినటులు :—

'జలజల పూలు రాలినట్లును, చల్లని మెల్లని పిల్లతెమ్మెరలు తెలతెల
వారి వీచినట్లును తియ్యని కమ్మని పాలమీగడలు తొలితొలి తోడువిచ్చినట్లుగను,
తొరపు సిగ్గున ముగ్ధకన్దోవల్ వలపుల చిమ్మునట్లును''

చెలువ మొల్కించునదిగానే యున్నదనుట లెంతయు సత్యము. వీరి రచనలోని చమత్కృతి, రసపోషణము, అధ్యాత్మిక తత్త్వజ్ఞాన ప్రకటనమునందలి పాండిత్య ప్రతిభా విన్యాసము సహజ సౌందర్యము ఎంతో ఆశ్చర్యానందములను గలిగించును.

పోతనభక్తి వేదాంత వైరాగ్య రసములవలెనే శృంగార రసమహోదధిని మథించి యమృతమును దేల్చిన మహా రసికచక్రవ ర్తియనిన చాలామంది నమ్మలేరు. పోతన యెంతటి రసిక శేఖరుడో శ్రీ వరదాచార్యులవారి కావ్యము విశదపరచినది.

చతుర్థాశ్వాసములో శ్రీవారు భోగినీ నాట్యమును వర్ణించిన మనోజ్ఞవైఖరి ఆంధ్రసాహిత్యమునకే యలంకార ప్రాయముగా నున్నదనుట అతిశయోక్తిగాదు "చెక్కి చేసిన మోహినీ శిల్పమనియు, దిద్దితీర్చిన నవరత్న దీపమనియు, పోతబోసిన యపరంజి బొమ్మ యనియు" భోగినిని అందాల పుట్టిగను, కళలకు పెట్టినది పేరుగను, వివర్ణించుట నర్తకికి కావలసిన సమస్తములగు యోగ్యతలను చెప్పినటులైనది. మహాభక్త కవిపోతన ఒక నర్తకియగు వేశ్యనుగూర్చి వర్ణించి దండకము రచించునాయను సంశయము మటుమాయ మగునటుల, భోగినిని గుణవతిగను, శీలవతిగను, గంజాయితోటలో సంజనితమైన తులసి వృక్షముగను వర్ణించి ఉత్తమ నాయికగా చిత్రించుట ఎంతో యుదాత్తముగా నున్నది.

"వరసుందరు సింగనభూమిజానినే వలచినదాని నన్నతఁడు వద్దన దేహమునేవి వీడెదన్" అని చెప్పుటలోనే దాని సతీత్వము తేటపడుచున్నది. ఇక మనము భోగినీ దండక రచనమువలన పోతన గౌరవమునకు భంగమేచట గల్గునోయను సంశయ పడుటకు తావు లేకుండునట్లొనర్చినారు. "స్త్రీరత్నం దుష్కులాదపి" యని పెద్దల సుద్దిని సార్థకపరచినారు. రససిద్ధి కలిగి అనందపారవశ్యముల నొసంగునట్టి యే కళయైనను, "ఆనందో బ్రహ్మ"యనిన ప్రాజ్ఞుదువు ననుసరించి బ్రహ్మానంద దాయకమనిన సత్యదూరము గాదుగదా !

అందులకే కవిగారు భోగినీ నాట్యసమయమునందలి రాధామాధవ విప్రలంభ సంభోగ శృంగార వర్ణనావసరమున జూపిన తాదాత్మ్యములో జీవబ్రహ్మైక్య సాధనా స్వరూప విరూపణము నతిచతురముగా వివరించినారు. భక్తి, శృంగార రసముల పరిమలక్ష్య మొకేవిధమైనది. అది తమ ప్రియ సుఖానందప్రాప్తికి హేతుభూతమైన ప్రియతమునిలో సాయుజ్యమును జెందుటయే తద్విరహా సహనమే. అందులకే జయదేవపోతనాదులైన కవులు, సిద్ధేంద్ర నారాయణతీర్థాది వాగ్గేయకారులు "సాత్వస్మైచిత్ పరమాప్రేమరూపా" అను ప్రేమ తత్త్వోపాసనమును, "యథావ్రజాంగనానామ్" అను నారదసూత్రప్రకారముగా రాధామాధవుల మధ్య నోవ్రజనారీ శ్యామసుందరులలోనో ఆరోపించుకొని శృంగార భక్తుల రంగరించి యొకటిజేసి తద్వారా పరమానందానుభూతిని బొందుచున్నారు. పాఠకుల నానానందమున దేలించుచు చరితార్థుల నొనర్చుచున్నారు. శ్రీ మదాచార్యులవారి రచనలోని భోగినీ నాట్య వర్ణనాంతర్గతమైన రాధామాధవ విరహ వర్ణనములుగూడ తామాకోవకుజెందినవే యనుట సహృదయ శేఖరులకు గోచరింపకపోదు. పవిత్ర భారత సంస్కృతిలో, ఉత్తమ కళోపాసనాధ్యేయ మిదియేకదా ! వీరి కవిత యీ ఘట్టములో సాహిత్యరూపములో శబ్దపాటవమును శబ్దరూపములో సాహిత్య పాటవమును జొప్పించి పూర్తి లయబద్ధమొనర్చి ప్రదర్శనానుకూలముగా సాగినది.

శ్రీ మదాచార్యులవారీ ఘట్టములలో అతి రమణీయములగు హస్తపాదహావ భావ విన్యాసములలో నమభూతులకరగి యమృతీకరించి యందరు నాస్వాదించి యానంద సముద్రపుటంచుల స్పృశించునట్లు శృంగార విలాసముల కుప్పబోసినారు. వీరి యీ నాట్య

వర్ణన మనన్యసామాన్య ప్రతిభా పాండిత్యముల గ్రుమ్మరించుచు ననితరసాధ్యమై యపూర్వ పద్ధతులలో నడిపినదనుట అతిశయోక్తి కాదు. సాత్విక, వాచిక, ఆంగిక, ఆహార్య రూపము లతో సమగ్రమగు నాట్యమును, ఒక వాచకరూపమగు కవితలోనే రససిద్ధిగల్గునట్లు వర్ణించుట సాహసమైన పనియనియే చెప్పవలెను.

భోగినీపాత్ర ఆచార్యులవారి రచనలోబడి ఆంధ్రులకు మరపురానిదై చరితార్థత నొందినది. సుందర నాట్యములు కనుల గట్టునట్లు వర్ణింపబడినతీరు అపురూపము

రాధామాధవ తత్వమెరిగిన శ్రీ సిద్ధేంద్ర క్షేత్రజ్ఞ, జయదేవ, లీలాశుకుల రచనలు లోకకల్యాణమున కెట్లుపయుక్తములైనవో భరతనాట్య శైలిలో వీరి శబ్దయుత రచనలగు సలామ్ శబ్దములు దశావతార వర్ణనాగతులు కళికలలో రగడలకు చెందిన యుత్కళికలు తోహరలు మండూకాది శబ్దములను పొందినతీరు ముగ్ధ, ప్రౌఢ, భావరూపమునవలరు అష్ట విధ నాయికాదులు నభిసారికాది భావప్రకటన లెంతేనియు కూచిపూడి నాట్యప్రవర్తనాలికి ఉపయుక్తములుగా నుండుట అత్యంతాభినందనీయములు; నాకెంతేని గర్వకారణములు ఆచార్యులవారిందు కూచిపూడి నాట్యకళా రీతులను గూర్చియు వివరించి యున్నారు. ఇవి యన్నియు సశాస్త్రీయములు. శ్రీ కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు వేయి పడ గలలో విశ్లే కొన్ని కూచిపూడి రీతులను వర్ణించియున్నారు. కాని మధుర కవితాస్వర్ధునుల ప్రవహింపజేయు ఆచార్యులవారి గంటములో మా కూచిపూడి నృత్యమెల్లను యొదిగి యొప్పారి రససిద్ధినందినందులకు కూచిపూడి వాస్తవ్యుడనగు నేనెంతో గర్వించుచున్నాను. అభినందించుచున్నాను.

సంస్కృతాంధ్రకావ్య సాహిత్యములలో నాట్య మింత విపులముగా రససిద్ధినొందిన కళాఖండము గాంచలేమేమో! భక్తకవిరాజుగా వెలసిన శ్రీ పోతనామాత్యునిచరిత్ర వ్రాయుట తేలికైన పనికాదు. దానిని మహాకావ్యముగా నంతరించుట మరింత కష్టసాధ్యమని వేరుగా చెప్పనక్కరలేదు. ఈ ఘనకార్యము నమోఘముగా నిర్వహించి యాచార్యులవారు ధన్యులై యాంధ్ర సారస్వత లోకమునకే వందనీయులుగ నైనారు.

శ్రీ పోతన ప్రణీతంబైన భాగవత మెంత చిరస్థాయిగా నిలిచినదో యటులే శ్రీమాన్ వరదాచార్య ప్రణీతంబైన పోతన చరిత్రమను ఈ కావ్యరాజముగూడ చిరకాలము నిలిచి నిఖిల రసికజన హృదయాహ్లాదకరమై వెలుంగుట తథ్యము.

చిక్కడ్‌పల్లి
హైద్రాబాద్
17-12-1966

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక ఎకాడమీ నృత్యగురుకుల
కులపతి
నాట్యాచార్య భాగవతుల రామకోటయ్య

# పీఠిక

## శ్రీరామ స్తుతి

ఉ. శ్రీరామప్రభు రాట్కపోల మెవరీ సిందూర చిహ్నమ్ముతో
నారాధింతురటన్న మారుతికి మారాడంగ లజ్జించు సీ
తారామం గనుచు న్రహస్థితిని స్వాంతంబందు నూహించి సు
స్మేరాం చన్మృదుగల్ల ముద్దడవు శ్రీ సీతాపతిన్ గొల్చెదన్, 1

## త్రిమూర్తి స్తుతి

ఉ. శ్రీని సువర్ణరూపను స్వచిత్తసరోరుహ మందునుంచి శ్రీ
వాణి సువర్ణరూపను స్వవక్త్రసరోజమునన్ సృజించి శ
ర్వాణి సువర్ణగోత్రజను స్వాంగమునందు లయింపఁ జేయుచున్
దానయి బ్రహ్మ విష్ణు శివతల్ గను తత్త్వమునెంచి మ్రొక్కెదన్. 2

ఆ. మదిని శ్రీని సర్వమంగళన్ నెమ్మేన వాక్కునందు వేదవాణిఁ దాల్చి
సకల లోకములకుఁ ద్రికరణ సంశుద్ధి మంగళమ్ముగూర్చు మహితుఁ దలఁతు. 3

## బ్రహ్మ స్తుతి

ఉ. నాలుగు నోళ్ళలోఁ బడుచు నా బ్రదు కిట్టులు రచ్చకెక్కె నీ
వేల నఁటన్న వాణిఁగని యెవ్వఁడు గర్హణముం బొనర్చె నిన్
బేల యఁటంచుఁ బల్కు విధి నెవ్వగనారసి ఛాందసుండ ! నీ
నాలుగు నోళ్ళయంచు సతి నవ్వ హసించు విరించి నెంచెదన్. 4

## శంకర స్తుతి

ఉ. పార్వతి వెంటనంట హిమవంతు గృహమ్మును వీడి వచ్చుచో
గర్వముమీఱ నవ్వు లొకకంటను నింకొకకంట నశ్రువుల్
బర్వఁగ మోదఖేద రసభాజన ముర్వి యఁటంచుఁ జూపు శ్రీ
శర్వుని నర్ధనారియగు స్వామిని విశ్వపతిన్ భజించెదన్. 5

## సరస్వతీ స్తుతి

ఉ. వాణి, మదేభకుంభకుచ భాగవిభాసిత వల్లకీ నటత్
పాణి, గళాప్రభాత రతపద్మవిలాస కృపావలోకన

శ్రీని, నవేందు సుందర శుచిస్మిత నిర్మిత కుందకుట్మల
శ్రేణి, నరాళకుంతల విశిష్ట ఘనాఘన వేణిఁ గొల్చెదన్. 6

చ. చదివిన వానివోలె గురుసాహసి నౌచు మహాప్రబంధ మిం
పొదవఁగ వ్రాయఁబూనితిని నో, యన నా, యన రాదుగాని త్వ
త్పద కమలాశ్రితుండ రసభావపదార్థ మహత్కవిత్వ సం
పదల నొసంగి యేలవె? కృపామతి! జ్ఞానరతీ! సరస్వతీ! 7

ఉ. సుందర నీకు మ్రొక్కి కలముం గయిబూనితి దాని జిహ్వాపై
నందము చిందగాఁ బదములందు సువర్ణపు టందెలూని త
ద్ధిం ధిమి తైతతో మ్మనుచు దివ్య రసధ్వనులూఱ నాట్య మిం
పొందఁగఁ జేయవే సహృదయుల్ విబుధుల్ వినుతింప భారతీ! 8

## గణపతి స్తుతి

తే. తలఁచివేడెద మదిని సత్కావ్య విఘ్నవార వారణ వారణ వదనమదను
దాస మానసమౌఢ్య సంతమసపటల హరణ తరుణేందు రేఖాయితైక రదను. 9

## ఆంధ్రజనతా స్తుతి

ఉ. చిన్న నఁటంచు నెంచకయె సిగ్గొక యించుకలేక భక్తిపో
తన్ననుఁగూడి భాగవత తత్త్వముపాడ గళమ్ము విప్పితిన్
సన్నిఁకఁ దిట్టిపొందు కరుణం గని దీవెనలిందు నాల్గు కో
ట్లన్నల మంగళార్థమయి యాంధ్రపదాల నివాళి బట్టితిన్. 10

## ఆంధ్రభారతీ స్తుతి

సీ. దివ్యుఁడౌ శ్రీకృష్ణదేవరాయలు తాను దేశభాషల లెస్స తెనుఁగనంగ,
అప్పయ దీక్షితు లాంధ్రత్వ మాంధ్రభాష లభించుటలు తపఃఫలమనంగ,
బ్రౌన్ దొర యాంధ్రమ్ము ప్రాచ్యభాషలకెల్ల మధురమౌ 'ఇటలీ' సమానమనఁగ,
మల్కిభరాముండు మహితాంధ్ర కృతికన్య కృతి గోపికల రాధికే యనంగ
తే. ద్రవిడ కర్ణాట కోధ్ర విద్వాంసు లలర నాంగ్ల పారశీ బుధులు వహ్వాయనంగ,
పాటిపలుకుల మేటి భాషావధూటి యనఁగ నుతికెక్కు నాంధ్ర వాగ్జననిగొల్తు. 11

## కవి స్తుతి

సీ. పులుఁగు జంటనుబాపు బోయను శపియించు కరుణాబ్ధి వాల్మీకి కవిని నేను,
చను కుమారునివెంట వని ప్రతిధ్వను లీన నఱచుచు ముఱుకు వ్యాసాత్మ నేను
మగువపైఁగల కూర్మి మబ్బుతోఁ జెప్పింపఁ దపియించు కవి కాళిదాసు నేను,
ఎద నీరుగాఁగ శారదయేడ్చు కాటుక కన్నీరుదుడుచు పోతన్న నేను

తే. నాల్గుమోముల విశ్వమ్ము నాకుఁదెల్పు ఖేదమోదానుభూతి వీక్షించియెంచి
పలుక నోరుగలట్టి దేవతను నేను రమ్యభారతీ వంశవర్ధనుఁడ నేను. 12

## కవితా స్తుతి

సీ. ప్రతిభ యే పితర, వ్యుత్పత్తి యే జనయిత్రి, సుకవియెడంద ప్రసూతిగృహము,
కథరూప, మౌచిత్యగతియె సౌందర్యమ్ము రసము ప్రాణము, ధ్వని రమణవయసు,
బహుళార్థదాయక భాసురాలంక్రియా సంధానత వివాహసంస్కరణము,
సరసాత్మపతి, విమర్శకుఁ డత్త, వ్యాకృతి తా నాఁడుపడుచు, ఛందస్సు నడత
తే. రమ్యశయ్యల సరసుని రతులఁదేల్చి రూఢి మధుర ద్రాక్షా పాకరుచులఁ దన్పి
భవ్యగుణరీతి సాహిత్యబంధు వితతి తలల నూఁపించు కృతికన్య ధన్య భువిని. 13

క. అక్షరపద సంపదకై యక్షరపదముల వెలుంగు నవ్యయ కవితా
లక్షణ లక్ష్యీకృతుల ముముక్షువు గతిఁగొల్చి ప్రియఁబూనెద సుకృతిన్. 14

చ. భవభయ పాపతాప వినివారకమై తలదాల్ప నొప్పుచున్
నవరసముల్ స్రవించు చరణ ప్రసవ ప్రభవమ్మునందు గా
దె విబుధలోకమెల్ల వినుతింపఁగ సత్కవితా స్రవంతి గం
గవలె నిరర్గళామృత వికాస విలక్షణధారఁ బాఱుచున్. 15

## వ్యాస వాల్మీక స్తుతి

చ. ధరపయిఁ దొల్త నెవ్వని పదమ్మునఁబుట్టెను కావ్యగంగ యా
దరగతి దాని నౌదలనుదాల్చి యెవండిడె భారతార్థ మా
హరి హర రూపులౌ మునుల నాది కవీంద్రుని బుట్ట పుట్టువున్,
గురువగు బాదరాయణిని గూర్చి నతిన్ వినుతిన్ బొనర్చెదన్. 16

## కాళిదాస స్తుతి

సీ. జీవనాంచిత నీల జీమూతమూర్తిని సందేశహరునిగా సల్పు ప్రతిభ
రఘువంశవృక్ష విరచిత శాఖావళిన్ బ్రాణవాయువునింపి పల్కు తెలివి
మహనీయచారు కుమారసంభవమున్ రసానందడోలఁ దేలార్చుగరిమ
శశ్వదభిజ్ఞానశాకుంతలా కృతిన్ విశ్వభారత పీఠివెట్టు ప్రజ్ఞ
తే. యెవని సొమ్ము లా సరసవాగవనిపతిని హిమ నగోత్తుంగ శృంగసాహిత్యమతిని
విబుధపుం భారతిని సుకవి కులగతిని గృతిని గాళిదాసుని నమస్కృతిని గొల్తు. 17

## భవభూతి స్తుతి

క. ఉత్తరరామ కథాకృతి విత్తమ్మునఁ గీర్తిరమను విశ్వ దశదిశా
భిత్తికల మేడనిడు కవి సత్తము భవభూతిఁ దలఁచి సన్నుతి సేతున్. 18

## సంస్కృత కవిజన స్తుతి

సీ. వందనీయ ప్రతిభారవి భారవిన్ మేధా వినిర్మిత మేఘమాఘు
దివిజ కవీంద్రు ధీ ధిక్కారిని మురారి లలితనాటక వాగ్విలాసుభాసు
కవిజన చిత్తాపకర్షు శ్రీ హర్షు నపూర్వ శృంగారభావు జయదేవు
మహిత కవిత్వ ధీమంతు ననంతుని రసకావ్యధారుణీ రాజు భోజు
తే. నెడఁదలో నెంచి తలవంచి యెఱఁగి మరగి విశ్వకవి రవీంద్రుండాది వివిధ భాష
లందు నుతికెక్కు కవులకు నంజలించి యాంధ్రకవి దేవతల నింక నభినుతింతు. 19

## తెలుగు కవుల స్తుతి

క. కన్నవ్వ తెలుఁగునుడి, మము గన్నయ్య యెవండొ యెందుగలఁడన నోహో !
మిన్నగ వాగనుశాసను నన్నయ్యని తెలియుమనెడి నన్నయ నెంతున్. 20

ఆ. నీతివర్తనంబు నిర్మలాత్మజ్ఞాన మాటవెలఁది నడల నలరఁజేసి
యాది చేఁదుగాఁగ నగుపించు వేమనగ నిరతమమృతరూపునిగ దలంతు. 21

ఉ. భాగవతాఖ్యతో నమృతభాండము తెన్గుల కిచ్చు నమ్మహా
భాగుని బోతనగ బరమ భాగవతోత్తము నాంధ్ర వాగ్వధూ
టీ గురుశోకవారణ పటిష్ఠుఁ దలంతుఁ గలిం దళింప జ
న్మాగతుఁడైన ముక్తితనయా జనకుగ సనకున్ శుకార్భకున్. 22

సీ. అక్కిరీటి శరమ్మొ తిక్కన గంటమో సంగరోద్యోగాల జయముఁ గాంచె
నాంధ్రవాగ్వనితా సుమాధరం బెట్టునో భారతారణ్యాల సౌరు జిమ్మె
శ్రీనాథుఁడే కళాశ్రీనాథుఁడో యేమొ పదమంటి రసగంగ బయలుదేఱె
శ్రీకృష్ణరాయలే శ్రీకృష్ణుడగునేమొ యాముక్తమాల్యద యతని వలచె
తే. నలఘు మను సంభవమొనర్చు నవని పైకి నరుగుదెంచిన యపర పవరుఁడు గురుఁడు
విప్రవరుఁ డల్లసాని కవిప్రవరుఁడు నాదిగా నాదికవుల దివ్యాంఘ్రిఁ గొలుతు. 23

సీ. నంది తిమ్మన కృతి నవ పారిజాతమో శ్రీకృష్ణుఁ డద్దాని స్వీకరించె
రామరాడ్భూషణ రత్నమౌటనో యేమొ వసుచరిత్రకు విల్వవచ్చె నెంతొ
రామకృష్ణావతారమ్ము లేకమ్మోట వ్రాయఁగల్గెనొ పాండురంగ మహిమ
ఆంధ్ర కావ్యప్రపంచార్కుఁడో సూరన్న యల కళాపూర్ణోదయము నొసంగె
తే. నరయఁగం కంటిపాపఁడే యనఁబడుచును సరసగతి రామచరిత కుత్తరము వ్రాసె
మొల్ల పూఁదావి రాముల యిల్లు నిండెఁ జేమకూరదొ రుచివిల్వ చెప్పలేను,

## ఆధునిక కవి స్తుతి

తే. అక్షరార్థ ప్రదాతలౌ యాదికవుల యార్షఋణ మీఁగ నివ్విధి నంజలించి
సాటికవులలో నెంతయు మేటులైన ప్రస్తుత కవీంద్రవందు లింఁ బ్రస్తుతింతు. 25

క. తెనుగుం భారతి నిద్దుర కనుదమ్ములు విప్పనే సుకవి కర మది తా
వినకర కళ లీనెనొ యా ఘనమతి వీరేశలింగ కవిని నుతింతున్. 26

క. అసమాన పాండితీధను నసదృశ హరిపాదకళ్వ దరవింద మరం
దసమాస్వాదనచణు రామసుధామరు వాసుదాసు మాన్యు నుతింతుఁ. 27

చ. తిరుపతి వేంకటేశ్వరుల తీరునఁ గూరిమి వందనీయులౌ
తిరుపతి వేంకటేశ కవిధీరుల నవ్యకవిత్వమార్గ స
ద్గురువుల భారతీ కమల కోమల పాదయుగావతారులఁ
మరి మరి మ్రొక్కి వేడెదను మానసవీథిఁ దలంచి భక్తిమై. 28

ఉ. ధీనిధి యాంధ్రభారత కృతి శ్రీకర్త మహాంధ్రరాజ్య సం
స్థాన కవీశుఁ డుజ్జ్వల యశస్కుఁడు భారతఖండ పూజ్యవి
ద్యానిధులం దొకండును శతద్వితయాధిక గ్రంథకర్తయా
జ్ఞానసముద్రు వ్యాసముని సన్నిభు శ్రీపదకృష్ణుఁ గొల్చెదన్. 20

సీ. విశ్వనాథ కులాబ్ధి విధురూపుఁ డితఁడని చెలియలికట్టయే చెప్పు నెవని
సత్యనారాయణస్వామి యీతఁడె యని ఫణి వేయిపడగలఁ బల్కు నెవని
వరకవి సామ్రాజ్య ధరణీశుఁ డితఁడన నేక వీరాకృతి యెసఁగె నెవని
నభినవ శ్రీనాథుఁ డన నీతఁడే యని కిన్నరసాని కన్గొఁటె నెవనిఁ

తే. గాంచి, యెవఁడు రామాయణ కల్పవృక్ష వినుత కాండాలి దివికి నిచ్చెనలు వైచి
యమరకవి మతిఁ దెలిచి రాజని వెలింగె నట్టి కవికుల గురువున కంజలింతు. 30

చ. సరస కవిత్వ సంపదల సౌందరనంద మహా ప్రబంధముఁ
విరచితముం బొనర్చిరి కవిప్రకరమ్ము తలం ధరింప సు
స్థిరమతి లక్ష్మికాంత కవిసింహుఁడు కాటురి వేంకటేశుఁడుఁ
శరధి గభీరుఁ డున్నత విచారుఁడు వారిఁ దలంచి మ్రొక్కెదఁ. 31

క. కవిసార్వభౌము దుర్భాకవరాన్వయహరిదిశాప్త ఖద్యోతను స
త్కవిరాజ శేఖరాఖ్యు శతవధానిని వీర వాక్ప్రతాపుని దలతుఁ. 32

చ. నవరసపూర్ణ రమ్య రచనా ధరణీ గురుభారవాహ వై
భవ జితశేషు భవ్య శివభారత కావ్యకళామనీషు స
త్కవికులభూషు పండిత జగద్వినుత ప్రతిభావిశేషు నెం
దవిరళ కీర్తిపోషు గడియారము శేషకవీశుఁ గొల్చెదన్. 33

మ. బుధులెల్లఁ నుతియింప నాంధ్ర చరితల్ పూర్వోక్త మార్గమ్మునన్
సుధలన్ బంచ రచించె భవ్యకవితా శోభాయమానుండు శ్రీ

మధునాపంతుల వంశమండనుఁడు శ్రీమత్సత్యనారాయణుం
డు ధరన్ గీర్తిపహింవ నాదు కయిమోడ్పుల్ తత్కవిస్వామికిన్. 34

ఉ. వేంకట పార్వతీశ్వరుల వేలురి కావ్యకళా ప్రపూర్ణ శో
భాంకితు, తుమ్మలాన్వయ సుధార్ణవ పూర్ణశశాంకు. నేటుకూర్
వేంకటనారసింహ సుకవి ద్రుహిణుల్ వర సన్నిధాన వం
శాంకుర పారిజాతమును నమ్మల సుబ్బకవి న్నుతించెదన్. 35

## నవ్యకవి స్తుతి

సీ. భారతి కనుగట్ట బంగారు తల గొట్టి తృణ కంకణమ్ము చేత నిడె నెవఁడు
నాక వనము మించు నా కవనమ్మనఁ "దెలుఁగుతోఁటన్" దీర్చిదిద్దె నెవఁడు
మదవతి యగు వాణి పదములం బడి రాఁగఁ బిలిచె "రమ్యాలోకముల" నెవండు
భారతి తలఁదాల్ప భాషలో నాయువుపట్టుతో "జడకుచ్చు" గట్టె నెవఁడు
తే. అట్టి మా యాంధ్ర జయదేవు నార్ద్రభావు నవ్య దివ్య కవిత్వ గాంధర్వజీవు
రవి కవీశ్వర శిష్య శ్రీరాయప్రోలు సుబ్బరాయని నోరార స్తుతియొనర్తు. 36

ఉ. శ్రీయుతు బాపిరాజును విశిష్ట కవీశ్వరు నప్పరాణ్మణి
న్నాయని సుబ్బరాట్కవిని నండురి సుబ్బకవీశు జాషువన్
దీయఁగఁ బల్కు వేదుల సుధీమణిఁ బాపయశాస్త్రి నవ్యవా
క్ఛాయల సొంపు నింపు శివశంకరు నోరి నృసింహు నెంచెదన్. 37

క. "శివ తాండవ" కర్తను సత్కవికులశేఖరుని శారదా వరపుత్రున్
వివిధకళాస్పదు నెంతు న్నవినయమతి పుట్టపర్తి నారాయణునిన్. 38

తే. రామచంద్రుని పిళ్ల "వే" రత్నకవిని, బోయి భీమన నంబటి పూడి సుకవి
నోలి నింద్రగంటిని శ్రీ కొడాలి కవిని ఘనుని యేలేశ్వరాఖ్య సత్కవి నుతింతు. 39

## అభ్యుదయకవి స్తుతి

సీ. అభ్యుదయ పథాల కాదికవీంద్రుడౌ గురుజాడ యప్పరాడ్గురు నుతింతు
తన్మార్గముల వ్యాసత న్నిర్వహించిన గిడుగు దంభోళిని కీర్తిజేతు
కవితాభ్యుదయమార్గ కాళిదాసన వెల్గు శ్రీశ్రీ పదాల జేజేల నిడుదు
వవకావ్య విశ్వసంభవభూతి యన నొప్పు కృష్ణశాస్త్రికి భక్తి కేలుమోడ్తు
తే. ఆంధ్రవాణిత్వమే వాహమన వెలుంగు నతులమతికి నారుద్రకు నతులొనర్తు
కావ్య సురనదీ జలపాతగతుల క్షితిని నందనమొనర్చు నారాయణుం దలంతు. 40

తే. రుద్రవీణాశ్రుతి స్వరారోహణములఁ దమి మహేంద్రోదయ ప్రభాతముల బాడి
యగ్నిధారా శరాహతి నధమ గర్వ శరధి నింకించు శరధి దాశరథి నెంతు. 41

క. వేమన హృదయుని నభినవ వేమనను బ్రాజకవీంద్రు వినుత చరిత్రుఙ్
ధీమహితునిఁ గాళోజీ నామాంకితు వినుతిఁజేతు నారాయణునిఙ్. 42

క. శశ్వత్కాళోజీ రామేశ్వరు శ్రీ పొట్లపలి కవీంద్రుని విద్వాఙ్
విశ్వమ్మును విజ్ఞానపు విశ్వమ్మగు నార్లకవిని వినుతింతు నొగిన్. 43

## తెలంగాణ పండితకవి స్తుతి

సీ. కవిలోక మిత్రు శ్రీకాకునూర్యన్వయు నాంధ్రఛందో నంతు నప్పకవిని
సరసాచ లాత్మజా పరిణయ సత్కావ్య కర్తన్ కిరీటి వేంకట కవీంద్రు
వర బాలభారతీ బిరుద విభ్రాజితు శ్రీ బుక్కపట్టణ శ్రీనివాసు
స్తవనీయు శ్రీశారదాప్రశ్న వివరణు శ్రీమన్మరింగంటి సింగనార్యు
తే. కాళిదాస కావ్యోద్యాన గంధవహుని కోలచల మల్లినాథ సద్గురువరేణ్యు
ఘనుల శ్రీమరింగంటి వేంకట నృసింహ సత్కవిద్వయామల భక్తి సన్నుతింతు. 44

సీ. *పాండురంగఁడె మడికొండలో శ్రీరాము కథ వ్రాసి పండరి కవిగ నలరె
తా నాంధ్రకవితా పితామహుం డిచ్చోట నాంధ్ర పితామహుం డుగను బుట్టె
కృష్ణరాయలె రామకృష్ణ రాయలుగాఁగ బూర్గులవంశ సంభూతుఁడయ్యె
రుద్రాంశుఁడు ప్రతాపరుద్రుండె సురవరమ్మున బ్రతాపుఁడుగాగ మూర్తిఁజెందెఁ
గీ. సరసగతుల నింద్రద్యుమ్న ధరణిపాల చరితమును సత్ప్రబంధ విస్ఫురణ మెరయ
రచన మొనరించు కేశవరాయ డాది చతుర పండితకవుల సంస్తుతినొనర్తు. 45

సీ. ఉద్దండ పండితు లొద్దిరాజాన్వయ సోదరకవుల సంస్తుతి నొనర్తు
ఆంధ్రబిల్హణు సువిఖ్యాత పండితకవిన్ చతురాస్యు లక్ష్మణశాస్త్రి నెంతు
ప్రకటిత శ్లేషయ మకచక్రవర్తియౌ కుకునూరి రామాఖ్య సుకవి దలఁతు
రమణీయకావ్య నిర్మాణ శిరోమణి కేశవపంతులం గీర్తిసేతు
తే. గార్లపాటి రాఘవ మహాకవి నుతింతు ప్రాజ్ఞ ముసిపట్ల పట్టాభిరాము నటులె
అపర నన్నయ నుదయ రాజాన్వయాబ్ధి విధుని శేషగిరీంద్ర కవి న్నుతింతు. 46

సీ. అభినవ పెద్దన యననొప్పు మద్గురు న్వానాద్రి వేంకటవర్యు గొల్తు
సంస్కృతాంధ్ర కవిత్వ చతురాననుని వానమామల లక్ష్మణు మది భజింతు
రైతు రామాయణ రసవన్మహాకావ్యకర్త నగ్రజుని జగ్గన నుతింతు
సత్కావ్య కల్పనా చతుర పాండిత్య విహారిఁ గోరుట్ల కృష్ణార్యుఁ దలఁతు

---

* పండరినాథుడనే కవి మడికొండలో జన్మించిన నియోగి బ్రాహ్మణుడు. ఇతడు "రామకథా కల్పలతా" యను పేర ౧౧౦౦౦ శ్లోకాలతో సంస్కృతములో రామాయణము వ్రాసినాడు. ఆంధ్రమున పండరి రామాయణ మనుపేర అనేకవేల పద్యములలో నొక రామాయణమును వ్రాసినాడు. ఇది అముద్రితముగా నున్నది.

తే. చిఱుక పలుకుల నమృతమ్ము నొలకవోయు చిలుకమఱ్ఱి రామానుజు నలఘుమతిని
ముక్కు తిమ్మనార్యుని రీతి ముద్దుపలుకు లల్లు పల్లె దుర్గనకవి నభినుతింతు. 47

క. ఎన్నుదు రామన్నను సంపన్నుని శ్రీ సుప్రసన్ను మాయన్నల కృ
ష్ణన్నను తంయ్యాలాన్వయుఁ గ్రిన్నన బలరాము వేముగంటి నృసింహున్. 48

## సకల సుకవి స్తుతి

తే. మరచినట్టి సత్కవులకు మది కొకింత గుఱుతులేని సత్కవులకు కొంచిమింక
చిఱుతలైన సత్కవులకు ధరణిఁ బుట్టువొందవోవు సత్కవులకు వందనములు. 49

## కుకవి స్తుతి

తే. అర్హతయె లేక యిటులు మహా ప్రబంధ నిర్మితి నొనర్చు చపలునినేఁ జెలంగ
నొకరి ననవేల యీతఁడు కుకవి యనుచు అకట నాదః సాహసకృతి కొక నమస్సు. 50

## ప్రబంధ స్తుతి

సీ. రూపిత ప్రాసాద గోపురసీమల రమణీయ శిల్ప చిత్రణము భంగి
సహజ సౌందర్య భాస్వత్కోమలాంగికి సురుచిర భూషణాంబరములటులు
వరతప్త కాంచనాభరణ సంతతులందు నవరత్న సత్కళా నివహగతుల
ఆపాత మధుర మంజులగానవాణికి వీణామృదంగ నిక్వాణ సరణి

తే. వర్ణనాదులుం గృతి కెంతొ వన్నె గూర్చగల్గునని బ్రబంధాఖ్య సత్కావ్య భేద
గతిని దీర్చిరి నిజ కళాప్రతిభ మెరయ మను వసు చరిత్రముల్వ్రాసి మనుసు కవులు. 51

ఉ. అవ్విధి సత్ప్రబంధ రచనాశయమొప్పఁ గృతినొచింతుఁ దా
నెవ్వడు శారదా సరసిజేక్షణ కజ్జల బాష్పపంక్తులన్
నెవ్వ గఁగోట మీటి పెను నెంజెలిఁ బాపెనొ వాని వృత్తముఁ
రవ్వలహారమందుఁ గృతి రమ్యత చాలమి విల్వ తగ్గునే । 52

చ. రసమయ కావ్య దివ్య సుమరాజమునం దొసగుల్ ప్రమాదతన్
మసలినఁ దత్ప్రబంధమును మాన్యులు మెచ్చకయుందురే సుధా
రస నిధియైన తేనె పెరరంధ్ర సమన్వితమంచు నిద్దినీ
రసమని త్రోసిపుచ్చుటలు ప్రాజ్ఞ జనోచిత కృత్యమానాకో । 53

## విమర్శకులకు వినతి

తే. మీ యనుగ్రహపాత్రుని దోయధి గని రత్నముల నేరి ఘనుడని వ్రాయగలరు
మీదు విగ్రహపాత్రు మహోదధి గని నత్తలనె యేరి యల్పుడనంగలారు. 54

తే. మేటి కాళిదాసుఁడె "మీదు మెప్పు గనని విజ్ఞత యదెట్టిదైనను విఫలమనియె"
ఇపుడె కవి కీర్తికొఱ కేను తపమొనర్తుఁ బ్రోత్సహింప బిడ్డకు పాలు బోయుటగును. 55

## అసద్విమర్శక స్తుతి

తే. మొదలు తుద గ్రంథ మెల్లయుఁ జదువకుండ యొరు నితడు తానొక కవియా యటంచు
నెంచు ఘనులకు నది విశ్వసించు ప్రజకు దూరమున నుండి యొక నమస్కార మిడుదు.

## సద్విమర్శక స్తుతి

సీ. క్షీరాబ్ధి గత సుధాసార సర్వస్వమ్ముఁ దెచ్చి చూపించు మందరనగమ్ము
స్వర్ణార్ఘ్యమూల్య సన్నిర్ణయమ్మొనరింప నొరదీయగలనికషోపలమ్ము
తోయసమ్మిశ్రిత దుగ్ధభాగమ్మును లీల నేర్పరచు మరాళరాజు
సురుచిర వల్లరీ సుమనస్సు వాసనల్ కడలంట విరజిమ్ము గంధవహుడు

తే. నమిత ధీశాలి చిత్త సంయమనశీలి సరస సద్గుణ వ్యాఖ్యాత సాధ్వసాధు
విషయ నిర్ణేత సహృదయ విశ్వజేత యగు విమర్శకోత్తమునకు నంజలింతు. 57

## అభ్యర్థన

సీ. ధర నెలోరా యజంతా గుహాగర్భాల వరశిల్ప జాలకుఁ బురుడువోసె,
క్షోణిపై నొక చిన్నసూర్యుఁడై ప్రభజిమ్ము కోహినూర్మణి నెత్తుకొనుచు మురిసె,
శ్రీమదేక శిలాపురీ స్తనాగ్రిమ్మున భాగవతము కుగ్గుబాలువోసె,
కాకతిసామ్రాజ్య కాంతామతల్లికి రాతికోటల నంగరక్షజేసె,

తే. లలితలావణ్య సకల కళాప్రవీణ ప్రథిత విజయవిలాస సంపత్కృపాణ
ధర్మ సందీప్త రాజ్యతంత్రముల జాణ మా తెలంగాణ ముక్కోటి మణులవీణ 58

చ. ఎవనికి వాగ్వధూటి వెతనెంతయుఁ దీర్చెడి దిక్కటంచు క
న్గవబడి యశ్రులొల్క తన కష్టసుఖమ్ముల విన్నవించె, నో
కవివర ! తెన్గు భాగవతకన్య నొసంగుమటంచు వేడె తా
నెవనినిగాంచి శ్రీ రమణుఁ డిట్టిఁడు మానవమాత్రుఁడా నొకో. 59

ఉ. మా తెలగాణ పోతన సమాన మహాకవిఁగాంచు నంతగాఁ
బూత చరిత్ర యయ్యెనని భూ జనులందఱు సంస్తుతింప వా
క్చాతురి నా మహోన్నత విశాలవియత్తల సీమ గర్జలన్
జేతువొ మ్రోల్లిగుర్ప సుధజిమ్మెదొ రాగదవోయి సత్కవీ ! 60

చ. అలిగెదవేల నీ కనుల నశ్రులు గార్చెదవేలఁ బిల్చినన్
బలుకవదేల మోము నటు ప్రక్కకు ద్రిప్పెదవేల కాటుకల్

మఱుఁగఁగ నేడ్చు నీ పఱకు మానినిపైఁ గనువేయు నట్టి వా
రలయిన మానవాసురుల రాజుల కాలముపోయె సత్కవీ ! 61

ఉ. పూచి ఫలించు కల్పతరుపుంజము భాగవతమ్ము దాని పెన్
బూచిగఁ బొట్టఁ బెట్టుకొని భూమిపయిన్ దల లెత్తియాడు కీ
డౌ చెద పుర్వులన్ని హతమాఱఁగ నా యఱకాల నేలకున్
రాచెద వాని త్రోవలకు డాకలుగొట్టెద రమ్ము సత్కవీ ! 62

ఉ నిక్కముగాఁ బ్రజాహృదయ నిర్మల ధర్మ సుఖాసనమ్ముపై
నెక్కఁగ నీవుదక్క మరి యెవ్వరు నర్హులు గారఁటంచు నల్
దిక్కులు మాఱుమ్రోఁగెడి నదే ! నిజ కావ్యవిపంచికా శ్రుతిన్
జక్క సవర్చి కర్షకజన స్వరగీతిక లాలపింపవే ! 63

సీ తాళపత్రాల వాగ్బాలపాదాలు మాన్యాలఁ దేలెడి లక్ష్మి నంగి కొలువ,
నుడుగులో నీ యెద్దు టడుగులోఁ బులకించి మంచి ముత్యాల్ తలచుంచు వేయ,
కలములో నీ చేతిహలములో జలపుట్టి రసగంగ లుప్పొంగి బుసలుకొట్టి,
కృతిలోని రాముఁడు క్షితి నీదు సీతకు నురుబీజ లవకుశాభ్యుదయ మిడఁగ,

తే. వరద హస్తమ్ములోఁ బుట్టిపెరిగి తిరిగి లేచిరావోయి హాలికా ! లేచిరమ్ము
గడుసు శ్రీనాథుల దినాలు గడచిపోయెఁ గర్షకుని దైవము ఫలించు కాలమిదియె. 64

ఉ. కావలె నిన్నుబోలు నొక కర్షకసత్కవి, కుంగుచున్న యీ
భావలయాన నాయువులుపోసి సముద్ధరణం బొనర్ప మేల్
త్రోవలు దప్పి బండి సనెదోఁగలుం బడిపోవు పోకమున్
గేవల కర్మయోగివయి కేల హలమ్ము కలమ్ము బూనుమీ ! 65

మ. కలలం గాంచెడి ప్రాగ్దిశా తరుణి తాఁగన్విప్పగాఁ ద్రాటి క
మ్మల గంటమ్ము సుధాంబు వృష్టి గురిపింపన్ గావుమై గుడ్డచిం
పుల మాటుంగొని తొంగిచూచెడి క్షుధాభూతాళి భీతిల్ల నీ
కలిలో విప్లవ పాంచజన్య పృథు శంఖంబొత్తి మేల్కొల్పవే ! 66

చ. ఇలఁ బ్రజ చిన్నచేఁప గ్రసియించెడి యా పెనుచేఁపలై యెదన్
దలఁప రహో ! స్వజాతియను ధర్మమునున్ దయనెద్దుఁ దిర్యగా
దులె నయ మిట్టివారి యెదదూసెడి గుండియ గాలమై మనన్
దొలకరి మబ్బులో మెఱుపుదోఁచు విధమ్మున గంటమెత్తుమా ! 67

తే. అదొ త్రివర్ణపతాక తా నభయమిడఁగఁ జక్రమును దాల్చు వరద హస్తమ్మువోలె
నట్టె రెపరెపలాడు నీ యంబరమున నెఱి స్వతంత్ర భానూదయ నియతి దెలుప. 68

చ. ఉడుపతినా బలాసురుల నుక్కడగింపఁగ నింద్రచాప మె
క్కిడిన విధంబునన్ మనియహీన ముదంబుధి నోలలాడుచున్
దడవడు నీ త్రివర్ణ పరిధాన విశాలరసాల సీమలన్
విడివడె మూఁగవోయిన సువిశ్రుత సత్కవి కోకిలా ధ్వనుల్. 69

ఉ. తా నొక నిప్పుకుంపటికి దాపునఁ గ్రాలెడి లక్క యిల్లుగాఁ
గాన నగున్ బ్రపంచమును కచ్చెకె కాళులఁ ద్రివ్వ బాంబులో
జ్ఞాననిధీ! భవత్కవనగాంగ ఝరిన్ సురలోక నందనో
ద్యానము నాటి పోన్ భరతధాత్రికి రాఁగదవే జగత్కవీ! 70

మ. ధరణీపాలుర రాజ్యవై భవములన్ దత్ప్రేయసీ నాయకా
విరహోన్మాద కృతుల్ సమీక విజయోద్వృత్తమ్ములన్ నిత్యమున్
బరహింసాత్మక సార్వభౌమతలు కావ్యంబౌచు రూపొంది యు
ర్వర కీ దుర్దశగూర్చె శౌరి పదసద్భక్తిన్ బ్రసాదింపుమీ! 71

ఉ. నీ విలనున్న వేళ నతి నిష్ఠురబాధలఁ గూర్చినారు మే
ధావులు పండితుల్నృపులు తావక నిర్గతినెంచి కావ్య వా
గ్దేవుఁ డితండు బుట్టిన ప్రదేశమువారము మేము మేమునున్
గోవు గతించఁబాఁడి నెఱఁకుల్ బయటంబడుగాదె సత్కవీ! 72

ఉ. ఏలిక లగ్రహారముల నిచ్చెడి కాలముగాదుకాని యో
హాలిక సత్కవీ! సభల హారము లిచ్చెడివారలన్నచో
వేలుగలారు చిత్తము లభించును విత్తమునున్న కాన నీ
హాలికవృత్తి నేర్పని మహాకవియే నొక స్కూలు టీచరా. 73

ఉ. వేగములేచి స్కూలునకు వేళకుబోయి యనేక పాఠముల్
వాగుచు వేసటం బడుచువత్తుము జీతము జీవితమ్ముతోఁ
దూగమిరేయి ట్యూషనులతో సరిపుత్తుము మా కవిత్వపున్
భాగవతమ్ము లవ్వి వడుపాటులు దేవుఁ డెఱుంగు సత్కవీ! 74

ఉ. వెంగలి యట్లు స్కూలనుచు వేరొక భాష వచింతువందు వే
నాంగలమిద్ది నేర్వమి సమర్థత లేదు సమాజమందు మా
సంగతి నీ వెఱుంగవొకొ స్రష్టయునై నను సారసాక్షి దే
నాంగల విద్యరాదన రమాంగన డా యదుపీఠ మీదిలన్. 75

తే. కావున న్నీవు మా పయి గరుణగల్గి కలముబూనియొ లేకున్న హలముగొనియొ
ఆంధ్రశారద యేడ్పు రవ్వంతయేని పారదోలి నీ బిరుదు గాపాడుకొనుము. 76

## పండితవంశ పరిచయము

తే. తొల్లి నారాయణప్ప సుతుండు సింగరార్యుఁ డతని సూనుఁడు లక్ష్మణార్యుఁ డతని
నపర వాల్మీకి యనెను రామాయణార్థ ప్రవచనమ్మున కెద మెచ్చి పండితతతి. 77

తే. ఇతని సుతుఁడు వెంకయశాస్త్రి యెంతొ మేటి తర్కమునను వ్యాకరణ శాస్త్రమున నితని
ఛాత్రుఁ డారుట్ల జగ్గయ సంస్కృతమున వ్రాసె జగదీశ చంపూ ప్రబంధ మొండు. 78

ఉ. ఈతఁడు తాను వ్యాకృతి నహీంద్రుఁ డనంబడె వారణాసిలో
ఖ్యాతివహించు పండితులఁ గాదనిపించెను వాగ్వివాద మం
దీతని యన్వవాయమున నేడు తరమ్ములు వీరి యింటనే
చేతు నివాసమంచుఁ దొలి జేప్పె సరస్వతి యందు రెండతో. 79

తే. వరుస వెంకయశాస్త్రికి పట్టి మాదు తండ్రి బక్కయశాస్త్రి యీతనిని గూర్చి
బ్రదికి బక్కయశాస్త్రి పురాణము వినవలెను జచ్చి స్వర్గంబు వోవలెనను బ్రజ. 80

క. ఒక్క మయిలు వినఁబడునటు వక్కాణించు మధుగళరవపుసింహ మహో !
బక్కయ పురాణమన నబ్బక్క ! యనం జేయు బుధులు పామరులనకన్. 81

క. నిక్కము వచింతుఁ బాడెడి పక్కియు నిలుచుండుఁ జంటిపాపలు గూడన్
జెక్కిన బొమ్మల వలెనే దిక్కుగనక విందు రితని తియ్యని గళముఁ. 82

ఆ. మత్త మధుకరంబు మొత్తమ్ము లొకమరు ఝుంకరించు తేనె జాలువాఱు
గండు కోకిలములు కలహించు నొకసారి పలుకు హంస లితని గళరవమున. 83

ఆ. ప్రత్తి విచ్చినట్లు పండొల్చి చేతిలోఁ బెట్టినటులు కనులఁ గట్టినటులు
విసుగులేక యింక వినిన బాగుగనుండు ననఁగ నెంతొ రుచులు తనర నుడువు. 84

సీ. సిద్ధాంతులకె యెంతొ శిక్ష నీఁజాలు నపార జ్యోతిష్కలాబ్రహ్మ యతఁడు
సంస్కృత ద్రవిడాంధ్ర సాహిత్య జలధిలో నంత మారసిన దిగ్దంతి యతఁడు
బ్రహ్మవిద్యా భాష్య భగవద్విషయసూక్తిఁ బయిచేయి లేదనఁబడె నతనికిఁ
బులి జూదమున వీరి గెలిచెడి మొనగాఁడు పుట్టి రావలెనన్నఁ బొగడుటగునె ?

తే. పది తడవలేని వెయినూట పదియు నార్లు రౌప్య బహుమతు లర్ఘ వస్త్రములు శాళ్ళు
గొన్నవాఁడు మాటపదార్లకన్న నెపుడు తక్కువగ నాతని కొసంగు దాతఁగనము. 85

ఆ. ఇంత పండితుఁడయి యేమిచ్చినను గొను నానఁగొనఁడు పేదవేసముననె
మను నతమ్మ నిట్టి మా తండ్రి గర్భాన నెట్టి తపముజేయఁ బుట్టినాము ! 86

తే. అరయఁ బండిత వంశంబు నందు నిట్టి ఘనుని సుతులమై మూవు రగ్రజులు నేను
బుట్టినందుకు గర్వింప మెట్టులతని జ్ఞానలవమె మా యందు నేమేని యున్న ? 87

ఉ. వీరి కుమారు లందఱను వేంకటనాథుఁడు పెద్ద నాకుసుఙ
గూరిమి యొజ్జ, గుండవర గోపుని స్థానిక పండితుండు నా
కారము దాల్చి విద్దెలిటఁ గన్పడు ద్రావిడ సంస్కృతాంధ్రముల్
పారము ముట్టఁజూచెఁ బరభాషలు నేరిచె నుర్దు నాంగ్లముల్. 88

తే. ఉభయ వేదాంతశాస్త్రల మూహ సౌరని గణితశాస్త్రంబునం దెంతొ ఘనుఁడు వాణి
గర్వమును జంపి దంబంబు గట్టిపెట్టి యీ కళాతపస్వి మొగాన నిల్లుఁ గట్టె. 89

తే. బమ్మకుం బొమ్మ గట్టిన పండితుండు సకల భాషల జననియౌ సంస్కృతమున
మొక్కవోవని పదునైన యుక్కుతునుక విచ్చు తరవారి వాదర విధము దోఁచు. 90

మ. ఒక విద్యన్ బరిపూర్ణుఁడై మిగతలం దొక్కొక్క యల్పాంశ సా
ధకుఁడైనఙ శశిఁ గూడియుండు నుడు సంతానక్రియన్వెల్గుఁ దా
నొకటన్ బూర్ణుఁడుగాక యన్ని కళలం దొక్కింత సాధింపఁగన్
సకలోడుస్థగితాంబరంబున నమాసం గన్న చందం బనున్. 91

ఉ. నిండు ఘటంబు మౌని కడు నిగ్రహజీవి యఖండకీవిశా
లుండయి నీఱు గప్పికొన లోపల నుండెడి నిప్పు. బోధనన్
బండను దొల్చి రత్నమన భాసిలఁజేయును వేంకటాఖ్యచే
నుండె మదగ్రసోదరుఁడు యోగ్యుఁడు నా గురుదేవుఁ డాప్తుడై. 92

తే. అద్వితీయుఁడు నల్వురిలో ద్వితీయ సోదరుండు లక్ష్మణనామ శోభితుండు
లౌకికీ శిక్ష నెఱిగించు లక్షణమ్ము నైదువందల సూత్రమ్ములందు వ్రాసె. 93

తే. ఘన ప్రవక్త బహు గ్రంథకర్త నాల్గు బాసల ననర్గళముగఁ గవన మొనర్చు
ప్రౌఢకవి యాహిరీరాష్ట్ర ప్రభువరుఁడగు ధర్మరాజ సంస్థాన విద్వాంసుఁ డితఁడు. 94

ఉ. చక్కని సంస్కృతాంధ్రముల సాగిన యీ కవిరాజు వాణిలో
మిక్కిలి హృద్యమై రసము మీఁగడ గట్టెను నర్థెపల్ చెవుల్
నిక్కడి యాలకించెను ధ్వనింప నొయారపు క్రొత్తకైత లిం
దక్కటఁ గొన్ని యచ్చుపడె నాఁగెను గొన్ని ధనాద్యభావతఙ. 95

క. నేనును జగదీశ సదభిధాన తృతీయాగ్రజుఁడు సదా యనురక్తిఙ
మేనులు రెండైనను గన ప్రాణం బొకటియె యనంగ వర్తించితిమౌ. 96

క. ఒక కంచమున భుజించితి మొక మంచమునం బరుంటి మొక హృదయముతో
సకల కల లభ్యసించితి మకలుషిత ప్రేమ గర్భి తాంతర్యములఙ. 97

చ. సకల కళా విభాసితుఁడు చక్కని గాయకుఁ డెంతొ యందమై
న కవిత సంస్కృతాంధ్రముల నాగరకుల్ గొనియాడ వ్రాయుఁ బా

తకముల( బాపు నా హరికథ కథనమ్మున నాంధ్రభూమిలో
నొక యసమానరత్నమన నొప్పెను నేరిచె నాంగ్ల ముర్దునున్. 98

ఆ. కోకిలలకు మావి కొన( జూపి యూరించు జంటితేనె లాళజూపు తేంట్ల
కతని గళరవమున హాయి, సౌఖ్యము మెండు నా తపమ్ము ఫలింప భ్రాంతయయ్యె. 99

ఆ. తనదు కూ(తునొస(గి తండ్రి పెన్నొ-క తండ్రి యగుటెకాక నాకు నన్నపత్ర
మిడి కవిత్వకన్య యెంతొ విశ్రాంతిగ నన్ను గూడ(జేసె నా శ్వశురు(డు. 100

ఆ. ఆతని యుపకృతి(గొని యక్షరరూప కీర్తనల( దన కృతజ్ఞతల( దెలుపుట
నస్మదీయవాణి యా చందురునకుగా నొక్క- నూలుపో(గు నుంచుటెయగు. 101

సీ. హరిదాసకేసరి యన జగన్నాథార్యులనగ చెన్నూరిలో దనరు నిత(డు
నితని యశస్సింహ మీ యాంధ్రదేశాన నార్చి పంజావైచె నన్నిచోట్ల
నీతని గానమోహిని తాను స్వర్ణంపుటందెల గెల్చిన యందగత్తె
యీతని వాగ్దేవి యెన్నియోనగరాల( బుష్పవర్షమ్ముల మురి(గితేలె

తే. రాగమును వ్యాప్తి(జేసి హార్మనినిగాంచ రాగమును దో(చదని వేశ్వరవ మొనర్చు(
దాళమును వైచియల్లె మృదంగము( గన(దాళ మీ ధాటికని చేయి తప్పివేయు. 102

చ. సువిశద వాగ్ఝరీమహిమ చుక్క-లనాడెడి గాత్ర కిన్నరీ
సవతి పికమ్ము వోలె సరసంపు బరాబరులాడ నూ(పు లూ(
పి విడిచెవేల్ల నూర్లపత్రిజ భేషన( బల్లెల( బట్టణాల( గీ
ర్తిపడసె నెల్ల దేశముల దిర్గి సదా హరికీర్తనాదులన్. 103

శా. గంధర్వ ప్రీతిమానగానములకున్ గండ్లెణ్ణై కోకిలల్
రంధిణ్ గానల మోముదా(చుకొను చార్వజ్ మోహనాస్త్రోల్ల స
ద్బంధమ్మై స్వరగాత్రమాధురుల శ్రోతణ్ ముగ్ధునిం జేయ(గా
సింధుప్రావృత భారతావనిని నర్చింప(బడెణ్ మేటియై. 104

తే. కాగితములోన శిల్పమ్ము కత్తిరించుటందు తన సాటి(గనని మహాంధ్ర శిల్పి
యౌర! వీరి హస్తము సోకినంతలోనె కత్తెరకు కన్ను లుదయించు కళలునించు. 105

సీ. తలచు మానసమందు( దలచికొన్నంజాలు మయసభా శిల్పసంపదల( గురియు
కాగితమ్మును మల్చికై బూవినంజాలు నకిషీవిలాసముల్ నాట్యమాడు
కత్తెరకొనలింత కదలియాడినజాలు ఫలపుష్పతరులతల్ కళలు జిమ్ము
లలితాంగుళు లొకింత లాస్యమాడినజాలు శుకమయూర మరాళ నికరమొలుగు

తే. అచ్చువలెనుండు నా గరి యక్షరముల, ముచ్చటం గొల్పు వీరి పమ్మోనకర
కల్పనా నల్ప శిల్ప సత్క-ళలొకింత( గాంచ ముగ్ధు(డై చను విశ్వకర్మయేని. 106

తే. బ్రహ్మవేత్తయై బ్రహ్మానుభవరహస్య మెఱుగఁబల్కెడి రాజ యోగీశ్వరుండు
వీరి శిష్యగణమ్ములు వేల సంఖ్యలందు గలరందునందు మహాంధ్ర భువిని. 107

తే. ఒరుల మనసుల నొప్పించి యెఱుఁగనట్టి ధర్మగుణజాల నిరతాన్నదానశీల
సతత పతిపాదసేవ నాసక్త చిత్తయై సుఖదాఖ్యఁ జెలఁగు నా యత్తగారు. 108

సీ. మా తల్లిసీత బ్రహ్మజ్ఞ జనకజాత యఘదైత్యభీతజ్ఞానాగ్నిపూత
లక్ష్మి కళాదీప్తలావణ్యసముపేత ప్రఖ్యాత సుగుణసంపత్సమేత
సదమలసంతానచయ నందనోద్యాన యతిథి సమ్మోదకృదన్నదాన
సాధ్వీశిరోమణి స్వకులహితైషిణి యనసూయశీల దయాలవాల
తే. స్మయరహిత సుస్వభావ భాస్వత్ప్రభావ సత్యవాక్పూర పతిహిత సద్విచార
అనవరత శ్రీనివాస పాదారవిందమగ్న మధుపాయమానసమ్మాన్యహృదయ. 109

తే. కనియె తొమ్మండ్ర నా ప్రియజనని, యందు నుభయ వంశతారకలగు నుభయసుతలు
నలువురం బేరు కీర్తులఁ జెలఁగునట్టి నలువురు తనూజు లిప్పుడున్నారు భువిని. 110

తే. అందరం జిన్నవాడ విద్యార్జనమున నన్న లందఱికం బెను జిన్నవాడ
యిహపర సుఖమ్ములంబొందు హేతువిదియె యనుచు వరియింతు సుకవితావనిత నెందు.

క. పేశలగతి మణిమాలాకోశము నాహ్వాన కృతిని గూర్చితి మునునే
ధీశాలురైన విబుధుల యాశీస్సులఁగొంటి ధైర్య మలవడనుంటిన్. 112

క. పోతన కావ్యము వ్రాయన్ జేతమ్మననెంచి కృషినిజేసితి సుకవి
ఖ్యాతిగొన కాళిదాసులు పోతనలుం గూడ శ్రమలు బొందిరిగాదే. 113

ఆ. వారి ప్రతిభయనెడి వారాన్నిధికి ముందువారి కణమునగుచు వరలునేను
కావ్యమొండు వ్రాసి కవిలోక యశమును గాంచనెంచఁ బ్రజ హసించునేమొ. 114

ఆ. ఐననేమి మామకాజ్ఞానతిమిర సంగతులఁ దారిఁ దప్పుగతుల నరసి
యజ్ఞు డీతఁడనెడి విజ్ఞవర్యుల పరిహాసరుచులె మార్గ భాసకములు. 115

## సత్యదేవ స్తుతి

తే. స్వప్నసాక్షత్కృతి నొసంగి సత్యమూర్తి సకల దుఃఖభంజకమునై స్వాభిలషిత
సౌఖ్య సంధాయకమగు నస్మద్వ్రతమ్ము భక్తిమై నొనర్పుమటంచు బల్కెనొకట. 116

తే. నాటినుండి యా ప్రభుచరణ సరసిజము లాశ్రయించుచు ప్రతిమాన మమితభక్తి
వరల నొనరింతు తద్వ్రతాచరణమేను వెలసె సత్యదేవుం డిలవేల్పుగాగ 117

తే. ఘోర దీర్ఘక్షయవ్యాధి గూరినపుడు భార్యయును బంధుమిత్రు లుపకరణములు
గాగ విర్హేతుకామోఘ కరుణమెరయ నాకు ప్రాణప్రదాన మొనర్చె నతడె. 118

## కావ్యనిరోధ నివారణ

మ. సరిగా కావ్యము పూర్తిగాకమునుపే చంపం బ్రయత్నించు దు
ర్భర దుఃఖాకర రాజయక్ష్మకృత దీర్ఘవ్యాధితో నాల్గవ
త్సరముల్ పోరు నొనర్చి గెల్చితిని శస్త్రవాప్రిత ఘాతల్ పోరిం
బొరి బిట్టోర్చితి మార్చితిన్ యమునిదా "ప్రోగ్రామ్ము" నాసాంతముగ్. 119

ఉ. నే నిటు మృత్యువుం గెలిచి నిల్చుట రామ కృపాబలమ్ము నా
మానిని కంఠమం దలరు మంగళసూత్రి బలమ్ము నా తెలం
గాణపు తల్లి చల్లనగు గర్భ బలమ్మను నత్తమామలం
బూనికనుండు నాత్మబలముల్ కవిమిత్రి తపోబలమ్ములున్. 120

తే. అత్తమామలు, నా భార్య, యా ప్తమిత్రివరులు కాళోజి కవియు, దాశరథికవియు,
బూరుగుల రామకృష్ణరా డ్బూధవుండు నాకు ప్రాణపప్రిదాత లనంగవచ్చు. 121

శా. నా మైసూరు నివాసమందు వరదన్నా! యంచు కాళోజి తా
జీమూతమ్మయి ప్రేమ బాష్ప ఘనవృష్టిం బిట్టు వర్షించుచున్
నా మేనం గల తాపమార్చె నొక వందౌ లేఖలన్ సాంత్వన
శ్రీమాధుర్య సుధారసమ్ము లిడె నన్ జీవింపగా జేయనై. 122

చ. సఖుడు ప్రాణమిత్రుడును సత్కవిలోక దివాకరుండు దా
శరథి మహా కవీంద్రుడును జాబులు వ్రాయుచు నిట్టులాడె నో
వరదన! నాకు మోదకర వార్తలు జీవితమందు రెండె నీ
బొరసిన వ్యాధి దూరమయిపోవుట, పోలిసుచర్య యిద్దరగ్. 123

ఉ. పాయస దివ్యమాధురుల బంచు సుకావ్యముల న్లిఖించు నా
రాయణరెడ్డి సత్కవియు వ్రాసెడి జాబులలో నిటాడె నేం
డ్లాయెఁ దెలుంగునాట వరదన్న! మహాకవియైన పోతన
స్థాయికి జెందు నీ సుకవితా సుధలగ్ రుచిజూపవంచునున్. 124

సీ. మా యమ్మ వినుతింప మహిత వర్తనముల నత్తమెచ్చిన కోడలనగ నొప్పె
ఘన విపత్తుల నరశణము నవ్వీడక వైదేహి పేరు నన్వర్థపరచె
మైసూరు రాణిచే మహిళా సువాణిచే నభినవ సావిత్రి యనగ దనరె
మామక సేవకై మైనంకిత మొనర్చి నా బహిఃప్రాణమనం జెలంగె

తే. ఘోర యక్ష్మమ్ము నను భీకికొనుచుఁ దినగ నిదు దివసమ్ము లుపవాస మాచరించి
దేవు నడిగి నా బ్రిదుకు సాధించికొనిన మహిత గుణగణపేటి యస్మద్వధూటి. 125

సీ. పలుమార్లు క_త్తికోతల చికిత్స లొనర్ప పదివేల రూప్యముల్ వ్యయమొనర్ప
స్వాస్థ్యమ్ము గల్గమి సతత చింతామగ్న మానసులగుచును దీనులగుచు
న_త్తమామలును, భార్యయు, ధనాభావత ముమ్మాపు ఉపవాసముల బొనర్చి
కావేరిలో బడ కాయముల్ బాయగా నిశ్చితమతులయి నెగడు వేళ

తే. సుకవి పడుపాటు లెంతయుఁ జూడనగునె యనుచు నొక వేయి రూప్యములంపి నన్ను
రక్షణమ్మొనరించిన రాష్ట్రనేతయైన రామకృష్ణామాత్యు నభినుతింతు, 126

క, నా యింటి దీప రక్షకుఁ డాయెను బూర్గుల సదన్వయాబ్ధివిధుండై
స్వీయ దయామృతముల నిడి యాయువులను బోసె సుమహితాత్ముం డగుచున్. 127

గీ. ఆంధ్రలోకపు పూర్వపుణ్యముల పంట మంత్రిమాణిక్య చాణక్య మహిత దంట
యైన బూర్గుల రామకృష్ణాహ్వయునకు ఆయురారోగ్యభాగ్యమ్ము లలరుగాత ! 128



# విషయ సూచిక



## తృతీయాశ్వాసము

## షష్ఠాశ్వాసము

## సప్తమాశ్వాసము

## అ ష్ట మా శ్వా స ము

నవమాశ్వాసము

## ద శ మా శ్వా స ము

## కావ్యానుబంధము

### ఏకాదశాశ్వాసము



### ద్వాదశాశ్వాసము

శ్రీ రస్తు.

శ్రీ వాగీశ్వర్యై నమః




## జననము – బాల్యము.

*శుచీనాం శ్రీమతాంగేహే యోగభ్రష్టోఽభిజాయతే*

శ్రీరఘువంశ సుధార్ణవ
శారదరాకాశశాంక ! జననీ కౌస
ల్యారోజ పూర్వశైలత
టారూఢశరీర ! దశరథాగ్రకుమారా ! 1

ఉ. సొమ్ముల యాసలోఁ బడక క్షుద్రనృపాలుర నీసడించి చొ
క్కమ్మగు భక్తి భాగవత కావ్యరమం గృతినిచ్చె నీకు శ్రీ
బమ్మెరపోతరా జతని భవ్యచరిత్రము నే మహాప్రబం
ధమ్ము నొనర్చి నిన్ను కృతినాథునిగా నొనరించి చెప్పెదన్. 2

ఉ. విన్న దొకింత భాగవత విశ్రుతపీఠికలోనఁ దాను పో
తన్న వచించినంతను యథార్థ మిదే యను మా చరిత్ర తి
క్కన్నల వాదధోరణి రవంత మనమ్మునఁ దోఁచినంత నీ
సన్నిధిలోన నే మనవి సల్పెద నల్పమతిన్ మహాదృతిన్. 3

తే. సుతుని గొప్పలఁ గీర్తింప నతి ముదమున వినుచుఁ దను దాన మఱచెడి జనకునివలె
నాలకింపవె దేవ ! మహానుభావ ! జనవినుతకీర్తి ! శ్రీరామచక్రవర్తి !

### కావ్యోపక్రమము

మును నైమిశవని సూతునిఁ గని శౌనకమునివరాది గణ ముత్కంఠన్
వినయనతశీర్షమై కడు వినుతించుచు నిట్టు లొక్క వినతి యొనర్చెన్. 5

ఉ. దేశికరాణ్మణీ ! త్వదుపదిష్ట విశిష్టకథాసుధా సరి
త్ప్రేశల మాధురుల్ శ్రవణపేయములై భవదావభీషణా
వేశవినాశకమ్ములయి వేదపరార్థ విచార సార సం
కాశములై ప్రచండ కలికల్మషపుంజ విభంజకమ్ములౌ. 6

సీ. కలికాలమున నర్థకామమ్ము లివి రెండె పూరుషార్థము లయి వొల్చు నెందు
నవని జీవులకెల్ల నాహారనిద్రలే కర్తవ్యవిధులయి క్రాలుచుండు
భవబంధసంగతి పరమార్థసుఖమట్లు జనసేవనార్థమై తనరుచుండు
ప్రాకృత జడవాద పరిమితజ్ఞానమ్మె వేదశాస్త్రాదుల విలువగాంచు
తే. కలియుగమ్మందు నెందును గానరారు విష్ణుపదభక్తు లనువారు వెదకిచూడ
ధర్మదేవత యొంటి పాదమ్ముపైన నడువఁజాలక మూలకుఁ బడు నటంద్రు. 7

క. మాయోపాసకులకె కలి శ్రేయ మ్మొనఁగూడు దైవచింతనగల స్వా
ధ్యాయులకు నమాయికులకు న్యాయమునకు స్థాన మవని 'నహి' యంద్రు బుధుల్. 8

తే. భక్తియనిన నింద్రియసుఖప్రాప్తియందె త్యాగమనిననౌ మృత్యుసంయోగమందె
భూతదయ యన్నచో దారపుత్రు లందె సత్యభాషణవిధులు సాహిత్యమందె. 9

క. మనఁగలవఁట మనుజుల నో మునివందిత సకలధర్మమూలమ్మగు శ్రీ
దనుజహరు భక్తి వ్యాప్తిం బొనరించు మహాత్ము లెందుఁబుట్టరో కలిలో. 10

చ. అనుటయు రౌమహర్షిణి సమాదరబుద్ధి నిటు ల్వచించె నో
మునివరులార ! మీ వచనముల్ యుగధర్మ యథార్థరూప చి
త్రణము నొనర్చె నైనను బురాణ విరాజిత భక్తి శక్తి వ
ర్ధన చణు లుద్భవింతురు పరాశరసూనసమాను లత్తఱిన్. 11

తే. వ్రీహిరాశిలో నాడాడ వెలయు శిలలవలె ఖలుల్ కృతయుగమున వరలుచుండ
విసములో నచ్చటచ్చట మసలునట్టి తండులము లనఁ గలి బుధుల్ దనరుచుంద్రు. 12

క. అన విని మునిగణములు సూతునిగని యిట్లనియె వినఁ గుతూహలపడు మా
మనములు కలి జనముల సద్గుణగణవర్తనులు బుట్టుదురు ధర నన్నన్. 13

క. పారతరాగమ శాస్త్ర విశారదులగు మౌనులెందు జనియింతురు వా
రే రీతి మెలఁగ జనములు పారాశర్యోక్త శాస్త్రపథవర్తనులై. 14

క. పేగి సన విడుపు విడిదిన్ బోఁగలరన వారిఁగాంచి ముని యను గలిలో
భాగవతకర్తయగు నొక భాగవతోత్తముని చరితఁ బ్రవచింతు నిటన్. 15

క. లోక మిహ మొకఁడె యనుచున్ మౌకలివశ నేకదృష్టి మనలు కలిజనా
నీకమని నారదుఁడు మున్ వైకుంఠునిగాంచి ప్రశ్నవైచె నొకతఱిన్. 16

శా. ఓ వాత్సల్య పయోనిధీ ! భవపిశా చోద్విగ్నులౌ చేతముల్
భావాతీతుని నిన్నుఁ బొందు సులభోపాయమ్ము మా కిమ్ము, రా
నే వచ్చెన్ గలి యంచు దేవముని సందీప్తార్కకోటిద్యుతిన్
శ్రీ వైకుంఠనికేతనున్ మధురిపున్ సేవించి ప్రార్థించుటల్. 17

మ. జలజాతేక్షణుఁ డా వచస్సు విని వాత్సల్యామృతం బొల్క మై
పులకింపన్ దరహాససంతతులఁ బూవుల్ ప్రోవులై విప్ప నీ
కలిలో భాగవతమ్మె మోక్షపద సౌఖ్యప్రాపకం బంచు వే
దెలిపెన్ మౌనికిఁ దద్రహస్యమును నాదేశించెఁ దద్వ్యాప్తికై. 18

క. ధన్యోస్మి నాదు భాగ్య మనన్య మసామాన్య మనుచు నమ్మునియును సౌ
జన్యమ్ము వెలయ భువి సమ్మాన్యచరిత్రుఁడగు వ్యాసమౌనిదరిఁ జనెన్. 19

క. చని శ్రీ భాగవతము న మ్మునికి నుపదేశించె శ్లోకముల నాల్గిట దీ
నిని వ్యాప్తిసేయు మిది శ్రీ వనజాక్షుని యాజ్ఞయని దివమ్మున కేఁగెన్. 20

ఉ. నారదుఁ డిట్లు లేఁగి భువనమ్ములఁ ద్రిమ్మరుచుండు నంతలో
ధారుణి నాక్రమించెఁ గలిధర్మము. మర్మమెఱింగి మౌని శో
భారతభారతావనిని భావభవాంతకుఁ డుండు కాశికిన్
జేరువవెల్గు వ్యాసమునిశేఖరు నాశ్రమసీమ నేఁగుచున్. 21

సీ. అనవరతాధ్యయ నావర్తనోన్మత్త శుకతతుల్ శుకమహర్షులయి వరలెఁ
గరిపాదకంటకాకర్షన్న ఖరదీప్త హరితండ మపరశ్రీహరులె యయ్యె
షడ్జగాన విముగ్ధసర్పసంగత నీలకంఠముల్ ప్రీతినీలకంఠు లయ్యె
నధిపుండరీకత నధిగతాగమములై యజసమూహమ్ములెం దజులె యయ్యెఁ

తే. దానె సర్వజ్ఞుఁడును జతురాననుండుఁ బ్రబల నరకాంతకుండయి పరఁగుకతన
నతని సారూప్యమందె నీ యాశ్రమంబు మాయురే ! యాతపోధనుమహిమ యనుచు. 22

తే. హరిహరబ్రహ్మ సంకాశుఁడగు మునీశు, విరచితాష్టాదశపురాణవివిధకోశు
భారతామ్నాయవాగీశు భవవినాశు, బ్రహ్మసూత్రితగురువాగ్విలాసు వ్యాసు. 23

చ. కనుగొనె నీలమేఘనిభగాత్రు జటామకుటాభిరాము స
న్మునిగణసేవితున్ భువన మోహన భాగవత ప్రబంధ బో
ధనపరతంత్రు నైణతనుదత్తలసద్గురుపీఠు శిష్యవే
ష్టనమణిహారమధ్యగమసారమనోహరరత్నదీపునిన్. 24

క. గుప్తగతి వ్యాసుఁగని తావత్త యగుచు నాఁటు భాగవతబీజము సం
తృప్తికర ఫలవృతమ్మై వ్యాప్తిం జెందుటలు బానవాలుప్పొంగెన్. 25

క. పరికించి యెడఁద కడు నిబ్బరికింపఁగఁ బులక లలరఁ బరవశుఁ డగుచున్
'హరినారాయణ' యనుచున్ సొరిది నిరాబారి మొయిలు చొరి దివి కరిగెన్. 26

ఆ. సురలఁగాంచి వ్యాసుఁ జూచివచ్చినయట్టి చొవ్వు లెల్ల నెంతొ చోద్య మలరఁ
జివ్వతిండి యిట్లు సెప్పె వేలుపుజేని కంట కార మగుచుఁ గలఁతపెట్ట. 27

ఉ. ఓ యమరావనీంద్ర! ధర నొక్క మునీంద్రుని గాంచినాఁడ స్వా
ధ్యాయతనున్ గురుప్రతిభు నార్షకవీశ్వరు సత్కళానిధిన్
శ్రీయుతునిన్ బుధాగ్రణిని శీలధను న్నిరతాసురీబలా
జేయుని నైకసప్తఋషిసేవితు నన్యతపోవివర్ధనున్. 28

ఆ. వాయు వతని యండ వశవర్తియైయుండు నతఁడు రక్షకుఁడు హుతాశనునకు
ననవరతము నతఁడు యమపాలన మొనర్చు వానిఁబోలు మహితుఁ గాన నెందు. 29

ఉ. స్వాంతములోపలన్ నిగమ సంహితల న్మథియించి కర్మ సి
ద్ధాంతము సంగ్రహించి యితిహాసత భారతమున్ బొనర్చె వే
దాంతము బ్రహ్మసూత్రములఁ దాల్చెను భాగవతప్రబంధ వృ
త్తాంతములన్ శ్రియఃపతి పదాప్తికి భక్తిపథమ్ముఁ గూరిచెన్. 30

ఉ. సంచిత పుణ్యకర్మఫలసంపదలన్ బదులిచ్చి స్వర్గసౌ
ఖ్యాంచితులైరి పాండుతనయాదులు, భాగవతమ్ము భక్తి సే
వించి పరీక్షితుం డతుల విష్ణుపదమ్ము నకుంఠితాకృతిన్
గాంచెను దేవదుర్లభ మఖండ సుఖానుభవానుషంగమున్. 31

క. భారత భాగవతము లిటు పారాశర్యుండొనర్చెఁ బ్రాజ్ఞులు "వ్యాసో
నారాయణోహరి" యనన్ ధారుణి వినుతింప నమరధాత్రీశ! యనన్. 32

తే. విని బలారాతి మాత్సర్యవివశుఁ డగుచుఁ గినుక దనరఁగ మౌనిపైఁ బనికిరామి
నద్ది నవ్వులఁదేల్చి యిట్లనుచుఁ బల్కె విష్ణుభక్తుల కింద్రుఁడు న్వెఱచుననఁగ. 33

క. హరి పే రింద్రునకే తగు హరియనుట కుపేంద్రుఁడే సమర్థుఁడు ధాత్రిన్
నరులకు హరి యను బిరుదము సరిపోలునె నవ్వుగాదె సంయమినాథా! 34

ఉ. గొంకక వ్యాసమౌనికృతకోశము భాగవతమ్ము మోక్ష వి
ద్యాంకముగా వచించె దిటు లయ్యది కేవలదేవవాణి పా
దాంకిత మౌటఁగాదె భువినంతటి యోగ్యతగాంచె నెందునున్
సంకునఁ బోయఁ దీర్థమయి సత్కృతిగాంచదె కూపనీరమున్. 35

చ. అనవిని మౌనిచంద్రుఁ డపహాస విభాసిత మౌనముద్రతోఁ
గనుగొనె వజ్రికిన్ హృదయకంటకమై వెతగూర్ప వెంటనే

వినుడనిపల్కె శక్రుఁడిది వేరొకభాష రచింప నాదృతిం
దనరిన నట్టి బాసలకు దాసుఁడనయ్యెద మూఁడు జన్మముల్. 36

చ. ఇటు శపథం బొనర్ప సురలెల్లరు నుల్లము లుల్లసిల్లఁ జ
ప్పటులనువైచి శక్రుని సెబాసని సన్నుతి జేసి మర్త్యుఁ డె
న్నటికి సమర్త్యులం గెలుచునా నగుబాటని రంత మౌని సం
కటపడి వ్యాసమౌని కిది సర్వ మెఱుంగఁగఁ బల్కనెంచుచున్. 37

క. చనె ఋష్యాశ్రమమునకున్ గనె నచ్చట వ్యాసు వేదగానవిలాసున్
గొనె నతని ప్రణతు లాదట వినిచె న్నగభేది గర్వవృత జల్పనముల్. 38

చ. అది విని బాదరాయణి మహావ్యధితాత్మకుఁడై వచించె నో
త్రిదశమునీ ! మురాంతకుని దివ్యచరిత్రము లెట్టి బాసలోఁ
బొదిగిన నేనియద్ది సురపూజితమై యలరారు విష్ణుప
ద్యుదకము లీ కమండలువు నొందిన నిద్దియె సంకుతుల్యమౌ. 39

ఉ. దేవమునీంద్ర ! నేఁడు భవదీయమనోవ్యథ దీర్పఁ గాశికిన్
బోవఁదలంతునంచు ముని పుంగవుఁగాంచి నమస్కరించి యా
తావులకేఁగి ధూర్జటి పదమ్ములపైఁ గనుదమ్ములుంచి హృ
ద్భావము విప్పిచెప్పి నతిఁ బ్రార్థనమున్ బొనరించె నీగతిన్. 40

ఉ. ఉండెద వీశ్వరాహ్వయత నొక్కెడఁ బూరుషవేషధారివై
యొండొకచోటఁ బార్వతిగ నొప్పెదు శ్రీప్రకృతి ప్రవృత్తి నీ
రెండునుగాక నెల్లెడఁ జరింతువు చేతముగాఁగ మేన బ్రి
హ్మాండమునం ద్రిలింగత విహార మొనర్చెడి నీకు మ్రొక్కెదన్. 41

తే. 'వేదవేదాంగములు దేన వెలుఁగుచుండు నట్టి గీర్వాణవాణిలో నలరుకతన
వసుధ నీదు భారతభాగవతము లింత యాదరముఁగాంచె నీ కృతులగుటఁగాదు.' 42

క. అని శ్రీహరిగుణగాథలఁ గొని యవమతి సల్పెనౌర ! గోత్రభిదుఁడు వే
కనులుండి గ్రుడ్డివాఁడై చనుచుండె నపారగర్వ సంభృతమతియై. 43

ఆ అనుచుఁ గాశి వెల్గు నంబికాపతిదాసి నుతులుసల్పి భక్తినతు లొనర్చి
సంస్కృతమ్మువోలె సారవంతమ్మగు బాస నీవె భాగవతము వెలయ. 44

తే. ఈ వరమొసంగవేని విశ్వేశ ! వినుము జగతిఁ బ్రాయోపవేశమ్ము సల్పి వ్యాసు
డసువులంబాయు నీ భక్తు డమరపతికి లోఁకువై పోయెవనఁ గొట్టు నీకెకాదె ! 45

చ. అని ముని వల్కఁ శూలి దరహాసవిలాస మనోజ్ఞమూర్తియై
యనియెఁ ద్రిలింగరూపునిగ నారసి సన్నుతిం బొనర్తువో

యనఘ ! త్రయీస్వరూపుఁడ వహంకృతిదూరుఁడ వాత్మతత్త్వబో
ధనుఁడవు నీదు సన్నుతి ముదావహ మయ్యె యథార్థరూపమై. 46

క. వినుము త్రిలింగప్రాంత మ్మన నొప్పు ధరిత్రి నందు నలరారు నుడుల్
దనరుఁ దెలుంగనఁ బోతన యను కవి భాగవతరచన మం దొనరించున్. 47

తే. అతఁడపరిణీతుఁ డగుచు మహాతపమ్ము నాచరించి భాగవతకావ్యము నొనర్చ
నొకట వైవాహిక క్రియ లొదవెనేని బ్రహ్మచర్యమూనును సిద్ధి బడ యుదనుక. 48

తే. ప్రథిత నిరుపమ ప్రతిభావిభాసి యగుచు నతఁడు గురుశిక్షణములేక నఖిలశాస్త్ర
నిపుణుఁడగుచును సహజ పాండిత్య బిరుద రాజవిభ్రాజితుండగు నీ జగతిని. 49

క. రమణీయరచన నత్యనుపమ భక్తిజ్ఞాన భక్తి వైరాగ్యరతిన్
సమగతిని దూఁగు గీర్వాణముతోఁ దెన్గుకృతి నిత్య నవరసఝరియై. 50

సీ. లింగాకృతి న్నేను రంగైన నెలవంక గలిసి యక్షరరూపములుగ నలర
గణపతివర్ణాది గణియింపఁగాఁబడు నోంకారరూపమై యొప్పుమిగులఁ
బార్వతి తలకట్టు పరమేశు నెత్తిపైఁ బడగ నెత్తిన నాగు గుడి నమర్ప
శృంగీశ్వరుఁడు కొమ్ము గంగమ్మసుళ్ళును దిర్యక్ త్రిశూలము దీర్ఘమిడఁగ

తే. నాణిముత్యంపుఁ జేరుల యల్లికలగు నక్షరములకు గుణితంబు లందగింపఁ
దేవియ స్రవింపఁ జక్కని తెన్గు గాంగ పూర మొలికింప నుంటి నీ కారణముగ. 51

సీ. ఆంధ్రవాఙ్మయము నన్నయ్యగాఁ బిల్చిన ట్లానుడి శాసింతు నను విరించి
తెలుఁగు కవిత్వమ్ము వెలిఁగింపఁ జేయఁగ భాస్కరు న్నేనను భానుమూర్తి
తెనుఁగు కబ్బమునకుం దిక్కన న్నేనని తలఁదాల్చి నిలుపుఁ గుండలుల పెద్ద
యీ తెల్గుకైతల కెరయన న్నేనని పరమేశు బిరుదానఁ బరఁగుచుందు

తే. నలరు త్రైలింగభాషలో నమృతరసముఁ జిలుకు సోముఁడ నేనని పలుకుశశియు
నాంధ్ర కావ్యలక్ష్మికి సువర్ణాభిషేక మొనరఁజేసెదు శ్రీనాథు నను మురారి. 52

క. దేవతలె తెన్గుకవులై భూవలయమునం దెనుంగు బోషింపఁగ దీ
క్షావిధిఁ బూనెద రింకన్ నీ వర మది పూర్తిగాక నిల్చునె మానీ ! 53

తే. భాషలోఁ ద్రిలింగమ్ములు బరఁగుచుండు వాని గీర్వాణవాణి శబ్దపరములుగ
నిలిపి రూపభంగమొనర్చు తెలుఁగులందు వస్తుపరముగ సవరింతు వాని నేను. 54

తే. శేషశాయి 'అ' కారమై చెల్వుగులుకఁ బద్మభవుఁడు 'క్ష' కారరూపము ధరింపఁ
నగ్ని బీజ రేఫము రుద్రుఁడై వెలుంగ 'నక్షర' పదమ్ము మూర్తిత్రయాత్మకమగు. 55

క. ఈ తెలుఁగు హరుఁడు పల్కుట లేతద్వృత్తాంత మాత్మ నెఱిఁగి పవనుఁడున్
జేత మ్మెరియఁగఁ జని పురుహూతున కఖిలమ్ము విదిత మొనరిచె నంతన్. 56

చ. సురపతి మాతృభాష కిటుఁ జొప్పడనున్న యవజ్ఞ దేవతా
పరిభవమంచు నెంచి మది బాధపడెన్ బ్రతిచర్య దీనికిన్
జరుపఁగఁ బూని కిన్నరులు సాధ్యులు సిద్ధులు యక్షరాక్షసుల్
గురుబుధులున్ దిశాపతులు గొల్వ నుపేంద్రుని సన్నిధిన్ జనెన్. 57

చ. చని కమలామనోహరుని సస్మితశాంతముఖారవిందమున్
గని ప్రణమిల్లి దేవతలకందఱు కెందును దిక్కు వీవె సు
మ్మని పొసఁగించి తద్విషయ మంత యిటు ల్వివరించె విష్ణువున్
విని తనమానసమ్మునను విస్మయ మందగ బాధ జెందఁగన్. 58

సీ. ఔదలం ధరియించి యన్నవస్త్రము లిచ్చి పోషించు వరమాతృభూమి కన్నఁ
బొట్టలోఁ గొని మేటిపుట్టువు న్నిర్మించి స్తన్యమ్ము లిడి పెంచు జనని కన్న
బాల్యమ్మునన కాక బ్రతికినన్నాళులున్ బాలిచ్చి పెంచు గోమాతకన్నఁ
దలలోని నాల్కయై తలఁపున కాకార మొసఁగి విజ్ఞానంపుఁ బసదనర్చి

తే. ఘనత నిడు తల్లి బాసయే కాదె మిన్న యింతెకాక ప్రాఁబలుకుల కిల్లు నెల్ల
తల్లి బాసలతల్లి మందారవల్లి దేవవాణి దాని కదేటి తెల్గు పోటి ! 59

క. శరణాగతరక్షణ ఘన బిరుదాంకయశోవిశేష ! ప్రేమసుధా సా
గరవరనికేతనా ! నిర్జర భాషాజనని నిపుడు రక్షింపఁ దగున్. 60

సీ. అన విని వనజాక్షుఁ డమరాధిపునిఁ గాంచి స్మితసముల్లపిత భాషితము లీను
సమబుద్ధి నిటు పల్కు సకలభూతస్వాంత సంవాసినగు కర్మసాక్షి నేను
ఏప్రాణికేని నిర్హేతుకమ్ముగ బాధ లొదవినచోఁ గాంచి యోపలేను
మద్భక్తవరు నవమతి సల్పు కుత్సిత మానసుం డతఁ డెవ్వ డేని తాను

తే. స్వాధిరూఢ శాఖాచ్ఛేదచర్యబూను దేబె యగునని మీరెల్లఁ దెలియనగును
శౌరి పదభక్తు లాసురీశక్తి నణచి విశ్వకల్యాణమును గూర్చు విబుధులెందు. 61

తే. సురపతిగురుండు శుక్రుఁడు సూర్యచంద్రు లలఘుమతులు వీరెల్ల మదంశభవులె
విబుధులకు నాకు నెందైన వేఱుగలదె యమరవరులార ! మీరిట్టు లడలనేల ? 62

ఆ. సురలు మీరు ముందు నరులెవ్వరో మిమ్ము పరిభవింతురనుచు బాధజెంద
నేల యుచితగతుల నేదేని ప్రతిచర్య నాచరింపఁబూనుఁ డాత్మబుద్ధి. 63

క. కర్మవిహీనత యొప్పదు ధర్మమునకు విజయమెందుఁ దప్పదనుట లా
మర్మజ్ఞుఁడైన శ్రీపతి నర్మమ్ము లెఱుంగలేక నగభేది వగన్. 64

ఆ. మాకు నెల్లవేళ మార్గదర్శకుఁడవు వీవె యంచు నమ్మి నీరజాక్ష !
వచ్చినార మింతవఱకు నీ వీరీతి తప్పుకొనిన నేది దారి యనెను. 65

చ. సురుచిరధర్మసంకలిత సూనృతభాషలు జెప్ప నిట్టి పా
మరు చెవికెక్కునే దురభిమానవిదూషితుఁ డీతఁ డంచు లో
నెఱిఁగి స్వభక్త రత్నతతి నేచుశ్రీమమ్ములె సానరాళ్ళుగా
నరసి సురాళిఁగాంచి యిటులాడెను శ్రీహరి బాహిరంబుగన్. 66

చ. గురుతర సత్తపోనియతిఁ గూడిననే ఋషిభావమొందుచున్
నిరతసమాధి మగ్నుఁడయి నిల్వఁగ నోపును దత్సమాధిలో
సరసపుకావ్యసంతతుల సంలిఖియించుచుగానఁ దత్తప
శ్చరణ విధమ్ము భంగపడు చర్యలొనర్పఁగ నేర్పుగావలెన్. 67

ఆ. తపముఁ జెఱుచుకొఱకు ధనదారసుతరూప కేషణత్రియమ్మె హేతువగును
ఏతదీషణత్రియాతీతుఁడై యుండు భక్తవర్యుఁ డెందు ముక్తినందు. 68

సీ. స్వర్గాధిపత్య భాస్వద్భవ్య శకాంశ మవని సింగనృపాలుడై జనించు
భావజాతమనోజ్ఞ లావణ్యరూప రత్యంశమ్ము సుకవిభార్య న్వసించు
వేదశాస్త్రపురాణ విజ్ఞానదీప్త విఘ్నేశ్వరాంశ సుతాత్మ నెసగుచుండు
ఇందిరాహృదయాబ్జమందిరమ్మగు మామకాంశమ్ము శ్రీనాథునందు నుండు

గీ. నాగభూషణాంశము చిదానందుఁడగును, రంభ భోగినిగా ధర న్సంభవించు
దాశరథినయి నేనును దత్కవీంద్రు గాంచి యాచింతు నాంధ్రభాగవతకృతిని. 69

క. సురపతి తద్భాగవతము నరాంకితమొసంగు నటులొనర్పఁగవలె నీ
పరివారముఁ గొని యపు డది ధరమోక్షప్రదము గాక తనుతను బొందున్. 70

క. అనుటయు నారదుఁ డచటికిఁ జనుదెంచి రమాధినాథు సందర్శనముం
బొనరిచి నీ లీలలు వాఙ్మనములకునతీతమని నమస్క్రియ సలుపన్. 71

క. హరి నారదుఁ గని నవ్వెన్ సురమౌనియు హరి మొగమ్ముఁ జూచి హసించెన్
సురలెల్ల రొకరి మొగ మొక్కరు ప్రశ్నార్థకము గాఁగఁ గనుగొని రంతన్. 72

ఆ. స్వీయ గౌరవమ్ము చెన్నారుటకు గాను పరిక్కవారిఁ గించపఱచు జడుఁడు;
ఒరుల దీపమార్చి యొప్పారఁగల నను శలభరాజు కెచటి జయమటంచు. 73

క. ముని పల్కె నంత నేటికొ పని వినియెదననుచు వజ్రి పయనించుటయున్
దను వంటు చాయ పోలిక వెనువెంటం బయలుదేరె విబుధగణమ్మున్. 74

వ. అంత నారాయణుం గని నారదుం డిట్లను. 75

చ. సురపతి సోదరుండు పరిశుద్ధ మనస్కృత భక్తుఁ డాత్మయై
వరలెడి పుత్రుఁ డిందు నొకవైపున నీపు మరొక్కవైపునం

బరఁగెను పొట్ట రెండిటను బాధయె చేకురె ధర్మసంపదు
ద్ధరణ మొనర్ప కంకణము దాల్చిన నీకు వచించువాఁడనే. 76

చ. అనుచు నమస్కరించి గగనాధ్వచరుండయి వాసవాలువేఁ
జనఁదొడఁగెన్ విపంచిఁ గరశాఖల మీటుచు దూరమేఁగు న
మ్మునిఁ గని శారదాభ్రమని పూర్ణవిధుండని తారయం చెదో
ధ్వని యని శూన్యమంచు నొగిఁ బల్కిరి విష్ణుపదాలయ స్థితుల్. 77

వ. అని సూతుండు తత్కథా విధానంబు విన్నవించిన తెరంగెద్దియన. 78

## కథా ప్రారంభము

క. శ్రీనిధి కాకతి రాజ్య రమా నిర్మిత రాజధాని మహితైకశిలా
ఖ్యా నగర మ్మా దేశము తేనియ మాగాణ మెందుఁ దెలగాణ మనన్. 79

సీ. బ్రాహ్మణుం డా వీట బహుళ విజ్ఞానియై ప్రథిత విద్యానాథ పదవిఁ బడసె
క్షత్రియుం డా కోట సమరప్రతాపుఁడై రుద్రావతారంపు రూపుఁగొనియె
వైశ్యుఁ డా పూఁదోఁట వర్ధితనిధి పైఁడి తిప్పయ యనఁగ సందీప్తినొందె
శూద్రుఁ డాచోట దస్యుల ప్రాణగొడ్డమా కాపయ్య నా నెంతొ గణుతికెక్కె

తే. బ్రహ్మ తను ముఖ బాహూరు పదములగుచు నేకతనుగాంచె జాతు లనేకములయి
విడివిడిగఁ జీలిపడు వర్ణవితతి యెందుఁ గ్రమతఁ గలిసిన నర్థ యుక్తములుగావె ? 80

తే. కల్పవృక్ష శోభల సస్యకాండ మలరుఁ గామధేను వైఖరుల గోగణము దనరు
క్ష్మాతలస్వర్గ మవని నోర్గంటిపురము శాంతి సౌఖ్యాకరము తదుపాంతసీమ. 81

తే. భాగవతకర్త యుత్తమభాగవతుఁడు సహజపాండితీ ప్రతిభావిశాలయశుఁడు
బమ్మెయనపోతనాఖ్యతోఁ బ్రభవమందెననఁగ 'బమ్మెర' యననొప్పు జనపదమ్ము. 82

చ. అది యొక పల్లెటూరు కల వందొక కొన్ని గృహాలు పెంకు చా
ళ్ళఁ దలధరించి మోయు బెటులాయని సంస్మృతిభార మెంచి బా
ధఁ దనరు పెన్నుటుంబివలె దాపున మౌనులవోలెఁ బూరియిం
డ్లెద నమితాశ పీడునెడ నీ బరువే తృణతుల్యమౌ ననన్. 83

మ. అలుకుంబూఁతల నొప్పుకుడ్యములపై నందందు నందమ్ముగాఁ
జిలుకల్ పొన్నలు చంద్రవంకలు లతా చిత్రాలు సున్నమ్ముతో
విలిఖింపంబడెఁ, దిన్నె లోడికలతో వెల్గెన్, గుటీవాటివా
కిలులొప్పెన్, నునుబంతి పూసరులఁ బ్రాఁకెన్ గుమ్మడుల్ కొప్పులన్. 84

ఆ. పూరియిండ్లచుట్టుఁ బొదలు మొక్కపెరండ్లు మొక్కపెరటిచుట్టు ముండ్లదడులు
దడులలోనికేఁగు ద్వారాల పలుగాండ్లు గుడిసె గుడిసెవెనుక పిడుకగూండ్లు. 85

సీ. కుంపటివలెనుండు కుక్కుటరాయండు కుటిశిఖాగ్రమునెక్కి కూయు నొకట
పరపఁ బిల్లలకోడి పెరువు కుప్పలఁదోడి పురువుల ముక్కునన్ బొడుచు నొకట
ముంగాళ్ళపై లేచి మునిపంట దడులాఁచి ప్రాఁకుతీఁగల లాగు మేఁక యొకటఁ
గడుపుబ్బఁ బులు మెక్కి కుడితిగోలెము చక్కి పడుకొని నెమరుచుఁ బాడియావు

ఆ. ముల్లెగట్టు వెల్ల 'మొకమా'లన న్మేను ముడిచిపండు లేఁగబుడుత యొకటఁ
బూరిగుడిసెలెక్కి పొయిరాఁజెనని యగ్నిసాక్షిఁబల్కు ధూమసంఘ మొకట 86

సీ. ముత్యాలచెండ్లెత్తి మురిపించు జొన్నచేల్ కర్షకశ్రమబిందు ఘనతఁదెల్పు
బంగారు గొలుసుల బరువుల మెడవంచు వరిలక్ష్మి పాలేఱు వరుస విప్పు
వెండికొండలు చెట్లఁ బండించు ప్రత్తిచేల్ పశుపతిత్వము రైతుపరమొనర్చుఁ
జంకబిడ్డలఁగొంచు సాఁకెడు మొక్కచేల్ ప్రజకాఁపు చంకపాపలని చూపు

తే. మేలిపంట పొలాల నాఁగేలు చాలు శ్రీ మహాలక్ష్మియైన యాసీత నేలు
నేల నవధాన్య రత్నభూషాశిఁదాల్చి పాఁడిపంటల ముల్లె యీ పల్లెయనఁగ. 87

మ. కలఁ డాయూర నియోగి కేసనసమాఖ్యాకుం డశోకుండు పె
ద్దలపై భక్తి సమానమానవులయొద్ద న్మిత్రతాసక్తి చి
న్నలపైఁ బూర్ణదయానురక్తి వెలుఁగొందన్ సంచరించు న్జన
మ్ములు సంప్రీతి నజాతశత్రువని సంబోధింప తా నాతఁడున్. 88

మ. లలితకారుఁ డమాత్యమండల శిరోలంకారు డకూ్రరుఁ డు
జ్జ్వలచారిత్రుఁడు దానమానధన విస్తారుండు నానాకళా
నిలయుండు న్నయకోవిదుండును మృడానీదివ్య పాదాబ్జసం
కలితస్వాంతుఁడు దాంతుఁ డాతత జగత్కల్యాణ కార్యార్థియున్. 89

ఉ. తోఁపదు పావురాయికిని దూఁగని యాఁగని త్యాగరూప మా
రోపిత కర్ణకుండల విలోపము భూతబలిప్రదాన సం
క్షేపము దానవారి నిడి జీవనమెట్లను నాఘనాత్మ సం
తాపము ప్యోపమ మ్మితని దానవిధాన మను జ్ఞనమ్ముమున్. 90

సీ. ధర్మమార్గానువర్తనమునన్ భయమీఁగి బుద్ధివికాసమ్ము వృద్ధిసేయు
సకలార్థ సందోహ సముపార్జనమ్మున గాత్రరక్షణము చక్కంబొనర్చు
నిహరూప కామనా ఫలసిద్ధి ఘటియింప మనమును గౌతుకమ్మునఁ దెమల్చు
మోక్షకాంతా కరాంబుజ పరిగ్రహణాప్తి నాత్మ బంధన దుఃఖహతి యొనర్చు

తే. ధర్మ సంరక్షణార్థ మర్థమ్ము పెరుగ మహిత మోక్షసంగతికిఁ గామములు పెనఁగ
నిజ మనీషాంగ హృదయాత్మ వివాహమునకుఁబుష్టి విడు పురుషార్థ చతుష్టయమున. 91

మ. కలనైనన్ దలవంచి యొడ్లఁ గొలువంగాఁబోఁడు వేయేటికిన్
దలపైఁ గత్తులు పచ్చినన్ సరి యసత్యంబాడ వెన్కాడు న
వ్వులకైనన్ బరనిందఁ గొల్పు పరుషంబుల్ నోట రావీఁ దమా
త్యులలో లేఁడిపు డింతవాఁడను జనోక్తుల్ బాడు నాగేస్తువిన్. 92

చ. ఎడపక కాలమేని కఱవేని ఫలించెడి క్షేత్రపాత్ర మే
పిడికెడొ యన్న మర్థులకుఁ బెట్టి తినందగు భాగ్య యోగ్యతల్
వడయఁగఁజేసె భార్యయును బైఁడికిఁ దావి పొసంగురీతిఁ దో
డ్పడు పడు చెప్పు డేయతిథి వచ్చిన నీశ్వరభావనన్ గనున్. 93

చ. నిరుపమ భర్తృ భక్తిగుణ నిర్జితశైలసుతా భవానినిన్
వర హృదయాంబుజాలయ నివాస పరాజిత శ్రీని సత్య సుం
దరశివవాగ్వినోదపరితర్పిత వాణిని లక్కసానినిన్
బరిణయమాడెఁ గేసన యపార తపఃఫలభాగ్యమో యనన్. 94

చ. సరసగభీరనిర్మల విశాలసుధామధురాంతరంగభా
సురయయి నిర్విరామకృషి శోభితయై మహనీయగోత్ర మం
దిరయయి పాపతాపచయ నిర్వృతిసేయు సుశీలయైన యీ
గరిత పవిత్రవర్తనల గంగ నటుల్ తలదాల్చు నాథుఁడున్. 95

సీ. సావిత్రి సావిత్రి జన్మమెత్తెనొ కలిన్ సత్యవంతుం డౌర : సాధ్వి భర్త
యనసూయ యనసూయ నవతరించెనొ నేఁడు నత్రిగుణాకారుఁ డతివ పతియు
భూజాత భూజాతపుణ్యయయ్యెనొ తిర్గి రామాననుం డహో : రమణి వరుఁడు
సతి సతియై పునర్జన్మమెత్తెనొ యేమొ శంకరాచరణుఁ డీ సకియ మగఁడు

తే. అల సుభద్ర సుభద్రయై యవని దిగెనొ వెలఁది యాత్మేశ్వరుండెందు విజయుఁడనఁగ
లక్కమాంబ కేసనగేహలక్ష్మి యగుచుఁ బూతచరితయై ధరణి విఖ్యాతిఁజెందె. 96

సీ. పరమనోభావమ్ము నెఱుఁగని చేతమట్లితరపూరుషగుణస్తుతిఁ దెలియదు
చేతనాదేశానఁ జెలఁగు దేహమువోలెఁ బతియాజ్ఞ తలఁదాల్చి వరలుచుండు
దేహావరణ మందె తిరుగు ప్రాణముభంగి నిలు దాఁటి పొరుగింటి కేఁగ దెపుడు
ప్రాణిహితార్థమై భ్రమియించు మన మట్లు స్వామి శ్రేయోభిలాషం జరించు

తే. తన మొగము తానె కనలేని కనుగవగతి నెట్టిదో స్వార్థపరతనా నెఱుఁగదౌర :
సన్న పెగ లక్క కరఁగెడి సరణిఁ గరుణఁ బరుల దుఃఖాగ్ని లక్కాంబ కరఁగుఁగాదె.

ఆ. నిండు సరసిలోన నెగడు జీవనముల సఫలతం జెలంగు సస్యసరణి
నామె జీవనమున ననదకూటువయెల్ల వాంఛితార్థములు ఫలించ నలరు. 98

చ. అవనిని స్త్రీలు శీలవతు లైనసె వంశముపేరు కీర్తులన్
జివురిచి తీవబాఱుఁగదె శ్రీమతి లక్కమ తాను నాయశ
మ్ము వడసె నింకనుం బడుచు ముచ్చట పాటులు దీఱనట్టి పూ
పవయసులోననే కడుపు పండెను నిండెను. మోదసంతతుల్. 99

క. తొలిచూలున నాత్మజు నత్యలఘుమతిం గనియె తిప్పనాఖ్యాకుని కో
మలి మలిచూలుందాలిచి వెలయుతఱి న్వచ్చె నొక్క విప్రుం డటకున్, 100

సీ. సన్మతింగల వేదశాస్త్ర విజ్ఞానంబు ఘనశిఖాభ్యున్నతిన్ గ్రాలు ననఁగ
విధి లిఖించిన దుష్టవిధియెల్ల భస్మమై ఫాలభాగమ్మునఁ దేలె ననఁగ
వాఙ్మనోతీతమై వరలు తత్త్వమెడంద విడు బ్రహ్మసూత్రాన ముడి బడెనన
నంతర్బహిర్దీప్తి నలరు శుచిత్వంబు మడుఁగుగా మేన నేర్పడియె ననఁగ

తే. శిరము గోష్పాద పరిమిత శిఖఁజెలంగ నలికతలవిభాసిత భస్మతిలకుఁడగుచు
వెడఁద యురమున యజ్ఞోపవీతమలర సవదరించిన ధౌతవస్త్రమ్ముతోడ. 101

క. గురుమౌఢ్యరహిత గురుఁడో విరూపనయనస్వరూపవిరహితహరుఁడో
పరివర్జితచిహ్న సుధాకరుఁడోనా నరుగుదెంచి గ్రామములోనన్. 102

చ. అకలుషభక్తి శ్రీరఘువరాలయమందు వసించి నేర్పుమై
ప్రకటపురాణరత్నమగు భాగవతార్థ మెఱుంగఁ బల్కుఁదా
సకలజనానుమోదగతి పారతరాగమ శాస్త్రవాది బ్ర
హ్మకుల వరప్రసాది పరమార్థవినోది త్రికాలవేదినాన్. 103

ఆ. వినఁగ నూరుకూరు వెడలె దేవాలయమునకు భక్తి యెడఁద మోసులెత్తఁ
బూర్ణగర్భయగుచుఁ బొలఁతి లక్కాంబయు వేడ్క భాగవతము వినఁగఁజనియె, 104

క. చని శ్రద్ధ గదుర భాగవతనిబోధితభక్తిరససుధామాధురిలోఁ
దనుతాను మఱచి భూసురుఁ గని మ్రొక్కుచు నొక్కమనవి గలదని యనుచున్. 105

ఉ. భాగవతమ్ము నే పరమ భాగవతోత్తముఁ డాంధ్రభాషలో
ధీగరిమన్ రచించెను సుధీనిధి దానిఁ బఠింప మాదృశా
రాగనిబద్ధ బుద్ధితిమిరమ్ము నశించును జ్ఞానభానుకాం
త్యాగమనమ్ము గల్గుననినంతనె సంతసమందె బావఁడున్. 106

ఆ. హవనవాటిలోని యరణిపాత్రిను వలె నలరి పృచ్ఛసేయు నామెఁ గాంచి
బ్రహ్మతేజమొందు భామినిగర్భాన దాఁగియుండినట్లు తలఁచి పలికె. 117

ఆ. ఉవిద ! నీదు పొట్టనుదయించు నీ కోర్కె నిజముసేయువాఁడు నేఁడొ రేపొ
యుదయ మొందకుండనుండునె నిజభక్త వాంఛితములఁదీర్చు వరదుఁ డెందు. 108

వ. అనుట లయ్యువిద తనివినొంది సప్తాహమ్ములు భాగవత మాసాంత మాకర్ణించి.

ఆ. గ్రంథపూజనమ్ము గావించి విప్రుని పాదకంజములకు భక్తి మ్రొక్కి
యామెనరసి 'సుతనయావాప్తిర' స్తని దీవనలనొసంగె ద్విజవరుండు. 110

క. తదనంతర మలనల్లన ముదిత గృహముఁ జేరఁబోయె మూఁడవనాఁడే
యుదయించె నాంధ్రశారద యదృష్టమన నొక్కపాపఁ దల వ్యాసాంశన్. 111

సీ. శుకభరద్వాజ ద్విజకులమ్ము శ్రుతిఁబాడె గోవ్రాతములు సుధల్ గురియసాగె
శారద పూర్ణిమాశశిరూప మలరారె, బ్రాహ్మీముహూర్తమ్ము పరిఢవిల్లె
సుకుమార మలయజ సుఖమారుతము వీచె, సుమనస్సువాసనాప్రమద మెదిగె
భాగవతస్తోత్రపాఠాలు చెవిమ్రోఁగె, గోపాలకుల ముదాలాప మెసఁగె

గీ. తారకారామమై యనంతము వెలింగె, క్షోణి మేల్కాల్పు కవియనఁ జుక్కపొడిచె
ఆంధ్రకవితావధూటీముఖాబ్జమిత్రు, వినుతచారిత్రు లక్కాంబ గనె సుపుత్రు. 112

సీ. ప్రాచీదిశాంగన ప్రసవించె మేరువున్, బంగారుకొండయై పాపఁడొదవె
తరులతాగుల్మాలిఁ గురిసె నీహారమ్ము, కొమరుపై కలినీళ్ళు గురిసెనంత
మొదవుల పొదువులనోర్మముంచె వత్సముల్, తననోట వ్రేలిడికొనె నిసుంగు
మబ్బుల సందున న్మసలియాడె నినుండు, పసిపాప పొత్తిక న్వసతిగొనియె

గీ. పక్షితతి కూజిత మొనర్చెఁ బట్టి యేడ్చె చుక్క జారెను కన్నీటి చుక్కజారె
గమలములు విచ్చె బుడుతఁడు కనులువిచ్చె బాలభానుఁ గాంచెను ప్రజ బాలుఁగాంచె. 113

చ. తవులు తమస్సు వీడి చను తత్త్వనిబోధకతేజ మొప్పు ముం
దవనికి నాస్తికత్వమణగారి సదాస్తికభావ మేర్పడున్
వివిధ కళాంశ తార లగుపించ వినుం డొక డుండు నన్న క్రొం
బవ లుదయించుచుండె నిట బాలుడు పోతన పుట్టువుం గొనెన్. 114

సీ. జనమనోంబుజమిత్రుఁ డన నొప్పు నీ బిడ్డఁడన జాతలగ్నమం దినుఁడు దనరె
నురు పండితానీక గురువర్యుఁడగు నట్టి జీవుఁతండనఁగ ధనుర్గురుఁడు వరలె
బుధజనాంబుధిపూర్ణవిధుఁ డీతఁడగుననన్ బుధచంద్రు లనుకూలవిధి నెసఁగిరి
కవి సార్వభౌమ మూర్ధవతంసమితఁ డనఁ గవి మహోచ్చస్థాన నివసతిగొనె

తే. మందమతిచే శ్రమంబడు మహితుఁడనఁగ మందుఁ డవరోధకస్థానమందు వెల్గ
జ్యోతితోఁ బోరెడి తమిప్రపోతములయి పరఁగె ఛాయాగ్రహమ్ములు పాపదృష్టి. 115

తే. కవి గురువులందు మౌఢ్యమ్ము గలదుగాని యితని మతిలోన లేదది యింతయేని
శశియశమ్మునకైన మచ్చగలదేమొ కాని యీ కళానిధి నద్ది గానఁబోము. 116

క. బాలకుఁ డతుల ప్రతిభాశాలియగున్ వీని నెదురఁ జతురాననుఁడున్
గేలియగున్ ఫణిపతియున్ వేల శిరము లూఁచి మెచ్చు వీని చరిత్రల్. 117

క. అనుచున్ జ్యోతిష్కులు పాపని జాతకరీతి నరసి బహుళాశ్చర్యాం
బునిధిన్ మునుఁగుచు నిసువున్ ఘనముగ దీవింప జాతకర్మము జరిగెన్. 118

గీ. షడ్రసోపేత పక్వాన్నసరణి మెరయ నూరునకు విందు నిడిరి పుత్రోత్సవమున
వచ్చిభుజియించిచనె ప్రజయిచ్చమెయిని హెచ్చి యుప్పొంగి తీసిన యేఱువోలె. 119

ఆ. ఎదుగుచుండెఁ గొమరుఁ డేఁ డొక్కనాఁడుగా విదియనాఁటి విధుని విధముదోఁప
ఘనునిఁబోతనార్యుఁగని పెంచనోఁచిన తల్లిదండ్రు లెంత ధన్యతములొ! 120

సీ. మత్స్యావతార సన్మహిమంబుఁ జింతించుననఁ దొట్టియం జేఁప యటు నటించుఁ
గూర్మావతారంపు గుట్టు నాలోచించుననఁ గూర్మమట్లు పాఁకాడుచుండు
వరవరాహావతారరహస్య మరయునాఁ గిటి యట్లు మట్టితోఁగ్రీడసేయు
నరసింహతత్త్వమ్ము నెఱిఁగె నీతండనన్ బ్రహ్లాదరక్షణపరత నుండు

తే. వామనావతారాంచిత వైభవంబుఁ జదువునన వామన బ్రహ్మచారి యయ్యె
రామ తత్త్వసంశోధియై వ్రాయు ముందు భాగవత మన శ్రీరామభజనసేయు. 121

తే. ఆమె పూర్వపుణ్యము మంచిదగుటవలనఁ గలిగి రిరువురు సుతులు జగద్విదితులు
తిప్పనార్యునివంటి యాస్తిక చరితుఁడు పోతనార్యునివంటి విఖ్యాతయశుఁడు. 122

చ. రగరగ మంచు మేల్మి నవరత్నకళల్ దొనఁకాడు శుక్తిగ
ర్భగృహమునందె స్వాతి వినిపాతితవాఃకణపంక్తి మౌక్తికా
ప్తిఁ గనును నత్తగుల్లఁ బ్రభవించును గొమ్ములపుర్వు లెందు మా
త గుణగణాఢ్య యైననె సుతప్రకరమ్ము సుశీలతన్ గనున్. 123

క. తిప్పన సౌభ్రాత్రమ్మన నప్పురిఁ గల చిన్నపెద్ద లందఱికిఁ గడున్
మెప్పునుజానకన్న యనన్ గొప్పగుఁ దమ్ముఁ డన నన్నకున్ బ్రాణంబౌ. 124

సీ. తన కెవ్వ రేదేవి తినుబండ మిడిరేని యనుజుని కిడక తిప్పన తినండు
అనుజన్మ నెవ్వ రేమనిన తానడ్డమ్మువచ్చు మై నీఁగను వ్రాలనీఁడు
గడియసేపింటఁ దమ్ముఁడు గానరాకున్న వెదకుఁ గన్పడుదాఁక వెతనుజెందుఁ
తన ప్రాణమున కెంతయును గూర్చు వస్తువే నవరజుం డడిగినయంత నొసఁగు

తే. భోజన మొనర్చు తఱి నిద్రవోవు వేళలందును యవీయసుఁడు తనయండ నుండ
వలెను దగవులాటనవేమొ తెలయ రనఘగుణులు సోదరుల్ రామలక్ష్మణులు మణులు.

క. తిప్పన చదివెడు పద్యముఁ జప్పున నొకసారి వినిన సరి పోతన తా
విప్పుడు పొత్తము నొప్పంజెప్పును సద్దాని నేమి సెప్పుట తెలివిన్. 126

ఆ. దూఁకు లెగురు లందుఁ దొండు మెండుగఁబడి సరకుఁ గొనఁడు లేచి యురుకు నపుడె
యరరె ! భూమివ్రక్కలయ్యె నం చ్రా యుక్కువాలు పాటుగాంచి ప్రక్కవారు. 127

ఉ. ఆటలమేటి విద్దియలయందున వానికి వాఁడె సాటి కొ
ట్లాటను బాలు రంద ఱొకఁడైన నెదిర్చెడి ధాటి, తీయఁగాఁ
బాటలు పాడుటందుఁ బికవాణికి వానికిఁ బోటి యెందు మో
మోటముఁ గొంకుజంకులను బొత్తుగ వీడి చరించు నాతఁడున్. 128

చ. గురినిడి కొట్టెనేని యొక గోలియుఁ దప్పదు, కచ్చగట్టి బొం
గరమును వేయ వ్రేటు కొక కాయ పటుక్కను బందెమూని తా
నుఱికిన లేడిపిల్లవలె నొక్కని యయ్యకుఁ జిక్క డద్దిరా!
చిఱుతఁ డసాధ్యుఁడంచు నెదఁ జే యిడి విస్మయమంద నందఱున్. 129

ఆ. కోఁతివోలెఁ జెట్ల కొనఁగొమ్మ లెగఁబ్రాకుఁ బక్షివోలెఁ గ్రిందఁబడగఁ దూఁకుఁ
గాలు భూమిపైన గడియైన నాఁగదు పాదరసము గలదొ పాదయుగళి! 130

క. గుడికిఁ జను జననిఁ గని వెంబడిఁబడి చను జదువుకొనెడి బడి విడియైనన్
బడి పడి జేజే లిడు నయ్యెడ నెడమయుఁ గుడియు ననక నెంతయుభక్తిన్. 131

తే. సాధుసజ్జన దర్శనోత్సాహగతియు హరికథాపురాణ శ్రవణాభిరతియు
శంభుపదసరోజార్చనాసక్తమతియుఁ బెరుగసాగె వేఱొకప్రక్క బిడ్డయెడఁద. 132

ఉ. అంతటిలోన నొక్కతఱి నంతికమందు వెలుంగునట్టి గ్రా
మాంతరమైన పాల్కురికియం దొక జాతర శైవవైభవో
దంతముఁ జాటుచున్ దనరె దాని గనుంగొనఁ బోతరాజు తా
నెంతయు సంతస మ్మొలుక నేఁగెను దల్లియుఁ దండ్రి వెంటరాన్. 133

ఉ. భూమియె యీనెనో యిసుకవోసిన రాల దుసిళ్ళపుట్టలై
చీమలబారులై జనము చేరఁగసాగిరి, యంటుముట్టులన్
నేమము వీడి యాడ మగ నిర్ణయమున్ విడనాడి త్రోపులన్
స్వామినిఁజేరి దర్శనము సల్పుచు వెన్కలవారి నిల్పుచున్. 134

క. పులుఁగులు ఫలతరుశాఖలఁ గలహించెడి ననఁగ జనుల కలకలములు తా
మలలం ఘూర్ణిలి కోలాహలమొనరుచు నొక మహార్ణవాకృతిదాల్చెన్. 135

క. రంగుల గుడారములలో నంగడి వీథుల నమర్చి రా యా సరకుల్
సింగారమొప్ప సక్రమభంగిన్ యాత్రికులు దృష్టిబడి చనుదేరన్. 136

సీ. ముస్తై కచోరాలు బుక్కగుండ గులాలు తిరుకుంకుమమ్ము దాసరిబెహారి
గాజులు మెట్టియల్ కళుకైన పిల్లాండ్లు బసమపుండలు నిచ్చు బలిజెగౌర
పవరమీర్పెనలు ప్రసాధనుల్ సూదులు పూసలద్దము లమ్ము పూసబేరి
లక్కబొమ్మలు బొంగరములు కోలలు చిట్లు వడెలమ్ము రంగారివర్తకుండు

తే. చెఱకులున్ మొక్క కండెలు సెనగబేడ బొరుగులున్ కజ్జపుండలు పొంగరాలు
బత్తిసాలు చిల్కలు లడ్లు పలుమిఠాయి లమ్ము తినుబండముల దుకాణమ్ములొకట. 137

సీ. బొరలై వ్రేలాడఁబడు పల్ల జడగుంపు భవబంధ మిటువలె భారమనఁగ
నిలువెల్లఁ జాఁదిన వెలిబూదిరేకలు నీ దేహమెల్ల విబూది యనఁగ
రగరగన్మెఱయు తామ్రిపునగల్ మేలిమి భూషాళిరాగవిదూషితమనఁ
గలితత్రిశూల సంగత ఘంటికాధ్వనుల్ చిదచిదీశసమైక్య శివమిదియనఁ.

తే. జడలతో బూది బొట్లతో స్వకరమంటు ముమ్మొనలవాలుతో రాగిసొమ్ముతోడఁ
గక్ష్యవ్రేలెడి జోలెతోఁ గరములెత్తి దిశల శివసత్తులై తూలు బసివిరాండ్రు. 138

తే. సింగినాదాలు శంకులఁ జేయురొదల బూరటిల నింగి 'శరభ శంభో శివ !' యని
యఱచి పండు నిప్పుకలతోఁ బఱచినట్టి యగ్గిగుండాల నుఱికెడి యయ్యలొకట. 139

సీ. గొంగళి ముసుఁగిడి గోవులంగాయగాఁ దరలురా జాంబవంతా యటంచు
మును సూత్రిధారి యా ముకుఁదాడు లాగుచుఁ గజ్జనెత్తుటయు ముంగాళ్ళలేచి
గడ భుజమ్మునఁ బూని మెడ ఘంటికలు మ్రోఁగ బొల్లిమోరలనాడు భల్లుకములు
మొగము ముక్కును దాల్చి జగతికి దిగివచ్చి గర్జించుమేఘంపు కరణి నుఱుమఁ

తే. బులిమొగపు లక్కబుఱ్ఱను దలఁదగిల్చి యాడుచున్ మ్రొక్కివేడుచు సమ్మవారి
పసుపు బంగారుఁగొనుఁడొక్కపైస యనుచు యాత్రికుల కడ్డమేఁగుఁ బెద్దమలవాఁడు.

తే. నమలిపురి యీఁక వ్రేవలి న్నాట్యమాడ నిఱుకు గుబ్బల పూసల సరు లెగయఁగఁ
బడుచు పౌరుట్టిపడు మేనఁ బచ్చబొట్లుఁ జెలఁగ హల్లీసకమ్మాడుఁ జెంచెతలును. 141

సీ. చిందమ్ము లుష్ణీషబృందాకృతులఁ బూన మొగిలుపై కంబళుల్ పగలు బేన
మఱములన్ డమరుక మ్మిరుజెంప వాయింపఁ జిఱుగజ్జె లీలలం బరిహసింపఁ
గర్ణమూలమ్ములన్ గయినుంచి ఱ్రితి నించి మల్లన్నకథ బాడు గొల్లమూఁక
ప్రిభల ముఱ ఖడ్గాలు బల్కుచు జేగంట మ్రోగించి చను వీరముష్టిగణము

తే. కదలనీక యడ్డమ్ముగా గంటఁబట్టి కలపకోలను గంట యంచులకుఁ ద్రిప్పి
యందుఁ గట్టిన గవ్వ నాట్యమ్మొనర్చి వాదు సేయఁ దత్త్వముఁ బాడు బూదిగురుఁడు. 142

తే. దేవదాసీజనమ్ములు సేవముందు సరసతౌర్యత్రికక్రియల్ నెఱపుచుండ
బసవనకిలాతమున్ నాగుపడగగొడుగు నెసఁగ దివ్వటీల్వెలుఁగ మారేఁగె భవుఁడు. 143

క. సేవించి యీశ్వరార్చన గావించి గురువు సమాధిఁగనుగొని భక్తిన్
దేవాలయ ప్రదక్షిణ మావహిలన్ జుట్టి వచ్చె నలఁ గేసనయున్. 144

క. ముద మెదుగఁ గొమరుఁ గని నీ కెదికావలెననుచుఁ గొనుచు నిడిఁ జిఱుదిండ్లన్
సుదతిఁగని పోదమిఁక నన దధిగిణతోమ్మని మృదంగతాళము లొలసెన్. 145

చ. చెవులకు విందు లీ ధ్వనివిశేషము లేమని పృచ్ఛసేసె మా
ణవకుఁడు వీథిభాగవత నాటకవాటిక మ్రోఁగు మర్దళో
ద్భవ మధురస్వనమ్ములని పల్కె గురుం డటనుండి వాని ని
ల్లెవరు నదింపఁ జేయుదు రదెందులకంచు వచించెఁ బాలుఁడున్. 146

ఉ. భూషలుదాల్చి రంగులను బూసి మొగమ్మున రాజు మంత్రినా
వేషము లొప్పఁ గైదివియ వెల్గులలోఁ బ్రతిసీరముందు సం
భాషణ లాటపాటలును భాసిల భాగవతోక్త సత్కథా
పోషణముం బొనర్తు రెద పొంగ వినోద మెసంగఁగా నటుల్. 147

చ. అని వచియించెఁ గేసనయు నాత్మఁ గుతూహలతాలతావితా
ననికర మంబర మ్మలమి నవ్వులపువ్వులనీనఁ బోతరా
జును దనయయ్యతోనటుల చొప్పును జూడఁగ వేడె నాతఁ డం
తనె సుతుఁ గొంచు వీధి సవిధస్థితుఁ డయ్యె సతీసమేతుఁడై. 148

ఉ. ఇవ్విధి దివ్వటీ ల్వెలుఁగు నేమని బాలుఁడు పృచ్ఛసేయఁగా
నవ్వుచు లక్కమాంబ నిజ నందనుఁ గన్గొని చంద్రసూర్యు లా
దవ్వుల వెల్గనేల యనె, దాపున నాతెర యేల యన్నచో
నివ్వటిలుం బయి న్మసక నీలపునింగి యదేలరా ? యనెన్. 149

చ. వెలుఁగుల నీను ప్రొద్దుటను వేసము లాడవదేల యన్నచోఁ
దళతళలాడు తారకలు తాము పవ ల్గన రావదేల యం
చలఁ దెలవాఱు నంతఁ దుదియై చను నాటకమేల యన్న రే
ల్కలఁ గనుఁబెల్ల మేలుకొనఁగాఁ గనరాదది యేలరా ? యనెన్. 150

ఉ. వచ్చుచుఁ బోవుచుండె నటవర్గములోని కదేల యన్నచోఁ
జచ్చుచుఁ బుట్టుచుండె జన సంఘము భూస్థలి నేల యంచు వా
రెచ్చట కేఁగుచుండిరన నెవ్వడు వారికి వేసమిచ్చుచున్
బుచ్చునొ యట్టి సూత్రధరు పొంతకుఁ బోదు రటంచుఁ బల్కెనన్. 151

ఉ. ఏఁగిన వీరిఁగాంచి యతఁ డేమని పల్కునెటన్న వారి వే
షాగతులం బొనర్చి యెటు లాడుఁడు పాడుఁ డటంచుఁ దెల్పెనో

యాగతి యాడిపాడిన నహో ! యని వారల మెచ్చు నిచ్చు మే
ల్భోగము లట్లు జేయమిని పొందని దండనఁజేయు వాఁడనన్. 152

క. రంగమున నృహరి యుద్భట భంగిన్ బ్రత్యక్షమయ్యె బాలకు లదరన్,
సంగడి నిదురలు జెదుర మృదంగస్వన సింహగర్జ నార్భటి గదురన్. 153

క. రావ మిది యేమి యనఁగా నావనితయు సుతునిగాంచి యసుర నడంపన్
సేవకుఁడగు ప్రహ్లాదున్ గావఁగ దేవుఁడు జనించెఁ గంబమున ననెన్. 154

ఆ. దేవళమ్ము నందు దీపించు లింగము దేవుఁ డంటి విప్పు డీ విధముగ
సింహముఖముఁ దాల్చి శ్రీహరి ప్రహ్లాదుఁ గావ దేవుఁ డయ్యెఁ గాంచు మనెదె. 155

ఆ. అనుచు సుతుఁడు వల్క విని తల్లి హరిహరు లేకరూపు లనియె నెట్టులనిన
సిగఁ జెలంగు కుప్పె సింహాస్య వలయమ్ము రూఢి నొక్క పసిఁడి రూపు లగుట. 156

ఉ. ధీనిధివై నత మ్మఖిల దేవత లొక్కటి యంచు నెంచుచున్
మానసమం దుమారమణు మాటికి మాటికి సంస్మరింపనౌఁ
దా ననలమ్ము వృక్షసముదాయ విభేదము లూడ్చుకై వడిన్
జ్ఞానము రూపభేదము లొకం డొనరించు నసంశయాకృతిన్. 157

చ. అన నతిభక్తి నంబ వచనామృతసారము నాస్వదించి యే
మనియెద రిట్టి యాట నని యర్భకుఁ డాడెను బృచ్ఛసేయు నం
దను గని యిద్ది భాగవత నామముతో నుతికెక్కునంచుఁ దా
జనని వచించె దాని విని సంతసమందుచు బాలుఁ డాదటన్. 158

ఉ. భాగవతాఖ్య దీని నిటు బల్కెదు రేలనె; నీ కథాసుధల్
భాగవతమ్మనం దనరి ప్రస్తుతి కెక్కిన పుస్తకమ్మె
పాగుటచేననెన్ జనని; చక్కని పొత్తమునేఁ బఠించెదన్
వేగమొసంగు నాకనుచు వేడెఁ గుమారుఁడు మాతృదేవతన్. 159

తే. అదియొ గీర్వాణవాణిలో నలరు నీకుఁ దెలుఁగుపలుకుల వెలసినఁ దెలియుననియె;
తెనుఁగునన్వ్రాసి యిమ్మనెఁదనయుఁ; డంబ వ్రాయరాదనె; సుతుఁడు నే వ్రాతుననియె.

ఉ. అంత ననంతవత్సలత నాత్మజునింగని కౌఁగిలించి నీ
కెంతటి బుద్ధిరా బుడత ! యేండ్లు మదాయువుఁబోసికొంచు జీ
వింతువుగాకయంచుఁ గయి వేళ్ళల బాలుని మీఁదు ద్రిప్పియా
యింతి కణంత లద్దుకొనియెన్ నెటికల్ ఘటియింపఁ బ్రేమిడిన్. 161

తే. భాగవతమును దెస్సలో వ్రాయునంట చెవి నిడెదరొక్క కొమరుని చిల్కపల్కు
లీడునకుమించి మాటల నాడునమచుఁ బల్కెనప్పురంధ్రిమణి పతినిగాంచి. 162

చ. అది విని కేసరాజు ముదితాశ్రుకణావిలలోచనాంబుజా
స్పదుఁడయి పత్నిఁగాంచి యిటు వల్కెను గల్కిరో ! వీనిఁజూచి నేఁ
డుదయమె యోగియొక్కఁ డితఁ డుర్వి మహాకవిసార్వభౌముఁడై
విదిత విశాల విశ్వపరివేష్టిత నిత్యయశస్వియౌ ననెన్. 163

ఆ. అదియు నిదియు నొకటియగుట మానసమెల్లఁ బులకరించె ననుచుఁ బొలఁతిఁగూడి
తనయు భావిజీవిత ప్రపంచమ్మును సూక్ష్మదేహుఁ డగుచుఁ జూట్టివచ్చె. 164

ఉ. అమ్మహితుండు కేసన నిజాత్మజునింగొని ధర్మపత్ని ల
క్కమ్మయు వెంటరాఁ బురహరాలయ గోపుర దీపితశ్రికా
లమ్మునుగాంచి మ్రొక్కి పదిలమ్ముగ గట్టును డిగ్గి బండిపై
బమ్మెరకేఁగసాగె నడిబాట రహించెడి మావితోఁటలో. 165

వ. అలరు రసాలసాలమ్ముల నరసి కేసనకావ్య కళలొల్కు కొమరునిలోని కవితాత్మ బయ
ల్పడు నటు లిట్లభివర్ణింపఁ దొడంగె. 166

క. తలలో శలాటువులొ యాకులొ యీఁకలొ ముక్కులో చిగురురిక్కలొ కొ
మ్మల చిలుకల చెలువమ్ములొ లళితరసాలఫలపత్రి లావణ్యములో. 167

ఉ. రంభలు రామచిల్కలయి రక్తిని నాట్యము లాడుచుండ నీ
కుంభిని దేవగాయకులు కోకిలలై జతబాడఁ గిన్నరుల్
బంభరరూపులై కలవిపంచికి కిన్నెర మీటఁగా నొకే
స్తంభపుమేడ గాన పరిషత్తురచించి రయారె ! ఖేచరుల్. 168

సీ. పసిఁడిముద్దకు భోజ్యభాగ్యమ్ము గలిగింప రసము లూరించిన రసికుఁ డెవఁడొ
గరుడపచ్చల కొమ్మకై మెచ్చి విరుల వీవనలిచ్చి విసరించు ప్రభు వెవండొ
వరపరీవాళములఁ గప్రము తమ్మలమొనర్చి పికభామినికొసంగు ప్రియుఁ డెవండొ
ముత్తెంబులం బూలగుత్తులుగాఁ గూర్చి ధర సేసజల్లు భూధవుఁ డెవండొ

తే. ఫలము సరసతగని పయింబడు శుకమ్ము పువ్వునవ్వుకు భ్రమియించి పోవుఁ దేఁటి;
పల్లవపురాగమును రక్తిఁ బాడుఁ బికము; యీ రసాలముం బ్రేమ నెవ్వారు గనరు? 169

సీ. అధరారుణ ప్రభాస్పదపల్లవమ్ముల నివపు మంటల యగ్గి రవులఁజేసి
లోలనేత్రాభ వినీల పత్రమ్ముల మెత్తని కత్తుల మేలగించి
దరహాస సదృశ సుందర సూనవల్లరిన్ బావుటమ్ముల పొదుల్ పొందుపఱచి
గాఢోపగూహనాకార శాఖాకాంతిఁ గొమ్మవ్యూహమ్ములఁ గూర్చి కట్టి

తే. యతను వీరశృంగార రసాలవాల భాసురవసంత లక్ష్మీవిలాస వేళ
ముత్తెముల మొల్క నలికి వియత్తలమునఁ బైఁడి పండించెను రసాలబాల లీల. 170

సీ. సవితృకరాళికి సందానంగనిరీతి ధరణిఁగట్టిన కోటబురుజు లనఁగ
మదనబలమ్ములౌ మాధవాదుల పోర రహియించు ఘంటల రథము లనఁగ
జానకీభక్తులౌ వానరాళికి వసుంధర నిల్పు నిలయగోపురము లనఁగఁ
బదములేపి యొకింత కదలఁజాలని మోఁత బొట్టెకెత్తిన పండ్లబుట్ట లనఁగ

తే. నాదిఁగఠినదారువు లయి యంతనంతఁ గొమ్మలై నునురెమ్మలై కోమలమగు
పత్రిపల్లవసుమములై ఫలతతులయి మధురరసములై కరఁగు నీ మావితరులు. 171

క. పచ్చల నడుమం గెంపులు ముచ్చటగాఁ బొదిగి మంచి ముత్తెపుసరులన్
పొచ్చెమగు పైఁడిగుండ్లవి కుచ్చులు వ్రేల్మావిగొడుగుఁ గూర్చిన దెవరో. 172

తే. ఛత్రిపతు లెందఱో యిందు సభనుదీర్చి రేలకో పంక్తులుగఁ బర్ణశాల లమరుఁ
బచ్చపచ్చని యీ పల్లెపట్టు నెవ్వఁ డిచట రచియించెనో తరునిచయములుఁగ. 173

వ. అనుచు నానర్చు వర్ణనమున కత్యంత మలరి పోతన కవులివ్విధి వర్ణింతు రేమని ఫల
తరుల నరసి. 174

క. రెక్కల మాటిడి పక్షులు చక్కఁగఁ బొదిగిన నిజాండచయ మనఁ గొమలన్
బెక్కులుగ వ్రేల్ఫలముల నియకొక్కమరుఁడు గాంచి యుఱికె నామ్రవణమునన్. 175

క. ఉఱికెడు సుతుఁగని కేసన చిఱుతని కవితాత్మభావ చింతనములకున్
ముఱియు చుఁబువు పుట్టఁగనే పరిమళములఁ జిల్కుననుచుఁ బల్కెను సతితోన్. 176

ఆ. పైకిఁగాంచె వటువు పత్రిమ్ము లందుండి శుకము ఫలమురాల్చె శుకుఁ డొసంగు
భాగవతరసాల ఫలరసంబోయన బాలుపదములందుఁ బడియె నదియు. 177

క. ఆపక్వఫలము దినుచు ముదాపూరిత లోల లోచనాంబుజములతో
నాపాప బండి నెక్కెను గోపాలుఁడు వెన్నముద్ద గొనివచ్చె నన్. 178

ఉ. ఈకరణిన్ శుకాదు లవి యేల భుజించెడి నీ ఫలమ్ము నా
నాకలిబాధ తీర్చికొన నంచు వచించెను దండ్రి ప్రేమమై
సాఁకఁగ భోజనం బిడఁగఁ జన్గుడుపన్ జనయిత్రి లేదె యీ
మూఁకల కంచుఁ బల్కె తన ముద్దులపట్టి కతండు నిట్లనెన్. 179

తే. ప్రకృతి మనకెల్లరకు మాత, పరమపురుషుఁ
డగు మహేశ్వరుఁడే పిత యనుచుఁ దెలియు
మవిన జననిఁ జూపించి మాయంబ యీమె
యగును బ్రకృతి గాదనె సుతుఁడంత నయ్య. 180

క. కొమ్మకుఁ గొమ్మకు నూర్ల ఫలమ్ములు గనవచ్చు మొదలు లక్షింప సమ
స్త మ్మొక మానువెకద భూతమ్ములు నొక ప్రకృతిసుతులె తామన సతడున్. 181

ఆ. పాల నిచ్చి నాకుఁ బలువన్నెముల యాట బొమ్మ లిచ్చి రుచ్యభోజన మిడి
పేర్మిఁ గాంచి నన్ను పెద్దవానిగఁజేయు మాతవోలె ప్రకృతి మనుప దనిన. 182

సీ. రవిసోము లనెడి నేత్రములొప్పు మన నెప్డు డాకకంటఁ గాంచుచు నుండు నామె
మబ్బుభాండము లెత్తి మధురోదకము వోయుఁ బర్వతోన్నత పీఠపంక్తి వేయు
బహుధాన్యముల తీపి పాలబువ్వ నొసంగు పండ్లజాతుల చిఱుదిండ్ల నిడును
దావులన్ వెదఁజల్లు పూవుగిన్నెలు నింపి కమ్మతేనియ పానకమ్ము లిడును.

తే. మహి యనెడి స్వీయవక్షోజమండలమున నూరు జీవనమ్ములఁ బాలు ధారవోసి
యడిగినవియెల్ల నొసఁగి యీయఖిలభూతసంతతిని రొమ్మునకుఁగట్టి సాకుఁ బ్రకృతి.

సీ. ఆనంద డోలిక నాడింప సింగిణుల్ రంగారు మబ్బుల నింగిఁ గూర్చు
లలి సైకతమ్ముల తలిమమ్ములన్ వైచుఁ బచ్చిక రత్నకంబళము బఱచుఁ
దారాన్విత నభోవితానమ్ము నమరించుఁ దరుశాఖఁ దాళవృంతముల వీచుఁ
జలువ వెన్నెలకొంగు చాటున జోకొట్టు నీలిముసుంగులో నిదురఁబుచ్చు

తే. నుభయసంధ్యల రాగము లుప్పతిల్ల మందమలయానిల స్వరమండలిఁ గొని
హాయియని ప్రాణిసంతతి కనవరతముఁ జోలబాడును లెండని మేలుకొల్పు. 184

క. బిడలగు ప్రాణుల బ్రదుకులు గడచుట లెట్లనుచుఁ బ్రకృతి కలకాలమునున్
వడఁకున్ మది నుడుకున్ వెతఁ దడుపున్ బాష్పాంబుధార ధారుణి నెల్లన్. 185

తే. ప్రకృతిపురుషుల దివ్యదాంపత్యమందు నిమ్మనుజసౌధరాజముల్ బొమ్మరిండ్లు
భూతగణవృత్త మొకకమ్మ బొమ్మలాట ధరఁ బ్రజల చావుపుట్టుకల్ దాఁగురింత. 186

ఉ. దాఁగురుమూఁతయాట లని తాము వచించిన యంత మీసుతుం
డో గురువృద్ధు లార్యులు నిటుల్ పసిపిల్లలవోలె నాడు చే
లాగని కాంచుచుండె నను లక్ష్మమ నారసి కేసనార్యుఁడున్
ధీగరిమమ్ము మీఱ నరుదెంచిన శంకలుదీఱ నిట్లనున్. 187

శా. ఖేలామంటప మీజగమ్ము జనముల్ క్రీడావినోదార్థమై
గాలిం దేలు వినీల నీరదములై కాలాబ్ధి నోలాడు క
ల్లోలవ్రాతములై నటించును మరు ల్లోపమ్ముతో నాఱు దీ
పాలై మాటుమడంగిపోవు జగదంబాపాణి కమ్మాయటన్. 188

ఉ. సాగు జగంపువీధి నొరుఁ జంపి తనన్ బ్రతికింపఁ జేసికోన్
దాఁగుడుమూఁతలాడను దినమ్ము జనమ్ము ధనమ్ము నమ్ముచున్
మూఁగు నిశాకరాళకరముల్ కనుమూయ ప్రభాతసుందరీ
స్వాగతరాగముల్ నయన సారసముల్ వికసింపఁజేయఁగన్. 189

ఉ. ఎచ్చటినుండి వచ్చెదరొ యెచ్చటి కేఁగెదరో యగమ్య మా
వచ్చినవారిలో దొర లెవారలొ దొంగ లెవారొ దేనినిన్
మ్రుచ్చిలినారొ వారిఁ గనుమూసి నటింపఁగఁజేయు టేలనో
యచ్చట నున్న తల్లి జగదంబ యెఱుంగును వీని మర్మముల్. 190

చ. తమమును జేరు చోరుఁ గని తద్దయు సత్వసముద్ధతిన్ పదో
ద్గమిత రజమ్ము నంటక ప్రధావితులై చనుదెంచి ముక్తసం
గమునఁ జరించి మాతృపద కంజములన్ స్పృశియించి ముక్తులౌ
సుమహితసిద్ధు లెందరొకొ చోరవశంగత బద్ధు లెందఱో! 191

శా. క్రీడారంభమునం దొకం డొకఁడు స్వక్రీడాంతమం దొక్కఁ డా
క్రీడామధ్యములోనె కాలనిహతిన్ గ్రీడాభువిన్ వీడు నె
వ్వాఁ డెవ్వానికిఁ దోడురాఁడు విడిపింపన్ లేఁడు తానై తనన్
పీడాముక్తు నొనర్చు కొంటకయి కావించున్ బ్రయత్నమ్ములన్. 192

ఉ. త్రిప్పెడు సూత్రధారి గుఱుతింపక యాడును దోలుబొమ్మ తాఁ
జప్పుడు సేయు వైణికుని జాడ నెఱుంగక పాడు వీణ, యి
ట్లెప్పటిదాఁక నొప్పు నివి యేరి నడుంగుట లాటపాటలున్
జప్పున నాగునో మరియు సాగునొ తా మవి తెల్యనేర్చునే. 193

చ. అని వచియించు తండ్రి వచనామృతసారము నేమొ గుర్తెఱిం
గిన పెనుప్రోడవోలెఁ బరికించెడి నందనుఁ గాంచి మోము ము
ద్దునుగొని యేమి యర్థ మెదఁదోఁచెనొ తెల్పు మఁటన్న మాతృమూ
ర్తినిఁ గని బాలకుండు వివరించె సుధామధురోక్తి నీగతిన్. 194

ఉ. దొంగతన మ్మొనర్చుటలు దోస మటంచు వచింతు రార్యు లా
దొంగలఁ గూడువాఁ డతఁడు దొడ్డదొరైనను సాటివారిలో
భంగపడున్ గదే! నిరతభక్తిని మాతృపదమ్ము నంటి స
త్సంగతి నున్న బాలకుఁడు చావు దొలంగి చెలంగు ముక్తుఁడై. 195

ఆ. అనిన జనని నగుచు నౌనౌను చౌర్యంబు చిన్నదయ్యుఁ గలఁచు మున్ను వెన్న
దొంగ కృష్ణుఁ డెంతొ దొరబిడ్డఁడైయుండి కట్టుబడియె మాతృకరములందు. 196

ఆ. అనుటఁ గృష్ణుఁ డెవ్వఁ డాతండు తానేల వెన్న దొంగిలించెఁ జిన్ననాఁడు
కట్టుబడియె జనని కరములం దెటులను సుతునిఁ గాంచి పలికె సుదతి యిటుల. 197

మ. మనగ్రామమ్మను జేరినార మదె యస్మద్గేహ మీ సత్కథన్
వినఁగాఁగోరెదవేని దాని నెపుడో విశ్రాంతిగా నున్నవే

శ నిదానమ్ముగఁ జెప్పనొప్పు నిటు లేలా తొందరం జెంద నీ
వును నా గర్భమునందు నుండి సకలంబు న్వింటి వా గాథలన్. 198

ఉ. గర్భమునందు నున్న శిశుకాయ మెటుల్ వినునందువేని యో
యర్భక! మున్ సురారిసుతుఁ డట్టులె పొట్ట వసించి యింక నా
విర్భవ మందకుండఁగనె వేలుపు మౌని వచింపఁగా మహా
నిర్భరుఁడై వినెన్ మహి జనించియు శ్రీహరిభక్తుఁడై మనెన్. 199

ఉ. నేఁ గొను నన్నపానములు నీకును నన్నముగావె యూపిరిన్
నేఁ గొనునట్టి శ్వాసములు నీకును బ్రాణముగావె మందులన్
నేఁ గొనునట్టి యౌషధము నీకును రోగహరంబుగాదె మా
శ్రీగురుసూక్తి పొట్ట నివసించెడి నీకును జెందదే యనన్. 200

క. లీలావతిగర్భంబున బాలుఁడు ప్రహ్లాదుఁ డుండి భగవత్కథ ముం
దేలీల వినియె సురమునిపాలుండు వచింపఁ బరమభక్తాగ్రణియై. 201

క. అను సుతునితోడ శకటమ్మును దిగి జనయిత్రి పదనమునకున్ జనియెన్
దనయుఁడు బోతనయును నది వినవలెనని యెంచి యెంతో వేడుక నుండెన్. 202

## ఆశ్వాసాంతము

క. నీరదనీలశరీరా! స్మేరానన సితమయూఖ చిత్రిత విద్యు
ద్ధారా హీర మసారాకారా! విశిఖైక తాటకా సంహారా! 203

ఉ. ఖండితదుష్టదానవనికాయసముద్ధతవేగ! దివ్యదా
ఖండలకల్పభోగ! వరకర్ణచలన్మణికుండలప్రభా
మండితగండభాగ! స్మితమంజులపుల్లముఖాబ్జశోభితా
ఖండదయానురాగ! త్రిజగన్నుతపాదపరాగ! రాఘవా! 204

### మాలినీవృత్తము

మనసిజసుకుమారా! మారభిచ్చిత్తచోరా!
వననిధిసుగభీరా! వార్ధిగర్వాపహారా!
కనకపటవిదారా! కర్బురాలోకచీరా!
జనిమరణనివారా! శస్త్రరామావతారా!

### గద్యము

శ్రీమద్భరద్వాజగోత్ర పవిత్రాపస్తంబసూత్ర, ప్రథిత సూరిజనమిత్ర, బక్కయ్యశాస్త్రిపుత్ర
వాగీశ్వరీ సమాసాదిత, వైదేహీవర నివేదిత సరసకవితావిలాస, సహజ
పాండిత్యభాస, వరకవివిధేయ, వరదార్య నామధేయ ప్రణీతంబైన పోతన చరిత్రమను మహాప్రబంధమ్మునందు ప్రథమాశ్వాసము.

శ్రీ ర స్తు.

శ్రీ వాగీశ్వర్యై నమః




## తారకోపదేశము — కల్యాణము

"ఉపదేక్ష్యంతితే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వ దర్శినః"


శ్రీ సీతాహృదయాంబుజ
భాసుర మధుపాయమాన భావజరూపా!
కోసలనృప ముఖకువలయ
హాసశరచ్చంద్ర! దనుజహస్తి మృగేంద్రా! 1

తే. తారకానుసంధానకథావివరము, అఖిల మానవలోక కల్యాణకరము,
చిత్తగింపవె యీ యితివృత్త మవల రమ్యగుణభద్ర! శ్రీరఘురామభద్ర! 2

ఉ. అక్కమలాప్త రశ్మిపొడయైనను జూపకపోయె నప్పుడే
చుక్కలు వెన్నపూసలయి చూచుచునుండఁగ మాయమై చనెన్
గొక్కరకోయటంచుఁ దొలికుక్కుట కంఠము లెత్తి పిల్చి న
ల్దిక్కుల నూఁపిలేపెను జలించిన చల్లని పిల్లతెమ్మెరల్. 3

ఆ. కనులుగట్టి యెవఁడొ కపటనాటకమాడి తెరమఱుంగుజేసె ధరణి ననుచుఁ
గాల్చివేయ నినుఁడు కటికచీఁకటి తెరలన జనించెఁ దూర్పునం దరుణిమ. 4

ఉ. దీపముఁ గాంచి కాటుకలు దిద్దినకన్నుల బాలయోగి తా
నో పురిటింటఁ దల్లికడ నూహలకందని భావగీత మా

లాపన సేయుచుండెను విలాసవిహాసవికాస మొప్ప బ్రా
హ్మీపరవేళయాట నని మేషదృగంచలముల్ నిగుడ్చుచున్. 5

సీ. తమ్ములయెద నున్న తుమ్మెదలంగూడి చీఁకటుల్ భువినుండి చెదరిపోయె
వికసించిన సరోజముకుళమ్ముతోఁబాటు కలప్రాణులెల్లను గన్నువిచ్చెఁ
దామ్రచూడపు రాగతానమ్ములను గూడి కడలలో సాంధ్యరాగమ్ము లలమెఁ
బాత్రల నుప్పొంగు పాలధారలతోడఁ బ్రాగ్దిశన్ వెలుతురు బ్రాఁకికొనియెఁ

తే. జుట్టు వెలిఁగించుకొని చేనిపట్టు జేరు హాలికునితోడ జతగూడి యరుణకిరణుఁ
డల్లనల్లనఁ దూరుపునల్లమలల శృంగములనెక్కి జగతిని దొంగిచూచె. 6

క. తొలిదెసకుఁ దెలివివచ్చెన్ దొలఁగిచనెన్ నిదురమబ్బు తొంగలిరెప్పల్
నులుముకొనుచుఁ గనువిప్పఁగ వెలసెన్ బాలారుణార్క బింబాకృతియై. 7

తే. ఆదిన మ్మా ప్రభాతశుభోదయమున నాకుపచ్చవన్నియ చెల్వ మలలవోలెఁ
గ్రేళ్ళుఱుకు లేఁతపచ్చికబీళ్ళపైన మేయు గోవులఁ గనఁ బోతరాయఁ డరిగి. 8

ఉ. శ్యామల సస్య సంగతి నెసంగెడి సంగడి మోటబావిపై
భూమికి నూడలంటు వటభూరుహ సుందరశాఖలన్ ఖగ
స్వామి కులాయ మట్లు తృణసంగతిఁ గూర్చిన మంచె యంచుపైఁ
బ్రేమిడి నెక్కి కాంచు రవిబింబ ప్రసాదిత మోదితాశలన్. 9

సీ. మోటఁదోలు చొకింత మ్రొగ్గి దండెడ తంత్రి శ్రుతిజేసి పాడెడి చోటకాఁపు
మిరెపతోఁటల నలిం బెఱుకు గాజులచేతఁ జిటుకుతాళముగొట్టు చిన్నిపడుచు
పచ్చికన్ లేఁగల భరతనాట్యముప్రక్క బిల్లఁగ్రోవివి నూఁదు గొల్లబుడుత
రాత్రింబవళ్ళు విశ్రాంతిగానక తోఁట గాపాడుచుండెను గడ్డిబొమ్మ

తే. పసరుచాయల నీను మేల్వారిపొలాలు పచ్చ 'మఖమలు' పట్టుతివాచి గాఁగఁ
దెల్లవస్త్రాల మను దొరపిల్ల లట్లు కొంగగుంపు లా యొడ్ల మధ్యంగనఁబడు. 10

సీ. కట్టి పిఱుం దాని కంబళిముసుఁగుతో నీ రెండ గ్రాఁగుచు నిలుచుగొల్ల
పాదాల కసిదీఱఁ బసరిక బయళులఁ జంగున నెగురు వత్సముల గుంపు
పశుగణమ్ముల మూఁపుపై బొరింబొరి వ్రాలి స్వారిచేసెడి భరద్వాజపక్షి
వనదంశములఁ ద్రోల వాలచామర మెత్తి వీఁపుపై నాడించు వృషభరాజు

తే. దురదవోఁ దాటిమ్రాఁకుల నొరయు గేదె
గడ్డిమేయు గోవుల మెడగంట మ్రోఁత
కనుచు వినుచుఁ బోతన తన తనువుమఱచి
యెడఁద పొంగు భావమ్మున నిటులఁ దలఁచె. 11

క. క్రిక్కిఱిసియున్న పొదుఁగున నొక్కుమ్మడిఁ దలను గ్రుమ్మి యొగి కర్ణములున్
జక్కని వాలము నిక్కఁడి గుఱిక్కన మేన్సాఁచి చన్ను గుడిచెడి లేఁగల్ 12

చ. నడచుచుఁ బచ్చిగడ్డిని దినం దలవంచిన గోవు, వెంబడిన్
బడి వెనుకాళ్ళలో మసలి పల్మఱు చన్గుడువంగ నట్టు సాఁ
చెడి తనలేఁగఁ గాంచు తమిచే మెడ మోడిచి మేను నాకి హె
చ్చెడి మమతాప్తి మూర్కొనుచుఁ జేఁపును పాల్ గరుణారసమ్మనన్. 13

వ. అనితలంచి నిసర్గరమణీయంబులగు ప్రకృతి దృశ్యంబుల మనోహరంబులగు పశు
గణముల విహారవిలసనంబులం బారవశ్యమ్మున నారయుచుండ. 14

క. ఒక దెస నేమో కనినటు చకితుండై చారు హరిణ చర్మధరువి భ
స్మకలాపకలిత నైజాంగకలాజిత శారదాభ్రగత హిమకరునిన్. 15

క. మండిత కరధృత దండకమండలు హసదాననేందుమండలుని జటా
మండల ఖేలత్సుందర గండస్థలు లంబితాక్ష ఘనకుండలునిన్. 16

క. కాషాయాంబరకవచిత వేషున్ రుద్రాక్షదామ విస్ఫార దురో
భూషున్ హరిపదమార్గాన్వేషున్ జ్ఞానాగ్నిదగ్ధ నిజకృతదోషున్. 17

మ. ఒకయోగిన్ గనె స్నానసంధ్యలను శాస్త్రోక్తక్రియన్ దెల్లవా
ఱకముందే నెఱవేర్చి గోగణముఁ జేరన్ వచ్చి 'యీ మార్గమే
డకుఁ జేర్చున్ దయయుంచి తెల్పెదవె బిడ్డా!' యంచుఁ బ్రశ్నించు చం
ద్రికళాపూర్ణముఖారవిందుని దయార్ద్రస్వాంతునిన్ శాంతునిన్. 18

క. కని మ్రొక్కి యతనిచెంగట వినయవినతశీర్షుఁ డయి ద్రవీభూత సుచే
తనుఁడై యనురాగోక్తుల నను 'నిటులే యూరుఁ జేర నరిగెద రార్యా! 19

ఆ. అనఘ పాలకురికి చనుదెంచు మునుముందు శైవమతగురుండు దైవసముఁడు
సుకవితారకలకు సోముండు సోమసమాఖ్యముని సమాధినందె నందె. 20

తే. యాత్రికులు మీరు వసతి గ్రామాంతరమున నెట్టు లుండునో భోజన మెపుడో యేమొ
కొంచె మీక్షీరముల నారగించిపోదు' రనుచు దొన్నియన్ గోదుగ్ధ మునిచి తేఱ. 21

తే. పొట్టనిండఁ ద్రావి పుట్టెఁడు ప్రేమతో నిట్టి పుణ్యమూర్తి నెందుఁ గాంచ
నేమి ప్రతిఫలమ్ము నిడు చిదానందుండు వీని కనుచు భావవీధి నరసి. 22

తే. "గోరసమ్ములఁ దృప్తిని గొంటి వత్స! నీదు గోరస మిట్టులె నిఖిల జనము
లపని నాచంద్రతారార్క మనుభవింత్రు గాత!" యనుచు దీవించి యేఁగం దలంచె. 23

ఉ. అవ్వనభూమి నొప్పు చెలువౌ ఫలభారనతామ్రభూజమై
యవ్వటుశీర్ష మొక్కపరి యమ్ముని పావనపాదసీమలన్
జువ్వన వంగె నెన్నుదురు క్షోణితలమ్మున సోఁక భక్తిమై
నివ్విధిఁ బూర్వపుణ్యము లనేకము లేకములై ఫలించెనాన్. 24

తే. స్వామి! యంచును గద్గదస్వనము గదుర నార్తిగొని పోతన మునీంద్రు నడిగె నిటుల
"వసుధలో దేవుఁ డుండునన్ వాక్కు విందు వాని గాంచఁగ నావంటివాని కగునె? 25

క. మిమువంటి ముని నడుగ నిక్కము సెప్పెద రనుచు వినుట కాంక్షింతు" ననన్
ప్రముదితమానసుఁడై సంయమి డింభకుఁ గాంచి యిట్టు లాశ్చర్యపడున్. 26

ఉ. "ఆరయ షోడశాబ్ద తరుణార్భకుఁ డీతఁడు వీని కియ్యెడన్
సారసలోచనా ప్రణయసంగత వాంఛల నాటపాటలన్
దోరపుఁ గూర్మి యుండఁదగుఁ దోఁచునె తత్త్వవిమర్శ పూర్వసం
స్కారము లేక యివ్వటుని జన్మము కారణగర్భితం బిలన్." 27

చ. అనుకొని దివ్యదృష్టిని మహాత్ముఁడు యోగివరేణ్యుఁ డట్టె పో
తన భవితవ్యమున్ హృదయదర్పణమం దఖిలమ్ముఁ గాంచి కా
రణభవుఁడం చెఱింగి స్వకరమ్ము శిరమ్మున నుంచి బాదరా
యణికృప నీ రహస్య పరమార్థ మెఱింగెద వంచు నిట్లనెన్. 28

ఆ. భూమియందు విత్తుఁ బుట్టించు శక్తియై విత్తులోన మొలచు విమల శక్తి
యగుచు నొకట రెంటి నైక్యమ్మొనరించి సృష్టిరచన చేయు స్రష్ట యతఁడు. 29

క. రసరూపుఁడు నారాయణుఁ డసదృశ విజ్ఞానవహ్ని నావిరియై భ
క్తిసరిత్సాగర హిమమై మసలు న్నిర్గుణత సగుణమహితాకృతులన్. 30

తే. ప్రభు నుపాసించు మార్గముల్ బహువిధములు గలవు కర్మ భక్తి జ్ఞాన గతు లటంచు
వీనిలో శ్రియఃపతిని సేవింపఁజేయఁగలుగు సులభసాధన మయి వెలసె భక్తి. 31

తే. మొఱలనిడు గజేంద్రుని గాంచి యుఱికిరాఁడె వేఁడుకొనెడి ప్రహ్లాదుఁ గాపాడిపోఁడె
పరమపదపీఠినుండి యావరదుఁ డెచ్చు పరమమగు యుక్తి యొకఁడె సద్భక్తి యుక్తి. 32

క. అనియెడి మునిబోధలు విని యనఘుం డా పోతనార్యుఁ డార్తుండై 'యో
మునిరాయా! యీశ్వరదర్శనమార్గముఁ దెల్పుఁ' డనుచు సాగిలఁబడుచున్. 33

ఆ. 'జన్మ మిచ్చినట్టి జనకుఁ డీతం డని జనని చూపుభంగి సద్గురుండు
పరమపదవి నొసఁగు భగవానుఁ డితఁడని తెలుపకున్నఁ దెలియఁగలమె' యనిన. 34

తే. పాత్రుఁ డగు బాలు హృదయసుక్షేత్రమందు
విత్తె రామతారకమంత్ర బీజ మంత

హరియు మానసగుహఁ జొచ్చి యార్భటింపఁ
గడచనెఁ మమత్వ మదోగ్రి కరిగణమ్ము. 35

ఆ. అంత యోగి వటుని యంతరంగపుటార్తి గుర్తెఱింగి యెంతొ కూర్మిమీఱ
మదికి నచ్చునట్లు మంత్రార్థమహిమంబు లెఱుకపరచె చట్టు కివ్విధముగ. 36

క. భూతముల రమించెడివాఁ డాతం డైయుంట రాముఁ డనఁబడు నను వి
ఖ్యాతి "స ఏకాకీ న రమేత" యనెడి శ్రుతినిరుక్తి మేకొనె ధరణిన్. 37

క. రాముఁ డనంతుఁ డనాది ప్రేమమయాకారుఁ డఖిలవిశ్వాత్ముండా
నామమహత్వ మజ హర స్వాములునున్ వినుతి సేయఁజాలరు వత్సా! 38

శా. శ్రీ నారాయణమంత్ర జీవమగుచున్ జెల్వొందు 'రా'వర్ణ పా
ర్శ్వానన్ శ్రీ శివమంత్రజీవపద విభ్రాజన్'మ'వర్ణంబు సం
ధానంబుం బొనరింప 'రామ' యనుచున్ ధాత్రీజనోత్తారకా
స్థానంబై శివకేశవైక్యతనుఁ బ్రస్థాపించుఁ దా నెట్లనన్. 39

ఆ. ఓం నమ శ్శివాయ నొక 'మ'వర్ణంబు నారాయణాయలోన 'రా' తొలంగి
న 'న శివాయ' మరియు 'నాయణాయఁ'గమాఱి ముక్తినిడననర్థములగునవియు

ఆ. హరుని మంత్రమేని హరిమంత్రమేనియు నొక్కటొకటె ముక్తి నొసఁగు ననిన
చతురమంత్రయుగ్మ సంపుటీకరణ మిం దీయలేని కోర్కె లేవి గలవు? 41

ఆ. రామతారకమ్ము రహి నాత్మ జపియించు శంకరుండు భక్తి శౌరిరూప
ధరుఁడు రాఘవుండు తా నంబుధిం గట్టు ముందు త్ర్యంబకునకు మ్రొక్కి వేడె. 42

ఆ. ఒకరి నొకరు పూజ లొనరించుకొన నిట్టు లుభయు రొక్కపేర నొదిగియుండ
వారు తక్కువనుచు వీ రెక్కువనుచును మదిని దలఁచువాఁడు మానవుండె. 43

ఆ. ఎన్నిమతములేని యీశ్వరుం డొక్కండె భాష లెన్నియేని భావ మొకఁడె
పలుతెరంగుపూల బరగు తేనె యొకండె ఆల రంగెదైన పా లొకండె. 44

వ. అని మంత్రార్థ మహిమంబుపదేశించి. 45

ఆ. బాలు మొగముఁ గనిన వేళావిశేష మ్మదేమొ కాని యోగి యిడియె వేఱ
సిద్ధమంత్ర మొకటి 'జిహ్వాగ్రవశవర్తినిగ వసించు వాణి నీ' కఁటంచు. 46

క. ధ్యానమతి మంత్ర మనుసంధాన మ్మొనరించుటలు ప్రధాన మ్మనుచున్
దాని జపవిధానమ్ము నిదానమ్ముగ విను మటంచుఁ దా నిటు నుడువున్. 47

ఉ. సాదరబుద్ధి నేమఱక శారదమంత్రము ప్రొద్దుమాపులన్
ద్వాదశహాయనమ్ములు జపమ్మొనరించినఁగాని సిద్ధిగాఁ

బోదిది యీ తపమ్ము పరిపూర్తి నొనర్పఁగ నెల్లవేళలన్
నీదగు బ్రహ్మచర్యవ్రతనిష్ఠయె మూల మటంచు నెంచనా. 48

శా. ఆయా కావ్యములన్ బఠించుతఱి నీ వాయా మహాదర్శనా
మ్నాయాభ్యాస మొనర్చువేళలను వీణాపాణియై వాణి తా
నీయందున్ వసియించుచున్ సహజపాండిత్యంబు ప్రాప్తింపఁగన్
జేయున్ నీకు నరుం డొరుండు గురుఁ డౌనే సిద్ధవిద్యావిధీ! 49

తే. ఘనతరానల్పకల్పనా కావ్యపటిమ వరల నిరుపమప్రతిభావిభాసి వగుదు
వెట్టి గ్రంథమే నొకసారి యిట్టె చూడ వల్లెవేయక నోటికి వచ్చు నీకు. 50

తే. మొదలుపెట్టిన తప మది ముగియకుండ బ్రహ్మచర్యదీక్ష వ్రతభంగ మైన
కావ్యకల్పనాధార యొక్కటియె దక్కు ధారణాశక్తి నీనుండి తరలిపోవు. 51

క. కృతిని నరాంకిత మొసరుప క్షితి నీదు ప్రబంధమునకు క్షీణత కూరున్
క్షతశేషమ్ములు లక్షణయుతములు గావను నకీర్తి నొందును బుత్రా! 52

తే. అవని గాంగేయ భార్గవ హనుమదాది శంసనీయ శూరశిరోవతంసు లెల్ల
మనమును జయించి యమునకు మఱలఁబడిరి బ్రహ్మచర్యంబునకు దుర్లభంబుగలదె? 53

సీ. జీవనజ్యోతులు చిరజీవిగా వెల్గ నాత్మ నర్పించు స్నేహస్వరూపి
రమణీయదేహహర్మ్య స్థిరత్వమునకై నమ్మకమైన పునాదిబలము
బహురోగబాధలఁ బ్రతిఘటింపఁగ వైద్యుఁ డక్కఱలేని దివ్యౌషధంబు
అజరామరత్వలాభాప్తికై శమదమా ఖ్యాంబుధిన్ బుట్టు జీవామృతమ్ము

తే. జీవజీవమ్ము చావుకుఁ జావు విశ్వసౌఖ్యసారమ్ము పురుషార్థసాధనమ్ము
ఉత్తమ బ్రహ్మచర్యసంపత్తుముందు దిగదుడుపుకైనఁ గొఱగాదు మిగతధనము. 54

తే. దీనజనులను దయఁజూచు దివ్యకర్మ తపము లన్నిటిలో నుచ్చతమము వారి
మఱువవలదంచు దీవించి దరికిఁదీసి మూర్ధసంస్పర్శమొనరించి మునియుఁ జనియె. 55

క. అరిగెడి మునిపదములఁ బడి యరిగెడి శ్రీపోతరాణ్మహార్త్యనురాగా
దరపూర్వదృష్టితతి వెను మఱలుట లన నెంతయును శ్రమంబయిపోయెన్. 56

క. ఇటు లా పోతన తా నెప్పటివలె నిలుపేరె భావపథములలోనన్
నటియించె నలువ వాణీ కుటిలాలకఁ గూడి వేదగుణగానరతిన్. 57

ఉ. తేపకు యోగిరూపమును దీవనయున్ నవనీతసౌకుమా
ర్యాపహసన్మనోజ్ఞ కరుణాంచితవృత్తియు బ్రహ్మనిష్ఠయున్
జ్ఞాపకరూపతన్ మెఱయ జ్ఞానయుతుల్ మది పొంగిపాఱె నా
మాపటినుండియున్ హృదయ మార్గమె వేఱయిపోయె నెంతయున్. 58

చ. ఇసుకను జక్కెఁరం గనఁగ నేకవిధమ్మునఁ గానిపించు నా
యిసుక జలమ్ములన్ గరఁగ దేండ్లకొలందిగ నాని పొత్తు తాఁ
బొసఁగినయంత నీరమయి పోవును జక్కెర మానవాళి రూ
పసమత నుండనేమి రసభావవిలీనుఁడె సజ్జనుం డిలన్. 59

క. ఎద నేమియో పరా కయ్యెదియే హృదయమున నురక నాడఁగ మఱునాఁ
డుదయమునఁ బోతనయు మది ముదమొదవఁగ నా ప్రదేశమున కరిగి యటన్. 60

తే. పచ్చపచ్చని యా చేల పల్లెసీమ విచ్చుచున్న పద్మమ్ముల వెలయు కొలను
పచ్చికయెడారులన్ గన భావ ముబికివచ్చెఁ జెయిసాగెఁ దా నెదో వ్రాయనెంచె. 61

ఉ. ప్రక్కన నున్న ముల్లుగొని పచ్చలు విచ్చెడి తాటికమ్మపైఁ
జెక్కఁదొడంగె ముత్తియపుఁ జేరులఁ దీరుచు నక్షరాళి పై
కెక్కెడు బొమ్మలన్ నుదుట నేర్పడు రేఖలు భావవాహినిన్
జక్కని యానకట్టల పసందులు దిద్దఁగ దన్మయాత్తతన్. 62

క. పరిదృశ్యమాన పరిసర చరాచరప్రకృతివస్తుసంగతనుతసుం
దరతను గన్గొనుచును సంబర మంబర మంట నిట్లు భావించు నెదన్. 63

తే. లలిని బసరికరంగు నాకులకు రుద్ది రుచిర పరిమళ మధురస రూపవితతి
పూలఁ గీల్కొల్పి వన్నెలు పొందుపఱచి విశ్వచిత్రమ్ము విరచించు విబుధుఁ డెవఁడొ,

తే. వింతసింగిణి రంగులపెట్టె విప్పి యాకసపుఁ బల్లెరమ్మున నఱుగఁడీసి
క్రమముగా నన్నివర్ణముల్ కరఁగిపాఱఁ గుంచెలన్ రంగుచిత్రాలఁ గూర్చు నెవఁడు. 65

చ. అనుకొని చూపుమేరలను హాయి నొసంగు విశాలదృశ్యమున్
గను నట నంబరమ్ము భువిఁ గట్టె గుడారము కొండచాళ్ళు భి
త్తి విడెను చుట్టు నందు సభఁదీర్చె మహీరుహపాళి శాద్వలాం
గణములు పచ్చపచ్చని నిగారపు టాస్తరణమ్ము లొత్తఁగన్. 66

తే. అరసి కడు లోఁతునన్ జిక్కి యలరుచున్న ప్రకృతిగత కళార్ణవ నవరత్ననిధుల
సంగ్రహణమున్ బొనర్చుచుఁ జతురమతిని బోతనార్యుండు పద్యముల్ పూర్తిచేసె. 67

తే. భావ మప్పొంగ నీరీతిఁ బద్యములను బూర్తిగావించి విబుధుఁ డపోతరాజు
మధురమంజులశ్రుతి వాని మఱలమఱలఁ జదివికొని తృప్తిగొను స్వర్గ మొదవినటుల.68

తే. "సూర్యభగవాను వదనమ్ముఁ జూచి నవ్వి యాత్మ నర్పించుకొనిన యీ యంబుజమును
ఖలుఁడు గజరాజు సింగమ్ముకరణి వచ్చి తుంచి తలమోదుకొనునఁట తుచ్ఛబుద్ధి." 69

తే. శ్రుతుల విహరించు మధుపానరతుఁడు తేఁటి భద్రగతి పూల నలరించు క్షుద్రశలభ
మెగసిపడి పూవురేకులె పగము గొఱికె దీప్తిమత్కావ్యపత్రిలఁ దిను చెదలన." 70

క. ఇప్పగిది స్వీయకవితల నుప్పొంగుచుఁ జదువుకొనుచు నొకపరి వీనిన్
తిప్పన్నకు వినిపింపఁగ ముప్పిరిగొను తమిని సదనమునకున్ జనుచున్. 71

ఉ. ఇమ్మహి యోగిదర్శన మదెంతటి పుణ్యాల కబ్బు నా యదృ
ష్టమ్ము ఫలింపఁ దారకరసాయనమున్ గరుణించి ప్రోచుటన్
గమ్మని కైత నన్వలచెఁగావలె నెయ్యది ? యేది లోటు ? స్వ
ర్గమ్మును గాలఁ దన్నుదును కావ్యజగత్తును బట్టి దున్నుదున్. 72

చ. అనుకొను పోతనార్య హృదయాంబరవీథి రసాంబువాహగ
ర్జనలు ప్రతిధ్వనించె సరసన్ మెఱపెన్ బ్రతిభాలతాంగి భా
వనల నలంకరించుకొని వస్తువు లెల్ల నొకొక్క కావ్యమై
కనబడసాగె నాగె నడకల్ జడిమంగొని యూరుఁ జేరుచో. 73

గీ. పూట గడవని పేదకాపురపు రాణి బాటనంటి తా నెచటికొ బయలుదేఱె
నంతరంగాన నుడుకు దుఃఖాబ్ధి లెవియొ కంటనీరొల్క శిరమెత్తి కాంచలేదు. 74

ఉ. అంతటిలోన వీధి జనమంతయు విస్మితదృష్టితోడ న
త్యంతముఁ గాంచుచుండె నెటునందని పేలికఁ జుట్టి వచ్చు నా
యింతిని నూత్నయౌవనలతేందిర కౌఁగిటఁ జెంగలించు పూ
బంతిని గంతుదంతి నతిపావనరూప సుధాస్రవంతినిన్. 75

ఆ. లేఁతవయసు వన్నె పూఁతఁబెట్టుట మేను నిండుపాఱి మిసిమి నిగ్గుదేరి
పొసఁగ నచ్చులోనఁ బోఁతఁబోసిన దేవి మూర్తివోలె రూపు ముద్దొసంగె. 76

ఉ. చక్కని నాగుగున్నల నపోరిడ బాహు లరంటిబోదియన్
జిక్కని వంపుసొంపుల సృజింప మృదూరుయుగమ్ము ముద్దుకీ
ల్కొక్కులుదేలి, వర్తుల మనోజ్ఞ పయోధరభార మక్కునం
దొక్కరవం జలింప హొయలొప్పెడి హంసికవోలె నేఁగుచున్. 77

ఆ. మట్టిబాఱియున్న మణిదర్పణ మ్మయి మబ్బుగ్రమ్ము చంద్రమండల మయి
మాసి మదత విడిన మరుపట్టుపుట్టమై యలరు దిద్దుకొనని యామెరూపు. 78

సీ. నెఱికురుల్ దువ్వదు సరిచేయ దైనను సిగముడి తానెంతొ చెలువుగులుకుఁ
దెలికన్నుఁగవఁ గాటుకలు దిద్ద దైనను లోలేక్షణము లెంతొ లోభపెట్టు
జిగిమేనఁ దొడుగదు నగనాణె మైనమ గొనరించు చిఱునవ్వు మునరు మోము
కొంగు కందెడి వన్నెకోక లే దైనను పుట్టుచెల్వము పంచిపెట్టు నొడలు

తే. నుదుట నొక చుక్కబొ ట్టిడ నదియె చాలు కొట్టవచ్చు లక్షలసొమ్ము బెట్టినట్లు
పికులు గుత్తపు ఱవికలోఁ జికిలిసేయు మరుకటారియై మెఱపెడి మగువ వయసు. 79

తే. పుట్టుచక్కఁదనములోని గుట్టు విప్పు నిండు ప్రాయమ్ము మేన దాఁగుండలేక
యుబుకులాడఁ జేతులఁగప్పి యురము కరము దాఁచుకొను చేఁగు నా బీదతరుణి తాను. 80

సీ. తనవైపు యువకులేరును గన్నువేసిన బ్రతుకేటి కనునట్లు బాధపడును
గాలినిండుఁగఁ జీర గలుగు స్త్రీ లెదురైన దొంగ తానైనట్లు క్రుంగిపోవు
నూరిపెద్దలు దారిఁ దారసిల్లినయంతఁ దలపోయినట్లు చిత్తమునఁ దలఁచు
ఈబాధ లేవియు నెఱుఁగని పశుజన్మ వెయిబాళ్ళు తనకన్న నయ మనుకొను

తే. జనము లేనిచోఁ దలయెత్తి కనుచు ధృతిని నేదియో పీడదప్పిన ట్లేఁగు తనకు
నేది యెట్లున్నఁ బెనిమిటి యిడుమ లెదకు జ్ఞప్తిరాఁ బొట్టగడచుటే చాలనుకొను. 81

ఆ. పొంగుయౌవనమును గొంగుచాటొనరించుమాత్ర ముడుపు లేక రాత్రిపగలు
లోకమెదుటఁ దిరుగ లోలోనఁ గ్రుంగెడి శీలవతిని గాంచి జాలినొంది. 82

ఆ. అనఘుఁడైన కవియు నాయమ దుర్భరస్థితిని దలఁచి గుండె చితికిపోవ
నొడలిపైన నున్న యుత్తరీయముఁ దీసి మీఁద వైచి పలికె సాదరముగ. 83

ఉ. 'పల్లియలక్ష్మివో యనఁగ భాసిలుచున్న భవత్స్వరూప మో
తల్లి ! స్వమానరక్ష కిటు తల్లడమందఁగఁ జూడఁజాల నా
చెల్లెలివంటిదాన వని చిత్తమునం దలపోసి నీ కిదే
యొల్లియగాఁగ నా వసన మొక్కఁడొసంగెద స్వీకరింపుమా.' 84

తే. అనుట లజ్జమై నామె పోతనకు మ్రొక్కి యేను దీనిని గొన ననె నేల యనిన
దీని నేఁ గొన శంకించు మానసమున నా మగం డదె వచ్చుచున్నాఁ డనియెను. 85

తే. ఇంతలో నామెపతి యట కేఁగుదెంచి తనదు భార్యను గాంచి యిట్లనియె 'నోసి !
దేవునంతటివాఁ డయ్య తీసికొనుము వస్త్ర' మని తాను గొని దాని వనిత కిడియె. 86

ఉ. 'ఇల్లను వీడి మీ రుభయులెచ్చటి కేఁగుచునుంటి' రంచుఁ దాఁ
జల్లఁగఁ బల్కరించు కవిచంద్రుని గాంచి నమస్కరించి 'రే
యెల్లను బస్తు గ్రాసమిడ రిప్పటి కప్పటి కంచు మా దొరల్
పల్లెకుఁ ద్రిప్పుచుండి' రని పల్క నతండు కవీంద్రుఁ డిట్లనెన్. 87

తే. 'ఏల గ్రాస మీయఁడు మీర లేమియేని యప్పుగైకొనియుంటిరా యతనియొద్ద ?'
యనిన నేడ్చి పాలేరు పోతనకు మ్రొక్కి తన విషాదగాథను జెప్పుకొనియె నిట్లు. 88

క. 'ఈ నెల గ్రాసము దెమ్మని నే నంపితి దీని, నిదియు నేఁగెను, బ్రభువున్
దా నడిగె నా దొరయు నవ మానింపఁదలంప నింటిమార్గముఁ బట్టెన్. 89

క. ఈనినపులియై సిగమున్ బూనిన కాళి యయి యగ్గిపోగమంటలు క
న్గొనలఁ గ్రక్కుచు కోపముతో నింటికి వచ్చెఁ దోఁకఁద్రొక్కిన త్రాఁచై. 90

క. ఏల యిటు వచ్చితివి? బత్తెమియలేదె యతఁ? డనన్ మౌనమున గండ్ల నశ్రు లురలఁ
గూడు లేకున్న మానె నే మాడిచత్తుఁ గాని చన నింక నా పాపికడ కనియెను. 91

క. తిట్టెనె కొట్టెనె పీడం బెట్టెనె విన్నాతఁ? డేల విలపించెదవే?
గట్టిగ నుడువుము నాపై నొట్టుసుమీ! యనుచు మిగుల నోదార్చుటయున్. 92

క. చిత్తము కుదుటఁబఱచుకొని యిత్తెఱఁగునఁ బల్కె దాని నేమియనుచు వా
క్రుత్తును దలఁచికొనిన వడకెత్తు నొడలు నోట మాటయే రా దనుచున్. 93

తే. చెప్పలేక చెప్పఁగలేక చిన్నవోయి యా విషయమంత యెటులో యొక్కటులు దెల్పె
నడుగుఁడించుక దానినే నుడువు నదియె' యనుటఁ బోతనంగని మ్రొక్కియనియెనామె.

తే. 'గ్రాసమిత్తు రమ్మనుచు నక్కడనె యున్న తనదు గరిసెలయింటికిఁ గొనుచుఁబోయి
తలఁపులన్ జూపులందు వర్తనములందు వలపులొల్కఁగా నేమేమొ పలుకు ఖలుఁడు.

తే. తలఁప మా యిండ్లలోఁ బుట్టఁదగినదాన వీవు తప్పి జన్మించితి వెటులో యచట
సుఖమనఁగ నెట్టిదో కండ్లఁజూడ వీవు కటకటా! బలే పెనిమిటిం గట్టికొంటి. 96

శా. పట్టెం డన్నముఁ బెట్టి నిన్సుఖముగాఁ బాలింపలేఁ డౌర! మైఁ
జుట్టంజాలెడి కోకదెచ్చుటకె చచ్చున్ గాకికిన్ ముక్కునన్
గట్టంబెట్టిరి దొండపండు నిదిగో! కాసు ల్పదాఱంచుఁ జేఁ
బట్టెన్ గట్టిగ నాకు ప్రాణములు పైఁబైనేఁగె నింకేమనన్. 97

తే. మనసులో నగ్నివడె నొడ ల్మండిపోయె నెక్కడన్లేని ధైర్యమ్ము నెంతొ బలము
వచ్చె నొకయూఁపులోఁ జేయి వదలుచుకొని బయటఁబడితి నచ్చట గంపఁ బాఱవైచి.

ఉ. దాసినె? కూడుగుడ్డ లిటు తగ్గిన రెక్కలకష్ట మెద్దియో
చేసి లభించినంత తిని జీవిత మీడ్చెద నింతెకాని సీ!
కాసులయాస మానమును గంపలగానము జేసికొందునే
నాసరి యాఁడుబిడ్డయును నాసరి సోదరిలేదె మీకునున్. 99

తే. అనుట లింక నాతఁడె 'గాస మడిగికొందు తిందు పొ' మ్మని మీసమ్ము దిద్దినాఁడు
అన్ని దెలిసినమారాజు లాచరించు పనులె యిటులున్న మముఁగూర్చి పలుకవలెనె?' 100

తే. అనిన 'నతఁ డిట్లొనర్చెనే యబల! యట్టి ఖలున కే శిక్షనీయఁగావలె' నటన్నఁ
జెక్కిళులమండి కన్నీటిచుక్క లురలఁ గవిని గాంచెను సతి కవి గాంచె సతిని. 101

క. కోమలి యూర్పుల నాగుం బాములు బుసకొట్టె, బాష్పపటలి దశదిశా
స్తోమమున నగ్నిగురిసెన్ భామినిమొగమందుఁ బ్రళయభానుఁడు వొడిచెన్. 102

క. 'మీకా సంబళ మిడియెద నాఁకలిఁ బాఁపుకొనుఁ డరుగుఁ డవనీస్థలిలో
శ్రీకి పయోరూపయుత స్త్రీకిన్ గాపురుషవలనఁ జేకురు బాధల్.' 103

వ. అనుచు పోతన తాను. 104

క. వారల నింటికిఁ గొనిచని కూరిమి నా బత్తెమెల్లఁ గొలిచియిడె నమ
స్కార మ్మొనరిచి యేఁగిరి వారలు, పోతనయు సఖునివసతిꣳ జేరెన్. 105

క. పోతనను గాంచఁగనె తమిఁ జేతులు జోడించి పఱచి చిఱుచాఁప యొకం
డాతఁడు సవినయమతి 'నిటు లేతెం'డని స్వాగతమ్ము నిడె నయ్యెడలన్. 106

తే. అరుగుదెంచిన కవియు నయ్యాసనమున నధివసించి నెయ్యుని కేల నలరుచున్న
గ్రంథమునుగాంచి 'యదియేమికావ్య' మనుట 'లాంధ్రశృంగార నైషధ'మనె నతండు.

క. విని యప్పలుకులఁ బోతన ఘనమోదము నొంది 'రాజకవికృతి కదుఁ జ
క్కనిగ్రంథరాజ మది కాంక్షను బఠియించెదవు నీవు సత్కావ్య'మనన్. 108

క. 'తరుణుఁడ వవివాహితుఁడవు సరసుఁడవున్ జిన్ననాఁటి సఖుఁడవు సుకళా
భిరతుఁడ వనుచును నా కావ్యరమను గొనివచ్చితిని నవధరింపఁదగున్.' 109

క. అన విని 'నా భాగ్యంబేమన పంగువుపైకి గంగ యరుదెంచిన దో
యనఘా ! తప్పక దానిని వినఁదలఁచెద' ననుచు నతఁడు వినతి యొనర్పన్. 110

క. ఒక్కరని నిర్ణయింపక ముక్కుకు సూటిఁ జని హృదయమున నాఁటుకొనన్
జక్కని ధ్వనితోఁ బద్యము లక్కవి పఠియించె మిత్రుఁ డౌనన నిట్టుల్. 111

తే. "సృష్టి సౌందర్య సంపదఁ జేతములకు హాయి నొనఁగూర్పఁగా దిద్దె నాదిశిల్పి
యట్టి చిత్రమ్ముపై స్వార్థహస్తముంచి మైలపఱచుట పాడియె మానవునకు. 112

తే. దృశ్య మెద్ది భోజ్యం బెద్ది తెలియలేక కనిన ప్రతివస్తువును నోటఁ జొనుపుకొనఁగఁ
జూచు శిశు హస్తసంగత సూనమాల చిఱుతఁ దేద్వఁగాఁ గొని రక్షసేయు జనని. 113

తే. పచ్చఁగా నిగుర్చని శుష్కపాదపమ్ము నల్లుకొనె మల్లికాలత చెల్లదనుచుఁ
బోఁకబోదియం దార్పఁగాఁబోకు మచట వాడిచను సది నీకృషి వ్యర్థమగును. 114

తే. కొలని పహవాన మెడఁబాప జలజకాంత చివరి కొక చుక్క మధు వేనిఁ జిందఁగలదె
మనసు నొప్పించు త్రోవలఁ జనకు పాంథ ! చిక్క దానందధామ మా సీమలందు. 115

తే. పైర తరుపుష్పబంధమ్ము వేఱుపఱచె మోముమాడ్చె నాక్షణమందె పూపడంతి
దాని కిష్టమ్ముగానట్టి తఱిని ధరణి నేహృదయమేని యానంద మిడఁగలేదు. 116

తే. మధుసుధలఁ జిల్కు నగుమోము మంటఁగలిపి తేఁటినోటిముంగలి బుక్క వీటిబుచ్చి
సౌరభమునకు నోఁచదు మారుతమ్ము తీవపూవుల నెడపి సాధించె నేమి ? 117

తే. ఇలను ప్రేమామృతమ్ముల గెలుచుకొనఁగఁ
బహుబలముకన్న స్నేహమే పనికివచ్చు

వ్రాఁకులఁ దొల్చునట్టి బంభరము తాను
మధువుఁ గొను జూడు పూవన్నె మాయకుండ. 118

తే. గుండె యసి గాయ మొనరింపఁ గుంది కనుల
బాష్పములె హింసకు శిరమ్ము బగులుచవొకొ
స్వీయగతి నడ్డు పర్వతశిఖరతతుల
వనరు మేఘమ్మె పిడుగయి వ్రాలదొక్కొ." 119

క. అని యిటు లా పోతనకవి తనకావ్యవిపంచి నత్యుదాత్తాశయ గీ
తనిరూఢి నమరగానము వినిచిన వినతుఁడయి సఖుఁడు వినుతించె నిటుల్. 120

క. 'నీదు సుకావ్యము కర్ణాహ్లాదం బిదె భారతీకరాంచితవీణా
నాదంబై కృష్ణార్జున వాదంబై సామవేద వరపాదంబై. 121

క. శృంగారనైషధమ్మును బంగారమ్మనుచు శిరముపై నిడితిని యా
బంగారమున సువాసనలం గూర్చె భవత్కవిత్వ లక్ష్యము లనఘా! 122

క. నైషధకావ్యరమాగండూషఁ మధుపానమత్త డోలాయిత దృ
గ్దోషుఁడనౌ నాకొక ప్రత్యూషాకృతి యయ్యెఁ దావకోక్త కృతిరుచుల్.' 123

క. అప్పలుకులు విని పోతన యిప్పగిదిం బలికె 'నౌర! యిది నైషధపుం
గొప్పను మించు ననుట లిది యొప్పునె నాపైనిఁ గూర్మి నొగి నిట్లనుటల్. 124

ఉ. ప్రాకృతికాంతరంగ బహిరంగ ప్రవృత్తుల వాస్తవస్థితిఁ
లోకముముందు దర్పణములోవలెఁ జూపుటలే కవిత్వ మా
ప్రాకృతి కాంతరంగ పరివర్తనమే రసరూపమొందు బా
హ్యాకృతిలోని మార్పులె రసాంగప్రకాశక వర్ణనాదు లౌ. 125

ఉ. ఉన్నది యున్నయట్లు పరసోక్తులఁ జూపు కళావిలాసమే
యెన్నఁగ సత్యరూప మది యెందును సుందరమై చెలంగు నా
వన్నె యొకండె చాలక శివంబును దానయి సాహితీ విలా
సోన్నతి వెల్గి బ్రహ్మసుఖ సోదరమై తిరమై రహించెడిఁ. 126

శా. కాంతాసమ్మిత కర్ణపేయరస వాక్యస్ఫూర్తి నొప్పారి ధ్వ
న్యంతర్గర్భిత భావపూర్ణ రమణీయార్థప్రవం చాతిభా
స్వంతం బౌచును గావ్యరాజ మది విశ్వశ్రేయ మొందన్ప సో
దంతంబై మను టొప్పు నప్పు డది సత్కావ్యం బనంగాఁ దగున్. 127

మ. అకలంకంబయి యత్యుదాత్త మయి లోకాదర్శ విజ్ఞానదా
యకమై దివ్యకథాపవిత్రమయి పాత్రౌచిత్య సల్లాప దీ

పకమై పాజ్ఞమనోనురంజక రసప్రస్ఫోటమౌ కావ్యముఁ
సుకవీంద్రుండు రచించుఁ దా' నన మనళ్ళుద్ది న్సఖుం డిట్లనెన్. 128

ఉ. 'ఓ కవిలోకవంద్య! భవదుక్త మహాశయ కావ్యలక్ష్య సు
శ్రీ కమనీయ బోధన మశేష జగద్గురుపీఠవర్తియై
వీఁక మెయిన్ బ్రజాహృదయవీథుల నిర్మల ధర్మదేవతా
లోకముఁ సృజించు నన లోఁగల నా హృదయమ్మె సాక్షియౌ. 129

ఉ. ఎట్టులనన్ భవత్కవన మెంతయు గుండెకుఁ దాఁకి మర్మమున్
ముట్టి మదీయమార్గమును బూర్తిగ మార్చిన దిప్పు డున్న దు
న్నట్టులఁ జెప్పుచుంటి భవదంఘ్రుల సాక్షి మహాపరాధపుం
బుట్ట' నఁటంచు మ్రొక్కులిడి 'పూజ్యకవీ! క్షమియింపు న'న్ననున్. 130

తే. 'ధర నుపాధ్యాయుఁ డెదొ యొక్క తరుణమందుఁ
బ్రాంత పరిమిత జనులకు పాఠమిడును
గాని సత్కవివాణి శిక్షణమొసంగు
సకలకాలమ్ములందు విశ్వప్రజలకు. 131

క. ఈ హితముఁ గఱపు నతఁడె స్నేహితుఁ డగు వానిచెలిమి క్షితిజను లెల్లన్
స్నేహితు లగుదురు చెడు దుర్మోహతమిస్ర' మన సుకవిముఖ్యుఁ డిటాడుఁ. 132

క. జీవజ్యోతులు స్నేహపు భావముననె బ్రదుకువెలుఁగుఁ బడయన్ గలుగున్
దైవజ్యోతియు స్నేహశ్రీవిభవము గలుగువఱకె సెమ్మెన్ వెలుఁగున్. 133

తే. ఎడఁద దొనఁగు పశ్చాత్తాపపడుటచేతఁ గరఁగి పాఱెడి కన్నీరు కడిగివైచె
నేరములులేని నరుఁ గననేర మెందుఁ దప్పుకొనలేఁడు మనుజుఁడు తప్పునుండి. 134

ఆ. ఒక్క విత్తునాఁటఁ బెక్కుగింజలు వెన్ను నంటియున్న ఫలిత మబ్బునట్టు
లొక్క పాపకర్మ పెక్కింతల ఫలమ్ము వెన్ను నంటి కుడుపు నిన్నరునకు. 135

క. కావునఁ జెడుచేఁతల నెద భావించుచునుండరా దపాయకరము 'య
ద్భావం తద్భవతి హి' యని ధీవర్యులు నరుని గతిని దెల్పుదు రవనిన్. 136

తే. ప్రసవములు సన్నిహిత సమీరముల సతము నిజ పరిమళమ్ములతోడ నింపునట్లు
శుచిఁ గోరు స్నేహితున కా సుగుణరాశి ధర్మవర్తనమ్ములను బోధనమొనర్చె. 137

చ. మనికిని జేరి తిప్పన సమక్షమునన్ దలవంచి మ్రొక్కి దీ
వనలను గొంచుఁ దొల్దొలుత వ్రాసిన కైత లటంచుఁ బల్కుచుఁ
దనవగు పద్యముల్ వినయతత్పరతన్ బఠియించె నౌనన
మనమున శారదన్ దితిజమర్దను రాఘవు వేడు నీ గతిన్. 138

సీ. పురుషుల వలపించు మోహన రూపమ్ము మన్మథ జనకత్వ మహిమఁ జెప్పు
ఘన వైరిజనుల మన్ననఁ గన్న శౌర్యమ్ము జిష్ణుసోదర పరిస్థితులఁ బల్కు
మునిపత్నినే పూత నొనరించు పాదమ్ము జాహ్నవీజనకుని జాడఁ దెలుపు
నా మహాదేవున కారాధ్యనామమ్ము తగ పరబ్రహ్మతత్త్వము వచించు.

తే. ఘనుఁడు రత్నాకరుఁడె భక్తిఁ గాళ్ళు గడుగు టరయ లక్ష్మీపతిత్వ భాగ్యమ్ముఁ జాటు
సతిని సీత నగ్నిపరీక్ష సల్పు టద్ది వర సనాతనధర్మరూపతను నుడువు. 139

క. రామా ! రఘుకులజలనిధిసోమా ! సోమక సురారి సూదన భీమా !
భీమాగ్రజాతనుత పదతామరస ! రసస్వరూప ! దర్శన మీవే ! 140

తే. సరస సంగీత సాహితీ స్తనవిలాస భాస ! భాషామతల్లి ! యో పాలవెల్లి !
గహన శాస్త్రీయ విజ్ఞాన కల్పవల్లి ! దర్శన మొసంగవే శారదమ్మతల్లి ! 141

సీ. సదసద్వివేక సంపదల కాస్పదమైన గ్రంథపాణిన్ ధర్మసింధు వొసఁగి
యిందిరా సుందరీ మందిర మ్మగు పద్మ హస్తమ్ముతో నభీష్టార్థ మొసఁగి
మారకుమార శృంగారార్వ మగు కీరకరముతో వాంఛితకామ మొసఁగి
చపలతా వ్యపనయ జ్ఞపతపోనిరతాక్షదామబాహన్ మోక్షధామ మొసఁగి

తే. పుస్తకాంబుజ శుకదామ హస్తవితతిఁ బూరుషార్థమ్ము లొసఁగి యపూర్వ కరుణ
రక్షసేయవె వాక్సుధారసము లొనఁగి పద్మభవ చతుశ్చతురాస్యపద్మనిలయ ! 142

క. అనుచున్ దన యిలవేల్పుల నినకులభూషణుని వాణి నెంతయు నిష్ఠన్
ఘనభక్తియుక్తి నెపు డిటు కొనియాడుచుఁ దపమొనర్చుఁ గొమరుఁడు కూర్మిన్. 143

క. తెలతెలవాఱకముందే చలినీళ్ళన్ మునిఁగివచ్చు సంధ్యాజపముల్
సలుపును నిజవర్తనములఁ దలిదండ్రుల నగ్రజన్ముఁ ధలలూఁపించున్. 144

తే. జనని శాసనమ్మును శిరసావహించి పోతనకవీంద్రుఁ డొకనాఁడు పొలము కేఁగ
వరిని గోఁతవట్టిన కూలివారిఁ గాంచి యిటుల వచియించె నుత్సాహ మెసక మెసఁగ.

ఉ. ఈ పదియైదు మేల్మిపన లింటికిఁ దెమ్మనె నమ్మ, బండిపై
మోపులుగట్టి పెట్టవలె, ముత్తెపుగుత్తుల నేలు పచ్చిప్రా
ల్గాఁపుచు నగ్నిపై నడుకు లం బడఁగొట్టిన చింతయాకులై
తోఁపఁగ సాగు నాల్కనిడు తోడనె కప్రిమటుల్ కరంగుచున్. 146

ఉ. తీపగు సానికాటుకలె తెమ్మని చెప్పెను గొంచుఁబోనిచోఁ
గోపపడున్ గదే యనుచు గోష్ఠములోఁ గల బండి లాగి యా
మోపులు బెట్టి కట్టి యొక మూరెఁడు పొద్దు వెలుంగుచుండఁగా
నే పయనించె మేల్పసిఁడి విగ్గుల నీను పొలాలఁ గాంచుచున్. 147

చ. బడిబడి గూండ్లకేఁగు ఖగ పంక్తులు సస్యము లూఁగఁ జేలపైఁ
బడియెను మంచెపైఁ గృషిక బాలిక పేరుఁగఁ వైచికొన్న యా
యొడిసెలఁ దీసి యందు శిల నుంచి గిరాగిర త్రిప్పి శక్తిమై
విడిచెఁ బెరిల్లుమంచు నడువీథిఁ బ్రతిధ్వనులీను కేకలన్. 148

ఉ. సారసమిత్రుఁ డారయుచు సంతపియింపఁ దివమ్మునం దిటుల్
నీరజకాంత స్వీయ రమణీయముఖాశ్రిత భృంగసంగతిన్
జారిణియై చరించు నని స్వాంకయుతాస్యత వెక్కిరించు నా
కైరవమిత్రునిం గన మొగమ్ములు మాడిచెఁ బుండరీకముల్. 149

ఉ. తోయజపాణి మ్రొద్దు తన తూర్పు దిశాంగన వీడి కూడె నా
చాయమగండు పశ్చిమదిశాసతి నా యమ యిల్లు పైఁడి యై
పోయె నభమ్ము కుంకుమల పూజ నొనర్చుచుఁ బూలహారముల్
వేయఁగసాగె నోలి నడువీథుల నేఁగు బలాకపంక్తులన్. 150

ఉ. హాయిగ మందమారుత విహారము లొప్పె దిశాంగణమ్ములన్
బోయెడు పిల్లఁగ్రోవి సుతిబోయుచు నాగసౌరమ్ము బాడ లేఁ
బ్రాయపు గొత్తెపిల్ల మెడపట్టెడగంటల వెంటనంట నం
బా ! యని లేఁగటాలు స్తనభారముతోఁ బరువెత్తు నిండ్లకున్. 151

ఆ. కొసరి యొడి నింపు కూలిగింజలతోడఁ బరిటమఱుఁగు లేని వయసుతోడ
రిత్త బువ్వదుత్త నెత్తిపై నిడి యింటి కరుగుఁ గాఁపువారి యాఁడుఁబడుచు. 152

ఆ. గొత్తెమంద గోల గొల్లనియాలయుఁ, బసుల కాలిధూళి విసరణంబు
మంచెవారికేక మందకుక్కల ఢాక ప్రతినదించు గ్రామపరిసరముల. 153

ఉ. ఊఁ రిఁకఁ గొంతదూరమున నున్నదనన్ జెవి మ్రోఁగసాగె నా
దారవి గంటమ్రోఁత ధ్వనియా దెసకున్ బరికించిచూచె నా
దూరములోనఁ బెల్లెగయు ధూళి గనంబడె బండియేదొ యీ
దారిని వచ్చుచున్న దని దానిఁ గనుంగొన నెంచె నంతలో. 154

క. వీక్షించె సుకవి జితఫణి పక్షీంద్రగతిప్రవాహ పదవేగ విలా
సోక్షము ధూళీవృతాంతరిక్ష ప్రచ్ఛన్నరూపరేఖాక్షమ్మున్. 155

ఉ. ఉరగములట్లు వాలముల నుప్పరవీథిని నిల్పి తెచ్చి మూఁ
పురముల నుంచుచున్ హరిణపోతములట్లు చతుష్ఖురంబు లం
బరమున నాడఁ దద్గతికి బండియు నుయ్యెల లూఁగ నందికే
శ్వరులయి విక్రమించి యట వచ్చుచునుండెను యుగ్యయుగ్మమున్. 156

సీ. హరునిపేరురము నా నలరారు ముఖసీమఁ బసతాళిక్కు ఫణులయి పెనఁగులాడ
రజతంపుఁదొడవులన్ రాజిల్లు శృంగమ్ము లందాల శశిమౌళి నమ్ముబోయ
లింగాకృతిన్ మూఁపునం గుల్కు కకుదమ్ము హరవాహనత్వ మస్వర్థపఱుప
శృంగారగంగాతరంగాయితము సాస్న శివచీర కుచ్చెళ్ళ జిలుఁగు లల్లఁ

తే. పక్రిక్క లెగఁబోయ బుసకొట్టు ఫణు లనంగ
గమనమొనరించు హిమవన్నగంబు లనఁగ
నురువుల వెలార్చు క్షీరాబ్ధి తరఁగ లనఁగ
వచ్చెఁ జౌదంతు లన ననడ్వాహయుగళి. 157

క. చకచక గిత్తల కదముకు తక్రికిట ధికిట ధకిబి ధా మృదంగధ్వని టక్
టికు మను కేదారాహతి నికటతటిని శకట మొకటి నిల్చినయంతన్. 158

చ. రథివలె గోశతాంగమున రాజిలుచున్ శరదాస్థ పూర్ణిమా
తిథి వెలుఁగొందు చందురుని తీరులు గేరు కళాపరిపూర్ణు 'నీ
పథ మెటు వోవు' నంచు మృదు పండితవాక్కులఁ బల్కరించు త
త్పృథులమతిన్ బృహస్పతి కవిప్రతి నారసి చేరి మ్రొక్కుచున్. 159

చ. 'ఎచట భవన్నివాస ? మిటు లెచ్చట కేఁగుట లో మహాత్మ ! తా
మిచటికి నేఁడు వచ్చుట ల దెచ్చటనుండి ? కుటుంబయుక్త మి
ట్లిచటికి వచ్చినంత గమియించెను ప్రొద్దు రచింపనుండె మీ
సుచరిత మామకీన శ్రుతి శుక్తిపుటాల హిమాభిషేకమున్. 160

క. అనుటయు 'విను మిపు డీవే నను దెలిసెద' వనుచు భావనామయవిశ్వ
మ్మునఁ జేరి పోతనను బాలమును గని యాశుగతిఁ బద్యమును గూర్చె నిటుల్ 161

సీ. 'ధాత్రియై సస్యనంతానమ్ము నొడిగట్టి జీవన స్తన్యమ్ముఁ జేపి కుడిపి
లలిఁ గాడ్పు తూఁగుటుయ్యేలలోన నిడి యూఁపి పులుఁగుల జోలపాటల నలర్చి
వెలిచట్ల గడ్డిబొమ్మల గోవుపుత్తెలఁ బెనుగూర్మితో నాడుకొనుట కిచ్చి
పుట్టుటాదిగ నెందుఁ బోనీక తలఁదాల్చి దినమొక్క చాయగాఁ బెనిచి యింట

తే. నాడు బిడ్డను రైతున కప్పగించె బండిపై నిడికొని పోవుచుండె నతఁడు
సాగనంపఁగాఁ గాల్రాక చదికిలఁబడి యిల నెఱియవాయుఁగడుపు చెక్కలగు' ననిన.

క. అలఘుమతిఁ బోతనార్యుం డలికతల న్యస్త హస్తుఁడై యుత్సుకతన్
భళిరే ! సత్కవి వని యిటు వలికెన్ సుధలొలుకు మధురభాషణ మొప్పన్. 163

సీ. 'మహి న స్తమింపని మార్తాండబింబమ్ము క్షయ మెఱుంగని పూర్ణచంద్రముండు
విలయమ్ము నందని విశ్వమ్మునకు స్రష్ట యక్షరలక్ష్మికి నాత్మవిభుఁడు

అంతరాత్మను దానమాడించు స్వర్గంగ కాలవాహినిఁ గెల్చు ఘనవిజేత
కమ్మని రసమిచ్చు కరఁగని కలకండ జనుషాంధు నాత్మదర్శక ముకురము

తే. దేవ మానవ స్థావర తిర్యగాళి సమత నిజకావ్యకృత పర్ణశాల నుంచి
యక్షరామరపదవుల నందఁజేయు వరదుఁడె కవీంద్రుఁ డన వేయి వాక్కు లేల ?' 164

తే. 'ఓ మహాకవీంద్రా ! కొంచె ముండుఁ !' డనుచుఁ
బోతకవి గంటమును గమ్మపొత్తమూని
యపుడె తత్కవిప్రోక్త పద్యమును వ్రాసె
నతులి తైకసంధా గ్రాహ్యమతి వెలుంగ. 165

క. అది గని సుకవీంద్రుం డనె 'నెది వ్రాయుచునుంటి విట్టులి మ్మే దర్శిం
చెద' నంచు దానిఁ గన్గొని 'యిది నా పద్యమ్మె' యనుచు నింకొక కమ్మన్. 166

ఆ. తిరుగవైచి దాన వఱలెడి సత్పద్య రత్నములను గాంచి 'రచనసల్పి
రెవ' రటంచుఁ బల్క 'నే' నని వినయము మూర్తిగొన్నయట్లు మ్రొక్కి నిలిచె. 167

క. నిలిచిన కొమరుని పేరూరులు కులగోత్రములు రంగురూపులు మర్యా
దలు చదువు లాస్తిపాస్తులు తెలిసికొనం దొడఁగె శ్రద్ధ దీపింప నొగిన్. 168

క. ఊరుం బేరు నిటు కులాచారవిచారముల వంశసంబంధము లెం
దారసి నిజసోదరి నొకసారి కనుంగొని సుకవి విచారించు నెదో. 169

మ. వెఱఁగౌ నీ వినయాతిరేకమును నీ విద్యా వివేకమ్ము లా
వరణీ యాంగజరూప వైభవము నవ్యాజ స్వభావమ్ము లా
దరణీయమ్ములు లోక మంతకును విద్వద్వంద్యుఁడౌ నీతఁ డే
పరమోత్కృష్ట మహాపురాణకృతి నిర్మాణార్థమై పుట్టెనో ! 170

చ. స్మరశరహారసన్నిభసమానరమాకలితార్థయుక్తితో
సురుచిర సుందరోన్నత విశుద్ధ మహాద్భుత భావశక్తితో
నిరుపమ కావ్యవాణి యితనిన్ వరియించుట వీన నుందు రా
హరియు హరుండు వాగ్వరుఁడు నైక్యవిధాకృతి వ్యాసరూపతన్. 171

ఉ. 'మాటలమాటలన్ జనెడిమాటయె విస్మృతిగొంటి నిట్టులే
సూటిగఁ బాలకుర్తి కెది చొప్పగు ? నింకను నప్పురంబు ని
చ్చోటున కెంతదూరమునఁ జొప్పడుఁ జెప్పెదవే' యటన్న నా
మాటల కడ్డువచ్చుచు నమాత్యకుమారుఁ డిటాడె నర్మిలిన్. 172

శా. పొంత మ్మేఁగెను బ్రొద్దు పొల్కరికికై చౌకోసు లేఁగన్ దగున్
కాంతారాధ్వము సౌరభేయము లతిక్లాంతస్థితిన్ జెందె ముం

దెంతో దూరము లేదు మాపురము తా మేతెంచి యీరేయి వి
శ్రాంతిన్ బొంది పునీతమున్ సలుపుఁ డస్మద్గేహమున్ దేశికా ! 173

మ. ఘనుఁ డస్మజ్జనకుండు కేసనసమాఖ్యాకుండు శ్రీవారి ద
ర్శనసౌభాగ్యము లబ్బ నుబ్బిపడు యుష్మత్కావ్యపీయూష పా
వనసారస్యముఁ గ్రోలి వ్రాలును భవత్పాదారవిందమ్ములం
దనఘా ! మీదగు రాక మా కిపుడు కల్యాణప్రదం బెంతయున్. 174

చ. భవశత పుణ్యపుంజ పరిపాకవశమ్మునఁ గాగ జ్ఞానవై
భవజితధాతయున్ సరసవాఙ్మయలౌకికనేత యైన స
త్కవివరు దర్శన మ్మెటులు గల్గు నటంచు వచించు పోతనన్
బ్రవిమలచిత్తుఁడై కనుచుఁ బల్కెను దత్కవిశేఖరుం డిటుల్. 175

ఉ. హాటకనిష్క వస్త్ర మణిహార గజాశ్వరథాగ్రహారముల్
కోటి యొసంగనేని యొనగూడదు ని న్గనినంత తృప్తి నీ
మాటను దాఁటలేను చన మానసమొప్పదు నా నివాస మి
ప్పాఁట భవన్నివేశమునఁ బొల్పెసలారుట నా యదృష్టమే. 176

వ. అని కవినాథుండైన శ్రీనాథుండు పోతన గుణరూపంబులంగాంచి యిట్లెంచఁ దొండగె.

సీ. ఈ కళానిధిఁ గాంచి లోకమ్మ కిడు తల్లి వెలఁదియే ధరఁ బాలవెల్లి గాక
యీ కుమారుని జన్మమిచ్చిన పితరుండు నరుఁ డౌనె చంద్రశేఖరుఁడు గాక
యీ కృతిం గన్నట్టి యే దేశమేని దేశమ్మె విజ్ఞానకోశమ్ము గాక
యీ కావ్యరత్నాల నింపారు మృదుభాష భాషయే వాగ్వధూభూష గాక

తే. యితని సాహచర్యమ్మున నేఁగినట్టి వేళవేళయే యానందడోల గాక
యీ కవీశుండు దా వసియించు నాలయమ్ము నిమ్మౌనె పుణ్యతీర్థమ్ముగాక. 178

క. అనుచున్ దనశకటము పోతనబండికి వెంటవెంటఁ దరలించుచు న
ల్లనఁ జనిచని బమ్మెరపురమునకున్ జనె సుకవి యంత మునిమాపయ్యెన్. 179

ఉ. బండిని డిగ్గి పోతన గభాలునఁ లోనికిఁ బోయి తండ్రికిన్
దండముపెట్టి నిర్భరముదమ్ము నదమ్మయి గుండె నిండుచున్
గండయుగాన హాసగతి గంతులువెట్టఁగఁ 'బండితుండు మ
ద్దండకవీశ్వరుం డొకఁడు తా నరుదెంచె' నటంచు బల్కినన్. 180

క. తనయుని పల్కులు విని కేసన మనమున సంతసించి 'సరె ! వారిని వేఁ
గొనివత్తు లోని' కనుచున్ జనియె నెదుర్కొనఁగ వినయ సంభ్రమ మతియై. 181

క. ఎదురుసని కవిని గని సమ్మద మొదవఁగ నతని పాదముల కెరఁగి యనెన్
'సదయత మీ రరుదెంచుట సదనమ్మె పవిత్రమయ్యె సాహిత్యనిధీ !

క. నేఁడే కృష్ణాష్టమి, యీనాఁడే శ్రీరామనవమి నాభాగ్య మ్మీ
నాఁడే దీపావళి యొనగూడెన్ దమరాకవలనఁ గులము తరించెన్.' 183

క. అని పాదప్రక్షాళనమునకై నీరొసఁగి నమ్రమూర్ధ స్మేరా
ననుఁడై సవినయగతిఁ ద్రోవను జూపుచు నింటిలోని వాకిలి పంచన్. 184

తే. అమరిచిన శిల్పయుత సుందరాగ్రపీఠిపైన వేంచేయుఁ డనుచును బల్కి యల్లై
యాఁడువారిని లోనికిఁ దోడుకొనుచునేఁగఁ దనభార్య లక్కమ నెదురుపంచె. 185

క. 'తలిదండ్రులు తొలినోఁచిన ఫల మీరూపమునఁ దాను ఫలియించె నహో!
వెలగట్టలేదు లోకము తెలుఁగుంభారతికి మంచిదినములు వచ్చెన్. 186

క. ఏ మీగ్రామము సాలగ్రామమువలెఁ బూజనీయగతి విలసిల్లున్
ఏ మీనామము విన్నఁ బ్రణామమ్మునుజేయు జగ' మనన్ విని యతఁడున్. 187

క. పలుకులఁ దేనియ లొలుకఁగ నలికతలన్యస్త ముకుళహస్తతలుండై
నిలిచిన వృద్ధునిఁ గని దరిఁ బిలుచుచు నిజపార్శ్వనిహితపీఠస్థితుఁగన్. 188

క. 'ఈరీతిఁగ మీర లనాకారితునకు నా కొనర్చు గౌరవ ఘనస
త్కారములు ముగ్ధునొనరిఁచె నోరే రా దేమి బదులు నుడువఁగవలెనో! 189

క. శ్రీలీను కొండవీటినృపాలుర సంస్థానకవిని, వాసస్థలమో
కాలపటము కావ్యకలా శ్రీలలనారాధకుఁడను శ్రీనాథు' ననన్. 190

తే. 'ఎట్టెటూ మీరు శ్రీనాథులేమి నాదు దేహమును గేహమును బవిత్రతము లయ్యె
జన్మ తరియించె విద్వదౌషధప్రసిద్ధిఁ గాంచు శృంగారనైషధకర్త లౌర! 191

సీ. సంసారకూపార సంచార నౌకాప్రగతి కరిత్రమ్ము పండితమతమ్ము
అజ్ఞానవిపినమధ్యస్థ పాంథజనమ్ము చన రాచబాట దోషజ్ఞుమాట
ధనమదాంధీభూత జననేత్ర తిమిరసంహారకాంజనము ప్రాజ్ఞాచరణము
మమతాబలాసురోన్మథనక్రియా వజ్రదర్పణ మ్మార్యసందర్శనమ్ము

తే. అఖిల మానవ లోక కల్యాణదాత వివిధ విజ్ఞాన వాఙ్మయ విశ్వనేత
యవని కవితావిపశ్చితుం డపరధాత లోకపూజ్యుం డతం డొక నాక కాక. 192

శా. శ్రీమందాకిని లోకపావని ప్రజాక్షేమార్థమై స్వేచ్ఛగా
హైమాద్రి న్వెస వీడి సాగరవరాహ్వానమ్మునన్ బోవ మ
ధ్యేమార్గస్థవినమ్రవేతన తరూద్దీప్తిన్ బ్రసాదించు న
ట్లే మీ యాత్రల మా కయత్నముగఁ గూడెన్ వాంఛితార్థ మ్మిటుల్. 193

ఆ. ఎచటినుండి రాక? యెచటి కిల్లేఁగుట? తెలియఁజెప్పఁగలరె దివ్యచరిత!
మీఁదు రాకపోక మీకోసమేగాక మాకు శుభద' మను నమాత్యు నరసి. 194

శా. కాశీనాథు భజించి నిస్తులప్రయాగక్షేత్రరాజంపు వా
రాశిఁ దేహము ముంచి భక్తిని గయాశ్రాద్ధమ్ము గావించి పి
త్రాశీర్వాదముఁ గాంచ హాయన మొకం డైపోయె నీ యేఁటనో
శ్రీశైలేశునిఁ జూచివచ్చితిమి యీ సీమాంచిత క్షేత్రముల్. 195

ఆ. కొలనుపాక నోరుగలు సహస్రస్తంభదివ్యమందిరముల దేవతలను
జూచి పాలకురికి సోమన విభవంబుఁ గాంచ నిట్టు లేఁగుదెంచితి' నన. 196

తే. 'అనఘ! దీర్ఘప్రయాణమ్ము లాచరించి
యలసితిరి కోష్ణజలముల జలకమాడి
వార్చి భుజియించి బడలికఁ దీర్చుకొనుఁడి'
యనియెఁ గేసనార్యుఁడు 'వల్లె' యనియె సుకవి. 197

శా. తానా లక్కమ వారి నర్ఘ్యవిధి సత్కారమ్ములం దేల్చి సం
తానం బెంతని పృచ్ఛసేయుటయు వృద్ధస్త్రీ వగన్ జ్యేష్ఠుఁ డీ
సూనుం డాదటఁ బుట్టిపోయిరి ఋణస్థుల్నల్వు రంతంపుఁజాల్
దీనిం గంటి నటంచుఁ బల్కె ముదము ద్దీపింపఁగన్ మోమునన్. 198

క. అంతట నిల్లేఁడు రాజులు సొంతపు టొక వడుగొ పెండ్లి సోబనమొయనన్
గంతులిడుచుఁ జిటుకలపై సంతసమున నెల్ల పనులు సలిపిరి కడఁకన్. 199

క. నానాన్న రుచిరభోజన పానీయాపూపభక్ష్య పరికల్పిత క
ల్పానోకహమై యొప్పె మహానసగృహసీమ యెల్ల నాసమయమునన్. 200

తే. వెండిపూవుల పీఁటలు వేసె నొక్కఁ డరఁటియాకుల విస్తరుల్ పఱచె నొకఁడు
రజతపాత్రిల నుంచె నీరమ్ము లొకఁడు సూపమును వడ్డన మొనర్చె సూదుఁడొకఁడు.

క. హైయంగవీనమును గడు తీయని పెరుఁ గపుడె తోడుదీసి విడిదిలో
వీయాలవారలకువలె వేయాఱుల వంటకముల విందు నొనర్చెన్. 202

తే. ఆదరణతోనె భుజియించినట్టులయ్యె నడుగఁ బనిలేదు వలయు పదార్థవితతి
యనుచు దధిఘృతక్షీరకుల్యాన్నములను 'అన్నదాతా సుఖీ భవ' యనుచుఁ దివిరి. 203

ఉ. కమ్మని కప్పురంపు నునుగంధములందు దిశాచయమ్ము తా
నమ్ములనాడ మోవి యరుణమ్మయి క్రొమ్మెఱుఁగెక్కఁ జక్కఁగాఁ
దమ్ముల మాస్వదించి సుఖదమ్మగు పాన్పులలోఁ గుటుంబ యు
క్తమ్ము పరుండె వేఱ తమకై సవరించిన మేల్పవంతిలోన్. 204

ఉ. ఎల్లరు గాఢనిద్ర వసియించెడువేళఁ గవీంద్రుఁ డల్లవన్
దల్లిని బిల్చి పోతన విధంబును, జక్కదనాలచుక్కయౌ

చెల్లెలితీరు, వంగడపుఁ జెల్వముఁ, బెద్దల చిత్తవర్తనం
బిల్లును బట్టు లన్ని యొకయింత విమర్శయొనర్చి యిట్లనున్ 205

సీ. చిన్నవానినిఁ గన్న నన్నమ్మ దినకున్నఁ గడుపు నిండినయట్లు నెడఁద వొంగు
మాటమన్ననఁ జూడ మనుజుఁడా యీ ప్రోడ దేవతయా యను భావ మొదవు
కన్నియ కగువాఁడు కలసె నీడుంజోడు జానకీశ్రీరామచంద్రు లనఁగ
ధనధాన్యముల రెచ్చి తాండవించును లచ్చి పాలనుజూడ వ్రేపల్లెవాడ

తే. వంశమర్యాదలకుఁ బల్కుఁ బనియెలేదు చదువులం దేరి బుద్ధియు సాటిరాదు
కనులపండువు సేయు నీ కాఁపురమ్ము సేయుటన నోఁచుకొన్నట్టి చెలువ సొమ్ము. 206

శా. సంబంధమ్మున వంక లేదొకటి యే సందేహ మీయూరర
ణ్యంబుల్ కొండలు ద్రివ్వివోసికొని యే యైదాఱునాళ్ళో ప్రియా
ణంబుౙ జేసినఁగాని చేరకొన మన్నా ! యింతద వ్వీయ సా
ధ్యం బెట్లౌనని యైన నాకొక యుపాయం బాత్మలోఁ దోఁచెడిన్. 207

తే. సరసుఁడగు సింగభూపుఁ డీ సరసలోన రాచకొండఁ బాలించు సర్వజ్ఞుఁ డతఁడు
అతని యాస్థానకవి నయి యనవరతము నిటకు వచ్చుచున్ బోదు నీయిష్ట మేమి ? 208

సీ. ముదుకఁడన్ నాకండ్లముందు గావలె నంచుఁ బసిపాప కొనరించు పరిణయమ్ము
దాఁపుననుండు నా తనయ నాకని యెంచి తనయూరి ఖలునకుఁ దార్చు పెండ్లి
నావైపుబంధువుల్ నావారు వీరని యపురుషార్థికి నిచ్చు నుపయమమ్ము
ధనవంతుఁ డనియెంచి మనుమరాలికి తాత కొనఁగూర్చు వైవాహికోత్సవమ్ము

తే. తన యభీష్టపూరణముకై తనయ నలరు లలిత రూపయౌవనసత్త్వములను బలిగఁ
గొనెడి ప్రేమాతిశయ మనుకూలశత్రువిధిఁ బరఁగు సస్యహతి నతివృష్టిభాతి. 209

తే. పిల్లప్రియమును గోరును బితరు లెందు హితముఁ గోరుదు రివి రెండు జతపడునెడ
సౌరభాన్వితమై యొప్పు స్వర్ణమట్లు ధరఁ బ్రశంసార్హమగును దత్పరిణయమ్ము. 210

తే. రూప యౌవన వంశానురూపవృత్తవిత్త విద్యాదులన్ గ్రాలు నుత్తముండు
వరుఁ డయినఁ బుత్రికాభీష్ట మరయకుండఁ బెండ్లి నొనరింపవచ్చును బితరు లనుచు.

వ. మజ్జనకుండు తలచు వచియించెడువాడన. 212

చ. తనయునిపల్కు లెల్ల విని తా నిటులాడెను వృద్ధమాత 'నీ
జనకుఁడు గేహభారమును సాంతము నీ పయి నుంచిపోయె నీ
వును గడు బుద్ధిశాలి వెది పోఁటినొ దాని నొనర్పు మెందు నీ
వనునది కాదుకూడదని యంటినె యిద్దియె నా యభీష్టమున్. 213

చ. తన యనుకూల మెంచి యొరు ధాత్రిని మోసమొనర్పరా దనన్
దనయనుగూర్చి వంచన మెదన్ దలపోయఁగ న్యాయమౌనొకో!'
యనుచు వచించు మాతృహృదయాభిమతమ్ము నెఱింగి మానస
మ్మునఁ గవిరాజు తృప్తిగొని మోదగతిన్ విదురించె నా నిశిన్. 214

క. వఱువాత మేలుకొని యవసరముల ముగియించి స్నానసంధ్యాజపముల్
సరి దీర్చి సుకవి యల్లన నరిగెను సాకాంక్షఁ గేసనామాత్యుఁ గనన్. 215

తే. ఏఁగుదెంచెడి కవిరాజు కెదురు నడచి కేసనామాత్యుఁ డాదృతిన్ గేలుమోడ్చి
పఱచియున్నట్టి రత్నకంబళముఁజూపి 'యిటులు దయచేయుఁ' దని వచియించి భక్తి.

ఉ. 'శ్రీకరమై మహీజనవశీకరమై రమణీయభావ ర
త్నాకరమై రసోల్బణసుధార్ణవ తుంగతరంగశీకరా
సీకసువృష్టియై కురియు నీ కవనమ్ము కళాధనమ్ము మా
కో కవిరాజరాజ! భవదుక్తమహాకృతి నైషధావనిన్. 217

క. సుమనశ్శేఖర! యుంచుక శ్రమయీయఁగ నెంచినాఁడ క్షమియింపవలెన్
దమ వాగమృతముఁ గ్రోలఁగఁ దమి గల' దన సుకవి పల్కె దరహాసముతోన్. 218

క. 'భ్రమరాభుల సరసులఁ గని యమితోత్సాహమ్ము మెఱయ హసియించుచు వా
గమృతము నర్పించుట లోక శ్రమమే సుమనస్సులకును సౌజన్యనిధీ! 218

క. కవులన నింతటి ప్రేమము భువి నెవరికినైనఁ గలదె పూజ్యచరిత్రా!
కవికులతిలకుఁడు పోతన భవదాత్మజుఁ డగుట కిదియె పరమార్థమ్మో!' 220

క. అనుచున్ గవిమాహాత్మ్యమ్మునె యాఱుగతిన్ కవీంద్రముఖ్యుఁడు పద్యా
శివి గూర్చుచు నిజకవితాఘనతలఁ జెప్పకయె చెప్పఁగాఁ దొడఁగె నిటుల్. 221

ఉ. మండిత సత్కలాగగన మందిరుఁడున్ రసమానసాబ్జమి
త్రుండును నౌ మహాకవివరుం డగు సెట్టి తపఃఫలమ్మొ చీ!
దండుగ తక్క విద్దెలు వృథా ప్రభుతల్ తమరంధ్రయుక్త మృ
ద్భాండజలమ్ము జీవనము పాదరసమ్ములు సొమ్ము లిమ్మహిన్. 222

చ. ఇలఁ గడు సున్నితంబు కవిహృద్గతి నైజకలావిలాసమం
జులమధురాన్వయా ప్రకృతిసుందరి నిందిరఁ జేసి చారుకో
మలహృదయారవిందసుమమందిరమం దిడి మ్రొక్కు నాయమన్
మలినమొనర్చు చేష్ట లణుమాత్రమునన్ సహియింపఁ డాత్మలోన్. 223

సీ. చీఁకటితెరలను జించి ప్రకాశించు నక్షత్ర మా కవినాథు ప్రతిభ
జ్మొఖండ మలమి విశ్రాంతిఁ గానక యాడు నుదధివీచులు కవియూహ లెల్ల

నొకసారె జగమునన్ బ్రకటితమ్మై వెల్గు మేఘఘోషణ కవిమిత్రు సూక్తి
యెంతఁగా మున్గిన నంతుజిక్కఁగనీని రత్నాకరము కవిరాజుగుండె

తే. మూఁడులోకమ్ములన్ జుట్టుముట్టి వచ్చి వెడలు త్రిపథగ సుకవి కవిత్వధార
రేఁబవలు లోకమంతకుఁ ద్రోవఁ జూప సోమసూర్యులు కవివరు చూడ్కు లవని. 224

సీ. బరిగంటమనె కేలఁ బట్టెనా గడియలో ముల్లోకములు పదమ్ముల నడంగు
నేకాగ్రితాయోగ మేర్పడఁ గన్నెత్తి చూచెనా ప్రతిసృష్టి లేచి నిల్చు
భావనాబలవిజృంభణ బొమల్మడిచెనా కాలచక్రమునె వెన్కకు మఱల్చు
ధీమంథమున రసాబ్ధి మథించి యమృతమ్ము చిల్కెనా విశ్వసంజీవి మొలచు

తే. కలమధురగీతి స్వర్ణదుల్ కరఁగిపాఱు
విచ్చు భావాళిసురలతో ముచ్చటాడు
కలుకు గంటంపుమొనఁ గల్పకము చిగుర్చుఁ
గవిహృదయసీమ నెపుడు స్వర్గములు వలచు. 225

క. ఉత్తమకవితాలేఖన చిత్త మ్మెల్లరకు సురక చిక్కునె కూర్పన్
విత్తమ్మా ? నేరిచికొన బొత్తమ్మా ? పూర్వజన్మపుణ్యము గాకన్.' 226

తే. అనుచు నిజ నిసర్గ నిరర్గళామృతరస భాసురాపూర్వ కవితాప్రవాహధార
భవ్య భారతీ రమణీయ పదసరోజ జీవనమ్మనఁ బ్రవహింపఁజేసె నంత. 227

క. శ్రీనాథుని కవితాధుని తానా కేసనముఖాబ్జ దరహాసకళా
శ్రీని వికసింపఁజేయ మహానందముతోఁ 'గవీ ! జోహా' రనె నతఁడున్. 228

క. ముదితాత్ముని గేసనఁ గని యిదె యదనని మానసమున నెంచి కళాకో
విదుఁ డుచితజ్ఞుఁడు సత్కవి పదపడి యిటు పల్కెఁ జతురభాషణ మొప్పన్. 229

సీ. 'కనకాభిషేకమ్ము గావించె మత్కావ్యభార్గవిం బరికించి ప్రౌఢుఁ డొకఁడు
రత్నాంబరముల నర్చనసేసె మామక వాక్సతిన్ గని వీరవరుఁ డొకండు
హేమపాత్రల విందులిడె నస్మదీయ సత్కవితాంగన కమాత్యఘనుఁ డొకండు
కస్తూరితోఁ జల్లెఁ గలయంపి నాదు భారతి యింటి మును తెన్గురాయఁ డొకఁడు

తే. ఆ మహారాణి నావాణి యర్థివోలెఁ జేయిచాఁచి నిన్నొకటి యాచింప వచ్చె
నామె కోరికఁ దీర్చు భాగ్యమ్ము వడసి నీదు వంశప్రతిష్ఠలు నిల్పుకొనుము. 230

చ. అన విని కేసనార్యుఁ డిటు లాడెను 'మీ రమణీయ వాణికిన్
జనపతు లెల్ల నూడిగము సల్పిరి నేనన నెంత యా కుచే
లుని గని ప్రేమ తండులవిలోపము గాంచిన శ్రీదుఁ డీ యకిం
చనున కమూల్యభాగ్యము నొసంగఁగ వచ్చెనొకో యనన్ జనున్. 231

తే. తమకిదె తను మనః ప్రాణ ధనము లన్ని ధారవోతు నీశ్వరు నాన ధరణిపైన
నాది యనియెడి దంతయు మీదె' యనిన నాత్మ సుప్రాంగి శ్రీనాథుఁ డనియె నిట్లు. 232

క. తలపోయుదు నెమ్మనమున లలితవయోరూప సుగుణ లావణ్యను నా
చెలియలి మీ పోతన కత్యలఘుమతికి నొసఁగి పరిణయం బొనరింపన్.' 233

చ. అనుటయుఁ గేసరాజు హృదయమ్మున నింగికిఁ బొంగి తారలన్
గని స్పృశియించి మేఘపరికల్పిత తల్పములన్ శయించి స్వ
ర్ధునులను నీఁదులాడి పరితుష్టినిఁగూడి 'శుభస్య శీఘ్ర' మం
చు నుడివెఁ జూచుచుండఁగనె చుక్కల నంటెడి భాగ్యరేఖలన్. 234

ఉ. ఇక్కరణి న్వచించి హసియించెడి కేసనఁ గాంచినంతనే
యక్కవిరాజరాజు వదనాబ్జము పక్కన నవ్వె నవ్వుతోఁ
జెక్కిన బొమ్మలో నొకట జీవనముల్ బడె నొక్కసారెయ
బ్బక్క యఁటంచు నేరా తలయందలి భారము దించినట్టులై. 235

తే. 'అరయ రాశిద్వయమ్ము నేకాధిపత్య గతిఁ జెలంగుచు బహుగుణోన్నతి వెలుంగు
లక్షణాన్వితమ్మగు శుభలగ్న మొకటి యీవధూవరులకు నిశ్చయింతు' ననియె. 236

ఉ. ఇప్పగిదిన్ వచించెను గవీంద్రుఁడు కేసన సంతస మ్మిఁకన్
జెప్పఁదరమ్మగా దెపుడొ చేవ నశించిన యౌవనమ్ము తాఁ
జప్పున వచ్చి చేర నెద చక్కిలిగింతలు వెట్టె 'పెండ్లి మీ
రెప్పు డొనర్తు మన్న నపు డేనును సిద్ధ' మఁటంచు వాకొనెన్. 237

క. శ్రీనాథున కే పనులును నీ నా యనకుండ జరుగు నిముసములోనన్
శ్రీనాథుండును విద్యా శ్రీనాథుం డితఁడు వేఱె చెప్పఁగనేలా ?

క. పెండిలి యనఁగనె పోతన గుండెలలోఁ దపము మాట కోమలి రూ
పోద్దండసుమాయుధు వేఁటయు రెండంచుల కత్తికోఁతరీతిఁ గలంచెన్. 239

తే. తండ్రి కెదురాడ నోడుచుఁ దరుణిరూప సరససంపదన్ గూడుచు స్వాంతమందు
శ్రీరఘూత్తము వేడుచుఁ జివరికెటులొ సిద్ధపడెఁ బోతనయుఁ బెండ్లి సేసికొనఁగ. 240

సీ. ఆనందరమ మంగళాశాస దక్షత పాణియై నవమండపమ్ము లమరె
సంతోషపద్మినీ సార్ద్రకటాక్ష వీక్షణములై పచ్చతోరణము లొప్పె
సమ్మోద లక్ష్మీప్రసన్న హాసప్రభా ధవళమై సున్నంపు తళుకు లొలసె
హర్షేందిరా నూపురాంగద కంకణ క్వాణమై శుభవాద్య గణము మొరసెఁ

తే. గౌతుకశ్రీపదాలక్తకమ్ము లగుచుఁ గూటదేహళిన్ బసుపుకుంకుమలు మెఱసెఁ
బ్రమద భార్గవీ విశ్వరూపమ్ముగాఁగ నగుమొగమ్ముల బంధుమండలి రహించె. 241

క. తఱి నొక నిశిని ముహూర్త మ్మరుదెంచెను వధువు కొదవె నభ్యంగనముల్
పరిణయవేదికిఁ గొనిరా వరున కెదురుసనిరి రాజవైభవములతో. 242

సీ. అభ్యంగనపుఁ బచ్చి యార్చుపెన్నెరులలో శృంగారవార్ధి తరంగ మడరఁ
చెక్కు-లం దగరుపు చుక్క-లు చిగురాకుతములమ్ముల న్లవంగములుఁ బొదుఁగ
మృగనాభి పెండ్లిబొట్టుఁగ దిద్దుమోమునన్దవనిఁ బూర్ణమృగాంకుఁడవ తరింప
బసుపు పారాణి సొంపెసఁగు పాదాలలో లలితరసాలశాఖలు చిగుర్ప

తే. లేమ తారుణ్య నందనారామసీమఁ గంతుఁ డెద పొంగ బంగారు బంతులాడ
సకియ సౌందర్య దివ్యనిర్ఝరుల యందుఁ బ్రేక్షకాక్షి ద్విజిహ్మనముల్ పెనఁగులాడ. 243

తే. తమిని సానపీఁటన నుంచుఁ దములపాకు లందు దుర్గామహాదేవి నధివసింపఁ
జేసి యక్షతలును బూలు వేసి ప్రార్థనాంజలి ఘటించి మాంగల్య మడుగుకొనెడి. 244

క. కన్నియ నారసి యన్నులమిన్నలు మన్ననలొనర్చి మించును లగ్నం
బున్నట్లు విన్న కొనిరమ్మన్నాఁడు పురోధ యనిన నతివకు లజ్జన్. 245

తే. కన్నులను వెన్నెలలు గాసెఁ గలికి సొగసు నవ్వుల న్మల్లియలు బూచె నాణ్యమైన
గొంతులోఁ గోకిలలుగూసెఁ గొసరి కొసరి నడల రాజహంసలు కాళ్ళఁబడుచు డాసె.

క. అడుగుల నడుగు లిడుచు నిరుగడలం దైదువులు గొల్వఁ గన్యక వచ్చెన్
విడివడి వేదసరస్వతి నడిపందిట గజ్జెగట్టి నాట్యమొనర్చెన్. 447

సీ. మణిభూషణోపేత మహితబంధువ్రాత మమలరత్నాకరం బగుచు నెగడఁ
దెరపట మ్మల కామధేనువై తలసూపి వాంఛిత మ్మొసఁగి యవ్వలకుఁ దొలఁగఁ
గంజాత సముదిత కమలావధూటియై పొలగంప న్స్నాత్నవధువు పొదల
నెలవంక నేల రవ్వలముక్కరయు వధూదరహాసములకు సోదరత నెఱపఁ

తే. పొగ సెల్లాలు శేషాహిభావ మూన స్వమధుపర్కమ్ము పీతాంబరముగ నమర
నడరు క్షీరార్ణవ నికేతనుఁ డనఁ బుడమి వరలు నారాయణాంశుఁడౌ వరుని దరిసి. 448

తే. పూజ్యగతి మహాసంకల్పపూర్వకముగ ధారవోసె సాలంకృతన్ దన యనుజను
అఖిల గో భూ హిరణ్య దానాదు లొసఁగి నాదు భాగ్య మటంచు శ్రీనాథ సుకవి. 449

క. సుముహూర్త మరసి విప్రోత్తము లెల్ల 'సులగ్నసావధాన' యఁటంచున్
దమి మంగళాష్టకవ్రాతముఁ జదువుచుఁ దలల నక్షతలు జల్లిరొగిన్. 450

క. మట్టెలు మంగళసూత్రము ముట్టుఁ డనుచు భూసురులును ముత్తైదువలున్
ముట్టఁగ వాద్యము లలరఁగఁ గట్టించిరి వధువు వరునికై కట్టువడెన్. 451

చ. నిజముగ నీమె లక్ష్మి యని నిర్ణయముం బొనరించి స్వర్ణమే
బుజబుజ జుట్టి వచ్చి తల పొట్టినఁ బెట్టుచు తాళిరూపమై

విజితవిధానఁ గట్టువడి వ్రేలఁగఁ జుక్కల నాడుచున్న యా
రజతము కాళ్ళవ్రేళ్ళఁబడి రాదెటు నెట్టన చుట్టు మట్టెలై. 252

తే. ఆల్మగలు ప్రాలు పోసికొం డనిరి వధువు వరుని శిరమందమిన్ నిల్పె వరుఁడు నిల్పె
బాఱు లెత్తిపోయగ సిగ్గుపడెను వధువు అపుడు వరునిదె పైచేయి యగుచు నొప్పె. 253

క. ప్రాలో వేణిని మెఱపుల చాలో చూపులఁ బ్రసూనచయవర్షాలో
బాలిక నవ్వుల రా ల్ముత్యాలో మోదాబ్ధి శీకరాంబుశ్రీలో. 254

క. లీలఁగ సేసల దోసిలి పూలశరము లనఁగ ముంచి పోయుచు వానిన్
దేలుచు మున్గుచు సరిపంతాలను నెఱపిరి స్వబంధుతతి హర్షింపన్. 255

ఉ. నాతిని గూడి పోతనయు నవ్వుమొగమ్ము వివాహవేదికన్
జ్యోతి వెలుంగఁజేయఁ బరిశుద్ధమనస్కత సన్నెద్రొక్కి సం
జాతదృఢానురాగమతి సాప్తపదీనము నాచరించుచున్
'నాతి చరామి' యంచుఁ బ్రతినం బొనరించెను వహ్నిసాక్షిగన్. 256

చ. ప్రతిసరసూత్ర బద్ధ నిజపాణిపరిగ్రహణ ప్రసన్నుఁడౌ
పతి వెనువెంట బాల మధుపర్కపటాంచల గ్రంథిబంధనో
ద్ధతి సవరించుకొంచుఁ గనుదమ్ములఁ గప్పు లలామకంబు నం
చితగతి నోరఁద్రోయుచును జేసెఁ గృశాను ప్రదక్షిణక్రియల్. 257

క. సీతారాముల వలె నా నాతియుఁ బోతనయుఁ జిటికెనలు గైకొనుచున్
జేతోముదమున నారంజోతికి జోతలిడి రా పసుపు బట్టలతో. 258

శా. కస్తూరీతిలకాంచితాస్యరుచి రాకాచంద్రబింబాకృతిన్
నిస్తేజమ్మొనరింపఁ గుంతలములన్ దీపించు దివ్యాక్షతల్
ప్రస్తామ్ర ప్రసవప్రభావిభవ విస్తారమ్ముతో వ్రాలఁగా
మస్తాగ్రమ్ముల వంచి మ్రొక్కులిడి రమ్మాన్యాళికిన్ దంపతుల్. 259

క. ఇంటి కరుదెంచి యీ పేరంటములోఁ బాల్గొనిన చిరంటీవ్రజముల్
మొంటెల వాయనముల్ గొని జంటం గని ముచ్చటగఁ బసపునలిపింపన్. 260

క. అందమగు పళ్ళెముల స్రక్చందన తాంబూల పుష్పసౌరభవారిన్
సుందర రాజతపాత్రఁ బొందుపఱచి వదినెవరుస పొసఁగఁగ వధువున్. 261

ఆ. పిలిచి పీఁటవైచి ప్రియుని కట్టెదుటనె కూర్చొనంగఁజేసి కుంకుమ మిడి
చందనమ్ము చేతి కందించి పేర్వెట్టి పిలిచి వరునికేలఁ జిలుకు మనుచు. 262

ఉ. ఏటికె పల్కవౌను వచియించిన నోటివరాలు రాలు నే
పాటియొ మామఱందలుకు పాపము ; చంటిది యింక చక్కఁగా

మాటలురావు నేర్పవలె మౌనముఁబూనుట లెంతకాల మీ
పూట భుజింపలేదనుచుఁ బువ్వుల రువ్విరి నర్మభాషలన్. 263

క. పలుకుటకు మొగము లేకయు నలుగురిఁ దలయెత్తి సరిఁ గనంజాలకయున్
వలపించు ముగ్ధచేష్టలఁ దలవంపులు బొంది సిగ్గు తానే గెల్చెన్. 264

ఆ. పజ్జ నిలిచి జనని 'భయమేలనే తల్లి ! నంగు లేల ? పోతనకవిరాజ !
చేయి నొసఁగుఁ డనుచుఁ జెప్పవే వదినెలున్ బేరు చెప్పి నట్టి వారె' యనిన. 265

క. అరుణారుణ బింబోదయ కిరణాయిత నవరసాల కిసలయ శోభా
కరమగు నధరపు మఱుఁగునఁ బరభృతములు కూసె ననఁగ భామిని నుడివెన్. 266

క. 'పోతన కవిరాజా ! కుడిచేతి నొసఁగుఁ' డనుచు నొకట శ్రీగంధమ్మున్
జేతఁగొని చర్చ చేయుచు భీతిని దరినున్నవారి వీక్షించు తఱిన్. 267

చ. అధరపుటాంచలమ్ములను నట్టిటు దాఁగురుమూతఁలాడు స
మ్మదమయ హాస చంద్రిముఖ మండలశోభఁ దరంగిత త్రపాం
బుధులను నీఁదులాడు స్మర మోహన కేతన నేత్రమీనముల్
సుధలను బంచి పోయ నొగి చూపరవాల్చుచుఁ జూపఱం గనన్. 268

క. పసుపును బారాణిం గొని బిసరుహమృదుపాణి నలఁదెఁ బ్రియుపదముల కీ
పసుపుఁ జెయికి నీరనె పతి వసనమునకుఁ దుడువు మనుచు వనితలు నవ్వన్. 269

ఉ. దండకుఁ జేరఁగోరు కయిదండలకున్ దగువేళగామి పూ
దండకుఁ బ్రీతినిధ్యవరదాన మొసంగి నవీనదంపతుల్
దండలు వేసికొందు రఱుత న్మరుపాశము లట్టు లొండొరుల్
గుండియ లిచ్చుకొందు రతి గుప్తగతిన్ విరిచెండ్ల రూపతన్. 270

క. వీఁకన్ లగ్నము స్థాలీ పాకమ్ము సదస్సు నాకబలి దీరుట ల
స్తోకానురక్తి వింతఁగ సాకిన సుత నప్పగించు సమయము వచ్చెన్. 271

సీ. తనయను గౌఁగిఁట దార్చుచు జనని యౌదల మూర్కొనుచు వీఁపు కలయ నిమిరి
యుప్పొంగివచ్చు దుఃఖోర్మి మత్తడిదూఁక నెన్నఁడు ననువీడి యెఱుఁగ దనుచుఁ
గంటి నేనాఁడొ యత్తింటి సొమ్మిద్ది మా యింటనుండిన దని యెంతు ననుచుఁ
గవ్వంబులన్ బెట్టి కడుపులో నెవ్వరో చల్లచేయుదురు నా యుల్లమనుచు

తే. కుడుమనన్ బండుగను వట్టి గోల యనుచుఁ గాంచి ప్రాణమెత్తుగఁ బెంచి కన్నకడుపు
నీ చెయిం బెట్టితిమి పాలనేని ముంచు నీటనే ముంచు భారమ్ము నీదె యనుచు. 272

తే. ఆత్మజం గని యత్తింటి యఖిలబంధు
మండలికి నోట నాల్కవై మగని కెపుడు

నంగిలోని బొందియవగు చణఁగిమణఁగి
పొసఁగి మనుమమ్మ! శుభముగఁ బోయిరమ్మ! 273

క. అనుచున్ బోతన కేలన్ దనయన్ దగనుంచి గుండె తఱుగుకొనన్ బెన్
వనటన్ జెందెడి తల్లిని గని కూఁతురు కనుల బాష్పగంగలు దొరలెన్. 274

క. వంతం జెందెడి సుతఁ గని చెంతంగొని కనులు దుడిచి చెక్కులపై వ్రాల్
కుంతలములు సవరించుచుఁ జింతిల వల దనుచు బిడ్డ చిబుకము ముట్టన్. 275

క. ఎంతటివారికి గుండెల నింతింతనరాని దుఃఖ మేఱులు బాఱెన్
సంతోషసమయ మయ్యున్ జింతాజడమయ్యె నచటి చేతన మెల్లన్. 276

క. ఆదట శ్రీనాథుం డును సోదరిఁ దరిదీసి కడుపు చుమ్మలు చుట్టన్
'మేదిని సోదరుఁడే చనె నాదు పితయె యుండె ననుకొనఁగదవె యంబా! 277

ఉ. దూర మొసంగినాఁడ నని దూరకు మమ్మరో! నీ మగండు బం
గారము నీదు పుణ్యము లగణ్యములై ఫలియించె నీగతిన్
గూరిమి గల్గియున్న మనకుంగల దూరమె చేరువౌను గూ
పారహృదంతరాళ మెడఁబాయునె సోముఁడు వ్యోమవర్తియై. 278

ఉ. ధారుణి స్త్రీజనమ్ము తలఁ దాల్చెడి సూనవితాన మెందుమన్
హారమునందుఁ జేరుకొన నాదిని సూదిమొగంపు ముద్దు స్వీ
కార మొనర్పఁగావలెను గష్టము నిష్ఠుర మంచు నెంచకే
దారము నందుఁ గట్టుబడి తామెలఁగన్ వలె సుమ్ము సోదరీ! 279

ఉ. శీలవతీసతీ! సుకవి శేఖరు నీ ప్రియుఁగూడి యాడి ము
ప్పూలును నాఱుగాయలయి పొల్చెడిసంపద లింపు నింపఁగన్
బాలలతో ఫలించి చనుబాలను దానములాడి పాడవే
జోలల డోలికారవము సొంపులు వీణియ గోట మీటఁగన్. 280

సీ. అంబికాసతియట్టు లాత్మేశ్వరున కెప్పు డర్ధాంగివై ప్రేమ నలరుచుండి
వాణీసతివిధమ్ము ప్రాణవల్లభునోట నాలుకవై కూర్మిఁ గ్రాలుచుండి
శ్రీకాంతయట్టులు నీకాంతు హృదయమ్ముఁ దమి నాక్రమించి నిత్యము వసించి
పూతగంగాసతీ పుణ్యవర్తనమట్లు నాథుండు తలఁదాల్ప నడచుకొనుచుఁ

తే. బ్రియుని దనుమనోవాక్య త్రికరణములను నెలమి స్వాధీనమొనరించి యెంతొభక్తి
యతిథి గురుబంధుజన పూజ లాచరించి మించి యుభయవంశము లుద్ధరించవమ్మ. 281

## ఆశ్వాసాంతము

క. నానాస్త్ర శస్త్రవిద్యా జ్ఞానానుభవ ప్రవీణ ! కౌశికమఖ సం
త్రాణ ! సుబాహు మదేభ ప్రాణాంతక నృహరి నఖర బాణకృపాణా! 282

శా. శ్రీమన్మన్మథ మన్మథాయిత కలాసించన్ముఖేందీవర
శ్యామా ! భానుకులామృతాంబుధి మన స్సౌగంధిక ప్రోల్లస
త్సోమా ! దైవకలాభిరామ ! రిపుసంస్తుత్యాద్భుత స్థేమ ! శ్రీ
రామా ! దైత్యవిరామ ! సద్గుణగణారామా ! యశఃపూరమా ! 283

భుజంగప్రయాతము

మహీజాముఖాంభోజ మత్తద్విరేఫా !
మహర్ష్యంతరంగాబ్జ మార్తాండదీపా !
అహల్యాఘదావానలాంభస్స్వరూపా !
సహస్రాక్షదుర్దాంత శౌర్యప్రతాపా ! 284

గద్యము

శ్రీమద్భరద్వాజగోత్ర పవిత్రాపస్తంబసూత్ర, ప్రథిత సూరిజనమిత్ర, బక్కయ్యశాస్త్రిపుత్ర
వాగేశ్వరీ సమాసాదిత, వైదేహీవర నివేదిత సరసకవితావిలాస, సహజ
పాండిత్యభాస, వరకవి విధేయ, 'వరదార్య నామధేయ ప్రణీతం
బైన పోతన చరిత్రమను మహాప్రబంధమ్మునందు
ద్వితీయాశ్వాసము.



శ్రీ ర స్తు.

శ్రీ వాగీశ్వర్యై నమః




## తపోభంగము — మల్లన జననము

"ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి"

శ్రీకర కమలార్చిత నవ
కోకనదారుణ మనోజ్ఞ కోమల చరణా!
సాకేతపుర విహరణా!
కైకేయీ వర నిరుక్త కార్యాచరణా! 1

తే. రససుధాసరోవర మతిరమ్యతరము ఆంధ్రి శృంగారరుచిరము ప్రహ్లాదకరము
అవధరింపుము శ్రీపోతనార్య చరిత మహితకరుణాలవాల! రామనరపాల! 2

తే. వేదమూర్తులు జ్యోతిషుల్ విప్రు లెందు శాస్త్రవిధి నిర్ణయించిన సన్ముహూర్త
కాలమున స్నుషాసుతుల నొక్కటి యొనర్ప నెంచి తత్ప్రయత్నమ్ము గావించు జనని. 4

మ. పితరుల్ శోభనసన్ముహూర్తమునఁ గప్పింపన్ నవీనాంబర
ప్రతతిన్ బేర మొనర్చుటల్ ముసలి యవ్వల్ జవ్వనుల్ వారలం
జతఁగూర్పన్ వెర వెంచుటల్ గదికి మేల్పొరుల్ మిటారించుటల్
ప్రతికూలించె కవీంద్రు డిద్ది స్వతపోభంగాకృతిన్ దాల్చుటల్. 5

తే. చేయుచున్నట్టి యీ తపస్సిద్ధిగామి నే గృహస్థజీవనమును నెఱప ననుచుఁ
బెద్దవారితో నెటు విన్నవించువాఁడ నంచుఁ బోతనార్యుం డెద నెంచు నిటులు. 6

శా. 'తా నా సంయమి మంత్రరాజ మనుసంధానమ్ము గావింపు మం
చానాఁ దేల యొసంగెనో తపము రెం డాఱేండ్లు నిష్ఠామతిన్
బూనంగావలె నంచుఁ దెల్పె నది సంపూర్ణంబుగాలేదు న
న్నీనాఁ డేగతి రక్షసేసెదవొ బ్రాహ్మీ! జ్ఞానసంధాయినీ! 7

క. పదునొకఁడేఁడులు గడచెను దుద కొక వత్సరము గలదు తొరపడ జన ది
య్యద నెటులో త్రోసిపుచ్చెదఁ దదుపరి హరి గలఁ దఁటంచు దలపోయు నిటుల్. 8

తే. పితరుల మనమ్ము నేల నొప్పింపవలయు నరుగుదును నేఁడు శయనమందిరమునకును
నందు వ్రతదీక్ష భంగమునందకుండ సంచరింతును నియమిత స్వాంతవృత్తి. 9

తే. ఇంతిపజ్ఞ మున్న యేకాంతమున ఋశ్యశృంగునకును శృంగభంగ మగును
మాదృశులనుగూర్చి మాటాడనేటికి శివునిగెల్చు మదను నెవఁ డదల్చు. 10

చ. తరుణి యనంగకేతుముఖ దర్పిత మీన మనోజ్ఞనేత్రి సుం
దర వదనేందు సించిత సుధామధురోజ్జ్వల మందహాస బం
ధుర రుచిరాలకాకులిత ఫాలత్రపాగుణశీల యొంటి నా
చరి వసియింప నీ తప మితఃపర మేగతి నిర్వహింతునో? 11

మ. సతతమ్మున్ లలనావయోవిలసనాస్వాదైక కాంక్షచర
న్మతి తాఁ బోరు నొనర్పసాగె నిటు లస్మద్బ్రహ్మచర్యానఘ
వ్రతదీక్షారతితోడ నిట్టి యసిధారామార్గమం దెట్లు న
న్గృతకృత్యుం బొనరింతువో సురనుతాంఘ్రీ! తల్లి! వాగీశ్వరీ!' 12

ఆ. అనుచు భావనమ్ము నొనరించి పోతన నాఁటిరేయి తల్లిమాట దాఁట
భయముఁజెంది యెట్లొ శయనమందిరమున కరిగెఁగాని మనసు కరఁగదయ్యె. 13

క. తారల శశి యన మౌక్తికహారములో నాయకమణి యగునన సతి శృం
గారపు సార మ్మన బంగారపుఁ గీర మ్మనంగ గరితలు గొలువన్. 14

చ. భయ మొకవైపునన్ బ్రణయభావము వేఱొకవైపునన్ మిల
న్నయనవిలోకనద్యుతుల నాట్య మొనర్పఁగ వెన్క నెవ్వరో
చెయివిడి త్రోసినట్లు పతిఁజేరుట లెప్పటి కన్నయట్లు పా
దయుగము సంశయాత్మక పథమ్ములనాఁగుచు నేగ నింతియున్. 15

చ. చెలులను వీడలేక సరిచేడెల మోములు జూడలేకయున్
జెలియలికట్టు దాఁట దరి జేరుటలోఁ గృషిభంగమందు పే
రలలవిధమ్మునన్ మనమునం దుదయించిన ప్రేమభావపున్
వలపులు వ్రీడఁ గూడ తలవంపులు వొందఁగ సుందరాస్యయై. 16

ఉ. కాంతునిఁజేరి గుప్తగతి కౌతిక మేఱులుఱాఱ వృద్ధలౌ
యింతుల బల్కి నెట్లొ హృదయేశు నెడందను చందనమ్ము నా
క్కింత యలంది పుష్పాదుల నించుక చల్లి త్రిపాతరంగిణీ
క్రాంతముఖాబ్జయౌచుఁ బతికంఠమునన్ సుమహార ముంచుచున్. 17

ఉ. కంతుశర మ్మిదే యనఁగఁ గామిని సుస్మితకాంతి కమ్మపూ
బంతి నురమ్మునన్ విసరి పాణిని గప్రపు వీడ్య మిచ్చి నా
స్వాంత మొకింత మారదని సాక్ష్యమొసంగు వరాననమ్ము వి
భ్రాంతిని గాంచి యేలనని భావనమున్ బొనరించు నాత్మలో. 18

ఉ. అక్కడి స్త్రీలు వారిఁ గని హాస్యములాడుచు నేవొ గోప్యముల్
మక్కువఁ జెప్పికొంచు నడుమన్ నగు నోళుల వ్రేళ్ళఁ గప్పికొం
చొక్కొకరింట నేదొ పని యున్నదటన్న మిషన్ గమించిరే
నొక్కతె నైతినంచు దిగులొందుఁ బ్రమోదమునొందు నామెయున్. 19

క. పొత్తముఁ గొని చదువుచుఁ దన చిత్తము సతి నుండి తొలఁగఁజేయుచు నన్యా
యత్త మ్మొనరుచుఁ బోతన సత్తప నిర్వహణబుద్ధి సందీపింపన్. 20

క. ఉలుకఁడు పలుకఁడు 'రమ్మో లలనా!' యని యాదరించి లాలింపఁడు, గం
టలకొలఁది చిత్తరువుక్రియ నిలిచినది నిలిచినయట్లె నిలిచెన్ సతియున్. 21

క. సతియై చెలువమ్మునకున్ గతియై జవ్వనము పొంగు గంగాప్రతియై
రతియై సాక్షాత్కృతినిడఁ బతియై గనుగొనఁ డిదేమి పాపమొ యతఁడున్. 22

ఆ. చేతమందు లజ్జ భీతి రేకెత్తింప బజ్జకరిగి పదముఁ బట్ట వెఱచు
సిగ్గు వెనుక కీడ్వఁ జెలి నెందు ప్రేమంపుఁ గాంక్ష ముందు నెట్టఁ గలఁతఁజెందు. 23

తే. వంచినట్టి మోమెత్తి స్వవదన మొకఁట గాంచకున్నట్టి పతిచేత వంచితయగు
తన్వి కాభరణములు బంధనము లయ్యె భరముఁగా దోఁచె నూతనాంబరము కరము. 24

తే. పంజరములోనఁ గ్రొత్తఁగాఁ బట్టి తెచ్చినట్టి శుకరంభ నెంతయొ నాదరింప
ముద్దుముచ్చటల్ నెఱపున వద్దఁ జేరి యనుచుఁ కవిరాజు తలఁవఁడు మనమునందు. 25

క. పెనిమిటి గ్రంథమును బఠించిన వేళల నిలిచి నిదురఁజెంద నతఁడు బ
జ్జ నలరు నొకచదరం బడుకొని యామెయు వగలఁబొగిలి కుందు నెడందన్. 26

ఆ. ఎన్నఁ డెఱుఁగనట్టి యేకాంతవాసమ్ము దొరికెననుచు నెడఁద మురిసియాడు
నాత్మవిభుఁడు పిల్చి యనురాగ భాషలఁ బల్కరింపఁడనుచు బాధఁజెందు. 27

ఉ. పోతన మేల్కొనన్ నిదురవోయినదానివలెన్ నటించుఁ దా
నాతఁడు నిద్రవోవుతఱి నక్షుల సాంతము నొప్పగించి వృ

ధ్వీతల వాసమున్ మఱచి వేమరు నాథుని గాంచి కన్నులన్
స్వాతిపయఃకణమ్ము లొగి జాలిగొనన్ దడుపున్ దలాడలన్. 28

చ. ఫణి మఱచేతి కబ్బినటు భావన సేయుచు నేమి యేమియో
తెలియని స్వర్గసీమలను దేవతయై విహరించునంతనే
కల లివి యంచు భావపథకత్రిదివమ్ములు నేలఁగూల వి
హ్వలమతి నాస జావని నిరాశలఁ గ్రుంగి కృశించు శయ్యపై. 29

ఆ. కనుల ముందు సెజ్జఁ గనఁబడు నాథుండు చనఁగరాని దూరమున వసించెఁ
జేతి దర్పణమునఁ జెలువారు శశిబింబ మందరానిచోట నలరు నటులు. 30

ఆ. ఉండలేదు పడక నుండకపోలేదు కంటకములఁ బొరలు కరణి వరలు
నపరిపూర్ణఘటము నందుండి తొణకాడు జీవనాథమయ్యె జీవనమ్ము. 31

తే. కళ లుడుగునట్టి శశితోడఁ గలువకంటి వెల్లబాఱిన మోముతోఁ దెల్లవాఱె
నిది యొకటెకాక మువ్మాపు లిటులె యేగెఁ బడఁతి యెదఁ జెప్పఁగారాని బాధఁ గ్రాఁగె.

ఆ. ముట్టుకొనకముందె మోముమాడుచుఁ బూలు చందనమ్ము పాత్రలందె యింకుఁ
బడకటింటి యువతి యెడఁద తానేమౌనొ తెల్లవోదు రాండ్రు తెల్లవాఱు. 33

వ. అంత నయ్యూరి రచ్చమ్రానులకడ చవుకులలో. 34

క. ఇన్నాళ్ళటి బోతనగాఁ డన్నడకయె మాఱె బుద్ధి యచ్చము పదియా
ర్వన్నెపసిండియె మూర్తిం జిన్నయ్యను గీర్తి నెన్న క్షితి మిన్న యగున్. 35

ఉ. ఉన్నటుఁదోఁచ దూర నతఁ డొక్కని జోలికిఁ బోఁడు బీదనున్
జిన్నతనమ్ముగాఁ బరిహసింపఁడు లేచి తలంచికొన్న నా
డన్నము పుట్టుఁ బుత్రుఁగనినట్టి సుదంపతు లెన్ని జన్మముల్
పున్నెముజేసిరో సుగుణ భూతనికేతను బోతనార్యునిన్. 36

తే. తండ్రి యెత్తు కుమారుఁడై తండ్రికెదురు నిలిచి మాటాడియెఱుఁగఁడు పిలిచినఁ జను
జనినఁ గంటఁ గన్గల్పికొంచఁడు శిరమ్ము వంచి యడిగిన వఱకె తా బదు లొసంగు. 37

ఆ. అనుచు చిన్న పెద్దలందరు గుమిగూడి పోతనార్య సుగుణపుంజములను
జెప్పుకొనగఁ జెరువుచెంత బావులకడ నతివ లతనిచర్య లన్ని యెరిఁగి. 38

క. అన్నిపరెగాని యాతని కున్న యవగుణ మ్మిదొకటె యొకపరి భార్యన్
గన్నెత్తియైనఁ గనఁ డిల్లెన్నాళ్ళని పెండ్లమెదిగి యింట వసించున్. 39

ఆ. ముక్కుమూసికొనుచు మూలఁ గూర్చొనఁగోరు దపసితోఁ డతండు తరుణి యామె
ముందుతాను హృదయమం దేమితలఁచునో దైవ మెఱుఁగు నీవిధమ్మదేమొః 40

వ. అనుచు నాడిపోసికొనుచుందురు. 41

క. అంతనొక క్రొత్తచెలి కవికాంతన్ గనవచ్చి సుతులు గల రెందఱనఁ
చెంతంగల లక్కమ మొగఁ మింతై తలవ్రాల నూర్పులెసఁగఁగ వగచెన్. 42

తే. 'పట్టుమని పదినాళులు పడుచుఁదనపు ముద్దుముచ్చట లొక యింత ముగియకుండఁ
జంటిపిల్ల వెంటనె యొక దంటపిల్ల కాలఁ జేత వ్రేలాడఁగా నేలయనుచు. 43

ఆ. ఏల వంత యీమె కేమంత యీడేగెఁ గాన్పుగలుగ దినము గలదు ముందు
సంతుగల్గి చంకచాలైన మాకేమి యిత్తు' వనుచు ధైర్యమిచ్చు నామె. 44

క. సంతాన మింట వెలయన్ గాంతునె నా కట్టి భాగ్యగతి యబ్బునె యో
యింతీ! యని లక్కమ కడుచింతన్ బాష్పముల పరిటచెఱఁగున్ దడిపెన్. 45

తే. అంతఁగొంతకాల మ్మిటు లరుగువెన్క లక్కమాంబయుఁ దనగృహలక్ష్మియైన
కోడలును సఖీజనము సీగోడు దెల్పు మనుట వినుచుండె వేఱొకయబ్బనుండి. 46

చ. తనువులు పైకిఁ గాంచుటకుఁ దామిటు వేఱుగఁ దోఁచుచుండియున్
మన మొకటై వెలుంగు ఘనమైత్రిఁ జెలంగెడి స్త్రీల బేల యో
ర్తను నిటు 'నన్నుఁ జంపుకొని నట్లె నిజమ్మును జెప్పవేని నీ
వనఁ బ్రియుఁ డేటికే విముఖుఁ డౌ' నన నింకొక ప్రౌఢ యిట్లనున్. 47

ఉ. 'ఏయదొ కల్గఁజేసికొని యేగి సపర్య లొనర్తువే కడుం
దీయఁగఁ బల్కరింతువె యెదేని మిషంగొని వశ్యఁజేయఁగా
వేయి విధానముల్ గలవు వీనిని నే సతి విప్పిచెప్పఁ దా
నాయన యోగియన్నఁ గన నంత కమాయికురాలి వీ'వనన్. 48

క. ఆనాతియు లజ్జాభారానతవదనాబ్జ యగుచు నతిచంచలదృక్
సూనములు హృదయవాసన లీన నఖవిచేష్టలలర నిటులని పలుకున్. 49

సీ. 'వేఁడినీటిని దోఁడి వీఁపురాఁతు నఁటన్న మునిప్రొద్దె కోనేట మునిఁగివచ్చు
బడకవైచి యొకింతఁ బదముఁబట్టెద నన్నఁ బండఁబోవుమ జేనిపజ్జ కెపుడు
మందలించెద నొక్కమా ఱింటిలోననఁ బుస్తకమ్ములతోనె ప్రొద్దుబుచ్చు
భుజియించుపిదపఁ దాంబూలమిత్తు మఁటన్న వ్రతవిఘ్న యని దాని పదలివైచు

తే. మన మలర మాటలాడుద మనుకొనినను నొంటిగా నుండనేయుండ రింటనెపుడు
పత్య హేతుకసత్కృపాబలము లేక యేమి సేయంగలుగు నాఁడదింతకన్న? 50

తే. కిసలయ మనోజ్ఞ రాగ దృగ్విసర ముడిగి కుసుమ సుస్మితవాసనల్ గుప్తమగుటఁ
జెన్ను దఱఁగిన నాలతాశ్రీకుమారి నగును మాధవుఁగూడి యేనాఁటికైన.' 51

క. అన విని చెలు లెద నిటు సీరొనరుచు నీ చరిత లింక నుమయే నీపై
నెనరుఁగనవలెనె వా రేమనఁగల రీ విషయమునఁ బ్రియా యని యనుచున్. 52

మ. 'ధృతివిశ్వాసకృషిక్షమావిధులు సాధ్వీ కార్యసంసిద్ధికై
యతిముఖ్యాంగము లాత్మశాంతి కివె మూలాధారముల్ భావి ను
న్నతి జేకూరునఁటన్నయాస బ్రతుకున్ నవ్వించు దానిన్ విడన్
మృతియే నెంజిలి రూపమూని వడిఁ బ్రాణిం బట్టి భక్షింపదే. 53

చ. సతతము కాల మొక్కటులు సాగదు జీవితమం దెవారికిన్
గుతుకము కొన్నినాళ్ళు వెత కొన్నిదినమ్ములు బేల! యేల యీ
గతి విలపించుచుంటి' వనఁగా, విను పల్కుల లక్కమాంబకున్
మతిచెడినంతయై యపుడె మందిరమున్ విడఁ గోర్కె యేర్పడెన్. 54

వ. అంతఁ గొన్ని దినంబులకు. 55

ఉ. పూతచరిత్ర లక్కమయుఁ బుణ్యుఁడు కేసనమంత్రి యాత్రలన్
జేతుమఁటంచు నొక్కతఱి సిద్ధపడం దమి వారివెంటఁ గే
లూఁతగఁ దిప్పనార్యుఁడు స్వయోషయుఁ దానుఁ బ్రియాణమై చనెన్
గోఁతకువచ్చెఁ జేలనుచుఁ గూరిమితమ్ముని నింటిలో నిడెన్. 56

చ. చనిచని చేలఁ గష్టపడి చయ్యన నింటికివచ్చినంత భో
జనమిడ నీదు భార్యయును సద్మమునందె వసించునింక నే
మను' దన యన్న కప్పు దెదురాడఁగ నోడెనుగాని పోతరా
జున కది నచ్చదయ్యె నెటు సొంపక 'మంచిది పోయిరం' డనెన్.  57

తే. పల్లె పొలిమేర వఱకును బండ్ల నల్ల సాగనంపి తల్లికిఁ దన జనకునకును
మ్రొక్కి 'యింక నాఁగెద' నన ముసలితల్లి పోతనను గాంచి వచియించె నీ తెఱంగు.

తే. 'గృహములో నేడఁ జూచిన గింజగిరుజు కనఁబడుచు నున్న దింట నొక్క!ర్తు పిల్ల
ఊళ్ళపై దొంగ దొర భయమున్నదనుచు వినఁబడెడి నింటనే పండుకొనుము నిశల. 59

ఆ. అనుదినమ్ము నింటఁ బనిపాటులం దోడుపడ గృహానఁ బాఁచిపని నొనర్పఁ
బాలికాఁపుతల్లి బాలాంబకు న్నేను జెప్పినాను వేఱ చింతవలదు.' 60

క. అను జనని వాక్కు విని పోతన వారిని సాగనంపి తన పొలములు చే
లును జూచుకొనుచు నల్లనఁ జని గేహముఁ జేరెఁ బ్రొద్దు జామయ్యె సరిన్. 61

తే. ఇంట నిద్ద ఱాల్మగలె వేఱెవరు లేరు క్రొత్త యొకరికొక్కరు పిల్చుకొన రెపుడును
నందు నామెకుఁ జెప్పరానంత సిగ్గు ముందెటులో యంచు నివలి స్త్రీ ల్మచ్చటింతుర్. 6

ఉ. వచ్చినయట్లు నేఁ డెటులొ వంట నొనర్చితిఁగాని వా రెటుల్
మెచ్చెదరో యెటైనను శ్రమే తినుదాఁకను భోజనార్థమై
వచ్చెదరా యఁటంచు నెటుఁ బల్కుట యేదొ భయ మ్మెడందలోఁ
జొచ్చును బల్కరింతమనుచో నని మున్వెనుకాడు నామెయున్. 63

ఉ. స్నానముఁ దీర్చి శ్రద్ధమెయి సంధ్యను వార్చి విభూతిఁ దాల్చి యీ
శానునిఁ గొల్చి తారకము శారదమంత్రము నిష్ఠతో నను
ష్ఠాన మొనర్చి కూర్చొనిన సత్కవి నారసి వెండిపళ్ళెమున్
బూనిచి లేహ్య చోష్య రస భోజ్య పదార్థము లుంచుఁ గూరిమిన్. 64

ఆ. నాతిఘృతము వడ్డనన్ జేయుచున్ బతి చాలు ననఁడటంచు చాలవంచు
స్మేరకోరకిత విచార వీక్షణముల నామెఁ గాంచు నతఁ డిదేమి యనఁగ. 65

క. కాంచిన యంతనె యా సతి నంచిత గతి సిగ్గు మొగ్గలై విరియ హస
చ్చంచలదృష్ట్యంచలములఁ గాంచు నతవిలోనఁ దాఁగు కాంక్ష లిగుర్పన్. 66

క. ఉంచు మిది యనఁ డతం డెది కంచములో లేవొ యామె కని వడ్డించున్
గించిత్తైనను నోర్మెదిలించ రపుడు మూగవారి లీల నిరువురున్. 67

ఉ. కన్నులఁ గల్పి యామె దెసఁ గాంచ డతండును శాకపాక మె
ట్లున్నది యేమి గావలయు నుంచెద మీకన నోడు నామెయున్
దిన్నపదార్థపుం రుచులు తియ్యన నుప్పన యంచుఁ బల్కఁబోఁ
డెన్నఁడు నాతఁ డిప్పగిది యేగెను గొన్నిదినంబు లిర్వురున్. 69

చ. పతి సతితోడ నేదయినఁ బల్కుటకై పని గల్గెనేని యా
సతి పతితోడ భాషణము సల్పఁగ నక్కఱ యుండెనేనిఁ దాఁ
బ్రతినిధియౌను నిద్దఱకు బాలమ యామెకె చెప్పుచుండు రే
గతియగు నామెయే నడుమ గ్రాలమి నిర్వురకంచుఁ దోఁపఁగన్. 70

ఆ. సరస వీక్షణముల దరహాసముల మూక వేషములను నర్థభాషణముల
నానఁ గొన్నినాళ్ళు నటనలఁ గొన్నాళ్ళఁ బ్రకటపఱతు రాత్మభావములను. 71

మ. ఒకనాఁ డింట బరుండు బాలమయు నత్యుత్సాహ మేపారఁగన్
సుకవిన్ గాంచి యిటుల్ వచించెను 'ప్రభూ! చూలాలు నా యేకపు
త్రిక నీళ్ళాడెను నేఁడు పండుకొన రాత్రి న్నేను రాజాల నిం
కొక యైదుం బదినాళ్ళు లింట నొకరై యుండన్వలెన్ మీరలున్.' 72

క. అనియెడు మాటలు విని పోతన మంచిది యట్లె యనుచుఁ దనపంటలఁజే
లను జూడ నరిగి సాయంతనమగుట గృహంబుఁ జేరుతఱి ద్వారమునన్. 73

క. తన కెదురుచూచు భార్యం గనుఁగొనె నామెయును నతనిఁ గనె దృగ్యుగళిన్
పెనఁగొనియాడెను మీన మిథునములు ప్రణయపరివాహతోయోద్ధతిలో. 74

క. ఎదనెదఁ బయ్యెద జాఱన్ వదలఁబడి సవరించు సుస్మితద్యుతు లూరన్
గదకంటఁ బ్రియుని గాంచు నతఁడు తను గన లజ్జఁ గన్నుదమ్ములు వ్రాలన్. 75

ఉ. కాంతుని మోముఁ గాంచఁగనె కామిని మోమున సిగ్గుదొంతరల్
దొంతరలై నటింప నగి తుఱ్ఱున లోపలి కేగె నాతఁడున్
స్వాంతముతో వచించినటు పాపడ నేనని పల్కి గ్రంథ మె
క్కింతఁ బఠించి పజ్జ రచియించిన శయ్య శయించె నంతటన్. 76

క. పెనిమిటి పాత్రమును జదివికొనెడివఱకు నడిమియింటఁ గూర్చొని సతియున్
దనకై పఱచికొనిన పక్కనఁ బడుకొనెఁ బతికి దవ్వుగా నాతిన్నెన్. 77

క. క్రోడీకృత జీవములగు నాడీతంత్రుల బిగించి నవమధుర శ్రుతుల్
గూడన్ మోహనరాగముఁ బాడె మరుఁడు తరుణి హృద్విపంచీ సీమన్. 78

క. శారద శర్వరి సురభిళ మారుత శైత్యము వివిక్త మందిరము సుధా
పూరాక్షత తారుణ్యముఁ గూరియు నిజపత్ని పొందుఁ గోర దదేమో. 79

క. మానవ దేహమె కాదో మానసమే లేదో యుండి మానిని మొగమున్
గానం డిటు కన్నెత్తియు మౌనులలో నెందు నిట్టి మానిసి గలఁడే. 80

ఉ. అండజయాన తాను చెలులందఱితో నల 'నాథుఁ డొంటిగా
నుండినఁ బల్కరింపనె ప్రియమోక్తుల'నంచు వచించె నట్లు బ్ర
హ్మాండముగాఁగ నుత్తరకుమారుని ప్రజ్ఞల నిట్టివేళ నో
గుండెలె లేవు నో రెవరొ కుట్టినయట్టుల మూఁతయే పడెన్. 81

తే. పొటమరిలనె ప్రియము తీవబోఁడు లాది నంతరంగము విప్పి మాటాడ రెందుఁ
బూఁతఁబట్టనె మును లతాముఖములందు మూతివిప్పని మొగ్గలె మొలచునట్లు. 82

శా. తేలం గన్నుల రెప్ప వేయకయె 'రేః రేః' యన్న కేకల్ నభ
శ్శాల మ్మట్టి ప్రతిధ్వనింపఁ జలిబుచ్చున్ మంటలన్ గ్రాఁగుచున్
లీలన్ జుట్టులఁ ద్రిప్పుచున్ రయితు మంచె న్నిల్చి రక్షింపఁగన్
జేలన్ జూచుచుమండఁ గోఁతలకు వచ్చెన్ నేఁడొ రేపో యనన్. 83

ఉ. అంతటిలోనె యుత్తరదిశాంగణమందుఁ దటిత్కుమారి వి
భ్రాంతిని గొల్పు క్రొమ్మెఱుఁగు బంగరు పాచిక బాఱవైచుచున్
బంతముఁబూని పోతన తపమ్ముల పంటలఁ బాడు సేయఁ గొం
దంత ప్రయత్నముల్ జరుపునంచు బయల్పడె నబ్దముల్ దివిన్. 84

ఉ. అంబలిద్రావి కావలికినై నిశిఁ జేలకుఁ బోఁదలంచుచున్
సంబళికాఁ డొకండు పెనుసందడి సేసెడి మబ్బుఁగూడు నీ
లాంబరసీమఁ గాంచి దిగులంది కవీంద్రు గృహమ్ము మున్ గవా
టంబును దట్టి పిల్చెను దటాలున వాకిలి విప్పె నాతఁడున్. 85

శా. 'గాలిన్ దేలుచు మబ్బు లెట్టెటులనో కప్పించనౌ నెల్లి యే
పోలేరమ్మకు బోనమున్ సలిపి మున్ మున్ గోఁత వట్టించుటే
మేలౌ' నంచు వచించెఁ బోతనకు 'సామీ !' యంచు కేల్మోడ్చి మి
న్నాలోకించుచుఁ బాలికాఁ డపుడు లాభాకాంక్ష లేపారఁగన్. 86

క. పోతన వానినిఁ గని 'పోచా ! తోడ్కొనిరమ్ము కూలిజనముల రేపే
కోఁతలు బొనరింతము చే లా తదుపరి ప్రభుని చిత్త'మని యిటులాడున్. 87

క. చెడఁగొట్టు వానలో యే చెడురోగమొ కృషిని మన్నుజేయు నెటు శ్రీమల్
బడ నోటికందు నొక బుక్కెడు కూడెఱుఁగ రది బొజ్జగీఱుకొను నృపుల్. 88

ఉ. పోవలె రేపు ప్రొద్దె వనభోజనముం బొనరింప నచ్చటన్
దేవళమందు వెల్గు మన దేవికి దుర్గకుఁ బూజచేసి న
ల్లావుల పాల పాయసము నట్లును బుల్గములున్ నివేదన
మ్మీవిధి సేయు టొప్పునని యింట వచింపుము యత్న మేర్పడన్. 89

తే. పాలికాఁపు కవిం గాంచి భక్తి మీఱ 'వంటసేయ బాపఁడు లేఁడె స్వామి !' యనుట
'నాడె వారెల్ల నాయనం గూడి తాము యాత్రలను జేయుటకునయి యరిగి' రనుచు. 90

సీ. కట్టకొమ్మకు తూముకాల్వ దాపట నున్న యేపెల పాయకు నెగువ నలరు
మన నూవుజెల్కలో మఱ్ఱివృక్షము నీడ వంట నొనర్పఁగా వసతిఁజేయ
దాఁపున నీళ్ళుండుఁ దేపతేప చెఱువు కట్టెక్కి దిగెడి యిక్కట్టు దొలఁగు
నొక దుర్గదేవళ మొక్కింత దూరమౌఁ గట్ట కాచివరలోఁ గ్రాలుకతన

తే. నదియు నేమంత దూరమౌ నర్చనకయి పోయివచ్చుటె కాదె యూరేయి నీవు
బండిఁ గొనివచ్చి యిచటనే పండుకొనుము చనవలెను ప్రొద్దునకు ముందె మన మచటికి.

తే. కావలికిఁ బంపు నీరటికాని నేటి కొక్కనాటికి నింటిలో నుండి నీవు
పొలికిఁ గూష్మాండ లాంగలీఫలములాది వలయు సరకుల సమకూర్పవలయు ననుచు.

క. మునురుకొనివచ్చు మబ్బులఁ గపిగొని గర్జించు నుఱుము గడగడలపడిన్
కనుబుసులాడెడి మెఱుపుల దిసలం గని యెంతొ గుండె దిగులున మండెన్. 93

శా. ఆనాఁ డింట శయించి పోతనయుఁ దా నత్యంత చింతావృత
ప్రాణుండై హరు దుఃఖ దైన్యహరునిన్ బ్రార్థించి 'సామీ ! భవా

ధీసంబైన విభూతి తావక కృపాదృష్టిన్ విభూతిప్రదం
బౌ నా దృష్టి తిరోహితంబయినఁ జేయంజాలిలిం బూదిగన్, 94

క. తను దానె కర్త యని విను గనఁజాలఁడు నీదు దయను గనఁ డజ్ఞుఁడు నీ
ఘనశక్తి లేవిచోఁ దృణమును గదలుపఁజాలమనుచు మును సుర లనరే. 95

సీ. పరిమితోద్యానమ్ము విరచించి కర్తయా మహదరణ్యస్రష్ట మఱపుదట్టుఁ
దను సరోవరకుల్య లొనరించి కర్తయా జలధినదీదాత శంకితుఁడగు
నిశ దీపకళికల న్నిర్మించి కర్తయా విధుభాను నిర్మాత విస్మృతుఁడగు
వీజనాహతి గాలి వీచుచుఁ గర్తయాఁ బ్రాణానిలవిధాత గానరాఁడు

తే. తనదు సృష్టికిఁ దను గన్నతండ్రి కర్త యాదిమానవుఁ గన్నట్టి యయ్య లేఁడు
ధరణి నొక సౌధమున్ గట్టఁ దాను కర్త ధరణి కర్తయా పరమాత్మ తలఁపురాఁడు.

ఆ. విశ్వపటముఁ జిత్రవిధిఁ జేయు విబుధుని ప్రతిభ మెచ్చి పొగడు ప్రతినరుండు
చిత్రవిశ్వ మెల్లఁ జేసెడి సర్వేశు వినుతి సేయకుండు వెఱ్ఱిగాదె. 97

ఆ. తనకు భృతినొసంగు ధనికునిఁ గని మ్రొక్కు తనకు ధనికునకును ధరణి కంత
నన్నవస్త్రములిడు హరి నెంచి మ్రొక్కఁడు దూరదృష్టిలేని దుర్ముఖుండు. 98

ఉ. బొమ్మను నమ్మి యింతకును బొమ్మ నొసంగిన యమ్మ వీడి తా
నిమ్మహి నాడుచుండు శిశు వించుక యాకలి బాధపెట్ట నా
బొమ్మను వీడి 'యమ్మ' యని బోరున నేడ్చెడిరీతి మేటిక
ష్టమ్ములు దాపురించునపు డజ్ఞుఁడు విన్గని యేడ్చు నార్తుఁడై.' 99

క. అని తలఁచి యొక్క కూరుకుఁ గొని నిద్దురలేచి 'కృష్ణ ; గోవింద !' యటం
చును బూర్వదిశ నరుణశోభను గని భగవద్గుణానుభవము నొనర్పన్. 100

క. పరువిడెడి యిరులఁ గన్గొని పరిహాసము సేయు ననఁగఁ బరువము లొప్పన్
సరసిజ ముఖమున నవ్వుచు నరుదెంచఁగ సాగెఁ బ్రత్యుషాంగన భువికిన్. 101

సీ. తరులతాగుల్మ సంతతిని బోర్కాడించి తమి సుమమ్ముల పూజనములు గాంచి
పులుఁగు సంగడికాండ్రఁ బలుకరించి యొకింతఁ దామ్రచూడస్తోత్రతతిని దనిసి
యొగి సంబరము వెల్ల మతికి యాఱఁగవైచి మలయానిలుని వీవనలను గొనుచుఁ
బ్రాగ్దిశారమణికిఁ బసుపు కుంకుమ మిచ్చి యామె చూపిన రాగ మనుభవించి,

తే. గారడి యగు చీఁకటి కనుకట్టొనర్చి మాయముం జేయు లోకమున్ మఱలఁ జూపి
వాని తెలివితేటలఁ దెల్లవాఱఁజేయ నా యుషస్సతి జగతిఁ బ్రత్యక్షమయ్యె. 102

సీ. కఱవుబాధలఁ బట్టి కడఁదోల మా కంతముల నిత్తుమని చేలు తలలు వంచెఁ
దమ పొట్టలోని యన్నము దీసి ప్రజనోటఁ బెట్టునాన్ వరి కొంతఁ బొట్ట విచ్చె

పశ్యతోహరు లట్లు బారులై చీమలు బొరియచుట్టును వడ్లగరిసెఁ గట్టె
శుకతుండముల వ్రేలు సొంపైన వరియెన్ను ముత్తెపుచుంచుల ముక్కుఁ బిదె

తే. దివిని శశిరేఖ యమృతబిందువుల నడుగ వడ్డి కొసఁగెదమని కొడవళ్ల తాము
పల్లెపడుచుల మూఁపుల పల్లకీల నెక్కివచ్చెను వరిఁగోయ నెంతొ ఠీవి. 103

క. కల్లలు కపటము లెఱుఁగని పల్లెమొగపు చూపు చేవబాఱిన యొడలుల్
తెల్లనగు వడికిన ముతుక యొల్లెల కాసెల విలాస మొప్పఁగఁ బడుచుల్. 104

ఉ. పయ్యెదచుట్టు కౌమనకు బాసటయౌ మొలనూలికట్టుతో
వియ్యమునందఁ జెక్కుఁబల వ్రేలెడి పోఁగులఁతోడ ముంగురుల్
నెయ్యముగోరి చేఁగలుప నెన్నడు మల్లలనాడఁ గూడి పా
డుయ్యెలపాటకున్ లయగ నొప్పెడి గాజుల చేతి ఘల్లులన్. 105

తే. బంతిపూలు సిగలఁ బైడికాంతు లీనఁ జేల బంతులై కొడవళ్ళఁ జేతఁ బూని
మునుము నిడి కోయసాగిరి ముచ్చటగుచునుండఁ బోతరాజిటు లాత్మ నూహ పేయు.

తే. 'ప్రాణిసేవకు బలియైన వరిపరకలఁ గాఁపుపడుచుల వికసించు కన్నుదోవలు
రైతు నవ్వులున్ బుష్పవర్షాలు గురియు దివినిఁ బక్షులు ధన్యగీతికలు బాడు. 107

తే. నాగరకుఁడు పాషాణఖండములఁ గాంచి సంస్తుతించును నవరత్నచయ మటంచు
ధరణి నవధాన్యరత్నాలు కఱవుపడిన నొక్క వజ్రముఁ దిననేల నొఱగు నేల? 108

మ. అనివార్యాతపశీతవర్షగత బాధాహారివౌ నిన్ను గాం
చనె కృష్ణార్పణమంచు నీ కయిని సస్యశ్యామలన్ భూమి నే
ఘన చిత్తమ్మది ధారవోసినదొ తత్కారుణ్యవారిన్ జనిం
చెను గంగమ్మలు వేలు కర్షక తపస్వీ! లోకమాన్యాగ్రణీ! 109

ఉ. అల్లులు వంచి మత్తిలి సుఖావిలదోలిక నూఁగు చేలలోఁ
గల్లల దోరయెన్నులవి క్ష్మాపతి శీర్షకిరీట పాళిపై
వెల్లితమిం దురాయిలను వెట్టెడి మంచెనఁ గూరుచున్న నీ
బిల్లను జూచి రాజ్యరమ పీఠము నిల్పె నచంచలాకృతిన్.' 110

ఉ. అని యిటు లూహచేయుచు మహాకవిశేఖరు డంబరాధ్వమున్
గనుగొనె నీలనీరద మొకండు చలన్మహితేంద్రనీలప
న్మణికృత పాకశాసన విమానమనన్ దివి నాడె మేల్ శరా
సనము నధిజ్యమై దివిని సంధిలఁజేసెను రత్నతోరణల్. 111

తే. ఎప్పు డొకయింత యెండక న్నెఱుఁగనట్టి మెఱపు దొరసాని మబ్బుల కురులలోన
సింగిణియును దా నొకవంక రంగులీను పూలదండఁ గీలించె నందాలు గులుక. 112

శా. ఇంతింతై వడు గింతయైనగతి మబ్బీక్షించుచున్నంతలో
నంతై యాకసమంతయై విరిసి నీలాకార మేపార నా
శాంతమ్ముల్ గ్రసియించి మించి ఘనగర్జార్భాటధాటిన్ బ్రజా
స్వాంతమ్ముల్ పెకలించె నుద్ధతి నిరాశాకంధిలో ముంచఁగన్. 113

సీ. ధూర్తనాగారూఢ దుందుభిస్వనభీతి మార్తాండబింబమ్ము మఱుఁగుసొచ్చె
గగనసంగరనట ద్ఘనతటిత్కరవాల సమితి కన్నులలోన సాము సేసె
నీలాద్రిశిఖర నంధిత వారిద శతఘ్ను లదురుదెబ్బల గుండెలందు వైచె
శక్రచాప విముక్త శరపరంపరలచే దశదిశాజాండమ్ము వశమొనర్పఁ

తే. గలుషవిషయుక్త గర్వాంధకారసార పప్పు లొాలయఁ గాదంబినీ వాహినులును
భీత దీన మానవ వివిర్భిన్న భిన్న చిత్తముల నొంప వడఁకింపఁ జేరవచ్చె. 114

తే. కర్షక విషాద నిశ్వాస ఖండతండ మేకమై చండపవను సమాకృతిఁ గొని
వీచెనన గాలితో మబ్బు విచ్చిపోవు వరపప్రజాహిత దౌర్జన్య ప్రభుత యగుచు. 115

ఉ. వచ్చెను గాలివాన కొాదవళ్ళను వేగము సాగనిండటం
చెచ్చెరికమ్ముగాఁ బలికి యింతులతోఁ బనిఁగొంచుఁ బోతరా
జచ్చటనే వసించెఁ బని లన్నము నీరనకుండ నోటికిన్
వచ్చిన యోగిర మ్మొకట వర్షహతిన్ జెడునంచు భీతుఁడై. 116

ఉ. వీరు లవిత్రహస్తులయి వ్రీహిసమంచిత సస్యమంజరీ
వార నికృన్తనమ్ము సలుపన్ బనలన్ ఖలమందుఁ జేర్పఁగన్
బూరుష కార్షికాళి తలమోయుచు వానిని గుప్పవేయుచున్
గూరుచొానంగఁ దీటికయుఁ గూడ లభింపనటుల్ శ్రమించెడిన్. 117

ఆ. ఇంతలోన సుకవి కాంత వంట నొనర్చి బోనమిడుట లెపుడొా తా నెఱుఁగక
మగని రాక కొఱకు మార్గమ్ములం గాచుచుండె జాము ప్రొద్దె యుండె నింక. 118

ఉ. ఎంతకు రాకపో వటిటు వేఁగి కనుంగొనసాగెఁ జెంగటన్
గాంతలు వెత్తిపైన వరికట్టలకుం గొాడవళ్ళఁ జెక్కి తా
మెంతయు శ్రాంతలై పసుల నిట్టటుఁ బాపుచు వచ్చుచుండి రా
యింతులఁ బృచ్ఛ సేసె భుజియింపఁగ బోతన రాని హేతువున్. 119

ఉ. అప్పుడు వార లామగువ నారసి పల్కిరి చేనికోఁతలో
నిప్పుడు నద్దమాలునెడ నింటికి వంటయె వచ్చు నెంతయో
తిప్పలఁబంచు నుత్తరపుదిక్కు మొగు ల్గని భీతుఁడై వరిన్
గుప్పనువేయుదాఁక నటఁ గూర్చొనె మమ్మును దంపె స్వామి తాన్. 120

ఉ. ప్రొద్దటినుండి నాల్కఁ నొకబొట్టు జల మ్మిడకుండ వారు మా
యొద్దనె నిల్చి కాచుకొనియుండిరి యద్దరి కట్టకొమ్ముకుం
దద్దయు వేగ నేఁగి గుడితల్లికి బోనముఁబెట్టి మిమ్ములం
బ్రొద్దుఁజెలంగ రమ్మనిరి పోతనగారును వత్తు రింతలో. 121

చ. అనిన విషాదరేఖలు నిజాననసీమ నటింప పాపరా
ధనువలె మానసమ్ము పరితాపదవాగ్నుల నొంప వంటక
మ్మును నితరాన్నపానముల పొందికఁ బళ్యమునందుఁ బెట్టి యా
కు నొకటి గప్పి వస్త్రమునఁ గూరిచి కట్టి పథానువర్తయై. 122

చ. చనఁ దొడఁగెన్ మహాత్వర నసంస్కృత దుర్గమ మార్గ గుప్తశ
ల్యనికరసంక్రమచ్ఛ్రమములన్ స్ఖలదార్ద్రపదారవిందయై
తనులత సంచలింపఁగ యథాయథయై పవనాహతిన్ శిరో
జనిచయ మాటలాడఁ బెలుచన్ బ్రతిముక్తపటాంచలమ్ముతో. 123

చ. వనిత, మరాళపాళి కలభాషణలన్ బదభూషణాకృతిన్
గొని తన వెన్నడం దరిసి కోపమునన్ గలహింప నల్లనన్
జనిచని ముంగటన్ గనె విసర్పిత నింబమహీరుహంపు నీ
డను వరమందిరస్థితమృడాని నివారితభక్తహానినిన్. 124

చ. కనుగొని యార్తిమీఱ నిరుగన్నుల బాష్పములూరి చెక్కులం
దునఁ బడి జాఱ నెన్నుదురు దుర్గపదమ్ములఁజేర మ్రొక్కి 'యో
జనని ! మహాపరాధ మెది సల్పితి నన్నిటు శిక్షసేయఁగా'
నని యిటు వేడు నాగిరిజ నంచితభక్తి సమర్చఁ చేర్చుచున్. 125

మ. గతజన్మాఘము లక్షమార్హము లనేకమ్ముల్ సదా దుర్వ్యథా
కృతి వెన్నాడును విన్నటంచును నుపేక్షింతే భవత్పాదధూ
ళి తలం దాల్పఁ బ్రణష్ట మందు విధిదుర్లేఖాక్షరశ్రేణి యు
న్నతిఁజేకూరు ముదమ్ములూరు నను ఛందస్సూక్తులుం గల్లయో ! 126

శా. తల్లీ ! యెల్లపుడున్ గళేబరగతార్థంబంటి ముక్కంటిలోఁ
దల్లీనమ్మయి యుండి నీ దుహిత యేతద్రీతి నీముందు క్షో
భిల్లం జూతువె నాఁడు రుక్మిణికి నీవేకావె ప్రార్థింపఁగా
ఫుల్లాబ్జాక్షు నొసంగి ప్రోచితివి నా పూజల్ వృథాసేతువే ? 127

శా. ప్రాలేయాచలశృంగ తుంగ రజతప్రాసాద భాగమ్ములన్
బాలేందు స్పృహణీయ శీతలకళా పాటీరలేపమ్ములన్

దోఃద్గాంగతరంగశీకరములన్ దోడ్కొంచు నేతెంచు వా
తూలాంకూరము పీవ నీవలర నెందుంబోలు మాపూజనల్ ? 128

ఉ. సారసనేత్ర ! నీ ప్రణయ చారుతరేక్షణపంక్తి బూదియా
మారుని లేపి శూలికి కుమారునిఁ జూపి జగమ్ము నాఁపె భూ
వారిజనేత్ర లెల్లరు వివాహముముందు భవత్పదాబ్జముల్
కూరిమిమీఱ నెల్లపుడు గొల్చి శిరమ్ముల వ్రాల్చి మ్రొక్కఁగన్. 129

సీ. త్రయ్యంతసారామృతసరోవర స్వర్ణసరసీరుహమ్ము లే చరణయుగళి
వరభక్తమానస వాంఛాఫలప్రద కల్పకశాఖ లే కరయుగములు
సకలభూతప్రాణ సంత్రాణచణఘృణా దుగ్ధార్ణవ మ్మదే దొడ్డకుక్షి
విగళక్షయ కళంకవిరహిత రాకాసుధాంశు సంకేత మే యాననమ్ము

తే. అఖిలవేథాండవిలయ సృష్ట్యాది చిత్రలీల లే యక్షి మీలనోన్మీలనములు
అవవి సుఖదుఃఖసంజ్ఞ లే హాసరోషకాంతులో యా శివామూర్తిఁ గాంతు నిన్ను. 130

మ. నడయాడున్ భవదీయకాయమయి సౌందర్యార్ణవం బీకటిన్
బుడమిన్ దట్టుచు మధ్యసీమ గగనమ్మున్ ముట్టుచున్ నాభిలో
సుడులన్ జుట్టు వళిన్ దరంగగతి లేచున్ గ్రీవలో శంఖమై
యొడుపుల్పెట్టుచుఁ జన్గవన్ రజతహేమోర్వీధ్రముల్ నెట్టుచున్. 131

ఉ. హాసములందు ఫేనము లపాంగనిరీక్షణలందు మీనముల్
భాసురఫాలమందున క్షపాకరునిన్ గురులందు శైవల
వ్యాస మొనర్చి మన్మథుని హత్యయొనర్చిన కొండవీటి స
న్న్యాసి విటాలవహ్నిశిఖ లార్చి రతిం బతిఁ గూర్చు నంబికా ! 132

మ. గిరిశోన్మత్తమనస్సరోవరలసత్క్రీడామరాళీ మహే
శ్వరి కాళీ జగదాదికారిణి నమస్కారమ్ము లోయమ్మ శ్రీ
హరికిం జెల్లెలి వెట్టి సంపదల నీయంజాల వావిష్ణురా
ద్వరు సృష్టించిన తల్లి' వే పనుల దీర్పన్లేవు నిర్వ్యాపృతన్ ?' 133

చ. అని యిటు వేఁడి దేవికి సమంచితభక్తి నివేదనమ్మునున్
బొనరిచి 'యంబ ! నీదరికి నొంటిగ వచ్చితి జంటగల్గి నీ
యనుపమసత్కృపాజలధి నాత్మజపై ప్రసరింపనీయరా
దనుకొనెదేమొ తల్లి సుత నారటపెట్టిన దిక్కు చిక్కునే ? 134

మ. మును శ్రీరుక్మిణి నీ పదమ్ములను సంపూజించి తా నేఁగుటన్
వనజాక్షుం దరుదెంచి యెత్తుకొని పోవంజేసినా వట్టి నీ

యనుకంపామతి నేడ దాఁచితివి నేఁ' డంచున్ వివాశించె నీ
కును నట్లొననఁగా ద్విజాలిరుత మాఘోషించె వృక్షోపరిన్. 135

చ. అది వినఁగా దివమ్మును ముదశ్రువులన్ గురిపింపసాగె నా
నుదకము వర్షరూపమున నొక్కొక చుక్క ధరిత్రి వ్రాలె నా
సుదతియు నుప్పర మ్మొరసి చొప్పడు కారుమొగిళ్ళబారు బి
ట్టదవద జెంది గుండె దిగులంది కనుంగొని యేఁగు వేగతన్. 136

క, అటునిటు గాంచువఱకె చీఁకటి వడినటు మబ్బు పచ్చి కడవై తోచెన్
జిటిపొటి చిన్కులు పన్నీరటు జిల్కుచు నభము వృష్టి నారంభించెన్. 137

ఉ. సద్దుగ మేడలెక్కి కనుసైగ లొనర్చెడి మేఘ పంగతిన్
వద్దని సస్యకాంత తల వ్రాలిచె గర్భభరాలసాంగియై
వద్దననేని త్రాగి పయివచ్చిపడెన్ బ్రిజ నష్టమౌట తా
నద్ది యెఱుంగఁ డెంతటి ఘనాహ్వయుడైనను ద్రాగుబోతనన్. 138

చ. అవసరమంచు వాఁడెఱచి యాచనసేసెడి యర్థి కిచ్చు నీ
ళ్ళవి నవజీవనమ్మనిరి యట్టులె పొట్టలు నిండఁ బండు భూ
తవితతి కిచ్చునట్టి యమృతమ్ము విషమ్మని రిట్లనౌచితిన్
దివి జవదాన్యుఁడైన ఘనదీపితుఁడున్ బతనస్థితిన్ గనెన్. 139

తే. పైన వాన క్రిందనో ముండ్లబాధ దెసల హోరుమని యీఁదగాలి కంగారుపఱుపఁ
బతి భుజింపకపోయెన్ బాధ ముందు నామె కివి చీమకుట్టిన యంతకావు, 140

ఉ. ముద్దుమొగానఁ జెక్కుళుల ముత్తెములట్టుల నిల్చి జాఱు నీ
రొద్దిక దాల్చు చీర యదియో జడివానకు నాని యంతటన్
ముద్దయిపోయి యా మధురమోహన సుందరగాత్రివల్లిపై
నద్దినయట్టు లొప్పె బరదై నడ సాగకపోయె రేగడిన్. 141

తే. దెసలు గ్రుడ్డిగాఁగను నెడతెఱపిలేక చఱచికొట్టెడు పెనువానజడికిఁ దాళ
జాలమికి బిట్టు వడఁకుచుఁ జాన తాను జెంత నలరెడు నొక మఱ్ఱిచెట్టు డాపె. 142

తే. తలల గొంగడి ముసుఁగులు వెలుఁగ ముడుత గట్టుకొనిన చేతులఁ దమ కఱ్ఱలూని
గద్దువలకాని యట్టిటు గదలకుండ నాలఁ గొని నిల్చి రచటి గోపార్భకులును. 143

క. గతిలేని ప్రాణితతినీ గతి నేఁచఁ దొడంగె వర్షగతి యనుకొనుచున్
వెతనొంది యేడ్చు బాష్పవితతి యనఁ దరువరము గురిసె ధర జలకణముల్. 144

తే. ఉఱికి యుఱికి తాఁ బడిపోవు నరునిభాతి కురిసి కురిసి వర్షమ్మాగెఁ గొంతతడవు
నంత నాకాశమండలమంతఁ గూడ మైల గడిగిన ముకురమ్ము లీల వెలిఁగె. 145

ఆ. పగిలెఁ జేయి జాఱిపడి యద్దఫలకమ్ము లనఁగ నిలిచె మడుపులందు జలము
అద్దములను దాచినట్టి పచ్చనికోక లాఱఁగట్టె శాద్వలాంగణములు. 146

క. వెలిసెను వర్షాసారము బలికిన ఫణులగుచు వఱద లుఱుకులుబెట్టెన్
జలకములాడెను తరుగణములు గోపార్భకులు హృష్టముఖ సంగతులై. 147

సీ. హర్షాతిరేకాన వర్షప్రవాహమ్ము కట్టఁగట్టుచుఁ దటాకముఁ బొనర్తురి
తత్తటాకమ్ములన్ దాళపత్రములతో నౌకలు విడుచుచు నవ్వుచుందు
రా కట్టకింద నిమ్మారని యిసుకతోఁ బిచ్చుకగూళ్లఁ గావించుకొందురి
వాది యీ గూడన నాది యీ చెలువని కొట్లాడుకొని వానిఁ గూల్చుకొందురి.

తే. కొంప మునిఁగెను నా నావ కొట్టుకొనుచుఁ బోయె ననియెడి సంసారి పోల్కి నేడ్చ
లోకపుం బోకడల సమాలోకనమ్ము సేయు బ్రాహ్మణ్యులట్లు హసింతురపుడె. 148

క. కీలారి బాలురం గని యా లలనామణియు మందహాసస్ఫుట ప్రే
మాలాపము లలరఁగ నీ చేలన్ మా చేను లెవ్వొ చెప్పరె యనినన్. 149

తే. 'కూఁతపెట్టున్న యా కట్టకొమ్మ బట్టి బువ్వచేయి పైపునకని పోయి చూడ
మట్టి కనఁబడు నదియె యమ్మా!' యటంచుఁ జెప్పుటయు నామె త్వరగతిఁ జేరఁబోయె.

శా. ఎంతోదూరము లేదు మట్టి యపుడా యేణాక్షి యీ రూపుతోఁ
జెంత న్వెల్గెడి నాథు చేరువఁ బ్రవేశింప న్మొగమ్మోడి వి
భ్రాంతాపాంగవిలోకనమ్ముల నిజప్రాణేశునిన్ జూచుచు
న్నంతన్ గాలొక యింత జాఱి తను వాద్యంతమ్ము నూఁగాడుచున్. 151

చ. పడఁజనఁ బీఁట నుండి యొక పక్షివలె న్వడి లేచి యొక్కచే
యడుగునఁ జెంతఁజేరి మృదులాంసము లంటుచు నాఁపి సిగ్గుతో
జడిసెడి కల్కి మోమును బ్రసన్నపుఁ జూపుల నయ్యొ! పాపమన్
వడువునఁ గాంచి 'వర్షమున వచ్చితివే' మని పల్కె నాథుఁడున్. 152

ఉ. అద్దిర యప్పు డా యువతి యందము చందముఁ గాంచ నచ్చునన్
గ్రుద్దినయట్టు లంగచయ కోమలసౌష్ఠవ మెంతొ వింతగా
దిద్ది మరుండు నేర్పుమెయిఁ దీసిన చిత్రపటమ్ము కిమ్ముగా
నద్దము గట్టిపెట్టినటు లయ్యెను సన్ననిచీర మాటునన్. 153

క. అద్దుకొనిపోయెఁ గురు లమ్ముద్దియఫాలమున వింత మురిపెము దోఁపన్
నిద్దపుఁ గాటుక చెదరెన్ దిద్దిన కుంకుమము వద్దదిద్దములయ్యెన్. 154

క. తమదావు మఱచి విశ్వమ్మును మఱచియు నామె రూపమును గమగొనుచున్
గనియె నొక క్రొత్తలోకపు టనుభవము నమాత్యుఁ డెడఁద నతిపరవశుఁడై. 155

తే. అతని హృదయ సర్వస్వ మున్నట్టులుండి యపహరించిన ముష్కరులగుట నేమొ
యతని ముందు నిలువలేక యమితభీతి నిటటు పర్వెత్తుచుండె నా యింతి కనులు. 156

తే. రాగరసపూర్ణ మానసపాగరముల భావనాతరంగము లెన్నొ పతికి సతికి
గంతులిడు గాని యందు నొక్కటియుఁగూడఁ బెదవి చెలియలికట్ట దాఁటదు రవంత.

క. ఫలభారమ్మున సుడివడు సలలితలతికావిధాన స్తనగురుభార
స్ఖలదవలగ్నమ్మున నత్యలఘు జఘనభర విపీడితాలసగతులన్. 158

క. ఉంచి శివానైవేద్యపుఁ గంచ మ్మచ్చోట, సిక్తకశిపువు శుచిగా
వించన్ దానమ్మాడఁగ నంచనడ సరోవరమున కరుగఁగఁదొడఁగెన్. 159

తే. 'పదిలముగఁ బోవలెనుసుమ్ము పడెదు జారి'
యనుచు సదయాంతరంగుఁడై యతఁడు వల్క
జాలిగొల్పెడి స్నేహదృక్చయము బఱపి
యామె మౌనయై తలవ్రాల్చి యల్లఁ జనియె. 160

క. చనియెడిసతి వెనువెంటన్ జనగోరెడి వాంఛ నాత్మసంయమనమ్మున్
గొని యణఁచిపుచ్చి కవి నెమ్మనమున నిటులెంచు నామె మధురాకృతులన్. 161

తే. 'దొంగచూపుల నంపి యీ తోయజాక్షి నాదు చైతన్యము హరించి పోఁదొడంగె
నరుగునది యామెయగునె కా దరసిచూడ నేనె నను విడి చనుచుంటి నిశ్చయముగ. 162

తే. కృష్ణవేణీ శిరోగత కేశపాశ బంధమునఁ జిక్కి యదె ప్రసవమ్ము కందు
కాంతపైఁగల మోహాంధకారపాశ కూటమునఁ జిక్కి నాయెద కుందు నటులు. 163

తే. కందుచును బ్రసూనమ్మది యంద మొసఁగుఁ
గుందుచును నాదు హృదయ మానంద మొందుఁ
గష్టములనేనిఁ బ్రియములుగా నొనర్చు
నిష్టకామ్యమ్ము లీయిల నెవరికేని.' 164

క. అని తలఁచి కొంతవడి తన మనమును విషయాంతరముల మరలించుటకై
కను నచటి ప్రకృతిదృశ్యమ్మును నచటి కపోతమిధునమును గవి యెంచున్. 165

సీ. మెఱపుటీఁకల నిండు మెడ ముందు వెన్కకుఁ గునిసియాడఁగఁ దోడగూడి నడచుఁ
గేరికూయుచుఁ బ్రియం జేరి రాఁజుట్టుచుఁ బుచ్చమ్ము విప్పి పొంపుగ నటించుఁ
గనుమోడ్చి ముక్కు ముక్కునఁ జేర్చి విడదీసి యట్టిట్టు నేలపై నంటిరాచు
మెడ నోరద్రిప్పి విచ్చెడి పక్షములమధ్యఁ గొనముక్కునన్ గోకుకొనుచుఁ గూర్కు.

తే. ఱెక్క లీఁకలు విరియఁగ రెపరెపార్చి పంజరాకృతిఁ బైకేగఁ బాఱు కాంతఁ
బొంది సంతృప్తుఁ డగు నీ కపోతపతియె ధన్యుఁ డన్నివిధమ్ములఁ దలఁచి చూడ. 166

తే. కమలసుమ గర్భగత మధుకణవితాన మే విరహిణీ ప్రణయ పూర్ణహృదయ సుధయొ
మధు కచటఁ గ్రోలి యాడెడి మధుపములుఁగ నెవని కామాంధకారము లెగసి చనునొ.

తే. అరుగుదెంచు మిత్రుం డిఁక యరుగుననినఁ బ్రకృతి రాగరంజితయయి బరఁగు రాక
రాక వచ్చుట తరవుండి పోకడ యను సంధికాలమ్మొ రాగప్రసారకమ్మొ. 168

ఆ. కలువతీవె పడఁతి వలఁద మొగ్గలపయిన్ బచ్చనాకు పైటఁ బాయ నలలఁ
దానమాడు సరసిఁ దాగి కాంచుచు శశి చిక్కిపోవు విరహచింతనేమొ! 169

సీ. కలకంఠ సరసవాక్యవిలాసముల విన్నఁ గాష్ఠసంతతికి రాగము చిగుర్చు
శశికరమ్ముల వింత చక్కిలిగింతకుఁ బాషాణ కఠినగర్భము ద్రవించు
రాగప్రసన్నమౌ రవిబింబమును గాంచఁ దమ్మిపూఁబోఁడి మొగమ్ము విప్పు
సరసాంబువాహ సుందరతఁ గన్గొని కేకి పురివిప్పి వెయికనుల్ దెఱచి మురియుఁ

తే. ప్రకృతిసిద్ధ సౌందర్య ప్రభావిలసిత రూప దర్శనస్పర్శ నాలాపములనుఁ
గాంచి కాష్ఠపాషాణాదికములు మాఱు ననఁగఁ జేతనవితతి నేమనుట లింక. 170

మ. మధుపాన మ్మొనరింపకుండఁ గనులన్ మత్తెక్కు వైశ్వానరున్
విధి సేవింపకముందె మై సకలమున్ వేఁడిన్ దపించుఁ సుమా
యుధ పుష్పాస్త్రము లంటకుండఁగనె దివ్యోగ్రాక్షసంకాశుఁడున్
ప్రథమమ్మందు జితోస్మి యన్న వరుఁడౌ భామా కరస్పర్శచేన్. 171

క. అని యెంచి సతి తటాక మ్మునఁ జని తడవయ్యె జాజి మొగ్గనొకో దా
న నఁటంచు నచటికిం జని కనుగొనెఁ దన నామె కననిగతి యా చెంతన్. 172

తే. వెలఁది కాసారతీర పవిత్రవారి నసితభీతేక్షణముల నల్దిశలఁ గనుచుఁ
దాన మొనరించి ధౌతవస్త్రమును దాల్చుకొనెడి రమణీయ దృశ్యమ్ము కనులఁబడియె.

ఉ. కాంచినవెంటనే మఱలఁ గష్టముతోఁ దన యున్కిఁజేరి యి
ట్లెంచఁదొడంగె నల్లమది యెప్పటికప్పుడు కాంతరూపుఁగ
ల్పించ సుధారసమ్ములు ప్రవించెడి తోరపుఁగూరిమిన్ బ్రసా
దించఁ బ్రతిక్షణమ్మును ప్రతీక్షణమున్ బొనరించు చుండఁగన్. 174

చ. 'మిసమిసలాడు క్రొంబిదుచు మేని కళల్ ప్రసవింపఁ జంపక
ప్రసవములన్ శిరీషసుమ భాసుర కేసర సౌకుమార్య మా
ననములఁ జిన్నఁబుచ్చు మసృణప్రభ నొప్పు కరారుణాంగుళీ
వినరముతోడఁ దోలమున బిందెడి రూపమె కండ్లఁగట్టెడిన్. 175

తే. మీలతో నాఁచు పెనఁగు పద్మాలతోడఁ దడలు జడనల్ల సుడిగొని బడగలెగయ
స్వర్ణసౌందర్య దివ్య శోభాప్రవంతి పాఱునేఱులై సొంపారు బడతి మేన.' 176

మ. అతఁ డీ భావఝరీ తరంగముల రాయంచన్ బలెన్ రాగసం
గత చైతన్యము నూఁప స్నాతయయి యాకంజాక్షి తానున్ శుచీ
కృత కూర్పాసకచేలయై తడికురుల్ కెంగేల పైఁద్రోయుచున్
పతిసేవాభిరతి ప్రచోదిత నిజ ప్రస్థాన సంరబ్ధయై. 177

ఉ. వచ్చెను దక్షణ మ్మచట వర్తిలు దుర్గనివేదనాన్నముల్
విచ్చెను బ్రొద్దువోయె నను విన్నదనమ్ము మొగానఁ బైకొనన్
బొచ్చెములేని కూర్మి నిఁక భుక్తికి రారె యఁటంచు స్వాగతం
బిచ్చెడి యా యమాయిక చలేక్షణపంక్తులఁ జూచె నాథునిన్. 178

ఉ. ప్రొద్దటి నుండి యింతవడి భోజనమున్ బొనరింపదంచు నా
ముద్దియ జాలిఁగొల్పు మొగమున్ గనె వీక్షణ మూకభాషలో
నద్దములోవలెన్ గనియె నాయమ సాపడఁ బిల్వనెంచుటన్
దద్దయుఁ బ్రీతి భోజన మొనర్పఁగఁ గూర్చునె నాతఁ డచ్చటన్. 179

తే. మానినీరూప మధుర భావానుభూతి యాత్మసుఖ వేదనాకృతి నలరుకతన
నరుచి యగుటఁ దదన్యపదార్థవితతి నించుక భుజించి లేవఁదలంచె సుకవి. 180

ఉ. అంతటిలోనె పోతన మహాకవి పాణిగృహీతియున్ దమిన్
గాంతుఁడు భోజన మ్మసదుగా నొనరించు విదేలయంచు నొ
క్కింత సుధాన్నమెత్తి హృదయేశుఁడు వద్దన నుంచసాగ నా
యింతి కరాంబుజమ్ము గ్రహియించె నతం డిఁక చాలు చాలనన్. 181

తే. కరము గ్రహియించి రాగవిస్ఫురణఁ గాంచి తిన వశముగాదు వద్దన మ్మొనరుప కనఁ
బతినిఁ గని మోము ప్రణయసుస్మితము గురియ గరిత వడ్డింపనన్నట్లు శిరము నూఁపె.

క. ఊఁపి తలవ్రాల్చి నిలువని చూపులతోఁ దనను గాంచు సుదతి మొగముపై
వ్యాపించెఁ జూపు లతనికి లోపించెను స్మృతియు విచటి లోకమె మఱచెన్. 183

తే. అపుడు పేరుకె పాణిగ్రహణము జరిగె నాతి కిపుడు పాణిగ్రహణసుఖ మబ్బెఁ
బ్రణయసిత దృక్ప్రభలు తలఁబ్రాలు వోయ లలినుభయుల కియ్యెడ మనోలగ్నమయ్యె.

సీ. మణిదీపరూపేందు మండలప్రభ విశ్వ ఘన సౌధమునఁ బాల గచ్చొనర్చె
వరతారకాంచితాంబరవీధి కాచగోళముల శోభిలు వితానములు దీర్చె
పుష్పసౌరభ సముద్భూత మందసమీరబాల సాంబ్రాణి ధూపమ్ము వైచె
శాద్వలాంగణకృతాస్తరణమ్ము భూస్థలి హరిత కౌశేయ శయ్యల నమర్చెఁ

తే. గీర్ణహిమము పన్నీరుఁ జిల్కించుచుండెఁ జేల ఝిల్లికారవళులు జోలబాడెఁ
బూర్ణ నిశ్శబ్దశీలయై పోయి రజని ధరణి నంత యేకాంత మందిర మొనర్చె. 185

తే. ఆత్మపతనోన్ముఖస్థితి నందు జడధి వెనుదిరిగి స్వప్రణష్టత గనుట పొసఁగఁ
దన పరీవాహపథమంటి యవని యందుఁ బడు జలమ్ముల రొద వినఁబడు నొకింత. 186

ఉ. పంతులుగారి వింటి కిఁకఁ బంపవలెన్ శయనింపఁగా నఁటం
చంతట సందెకావలికినై తిని త్రాగి బిరాన వచ్చెఁ దా
స్వంతపు టింటి బంటు తమి సంగఘనాసితకంబళావకుం
ఠాంతరదేహుఁడై లగుడ హస్తసనాథ భుజాగ్రభాగుఁడై. 187

తే. ఎంత ప్రేమదేవత నుపాసించు వారి కంతరాయమ్ము గలిగించె నతని రాక
యా వియోగము సంగఫలానుభూతి రుచి వివర్ధకమౌ క్షుధారూపమయ్యె. 188

తే. ప్రణయలోకమ్ము బహుసూక్ష్మ వసతి గలది అందు రెండవ వ్యక్తి రా సందులేదు
సతిని బతినను భేదమ్ము సమసిపోవ దంపతులె యొక్కటై యందుఁ దనరుచుంద్రు. 189

క. సాలోక్య సౌఖ్యసాగర వేలావధి దాఁటివచ్చి విప్రవరుం డా
పాలేరు గాంచి పదిలము చేలని సతిఁ గొంచు గృహముఁ జేరఁగఁ జనుచో. 190

తే. మందమారుతానీత సుమధుర సూన సౌరభాపూరదశదిశాచక్ర మేలు
చారుతర మనోహర శరచ్చంద్రికలను గాంచి యీరీతి నెదఁద భావించసాగె. 191

సీ. నెల గుండియలఁ బిండి పెలయేటి యెలబోటి యిల క్షీరవారాశి నొలుకఁబోయ
వెలగల్గు చలివెల్గు తెలిమించు తులకించి మలినాంబరము నంతఁ జలువ సేయఁ
గళలీను నెలతేని చలువ వెన్నెల లతల్ భూరుహచ్ఛాయలం బూలుపూయఁ
దెలికౌముదులు యామినులు దాల్చు చేరుచుక్కల ముత్తెముల పులం గడిగివేయఁ

తే. గొలకులఁ బిల్వటద్దాల తళుకు మీఱె నలుగడల్ పచ్చిపాల్గాఁతెఁ జలువరాల
మల కరఁగి పచ్చికబయళ్ళ విలిచి పాఱెనన శుచిస్మితయై శరద్వనిత జేరె. 192

చ. ప్రకట శరత్కాలావిభవ భాసురమౌ ఋతుకాలమందునఁ
బకపక నవ్వసాగెను విభావరి తారకలీను మల్లికా
వికర వికీర్ణ రమ్య శయనీయ సితాంబరసీమ వాయుడో
లికల నిశాపతిఁ గలసి లీలఁజెలంగి సుఖాశిఁ దేలుచున్. 193

చ. తెలిగగనంపుఁ బయ్యెద వదృష్టపయోధరయై సతంబు ప్ర
క్కల మను నొడ్ల నంటని యకల్మషజీవనయై పతిక్రియన్
విలసదపంకవృత్తి ధరణిం బరతెంచె శరద్వధూటి కా
వలయు ఫలమ్ములొంది తలవంచి పదమ్ముల నంట సస్యముల్. 194

చ. ఘనవిభవాప్తిఁ దారకల గ్రొల్పొరలన్ వదనద్వివేక భా
వనము దొలంగి తీవ్రకర వర్షములఁ గురిపించి శైలజం

డన చణ వజ్రిపాత కదనమ్ములతో వెరపించు పాకశా
సను విషవర్తనమ్ములు నసారములయ్యె శరత్కుమారిమున్. 195

చ. అలరి హసించుచున్ గువలయాస్యములన్ సరసుల్ శరన్నిశా
లలన హసన్ముఖమ్ముఁ గన లక్షలు కోట్లు సుధాణిము త్తెముల్
వెలగొని క్రుమ్మరించిరొకొ వేవురు భామిని హాసపంక్తులన్
దొలఁకెనొ వజ్రరాశి యనఁ దోఁచె నభమ్మునఁ దారకావళుల్. 196

ఉ. యామిని తీవ దాని కొనలందునఁ జుక్కలు రేపు రాత్రికిన్
మోములు విచ్చనున్న పసిమొగ్గలు నిగ్గులుదేఱు చంద్రమ
స్వామియె నిండుగా విరియు చల్లని తెల్లని బంతి మాపులన్
గామిని వాహినుల్ విజయఘట్టము మెట్టె శరత్తు పొత్తునన్. 197

క. తారకములు రసకణ విస్ఫారకములు తిమిరగగన శాణోల్లిఖ
శ్రీరాజిత మణిదీపాంగారకములు వెల్గు మోదకారకములుగన్. 198

క. తారాపరివారమ్ముల వారిద విషవారకేందు వాల్లభ్యములన్
మారుత పరిచారమ్ముల శారదచంద్రికలు దశదిశాభువి నేలున్. 199

గీ. విరహిలోక సంతాపక స్మరకృశాను గోళ సంధుక్షణోద్ధూత గోవికీర్ణ
విస్ఫులింగ సంతతులన విధునిచుట్టు తారకారాజి వెలుఁగు నపారములుఁగ. 200

క. రేరాజు భువనవిజయ శ్రీరాజిత దీప్తి గగనసీమ వెలుంగన్
శారదరాత్రులు మంగళహారతు లిడుచుండెఁ దారలను దివ్వెలతోన్. 201

సీ. గగనసీమంతినీ గళ విరాజ న్మౌక్తికస్రజమ్మొ తారకావ్రజమ్మొ
విమల మందాకినీ వీచీ చలద్రాజ హంసికావ్రతులో సితాభ్రతతులొ
సదమలాంబర సరోజాత పేందిందిర పుండరీకమొ చంద్రమండలమ్మొ
జాయాపతిస్వాంత సంధానకర ప్రేమదూతాకృతియొ శీతవాతిగతియొ

ఆ. శారదాకృతుల్ లసత్కళానిధికి దోషాకరత్వ మంతమందఁజేయ
దిగ్దిగంతకీర్ణ దినకరతేజమ్మె చలువఁగనెనొ జ్యోత్స్న యలమికొనెనొ. 202

తే. తారలంగని ముత్యాలచేరు లనుచు మ్రింగఁ జను హంసపఙ్క్తి భ్రమించు మొయిలు
చాంద్రిఁ గని నిత్య మీ పయస్సరసియనుచు నమ్మ తమ్మియ ట్లిందువు నవ్వెపదెడి. 203

క. అనుచున్ జ్యోత్స్నారుచులన్ గనుచున్ దివి వదలి మదనకర పంజరమం
దునఁ జిక్కిన శుకరూప మ్మన నతిఁ గొని యూరుఁ జేరె నతిమోదమునన్. 204

క. సదనాగతుఁడై పోతన మదనశిలీముఖ విదీర్ణ మానసమునఁ గ్లే
శ దురామయ మణఁచు మహాగద మని విప్రుఁ డలతానికాయము డాయన్. 205

తే. మధుకరా! నాదు నవకము మాసి యెల్లి ధరణి వ్రాలకముందె యీ తరుణహాస
మధురసాస్వాద నొన్మత్త మహితసుఖముఁ గొను మనుచు జాజిపూల వాసనలు వీచె.

ఉ. అంతికమందుఁ బుష్పవతియై మను కమ్మని కొమ్మయైన చే
మంతిపడంతి వక్షమున మైకపు బంగరుబొంగరాల గి
ల్గింతలు వెట్టి చెక్కిళుల గిల్లినఁ బాల్గురిపించు జొన్నబా
లెంతలఁ గౌఁగిటన్ బరిమళించుచు వీచెను గమ్మతెమ్మెరల్. 207

తే. చూచు రాగరంజిత కాచలోచనముల నఖిలజగము లోహితమయి యగపడుగతిఁ
దనవలెనె లతల్ మరుబాధఁ దనరినట్లు దోఁచి యీరీతిఁ దలపోయఁదొడఁగె సుకవి.

తే. 'భర్తృసంశ్లేష మించుక బాయలేక సహగమనమున్ బొనర్చిన సాధ్వి యెవరొ
మాఱుజన్మాన వల్లీకుమారి యగుచుఁ దరువరాశ్లేష మొనరించి ధన్య యయ్యె. 209

తే. కన్నెలత వా చిలిపి గాడ్పుచిన్నవాఁడు పచ్చచీటిచీర చెఱంగు బట్టిలాగఁ
బ్రణయహృదయవాసన బయల్పడఁగ నామె నవ్వు నతనితోఁ బువ్వుచిన్నారినోట. 210

తే. మోహసమ్ముగ్ధయౌ జాజిమొగ్గచుట్టు గుసగుసల్ బెట్టు పవనుఁ గన్గొనుచు నామె
నాకుమన్ నీపయినె వాసనల్ గలవన నోరువిప్పియు లజ్జించి యూరకొనియె. 211

తే. చిన్నతన మింక విడకయొ సిగ్గుమెయినొ వచ్చుటకుఁ జిక్కులిడు లతావనితఁ గాంచి
నూటినదయే తెలియు వృక్షసుందరుండు మునువెనుక దోఁచక నిలిచి ముగ్ధుఁడగును. 212

సీ. రజనీయవనికాంతరస్థయై స్వర్ణదీ వారిశీకరముల బోరుకాడి
విమల ప్రభాతాచ్ఛ వేళావసరముల జిలిబిలి ముత్యాలచీరఁ గట్టి
అతిలోక నిజ మనోహర రూపలతలలోఁ గుసుమాభరణశోభఁ గుస్తరించి
మలయానిలోద్ధూత మంజులకింజల్క రమ్యపరాగాంగరాగ మలమి

తే. తీవకన్నియ యలరు వాతావరణము నరసి తరురాజు శాఖాకరాళిఁ బిలుచుఁ
దలను వాల్చి సిగ్గుపడు లతాకుమారి తమిగలిగి యొండొరుల నేల దరియ తేరా! 213

శా. నీవు న్నేనను భావ మేర్పడని యా నిద్రాదశాభూతమున్
పేవించెన్ గదె బీజమై శవము వచ్చెన్ వర్తమాన మ్మిటన్
బూవుల్ పూచిఫలించు మేల్వ్రయసె సంభోగాస్పదం బీలతన్
ఖావిన్ జీర్ణవిశీర్ణ పర్ణతను శోభారేఖలే శేషముల్.' 214

క. అవి తలఁచి యచటు విడి భోజన మట్టులె నిదురఁగూడ సైఁపమి నెటొ పే
రునకై శయ్యాగృహమునఁ దనకొఱకై పఱచినట్టి తల్పముఁ జేరెన్. 215

ఉ. కోమలి ప్రేమదృగ్విచి రగుల్కొని నాయెద కంటుకొన్న యీ
కామదవానలమ్ము నతిగాఁ బెనుచున్ మలయానిలార్భట

మ్మి మదనాగ్నిపైన ఘటియించెడి వెన్నెల వెన్నముద్దయై
నా మహనీయదీక్షలను నాశమొనర్పక యుండు టెట్లు(కన్ ? 216

చ. అని వ్రతభంగ మెంచి విరహార్తిని గుందెడి పోతనార్యునిన్
గనుగొని యా యొయారి తన కన్గొనలన్ బ్రియతప్రిపాథునుల్
పెన(గొన సుస్మితాస్య మరవిందములన్ బురుడింప( గంకణ
క్వణన మెసంగ సొంపొలయ( గపప్రిపువీక్ష్యము( గూర్చికట్టుచున్. 217

ఉ. కన్నులకాటుకల్ మరునికత్తుల సానలుబట్ట నవ్వులున్
వెన్నెలవన్నెలన్ జిలుక వేనలి వ్రేలెడి పూలమాలలో
మిన్నున( దారకల్ విరియ మించుల యంచుల యంబరమ్ములో(
బున్నమ చంద్రబింబ మన( బొల్తిక తా నవవిల్తు కొమ్మయై. 218

క. వర నవ్యాంబర దివ్యాభరణాలంకార పుష్పపరిమళ కలిత
స్మరశర విజయరమాయిత సురచిరవేషమున దేవసుందరి యన(గన్. 219

క. ఏలా లవంగ ఘనరస కాలక్రముకాంశ జాతిఖండ పరిమళ
శ్రీ లాంఛిత రుచికర తాంబూలము( గొనివచ్చి యీయ(బోవుచు లజ్జన్. 220

క. కొనివచ్చు విడెము నిడ( బజ్జన నిల(బడి సంతసమున సత్రిపయై యే
మొనరింపవలెనొ తో(చక మనమున నవ్యక్తసుఖము మల్లడిగొన(గన్. 221

సీ. అవనత ముగ్ధాస్య యగుచు( గేలుంగేలు( గీల్చి నఖాగ్రిముల్ గిల్లుకొనుచు
బరిట సీవలివంక మరలిరా( దిగుచుచో( గరమున నెటికలు విఱుచుకొనుచు
ఊరుపులన్ బదనాఱిన వాతెరం గడనాల్క నట్టిటు( దడవుకొనుచు
ఒక పాదమొని యింకొకట మ్రొగ్గుచును బాదాంగుష్ఠముల నేలయంటి రాయు

తే. గాలి తర(గల తా(కునన్ వ్రాలిపడుచు మోముదమ్మిని ముద్దిడు ముంగురులను
గోరి యొకరవ తలయెత్తి గోళ్ళగొట్టు మిషగ( బతి(గాంచు( దోనె శిరసును వ్రాల్చు.

క. కనియెడి తన సతి మోమున్ గని పోతన యెదియొ పల్క(గా దొరకొను నే
మన(జాలం దనకుండ న్మన(జాల(డు మిగత జగతి మఱచి యిటెంచున్. 223

తే. కొమ్మచూపుల నింద్రజాల మ్మదేమొ మాయమైపోయి నేనె నన్ మఱచిపోదు
వనిత యర్ధాంగియయ్యు నా మనసు నేచు( గుడియెడమ పార్శ్వముల కింత యెడమదేల ?

క. 'తడియుచు వడ(కుచు వానన్ బడి వచ్చితి చాల కష్టపడితివి నాకై
పడ(తీ ! సుమగాత్రివి విన్నిదుమల నిడినట్టి కటిక నేమమట' లనన్. 225

తే. 'దాసి గల్గియు సరియైన తరుణమందు భోజన మొనర్ప రైరని పొక్కుచుందు
జాలి(గొను మన్మనః ప్రియాసమున కన్న నెక్కువే మీర లనియెడి యిడుమ లనఘ !

తే. ఉంచు బోనమ్మె సరిగ భుజింపరైతి రేమి హేతు వీ యజ్ఞతో నేవియేని
గురుతరాపరాధమ్ములు జరిగెనేని వాని క్షమియింపుఁ' డనుచు నవ్వనిత యనియె. 227

ఉ. అన్నెలఁతం గనుంగొనుచు నా కవి కూర్మిమెయి న్వచించె 'నో
పున్నెపురాశి ! నా కనుల పున్నమ వెన్నెల ! రూపశీల సం
పన్నిలయంబ ! నా హృదయమర్మము దొంగిలు మారచోరుఁ బ్రి
చ్చున్నతఁ గొంగుమాటు నిడి సాకెడి దోషము సైఁపవచ్చునే ? 228

ఉ. అన్నముపైన నాదు హృదయ మ్మెట నున్నది ? నీదు రూపసం
పన్న హసన్ముఖాంబురుహ పంజరబద్ధ విహంగశాబమై
యున్నది నీ యధీనమయి యో సకియా ! దరిఁ జేర్పుమంచు' నా
యన్నుల మిన్న కేలు హృదయమ్మున హత్తుకొనన్ దలంచుచున్. 229

క. ఆనందమ్మున విడెమిడు పాణిన్ గొని నిమురుచున్ విభావోత్కర్షన్
దానై లాగుట నపు డమ్మానినియుఁ ద్రపాతరంగ మగ్నాననయై. 230

చ. 'విడువుఁ' డఁటంచు హస్తమును వ్రీడమెయిన్ విడిపించుకొంచు న
ప్పడఁతి పలంగవో నతఁడు పయ్యెదయంచు గ్రహింప జాటి మున్
బడె నది మూఁపునుండి, యద్రువన్ బృథులోరము నర్తిలన్ బొమల్
చిడిముడిపాటుతో మరము చేతులఁ గప్పుచుఁ గాంక్ష మప్పుచున్. 231

క. కుంచిత గాత్రిమ్ముల నతి చంచల నేత్రముల రుద్ధ చరణమ్ముల ల
జ్జాంచిత వదనమ్మున గిలికించితవతి యగుచు మగని కేలన్ వ్రాలెన్. 232

ఆ. వలదు విడువుఁడనుచు వచియించునే కాని మేను మఱచి పత్యధీన యగును
జనుదు నాడు పెజ్జ కనుగాని పతి పరిష్వంగ సుఖము విడిచి యడుగు సనదు. 233

తే. తీవఁబోంట్లు స్వప్రియువుల క్రేవఁ జనఁగ మొదటఁ గొంకెద రాపయి వదలలేరు
పాదపముల నుమ్మను లతల్ ప్రాఁకికొనుటఁ దెలియనట్లుం దలమికొన్న దొలఁగలేవు.

క. వేఱెవరో యైనట్లిటు భీరుహరిణమగుచుఁ దనను వీక్షించెడి యా
పారసనేత్రమ గౌఁగిటఁ జేరిచి వీఁపంటి భీతిఁజెందకు మనుటల్. 235

తే. అలసగతి పోష్ణనిశ్వాసములు జెలంగ గుండె వేగమ్ముగాఁ గొట్టుకొనుచునుండ
నరనరమ్మున సుఖపు స్వర్ణదులు పొంగ నాథు ననురాగదృష్టి నన్నాతి గాంచె. 236

క. కాంచుచు నఖిముఖియై కనిపించెడి పతిమోము కూర్మి వీక్షించి స్మితా
శ్యంచితవదనుండై యిఁక వేంచేయుము నన్ను వీడి వెలఁదీ ! యనుచున్. 237

ఉ. ఎంతయుఁ గూర్మి మోము పయికెత్తి కపోలములంటి మత్తవి
భ్రాంత విలోకనద్యుతులఁ బైకొను ముంగురులన్ సవర్చిత

త్కాంత జపారుణాధర సుధారస మానఁగఁబోయె నాతఁ డా
యింతి త్రపాతరంగ నివహేరితచారు ముఖారవిందమై. 238

క. 'కొనుఁడీ తాంబూలము నేఁ జనవలె విదియంత యేమి చర్య' యనుచు దే
ని నెఱుంగని పసిపిల్లటు లనుటయుఁ బ్రియురాలిఁ గాంచి యతఁ డతిప్రేమన్. 239

క. 'ఇన్నాళ్లు విరహవహ్నిన్ నిన్నీగతి తాపపెట్టు నిష్ఠురహృదయున్
గన్నెత్తిచూడఁ బాపము లన్నియు వెన్నడు క్షమింపు మబ్జాస్య!' యనెన్. 240

ఉ. మన్ననమాట నిట్లు బతిమాలెడి నాథుని గాంచి యార్తిమై
కన్నుల నుండి యశ్రుకణ గంగలు పొంగఁగఁ గోపతాపముల్
తెన్నులు వట్టిపోవ 'భవదీయను దాసిని నంత మాట మీ
రెన్నఁడు పల్కరా' దని రసేక్షణ పంక్తులఁ జూచె నామెయున్. 241

ఉ. వెన్నయటుల్ మనస్సులు ద్రవించె ముఖాబ్జము లప్రయత్నతన్
సన్నిహితంబులై పెనఁగె సప్రణయేక్షణ ఖంజరీటముల్
మిన్నగఁ బ్రాకె జంటఁగొని మేనులు తానములాడె సౌఖ్యసం
పన్నది దేశకాల సముపస్థితి మాటుమడంగె నిర్భరన్. 242

సీ. శిరము నాఘ్రాణింప సేమంతికాసుమ స్నేహసౌరభములు చెంగలించె
మోము మోమునఁ జేర్ప ముగ్ధనిశ్వాసాళిఁ బొగడపూవుల తావి బుగులుకొనియె
నధర మాస్వాదింప నరవింద సౌగంధ్య వీచీ వితానమ్ము విసరుకొనియెఁ
నయ్యెదలో నుండి పఱతెంచు నెమ్మేని మదపరిమళ మెంతొ మత్తుగొలిపె

తే. ఇట్లు నెత్తావిమొత్తమ్ము లెసక మెసఁగ మేను మఱచుచు నర్ధనిమీలితాక్షుఁ
డగుచుఁ గమలకోమల సతీహస్తపాశ బద్ధుఁడై ముక్తిఁగనె మారు బారి నుండి. 243

క. దోలత్ప్రణయాంబుధిలోఁ దేలికఁ దేలాడు పూలతెప్పలగుచు వా
రాలోల లోకనమ్ముల సాలోక్యముఁ గనిరి పుష్పసౌరభగతులన్. 244

ఉ. కుత్తుకబంటి నిండి పతి కూరిమి వెల్లువఁ బొర్ల లజ్జయన్
భిత్తిక గండివోఁ బ్రణయబీజపు మొల్కలు పుల్కలెత్తఁగా
మత్తిలి వ్రాలు గన్నులు చెమర్చిన చెక్కులు కెంపులీనఁగా
నత్తను వుండిలేనియటులయ్యె నదెట్టి సమాధి యోగమో! 245

ఉ. ఆ వనజాక్షి నూత్న ప్రణయాంకురముల్ వరరాగవృష్టిలోఁ
దీవలు సాచి యల్లుకొని తీరగు పూవులు బూచి కమ్మనె
త్తావులు జిమ్మఁ దేఁటులు సుధామధుమత్తత వ్రాలఁగా ఫల
శ్రీవిభవోన్ముఖమ్మయి చరించెను సౌఖ్య వసంతవీథులన్. 246

ఆ. నూత్నయౌవనపు మనోజ్ఞ వాసన లేవా కుంజపుష్పిత యగు కొమ్మ కెఱుక
తానె వలచి కలియు దాంపత్యరుచి మ్రాఁకు గడియ విడని తీవగరిత తెలియు. 247

తే. పొలఁతుకను గూడి సుఖనిద్ర నలరు కవికి స్వప్నగతుఁడయి కనిపించి సాధు వొకఁడు
'వీడు ధారణాశక్తి మున్నీటఁ గలిసె' నని నటులఁ దోఁచి మెలఁకువయయ్యె నంత. 248

క. తలఁపన్ దోషాకరుఁడై వెలయుటనో యేమొ రాత్రి వెడలి క్రమముగాఁ
దెలవాఱఁ గళానిధికిన్ వెలవెలవోయెన్ మొగమ్ము విశ్వముఁ గాంచన్. 249

వ. అంత కొంతకాలంబు గడచుటయు. 250

సీ. అన్నపూర్ణా మనోహరుఁడంచు పేర్వడ్డ కాశివిస్పయ యింట గంగ ద్రావి
కదలి యల్లఁదగు జగ్గన యన్నసత్రాన కులభేదమెంచక కూడు గుడిచి
భక్తలోకపు కొంగుబంగారమైయున్న పాండురంగప్పని పదము బాడి
కొండ లేడిటి నెక్కి కూర్చున్న వేంకటరెడ్డి రొక్కమునకు వడ్డి గట్టి

తే. పర్వతము కేగి తలవంచి బరువు దించి భద్రగిరినాథు నింటిలో నిద్రచేసి
యాత్ర ముగియించుకొని లక్కమాంబ కేసనార్యుఁ డిలు సేరి రొక వర్ష మరుగువెనుక.

తే. విత్త విద్యా కుల మదమ్ము లుత్తరింప గిరి వెలయు పరబ్రహ్మము నరసిమురిసి
పండరిస్థ నాదబ్రహ్మపదము పొగడి పురి వెలుంగు నన్నబ్రహ్మమూర్తి గాంచి. 252

తే. వివిధ గంగల మున్గిరి భవసముద్ర పారమున్ జేర నీశ్వర ప్రథిత దివ్య
తిరుపతుల నెన్నియెన్నియో తిరిగి రిలకు తిరిగివచ్చెడి జన్మమ్ము లరుగుకొఱకు. 253

క. యాత్రల కేఁగియుఁ దామ్రపుఁ బాత్రలఁ గొని యందు గంగ పదిలపఱచి చా
రిత్రములఁ బొగడి హరిహర చిత్రపటములం బ్రసాదశేషము గొనుచున్. 254

తే. పసుపు కుంకుమల్ నిర్మాల్య పత్ర పుష్పవితతి గ్రహియించి భక్తి విరతిని వారు
ముక్కు ముడిబెట్టక సదాన ముల్లు నాఁటకుండ వచ్చిరి హరి రక్షకుండుగాఁగ. 255

తే. బ్రాహ్మణశతమ్మునకును స్వబంధుతతికి రైతులకును దరిద్రనారాయణులకు
నన్న సంతర్పణమ్మిడి యార్యతతికి దక్షిణల నిడి చేసెఁ బ్రదక్షిణముల. 256

తే. సరస సౌందర్య సౌరభ్య సౌకుమార్య సంపదన్విత చూతపుష్పమ్ము తాను
ఫలదశను గాంచె సుమనోజ్ఞకళలఁ గూడి యధిగత ప్రయోజన సుకావ్యమ్మువోలె. 257

తే. నర్సమాంబ మోము నగవులన్ శశిబింబకళల శుక్లపక్షకాంతు లీన
నాలయమ్ము నిండి యానంద జలనిధుల్ నలు కెలంకులంటి నాట్యమాడె. 258

ఉ. ఎంతయు నిందుపాతె నొదలిప్పుడు నాల్గవమాసమం చొక
ర్తింతటి సైఁపిసైఁపముల యేర్పడు నాకళ లప్డె యంచొక

ర్తెంతపనిన్ బొనర్చితివె యేమి యెఱుంగనటుండి యంచొక
ర్తంతికవర్తినుల్ చెలులు హాస్యమొనర్చెద రిట్టు లా సతిన్. 259

ఉ. ఈ విధి గేలిసేయఁ జెలు లేదియొ దొంగతన మ్మొనర్చిన
ట్లా విరిబోఁడి వారిఁ గన నాసన మెత్తఁగ సిగ్గుఁజెందుచున్
బోవలెనంచు నేదొ నెపమున్ గొని లేచును రేపు పుత్త్రితో
దేవికి మాటలాడఁగను దీఱునొ తీఱదొ యండ్రు వారునున్. 260

ఉ. ఆ నెలఁతల్ వచింప నిటు లంతయునున్ విని లక్కమాంబ క
న్గొనల లేఁతనవ్వు లలుఁగుల్వడ నిట్లను 'మీదు నోటిపు
ణ్యానసొ మల్లినాథు కరుణా పరిపూర్ణ కటాక్ష వీక్షణా
ధీనతనో యటుల్ జరుగఁ దియ్యన సేయనె మీదు నోఁకలన్. 261

శా. శ్రీశైలస్థిత మల్లికార్జుననకే చేమోడ్పు లర్పించి మ
ల్లీశా! నా కొమరుండు కోడలును హాయిన్ బ్రేమతో నుండఁగా
నాశింతున్ దయతోడ వారలకు నీదౌ పేర దీర్ఘాయువున్
ధీశాలిన్ దగ వ్రేలెఁడంత మొలకన్ దేవా! ప్రసాదింపవే. 262

తే. అనుచు నే మ్రొక్కితిని బిడ్డ కతని పేరె పెట్టుకొని మల్లన యఁటంచుఁ బిల్చుకొందుఁ
ద్వరగ నా కండ్లముందది జరిగెనేని నపుడు నా ప్రాణి విశ్చింతనందు ననియె. 263

తే. బహుళ కీర్తిప్రతిష్ఠలన్ బ్రతికినట్టి దొడ్డ యిల్లాలు మాటవి తొలఁగ దెపుడు
కడుపు నిండఁ గన్నది లక్ష్మికళల వెల్గు పండుముత్తైద యామె కెట్టుండు కొదువ. 264

క. ప్రక్కలు నిండుపడెను జనుముక్కులు నలుపెక్కెఁ క్షీరములఁ దడిబడియెన్
జెక్కులు వ్రాల్గన్నులు తెలుపెక్కెను దంపతుల గుట్టు లీవలఁ బడియెన్. 265

ఆ. పైఁడియున్న కళలు పట్టియుండిన కళల్ పట్టియిచ్చు దొంగ నెట్టులేవి
నెలఁత మొగముఁ గాంచ నెల దప్పుటే నిజమ్మనుచు స్త్రీలు ముచ్చటాడుకొనిరి. 266

క. పిడికెడునులేని నడుమునఁ గడుపేర్పడె దినదినమ్ము కటి వ్రేఁగయ్యెన్
నడియింట నిండుకుండఁగ నడయాడెడి నోపలేని నడ నలసతమై. 267

తే. రెండుజీవాలతో నీమె గండ మెట్లు గడుచుకొని చల్లగా బైటఁబడునొ యనుచు
నెదురయిన దేవతలకెల్ల నెంతొ భక్తి గండదీపమ్ము లిడి మ్రొక్కుచుండు నంత. 268

తే. నెలలు నిండెను పున్నమకళలవోలె క్యావురనె బిడ్డయేడుపు కర్ణయుగళిఁ
దోరణముగట్టి రాయింటఁ దొల్లెయూగెఁ దల్లి యానంద మది చెప్పఁదర మెవరికి. 269

తే. బంధుమిత్రు లందఱి శుభపత్త్రికలను వ్రాసి పిలిపించుకొని యెంతొ వైభవముగ
బారసాల నొనర్చి కుమారునకును మల్లనామాత్యుఁ డంచు నామమ్ము నిడిరి. 270

క. తపమొనరిచి తిప్పనసతి యపత్యమును వడయదయ్యె నాయింటన్ నేఁ
దపురూప బిడ్డ యీశ్వరకృప బాలుం డెదుగుచుండెఁ గేరుచుఁ దొట్లన్. 271

ఉ. స్వీయతపమ్ము భంగమయి చిత్రగతి న్నిజధారణాకృతుల్
మాయములై చెలంగుటయు మ్లానముఖుం డయి పోతరాజు గా
ఢేయ విధమ్మునన్ దిరిగి తీవ్రతపోవ్రతనిష్ఠ శ్రద్ధమైఁ
జేయఁగనెంచి కాననముఁ జేరఁగఁబోవఁ దలంచు నీగతిన్. 272

ఉ. 'అక్కట ! సత్తపమ్ము నిటు లల్పసుఖార్థము వమ్ము సేసి నే
నొక్కడఁ గల్పభూరుహము నుగ్ర కఠోర కుఠారధారలన్
జెక్కలొనర్చి ప్రొయ్యనిడి చేద్పడుపేకదె ! మూర్ఖచిత్తుఁడై
యెక్కినకొమ్మఁ గొట్టుకొను నెవ్వఁడు వాఁడిలఁ గూలకుండునే ? 273

శా. సంతానార్థమె సంచరింపఁదగు నీ సంసారమం దెప్పుడున్
వింత ల్పల్పుచు నాటలాడుకొనుచున్ విధ్యుక్తధర్మమ్ము ర
వ్వంతేనిన్ బరికింపకే విఫలతన్ బ్రాల్మాలి కామాగ్నిలో
భ్రాంతిన్ రెక్కలుమాడి చచ్చు శలభప్రాయుండఁ గాఁజెల్లునే ? 274

తే. మనసయిన దీపశిఖ నార్పఁజను పతంగి యాత్మమృత్యువు నొక్కింత యరయలేదు
కట్టియన్ గాల్చి జీవించునట్టి వహ్ని దానితోఁ దననాశమున్ దలఁపలేదు. 275

తే. మనసులోని యీబాధను మాతృమూర్తి చరణసన్నిధి విజ్ఞప్తిసలిపి యామె
యాజ్ఞఁ గైకొని విపినమ్ము కరుగువాఁడ ననుచు నిటులెంచి సుకవియున్ జననిఁగాంచె.

ఆ.వె. వినయమతిని మ్రొక్కి జనని దీవనఁ గొని కూరుచుండె తల్లి కొమరుఁ జూచి
చంకనున్న పౌత్రి సస్మితాస్యముఁ జూపి చొట్టవడెడి గల్లసుమము లంటి 277

క. హాసకుసుమముల నస్ఫుట భాసుర కలభాషణాది బాలకుకోప
వ్యాసమ్ములఁ బండి పొరలు వేసమ్మున నందనవని విచ్చేసె నిలన్. 278

ఆ. ఇంటివిందఁ బిల్ల లెపు డాడిపాడుచు వచ్చిపోవు బంధువార మెసఁగఁ
గాంతిగల్గి యిల్లు కళకళలాడును లేకయున్నఁ బవలె చీఁకటి పడు. 279

ఆ. తపము తపమటంచు దయయు ధర్మము మాలి కన్నబిడ్డ విడిచెఁ గౌశికుండు
జనకరాజు కణ్వమునియుఁ గూఁతులఁ దెచ్చి పెంచుచుండ సిద్ధిఁ గాంచలేదె. 280

క. తినినట్లు కడుపు నిండున్ పనిపాటులు జపతపములు పరువిడిపోవున్
జను మీ జనకునిదరి కని తన తనయునిముందు పౌత్రిఁ దగ నుంచి చనెన్. 281

క. ఆ నందను ముద్దిడుకొని యానందాంబుధిని నోలలాడుచుఁ దృప్తిన్
దానిటు లెంచుచుఁ బోతన మానసమున రాగరసము మల్లడిగొనఁగన్. 282

తే. 'తరుణి ముద్దుల తాంబూలపరిమళమ్ము వ్రాలు పసిపాపనోటి చన్వాల తావి
మూఁడులోకమ్ములన్ వశ్యమున్ బొనర్ప దర్పకుం డూఁదుచున్న మంత్రములుగావె !

తే. నందనుఁ దన భార్యాభర్తలందు నెదుఁగు శశ్వదానందరూప వృక్షగత ఫలమె
బాలు రూపచర్యలన దాంపత్యకావ్య సరస ప్రేమ వృత్తముల భాష్యములు గావె ! 284

సీ. జాయాపతుల వాక్యసరససామర్థ్యముల్ వాగతీతములను మూఁగనోటఁ
దముదామె మఱచెడి దాంపత్యసౌఖ్యాప్తి విశ్వవిస్మృతిలోనె విశదపఱచు
నిద్దఱాల్మగలను నేకమ్మొనర్చు రహస్యచిత్రము మేన నచ్చుగ్రుద్దు
నానందడోలిక యగు శయ్య దంపతుల్ విడలే రనుచుఁ దొల్తెఁ బడుచు నూఁగు

తే. నొకటితో నొక్కటిం గూర్ప నొక్కటియగు లేక మూఁడేవి యగునవి లోకమెఱుఁగ
గాలుసేతుల వ్రేళ్ళ లెక్కవిఠ మడచి యురక సరిదిద్దు గణితశాస్త్రోక్తవిధికి, 285

చ. మహిఁ జతురాశ్రమ ప్రథితమార్గములందు గృహస్థధర్మమే
యిహపర సౌఖ్యసంపదల నిచ్చును మున్ను ప్రపంచభారధూ
ర్వహుఁడు గృహస్థుఁ డా జనకరాజు విదేహుఁడు గాఁడె రాజహం
స హొయలు నెన్నడల్ భువిని సన్నుతిఁజెందుఁగదా ! దివిన్బలెన్ 286

ఆ. అనుచుఁ దన తపమునకును విఘ్నమూర్తి యౌ కొమరుఁ గాంచి ముద్దుగొనెనొ లేదొ
మాయగప్పినట్లు మమతరాఁ బోతన కరఁగిపోయె మనసు తిరిగిపోయె. 287

క. కనులకుఁ గౌముది ముద్దులఁ దనువు సుధానిధి పటీరతనులేపమునై
తన పంచప్రాణమ్ములఁ గనకపుపేటి యగు తనయుఁ గన్గొనుచుండన్. 288

క. దినములు క్షణములుగా హాయనములు దినములుగఁ దెలియనట్టులు సుఖజీ
వన మొక మధురస్వప్న మ్మనఁ జనఁగాఁదొడఁగెఁ బోతనార్యున కంతన్. 289

ఆ. తపముమాట తిరిగి తలయెత్తనేలేక మాటుమడఁగె వెడలుమాట లుడిగెఁ
బాలకునకు మరగి పంజరబంధమ్మె సుఖమటంచు నెంచు శుకము భాతి. 290

ఉ. ఈఁత నెఱుంగువాఁడు మఱి యీఁత నెఱుంగనియాతఁ డిర్వురున్
నూతను దూఁకినంతనె మునుంగుట లెన్న సమానమయ్యు నా
యీఁత నెఱుంగు మానిసి యొకించుకలోనె మునింగి తేలఁడో !
పోతన సంసృతిన్ మెలఁగు పోకడ లట్టివె కావొ యారయన్. 291

చ. హరిపద కంజపంజర విహాయసతన్ విహరించు మత్తబం
భరమనఁ బోతనార్యు నెద బ్రహ్మవిచార కథాసుధా సరో
వర లహరీవితానగతి వర్తిలు రాజమరాళబాల యై
పరహితచింతనొందు భవపంకము నంటకయుండు నిత్యమున్. 292

క. కవియై పుట్టిన పోతన వివిధ విషయగతుల కైత వెదకుచుఁ బోవున్
భువిఁ దిరుగులాడు గౌతమి సువిదితగతి జలధిజాడఁ జూచుకొను గతిన్. 293

సీ. ఋతుసంగతుల మహోన్నతశోభలం దేలు ప్రకృతి సౌందర్య సంపదలఁ గ్రోల్చి
శశి సూర్యబింబ ప్రశస్త ప్రభాదీప్త విశ్వాకృతులఁ గాంచి వినుతి సేయుఁ
గమనీయ మృగపక్షి గణ రూపరేఖావిలాస లాస్యములఁ బేరాసఁ గాంచు
సుఖదుఃఖ సంగతిన్ జూపట్టు నరజాతి మానస పరిణామ మార్గమరయ

తే. నవరసప్రకాశక భావనామ రూపకలితమగు నీ జగత్కావ్య కవి యెవండొ
వాని మదిని దలంచి యవ్యాజ భక్తిభావ పారవశ్యమ్మునఁ బ్రస్తుతించు. 294

సీ. పొలము కావలికని పోవునే గాని యా పొలముపనుల బుద్ధి నిలువ దెందుఁ
బలుమాఱు పనివారు పిలిచినన్ వినరాదు వినవచ్చినన్ బల్క మనసురాదు
పల్కినన్ వారలు ప్రశ్నించునదొకండు తానేదొ వేఱె యుత్తరమొసంగు
నిదియేమి యిటులేల బదులిచ్చెదరటన్న నేమంటినో నేనె యెఱుఁగనను

తే. ఏదొ స్మృతిపథమ్మున స్ఫురియించినట్లు భావనమొనర్చుఁ గదలని ప్రతిమభంగి
వెదకుచున్నట్టి ధనము లభించె నిపుడె యనఁగఁ దనలోనఁ దా నవ్వుకొనుచు మురియు.

ఆ. రేయుబవలు మరక వ్రాయు చింతయె కాని యన్నపాన వేళలైనఁ గనఁడు
భోజన మ్మొనర్పఁ బొత్తులో దినవచ్చు చీలినైన పొమ్మిసీః యనండు. 296

సీ. చెరువు మానస సరోవరముతోఁ గవగూడి నవరసపూర్ణయై నాట్యమాడ
క్షేత్రమ్ములున్ దాళపత్రిమ్ములం గూడి శ్రీ సంపదలతోడఁ జెంగలింప
నాఁగేటికఱ్ఱు గంటపుమొనన్ జతగూడి క్షోణి మేలిమి వర్ణశోభ లీన
సస్యముల్ స్వకవితోద్దేశ్యమ్ములం గూడి బహు ఫలప్రదములై రహిఁ జెలంగ

తే. గోగణము వృత్తగణములం గూడి కృషిని నాల్గుపాదముల్ ధర్మము న్నడుపుచుండ
సేద్యమునఁ బద్యమున జడచేతనములఁ బెంచసాగెను బోతన్న ప్రియనయముల. 297

క. వర కవితోపాసన మిహపర సాధకమంచు నాత్మ భావించి మహే
శ్వర లీలా విలసనముల పరవ మనోల్లాస మధుర శైలిన్ గూర్చున్. 298

శా. తానా పోతన కొన్ని వత్సరము లేతద్రీతి సత్కావ్య వి
ర్మాణాభ్యాసము శాస్త్రసంగ్రహము గీర్వాణాంధ్ర సాహిత్య వి
జ్ఞానోపార్జనమున్ బొనర్పఁ గవితా సామ్రాజ్య ధౌరేయుఁడౌ
శ్రీనాథుం డొకనాఁడు వారిఁ గనవచ్చెన్ దుఃఖ దైన్యాహతిన్. 299

ఉ. వచ్చిన శ్యాలకుం గనుచు వందనమున్ బొనరించి పోతరా
వెచ్చటి నుండి రాక యనఁదేమియుఁ బల్కఁడు చిన్నవోవు మో

మచ్చుపడంగ లోనరిగి యాలినిఁ గాంచి విషాదమొప్ప వా
క్రుచ్చెను బావ వచ్చెనని కోమలి పేవెలి కేఁగుదెంచుచుౝ. 300

చ. తటుకున నన్నుఁ గాంచి కనుదమ్ముల గిజ్జున నిండు నశ్రువుల్
జొటజొట గ్రిచ్చకాయలటు చుక్కలు రాల్చఁగ నోష్ఠనాసికా
పుటములు సంచలింపఁ బొరివోవుచు గద్గదకంఠ మెత్తి దు
ష్పటమును మోమునం దిడి గుభాలునఁ బైఁబడి యేడ్చె నెంతయున్. 301

చ. వలవల కంటినీర్వడిపి వందురుచున్న యవీయసిన్ గనన్
గలికలియయ్యె గుండె వెతకంఠము మట్టుకు దట్టిపట్టె నా
చెలియలి బాష్పవాహినులఁ జేద్పడి యాతని దుఃఖవారిధుల్
జెలియలికట్ట దాఁటి తడజిమ్మెను జెక్కుల దూఁకు నశ్రులై. 302

ఆ. జ్ఞానవంతుఁడైన కవినాథు శ్రీనాథు నాక్రమించి దుఃఖ మజ్జుఁజేసెఁ
దాళపత్రిమందుఁ దనరు నక్షరమును క్షరమొనర్చు చెదలపురువు భంగి. 303

ఉ. హెచ్చిన దుఃఖవహ్ని దహియించుట నిర్వ్యరి యాత్మ లచ్చటౝ
వచ్చిన లోకులెల్లరు నవార్యగతిన్ మనసుల్ కరంగి క్రొ
వ్వెచ్చని బాష్పధారలయి వేగతులౝ బ్రవహింప నీగతిన్
గ్రిచ్చర మాటలాడెదరు గ్రిమ్మెడి యశ్రులు గోటమీటుచున్. 304

ఉ. ఆలు గతింప దిక్కఱిన యాత్మజనుం గొనివచ్చి చెల్లె హ
స్తాల నిడెన్ విషాదకర సంఘటనల్ కనలే మదేమియో
జాలి జనించు నీ నిసుఁగు చక్కని మోమును గాంచఁ దల్లి చ
న్పాలను ద్రావనోఁచ దఁట వత్సరమైన నభాగ్య యింతకున్. 305

తే. వదినె చనిపోయెనని వార్త వచ్చినపుడు పురిటిలోని బాలెంత యీ పొలఁతి తాను
అందులకె యప్పు డగ్రిజు మందలించి పిలుచుకొనిరాఁగ నత్తమామలను బనిచె. 306

క. వారేగి మానమయ్యెను జేరిరి నేఁ డింటి కేమి చెప్పఁగవలె నీ
దూరపు బంధుత్వపు వ్యవహారము సంకటపువేళ నవసరపడునే ? 307

క. కన విన దుర్భర మింకను మనసున్ మర్మముఁ బెకల్చు మగువవిలాప
మ్మనుచున్ బంధువితతి యా వనితను సాంత్వన పరిశాంత వాక్కులఁ దేల్చెన్. 308

ఆ. ఉబికివచ్చు దుఃఖ మొకయింతఁ గన్నీరు గార్చి యేడ్వ శాంతి గూర్చె కొంతఁ
గలఁగి రొదయొనర్చు కాదంబినులు వాన గురియ వెన్క స్థిరత గూడునట్లు. 309

క. అప్పుడు శ్రీనాథుఁడు కడు దెప్పరమగు వగలఁ బొగిలి తేఁకువ పెడుటౝ
జొప్పడి లొజ్జదనమున్ దప్పుకొనౝలేక కంటతడి నిడి పలికెన్. 310

క. 'కడుపు ఫలించిన దనుకొని కడు వేడుకపడితిఁ గాని కడ కీగతిఁ దా
విడిపోవు నన్నటంచును నడికడలిన్ బుట్టిముంచు నాకని తెలియన్. 311

క. ఇంటిపనులె చూచెదనా చంటినిసుఁగు నూరడించి సవరించెదనా
యొంటరికాఁపుర మీఁదఁగఁ గంట న్నీరొదవుఁ గాలకంతునకైనన్. 312

క. రొమ్మునకుఁ గట్టుకొని యీ యమ్మాయిని సాకినాఁడ నది యెందును మా
యమ్మేది యనినఁ గడుపది చుమ్మలువో నెడఁద ముంచు శోకాబ్ధియలల్. 313

తే. తోడిపిల్లలు మాయమ్మతోడఁ జెప్పి పప్పు లడుగుకొందు మటంచు బయలుదేఱ
దాను మాయమ్మ నడిగెద నేనఁటంచుఁ జేరి 'నాన్నా ! మనమ్మేది చెప్పు ?' మనును. 314

క. తాఁ జనియె మీఁదిలోకము జేజెకడకుఁ బూజసేయఁ జిటితల్లి ! యనన్
వేఁ జనుదు నచటికే యను నేజాడని పోదు దుఃఖ మెటు లాగు నిఁకన్. 315

ఉ. చిత్తము నమ్మనుండి యెటొ చేసి మరల్తి మటంచుఁ జేతఁ బం
డ్లిత్తు ననేమిరా విన దొకేచదు వూరక వేఁగలే నెదో
చిత్తరు విత్తు నమ్మదనిచెప్పి పదేపది, పిల్చునమ్మ యం
చత్తటి దాని నాకపుడొ యశ్రుజలాంబుధిఁ గ్రుంకు లోకముల్. 316

తే. 'అమ్మ' ! యనుచును నీబిడ్డ కమ్మగాను బిలువ నమృతమ్ము త్రాగిన విలువగాదొ
దీనికిని మించి స్వర్గమ్ములోన నేమి జుఱ్ఱుకొన నేఁగినావు నా సుదతి నీవు. 317

క. అనుచుఁ దరుముకొనివచ్చు వెతను నేమాత్రమ్ము నాఁపుదమన వశముగా
కను దలవంచి వగతు నన్గని నా తలయెత్తి కాంచు కందువు తానో. 318

ఉ. కన్నులనీరు కన్నులనె కన్పడకుండఁగఁ గ్రుక్కుకొందు నే
మన్నను నేమ నాతనయ హా ! యని బెంగఁగొనన్ నితాంత మీ
చిన్నికుమారితం గనుచు జీవనముల్ మెయినిల్పుకొందు నే
మున్నది నాకు నీ భువి యయోమయమై కనిపించు నెల్లెడన్. 319

తే. ఆననోత్పల సుమనోజ్ఞహాసకళల వెలుఁగు నా చంద్రదీపమ్మె మలిగిపోయెఁ
దక్కిన విలాససంపదల్ చుక్కలన్ని యెన్ని యున్నను విశ్వమ్ము సున్నగాదె ? 320

క. మగువల వెతవలెఁ బొంగక మగవారల వ్యథలు లోనె మసలును గాష్ఠా
ధిగతాగ్ని పొగల మంటల నగపడు నగపడునె తప్తమగు లోహములన్. 321

క. ఇది కన్గొని లక్కాంబయు మది మైనమ్మగుచుఁ గరఁగి 'మాన్యవరా ! యీ
పొద యేల ? నేఁ గలుగ శారద మాతృవిహీన యన ధరన్ మృష' యనియెన్. 322

తే. అవని సహృదయుల్ నిష్కల్మషాంతరంగు లొరుల సుఖదుఃఖరూపము లరసినంత
యద్దములయట్ల ప్రతిరూపమై నటింత్రు కొండగుహలై ప్రతిధ్వనుల్ కూర్చుచుంద్రు.

క. పోతన శ్రీనాథుని వలపోఁత నుడుపఁగా విరాగపూర్ణ వచస్సం
ఘాత సుబోధ సమాహిత చేతనునిఁ జేయ నిటు వచించును దాల్మిన్. 324

శా. 'బావా! నీవ సమస్తశాస్త్రచయ సంపన్నుండ వస్మాదృశా
త్మావిర్భూత మహాజ్ఞతన్ దొలఁగఁజేయం జెల్లు నజ్ఞుంబలెన్
నీవే యిట్టు లపారశోకజలధిన్ నిర్వేదమున్ జెంద నిం
కే వైరాగ్యపరుండు రాఁగలఁడు నీ హృద్వేదనన్ మాన్పఁగఁ. 325

తే. ఆయు వరిగినకొలఁది తా ననవరతముఁ జనఁదొడఁగెఁ గాలసామీప్యమునకె ప్రాణి
ఇది విషాదాంతనాటక మిందుఁ జివర మంగళముఁబాడఁగల్గు సమర్థుఁ డెవఁడు? 326

శా. నానా చిత్రవిచిత్ర వర్ణగత సౌందర్యంబు లెల్లన్ లయం
బూనున్ నీడను నేత్రహాసముఖహస్తోరుప్రదేశాల వి
న్నాణంబు ల్గనరావు భూశయనమున్ దా నొంద రూపప్రతుల్
మేనన్ నీడవలెన్ జనించు నరుతో మృత్యుస్వరూపం బనన్. 327

క. ఇరులడఁచు రవికరాళిఁ జిఱునీడపట మ్మొకింత చెడునె సవిత ముం
దరుదెంచ వెన్నడఁగు వెన్బరతెంచిన విడక ముందు వచ్చు మెలఁకువన్. 328

తే. బాలవృద్ధార్కులం గని చాల పొడవు పెరుఁగు మధ్యాహ్నరవిఁ గని తఱిఁగి కాళ్ళ
బట్టుకొని మఱుంగగు నీడ బ్రహ్మచర్యయుత యువకుచెంత నడఁగి యిట్లుండు మృతియు.

శా. సాయంకాలము వర్షకాలముగతిన్ సంవర్ధకంబై మనన్
ఛాయావాహిని నైజవేగమునఁ బ్రోత్సాహమ్ము దీపింపగన్
స్వీయావాసముగాఁ జెలంగుతి మిరాబ్ధిం జేరగాబోవు నీ
కాయాజాండప్రదోష సంతమసముల్గావే జరామృత్యువుల్. 330

తే. పాంచభౌతిక సోదరభావగతిని జల్లఁగా దేహరథ మెట్లొ సాఁగుగాని
పాలిపగ నవి కచ్చకుఁ గాలుద్రవ్వి కుపితగతి వేఱుబడఁ గొంప గూలిపోవు. 331

తే. జలము వహ్నికి నాజన్మశత్రువుగదె! యగ్ని జలము నావిరిసేయ నరయుచుండు
వాయువో యవ్యవస్థితవర్తి ధరణి వీరి స్థిరమైత్రి నెవ్వఁడు విశ్వసించు. 332

సీ. కారుచీఁకట్లలోఁ గన్నుమూసిన వెల్గు తెలియునే తానొక్క తేజ మనుచుఁ
జిఱుబీజమందు నిద్దురజెందు వృక్షమ్ము నవ్వునే పువ్వు చిన్నారినోట
నావిరియై వాయువం దాడు నీరమ్ము నడచునే తానొక్క నది ననుకొని
సూక్ష్మశుక్లకణాల సుప్తిఁజెందెడి మేను తన నిజరూపమున్ గనఁగలుగునె

తే. తను నితరమును గుర్తింపఁ దరముగాని స్థితి దనరుఁ బరిణతుల సృష్టియు లయమ్ము
బిందువుగఁ బ్రవాహముగ నావిరిగ మాఱు జీవనమె సృష్టిలయయుత జీవనమ్ము. 333

తే. కనులు మూసినఁ గడలేని గమన మనును గనులు తెఱచిన నిచటనే కల ననుకొను
మహిని గానఁగెద్దు పథగమనమువోలెఁ గాలచక్రయాత్ర కొకపు కడయెలేదు. 334

ఉ. పూర్ణమునుండి పెక్కు లిలఁ బూర్ణము లుద్భవమంది మాయ నా
పూర్ణము తాను లోపమును బొందక యెప్పుడు నిల్చు నెట్లనన్
పూర్ణిమచంద్రబింబములు పూర్ణతటాక ఘటాదులందు సం
కీర్ణత నొంది జీవనము కీడ్పడఁ బూర్ణశశిన్ సమైక్యమౌ. 335

క. సవరించు నీ భగిని రెండవ ప్రాణమ్మట్లు నీదు నందన నేనున్
భవదీయ స్వప్రియగ నవలోకించెద నిపేల నడలెదు బావా !' 336

తే. అనుచు భార్యావియోగజ న్యార్తితోడ నదరిపోయిన శ్రీనాథు హృదయమునకు
నరస శీతాసునయవాక్య చందనముల నంఁదె దుఃఖాగ్ని సంతాప మపనయించె. 337

## ఆశ్వాసాంతము

క. ఇనవంశాభరణా ! మునివనితా ప్రారబ్ధపంక వారణచణ మృత్
కణ విలసదబ్జచరణా ! పినాకమదహరణ ! విశ్వవినుత వితరణా ! 338

శా. ఆకర్ణాంత జగన్మనోహర విశాలాబ్జాక్ష ! సౌందర్యసా
రాకీర్ణాబ్ధితరంగరంగముఖ లావణ్యప్రమేన దృగ్వీక్ష ! ల
క్ష్మీకాంతాకృత సింహపీఠ విపుల శ్రీవత్సవక్షా ! సురా
నీకాధ్యక్ష ! దశాననద్విపశిరోనిర్లూనహర్యక్షమా ! 339

### తోటక వృత్తము

దశకంఠ విదారణ దాశరథీ దశకాయ వితారణ ధర్మసుధీ !
దశరూప ధరాంశజ తత్వనిధీ ! అశుభాంతక పూర్ణదయాజలధీ ; 340

### గద్యము

శ్రీమద్భరద్వాజగోత్ర పవిత్రాపస్తంబసూత్ర, పరిచిత సూరిజనమిత్ర, బక్కయ్యశాస్త్రిపుత్ర
వాగేశ్వరీ సమాపాదిత, వైదేహీవర నివేదిత సరసకవితావిలాస, సహజ
పాండిత్యభాస, వరకవి విధేయ, 'వరదార్య నామధేయ ప్రణీతం
బైన పోతన చరిత్రమను మహాప్రబంధమ్మునందు
తృతీయాశ్వాసము.



శ్రీ ర స్తు.

శ్రీ వాగీశ్వర్యై నమః




## రాజ సందర్శనము — శ్రీ భోగినీ దండక రచనము



విలస త్పంచవటీ
పావనవన భాసమాన పర్ణకృతకుటీ
రావాస ! ఛద్మహరిణ
ప్రావీణ్య నిరాస దివ్యబాణ విలాసా ! 1

గీ. ఆంధ్రవాణీ మనోజ్ఞ నాట్యాభినయము తేనెలూరు సత్కవితా ప్రసూనచయము
స్వామి యవధారు పోతన సచ్చరితము జానకీజాని ప్రత్యక్ష చక్రపాణి ! 2

వ. అంత శ్రీనాథకవిసార్వభౌముఁడు. 3

చ. తన వెత డింద బంధ్వవసథమ్మునఁ గొన్ని దినాలు మానస
మ్మును గుదుటఁ బడన్వయిచి పోతనతో జతగూడి సింగభూ
పువి ప్రతిభావిశేష పరిపూర్ణు నుదీర్ణు ననంత పాండితీ
ఘను రసవత్కవిత్వ కృతికర్తను సర్వకళావిశారదున్. 4

క. కననెంచి రాజగిరి పత్తనమున కరుదెంచె మించు తత్పురవిభవ
మ్మును గని యిది యమరావతి మనమున శల్యమ్మనాఁటు మణిగోపురతఁ. 5

గీ, అనుచు పోతరాజుకు మల నలరునట్టి కోటలను బాటలంటు శృంగాటకముల
అందములకు మందిరములై యంబరమును చుంబనమొనర్చు హర్మ్యాళిఁజూపి పొగడు. 6

చ. 'నగరము యోజనాయతము నల్దిసలంటి సరస్సువంటి మే
ల్సొగసుల వీన మార్గములఁ సుందర పద్మలతానుకారులై
యగపడ నందు నంగణచయమ్ములు వారిజపత్రశోభలన్
వెగడుఁగ హర్మ్యపంక్తి నవనీరజశోభల నొప్పు లక్ష్మితో. 7

చ. మల లిరువంక లప్పురి రమారమణీమణిఁ గొల్చి నిల్చి నే
స్తులవలె నొప్పు నౌదల మనోహర కాంచన గోపురాగ్రి సం
విలసిత రాజసౌధములు విస్ఫురిత భద్రిగజద్వయమ్ము మూఁ
పుల చవుదోలు దాలిచిన పొల్పును దెల్పు ననల్పశోభలన్. 8

ధ్రువకోకిల :

మలతలం గలధౌతమృణ్మయమంజుసౌధగణాకృతుల్
తలఁ జెలంగెడి మల్లెమొగ్గల దండలై విలసిల్లునో
విలిచిపోయిన నీలనీరద నీడమున బొలుపారుచున్
చలనమందక చెల్వుగుల్కెడి చంచలాకృతు లంచలో. 9

క. వీటన్ భూపతి కుచగిరికూటము లన నొప్పు నద్రికూటాగ్రములన్
వీటగు ముక్తాహారపు పేట లనన్ గొమరు మిగులు పేఁటలు గననౌ. 10

చ. మసలెడి నాగుకోమలుల మైఁగల యామలఁకల్ యొయ్యారముల్
కొసరెడి పావురాల మెడఁ గుమ్మటపున్ గులుకుల్ విలాసముల్
ముసరెడి బాతుపిండు మెడత్రొమ్మోద్పులలో మలఁపుల్ మనోజ్ఞతల్
మెనవుచుఁ దేర్చి తీసి రదె మేడలమీఁది యనల్పశిల్పముల్. 11

ఉ. చుక్కల నాడు మంచుమల చుంచుల మించెడి కోటకొమ్ములన్
జెక్కిన పట్టుపెక్కెముల చిన్నెల వన్నెలతో నభస్థలిన్
జిక్కని పాలరాతిని రచించిన రాజమహళ్ళ వాళ్ళపై
నొక్కెడ పాలవెల్లి తడ లోహరి సాహరి నాటలాడెడిన్. 12

సీ. తూర్ణగోచ్చావచ తుక్ఖార హేషాస్వనమ్ముల మను సాహిణమ్ము లవియొ
గర్జద్వాఘన కల్పవారణ బృంహితాళి నొప్పెడి యెకరాలు నవియొ
కీర పారావత శారికా టిట్టిభోత్కర కలస్వనితగోపురము లివియొ
మార్ద్వీక మృద్వీకా మదిరాసవోద్భూత సౌరభాన్విత పానశాల లవియొ

తే. రమ్యరాణ్మందిరాంగణారామసీమ చంద్రకాంతాశ్మ నిర్మిత చారుపీఠ
కుండికాంతర స్తంభాగ్రమండిత లయి శ్రీప్రతిమ లంబుశీకరాల్ జిమ్ము నదిగో ! 13

ఉ. టక్కరి పిల్లతెమ్మెర హఠాత్తు లతాభుజమూల మంటుచున్
జక్కిలిగింత సేయఁ బెలుచున్ బొరలాడుచు నవ్వుచుండెఁ బూఁ

జెక్కులి విప్పి సౌరభము చిప్పిల ని వ్వనలక్ష్మి మోమునన్
గ్రక్కునఁ జీరి వేగ్రి భ్రమరకక్రియ షట్పదపంక్తి వ్రాలెడిన్. 14

తే. పథములకు నిరువంకల బారుదీరి కత్తిరించిన జొంపముల్ కరి మయూర
మంజు హంసాది లవలీనికుంజ రచిత సుందరాకృతుల్ విస్మయ మందజేయు. 15

సీ. సింగిణీన్ రంగారు చిత్రలేఖన వర్ణముల నిగ్గు మొగ్గకుంచెల నలంది
పాతాళలోకపుం బడుచుల నెమ్మేని సోయగ మ్మిగురుల వ్రాయుచుండి
జలదభామినుల శీతల మృదుస్పర్శ నై జాంగకచ్ఛాయల ననువదించి
నాకాంగనాస్మితానన సుధాశీకరమ్ముల నవ్వు పూఁదేనియల హరించి

తే. నాగకన్యలతో మంతనములు నెఱపి స్వర్గయువతులఁ గూడి ముచ్చటలు సల్పి
ఉభయలోక సౌందర్య కళోపపత్తి భువిఁ బ్రతిఫలింపఁ జేసె నీ పూవుఁదోఁట. 16

క. మలయజ మృగమద పరిమళ మిళిత సమీరములఁ జారు మృగనయనలతోఁ
దల లూఁపించుచు నాత్మల బులిపించు న్నగర' మనినఁ బోతన కవియున్. 17

తే. 'కొండఱకుఁ బట్టణమ్ముల యందమొప్పుఁ గొందఱికిఁ బల్లెటూళ్ళ నానందమొదవు
నిజముగా నమాయికతయు నిర్మలతయు సరళత యనఁ బల్లెలనె కాఁపురము సేయు. 18

సీ. కమనీయ రాజమార్గములు లేవట దారిఁ జన వీలుపడని కష్టములు లేవు
భానుతోఁ దలఁ గ్రుమ్ము ప్రాసాదములు లేవు స్థలమువాలని యవస్థలును లేవు
రక్షకభటవర్గ రాయబారము లేదు పశ్యతోహర సమార్పటియు లేదు
ధన్వంతరులగు వైద్యశ్రేష్ఠులును లేరు సాంక్రామికామయసరణి యరుదు

తే. తలకుమించి వినోదవార్తలును లేవు కావలయు వస్తువులవి చిక్కవవికాదు
అతి సుపరిమళద్రవ్య సంతతియు లేదు రొచ్చుకాల్వ దుర్గంధపు మచ్చు లేదు. 19

ఉ. ఐనను రాచకొండపుర హర్మ్యవిధానములున్ మనోహరో
ద్యానములున్ సరోవరవితానములున్ సువిశాల రమ్య ర
థ్యా నివహమ్ములున్ జనసుఖావహముల్ పరిశుద్ధముల్ కళా
శ్రీ నిలయమ్ము లి ప్పురి వసించు ప్రజల్ నయకోవిదుల్ బుధుల్. 20

వ. అని నుడివె నంత. 21

ఉ. ఒండొరు లిట్లు పట్టణ మహోన్నత వైభవముల్ నుతించి బ్ర
హ్మాండముగా వెలుంగు నగరావరణమ్ములు దాఁటి మేటి యా
ఖండలుఁడో యనన్ దవరి క్ష్మాతలజాతసుధర్మయౌ సభా
మండప సీమలోఁ గొలు వమర్చిన భూపతిఁ గాంచ నెంచుచున్. 22

క. అరుగుచు నాపణమున నొక యరుఁగుపయిన్ బూలఁ బండ్ల నాకుల నమ్మా
మరునాలి యగు యువతి నేమఱుపాటునఁ గాంచి బావమఱఁదులు నిలువన్. 23

ఉ. విందగు యౌవనమ్ము వలపించెడి చక్కఁదనమ్ము నేమియో
యందము చిందులాడు సిగయందు సమర్చిన పూసరమ్ము కెం
పుందళుకుల్ చలించు స్మిత పుష్ప సుగంధితమౌ విడెమ్ము బల్
పొందిక ఫుల్లగల్లపుటభూషణమై చెలువారుచుండఁగన్. 24

ఉ. చెంతనె నిల్చియున్న కవి సింహుల నా వగలాఁడి గాంచి య
త్యంత వయోవిలాస మృదుహాస మనోజ్ఞ విలోకనమ్ములన్
గంతుశరమ్ముల న్విసరు కయ్యములోఁ దగు నెయ్య మేను సా
ధింతు నఁటంచు నెంచి కడు తియ్యని భాషణ మొప్ప నిట్లనున్. 25

క. 'పుయిలోడనేల పాఠ్రిజ్ఞులు దయసేయుఁడు కప్పురంపుఁ దాంబూలమ్ముల్
పిర్రియపడు భవదీయోష్ఠద్వయమునకై రాగరసప్రదాన మొనర్పన్. 26

తే. సరసగళ సమాశ్లేష వాసనలు పెనఁగఁ గరము విప్పారు మల్లికాంగనల యొక్క
యలరు దండలు తమరి నాహ్వానపఱచు' ననుట శ్రీనాథుఁ డరిగి యిట్లనియె నగుచు. 27

సీ. 'చెక్కుటద్దము నేలు చిగురు తమ్ములపాకు వరలుచున్నది పలువరుస లొరసి
కొమ్మకెంజిగురాకు కమ్మవాతెఱ లీల ముద్దిడున్ దాసనమొగ్గ విరిసి
సరససంపద యనన్ జను నాగరంగఫలము నంద గోరాను లావు మెఱసి
చెమరించు కాంతాననమనంగ శరములన్ బదునెక్కునదె మహోత్పలము మురిసి

ఆ. పూవుఁబోఁడి భోగిభోగానుకారి యీ యలరుదండ యెంత విలువసేయు'
ననిన లజ్జతోడ నాసక్తి పెనఁగొనఁ సుదతి నగుచుఁ బల్కె సుకవి నరసి. 28

ఆ. 'దండ యిద్ది యెవరి దండఁ జెల్వారునో యట్టివారి ఘనతఁ బట్టి దీని
విలువ యెదుగు వట్టి చిలిపి యూహించిన దండతాడనమ్మె దండ విలువ.' 29

తే. అనెడి పుష్పలావికను గన్గొని కవీంద్రుఁ 'డోసి నెఱజాణ! భళిరె! నర్మోక్తి సొబగు
దండపీడి దూరమ్ముగా నుండు కంటె దండతాడనమ్మె సుఖదాయక' మనె. 30

క. లలనామణి యొయ్యారము లొలుకఁగ ద్విజుఁ గాంచి 'శిక్ష కోపుదురే మున్
బలికింతు నెందటినొ యీ చిలిపిగుణము శిల్పితనము క్షితిఁ గన నెందున్. 31

క. శృంగార శ్రీనాథుఁ డనం గవితల వల్లు మీదు నర్మోక్తుల కీ
రంగారు దండతాడనముం గొనుఁ' డని యెడఁద విసరెఁ బూదండ వడిన్. 32

క. తఱుముకొనివచ్చు నవ్వును బొరిఁ బయ్యెదకొనలఁ గఱచి పోనడచి తళ్రిపా
భర చపల వీక్షణమ్ములు నెఱుపెక్కఁగ వేఱువిషయ మేదో తడవున్. 33

ఉ. అచ్చపలాక్షి చారుతర హాసములన్ రసభాషణాదిక
మ్మచ్చటివారి జిచ్చపడు నట్లొనరింప నొయారమొల్క మీ
వచ్చిన కార్యమెద్దియొ కృపన్ సెలవిత్తురె యంచు నాదర
మ్మచ్చుపడంగఁ బోతన మహాకవిఁ గాంచి వచించె నీగతిన్. 34

ఆ. 'బడలినారు చల్లపానీయములు గొండు విరుల వీవనలను విసరవిండు
రండు లోని' కన నతం డాడు 'పానంబు జోలి మరియు మీరు గాలి వలదు. 35

శా. ఓ నీరేజదళాయతాక్షి ! భవదీయోక్తుల్ చమత్కారప్ర
జ్ఞా నిక్షేపము లీ ద్విజుండు రసవత్కావ్యైక నిర్మాణ సు
శ్రీనిర్ద్వంద్వుఁడు వీరిఁ బోల్తు వపర శ్రీనాథుగా నెవ్వరా
శ్రీనాథుండు ? వసించు నెందు ? నెటు వాసిన్ జెందు వాక్రుచ్చెదే ?' 36

తే. అనుట లా యెమ్మెలాఁడి తా నతనిఁ గాంచి మధుర దరహాసములు మొల్లమాల లల్ల
దాడిమ ఫలాల గిల్ల నేత్రములు చలువ కలువపూ రేకులన్ జల్లఁ బలికె నిటులు. 37

తే. 'ఓ మహామతీ ! యల్పజ్ఞ నేమనందు నొక మహారాణి శ్రీనాథసుకవివాణి
రాజులే గారవించెడి రామచిలుక యాంధ్రసాహిత్యవనికి ముత్యాల మొలక. 38

చ. జిలిబిలి ముద్దుపల్కులను జేతమునన్ గిలిగింతవెట్టు నా
లలితపుఁ జాటువుల్ హరవిలాసము నైషధమాది సత్కృతుల్
తెలుఁగు సరస్వతీ మకుట దివ్యదనర్ఘమణిప్రతానమై
వెలుఁగుల నీనఁగా విబుధ విశ్వము మెచ్చ రచించె నెన్నియో ! 39

క. తెనుఁగుం భారతి పూరుషతను ధారణమున్ బొనర్చి ధర శ్రీనాథుం
డను పేరఁ దిరుగునఁట నేనును నమ్మహనీయుఁ గాంచనోఁచ మహాత్మా ! 40

క. అన విని యా యొయ్యారిని గని పోతన యలరి 'యతని కావ్యముల నిటుల్
వినుతింతు వా కవియె నీమును నిల్చెనఁటన్న నెంత మురిసెదొ' యనుటల్. 41

క. కలనైన నగపడని హరి తలవాకిట నిలిచి పిలిచి దర్శన మిడిన
ట్లెలనాగ బొమ్మయై కవి కల నిజమైనట్లు ముదముగని యిటు లాడెన్. 42

చ. "నరపతి యాదృతిన్ బరిజనమ్ములతో నెదురేగి తత్కవీ
శ్వరునకు స్వాగతం బొనఁగి సత్కృతి సల్పి 'మహామతీ ! భవ
చ్చరణము మామకీన పరిషద్భవనాంతరసీమలో నలం
కరణ మొనర్చరే' యనినఁగాని యతం డరుదేరఁ డందురే. 43

శా. శ్రీనాథుం డిటు పాదచారి యగుటల్ చిత్రంబు లాందోళికా
యానస్థుండయి చామరాళిఁ గొని శిష్యవ్రాతము ల్వెంట 'వి

ద్యానాథా! కవిసార్వభౌమ!' యను విద్వద్వంది కైవార ని
స్వానంబుల్ బలికింప నేగునని విశ్వంబెల్ల కీర్తింపనే. 44

సీ. సుమనస్సులందె పదములుంచు శారద కాలినడంబోవు కత మదేమి
గణములు వెంటరాఁ గదలి పాదము వేయు భారతి కీ యొంటిపాటదేమి
ఘన సువర్ణాభిషేకముల మున్గెడి వాణి యాతపమ్ముల వాడు హేతువేమి
బహుళార్థ వైభవప్రదయైన భాషకుఁ దానయి యరుదెంచు దైన్యమేమి

తే. తపమొనర్చినఁగాని స్వప్నమ్ము నీయనట్టి పుంభావ వాగీశ్వరికిని
నపశ్రియత్నత నగపడు నవసరంబె కలయొ నిక్కమొ యిదియేమొ తెలియ"నుచు. 45

ఉ. ఇవ్విధి కల్కి పల్క హసియించుచు గాంచి వచించె నాతఁ 'డో
జవ్వని! నీవు పల్కినది సత్యమె మత్పరివార సంతతిన్
నివ్వటిలానవేమధరణీపతి రాజ్యరమాప్త చిహ్నమి
ద్ధవ్వసుధాధినేత యభియాతి భవన్నృపమౌళి కెంతయున్. 46

చ. అహితుని పక్షమం దలరునట్టి జనమ్ము లెవారలైనఁ దా
మహితులుగాఁ గనంబడుదు రాత్మకు వారి గుణంబు లెంతయున్
విహితములయ్యు ద్వేషునకు విస్తృత దోషములై చనున్ రుజా
సహితున కన్నమన్నను విషమ్మటులై సహియింపనట్టులున్. 47

ఉ. ద్వేషముఁ గొల్పు చిహ్నములఁ దేవలదంచుఁ దలంచి యిప్పుడీ
వేషముఁ దాల్చి వచ్చితిమి విస్మయమందఁగనేల యాంధ్రవా
గ్యోషకు మాతృభాష కిల యోగ్యతలేదని సంస్కృతమ్మె స
ద్భూషయఁటంచు మీ విబుధవర్గము మీదు నరేంద్రుఁ డెంచుటల్. 48

చ. విని యిటు లేగుదెంచితిమి వీనుల విందిడు పైఁడిపంట మా
తెనుఁగు విగారపుం గయిత తేనియల రుచి చూపి యాంధ్రవా
గ్వనితను నర్హపీఠమున నర్తిలఁజేసెద మీ సదస్సునం'
దనెడి గవీంద్రుఁ గాంచి యిటులాడెను నవ్వగలాడి నర్మిలిన్. 49

ఉ. 'ఎంచిన మేల్మి మౌక్తికము నేమి యెఱుంగవి బొట్టె గోలి గా
వించినయట్టు లజ్ఞనయి విశ్వకవి న్నిము నోరుజాతి నే
మించఁగ నాడితిన్ నను క్షమించఁగ నో'నని చంద్రబింబమున్
వంచన వేయు నెమ్మొగము వంచి పదాబ్జములంట మ్రొక్కనన్. 50

క. కనుగొని శ్రీనాథుం డిటులను 'వగవఁగనేల వెల! యపరాధం బే
మొనరించినావని క్షమాపణ వేడికొనంగ వలసి వచ్చెను నన్నున్. 51

ఉ. ఈ విబుధుండు పోతన కవీంద్రుఁడు వీరును నేను నిందు మీ
భూవిభుఁ గాంచవచ్చితి మపూర్వ ముదంబొదవెన్ నినుం గనన్
బావుల రవ్వ నీ సరసపుం బలుకుల్ కవిచంద్రులున్ గళా
కోవిదు లెంతొ మెచ్చిరన కోమలి ! యేమనఁ జెల్లు నీ మతిన్. 52

ఆ. త్వరగ నరుగవలయుఁ దరుణి మే మీనాఁడు సింగనృపతి ఘన సభాంగణమున
కనుచు నేగఁబూన నాచాన తమకాన ముందు నడచి మార్గమును వచించు. 53

సీ. గుట్టాల కోనేరు కొండయం దేనికల్ కంఖాణములు వేలు గలవు సామి !
ఎక్కటికాం డ్రిక్కడక్క వజీరులు తెందేపలుగ నందుఁ దిరుగుచుంద్రు
బెడిదంపు టడిదముల్ నడుములందును వ్రేల బారాలు ద్వారాలఁ బరఁగుచుండ్రు
ఆముతేనుఁగునైన నచటి మావంతులు మస్తరింతురు విడిమట్టునుంతు

తే. రస్త్ర శస్త్రశాలలు పెక్కు లలరు వానిఁ బిరికివారు గాంచినఁ దల తిరిగిపోవు
సాముగరిడీలు గల వుక్కుభీము నేలు హొంతకాండ్రిందు రందు దిగ్దంతులనఁగ. 54

సీ. ఇది కచేరీకొండ యిందుండు మన్నియ తామరచెలిచూలి త్యాగమందు
నరవనంటి గమింప నాలుగు వాకిళుల్ గడచిన కచ్చేరి కానఁబడును
నెలకలు తిన్నియల్ నలువైన యంగణమ్ములు చాల్పుగా నందు నలరుచుండు
నా దివాణము పెక్కు నడుగందకుం దెన్ని త్రాళ్ళు వేసినను సంకెళ్ళబావి

తే. దానిలోని నీ రమృత సమాన మెన్ని కఱవు లరుదెంచిన నొకింతఁ దఱుఁగ దిదియె
దారి త్వరపడుఁ దేలినవారు ముందుఁ జనుదు రలవోకకై యుపవనికి నమట. 55

వ. త్వరపడి యరుగు నియ్యెరువుర శ్రీనాథుండు. 56

క. తొలుదొల్త సుకవి పరిష ద్విలసితుఁడును బహుశాస్త్ర విహర ద్ధిషణా
కలితుండగు నృపుఁ గన్గొనఁ దలవాకిట మెలఁగు చెలువ ధ్యానించు నిటుల్. 57

మ. 'మును నీ దివ్యకటాక్షవీక్షణ కళామోఘప్రభావమ్మునన్
మనుజాధీశులు మ్రొక్కు నంటి ఘన సన్మానమ్ములం గొంటి నేఁ
డును సర్వజ్ఞుని సింగనన్ గదియఁ దోడున్నీడ వీవంటి వో
జననీ ! శారద నీ స్తనంధయుఁడ నాఁ సర్వమ్ము నీ భారమే. 58

ఆ. కన్నబిడ్డ నొరులకై యొసంగెడివేళ (జన్మొసంగి రూపు చక్కదిద్ది
యిచ్చు నెంతొ వారు మెచ్చి మచ్చికజేసి ముద్దుగొనిన తానె మురియునమచు. 59

శా. తేజఃపుంజ విరాజమాన ముఖసం దీప్తుల్ కపోలోక వి
భ్రాజద్భ్రహ్మ కళావిలాస విభవ ప్రత్యూష కల్పమ్ముగా

రాజాగారముఁ జేర సత్కవులు మార్గం బిచ్చి నమ్రించినాం
భోజమ్ముల్ వికసింప మ్రొక్కు జనమున్ మోదమ్మునన్ గాంచుచున్. 60

తే. కార్తిక దమ్ములతో నొప్పు కోటగవను గుమ్మములు దాఁటి కొల్వుకూటమ్ము జేర
ద్వారపాలురు లేచ్చమై దారి విడిచి యరుగు పిదప వీ రెవరని యడుగుకొనిరి. 61

సీ. శ్రీశైల శిఖర సంస్పృష్ట సాంధ్యారాగ గతిని కాశ్మీర రాంకవము మేన
నైరావణకరాప్త హరిశరాసనలీల మణిమయ స్వర్ణ కంకణము కేల
శశధరోభయ పార్శ్వ సందీప్త గురుశుక్రులయి రత్నకుండలద్వయము చెవుల
మేరుగోత్రధృత క్షీరవారాన్నిధి ప్రక్రియన్ గౌశేయపటము కటిని

తే. పంచశీర్షోరగఫణాగ్రభాసమాన మణులనఁగ నంగుళీయక మైత్రి వ్రేళ్ళ
వరల లక్ష్మీ సమర్చిత వాణియగుచు వచ్చె శ్రీనాథుఁ డచటివా రచ్చెరువడ. 62

సీ. సతతా వ్యయవిభూతి సంపన్నమతి యన భస్మపుండ్రాన్విత ఫాలతలము
భవవార్ధి తారణోపాయమ్మున కమూల్య కర్ణధారుఁడన రిక్తశ్రవములు
విష్కామ మానసవిలయుఁ డీతండన మహిత రుద్రాక్ష సంపదల నెడఁద
బంధముక్తుండయి పరఁగు నీతండనఁ గంకణవిరహిత కరయుగమ్ము

తే. శుద్ధ సత్వగుణోపేత బుద్ధుఁ డీతఁ డనఁగ ధౌతవస్త్రోత్తరీయములు మేనఁ
దనర వెనువెంటఁ దాను పోతనయు వచ్చెఁ గర్మవెనుకనె జ్ఞానమ్ము గ్రాలుకరణి. 63

సీ. శ్రీనాథుఁడుం బార్వతీనాథుఁడును విట్టి రూపుగొన్నరఁటంచుఁ జూపువారు
సోమ సూర్యులు సదస్యుల ముందు నరులయి యిటు వచ్చిరని వచియించువారు
ఇహపర సౌఖ్యమ్ము లీ యాకృతులఁ దాల్చి యగుపించెనని ముచ్చటాడువారు
భోగీశ్వరత్వమ్ము యోగీశ్వరత్వమ్ము మూర్తిగాంచె నటంచు మురియువారు

తే. ఎవరు వీరని యొండొరు లెంతొ వింత గుసగుస ల్వెట్టుకొను చడుగుకొనువారు
నడుగవలెనని వాలిక కడకు రాఁగ నడుగ శక్తి జాలకయుంట నుడుగువారు. 64

క. నిరుపమ విద్యాధర బుధ గురు కవి నివహమ్ముఁగూడి కొలు వమరిన శ్రీ
హరిహయవిగ్రహ సింగన ధరణీపతిఁ గాంచి సుకవి దరియన్ జనియెన్. 65

మ. చని పేరోలగమం దనర్ఘమణి భాస్వత్పీఠికాసీనుఁడై
యనఘుల్ మంత్రులు వాహినీపతులు జోహారంచు బద్ధాంజలుల్
గొని కొల్వన్ గవిపండితప్రకర సద్గోష్ఠీవినోదస్మితా
ననుఁడై వెల్గెడి సింగభూపుఁ గని శ్రీనాథుండు తా నిట్లనెన్. 66

ఉపేంద్ర వజ్రావృత్తము.

శ్లో. చతుర్ముఖ స్తే చతురాననత్వం దదాతు వాణీపతి రబ్జజాతః
చతుర్భి రాజానువిలంబి హస్తై ర్వసూని దద్యా ద్వసుదేవసూతిః

శివ శ్శివం యచ్ఛతు శైలజాతాపతి గ్గిరీశో రజతాద్రివాసః
వసంతు దేవా స్తవ మంగళార్థంచిరాయురారోగ్యజయోస్తు రాజన్. 67

శా. వప్రాట్టాలక శృంగమూర్ధ విలసద్ వాల్లభ్యచిహ్నధ్వజా
ధి ప్రేంఖన్మసృణారుణాంశుక సముద్దీప్త స్వరూపమ్ము తా
విప్రప్రాజ్ఞ కవీంద్ర గాయక నటీ విశ్వమ్ముకై స్వాగతా
భిప్రాయ ప్రకటత్కరాగ్రమయి పంపెన్ యుష్మదాహ్వానముల్. 68

తే. అవని నరరూపతన్ సింగమైన నీవొ యాచరించు హిరణ్యదానాతిశయముఁ
గాంచి ప్రహ్లాదరక్షణఁ గాఁదొడంగె రాజ్యమెల్లెడ నన నచ్చెరమ్మె భూప! 69

క. ధర రాచకొండ గిరికందరముల గర్జించు నీ కొదమసింగం బం
చరిగజము లహర్నిశములు హరివాసరజాగరముల నందె న్మకీర్తిన్. 70

సీ. వెలయాంధ్రఁ గని పలు విప్పు నీనగుమొగం బతనుత్వమును బరిహాసమాడు
నార్తుల దయఁగాంచు నాయతేక్షణములు పంకజత్వమ్మున వంకజూపుఁ
బ్రాజ్ఞు లౌదలఁ దాల్పఁ బల్కు నీయధరమ్ము విద్రుమజాడ్యము విప్పిచెప్పు
నరిఁగాంచి బొమముడి నదరు నీ యలికమ్ము దోషాకరత్వమున్ దూఱుచుండు

తే. దానధార నర్థులఁ దన్పు త్వత్కరమ్ము కలభకర మృద్వికీర్ణతన్ గడిగిపోయు
ధర్మపథమును దొలఁగని త్వత్పదమ్ము కలిని యమధర్మపదముల నిలుపు వౌర! 71

సీ. కనుగీటుటకునైనఁ గాని చక్కఁగరాని యనిమిషాంగనలఁట యప్సరసలు
అడుగు భక్తుఁడుగామి యొదయఁదైనమనేమి ఫలమొసంగదఁట కల్పతరుగణము
గురుబుధుల్ కవులయ్యు నరజాతి కనులమున్ జుక్కలై చమనఁట సురనికరము
కంట కూరుకులేని కష్టజీవనమున కంతమ్ము గనదఁట యమరజన్మ

తే. రెప్పపాటులో వలపింతు రిప్పఁడతులు ఫలము లడుగుల నర్పించు పాదపములు
గోరునకు బోలుదురు సురల్ వీరిలోన ననుచు నిందుఁడే యిటు భువి నవతరించె. 72

సీ. అక్షిద్వయము గాంచనగు నీ కవుల నర్థి దానవారికి నద్దు దవుల రెండు
నిర్మలాక్షర కళానిధియౌట నేప్రొద్దు నీ రాజకళలు క్షయించఁబోవు
మనుధర్మగతి యిందు మహిషస్థమైనేమి నీశ్వరాగ్రహపాత్ర మెపుడు గాదు
అకలంక విబుధశిష్యానీకయుతులౌట గురువు లెందును మౌఢ్యవిరతిగనరు

తే. అల సుధర్మను మించి నీ యండ వివటఁ గవులు బుధులును గురువులు గలరుగావి.
పుడమి కవిచంద్రబుధగురు పూర్తిమూర్తిఁ గాంచె సర్వజ్ఞుఁడనఁగ నీకరణి భూప! 73

శా. గీర్వాణాంధ్ర వచస్సరోవర లసత్ క్రీడామరాళంబవీ
సర్వజ్ఞత్వము నీదు సొమ్మె యపు డా శౌద్ధోదన స్వామికిన్

శర్వాఖ్యాకునకున్ రచించె నొరునిన్ సర్వజ్ఞగా నెన్నుచో
నుర్విన్ శ్వానము గాంచి సామజముగా నూహించి కొండాడుటల్'. 74

చ. అన విని భూపుఁడున్ సుమహితాసనమున్ దగ నిచ్చి వారలన్
గని వినయప్రఫుల్ల ముఖ కంజము వాఙ్మధు వొల్కఁబోయ వం
దన మొనరించి 'మీ సుచరిత మ్మెఱుఁగన్ ద్వరవుట్టు' నన్నఁ బో
తన కవిసార్వభౌముని విధ మ్మిటు ప్రస్తుతిసేసె నాదృతిన్. 75

చ. 'అదరెడి సంస్కృతాంధ్ర మహదంబుధులన్ బరిషేచనమ్ముగాఁ
బుడిసిట బుచ్చుకొన్న కవిపూజ్యుఁ డగస్త్యుఁడు జానుతెన్గు సం
గడమునఁ గావ్యశారదను గన్న విధాత మథించు కబ్బపు
న్నుడికడలిం జనించిన మనోజ్ఞ సుధాకరమూర్తి యీతఁడున్. 76

మ. కలఘోష మ్మమ డిండిమప్రవరు ఢంకామ్రోఁగ ముక్తాసభా
విలసచ్ఛాస్త్ర పురాణ కావ్యరచనా విజ్ఞాన సామ్రాజ్య వి
స్తులపీఠిన్ గనకాభిషిక్తుఁడయి యెంతో ఠీవి దీపింపఁగా
వెలసెన్ సత్కవి సార్వభౌముఁడన పృథ్వీనాథ! శ్రీనాథతన్. 77

తే. ఆంధ్ర శృంగార నైషధా ద్యనుపమాన కావ్యఖని శాస్త్ర సాహిత్య గగనరంగ
దుర్నిరీక్ష్య మధ్యందినద్యుమణి విమతవాదిమదగజాటోప నివారక సృణి. 78

క. నానాదేశ నృపాలాస్థానములన్ సిరులఁ దోఁగి తానములాడెన్
దా నీతని శారద' యన శ్రీనాథుం డిట్లు వల్కె స్మితసంగతుఁడై. 79

శా. 'పాండిత్యమ్ము పదమ్ము లంటి కొలువన్ భావప్రసూనమ్ములన్
గండూషింప మరంద మంజుల రసాఖాతమ్ములన్ జాజిపూ
దండల్ గూర్చు తెనుంగువాణి తలపైఁ దాల్పన్ నృపా! పోతనా
ఖ్యుం డీతండు మదీయభావుకుఁడు ముఖ్యుం డాంధ్రకావ్యావనిన్. 80

క. కరమున్ జాచుట హరువకె వెఱచుట లఘములకె కన్నువేయుట లన సుం
దరకవితాంగనపయినే శిరమును వంచుటలు గుణవిశిష్టతకె నృపా! 81

ఉ. అరయ నీతఁ డెంతయు వయస్సునఁ జిన్నయనంగఁ దోఁచు, బం
గారమువంటి మేల్కవిత గాంచిన మిన్న యనంగనోఁపు మున్
మీఱె యెఱుంగువా రితఁ డమేయగుణాఢ్యుఁ డఁటంచు వింతకున్
గారణజన్ముఁ డీతఁ డనఁగావలె నీవలె నగ్రపీఠికన్. 82

ఉ. బమ్మెర యీ కవీంద్రుని నివాసము కాలపటమ్ము నా నివా
సమ్మట తావకీన గుణ సాగరభూత యశోరమా విహా

రమ్మల సొమ్ముగా నుదధిరాయనిపట్టి రమాకుమారి తా
నమ్ముడువోవు నంచు విని నక్కజమై కనవచ్చితిన్ నృపా !' 83

చ. అనుటయు సింగభూపతి సమాదృతి నీగతిఁ బల్కె 'నౌర ! మీ
యనుపమ ధీవిశేష సముదంచిత భవ్యకలావిలాసినీ
ఘనత నుతింపఁగాఁ దరముగా దికఁజాఁ లన నాల్కరాదు తా
వినుఁడు ప్రతీచిఁ జేరఁజను నేను పురోపవనిన్ జనన్ వలెన్. 84

క. కావున మీ రచటికి రా సేవించెద నింక నాకు సెలవిం' డనుచున్
భూవిభుఁడు వెడలఁబూనుట యావత్ప్రజ నిలిచ ముకుళితాంజలి మ్రొక్కెన్. 85

సీ. రాజేంద్రుఁ డా హజారము వీడు ననునంత నగరు భేరీజయనాద మెసఁగెఁ
బట్టపుటేన్గు సంబర మాఁపలేక తొండమునెత్తి వడి బృంహితములు సేసె
మన్నెవారలును సామంతులున్ మంత్రులు దళవాయిగమి సలాములు బొనర్చె
వందిమాగధుల కైవారసంగతజయ ధ్వానముల్ సన్మార్గతలము ముట్టె

తే. నిలువు టంగరేఖలు వ్రేల నృపుని మ్రోలఁ బట్టు నెట్టెంపు తలవాలఁ బ్రణతిసల్పి
యడుగులందు సమ్మాళిగ లిడి నృపతికి వీవధముఁ జూపుచున్ జన వేత్రధరులు. 86

శా. తారుణ్యప్రభ తాండవింప ముఖపద్మమ్మున భృంగమ్ములై
బారు ల్దీర్చిన నీలిమీసముల తేవల్ సింహగాంభీర్య సం
భారమ్ముల్ వెదజల్లు వీక్షణములన్ బ్రాంశు ప్రవేష్టాఢ్యతన్
ధీరోదాత్త మనోహరాకృతి సముద్దీపింప భూపాలుఁడున్. 87

చ. వలిపపు కండువా భుజముపై నొక ప్రక్కనఁ బాముకూసపున్
దళుకుల వ్రేల మేల్మి జరి దాపిన ముచ్చెల కాళ్ళదోతి పిం
జల జలతారు నాట్యమును సల్ప మదేభవిలాసయానపుం
గలుములు కాళ్లబట్టుకొనఁగా నవరోధముఁ జేరఁబోవుచోన్. 88

సీ. చారు నిష్కుటముఖ ద్వారానఁ జీరాడు తోఁపుతెరం గడఁద్రోచె నొకతె
బంగారు భృంగారముం గేలఁగొని తేని యడుగులం గడిగి నీరద్దె నొకతె
భూపాల రూపరేఖా పాదపాలమ్ము మించు దివ్వెల నురాళించె నొకతె
రమణీయ సుమగుళుచ్ఛము రాయని కొసంగి పన్నీరమున్ జిల్కె పడతియొకతె

తే. తోరణల ద్వారముల మారువారువమ్ము లనఁగ నసుపుకత్తియలును సౌధాళిమండి
కోడిగము లావటించెడి కోపుచూపు లలర నలరుసోనలఁ జల్లి రధిపుమీఁద. 89

క. మనసెచ్చట నుండునో యామనిషియు వచ్చుటనె తాను మనియుండుననన్
వనిత లొనర్చు సపర్యలఁ గనఁ డా యెకిమీఁ డెడంద కవివశమగుటల్. 90

చ. 'తెనుఁగు కవిత్వమన్నఁ దరితీపుగఁ జూచితి నిన్నినాళ్ళు లా
తెనుఁగు కవిత్వ మిట్టిదని తీపిగఁ దోఁచి శిరమ్మునూఁచితిన్
ఘనులు కవీశ్వరుల్ ద్రుహిణకల్పు లనల్పు లపూర్వ శిల్పు లే
మనవలె వారికైత కెద యమ్ముడువోయె నటంచు నెంచుచున్. 91

మ. జగజంపౌ మగమానికంబులును బచ్చల్ కెంపులు న్నీలముల్
సొగసౌ ముత్తియముల్ ప్రవాళములు జజ్జు ల్వాసి మేల్జాళువా
నగతోఁ గూడి వెలుంగునట్లు తెనుఁగుల్ నానారుచుల్ రూపముల్
నిగుడన్ సంస్కృతభాషఁ గూడి మది కెంతే వింతఁ గొల్పున్ భళీ ! 92

శా. ఆ వాగ్వశ్యత యాకళావిభవ మయ్యారే ! జగద్వంద్య మా
భావౌన్నత్యము పాండితీపటిమ దివ్యత్కల్పనాశక్తి భా
షావాల్లభ్యముఁ జాటు దీటుగలదే శాస్త్రజ్ఞతన్ వీరలన్
సేవింపం దగు భాగ్యమబ్బుట ఫలించెం బూర్వపుణ్యౌఘముల్. 93

క. ఈదివ మేమో ఘనవాగ్వాదము సేతు ననుకొనిన వాక్కు పెకలదీ
మేదిని పొత్తము ముత్తోరాదుగదా దీవ్యదిహపరప్రకృతులతో. 94

తే. నవరసంబుల చవులూర వివిధగతులఁ గవిత గీర్వాణమటు లల్లఁగలదు తెలుఁగు
బాస యనిపించినారు సెబాసు ! వీర'లని వయాళికి నుపవని కరిగె నృపుఁడు. 95

ఉ. అంత నృపానుజీవి యొకఁ డాదరమొప్పఁగ నేగుదెంచి భూ
కాంతుని యానతిన్ గవియుగమ్మును దోడ్కొనిపోయి రాజహ
ర్మ్యాంతిక భాసురోపవనికాంతరసీమ మనోజ్ఞ మల్లికా
క్రాంతపికుంజ బింబితవిలాసవితర్దిఁ బ్రవేశ పెట్టినన్. 96

తే. చారు చంద్రికాంతోపల స్థగితవేది మల్లికాశీతలచ్ఛాయ మంజుపీఠి
కల సుఖాసీనులై యుండి కవివృషభులు మోహనోద్యానశోభకు ముగ్ధులైరి. 97

శా. లీలోద్యానవిరాజమాన తరువల్లీ కుంజవైవిధ్య శో
భా లోకన్నయనారవిందములు మోదాంభోనిధి మ్మగ్న భూ
పాలాభ్యర్థితులై కవీంద్రులు వసీవామా సుధాస్యంది దో
లా లోలాయిత మానసంబయిన కేళాకూళి డాయంజనన్. 98

మ. కులకాంతామణి దర్పణాయిత చతుష్కోణాఢ్య షేలాపర
స్థలి సంధ్యారుణిమమ్ము కుంకుమిడె భాస్వచ్చంద్రికాంతామలో
పల రాణ్మంటప గోపురమ్ము సరసీవారిన్ వసీభామినీ
తిలకార్థ మ్మిడు రౌప్యపుం భరణి రీతిన్ వెల్గె నచ్చోటికిన్. 99

క. వడివంక లేక యొడ్డుం బొడవున్ బొంకమ్ము గల్గు భూపు దొడలి పు
త్తడి నిగ్గు తళతళల్ మత్తడి దూఁకుచు నంగరేకు మాటుం దాఁటన్. 100

చ. వడిగొని పట్టుకుచ్చులను వంకలు బెట్టెడి నీలి ముంగురుల్
విడివడి పింజలై నిటల వీథిని గాలిని దేలియాడఁగాఁ
దడగొను నీలిమబ్బుతెర దాఁగెడి యానెలబాలు మందలిం
చెడి మొగ మొప్పవచ్చి కవి సింహాలముల్ దలవంచె వారునన్. 101

ఉ. 'మృగ్యుఁడు త్వాదృశాఢ్య కవిమిత్రి చరిత్రిఁ డిలన్ చిరాయురా
రోగ్య జయోస్తు ! భోజసమరూప ! యటంచు వచింప నేఁడు నా
భాగ్యము పండె లక్షలిడి ప్రార్థనచేసిన వచ్చువారె మీ
యోగ్యతలెన్న నెంతయు మహోన్నతముల్ మదినమ్ము నేఁ డనెన్. 102

తే. 'కవులు మీరు నిరంకుశుల్గాన నేను సంశయింతు నా హృదయవాంఛను వచింప
నైన వచియింపరాదని యాగలేను సిగ్గు విడఁజేయు రసలుబ్ధ శీల మెందు. 103

క. రమణీయార్థప్రదమై సుమనోజ్ఞాలంకృతులను శోభిలు వాణిన్
శ్రమ యనక యిందుఁ బ్రత్యక్షము సేయఁగ విన్నవింతు క్షమియింపవలెన్. 104

ఉ. అఱువు కన్న భావమననాత్మకమైన కవిత్వమే సుధా
పేశల మాధురిన్ శ్రవణపేయసుఖమ్మొనగూర్చు సర్వసం
కాశ నదీప్రవాహ జలగర్భమునన్ లభియించునే గభీ
రాశయ దోలికా లహరి నాడు సరిత్పతి రత్నసంతతుల్ ? 105

తే. అనుకొనితిగాని యది కల్లయయ్యె నేఁడు దీవ్యదాశుధాటిన్ రసదీప్తిఁ గూరు
గొప్పలగు కావ్యకవితల గుప్పువారు మెప్పుగొనినారు నేనేమి చెప్పఁగలను ? 106

క. క్షితితల ప్రత్యేకతయున్ ఋతుగతి యను దేశకాల నియతస్థితులన్
మితిమించి పూచి కాచెడి లతలున్ దరుగుల్మములుఁ జెలఁగు నివ్వనిలో. 107

తే. నేను బ్రత్యహ మివ్వనినే వసించి కావ్యలేఖనా వ్యాసంగ గతి నెఱపుదు
తాము రసయుక్త సత్కావ్య సామపణితి పల్కఁగోరుదు సుద్యాన భవ్యశోభ. 108

క. అన విని శ్రీనాథుం డా వనశోభ నొకింతఁ గాంచి భావించెడి భా
వన నాశుగతి మధుర విన్నవమొప్పఁ గవిత్వరీతిఁ బాడఁదొడంగెన్. 109

తే. 'ఇవ్వనియె జవ్వనిం బోలి యెలమి మీఱఁ పుష్పవతియౌటచే శృంగభోగ్యమయ్యె
వేతదారామ మా రామ నృపతివోలె నలరి ద్విజవాంఛితమ్ము సఫలమొనర్చె. 110

శా. కాషాయాంబర శోభ నర్యముఁడు సాక్షాత్కర్మ సన్న్యాసపున్
వేష స్వీకరణం బొనర్చె నపరాబ్ధిన్ మున్గి తాఁ బద్మినీ

యోషారత్నము కన్ను మూసెఁ బతిహీ నోర్విన్ గనంజాలమిన్
ఘోషించెన్ దివిఁ బక్షిసంతతులు దిక్కుల్ మోము మాడ్చెన్ వెసన్. 111

మ. నెలరాజున్ వలపింపఁగా సురనదిన్ నీరాడి చెంగావి దు
వ్వలువల్ దాలిచి మబ్బుకన్నియలు చెల్వం బొప్పఁగాఁ దారకా
తిలకంబుల్ ధరియింపఁ జీఁకటికురుల్ దీపింపఁ గ్రీడాసర
స్సలిలన్ గ్రాలెడి నిల్వుటద్దములఁ జూచున్ గన్దొవల్ విప్పఁగన్. 112

సీ. పచ్చందనమ్ము దివ్యచ్ఛత్రములఁ బూని మినుముట్టె వృక్షమ్ము లనెడి మిషగ
మరకతప్రభ మహాంబరముపై ధ్వజమెత్తె ఘనపూగవృక్షమ్ము లను నెపమున
హరితవర్ణము పృథ్వి నాక్రమించి తురాయి తలఁదాల్చెఁ దృణసస్యధామ మనఁగఁ
బసరికల్ గగనమున్ బంధింపసాగెను జారులతా నికుంజము లనంగ

తే. వివిధ వర్ణముల్ కనులకు విందొసఁగుచుఁ బచ్చవన్నియపైఁబడి వలచి వచ్చి
విచ్చి విహరించి పూవాన విరియఁజల్లి వెడలిపోవు నేపూఁటను దడలవోలె. 113

సీ. కన వ్యూహములఁ బన్ని కంటిపాపల రెంటి బంధించెను గులాబిపడఁతి యొకటఁ
బట్టపవల్ చుక్క లట్టె చూపెను లసన్మహితేంద్రజాలాల మల్లె యొకట
పసిఁడి ముద్దలలో సువాసనల్ సృష్టించె సేమంతికా సుమస్తోమ మొకట
విచ్చుకత్తుల పొదుల్ విరిలోనఁ జూపించెఁ గేతకీపుష్పసంఘాత మొకట

తే. మధురసాభోగ హేమకుంభములపైన నీలమణి పాలికల మూఁత గ్రాలు ననఁగఁ
దమ్మి మొగ్గలపై వ్రాలు తుమ్మెదలును బద్మినీ కుచచూచుకప్రభలు జిమ్మ. 114

సీ. తాంబూల చర్వణ దంతపంక్తులతోడి దరహాస మొనరించు దాడిమమ్ము
ఆకుపచ్చని వన్నె కోక కొమ్మలయొడిన్ బండునా పసినిమ్మపండు బుడుత
శిబి సిగ్గుపడఁ గండజీల్చి పసిండిమేన్ శుకమున కిడు త్యాగి చూతఫలము
రంభాధరామృతరసనీత నవనీత మలమెఁ బచ్చని పొట్ల మనఁటిపండు

తే. స్వచ్ఛ మందాకినీవారి సంగ్రహించి తల ధరింపఁగ నెండ వానల సహించి
మూఁడు కనుల మూసియు మీసములను గడ్డములఁ బెనుచు నారికేళ సత్ఫల తపస్వి. 115

ఆ. చేయనట్టి ఘటము వేయని సున్నము పోయనట్టి మధుర తోయములగు
నాళికేర మవని రాలిపడం బగు క్రొదవనట్లు పీఁచుఁ బొదిగె నెవఁడొ. 116

తే. పొంగి కైలాసగిరిఁ బాఱు గంగనీరు కామధేనువు పాలమీగడల తీరు
మూకుడల మూసి ముక్కంటి ముద్రవేసి తీర్థము ప్రసాదమని యిందు దింపి రెవరొ.

క. అరవిందమ్ము లశోకము లరవిరి మల్లియలు మావి యలరులు కలువల్
స్మరశర గురుప్రభావము మరిమరి యిటు విప్పిచెప్ప మఱతురె యనుచున్. 118

సీ. తొలిమబ్బు తెర నుండి తిలకించు చుక్కలదొరఁ గాంచి కనుగీటు తొవపడంతి
భ్రమరమ్ము మోవిపై బడి క్రోలఁగను లఱమూసి చొక్కెడి లమ్మిముద్దరాలు
తీఁగల నుయ్యాల లూఁగు సమీరకుమారుతో నగుపూవు మగువ ఓన్న
పికరాగ వివశయై స్వకరాగ్రముల సైగలను జేయుఁ జూతపల్లవకుమారి

తే. ప్రియవసంత సమాగమవేళ యగుట వనవిలాసిని నూత్నయౌవన మనోజ్ఞ
శోభ పెనుపొందఁ దీరైన సొమ్ముబెట్టి వల పొలయరాగమాధురుల్ జిలుక నవ్వు 119

వ. ఇత్తెఱంగున ఋతిపర్వముగా మతికి నాహ్లాదకరముగా ముఖకమల వినిర్గతమగు. 120

క. శ్రీనాథ కావ్యమధురస పానోన్మత్తాత్ముఁ డగుచుఁ బార్థివుఁ డుండన్
దా నా పోతన నిజకావ్యానంద సుధారసమ్ము లతని కిటు లిడెన్. 121

క. దళపుష్ప ఫలజలమ్ముల నలఘుమతిన్ విశ్వరూపి నర్చించుచు ని
శ్చలవృత్తిఁ బొల్చు జన్మ సఫలతఁ గనునంచు ననుభవముఁ దెల్పుఁ దరుల్. 122

ఉ. మానిత సూనసౌరభరమాకృత మారుతి యాప్యయాన మ
మ్లాన సుమప్రమోదకర మౌఖరిత ద్విజసామగాన మా
పీన లతావితానము నభీష్టఫలప్రద భూజరాజ సం
స్థాన మహీన మివ్వన విధానముఁ గానము క్షోణి నెందునున్. 123

మ. తలక్రిందుల్ తపమున్ బొనర్చు నిటులీ ధాత్రిఁ దరువ్రాత మే
ఫలసిద్ధిఁ మదిఁగోరియో పవనమున్ బానీయమున్ గ్రోలి ని
శ్చలచిత్తుంబలె నెండ వానల శ్రమల్ స్వాంతంబునం దోర్చి ప్రా
ణుల కర్పించును దత్ఫలమ్ము లివియేనో సత్తపోధ్యేయముల్. 124

మ. అలఘూర్మిన్వన భాసమాన మయి హంసాందోళికాయానమై
జలపూర్ణంబయి శీతలావిలసుఖస్పర్శాత్మకంబై కళా
విలయంబై యతి నిర్మలంబయి మిల న్నీరేజగంధాఢ్యమై
కొల నొప్పెన్ బలు మెట్లతో సమచతుష్కోణాకృతిన్ విస్తృతిఁ. 125

మ. కలహంసధ్వనితో సుధాస్మిత లసత్కంజాస్య బింబమ్ముతోఁ
జలదుత్తుంగతరంగ హస్తములతో సంపుల్ల నీలోత్పలా
క్షులతో స్వాగతమిచ్చుచున్ దివి విలఁ జూపించు దివ్యామృతం
బులతో నర్ఘ్యమొసంగుచున్ విబుధులన్ బూజించు కాసారముల్. 126

సీ. కల్లోల వనమాలికా డోలికలఁ దేలి తూఁగాడుచుండు బాతువుల పిండు
గర్భభారాలసగతి నేలు చూలాలు గొనబైన నడ వచ్చి కొలను జొచ్చి

జలమగ్న ముకుళాంబుజాత సంఘాతమై ప్రతిబింబతతి తేటపడఁగ నీట
విపులాంగకము మల్లె విరితెప్పయై తేల నాగుబామై మెడ నాట్యమాడ

తే. నీఁదుచున్ మున్గి తేలుచు నెఱకలందు నొక్క జలకణమ్మేనియు నొత్తనట్లు
వచ్చి దరిఁజేరు సంసారవనధిలోన నంటియంటక మనెడు బ్రహ్మణ్యు నట్లు. 127

ఉ. వాసన యెంతయున్న నిజవర్ణము లెట్టివియైనఁ గ్రిందు న
గ్రాసనమందుఁ గ్రాలియు ముదాకృతి నవ్వుచునుండి రెండునా
ళ్ళసుమజాతి జన్మ ధరియిత్రి సమర్చల నేల వ్రాలు నౌ
రా ! సురరాజి పీవివి శిరమ్మునఁ దాల్చుట పూజ్యతన్ గనున్. 128

మ. పికసంఘమ్ములు వేణునాద విలసత్పీయూషపేయమ్ము లో
పికతోఁ బంచుఁ బ్రసూనముల్ ప్రతిఫలాపేక్షన్ వివర్జించి హ్లా
దకరామోద మరుత్తరంగములఁ జేతప్పంహతిన్ ముంచు న
మ్మకపున్ వీథుల మంచు నేల కవి నిర్మర్యాదతన్ సత్కృతిన్. 129

ఉ. ఇన్నితరాలనుండి రచియించిన యావనకావ్య గర్వమం
దెన్నివసంతశోభ లిగురెత్తుచు నవ్వుల నాట్యమాడెనో
కన్నుల నశ్రుబిందువులు గార్చుచు నాకులపాటుతోడ ని
ల్లెన్ని గతించెనో శిశిరవృత్తము లెవ్వఁ డెఱుంగువాఁ డిలన్. 130

వ. అని యనతిదూరంబున మినుముట్టువైభవమ్ముల తులదూగు విశాలరసాలముం గాంచి. 131

సీ. పైకిఁజూడ నొకింతఁ బచ్చపచ్చగనుంట ననిలుండు నుయ్యేలల నిడి యూఁపుఁ
బ్రతిదిన మ్మింతింతఁ బైకివచ్చుటఁ గాంచి జడిసి యాపీడకున్ జనఁడు రవియు
నొరుల పీడంబడి యుండకుండుటవల్ల నాత్మాభివృద్ధి యే రాఁపలేరు
రక్షింపుమని మహీకుక్షిలోఁ దలనిడన్ దనజీవన మ్మది ధారవోయు

తే. ధనికుఁ డీరీతి లౌకికాదరముఁ బొందుఁ బతిని గని లోక మిబ్బంగి భయముఁజెందు
దైన్యరహితున కభివృద్ధి తప్ప దెందు ధాత్రి యొకఁడె పాలించు బీదజను నెందు. 132

క. అనుచుఁ బూరుహ నివహ మ్మనుదిత జీవిత రహస్య మామూలాగ్ర
మ్మనుభూతిఁ బొంది సకలము కనులకుఁ బ్రత్యక్షపఱచుఁగాదె నృపాలా !' 133

వ. అని యీగతి పోతన నిజకవిత్వ పవిత్ర గాంగఝరుల బ్రవహింపజేయుటయు. 134

ఉ. జ్ఞాన విశేషశేషుల నగాథ మనీషులఁ గాంచి వారిదా
వీమల విందొసంగెడి

చ. జలజల పూలురాలి నటు చల్లని మెల్లని పిల్లతెమ్మెరల్
తెలతెలవాఱి వీచినటు తియ్యని కమ్మని పాలపొఁగడల్
తొలితొలి తోడువిచ్చినటు తోరపు సిగ్గున ముగ్ధ కన్దొవల్
వలపులఁ జిమ్మునట్లు చెలువ మ్మొలికించు భవత్కవిత్వముల్. 136

ఉ. పూలను మల్లికాలతకు మూలములందు నుషీరజాతికిన్
వాలెము నాకులందు మరువమ్ముకు దారువునన్ బటీర వృ
క్షాళికి సౌరభమ్మొలయుఁ గాని భవత్కవితాలతాంగనన్
గ్రాలు పరీమళమ్ములు సుఖప్రదమై సకలాంగకమ్ములన్. 137

ఉ. ఈగతి సింగభూపతి కవీశ్వర కావ్య కలావిలాసమున్
ధీగరిమమ్ము మీఱ వినుతింప నుదాస్థితుఁ డొండుజేని పా
ర్శ్వాగతుఁడై వినమ్ర వదనాంచితుఁడై ప్రభుదర్శనార్థమై
వేగరి యేగుదెంచెనని విన్నపముం బొనరించె నంతనే. 138

ఉ. వాని బ్రవేశపెట్టుమి యవశ్యముగా నని యాజ్ఞయిచ్చె భూ
జానియు ద్వాస్థితుండు నృపశాసన మౌదలఁ దాల్చినట్లు న
మ్రాననుడయ్యె చిత్తమని యచ్చొటుఁ జెచ్చెరవీడె సత్కవుల్
తోనె యనుజ్ఞవేడిరి ప్రదోషవిధుల్ నెరవేర్ప గోరుచున్. 139

క. కవు లేగుటయుం బ్రణిధియు సవినయగతి నేగుదెంచి జనపతికి "జయీ
భవ" యనుచు మ్రొక్కి జనపద వివిధ రహస్యముల నిందు వివరింతుననన్. 140

వ. అంత నమ్మహీపాలుండు. 141

క. 'హితమతివి రాజనీతి సుచతురుండవు సత్కవిత్వ సాహిత్యకళా
యుతుఁడవు వినయ వివేక నిరతుడవు త్వాదృశుఁడు ప్రణిధిరాణిం గలఁడే ? 142

తే. అన్ని విధముల నీవు మా కాంతరంగికుఁడవు విశ్వసనీయచారుఁడవు మాదు
రాజ్యభృత్యులలోనఁ బురాతనుఁడవు వార్త లేమి తెచ్చితి' వన వార్తికుండు. 143

వ. వినయవినత మస్తకుండై. 144

చ. "ప్రభువులు చిత్తగింపవలె వల్లియ పల్లియ యిల్లు నిల్లునున్
సభ సభ జుట్టివత్తు భువి సర్వదిశల్ చరియింతు మేఘస
న్నిభ సుమగాత్రి యొక్కతె యనిందిత చంద్రనిభాస్య యోర్తుఁ దా
మిభవరయానసంపదల నెందును ముం దరుదెంతు రిప్పుడిన్. 145

సీ. ఆహారమే లేక యమృతమానెడి యుక్తి దివియందె కాని యీ భువిని లేదు
అంబరమ్మనిన శూన్యమ్మై చెలంగుట దివియందె కాని యీ భువిని లేదు

అల కళానిధియు దోషాకరుఁడై యుంట దివియందె కాని యీ భువిని లేదు
అగ్నిమాంద్యమ్మున కౌషధమ్ములు లేమి దివియందె కాని యీ భువిని లేదు

తే. రాజు పక్షపాతమున విరాజిలెనన పొసఁగు దివియందె కాని యిబ్భువినిఁ గాదు
తనరు ఘనజీవనము విరాధారవృత్తి ననిన దివియందె కాని యీ యవనిఁ గాదు. 146

తే. అనుచు నేలినవారి రాజ్యమ్మునందు నన్నవస్త్రముల్ చదువు సంధ్యలు సమృద్ధి
వరలఁగా ననామయతనుఁ బరఁగుచుండు నఖిలజనమని పల్కెఁ చంద్రాస్య తాను. 147

వ. అంత నో వెలదీ ? మీ రెవ్వరని ప్రశ్నింప. 148

ఉ. యాచకపాణిపద్మముల నాడెడి శ్రీని ప్రజానురాగముఁ
దోచి స్తుతిస్వరూపతనుఁ దోఁచెడి వాణిని త్యాగపాణియౌ
రేచమచర్ల సింగమయ జేవికి నే దొరసాని నంచుఁ దా
గోచరమయ్యె నా కనులకున్ దమ కీరితిరాణి భూవరా ! 149

చ. ప్రజలకు తల్లి పండితుల పాలిటి కల్పకవల్లి కర్షక
వ్రజమును శ్రీల సౌఖ్యముల రంజిలఁజేసెడి పాలవెల్లియై
నిజమును న్యాయము న్మనుచు నీదగు కీర్తిరమామతల్లి తా
సుజనులచేతఁ బూజగొని చొక్కెడి విశ్వమునందు నెందునున్. 150

క. గిరికుచతటి ఘననీలాంబర మొరయుచు మెఱయ పసిఁడిభాగ్యము గురియన్
వర సస్యశ్యామల సుందరగాత్రి ధరిత్రి వపువు ధరియించె ననఁ. 151

వ. అద్వితీయ సుందరియగు నా ద్వితీయసుందరి నన్గాంచి దరహసితసుందర వదనార
విందయై. 152

సీ. ఆదిశేషుండు విద్యావేత్తయే కాని ప్రకటించు రెండు నాలుకల తనము
అహిరాజు తలఁదాల్చి యలరించునే కాని యొకప్రక్క గరళమ్ము నొలుకవోయు
హరిపేర పాఁవజేఁ డిరవొందునే కాని దిక్కరిపాయ మర్దించుచుండు
చిలువలతేఁడయి చెలఁగు నీతఁడు గాని ప్రాణభక్షణవృత్తిఁ బరఁగుచుండు

తే. సతము కౌటిల్యగతిఁ దానె సంచరించుఁ దనరు నెందు రంధ్రాన్వేష తత్పరతను
సందులకె వాని వీడి సింగావనీంద్రు వలచియుంటి భూపతినని పలికె వధిప. 153

ఉ. ఇంకొకవార్త దాని విపు డేలినవారికి విన్నవింపఁగా
జంకొదవు న్వచింపమిని స్వామికి ద్రోహ మొనర్చినట్లదో
సంకట మొందు డెందము ప్రసన్నమతీ ! క్షమియింపవేఁడు నీ
కింకరుఁ డాజ్ఞఁదెల్పఁ దమకించు" నటన్న నృపాలుఁ డిట్లనున్. 154

ఉ. 'జగతి జనమ్ము లెప్డు తన చాటునకుం దనుఁ గూర్చి గొప్పగాఁ
బొగడెడి వాగ్విలాన మదెపో నిజమైన పొగడ్త యద్దియే
తగినటు లాత్మతృప్తి నిడి తన్ను నెడందను స్వస్వరూపమం
దగపడు మేని నీడవలె నయ్యది నామము నంటియుండి లేన్. 155

మ. మును శ్రీరాఘవు నంతవాఁడును జనామోదమ్ముతో రాజశా
సన నిర్మాణ మొనర్చె నెయ్యెడఁ బ్రజా సంక్షేమమే కోరు రా
జునకై చారుముఖమ్ము నంటు శ్రవణాక్షుల్ చారుకర్ణాక్షులై
ఘనసాహాయ్య మొనర్చుఁ బాలక మహత్కర్తవ్య నిర్వాహతన్. 156

ఆ. ఇనుని కంటె ముందె చనుదెంచి జగతినిఁ గాంచి యతని ముందు నుంచునట్టి
వేగుఁజుక్క కరణి వేగులవాఁడునుఁ గనుల విప్పఁజేయు మనుజ విభుని. 157

ఉ. కావున వేగువాఁడు తన కన్నది విన్నది యున్నదున్నటుల్
భూవిభు చెంత నంతయునుఁ బొందికఁ జెప్పఁగ నొప్పు నెప్పుడున్
గేవల నిందయంచు మదికి న్నరియయౌనని దాని మానుటే
త్రోవ నసహ్యమంచు నగదమ్ము నొసంగని వెజ్జు లాప్తులే ?' 158

చ. అనుట యథార్థవర్ణుఁడు సమాదరబుద్ధి మహీంద్రువాక్యముల్
విని "ప్రభు కీర్తి కౌముదుల వీగెలె నకీర్తితమోంధకార మో
యనఘ ! త్వదీయ సేవకున కా భయ మేటికి గాంజ దుర్వినిన్
ఘనతుల సీప్రరోహమునుఁ గంటిని యచ్చెరుగొంటి నొక్కటన్. 159

చ. నరవర ! నిన్న రేయి రఘునాయక సుందర మందిరాంగణా
వరణ కవాటకంతమున వర్తిలు చారు శిలావితర్దికో
పరి వసియించియుంటి హరిపార్శ్వ గృహస్థిత దేవదాసి ముం
దిరువురు స్త్రీలుఁ జేరి వచియించుచునుండగ వింటి శ్రద్ధమై. 160

గీ. వాలకముఁ గాంచ వారలు వారకాంత లనుచు ననుమాన మొదవె వయస్సు గాంచ
నుభయులుం దల్లిబిడ్డలై యుందురనుచుఁ దోఁచె నిజమయ్యె వారి గ్ధోరణి నది. 161

క. జనపాల ! వారి నిరువురఁ జనపియనం దనరు వృద్ధ పాటిగణికతోఁ
దనకూతునుఁ జూపుచు నిట్లనదొడఁగె విచారవిలసితానన యగుచున్. 162

క. ఇది జన్మించుట నాదొక యదృష్ట మనుకొంటి నూర నలరెడి వేశ్యా
మదిరేక్షణల కసూయాప్రదయైన స్థితిఁ గాంచి వారందు రిటుల్. 163

సీ. వగలాఁడి క్రేగంట వలపులే పూఁచెనా రవ్వలు నీలాలు రాశివడును
ఎలనాగ కెమ్మోవి చిలిపిగా నవ్వెనా ముత్యాలు పవడాలు మునరుకొనును

జాణ యింపక పైఁట సవరించుకొనియెనా పైఁడి వెండియు నింట బంతులాడు
పూఁబోఁడి పొలయల్క బొమముడుల్ గూర్చెనా యెట్టి శ్రీమంతమును గట్టువడును

తే. ఔర ! యందాలపుట్టి నీ యనుఁగుఁబట్టి కళలకుం బెట్టినది పేరు కడమ మేము
దిగదుడుపు కక్కఱకురాము దీనిముందు దివ్వెటీక్రింద వెలుఁగాఱు దీపములము 164

గీ. రామభక్తుఁడై హనుమఁడు రాఁ డదేల మారభక్తుఁడై తలక్రిందు మాఱిపోఁడె
రామ యను శబ్దమున కెందు రమణి యంచు నర్థము వచింపఁడే శుకునంతవాఁడు ? 165

గీ. అనుచుఁ కులమువా రిట్లు నోరఱుగ దీనిఁ బొగడ నేను స్వర్ణస్వప్నములను గంటి
ననుకొనిన దెల్లఁ దలక్రిందులయ్యె నిపుడు పదిగ నగువారిమును జాఱిపడుటలయ్యె. 166

ఉ. పేరు ప్రతిష్ఠలుంగల కుబేరులు బేరులు వచ్చి మెచ్చి బం
గారము నిర్వ్వనంబొదుగఁగాఁగల మంచును యావదాస్తి నీ
పేరిటఁ జేయువార మని వేలకువేలను గుమ్మరించినన్
హారతులిచ్చినన్ బయిస నంటదు ముట్టదు వారిఁ జూడదే ! 167

క. మేళముబోవుదమే యీవేళం గోటీశునింటఁ బెండ్లి యటన్నన్
గాళుల వ్రేళులఁ బడి బతిమాలినను నసేమి యొక్క మాటయు వినదే ! 168

క. చదువుల సరస్వతివి యా మదనునిరతి వీవు నవ్వి మాటాడిన సం
పదలన్ని వద్దువద్దనఁ బదములఁ బడి రావె పొదముపదయనియనఁగన్. 169

క. 'ధనవుం బేరనినసె యింధనమై నిలువెల్ల మండుఁ దను విఁక నేలా
వినిపించెద వామాటలు మును నిలువకు పొ'మ్మటంచు మోమటు త్రిప్పన్. 170

క. వెలయాలున కెవ్వేళను గులసతిధర్మములు తడవఁగూడునె యనుచో
నులుకదు పలుకదు కందమ్ముల నశ్రులు గార్చు వ్రాల్చు మో మెత్త దిఁకన్. 171

ఉ. తాలుచుఁ దీవచేడియల తావులప్రోవులు తేనెసోనలై
నాలుగునాళ లందముగ నవ్వుచు రాలెడి పూలు యౌవన
శ్రీ లివి యేరికేనిఁ గయి సేయుము లాగు నిరర్థకమ్ముగా
కాలమరుత్తు నీ ముదుపుగట్టిన యౌవనసౌరభమ్మనన్. 172

క. మీ రడిగెడి యర్థాలంకారమ్ములు శరము లేను కాంక్షించునవో
సారస్వతాక్షరాలంకారము లీరెందు గూర్చు ఘనుఁ డెవ్వఁ డనన్. 173

క. సిరియుమఁ జతురాననసుందరియును సర్వజ్ఞసింగధరణీపతి నా
క్కరుఁ దక్క వేఱొకని వీరిరువురు వరియింప రధిపుఁ డిది యొప్పఁడనన్. 174

సీ. పంకేరుహమ్మయ్యుఁ బద్మమ్ము శుచియయి భానుచే వరియింపఁబడుట లేదె
మృగమదంబయ్యుఁ దావిగల మేల్కస్తూరి శ్రీవిష్ణుతిలకమై చెలఁగ గాఁదె

కేకిలో నొక తోఁకయీకయై పురి వన్నె వెన్నుని తలనెక్కి వెలుఁగ లేదె
కీటనిర్గత తంతుకూట పీతాంబర మ్మల చక్రివసనమై యలర లేదె

తే. అసురవంశసంజాతుఁడౌ నిసుఁగు నెందు నాత్మపదభక్తుఁ డంచు హృదంతరమున
నరయు సర్వజ్ఞుఁ డొక సింగమగుచు వచ్చి రక్షసేయఁడె ? నాస్వామి రాఁడె ? యనను.

గీ. లక్షపతినైన వట్టి నిరక్షరాస్యుఁ డీతఁ డని తేనెలో నీఁగరీతిఁ దీసి
వేయు లౌకిక మెఱుఁగదు స్వీయదృష్టి నలరు విద్వాంసు నృపుఁ బెండ్లియాడుదునను. 176

గీ. ఇంత విద్దె వచ్చి యెందు కక్కఱరా దిదొక్కనాఁడు రంగ మెక్క దనుచు
జాతివార లెల్లఁ జాటుకు నేటుకుఁ బరిహసింత్రు వట్టి పిఱికి దనుచు. 177

ఉ. అంతనె కూఁతుఁ గాంచి యిటులాడె గృహంపునెలంత యెందు నీ
వింతయె కానరాదు కులవృత్తిఁ దొలంగి చెలంగుమాత్రి మో
కాంత కులాంగనాయశముఁ గాంచుదె రోవెలఁదిం జనించి మే
ల్కాంతులనీను రత్నమయి గ్రాలునె సానలదీరుకాచముల్. 178

చ. చలువలఁ బంచి పాల్గురియు చక్కని చిక్కని మోముగోముకున్
శిల కరఁగున్ లత న్వెతల చిక్కుల స్రుక్కఁగఁజేయు హొన్ను మే
ల్కళ ననలీను మేను తెలికల్వల చెల్వము నేలు మీఱుమ
న్వలఁ బడిపోవు నీ బెళుకువన్నెల చిన్నెల కన్నుపన్నలన్. 179

ఉ. అందఱు మెచ్చు పత్కళల నందియవేసిననేని రంభకే
నందని యందమున్నను పయస్సుయి బొంగు వయస్సుగల్గనే
నందలమెక్క యాఁడెడి మహత్తరమైన యదృష్ట మబ్బదే
నందని మ్రానిపండు నృపుఁ డబ్బులు సాచఁగ నేల నర్తకీ ? 180

చ. చెలియ ! నరేంద్రదర్శనము చేకురుటే కడు దుర్లభమ్ము నీ
తలఁచినయప్పు డొక్కెడల తానది చేకుఱెనన్న జేనితో
పలుకఁగ వేళజిక్క దొకపాటునఁ జిక్కిన పెక్కుకార్య మ
గ్నులు నృపు లౌర చిల్కపలుకుల్ చెవికెక్కునె తూర్యఘోషలన్ ? 181

గీ. ఎందరో సుందరులు వారి కేమి కొదువ అందులో నీవొకతె వెవ్వ రడుగువారు
కడుపునిండిన హరికంటఁ గమ్మమావిఫలము గానబడిన నేమి ఫలము చెలువ ? 182

క. వలతేని వలను బడి నిన్వలచు నృపుం డనిన నమ్మవలనుపడదు కే
వల మతని ప్రేమ మది తీవలఁ జిక్కిన మావిగున్నవలె నిలుచునొకో. 183

శా. నీ కన్న న్వగలాడినిం గనినచో నిన్వీడు నా కన్నియన్
వీఁకం గూడును బ్రేమ మేగువెనుక న్వీక్షింప దప్పుల్లి కొ

క్కోకంబుల్ వృథ లేపఁజేయగల వేన్గు న్బట్టి పల్లూపుదే
నాకుం జూడఁగ నీకృతుల్ పెదవికన్న న్మించు దంతాకృతుల్. 184

సీ. అడుగుమోపక భూమి నరుగుచుందువుగాని యడుగక యెచ్చటి కరుగరాదు
నేత్రము ల్వూషలు నిధులు గాంచెదు గాని నేత్రాల వేఱొకనిఁ గనఁజనదు
అవరోధభవనాల నలరారెదవు గాని యవరోధ మొలయక యలరఁజనదు
భోగభాగ్యమ్ములఁ బొరలుచుందువు గాని భోగభాగ్యమ్ములఁ బొరలఁజనదు

గీ. కన్నులున్నను జగమునుఁ గాంచుటకును నడుగులున్నను భూమిపై నడచుటకును
వీలొసంగని రాజసౌధాలలోని బ్రదుకుకై చచ్చిపడియుండు బ్రదుకు బ్రదుకె. 185

గీ. కావున న్వేరొకని చెల్వకాని ధనదు వలచి వలపించి బులిపించి వలయు సొమ్ము
గడనసేయుమి యెలప్రాయ ముడుగువెన్క కుడిచి కూర్చుండి కాలమ్ముఁ గడపవచ్చు.

చ. అనవుడు దేవదాసిఁ గని య త్తరుణీమణి పల్కె నిట్టులో
వనరుహనేత్రి నాది కలువ ల్వితిఖించెడి కన్నులంచు నా
ననమున చంద్రికాంతకళ నాట్యమొనర్చునటంచు మేను తీఁ
వెను దలపించునంచు నను వేరొక పూరుషుఁ గోరుమందువే. 187

సీ. హిమకరస్పర్శచేఁ జెమరించు చందుఱా ఖద్యోతమును గాంచి కరఁగఁగలదె
ఓషధీపతిఁ గాంచి యుప్పొంగు క్రొందీవ యంచను గని పులకించఁగలదె
కుముదబాంధవ దర్శనమున నవ్వెడి కల్వ చంచలం గాంచి హసించఁగలదె
వరసుధాకరరుచు ల్మరగు చకోరమ్ము కరదీపికాకాంతి కరఁగఁగలదె

గీ. చంద్రికాంతాననయు లతాచారుగాత్రి కువలయదళాక్షి మృదుల చకోరహృదయ
రాజదర్శనస్పర్శనరక్తి లేమి కరఁగి పులకించి తులకించి కాంచి నగునె ? 188

ఉ. అందని మ్రానటంచు నెద యందు నిరాశలఁ గుంది నిస్పృహల్
జెంది మహీరుహమ్ము దరిఁజేరుట మానుకొనంగవచ్చునే
పొందుగ తాలవైచినఁ బూర్ణబలమ్మున గాలి వీచినన్
ముందర వచ్చి రాలిపడు మోదగతి న్భుజియింపగాఁబడున్. 189

క. కలవాఁడై నం జాలునె చెలువుఁడు రసికుండుగామి జీవిత మేలా
చెలువలు కలువలు సరసుల చలువ వలన నిలువగలుగు జలజదళాక్షీ ! 190

చ. కళలకు శ్రీని మేల్మియసు గల్గినవాని ధనంపుతేని చ
క్కలి చెలికాని సంతత సుఖమ్ముల కిమ్మగు రాజధాని నిం
చుల విలుకానిఁబోని వరసుందరు సింగనభూమిజాని నే
వలచినదాని నన్నతఁడు వద్దన దేహమునేని వీడెదన్. 191

గీ. క్షుద్రమానవుతోఁ గూడు సుఖము కన్న రాజుఁ గూడు కష్టమ్మె గౌరవకరమ్ము
సమద జంగా విమిశ్రి దుగ్ధముల కన్న సమల గంగోదకమ్మె సుఖావహమ్ము. 192

ఆ. అనెడి తనయ నుడులు జనయిత్రి విని యోసి పెద్దిదాన ప్రేమ గుర్రిద్దె దెందు
రాజు కల్మషాంతరంగమ్మునకు నద్దమేల విను మటంచు నిటు వచించు. 193

సీ. అమృత మొల్కించు దేవావతారం బన్న అల నిశాచరవృత్తిఁ జెలగుమందు
చల్లని ప్రభువు దర్శన మొనర్తమటన్న సరి దర్శనము మాసమరుగ నొసఁగు
శీతలకరసమాశ్లేష మ్మొసఁగునన్న కఠినుఁడై విరహులఁ గష్టపెట్టు
తన వారి నిధుల వర్ధనముఁ గోరునటన్నఁ దమ్ములపై నరిత్వమ్ము జూపు

గీ. అందగారాని చుక్కల నాడుచుండు నఖిల జగముల కధికారియై చరించు
విశ్వసింపఁడు ఛాయకు న్వెలుచుకొనును చంచలుఁడు రా జతని నమ్మ జడులు గలరె ?

చ. గురువునకేని ద్రోహ మొనఁగూర్చుటకై మనమం దొకింతయుఀ
వెఱవఁడు రాజు రాజ్యపదవీ మదమత్తుఁడు వానిఁ గొల్చుటల్
పరవశవృత్తిగాదె సుఖపంజరబద్ధ శుకస్వరూపవై
యరు సెటుజెప్ప నీవు నటులాడవలె న్మఱి మాఱుపల్కక౯. 195

గీ. సరసభృంగసంగతి నున్న విరిపడంతి దేవతాసేవ కర్హమై తేజరిలదొ
దేవదాసిగాఁ బేరొంది దీప్తిఁజెందఁ బరువుమాలిన దెప్లయ్యెఁ బతుపుఁగత్తె ? 196

సీ. దీనయొ నొకని స్వాధీనయై యుండదు సతత సువాసినీస్థితిఁ జెలంగు
కులటయొ నాత్మీయకులబహిష్కృత కాదు వంశ మర్యాదకు వన్నెఁగూర్చు
అబలయొ నరుని దేహబలాప్తి నోడదు చిలిపినవ్వులఁ బరాజితు నొనర్చు
నభయలజ్జాస్యయొ సభల నిందితయెగా దాటపాటల సమాజాదృతి గొను

గీ. సురలచే స్వర్గమందు నాదరము జెందు శుభములకు ముందు భూపాల సభలయందు
హరిహరాదుల కనువిందు యజ్వపొందు సానిదాని మించెడి దొరసాని గలదె. 190

గీ. దర్శనమున మత్తెక్కించు తరుణమదిర స్పర్శలేక వేధించెడి స్మరశరమ్ము
సకల ఋతువుల నలరు వసంతలక్ష్మి పవలురే ల్వెల్గు చంద్రబింబమ్ము వేశ్య. 191

క. కావున నాపలుకులు విని భూవిభునే వలతుననెడి మూఢ మతమ్ము౯
బోవిడిచి స్వకులవృత్తిని సేవించి యశమ్ముగాంచి చెలఁగుమి తనయా ! 199

మ. అనిపల్క న్జనయిత్రి కిట్టులనుఁ దీవ్రాసహ్యాభావస్ఫురా
ననయై యాత్మజ కర్ణ శల్యములు నింద్యమ్ముల్ త్రపాహీనముల్
వినగాలేను త్వదీయభాషణలు దేవీ ! చాలు నీ ధర్మబో
ధనముల్ తల్లి వినంబుపోయుననఁ బ్రత్యక్షమ్ము లీజాతినే. 200

మ. మునుజన్మమ్ముల సేయరాని దురితమ్ము ల్జేసి నీర్వోసి పెం
చిన తత్పాపఫలమ్ములం గుడువఁగాఁ జేకూరె నీజన్మ వ్యా
ధిని ముం దేఁగి యహింస మానవున కెందు న్శ్రేష్ఠధర్మమ్మనన్
వినవే లోభిమనమ్ము లూసరము లుర్వి న్ధర్మబీజక్షితిన్. 201

మ. ధనమే ధర్మము కామ మయ్యదియె బంధప్రాప్తికి న్మోక్షమా
ధన మాత్మీయులు నాప్తబంధువులు మిత్రవ్రాతముల్ విత్తమే
ధనతృష్ణాంధులకు న్ధనేతరపదార్థంబైన పేర్మార్థసా
ధనమైనట్టి మనమ్ము గానఁబడునే తన్మూలమే సర్వమున్. 202

శా. స్నేహప్రేమల దాయుచున్ దనుమనశ్రీ లర్పణల్ సేయుచున్
దేహంబై తమఁగూడఁ దా నటువలెన్ దేహమ్మయై మారకన్
లోహంబందున మోహమందు నెద యాలోచించు లోహంబొకో ?
దేహాకారముఁ బూను లోహమున నెంతే మెత్తనౌ కత్తియా. 203

మ. తగ నీహారతుషారధారలను ముక్తాహారముల్జేయ వీ
లగునే ధూమము నంబుదమ్మనుచు వర్షాపాత మేపారునా
వగదే లోకము శుక్తివిన్ రజతమన్నం గొట్టినన్ జిట్లదే
మొగమున్మాత్రము మార్చిచూపు వలపు ల్మోహమ్మనన్ మోసమా. 204

చ. ఎద ననురాగ మా విటుపయి న్మనునందుఁ విడెంపుఁజెల్మితో
పెదవులపైనమాత్ర మగుపించును రాగము గాన మైత్రితో
నదయముజెందు నెందు పరపోక్తుల సన్నవికూనరాగమా
ఎద నలుమూలల న్వెదక నింతకు రాగమె లేదు పేరుకున్. 205

గీ. అంతరంగ పవిత్రత కందనట్టి పాత్రలో నుండు మలినజీవనము తాను
దేవతార్చన మొనరించు తీర్థమైనఁ గ్రోలువారికిఁ గీడుఁ జేకూర్చదొక్కొ! 206

సీ. సురనామమూని యసురకృత్యముల రేఁపి సేవించువారినిఁ జెరుపుచుండు
చనుచుండ నెవరేని గనుచుండిరో యని చోరునివలె గొంది దూరుచుండు
అతినీచపాత్రయై యాకర్షణ మొనర్చి సాంకర్యమునకు నాస్థాన మగును
విస్ఫారమగునట్టి వీర్కంఠెఁ బలుచన యగుచును మితిమీరి యెగసియాడు

గీ. స్వాదురూపాన మానససదన మంటి ప్రమదదోలలఁ దేల్చుచు భ్రమల ముంచి
కలుగు సర్వస్వమును వెలిఁగ్రక్కఁజేయు మధుఘట మ్మెందునేని సమ్మాన్యమగునె ?

గీ. విలువపీతాంబరము దాల్చు వేశ్యకంటె దిసమొలం జరించెడి దొడ్డిపసులు మేలు
యతుల నైతికవృక్ష సంహతి నొనర్చు వేరుపురువని ప్రఖ్యాతి వేశ్యజాతి. 208

గీ. చెప్పకున్నను నరుదెంచు జెడుగుణములు పట్టి బోధింప సుగుణము ల్పట్టువడవు
మట్టియంటును కుమ్మరివానికిఁ జేర పసిఁడియంటునె కమసాలివసతి కేఁగ ? 209

క. వేసటజనించె త్వదుపన్యాసమ్ముల వినుచు వింక నాతల్లి యనన్
నాసరస గద్దియంగల భూసురుఁ డిదిగాంచి మోదపూర్ణహృదయుఁడై. 210

క. 'వెలవెలఁదుల జన్మించెడి పొలతియె యుష్మత్కుల తులసిమొక్క విధమునన్
మొలచెను స్త్రీరత్నం దుష్కులాదపి' యటంచు దాని స్తుతియించె నృపా ! 211

తే. అద్విజుం డిప్డు మీదరి కరుఁగుదెంచి చనెడి యిరువురిలోన బోతనసమాఖ్య
బరఁగువాఁడు శ్రీజానకీపతివి రేయి దర్శనమొసర్ప వచ్చె నాస్థానమునకు." 212

తే. అనుచు వేగరి పల్క నేమనుకొనియెనొ భూవిభువిమోవి చిఱునవ్వుపూలు గురిసె
స్మితసుమాల నామోదమారుతము విరిసెఁ జదలఁ దారకాపఙ్క్తిణయివి శశిఁ దరిసె. 213

చ. వనభువి వీడి తేఁడు పరివారసమేతము రాజమందిర
మ్మునఁ జనెఁ జౌతిచంద్రుఁడు నభోగతి వీడెను నర్తకీమన
మ్మున విరహాంధత ల్పెనఁగె భూస్థలిఁ జీకటు లావరించె బా
ష్పనికర మోడ్చె భోగిని యివమ్ము స్రవించె దిశాముఖమ్ములన్. 214

గీ. తరుణిమం బేగ నెంతయు నరసి విరియ వనితకురు లన్నియునుఁ దెల్లవాతె ననఁగ
ఇరులు దిశలందు హిమగతి కురిసి కురిసి కరగిపోవు మేఘమ్మయి తరలసాగె. 215

గీ. చీఁకటింటికి తొలిసంధ్య చిచ్చుపెట్టె త్రిపుకణమ్ములై కరఁగెను తారకాళి
పూత మెఱుఁగారు ముకురాలఁ బోలి దిశలు వింతచెలువమ్ము దిద్దెను విశ్వపతికి. 216

తే. అల యుషస్సను తెరపట మవలినుండి కమలబాంధవుఁ డత్యంతకాంతిమెయివి
మంచుముత్యాల తలఁబ్రాలు ముంచి పోసె సిగ్గుమై పద్మిని యుదరస్మితము గురియ. 217

సీ. అఱు మోడిచి పొదుఁగంది నాకుచు నిల్చి యంభారవళి లేఁగటావు లఱచుఁ
దలవె న్మొగిడ్చి రెక్కల డాఁచి కన్మలు్ప ఖగతతుల్ కోమల వెగయుఁచు గూయుఁ
దమపైనఁ గప్పిన తల్లిరెక్కలమధ్యఁ దలలెత్తి పిట్టపిల్లలవి యఱచు
నిలయాన నొరగాల నిల్చి కూర్కెడి పుంజు కోయని మెడసాఁచి కూయసాగు.

తే. నట్టె దేవతావేశమైనప్పు డదరి సిగము దూలెడిగతి మాఁగుఁ జెట్లగుంపు
చల్లగాలి దొంతరలు దిగ్గజధు లందు నలులుగొని స్వేచ్ఛగా నీఁదులాడుచుండె. 218

తే. మహిత దుర్గ సింహద్వార మంటపముల లలితగతిని సన్నాయిమేళమ్ము లొకటఁ
బ్రొద్దిశాకీర్ణ రాగానఁ బ్రొనఁగలిపి హాయి భూపాలరాగాల నాలపించె. 219

చ. నగరికి వాఁకిటన్ ధణధణధ్వని మ్రోఁగె నగార మాగధుల్
పొగడుచు 'రావు సింగనృప భూషణ గండరగండ వైరిమ
త్తగజ నృకేసరీ ! సుకవితారసపూర్ణమహోదధీ ! యుదా
రగుణ సురద్రుమా ! బహూపరా' కని పాడిరి సుప్రభాతముల్. 220

ఉ. అంతనె కాల్యముల్ నెఱపి యంత్రముల పాదుక లూని ఱేఁడు శు
ద్ధాంతము వీడి వంది నివహమ్ము సభాస్థలి చేతులెత్తుచున్
బంతులు తీరి 'సింగమ నృపా ! విజయీభవ' యంచుఁ బాడ సా
మంతులు మంత్రులున్ వినత మస్తకులై నిలువన్ స్మితాస్యుఁడై. 221

ఉ. వారిని వోలెఁ దక్కు పరివారముఁ గాంచుచు హస్తసంజ్ఞలన్
గూరుచొనంగఁ బంచి కవికోటికి నౌదల వంచి మ్రొక్కి ద
ర్బారును దీర్చి కూర్చొనియె బంగరుసింగపు గద్దెపైన సిం
గారపుఁ జామరా లుభయకక్ష్యల నాడఁగ రాజహంసలై. 222

తే. అంత సభలోని కొకవృద్ధ యరుగుదెంచి నృపునిఁ గని మ్రొక్కి సభికులు నివ్వెఱపడ
దివి గులుకు రంభకళలను దించివేయు తనదు బిడ్డను జూపి యిట్లనుచుఁ బలికె. 223

శా. 'నిత్యంబైన ధనమ్ము సత్కళ యొకండే యంచు గీర్వాణ సా
హిత్యాభ్యాసము గానశాస్త్ర పటిమల్ హృద్యాంధ్ర వాగ్వశ్య పాం
డిత్యంబుఁ జయదేవ గేయ సుమవాటీ చారు సంచారకృ
న్నృత్యోపేత మనోహరాభినయముల్ నేర్పించితిన్ దీనికిన్. 224

క. ప్రాజ్ఞులు గావీ పలుకులు విజ్ఞులకే తెలియు విద్దె విలువ యనిన స
ర్వజ్ఞులు మీ ముందఱ నీ యజ్ఞ యిటులఁ దెల్పుటన మహా సాహసమౌ. 225

తే. కాని తెలిపెదఁ ప్రభువు కీ కళల యందు నెది మనమ్మున కత్యంత మిష్టమగునొ
యా కళాప్రదర్శనమున కాజ్ఞ యిడెద రనుచు దెల్పితి దాసి క్షమార్హ' యనిన. 226

తే. తనను గూర్చి చెప్పెడి తన తల్లి పైనఁ జాలులెమ్మని బొమముడుల్ గ్రాల విసిగి
దృగ్యుగళి కాందిశీకమై దెసలఁ బర్వ సిగ్గున సవరుచును దన చెంగు కొంగు. 227

తే. 'ఇలఁ గళోపాసకుల కెందుఁ గలుగుఁ బ్రతిభ దేనిలోనఁ దన్మయత వా రూనఁగలరొ
యా కళలె దర్శనీయమ్ము' లని నృపాలుఁ డామె మదికి నచ్చినది చేయనగు ననియె. 228

క. అనఁగనె జయదేవాష్టపదిని గొని యొక కొంత సేపు తియ్యని భావా
భినయంబు నృత్యగతితో నొనరింప న్నిల్చెఁ దల్లి యొగి హంగు నిడన్. 229

గీ. చెక్కి చేసిన మోహినీ శిల్పమనగ దిద్దితీర్చిన నవరత్న దీపమనగ
పోతపోసిన యపరంజి బొమ్మయనగ అచ్చ మచ్చరయే యన నా లతాంగి. 230

చ. నగరికి వాఁకిటన్ ధణధణధ్వని మ్రోఁగె నగార మాగధుల్
పొగడుచు 'రావు సింగనృప భూషణ గండరగండ వైరిమ
త్తగజ నృకేసరీ ! సుకవితారసపూర్ణమహోదధీ ! యుదా
రగుణ సుదుర్ప్రిమా ! బహుపరా' కని పాడిరి సుప్రభాతముల్. 220

ఉ. అంతనె కాల్యముల్ నెఱపి యంఘ్రుల పాదుక లూని ఱేఁడు శు
ద్ధాంతము వీడి వంది నివహమ్ము సభాస్థలి చేతులెత్తుచున్
బంతులు తీరి 'సింగమ నృపా ! విజయీభవ' యంచుఁ బాడ సా
మంతులు మంత్రులున్ వినత మస్తకులై నిలువన్ స్మితాస్యుఁడై. 221

ఉ. వారిని వోలెఁ దక్కు పరివారముఁ గాంచుచు హస్తసంజ్ఞలన్
గూరుచొనంగఁ బంచి కవికోటికి నౌదల వంచి మ్రొక్కి ద
ర్బారును దీర్చి కూర్చొనియె బంగరుసింగపు గద్దెపైన సిం
గారపుఁ జామరా లుభయకక్ష్యల నాడఁగ రాజహంసలై. 222

తే. అంత సభలోని కొకవృద్ధ యరుగుదెంచి నృపునిఁ గని మ్రొక్కి సభికులు నివ్వెఱపడ
దివి గులుకు రంభకళలను దించివేయు తనదు బిడ్డను జూపి యిట్లనుచుఁ బలికె. 223

శా. 'నిత్యంబైన ధనమ్ము సత్కళ యొకండే యంచు గీర్వాణ సా
హిత్యాభ్యాసము గానశాస్త్ర పటిమల్ హృద్యాంధ్ర వాగ్వశ్య పాం
డిత్యంబుల్ జయదేవ గేయ సుమవాటీ చారు సంచారకృ
న్నృత్యోపేత మనోహరాభినయముల్ నేర్పించితిన్ దీనికిన్, 224

క. ప్రజ్ఞలు గావీ పలుకులు విజ్ఞులకే తెలియు విద్దె విలువ యనిన స
ర్వజ్ఞులు మీ ముందఱ నీ యజ్ఞ యిటులఁ దెల్పుటన మహా సాహసమా. 225

తే. కాని తెలిపెదఁ బ్రభువు కీ కళల యందు నెది మనమ్మున కత్యంత మిష్టమగునొ
యా కళాప్రదర్శనమున కాజ్ఞ యిడెద రనుచు దెల్పితి దాసి క్షమార్హ' యచిన. 226

తే. తనను గూర్చి చెప్పెడి తన తల్లి పైనఁ జాలులెమ్మని బొమముడుల్ గ్రాల విసిగి
దృగ్యుగళి కాందిశీకమై దెసలఁ బర్వ సిగ్గున సవరుచును దన చెంగు కొంగు. 227

తే. 'ఇలఁ గళోపాసకుల కెందుఁ గలుగుఁ బ్రీతిభ దేనిలోనఁ దన్మయత వా రూనఁగలరొ
యా కళలె దర్శనీయమ్ము' లని నృపాలుఁ డామె మదికి నచ్చినది చేయనగు ననియె. 228

క. అనఁగనె జయదేవాష్టపదిని గొని యొక కొంత సేపు తియ్యని భావా
భినయంబు నృత్యగతితో నొనరింప న్నిల్చెఁ దల్లి యొగి హంగు నిడన్. 229

గీ. చెక్కి చేసిన మోహినీ శిల్పమనగ దిద్దితీర్చిన నవరత్న దీపమనగ
పోతపోసిన యపరంజి బొమ్మయనగ అచ్చ మచ్చరయే యన నా లతాంగి. 230

ఉ. వేదము లుద్ధరించి బలు వీఁపున నద్రి ధరించి కోరపై
మేదిని నుంచి దైత్యుఁ గసిమీర వధించి బలిం గలంచి భూ
పాదుల ద్రుంచి రావణు లయంబొనరించి హలమ్ము బూన్చి హిం
సాదుల మాన్చి మ్లేచ్ఛకుల హత్యఁ జరించు హరి న్నుతించెదన్. 238

త్రిపుటతాళము

తగ్గధింత తాంహత ధీనుత తద్ధీనుత తాను ధణాంతరి
తఝుంతరిత తఝుంఝుంతరిత తఝుంతరిత ఝుంతక రేకిణ
తడికుడిడికుడిడిడికు డింకికు, తక్కిణనగ తకుందరి కిణనగ
తకుందరికుంద ధికుందరి తకుందక
జల ధినిహత వేదావనచణ విలసద్ఘనవౌకాభకరణ !
ఖలసోమకదైత్య విదర్హణ బలశోభిత మీనశరీరా !
మందరగిరికృత వరగోపుర సుందరతనుమందిర మహీధర
బృందారక సుధాప్రదాశ్రిత మందారా కూర్మాకారా !
పిశితాశనవధా కథాంచిత దశనాగ్ర విలగ్న మహీకృత
శశిమగ్న కళంక కళాధృత విశదాంగా వరాహరూపా !
కరభుజగ నఖర దంష్ట్రాహృత హిరణ్యకశిపు ప్రాణాశన
వరభక్త ప్రహ్లాదావన వరదా ! నరహర్యవతారా !
బలిదత్త త్రిపదావని ధనవిలసిత విక్రాంత త్రిభువన !
బలిమస్తక ధృత పదపావనతల ! శ్రీమద్వామనరూపా !
క్షత్రియ కులగోత్రవిఖండన సుత్రామ ! పరశుపవిమండన !
శాత్రవ మదగర్వాంధతమసమిత్రా ! శ్రీ భార్గవరామా !
దశదిక్పాలామర కామిత దశముఖ పశుబలి దాననిరత
వికాట మదగజ కంఠీరవ ! దశరథాత్మజా ! రఘురామా !
లలితశేషలావణ్యాజిరతులిత మసృణ ధవళ కళేబర !
జలధిసదృశ వరకృష్ణాంబర హలముసలధరా ! బలరామా !
యాగస్థిత పశుహింసావల వేగాంతక కరుణాంబుధి జల
త్యాగాప్త్రవిజిత భవశృంఖల శ్రీగౌతమబుద్ధ శరీరా !
ఉరు యవన వనాగ్నిజ్వాలా ! కరధృత భీకర కరవాలా !
వరదనుత జగత్పరిపాలా ! తురగస్థిత కల్క్యవతారా ! 239

వ. అని దశావతార కథా విధానంబు నభినయించి. 240

చ. ముసిముసి నవ్వులా పెదవి మూలల దాఁగుడుమూఁతలాడఁగాఁ
బ్రసవమునొందె నందు నెలవంకలు చెంపకుఁ జేరలా కనుల్

గుసగుసలాడసాగెఁ జెవి కోనలతో వల సింగిణీ ల్భొమల్
గుసుమశరమ్ము లెక్కిడుచుఁ గోమలతన్ లతలై నటింపఁగన్. 241

చ. మసలె వయోరమా మధురమందిరదీప్తి సురోజయుగ్మమా
పసిఁడి పయోజషండములఁ బయ్యెద గాంగతరంగమాలికల్
విసరెఁ దటిల్లతాపఙ్క్తులు వీరవిహార మొనర్చెఁ గౌనునన్
గొసరెను లోకలోచనచకోరము లా వదనేందుబింబమున్. 242

చ. పసిరిక పట్టుచోలమున బాహువిలాసము లాటలాడఁగా
మసృణ మృణాలనాళ వనమాధురు లుర్విని బర్వెఁ దేఁటులన్
గసరుచు బారలౌ కురులఁ గట్టిన కీల్జడ నల్లనాగమై
కసుబుసులాడె శ్రోణితటి గంతిడెఁ దంబుజకాయ పొంకముల్. 243

ఆ. ఒడుపు నౌదుగుఁ గల్గి కడు కోమలత నొప్పి యభినయించునట్టి యా లతాంగి
యొకొక యవయవమ్మె యొయ్యారముల నిధి కవనజలధి శిల్పకళల కవధి. 244

తే. చేయి మెదలుపఁ జాలేమొ చెల్వుగుల్కుఁ గాలుగదలుప నేమొ చక్కదనమొల్కు
గొంతువిప్పినఁ గోకిలల్ కొసరి పల్కుఁ గొమ్మ చూపుల విందిృజాలమ్ము పేయు. 245

తే. తమ్మిపూఁబొట్టలంబోలెఁ దళుకులీను మట్టలన్ దమ్మిరేకులై మలఁగు వ్రేళ్ల
నందచందము లెల్లఁ దా మణఁగి మణఁగి వంగిచెప్పిన ట్లాడుచు వరలుచుండె 246

తే. త్రికరణసమన్వయత్వముఁ దేటపఱచు సాత్వికాంగికవాచిక సహజవృత్తి
భావరాగతాళాంచిత భరతనాట్య భంగిమలఁ జూపె నాహార్యసంగతిఁగొని. 247

సీ. హంసముఖాకృతి నలరించు నొకముద్రి భ్రమరాకృతుల నొందు భ్రమను గొల్ప
హరిణముఖాకృతి నమరియుం డొక ముద్రియెగయు పతాకమై యెసఁగు నొకటి
శంఖచక్రాకృతుల్ సరిపోలు నొక ముద్రి దర్పకబాణసంధాన ముద్రి
శిఖరాకృతుల నధిక్షేపించు నొక ముద్ర యభయప్రదానహస్తాబ్జ మొకట

తే. ముకుళముద్రల భుజలతల్ మొగ్గదొడుగు బూర్ణ వికసిత ముద్రలఁ బూలుబూయు
వంపులగు వ్రేళ్ళఁ బూరేకు సొంపులీను క్షితిఁ గదలియాడు లత యా నెలఁత యనంగ.

సీ. బేసరికమ్మలు తీసినట్టులె వ్రేళ్ళ నొయ్యారముగఁ జీల లొలిచిపెట్టుఁ
బరిటయంచును బంటఁ గఱచి యద్దాని చాటున రైక విడిచినట్టులు నటించు
ముక్కుంజెవుల వ్రేళ్ళ మూసి నీటమునింగి స్నానమ్మొనర్చెడి వరణిఁ దెల్పు
నవతార దళకమ్ము నఱచేతిలో నాట్యమాడించు శివపూజ లభినయించుఁ

తే. తానమాడుచున్నతఱి చెల్వఁ దరుదెంచి చెట్టునెక్కి కొంచు గుట్టుదెలిసి
నగుచు నత్త వచ్చె దిగుమంచు జిగిమించు కళుకుఁజూపుతోనె గదిమివైచు. 249

తే. పూలఁగోయుచు నొడిఁజేర్చి మాల గూర్చి సరి నొనర్ప దారము పంట గఱచికొనుచు
సిగవిడిన సూదిదారమ్ము స్మృతికిరాక కుంచితభ్రూలతలఁ దల గోకికొనును. 250

తే. పూవుఁదీవియపైఁ బ్రాకు భుజగు లనఁగఁ గుడిభుజమునుండి కటి వ్రేలు కురుల నొడిచి
చూపు లోరఁద్రిప్పుచు జడచుంచులల్లు మ్రోడ్పుకన్గవన్ బ్రణయమ్ము మొగ్గదొడఁగ. 251

క. అద్దమున రాల్చి గుంకుమ ముద్దుగఁ దిలకము సవర్చి మురియును గనులన్
దిద్దిన కాటుక వ్రేల్ తల రుద్దును గురులొరయ నీటు రూపొందు కయిన్. 252

తే. ఒలుకు శ్రీగంధ మఱచేత నూర్చుకొనుట అందముగ నీనెలను దీసి యాకుమడఁచు
భావముల హస్తవిన్యాస ఫణితిఁ జూపి యచ్చెరువు గూర్చు గతుల నాట్యమ్ము సలిపె.

తే. సంయుతాసంయుతములగు సరస ముద్రలందు సౌందర్యజగతి రూపందుచుండ
హస్తపాద విన్యాసాల హావభావ ప్రకటనలఁ జూచి ప్రజ చిత్రపటములైరి. 254

ఉత్కళిక (ద్విరదగతి రగడ)

జాలెవిడు బొంగరము లీల గిఱ్ఱునఁ దిరుగుఁ
బూలబంతిం బోలెఁ దేలాడు నొక పరుగు
లాలించు పూలయూయేల చేరుల లాగు
నోలి ముందును వెనుక కొయ్యారముగ తూఁగు
నటునిటుల్ విసరు ముత్యాలవీవనఁ బోలి
యటుసోలి యిటువ్రాలి యందాల నడఁదేలి
యల దోలికలఁ దేలు కలహంసగతి నేలి
మలకలగు నాగుకోమలి సొంపువడ గ్రాలి
చిలిపి యందెలు మ్రోఁగ వలయంపు గతిసాగఁ
బులకించి తనువెల్లఁ బూలబంతిగ రేగ
జోడు గన్గొని కుల్కి యాడు పారావతము
క్రీడాగతికి నడుగుజాడలిడ స్వాగతము
పాడు నాగస్వర ప్రస్తారమున నూఁగి
యాడు నొయ్యారంపు కోడెనాగన సాగి
వెస నిల్చి ఫణమెత్తి విప్పియాడెడి రంగు
కసుబుస్సులం గసరి కాటువేయు తెఱంగు
పాలేఱు లుప్పొంగి పాయవేసిన లీలఁ
బ్రాకులాడుచు మ్రోలఁ బరువులెత్తిన హేల
గిరుల దొరలుచు దూఁకి తరుల నొరసిన కరణి
వడులు బెనుచుఁ బ్రాకి సుడులు దిరిగిన సరణి
మదమరాళము భాతి మత్తేభముల రీతిఁ

గౌదమహంసల జాతి కదము ద్రొక్క కపోతి
తకధిమిత తకఝుణుత తకఝుంత ఝుంతరిత
తకిట జతి ప్రకటగతి నొకటొకటి జతపఱచి
కలికి మెయిదండ చెయి కదలికల వంపులవి
నలువైన నాగుగున్నల నడల సొంపులయి
కేలుదమ్ముల గరుచ్చాలనమ్ము లెసంగ
నేలపై రివ్వుమని వ్రాలు హంపి యనంగ
నాలీఢగతి నేల నాని కూర్చొని నాతి
కేల జువ్వునవంగి వ్రాలు మారుని చేతి
యుండీల చువ్వయై యూగాడ నెన్నడుము
కాండ మిడునట్టు లాకర్ణాంత మిడుకరము
వెనువ్రాలి తనకాలి పెనువ్రేలి స్పృశియించి
మును వ్రాలి రతిపతికి మ్రొక్కి శిరమును వంచి
విడిన పయ్యెద కొసలు పిఱుచుట్టురాఁ జెక్కి
సడలు మువ్వలపేరు లెడనెడను ముడినొక్కి
యడలు చిఱుచెమ్మటల గడెగడెకు తడినద్ది
వడిఁ జిక్కువడు సరము లొడుపుగా సరిదిద్ది
గలుఘల్లుమని కాలి గజ్జియలు రవళింపఁ
దెలిచీరయంచు జలతారు ఝరి ప్రవహింపఁ
గురులు కనుదమ్ములన్ బెరసె బంభరములై
కర మొరసె బిగిచనుల్ కంతు బొంగరములై
ఫణులు గగనములోకిఁ బాఱాడెఁ గరములై
మణుల జీవములు బడి పెనఁగె నుంగరములై
చెలినవ్వు నెలవంక చలువవెన్నెల గాయఁ
గలికి కన్నుల సొగసు కలువపూవులఁ బూయఁ
గులుకు గళరవములోఁ గొసరి కోకిల గూయ
వలరాజు పువ్వు క్రొవ్వాఁడి ములుకుల నేయ
సలలితాంగుళులన్ రసాలశిఖి పులకింప
నలరు తరుణాంగకము లామనల తెర దింప
నొడల పుత్తడినిగ్గు తడలు మత్తడి దూఁకఁ
బడఁతి కనుసన్నలను నడచుఁ జెల్వపువాక
యాటపాటలలోన నందచందము నించి
యలరించి సభకు సభ నాడించి పాడించి
మురిపించి మఱపించి కరఁగించి కదలించి

ముదము విప్పుచు నట్టె నిమురబుచ్చుచు మించి
లాలి నూఁపెడి శివాలాస్యమ్ములను బోల
బాలకృష్ణవిలీల శూలి తాండవహేల
నవ్యమోహినివోలె నాట్యముల వలపించె
భవ్యభారతివోలె భరతమ్ము నొనరించె. 255

క. అందము చిందులు ద్రొక్కెను విందగు జవ్వనము భువనవిజయ మొనర్చెన్
కుందనమున జీవము బడె చెందామర లురుకులాడె చెలి నృత్యములన్. 256

చ. లలిఁ బవడంపు వన్నెల జెలంగు పదమ్ముల రాజహంసికా
చలన విలాస లాస్యములు సాగక గంగ మునుంగ బిఱ్ఱుగాఁ
గులుకు కపోతయానములు గుట్టలు చెట్టులఁ బట్టి పాఱఁగా
నలజడి చేసెనా గిలుకుటందెల చిందులతోఁ బసందుగన్. 257

సీ. పవనడోలికల జంపాల లూఁగుచు సరస్తతి నాడు కెరటాల పొరుదోఁచఁ
గదము ద్రొక్కెడి మారు గజ్జెల గుఱ్ఱమై యాటలాడెడు బెడంగడర నొకట
నద్ద మద్దముద్రిప్ప నసియాడు బాలార్క కిరణంపుఁ దళ్కుల సరణి బెళ్క
దంపతుల్ తమ పరిణయంపుక్రీడలఁజేత నెగిరించు పూబంతి సొగసు లొలయఁ

ఆ. గాళ్ళనాట్యమాడుఁ గదలదు పై మేను యెముకలేనియట్టు లెచటి కచటఁ
గలువకాఁడలట్లు కాళ్ళుచేతులు వ్రేళ్ళు మెడయు నడుము వింతయొడుపు మడఁగు. 258

తే. గొంతు మార్దంగికుని వైణికుని కరాల వ్రేళ్ళు నిరువదింటిని విరుగాళ్ళతోనె
విషమములగుజాతుల మార్చి వివిధతాళ కాలగతి తీవ్రతలఁ ద్రుటిన్ గట్టివైచు. 259

త-తో-హో-ధి-మ్మి-త్త-ధిం-ద-త-తో-హో-ధి-మ్మి-త్త-ధిం-దా
ధిత్తా-ధిమితా-కిటతక-తళంగు-తకధిమి-తకదధిగిణతోం
తత్తద్దిమిత-ద్ధిమితద్ధికితక-తై తాకిటతక-తతెహితతోం-
తై తాకిటతకతతెహితతోం-తేక్ ధినకిటతకిధీన గినధాగినధా కిటతక.

ముక్తాయి - సంకీర్ణ

తకఝం-తతఝణ-తరికిణకిటతక-తరికిట కిటతకధా-తరికిట కిటతకధా-
తరికిటకిటతకధా.

ముక్తాయి - ఖండగతి

తఝ మ్-తకఝం-తరితఝం- X -తధిగిణత-తధిగిణత-తధిగిణత-

త్రిశ్రజాతిమార్పు

ధాగినధిగినత్రికిట ధాతధా త్రుకతకిట తకధాతధా-తుర్రికతకిటతకధాతధా-

రెండవకాలం ముక్తాయి

త్రుకతకిట తకధాతధాకిటతక-గదిగనదా-కిటతకగదిగనధా-కిటతకగదిగనధా-

ఐదుజాతుల ముక్తాయి

తకఝణ-కిటతక దధిగిణత-తకదధిగిణత-దధిగిణత-
ధిగిణత-గిణత-త-తో-హో-ధి-మ్మి-త్తధిం-ద-

తోహర

ముక్తాయిలఁగొని మృదంగనాదము ముమ్మాఱుల్ వడి మ్రోఁగెన్
సక్తాత్మకమై సభాసముద్రము స్మయవీచికలన్ దూఁగెన్
కాళ్ళగజ్జియలు ఘలుఘలుఘలుమని కర్ణామృతములఁ బోసెన్
జోళ్ళతాళముల పలపలపలధ్వని చూపఱఁ జకితులఁ జేసెన్
చేతికంకణాల్ గినగినగినమని చేతములకు వలవేసెన్
నాతి యందియల్ చనచనచనమని గీతములకు శ్రుతిబోసెన్
స్వర్ణమేఖలా కింకిణీక్వణిత ఝాణఝణంకృతి బాడెన్
కర్ణపత్త్రి మణిమౌక్తికాభ్రమణ కాంతి తళత్తళలాడెన్
కనకరత్న వరతారహారముల కాంతు లూయెలల నూఁగెన్
ఘనతర నాసామౌక్తికప్రభల ఖద్యోతమ్ములు రేఁగెన్
వ్రేళ్ళ నమరు రత్నాంగుళీయరుచి వీచుల సింగిణు లూరెన్
గ్రోళ్ళవెల్గు సితకాంతిపుంజముల క్షోణిని దారలు జాఱెన్. 260

"మంగళమహాశ్రీ" వృత్తమాలా (అనుకృతి)

ద్యోతలమునం దెగయు శ్వేతాభ్రమై మదను కేతనమ్మై యెగయుఁ గొంగు
పింజలై కెంజాయ సంజలై కెంజివురు మంజరులఁ జిమ్మెడి చెఱంగు
జంభారిపై గినిసి యంబరము దిగివచ్చు రంభఁ దలపించు రూపమ్ము
కరఁగి యుఱుకాడు బంగరు తేటిపీటి నిర్ఝరి నేలు మేని వర్ణమ్ము
హాసమై చాంద్రీవికాసమై వికచసుమ భాసమై యొప్పు నగుమొగము
వీఁకమై కజ్జలితలోకనమ్ముల నెరతి లేఖ లల్లెడి నయనయుగము
మూటయై వలరాజు తోటయై సోయగపుఁ గోటయై యొప్పు యౌవనము
కమ్మనై మదనమంత్రిమ్మెయై యింద్రజాల మ్మొలయు మధురభాషణము
సొమ్ములై పరిణయసూత్రమ్ములై మరునాట బొమ్మలై నటియించు బొమలు
మ్రుచ్చులై సభకనుల నచ్చులై మనుపట్టు కుచ్చులై చెదరు నలకములు
మూకలై మిన్నేటివాఁకలై రాయంచ రాకలౌ కోకకుచ్చెళ్ళు
మరువులను దరఁగలటు సరములౌ ముత్యాల నొరయుచుండిన యుదరవళులు
వేణువై వినదించు వీణయై వీణగొను వాణియై చిలుకు గానమ్ము
సంగీతసాహిత్య సౌందర్యసౌభాగ్య సకలమ్ము నామెదే సొమ్ము. 261

చ. సులలితరాగరక్తసిత శోభలనంతము లీను నేత్రిపుం
గలుప కవీనికాభ్రమర కాముకుఁ దాత్రిమునన్ బయింబడన్

గలియ నంటంచు సిగ్గు నునుగాడ్పుల మున్వెనుకాడ నడ్డమై
విలుపు స్వమోహసంతమస విస్ఫురహస్తము లొచుఁ బక్ష్మముల్. 262

తే. నాతి మోమున నాట్యమ్మొనర్చు కనుల మదనవిజయధ్వజం బెత్తు మత్స్యయుగళి
రమ్య నవరసభావతరంగఘురుల వెడిసి యాడెడి వజ్రాలు మిడిసిపడఁగ. 163

సీ. అరమోడ్పుకన్గవన్ బరవశత్వముఁ జూపు కలికి క్రేఁగన్నుల కాంక్షదెలుపు
వాలోలభీత ముగ్ధాలోకనమ్ముల శృంగారలజ్జలఁ జిల్కరించు
నుడిగొన్న బొమముడిఁ జూజూ చూచుచుఁ బ్రణయకోపభరమ్ము బ్రకటపఱచు
వాలుఁగన్ను లొకింతఁ దేలవైచిన చూపు మనలేని విరహవేదనముఁ జెప్పు

గీ. మూయు గనుదమ్ములఁ ధ్యానముద్ర గదుర నగు కనులఁ బ్రియదర్శనానంద మెదుగ
నాతి నవరసభరితసౌందర్యఫణితిఁ గంటిచూపుల కావ్యలేఖన మొనర్చె. 264

తే. కమ్మవిలుకాని యమ్ము లబ్జమ్ము లెందు తమ్ములనబడు కల్కి నేత్రమ్ములకును
మగువ వదన సౌందర్య రమా సమార్హనియతి మాసమ్మునకు తూగి నెలయగు శశి. 265

ఉ. ధారుణిపైఁ బదాబ్జములు తాఁకుచు నుండెనొ లేదొ యన్నటుల్
నారి ప్రసూనబాణు విలునారిగఁ దారుచు నాట్యమాడెఁ జె
ల్వారెడు పండుటాకు నునుజెక్కులఁ జెమ్మటచుక్కలొచు నొ
ప్పారెను ఫాలభాగమున నద్దిన కస్తురి చుక్క యట్టిటున్
గాజెను ముంగురుల్ మొగముఁ గప్పుచు విప్పుచుఁ బోరెఁ జారు శృం
గార రసార్ణవమ్మునఁ జకాపిక చంచలనేత్రి మీనముల్
బాజె నురోజయుగ్మములపై మనుపయ్యెద హద్దుపద్దులన్
మీజెను గిల్లడఁ దుఱుము మేదుర సౌరభ సూనహారముల్
జాజెను మూఁపునఁ బ్రిజకు పమ్మదముల్ పమకూరె మానవ
మ్మూజె నృపాలరాణ్మణికి నల్లమునం దిఁక నామె రూపమే
చేరె క్షణక్షణ మ్మపుడె చేడియఁ గూరిచి చిత్త మెట్టిటో
మాజెను దెల్పఁజాలమికి మారుని దూజెను సారెసారెకున్. 266

క. హే కేశవ ! తవ విరహే ! సాకాంతా ! రాధికా ! విషాదా ! యని తా
నా కామిని విరహ ప్రణయాకారము దాల్చి పెజ్జ నారాటపడుఁ. 267

ఆ. మోవి నొక్కికొనుచు మునిపంట బొమముడి శిరము మూఁపి యెత్తు చిగురుకేల
నడి యొనర్పకంచు సంజ్ఞ వేయుచుఁ బ్రిక్క యింట నత్త వదినె యుంటఁ దెలుపు. 268

ఆ. అబ్జ నేదొ చప్పుడైనట్లు చెవి బెట్టు నటన సేసి నడి నొనర్పకుండ
నడచిపోయి 'కృష్ణ ! నవనీతహర !' యని బుగ్గనులిమి కవిని బుద్ధిగఱపు. 269

ఆ. వెన్న దొంగిలించు చిన్నతనపుఁ జేష్ట మురళిఁ బూని పాడు ముద్దురూపు
శంఖ చక్ర హస్త సర్వేశు వైఖరుల్ దలఁచి విరహ యగుచుఁ దల్లడిల్ల. 270

ఆ. ఈ ప్రపంచమన్న నేమొ సుంతెఱుఁగక భయముఁజెందు ముగ్ధభావ మొకటఁ
బ్రణయకోపభావప్రకటన మొనరించు చిలిపిపిల్ల చేయు చేష్ట లొకట. 271

ఆ. గోళ్ళు గిల్లు మోవిఁగొఱుకును మునిపంట శిరము వ్రాల్చి సిగ్గుఁజిలుక నిలుచుఁ
బరిట కొనలు వ్రేళ్ళఁ బట్టుచు మెలివేయు హారమెత్తి కేల నటిటు బుడుకు. 272

ఆ. కొంగు బట్టి లాగ గుంజుకొన్నతి 'విడుమబ్బ!' యనుచు విసుగువంది త్రోయుఁ
'గానిలెమ్ము జ్ఞప్తిలో నుంచు' మని శిరమ్మూఁపి చూచు నోరచూపు లొకట. 273

ఆ. అన్నిదెసల బెదరినటు జూచి నోటిపైఁ జేయివైచి 'యబ్బ సిగ్గులేదు;
ఎవ్వరేని చూడ నేమందు' రని యెంతొ భీతిఁజూపుఁ గొన్నిరీతు లొకట. 274

ఆ. ప్రియుఁడు తొల్లి జేయు ప్రేమవిలాసముల్ తలఁచి తలఁచి నోట జలములూర
మత్తకనుల మొల్కలెత్త స్మితమ్ముమై పులకరింపఁ దీపికలలు గాంచు. 275

ఆ. చిన్నవోవ మోము చెక్కుటఁ గేలూని సోలు మేనఁ గండ్లు తేలవైచి
వట్టి పిచ్చిదానివలె నెందుఁ జూచినఁ నందె చూచు మౌనయౌచు మరక. 276

ఆ. ఎట్టులిడిన దేహ మట్టులె పడియుండ నిల్చిపోవు కనుల నీరు నిండ
నట్టె వదనమందు నుట్టిపడ నిరాశ నెడఁద బరువుదీర విడుచు మూర్పు. 277

ఆ. నటన నిజమొనర్చి నాతి కృష్ణుని విరహంపు రాధపాత్ర నభినయించె
నాటవెలఁది యొక్క యసమాన ప్రతిభకు మురిసిపోయి రాజు ముగ్ధుఁడయ్యె. 278

క. కురువృద్ధుండగు భీష్ముఁడు శరతల్పగుఁ డగుట బ్రహ్మచర్యత మనుటల్
స్మరశర దుర్భరధాటికి వెఱచియె కదె యనుచుఁ బొరలు విరితల్పమునన్. 279

క. చెలియా! స్మరశరముల కేన్ బలియగుచుండంగఁ జూడఁబాడియె నీకున్
వెలలేని పుణ్యమబ్బును జెలువుని గూడుకొను దారిఁ జెప్పఁగదమ్మా! 280

సీ. మలయానిలుఁడె వీనిఁ జిలువ పొట్టంబెట్టరంయని నడుమంతరమున వాడుఁ
జందురుం డఁట వీఁడు క్షయమొందుగాక యీ మూర్ఖచర్యలు వాఁడె మొగులుముట్టె
మాధవుండఁట వీని మదమడంగనదేమొ మ్రొక్కినకొలఁది కొమ్మెక్కి తూలుఁ
బూవిల్తుఁడఁట వీఁడు బుగ్గియైపోనేమి యెఱుఁగనియటులుండి యేడిపించు

తే. తుంటవిల్తు దం డబలను నొంటిదానిఁ బొంచి మొనగానితనము జూపించుకొనెడి
విభుఁడు రానిమ్ము చెప్పెద వీరియాట లపుడు తలక్రిందులగును నా యాత్మ నగును.

తే. చలువచూపుల నగవు వెన్నెలలతోనె తగరము కళాయిపూఁతల జగతి రుద్దు
పీలిమబ్బులఁ దేలాడు బాలశశియొ పొగపొదలగాడ్పులు మంటల చిగురుబోలు. 282

తే. హరి! హరీ! చచ్చి బూడిదయైనఁ గాని మారహతకుని నైజమ్ము మారదాయె
దగ్ధమయ్యుఁ దా వితరుల తాప మెఱుఁగ దేటికే యన నిజసఖి యిట్లు పలుకు. 283

మ. చెలి! పద్మానన! చంచలోత్పలదళాక్షీ! మల్లికాహాస! మం
జుల మాకంద మనోహర స్తబక వక్షోజా! ప్రవాళాధరీ!
అలినీలాలక! జాళువా చిలుక! పుష్పాస్త్రుండు నీతోడనే
బలియయ్యెంగదె వాని కేను బలినై వర్తింతునం చేడ్తువా? 284

క. చెలి నీ వలపులు చోద్యమ్ములగదె! యివి మాకు నూత్నములుగా విపుడా
వలమురితాలుపు తానున్ వలరాజిడు వలను జిక్కి వలచు నవలని! 285

తే. పవనుఁ దన్నను దనయయ్యపాన్పు తిండి సోముఁదన మామ బడబాగ్ని సోదరుండు
మాధవుఁడన వెయ్యేఁడు మధుమత్తుఁ డరయ సచ్చరితుఁడెట్టులగుఁ దాను లచ్చికొడుకు.

మ. కలధౌతద్యుతి నేలు కోమల లతాగాత్రిన్ మనోహారిణీ
తిలకన్ నూత్న వయస్కఁ గూడి యమునాతీరాన డోలల్లవం
గలతాకుంజకుటీవిహారియయి యా కంజాక్షుఁ డొప్పారుటల్
తెలిసెన్ నా కొకవార్త యచ్చటికిఁబోఁ దీరున్ భవత్కామనల్.' 287

ఆ. అనెడి చెలియ పలుకు విని రాధ ముదమంది కుసుమవిశిఖ తల్పవసతి వీడి
సకియ నీవు మేలు జన్మలో మఱతునె యనుచు యమునఁ జేరనరిగెఁ ద్వరగ. 288

తద్ధిత్తాం ధిమిత హతయుంతరి - జంతా జగధరి - జగందకుకుందరి -
కుకుంద తకురదరి తకుందకిణ ధిమితా, తెహిధ త్తతా - కి ద్తకతా ననన్న
నతాజగంతరి-

ఉత్కళిక - రగడ

పొన్నపువువాసనల ప్రోవులు పొగడపూవుల నెగడు తావులు
మల్లియల మొల్లల సుగంధము నల్లగలువల చలువచందము
పిల్లగాడుపు టలలఁ దేలుచు నెల్లదెసలం దెగసియాడఁగనూ

చవుతిచందురుం డస్తమించెను సంతమసనంతతులు మించెను
గడలు వెన్నెల వలువలెల్లను ఘనమషీ పంకమున బులిమెను
ఝంఝరీటము రెక్కసాఁచెను కజ్జలాద్రులు నిక్కిచూచెను
గటికచీఁకటికురులు విడ దిక్ తటములందునఁ గాండవించెను
గన్నులకు బొదివికొనఁ గనఁబడకున్న శూన్య పథాంతరాళము
పరిన్నిక్కొనెనా దివిని జలముగ్ భ్రమరవాహిని సముదయంబులు.

ఆనిశీథిని ఫాలతలమున నలకలగు కాదంబినులలో
నీలవార్ధితరంగడోలలఁ దేలి తేపకు మిడిసిపడియెడి
మీను బిల్లల వోలె మిలమిల మిలుకు మిలుకు మిలుక్కు మనుచున్
గాలవల్మీకములు వెలువడి కసిబిసిగ వడి బెనఁగులాడెడి
త్రాఁచుపరువులవోలెఁ దళతళ తళుకు తళుకు తళుక్కు మనుచుఁ
చకచకచ్చకచక్కు మనుచును చంచలల్ నీలాంబరమ్ముల
నంచులై కనిపించి చనుటయు నవని చీఁకటు లావరించెనుగా.

కొండగమిపై దండు వెడలిన సురలరథములె యుఱుకులిడునో
వజ్రియే భండనమొనర్చునొ వడి గిరుల ఖండన మొనర్చునొ
గిరిశిఖరములె దొరలిపడునో కరుల ఘీంకృతిఁ గలియఁబడునో
ధణధణంధణ ధాణ ధంధణ డడడ డడడడ డాండ ఢమ్మని
గర్భనిర్భేదముగ నుఱుములా వ్రాస్ఫుటింపగ నవని చెవుడువడె.

రివ్వుమని యిటువైపు పాఱుచుఁ జివ్వుమని యటువైపు దూఁగుచు
నుర్వినంతయు నూఁపివైచుచు నుదధి జలముల లోఁపివైచుచు
రయ్యుమని వడి రవము సేయుచు కుయ్యుమని దివి గోల సేయుచు
రివురు రివురు రిరివురురివ్ రివ్‌రివ్ రిరివ్ రిరిరివ్ రిరివ్‌మను
వాయుదేవుని ప్రళయతాండవవైభవములకు శివము దూలుచు
ఛరర రరరర చఱ్ఱు మనుచును దరులశాఖలు ధరణిఁ గూలఁగ
లతలు కుంజము లతుకులన్ విడి కుతలమందునఁ గూలిపడఁగా
హోరుమను ఝంఝానిలమ్ముల ఘోరమను వర్షారవమ్ములు
రింజరింజరిరింజరిరిరింరింజరింజరిఝుంరిఝుం, అని
తెఱపినీయక చఱచికొట్టుచు కరకసంహతి విసరిపెట్టుచు
మూగి కురియు ఘనాఘనమ్ములు ముంచియెత్తె ధరం జలమ్ముల.

పాఱు యమునాతీరములలోఁ బద్మయుత కాసారములలోఁ
బల్వలాగత నీరములలో వార్యుతాశ్మాగారములలోఁ
జేరువలలో దూరములలో మంద్ర మధ్యమ తారములలో
రటటరట్రురరట్రి దుర్దుర పటురట ధ్వనశబ్దములలో
వటువు వేదము వల్లెవేయునొ వరుణపతి జయభేరి మ్రోయునొ
తాకుఢెకణకుడేకు పూర్ణతటాకముల మండూకశబ్దములు
కిత్రకనగణనగణగనగణనగణగనగ్గణనగణగన్గగం
కిత్రకజగజజగజగజగజజగజగజగ్జజగజగ్జగం
కిత్రెకడెగడడెగడెగడెగడడెగడెగడెగడడెగడెగడెగం
తగనగణనగణగనగంతగజగజజగజగజగంతగడెగడడెగడెగం

తగనగం, తగజగం, తగదెగం, నగం, జగం, దెగం – బహుగతి
నేకముఖముగ భేకలోకము వీఁకమై ఘోషింపఁగా.

అందు తానొక యందములగని నందనోద్యానంపు టామని
ఇందుధరు వలపించు మోహిని సుందరులకెల్లను శిరోమణి
కడుగబడియెడి కనకరథమన కదలు మాణిక్యావపథమన
అంబరము మాటైన చందురు బింబమో జలవీచిగత వికచాంబుజమొ ప్రియు వరపెడి చకోరంబొ యన నితరమ్ము మఱచుచు
ఏటికో యమునాతటీవని నేగునా విశ నేమియో పని
మాటిమాటికి మాధవా యని మధురరుతములఁ బిల్చు నేరిని
తడియు వానకు జడియ దిరులకు తరువుతరువును దరియు నేలకొ
పొదపొదను గని వెదకు నేమియొ ఎద విసిగికొను నెవరు లేమియొ
విటపముంగొని ప్రియుని కేలని విడుచు వెంటనె మృదుత లేమిని
మధువొలుకు విరి వధర మనుకొని భ్రమనుగొని చుంబనమొనర్చును
వృంతమెడలి లతాంత మెడగా నెంతపనియయ్యె నని వగచును
మంజుకుంజము మాధవుం డని భ్రాంతి పరిరంభణ మొనర్చును
పొదలు శంపాకాంతిలోఁ గని పొదరు లివి యని వదలి యేడ్చును

పతిని బాసిన రతికుమారియొ భవుని వీడిన గాంగవారియొ
కాఁకబెట్టిన మరుకటారియొ కేకలిడియెడి వనమయూరియొ
హోరుమని ప్రవహించు యమునా చారురవ వీణాశ్రుతిం గొని
ప్రతిదిశం గని పిల్చునేరినిఁ బ్రతివచనముగ వచ్చు నా ధ్వని
ఓ దొరా ! పిల్చునది యిది నీ రాధరా యనరాని ప్రణయపు
బాధరా దయనీయమీ నా గాథరా రారాదురా యనుఁ
బలుకరా ! యీ దాసిపై నీ కలుకరా రాగామృతంబుఁ
బలుకరా యెద పంజరపు నా చిలుక రారా చిలిపిమారా !
తరులు విన్నే పిలుపు చూడుము గిరులు నీకై నిలిచి వేడును
ఝరులు విన్గన మఱుకులాడును ధరయె నీ స్వాగతముఁ బాడును
తరుల నీ సుందరతఁ గంటిని గిరుల నీ సుస్థిరతఁ గంటిని
ఝరులలో నీ కరుణఁ గంటిని ధర క్షమాగుణపరతఁ గంటిని
ఆది మధ్యాంతరహితుడవని యాకసపు ముఖముననె వింటిని
అన్నియును నీవె యనుకొంటిని యవ్యయుని విన్గనకయుంటిని
దొంగ ! నీవే దాగియుండ నెఱుంగ బ్రహ్మతరమ్ము గాదుర

కలికి చూపులఁ గామితము లిడు కల్పవృక్షము పూలు బూయగ
చిలిపినవ్వుల సొగసు పురగని చేఁపులై మధుసుధల గురియగ

రార ! నవలావణ్య మదనాకార ! సుమసుకుమారసుందర
నీరదాభ శరీర ! నందకిశోర ! శిఖిపింఛావచూడా !
నమ్మి నా దైవమ్మ యీ రూపమ్ము యౌవనమెల్ల నీదే
సొమ్మురా ! విను విడిచి యీ జీవమ్ము వమ్మగు నిది నిజమ్మురా
మ్రొక్కెదను నా దిక్కు నీవే యెక్కడికిఁ బోయెదను వద్దన
చక్కదనముల మూట రతిసుఖసౌరభపుఁ బూదోఁట రారా.

తనువు తనువుం బెనఁగి ప్రణయోద్యానవల్లిక లల్లుకొనఁగాఁ
గనులు కనులుం గలిసి మరువాసనల నీనెడి మల్లియలుగా
నురము నురమునుఁ గదిసి హృదయ మ్మొక్కటే యను మాటఁజాటఁగ
నధర మధర మ్మొఱసి యద్వైతానుభవ వల్లకుల మీటఁగ
మక్కువల యానందడోలిక లెక్కి మైమఱపెక్కి మత్తిలి
చొక్కుదమురా సోలుదమురా సుఖజలధిలోఁ దేలుదమురా.

పొరలు తరఁగలఁ గూడియాడెడి పూలమై విహరించుదమురా
పూలతావులఁ దేలు చల్లని గాలియై దివి నేలుదమురా
గాలితాఁకుల కరగి కురిసెడి నీలిమబ్బయి వ్రాలుదము న
న్నేల నిటురా వేల రాధాలోల ! కనక సుచేల మృగమద
ఫాల ! స్మితదృగ్జాల ! ధృతవనమాల ! నా గోపాల కొనుమిదె
జొహా రోప్రియ ! జొహా రోసఖ ! జొహారులు వేజొహారుల్
తత్తక్కిట తక్కిట కిడతక ధిద్దిక్కిట ధిక్కిట కిడతక
తొంగిడతక నంగిట కిడతక తతతధిగిణత
తతతధిగిణత
తతతధిగిణత 289

ఉ. చేతులు సాగ వ్రాల్గములు చేద్పడ మందత నావులించు నా
కూతముతో నొడ ల్విఱుచుకొంచు నురోజ భరోత్కటమ్ము నా
త్మేతర వస్తువాహమటు లెయ్యెడనో పడవేయఁ ద్రోయు నాఁ
గోఁతవడు న్వడిఁ గ్రొ మొదలు గొట్టఁ జలించు లతాంగనాగతిన్. 290

చ. వలవల యేడ్చు వా డెచట వచ్చు నబద్ధము రాఁడటం చెదోఁ
దలఁచుచు నెందొ చూచుఁ గనుదమ్ముల రెప్పలు వేయఁ దూర్చి బి
ట్టులుకుఁ బయోజభార పృథులోరము కంపమునంద దోఁచదే
'తెలియ ! యిఁకేమి సేయవలెఁ జెప్పవదేమె' యనున్ మినున్ గనున్. 291

తే. 'అమ్మ ! రేపు వత్తునటంచు నమ్మ బల్కె మొగము ముందు బ్రేమను జూచి మోసపోతి
నెన్నినాళ్ళాయెనే యితఁ డేఁగి' యనుచు ముక్కుపై వ్రేలి నిడి మౌనముద్రఁ బూను.

క. సవ్య కరాంగుళు లొగి నపసవ్యపు తర్జనిని మడఁచి స్వప్రియ విరహో
హృన్నవ్యవధినెంచు నూహాకావ్యము లల్లును విషాదకంధి మునుంగున్. 293

సీ. బడిబడిం బఱతెంచు బాష్పస్రవంతిలో దెగిజాఱు మంచి ముత్తెముల పేరు
గాద్గద్య సందీప్త కంఠస్వనమ్ములో దరిదట్టి పొరలు దుఃఖరస ఝరులు
రాగార్త బింబాధర స్పందనమ్ములోఁ జిరుగాలిఁ గదలు కెంజిగురు గుదులు
రోమాంచ సముపేత కోమలాంగకములఁ బ్రిభవించు బరుసైన పద్మలతలు

గీ. కనెడి దంతయు నాపయి తనను దాను మఱచియాడుచు నెంతొ యున్మాదదశను
వ్యక్తయును శ్రోత తానెయై వదరుకొనుట నడరు ప్రేమగీతాంత్యస్వరాలపనము. 294

ఉ. ఎచ్చటి నుండియో సుమధురేరిత వేణు సుధాతరంగముల్
వచ్చుచు నున్నయట్టు లటువైపు ఋత్రిం బచరించి ప్రాణముల్
వచ్చినయట్లు తోనె స్మితవైఖరి లేచి యదేదిశఁ గనుల్
విచ్చి కరమ్ము మాటుగొని వేమరు నట్టిటు గాంచు కాంక్షమై. 295

తే. అదిగొ ! చెలి యిది యమునా తటాంచలమ్ము నుండి వచ్చెడి నని చంక నొక ఘటమ్ము
నమరిచికొని నీటికని రాయంచ నడల వెడలి యద్దరిఁ బాడు గోవిందు గాంచి. 296

తే. గాయక శిరోమణీ ! పికాగ్రిణీ ! విశాల విమల యమునాతరంగిణీ వీచికలను
బంపు సందేశరూపక ప్రణయగీతి రాగ వేగమ్ము నకు గుండె లాఁగలేవు. 297

తే. కొమ్మతావులఁ గోయిల కూయుఁ గాని యా యెడారుల రాగమ్ము తీయఁబోదు
కొమ్మకోయిల విరహ దుఃఖమ్ము యమున యేటులై ప్రవహించు ముందెటు తరించు.

తే. కొమ్మ రాగము కరపల్లవమ్ము మాఁపెఁ గోయిలం గల్ల రాగమ్ము గొంతు విప్పె
నస్వతంత్రియా కొమ్మ తా నరుగలేమి సిగ్గువిడి కోయిలయె తాను జేరవచ్చె. 299

తే. యమున నీటికై యీఘట మ్మరుగు దెంచి నీదు రాగామృతమ్ముతో నిండిపోయె
దీని మోయఁగా నేను న్నాలోన లేను వత్తువే దీని నెత్త నో వన్నెకాఁడ ! 300

తే. నాదు మోహాంధకార పూర్ణ హృదయంబు కరఁగి నల్లని యమునయై యుఱుకులాడు
దీనఁబడి కొట్టుకొనిపోవు దీన నేను నీవెకావె యద్దరిఁ జేర్చు నావ ననఘ ! 301

తే. ఇది యతడు విని ముదమంది యవలియొడ్డుఁ జేరవచ్చిన ట్లాతని చెంత కరిగి
రంగురూపుల గాంచి యారాత్రి యెవతె యొద్దనో పొద్దుబుచ్చిన ట్లూహ సేయు. 302

సీ. 'ఎఱుపెక్కె గనులు నిదురలేక యెవతెను గూడియో' యనఁగాదు 'వేఁడి' ననుచు
'గంట్లావర్చెను నీదు కమ్మవాతెఱకు నేచెలి' యనఁ 'గాదిది చలి' కటంచుఁ
'జెదరె నీ యుంబాల శిఖపింఛ మేతన్వికేశినో' యనఁ 'గాదు గాలి' కనుచు
'నానపైఁ గాటుక నలుపు లేకన్నులకలికివో' యన 'జాతెఁ దిలక' మనుచు

తే. 'యాహి మాధవ' యనుచు నీర్ష్యమెయిఁ బాడి ప్రియకోపాగ్నికీలయై పెనఁగులాడు
'అయి ప్రియే చారుశీలే !' యటంచుఁ గూడి కాంత గంగాప్రవాహమై చాగి వేడు. 303

తే. రమణి ! నీయెదఁ బొంగారు సుమమనోజ్ఞ హేమకలశ వినిర్గత ప్రేమ సుధలు
రమ్యమధురస మధుర నారంగరుచులఁ బైనఁ గొసరిడు గోస్తనీ ఫలరుచు లవి. 304

క. హరి ముగ్ధవధూ నికరే తరుణి విలాసిని విలసతి తత్కేళిపరే
పరిరంభణ చుంబన వర సురతవినోదే యటంచు సుదతి నటించున్. 305

సీ. చికిలి చూపులలోన శృంగారరసవల్లి పూలుపూయుచుఁ దోరణాలు గట్ట
చిలిపి లేనవ్వులఁ జెలువంపు వారాశి నెలబాలు లేతవెన్నెలల నలుక
కలికి భ్రూనర్తన నల్లలితలావణ్యాభ్రములు విందధ్రనువుల మ్రుగ్గుదీర్చ
కులుకు గ్రీవాభంగముల సారె కొయ్యారముల వాఁక కంబు మంగళములీన

తే. నాతికలకంఠ రుతము సన్నాయిఁ బాడ లజ్జ తెరపటమగుచు విలాసమినఁ
బ్రియ సితదృక్ప్రభలు తలఁబ్రాలుపోయ నారి నృపతి మనమ్ము లగ్నమ్మొనర్చె. 306

తే. మేల్కడాని క్రొమ్మించు నెమ్మేనితోడ నలకళామహోదధి వీఁదులాడు నట్టి
వెలఁదిఁ గని మెచ్చి ముత్యాలవృష్టి గురిసెఁ జెక్కుడం జుక్కలై రాలు చెమటచినుకు.

చ. తిలకము మోమునం జెదరఁ దీవ్రత ముక్కుపుటమ్ము లుబ్బి లో
వెలికి మితాధికమ్ములయి వ్రేఁగుగవచ్చుచుఁ బోవు నూర్పుగా
డ్పుల బిగియంతయున్ సడలి పొల్చెడి తమ్ములపాకు తీవయై
సొలసిన మేనితో నటిటు సోలెడి నెన్నడు మొప్పు నిల్చినన్. 308

తే. ఆమె సరసాభినయ చేష్ట లానృపాలు తనువు మఱపించి నిశ్చేష్టితునిఁ బొనర్చె
నామె చలదపాంగ నిరీక్షణాతిశయము నృపతి గని రెప్పవడని యనిమిషుఁడయ్యె. 309

క. మెఱయుచు నుండెన్ గన్నుల నరనిమురము వెన్కఁజూపి యాటపిన యా బి
త్తరి బొమ్మచేష్ట లామెను గుఱించి మనమందు నెంతొ కొనియాడె నిటుల్. 310

శా. 'అమ్మో ! ఎక్కడి కండ్లపండువగు నీయందాల రూప మ్మహో !
బొమ్మన్ దీర్చినయట్టు లున్నవి కనుల్ ముక్కు న్మొగం బద్దిరా !
సొమ్ముల్ దిద్దఁగ నావయస్సున కిటుల్ జోడయ్యె నీయంగముల్ !
సమ్మానార్హమె నీవ యౌవనమ ! యీ స్థానాధివాసక్రియన్. 311

క. కుదురైన సఖి మనోహర వదనము కుందనము కరఁగి పడి యచ్చునతే
ర్పాదవం బోఁతం బోసిరొ ! ముదిత యొడలిసొగసు శిల్పమున మలచిరొకో ! 312

ఉ. అచ్చెర మచ్చరంబు హతమార్చఁగఁ జూచెడి యామెఁ గాంచి పి
క్కచ్చిగ దీక్షఁ బూను మొనగాఁడు పితామహుఁడై వెఁ బిచ్చిగా

వచ్చుమ నందునన్ వయసువచ్చిన కొ్రొత్తదినమ్ము లివ్వి యీ
విచ్చెడి తమ్మిమొగ్గ తొలివిందున కే యళి పెట్టిపుట్టెనో? 313

ఉ. ముద్దియ సోగకన్గవకు మోహనరాగ కళా విలాసముల్
దిద్దెడి గీరు కాటుకల దిక్కయి తాళమువేయు రెప్ప లా
విద్దపు క్రింది కందెరల నీలిమ లద్దెడి చిందు కాటుకన్
వద్దన ముద్దువచ్చెడిని వారిజనేత్రి మొగమ్ము దీనితో. 314

ఉ. జోక వయోవిలాస తనుశోభలఁ గాంచి వసింపనెంచి లేఁ
తాకులతో వసంతకళ నందు రసాలకిశోర మంచు పుం
స్కోకిల కొమ్మ మాటుగొని కూసెఁ 'గుహూ' యని గాత్రికిన్నరన్
వీఁక పవర్చికాక చెవి విందిడునే యిటు లన్యగీతికల్. 315

క. లలన నిటు తలఁచి మెచ్చుచు 'బలే బలే' యనుచుఁ 'గష్టపడి నేర్చె నహో!
యిలుగట్టెఁ గళ లిచట' నని పలుకు నృపతితోడ వృద్ధభామిని యనియెన్. 316

క. 'దేవా! నృపగిరి రాజ్యరమావల్లభ! విశ్వవిజయ మార్తాండ! కళా
భావజ! సర్వజ్ఞా! పుంభావ సరస్వతి! జొహారు నరసింగనృపా. 317

క. నాకూఁతురు గొప్పలు నే నేకరువిడఁగూడ దైన నేమో స్వామీ!
మీకారుణ్యము నాకిటు వాకువిడెడి నా మనవి నవధరింపవలెన్. 318

గీ. ఏకవీంద్రుఁగాంచినను మాయింటఁ బిలిచి సింగభూపాల సముఖ విశేష మడిగి
యేగవలె నని యొకటెపో రిడుచునుండెఁ దమ కబద్ధ మీనుడి మాయెదకు నిజమ్ము. 319

గీ. తాము చెడి ప్రపంచమ్మునంతయునుఁ జెఱచు ఘోరతర జారవృత్తినిఁ బాఱఁద్రోలి
పరిణయములాడి సత్కీర్తిఁ బడయుఁ డనుచు పానిజాతిం బ్రిబోధమ్ము సల్పునుడులు.

క. పలుకు' ననఁ జెలువ తనమది వలపు త్రిపా జలధి మగ్నభాస్కరతఁ గొనన్
దెలిపెను చాలిఁక యెక్కువ పలుకకు మని జననిఁ గినిసి పలికి నృపాలున్. 321

క. నిజవదన రూపరేఖాంబుజ సుందరనేత్రి కుముదముల రాజకర
వ్రజ మలమక ముఖవికసనము జరుగు నెట్లనెడి భావముల వీక్షించెన్. 322

క. అంతట శ్రీనాథుఁడు తత్కాంతను వీక్షించి యామె కన్నులలోనన్
గంతులిడెడి యాశయముల పొంతపు వాక్యముల నిట్లు సూచించెఁ దమిన్. 323

ఉ. 'వారవెలంతలందు నిటువంటి సుబుద్ధియు సత్యవర్తనల్
పేరున కేరి యొద్దఁ గనిపింప విల న్వెదఁబోసి చూడ నీ
వారిజనేత్రి పుట్టువు కవశ్యముగా నొక కౌశికుం డెదో
దారినిఁ దప్పి వచ్చి యిటఁ దా వ్రతభంగము నొందఁగావలెన్. 324

తే. ఈ నడత బుద్ధిగఱపెడి మానవులకు నీమె నాట్యాభినయకళ లీ స్వరూప
మేకమై యెంతవానికి నెదఁ జెఱచెడి నొడయుఁ డధికారియై లగ వుడుపవలెను'. 225

చ. అనుటయు ఱేఁడు రాగ దరహాస మనోజ్ఞ కటాక్ష పూర్ణ దృ
ష్టి నసిత షట్పదమ్ముల రచించి పొలంతి ముఖాబ్జసీమ వ్రా
ల్చినఁ గని మోసులెత్తు నునుసిగ్గున బిత్తరి వ్రాలుఁ జూపులం
దన తల వంచె నుచ్చులిడెఁ దన్నృప దృష్ట్యళికా శిరోజముల్. 320

క. మదయౌవన ముబికింపఁగ నదయతఁ గంచుకము తలల నదుమఁగ బొరి ప
య్యెద నడగెడి చనుగవగతి ముదిత త్రిపాప్రణయహతుల మున్వొనుకాడన్. 327

చ. నిజగళసీమ నాయకమణి ప్రభతో సగియాడు మౌక్తిక
స్రజమును గేలఁ గీల్చి తన సన్నిధి కాయమఁ జేరఁబిల్చె నీ
రజభవుఁ డా సరస్వతి కరగ్రహణమ్మొనరించు పట్లఁ గం
రజలజమందుఁ దాళి నిడుటంబలె నామె గళమ్మునం దిడెన్. 328

తే. ఱేఁడు భోగినిన్ సతిగాఁ బరిగ్రహించె నచటి సభ రాజు రసికత నాత్మ మెచ్చె
నపుడు శ్రీనాథకవి తన యాశుధార వర్ణనమొనర్చె వారి దాంపత్య మిట్లు. 329

క. 'వరవర్ణిని యీ సుందరి కర మరయ సుధాకరుండు కాంతుఁడు కళలం
దిరువురి సరసపుఁ గలయికఁ బరఁగెను రాగమన సహజపద్ధతి గాదే.' 330

క. అన విని కవి పోతన యావవిత జననితోడ రాత్రి వల్కిన నీతుల్
మునువచ్చిమూర్తి గొనెనని యనుకొని జయదేవకృతుల నాత్మఁదలచుచున్. 331

సీ. కర్ణశుక్తి స్నిగ్ధ గర్భాశయాలనే కవిత పండించె ముక్తాఫలాలఁ
బద్మావతీ పాదపద్మలాస్యము కెద్ది రచియించె శృంగార రససరస్సు
కామేక్షు కోదండ కాండాలఁ దీయని పదనిడె నెద్ది స్వప్రణయ ఝురుల
సలలిత గోస్తనీ ఫల గుళుచ్ఛమ్ములఁ జిలికె నెయ్యది సుధాశీకరములఁ
గీ. జివర తలకిందు తపముఁ జేసియును నెవని రమ్యతర వాగ్ఝరీధార రాధ యగుచు
గోపికానాథు ప్రణయమ్ము గుత్తగొనియె నట్టి జయదేవకవివాణి యజునిరాణి. 332

సీ. రసభావ జలధిలోఁ గొసరి మున్కలువేసి దరిముట్టి జాతిరత్నాలు దెచ్చు
భాషార్ణవ క్షీరభాండమ్ము గిలకొట్టి పదనవనీతముల్ పంచిపెట్టు
విహపర ఫలసార మెద చేఁపురాగ స్తన్యము జేసి కుడుపుఁ బ్రజాళి కడుపు
చెవి సోకినంతనె తవిలి చేతము నిగ్గు రతపాద మంజీర రవళి సేయు
గీ. సత్కవీ! జయదేవ! విశ్వమ్ము నీదు మధుర మంజుల కావ్యకుమారి మహిత
పూజ్యపదముల పరసప్రబుద్ధ ముగ్ధనయన పద్మాల నిడుకొని నడుపు నెపుడు. 333

తే. చేతములకుఁ జక్కిలిగింతఁజేయ నీదు వాణి చిలిపి మాధవు క్వణద్వేణురవమొ
యుల్లములు కోమల రసాల పల్లవములుగాగఁ బులకించు విశ్వజగద్వితతికి. 334

తే. అట్టి నీకృష్ణ ప్రేమామృతాంబునిధుల ననుభవించఁగాఁ దా నోఁచికొనినదేమొ
గీతగోవింద గాన కోకిలము గాగ నవని పద్మావతియె యిట్టు లవతరించు. 335

తే. బోగముండ్లలోపల నీమె పుట్టవలసినదియెకాదు శ్రీహరిభక్తి నటన యందుఁ
దాఁ గరఁగి యేప్పి యేప్పించె దక్కునరుల వ్రాయ దండకమగు నీమె వర్తనమని. 336

క. అనుకొని పోతన గంటమ్మను గొని యా నెలఁత సుగుణపుంజమ్ముల నా
యనుపమ సౌందర్యమ్మును ఘనవిద్యాపాటవమ్ము కనులకా మెఱయన్. 337

ఉ. ముద్దులు మూటగట్టు పదముల్ జతగూర్చి సుధారసమ్ములో
నద్ది కదాని క్రొమ్మెఱుఁగు టద్దములో నవభావ వైఖరుల్
దిద్ది యలంకృతుల్ కొనలు దీరిచి పూచి ఫలించి వచ్చి తా
వద్దనవేని పైకొనఁగ వ్రాసెను భోగిని దండక మ్మొగిన్. 338

శా. పాద న్వ్రాసిన దండకమ్మది సభాభాగమ్మునన్ మంత్రిమై
యేదాగోడము వేయుచు న్దొసఁగులే యాక్షించి యీర్ష్యాళులై
పీడంబెట్టు నఖర్వగర్వమతులౌ విజ్ఞాఖ్య భూతాళి నా
టాడించెన్ చెవిఁబట్టి చెప్పినటు విందంచు న్నిరాలాపగన్. 339

ఉ. భోగిని యేరి సొత్తు కవిపోతన వ్రాసిన కావ్యమా మహా
భాగున కంకితమ్మయి సభాముఖమం దుపహార మిచ్చె నీ
త్యాగధనుల్ కవీకు నవతారము లేశుభకార్యమందుఁ దా
మేగరు రిక్తహస్తముల నీ మరియాదలు జాతినైజముల్. 340

క. అనవుఁడు నృపుఁ డా సత్కవిఁ గనుఁగొని తద్రచిత మధుర కావ్యామృతమున్
గొనకొని పీనలఁ గ్రోలియుఁ దన కంకితమిడుట నిటు కృతజ్ఞతఁ దెలుపున్. 341

సీ. ప్రకృతికాంతా స్వరూపంపు సొంపులఁ దీర్చి దిద్ద నే యెద నిల్వుటద్దమయ్యె
మాటలతోనె బ్రహ్మాండమ్ము సృష్టింపఁగల మొనగాఁడేని గంట మరయఁ
దాను మాఱక యనంతస్వరూపాల్ జూపఁగల్గనే హస్తలాఘవపు జవము
తన వాక్కు లోకమంతయుఁ దలం దాల్పగాఁ బలుకుబడిం గల్గి వెలయు నెవఁడు.

గీ. మధుర విజ్ఞానజలధిలో మనెడి రత్నసంతతులె వాని హృదయకోశమ్ము సొమ్ము
శాశ్వతాక్షర సామ్రాజ్యసంస్థ కతఁడు నిర్మకుట సార్వభౌముఁడై నెగడు సుకవి. 342

తే. అట్టి కవిరాజు సత్కృతినంది యిప్పు దమరుడైతి నే నెన్ని పుణ్యాల ఫలమొ
సత్కృతిని గొని సత్కృతి సలుపనెంతు చంద్రునకు నూలుపోఁగను చంద మొప్ప. 343

మ. అని వేనూటపదాఱులన్ బసిఁడి పళ్యంబందుఁ బోయించి పై
నను గాశ్మీరు పసిండిశాలువును విన్నాణంబుగా నుంచి చం
దన తాంబూల సుమస్రగంచిత సుగంధద్రివ్య సందోహమున్
గొని యాస్థాన కవీంద్రిసంతతికిఁ గన్గుట్టన్ నృపాలుం డనున్. 344

చ. 'మఱఁగఁగఁజేసె నో కవికుమారక ! తావక భావపూర్ణవా
గ్విరచిత దండకంబు చెవి విందిడి మందిడిన ట్లమర్త్యయై
పరగెను దాన మత్ప్రియభాగిని భోగిని దాఁగి సత్కవీ
శ్వర రసవాక్ప్రిపంచ వినివాసము నాశమెఱుంగ దెయ్యెడన్. 345

శా. వేయిన్నూటపదాఱులన్న నొక విల్వే మీకు నో పోతనా
ర్యా ! యాస్థానకవీంద్ర సంతతికి నీవధ్యక్షత న్వెల్గఁగా
నీ యుద్యానము లీ గజాశ్వవిభవం బీరాజహర్మ్యాంచిత
శ్రీ యాత్మీయధనాళి నన్నువలె నిన్ సేవించు నశ్రాంతమున్.' 346

ఉ. చందన చర్చతో నృప ప్రసన్నమృదూక్తులు చర్చచేసి గె
ల్వొందఁ గవీంద్రి మానసమహోర్మిపయిం బయిరీతి, వక్షమం
దందము చిందులాడ సుమహారము లా కవిరాజు మానసా
నందపుఁ గాళ్ళ బందమిడి నర్మిలి నాఁప మహీపుఁ డంతటన్. 347

ఉ. శాలువ కేలఁ బూని కవిచంద్రుని గప్పి బహూకరింపఁ బో
'నేల యివన్ని నాకు లభియించెను మీ మృదువాణి నెడ్డా నేఁ
జాల భవత్కవీంద్రి పరిషద్గురుపీఠి నలంకరింపఁ జాల్
చాలు' నటంచుఁ బోతనయె క్ష్మాపతి కేలును బట్టి యిట్లనున్. 348

ఆ. 'ఈ కవీంద్రి జన్మ మీశ్వరునికె దక్క నొరుల కెడ్డు చేతులొగ్గి యడుగ
దాఁడుబిడ్డ దేహ మమ్మకతిననట్లు కృతుల నమ్మకొనుటె బ్రితుకుదెరువు ? 349

సీ. ఒరుల రాజ్యాన మే ముండువారముగాము ఏలగాఁ బదములు చాలగలవు
ఒకరి ప్రిభుత్వాన నొదిఁగియుండము మేము గురు లఘు గణ పాలకులముగాన
అన్నవస్త్రాలకై యాచింప మొండొరున్ నవరసామృత భోజనమిడఁగలము
అర్థార్జనమ్ముకై యర్థింప మొరుల సకల విధార్థాలంకృతు లిడఁగలము
గీ. స్వీయ తాళపత్రకుటీర సీమలందు నఖిల భూతకోటికి నమరాశ్రియమిడి
శాశ్వతము బ్రోచు సత్కవీశ్వరుల మేము దైన్యమునఁ బడియుండ మితర గృహాల. 350

తే. వికచ చంపకోత్పల వనవీథులందు మత్తకోకిలములు బాడు మధురగతుల
నాటవెలఁదులు మా యొద్ద నాడుచుందు్రి సంచరింతుము మత్తేభసమితిపైన.' 351

క. ఇటులనె పోతన కవివరుఁ డటఁగల పండితుల గుండె లవియఁగ స్వోర
స్తటములఁ గేలిడి 'భళి! నీ దిటవుకె మ్రొక్కవలె'నని స్తుతించిరి సభికుల్. 351

ఉ. వెంటనె పార్థివుండు కవివీరుని ధీరత గాంచి నవ్వి 'మీ
వంటి గవీంద్రు లిమ్మహి నెవారును లేరిక మీరె గుత్తగా
గొంటిరి సత్కవిస్ఫురదకుంఠిత నిర్మల ధర్మకీర్తుల
న్నింటిని కటికాచిన మనీషులు శేషులు మీరె వానికిన్.' 353

క. అని పరిషత్కార్యక్రమమును బాహ్యము మఱచి మురిసి ముగియించి కవీం
ద్రుని శ్రీనాథునిఁ బోతన గనిపె నిజారామవసతి కాదరమొప్పన్. 354

క. వారు నృపాలవినిర్మిత సారతర సుఖాన్నపాన శయనాదిక స
త్కారముఁ గొని సాయం సంచారమ్మును సలుప వనిని జరియింత్రి తమిన్. 355

మ. హసదత్యంత మనోజ్ఞ పుష్పయుత దివ్యారామ సీమాంతర
స్థ సరోపాంత సితద్యుతిప్రకర భాస్వచ్చంద్రకాంతోపల
ప్రసృతాపూర్వవిలాస కుట్టిమ ధరాభాగమ్ములం బోతనా
ర్య సనాథుండయి వన్యశోభఁ గనులారం గాంచు శ్రీనాథుఁడున్. 356

చ. లలిత లతాంబరోడుగణలక్షిత సుందరకుంద పుష్ప గం
ధిలకరశాఖయై యొసఁగు ధీరసమీర కుమారు స్వాగత
మ్ములఁ గొని కూర్మి నూర్మిచయపోతములన్ సరసీ ప్రసూత శీ
తల పవమానదోలికలఁ దన్పుచుఁ బాడెడి జోలల వ్వినున్. 357

చ. కిలకిల నవ్వుపూలఁ బరికించుటచే వికసించు మోములన్
గలరవ భావగీతికల గానమొనర్చు శకుంత జాతి గం
తులఁ గని నాట్యమాడు మదితో నలనల్లన గాలిఁదూలు దీ
వలఁ దిలకించి యాడు తనువల్లికలన్ గవిరాజు లుండఁగన్. 358

ఉ. అందొక పిప్పలీతరు వరాగ్రకులాయతలమ్మునందు లే
కందువు లార్ద్రిచుంచువు ముఖమ్ముల విప్పి కలస్వనంబులన్
సందడి సేయ మాతృ ఖగశారిక మేతను నోట వెట్టు క
న్విందిదు దృశ్యమొందు కవివీరుఁడు పోతనఁ గాంచి యిట్లనున్. 359

గీ. 'ఈ పులుంగు విసుంగు లాయెఱ లొసంగు జనని కేమి ప్రత్యుపకృతి సలుపఁగలవు
ప్రతిఫలముఁ గోరకయె మాతృపతగి వీని నేల సేవించునో యాత్మ నేమి దెలియు. 360

సీ. చెమట ముత్తెముల రాశిం బోసినదె కాక ప్రభువు సన్నిధులు సేవకున కగును
దన జీవనమ్మంత ధారవోసినఁ గాక భార్యాప్రణయ వృక్షఫలము లమరు

విందారగింపుల నెందుఁ జేసినఁ గాక సఖ్యదేవత సుప్రసన్నయగును
హృదయాబ్జముం దమిన్ బదముల నిడఁగాక శ్రీహరి కారుణ్యసిద్ధిఁ జిక్కు

గీ. కన నహేతుక ప్రేమ గంగాభవాని మాతృమానస స్వర్గధామమ్ము నుండి
స్తన హిమాలయ శిఖరమూర్ధములు దాఁటి తడిపి చను శిశుతరుమూలతక్ష యడఁగ. 361

సీ. స్వప్రియార్థ సర్వస్వమ్ము వెలనిచ్చి నను గొంచు గర్భమున నిడి దాచి
తన పుత్రుఁ డనిపించుకొనుట కింతకు నాదుతనువుకై రక్తమ్ము ధారవోసి
యదలు నెక్కడనొ గర్భాందోళికామధ్య నాకని రాయంచ నడఁ జరించి
క్రొత్తచుట్టము ననుకొనుచు నల్పాహారములఁ దన్న రుచులు కోర్కులని కుడిచి

గీ. తివిరి దశమాసముల దశేంద్రియ విశిష్టమైహికాముష్మికానుభవాతియోగ్య
మైన యీ మేను తనదు గర్భాంతరమునఁ దీర్చి యిడు తల్లిఋణ మీఁగు తెరువుఁగలదె?

ఉ. బమ్మనుగన్న గర్భమ్మదుపద్మము విష్ణువు గూర్కు పాలసం
ద్రమ్మును రుద్రు నెత్తికొని రంజిలఁజేయు హిమాద్రి మాతృవ
క్షమ్మను నందనోపవన కల్పిత పుష్పఫలాదికమ్ములై
యమ్మను మించు దైవ మిలయందు ఘటెందును లేదు లేదనున్. 363

ఉ. తొమ్మిదిమాసముల్ మమతతోడుత మోసియుఁ గాంచి యీఁగనున్
నమ్మక కంటఁ గన్నిడుచు నన్మొలకంగొని యంతవింతగా
నెమ్మది పెంపుఁజేసి యల నిద్దురఁగోరిన నేవి నాదు పే
మమ్మకు నవ్వుచున్ దృణసమమ్ముగఁ బ్రాణములిత్తు నేననున్. 364

చ. కలకలలాడు నానగుమొగమ్మున మొగ్గలు విచ్చఁ గేకలం
గలరుతి సేయఁ గోయిలదుగల్ మృదులాస్యమొనర్పఁ గాళ్లు పే
తులు నగి కాంచి యుగ్గనుచుఁ దొట్టియ చిల్కకుఁ బారమిచ్చు నా
తొలిగురువైన తల్లికిడ దోసిట నిండవు మూఁడులోకముల్. 365

సీ. నాతల్లి మేల్జవ్వనంపుఁ గ్రొంజిగిచాయ చిగిరించె నా కాలుసేతులందు
నాయమ్మ హృదయప్రియసూనవాసనల్ ఫలియించె నా ముద్దులొలుకు మేన
నాయంబ సత్ప్రిపానయనకోరకములు వికసించు నా నవ్వు మొకములోన
నామాత రూపలతామంజుబింబముల్ దాఁగురింతాడు నా తనువులోనఁ

గీ. తల్లి సరసవాఙ్మధుర గీతములయందు నాదు కలరుతమ్ములు మోహనస్వరాలు
జనని రాయంచనడల లాస్యముల నాదు తప్పుటడుగుల లయలాదితాళగతులు. 366

తే. నాదు జీవనసరసి యున్నంతవఱకు మాతకనుదమ్ములకు నాదు మాటలేదు
నాకె దేన్ రోగపునీడ సోఁక నాపె నగుమొగము చంద్రునకు గ్రహణమ్ముపట్టు. 467

తే. నేను జేసిన దామె కింతేని లేదు ఆమె చేయని మేలొక్కటైన లేదు
ఆమె రక్తాల ఓల్చితి నా(కలియని యన్నమున్నీళ్ళనదు నన్నుగన్న నాపె.' 368

క. అనుకొనెడి పోతనార్యుని వెనుక నెవరో నడచినట్లు విన(బడె తోడ్తో
వెనుదిరిగి చూచె పక్కవి మనుజుం డొక దేగు(దెంచె మది శంకింపన్. 369

క. ఉత్తర మొకకేలం గొని తత్తఱమున వచ్చి యచటి దౌవారికు(డున్
దత్తావధానులగు కవిసత్తములను( గాంచి వినతిసల్పె నిటువలెన్. 370

మ. ఒక వార్తాహరు( డే(గుదెంచి భవదీయోదంతమున్ బృచ్ఛ సే
సి కడున్ వేగ మొసంగు(డంచు నిడె యిచ్చెన్ లేఖ నొక్కండు తా
మొ కటాక్షించు( డటంచు( గైనిడి నమన్మూర్ధస్థ బద్ధాంజలి
ప్రకటత్పాణిపుటప్రదీప్తు(డయి నిల్వంగాంచి శ్రీనాథు(డున్. 371

తే. ఆత( డొస(గిన యాజాబు నంది కేల( ద్వరగ విప్పి తా నిటు పఠింపందొడంగె
'వనుజు( జిరజీవి( బోతన నగ్రజుండు మంగళాశీస్సులిడి వ్రాయు మాటెది యన. 372

తే. పదిదినము లే(గినవి జ్వరబాధతోడ నమ్మగారికి నోట నీరైన(బోదు
కలవరించును రేయింబగళ్లు నిన్ను కనుల(జూపు చిక్కుట చాల కష్టమెనుమి. 373

తే. కావునం జాబు(గన్న తత్క్షణము నీవు బయలుదేఱు మాలస్య మింతయునలుపక'
యనుచు నీలేఖ నిట్లు విన్నంతలోనె యశ్రుశస్త్రముల్ గ్రుంగె( బోతన్న కపు(డు. 374

తే. వనము( గల దట్టె పోతనతనువు( గలదు పూలు( గనరావు వినరావు పుట్టు రొదలు
పంక్షుభిత జీవనాంచితసరసియందు లోకబింబము లుండియు లుప్తములగు. 375

తే. తనదు నవ్వు వెన్నెలలలో దశదిశలును( గళలనీనుచు శోభగా( గానుపించు(
దనదు కన్నీటిజలధుల దశదిశలును మును(గి కనరావు ప్రళయమ్ము మూగినట్లు. 376

క. మున్నున్న సంతసము తా( గన్నీటంగడుగ(బడుట( గళ లుడిగె మొగం
బన్నము నీళ్ళన కాత(డు విన్నదివిన్నట్లు లేచి వెడల(దొడంగన్. 377

శా. శ్రీనాథుండును( బోతనార్యు( గని యుర్వీనాథు సాన్నిధ్యమం
దే నీవార్త వచించి సత్వరము నీ వేగన్ జవాశ్వోల్లస
ద్యానమ్మొం దనుకూల మొందునటులన్ యత్నింతునంచు న్నృపున్
గాపంబోయెమ పోతరాజు వల దక్షంబంచు వారించినన్. 378

చ. చవిచక్షణమ్ములో మగుడ( జయ్యన( దా నరుదెంచె నాత(డ
వ్వనికి నృపుం డొనర్చిన యవజ్ఞను( జెప్పకచెప్పు చిన్నవో
యిన మొగమొప్పు( బోతనయు నేమటుగాంచె దహో ఫలించెనే
పని యన వచ్చునట్టిపని వాకిట(దీతె నటంచు( బల్కుచున్. 379

క. సిరినాథుఁడు దుర్భరగతి నెఱి పద్యమ్ములఁ బెకల్చి నిష్ఠురవాక్కుల్
నరపాలుఁడు పోతనకవివరుఁగూర్చి వచించినట్లు వాకుృచ్చె నిటుల్. 380

మ. అరుగంబూను కవీంద్రచంద్రులకు మాయశ్వంబు లేపాటి వ
క్షరసర్వార్థవిధాత లాద్యకవితా సామ్రాజ్య మత్తేభముల్
కఱవే వారికి భుక్తియుక్తినిడు శ్రీ కామారికే దక్క యు
క్కఱకై వారు కరంబు సాచుదురె రిక్తక్ష్మాపతి శ్రేణికిన్. 381

చ. అరయఁగ భూజరాజ మదియై భువి రాల్చు ఫలమ్ము లెంతయుఞ్
సరసములై సమగ్రమగు స్వాదురుచుల్ జిలికించు నర్థి తాఁ
బరుషపు జాల రాల్చిన యపక్వఫలమ్ము లభక్షణార్థమై
కొఱికి త్యజింపఁగాఁబడుచుఁ గూర్చు నతృప్తి నెడంద నెందునున్. 382

చ. అనుచు వచించి మౌన పరిహాస విభాసితుఁడై నృపుండు న
న్గనె నని పల్కు శ్యాలకునిఁ గన్గొని పోతన వీతిహోత్రుఁడై
చనుమనినార లెవ్వ రిటు చల్లని వార్తను నాదుపాలికిం
గొని చనుదెంతువంచు ననుకొన్న దెవారవి మాఱువల్కుటల్. 383

చ. అరుణ సరోజరాజిఁ బరిహాస మొనర్చెడి నేత్రసీమలన్
మెఱసెను వీరభార్గవి తృణీకృత విశ్వవిభూతి వైభవ
స్ఫురణఁ దలిర్చ స్వేచ్ఛ మినుఁ జూచెడి గుర్వభిమానకేతువుఞ్
గరమునఁ బూని తేని పృథుగర్వమతిఞ్ గదలించునో యనన్. 384

క. అంతటఁ బోతనయును భూకాంతుని యవమతిని శివుఁడు గరళమ్మునటు
ల్వింతగతి మ్రింగి చింతాక్రాంత స్వాంతమున జననిఁ గనఁబోవుతఱిఞ్. 385

గీ. అపుడు శ్రీనాథుఁడునుఁ బోతనార్యు ననుప నూర్వెలికి వచ్చి యింక నేమందునమట
వెదురులం గ్రొత్తకుండలు నెదురువచ్చె నైన నోరాడదయ్యెఁ బోతన్న నాఁడు. 386

క. ఆ వెదురుకఱ్ఱ గణుపులతో వెంచెడి నెవని బ్రదుకు తుదిదినముల దా
నే విగతాత్ముఁడు చితిపైఁ బోవఁగ నిచ్చెనల వైవఁ బొదవెదిగెనొకో. 387

క. ఈ నూత్న రిక్తఘట మే మానవ జీవన పిపాస మనల విన్నతహో
రాననము గలిగి యీగతిఁ దా నెదురయ్యె ననుకొను నెదం బోతనయున్. 388

సీ. ఆ నిశిఞ్ విధిలేక యాఁగె నొక్కెడఁ గాని తల్లికై మనమందుఁ దల్లడిల్లఁ
గ్రిందఁ దాఁ బడుకొనుఁ గ్రింద వైచిరొయేమొ నా తల్లినని యెదం గోఁతవడును
కనుమూసికొను నిల్లె కనుమూసి నా తల్లి మరణించునో యని మదిఁ దలంచుఁ
దెలవాఱు నెపుడని చలిమంటఁ గ్రాగుచుఁ దలి మంటఁబడిన విధమ్మునెంచు

గీ. వచ్చినప్పుడు కడు చెడ్డ వల్లులయ్యె జెక్కులం గట్టుకొని వ్రాలు డెక్కరణినిఁ
జనుపటకుఁ బ్రాణముండునో చనునొ కడకుఁ గండ్లఁ జూచు భాగ్యమ్మెని కలదొ యనుచు.

క. ఒక దెస తన మనమును జనని కలఁత విడి పుండు సేయ నృపతి తనయెడన్
బ్రకటించిన యవమతి హృచ్ఛకలమ్ముల జొరములను జల్లుచునుండన్. 390

క. ఖేద మ్మొకయెడఁ గ్రోధోన్మాద మ్మొకపక్క రేగి మానసమందున్
సూదులు గ్రుచ్చఁగ నొక్కొక పాదమ్మును పైచు చిట్లు భావించుకొనున్. 391

ఉ. 'సొత్తున కాసఁజెంది చని క్షుద్రనృపాలురఁ జేరి వారి యు
న్మత్త ప్రలాప గాన మహిమమ్ములు పందిని నందిఁ జేయగా
నెత్తినఁ బెట్టికొం చిదియె నిక్కమటంచునుఁ బ్రక్క తాళముల్
తొత్తయి తక్కతోమ్మనుచుఁ బొత్తువలె న్లయవేయు టొప్పునే ? 392

ఉ. చిత్తము స్వామి యంచురకఁ జేతులు పూర్వ సువాసినిం బలె
న్వృత్తులఁ బేనఁగా విటుని వశ్యునిఁ జేసెడి వేశ్యయట్లు కిం
చిత్తయిన స్మనమ్మునకుఁ జెందని కృత్రిమహాస దీప్తులన్
బత్తెపు పెత్తనమ్ములకు బంగరు మంగళహార తిత్తునే ? 393

చ. మనుజున నమ్మ మించి చను ముఖ్యుఁడవా యను నొక్క యగ్గు వె
న్క విడిన నీవు వట్టి కొలుఁగాని జడుండ వటంచుఁ దిట్టుఁ బ్రి
క్క వదచినంత నాసమముగాఁ జన నర్హుఁడవౌదువే యనుం
గన నెటువోయిన న్మరియె క్ష్మాపతి పల్లెరుకాయ చాడ్పునన్.' 394

వ. అని యీ గతి భావించుకొనుచు. 395

ఉ. ఆపద కోసుగాఁగ నెట వాఁగక గాలియ టేఁగుఁదెంచి వే
గ్రామము సొచ్చి మార్గమునఁ గాంచినవారినిఁ బల్కరింప నిం
కేమి వినంగనౌనొ యని యింటికి నేరుగ నేఁగ నెప్పట
ట్లామెయు వచ్చి కాళులకునైన జలమ్మిడదాయె భర్తకున్. 396

ఉ. ఏమనకుండఁ గాంచి చని రింత మొగమ్మయి లోని కింటివా
రా మహనీయు మానసమునం దొక గుందువడేన్ గుభాలునన్
శ్రీ మహితాఢ్యమౌ గృహము చీఁకటివడ్డటు చిన్నవోయి యే
బాములొ దాఁపురించినటు బావురుమం చగుపించె నెల్లెడన్. 397

తే. వచ్చినట్టి సోదరుని దివ్వన్న చూచి మారువల్కక కన్నుల నీరు నించె
నాత్రముస నేమి యెట్లుండెనని యడిగిన విన్ననే పోయినది యనె చిన్నవోయి. 398

ఉ. 'ఆఁ' యనుచున్ వివర్ణవదనాక్షుల సఖులు గ్రమ్మఁ 'బోతివ
మ్మా!' యని ఖేద గద్గద మహార్తరవంబుల నార్వఁ దిప్పరా
జో యసమానధైర్య మెదఁ జొప్పడ సోదరు నాఁపి పల్కె వ
ద్దీయది విన్న ప్రాణములె పోఁగును బైపయి నయ్యగారికిన్. 399

క. అనవుఁడు పోతన యలికిడి తన చెవిఁ బడఁ గేసరాజు 'తల్లీ!' యని వీ
తనయుఁడు వచ్చెను లక్ష్మీ! కనరమ్మని పెద్దపెట్టుగా నేడ్చె పొదన్. 400

తే. గర్జ విన్నంత గుండె వ్రక్కలయిపోయెఁ గట్టతెగిన యేఱుగుచు దుఃఖమ్ము పొరలె
వెంటనే పోతన మహార్తి వెదలి తండ్రిపైనఁ బడి యేడ్చెఁ దిప్పన వశము దప్పె. 401

గీ॥ తల్లి కొడుకా యనుచు తల్లడిల్లిపోయె నాకు భుజమిదవచ్చితే నాయన! యని
తండ్రి తలఁబాదుకొనియార్చెఁ దనయుఁడేడ్చె తెలివిఁదప్పెను కేసన నిలిచె నేడ్పు. 402

గీ॥ అపు డనుజుఁగాంచి యగ్రజుం డాగుమయ్య, యెట్లెటో జేయుచుండె తానట్టె కండ్ల
చీకటులుగ్రమ్మె మై జల్ల చెమటవోసె నసుట పోతన బెగడి కేసననుగాంచె. 403

ఉ. అంతనె చంటిబిడ్డవలె హా కొడుకాయని కేసనార్యుఁడున్
జింతిలు పోతనార్యు తొడఁజేర్చి తలన్నుదురంటి బాసుకొం
చంత మెరుంగనట్టి సొద నాగినగుండియ నాత్మఁబాసి, దుః
ఖాంతపు నాటకంబొకటి యాడెను తాన ప్రధానపాత్రయై. 404

గీ॥ ఒక్కపరి ఘొల్లుమనె నిల్లు బిక్కమొగము తో నిలిచె భ్రాతృయుగళమ్ము దుఃఖజలధి
మంచువలె గడ్డకట్టి స్తంభనముజెందె నిండ మునిగినఁ జలియింక నుండగలదె. 405

గీ॥ ముందునేనన నేనె మున్ముందనుచును పంతమాడుకొన్నట్టులు పయనమైరి
బాపురే యెంత పుణ్యదంపతులు వీర లనుచు గుంపులై ప్రజ కొనియాడె వారి. 406

గీ॥ ఎంతటి యదృష్టవతికి తా నీవిధముగ వచ్చు నైదువమరణమ్ము వసుధలోన
పోయె పసుపు కుంకుమరాల పూర్ణకళల లక్కమాంబ యనిరి యూరి లలనలెల్ల. 407

క. కాదిది సమయమ్మనుచును ఖేదము నావలకుఁ ద్రోసి కించిత్తయినన్
వైదికవిధి దప్పక దహ నాదిక్రియ లాచరించిరా సోదరులున్. 408

గీ॥ వత్సరములోన గ్రహణపర్వంబు వచ్చి నప్పుడేగి గోదావరియందు గల్పి
పితరుల ఋణవిముక్తి గావింపనెంచి వారి యస్థికలప్పుదరి పరచిరంత. 469

వ. తిప్పనార్యుండు పితరుల వియోగానంతరము కొంత కాలమ్మునకె జనకునకు కన్యాదానఫల
ప్రాప్తికినై తన పెంపుడు చెలియలి వైవాహిక క్రియా కలాపంబు లాచరించెనయ్యెడ.

## ఆశ్వాసాంతము

క. పావనముని జీవనబుధ సేవన పత్రిణతార్తిహరణ శీలావన సు
గ్రీవారిని బర్హణచణ పావక సమపత్రిభావ భవమృదుగాత్రా.

ఉ. వికచనవారుణాబ్జదళ విభ్రితనేత్రి విశాల! విస్ఫుర
న్మకురకపోల! రాజనిభమోహనఫాల! దయాలవాల! సు
ప్రకటిత మందహాసముఖ భాసురమౌక్తికమాల! శ్రీహరీ!
యకలుషశీల! వార్ధిమదహారక మార్గణజాల! రాఘవా!

## పాలాశదళవృత్తము

మదనసుమ విశిఖసమ మధురతమనేత్రా! కరనతలదనుజఖల గళవిదళపత్రా!
సదయ! విధుహృదయపృథుజలద మృదుగాత్రా! త్రిదశనుత పదముని గదిత నిజచరిత్రా!

## గద్యము

శ్రీమద్భరద్వాజగోత్ర పవిత్రాపస్తంబసూత్రి, ప్రథిత సూరిజనమిత్ర, బక్కయ్యశాస్త్రిపుత్ర
వాగేశ్వరీ సమాపాదిత, వైదేహీవర నివేదిత సరసకవితావిలాస, సహజ
పాండిత్యభాస, వరకవి విధేయ, 'వరదార్య నామధేయ ప్రణీతం
బైన పోతన చరిత్రమను మహాప్రబంధమ్మునందు
చతుర్థాశ్వాసము.



శ్రీ రస్తు.

శ్రీ వాగీశ్వర్యై నమః




## రామ సాక్షాత్కారము - లేఖినీ ప్రదానము

“ రామశ్శస్త్ర భృతా మహమ్ ”


రామా ! గుణ రూప ల
తా రామా ! దైత్య హృత మహాసాధ్వీ సీ
తా రామా విరహానల
నారాచవి తప్తసోమ ! నైగమధామా ! 1

తే. భవ దమూల్య సందర్శన భాగ్యయుతము భక్తిభావ సంభరితము ప్రాజ్ఞనుతము
కరుణరస కథామృతము సత్కవి చరితము చిత్తగింపవె రామ ప్రసిద్ధనామ. 2

తే. ఆర్యుఁ డగ్రజాతుండు తిప్పన్న వెంట రాఁగఁ బోతన సోమోపరాగవేళ
గంగఁ గ్రుంకి తీర్థ శ్రాద్ధగతుల నెఱపఁ జనుచు ముందొక గ్రామమున్ గనుచుఁ బలికె.

సీ. “సస్వర వేదఘోషలు శ్రుతిం బడు నిద్ది చతురాస్యు నాస్థాన సదనమేమొ
షట్ఛాస్త్ర సంవాద చాతురి యొప్పారు నిది శారదాదేవి వదనమేమొ
హవ నాగ్నిహోత్రి ధూమావృతం బియ్యది బలి యజ్ఞవాటికా ప్రాంతమేమొ
షడ్రస పక్వాన్న సౌరభావృత మిద్ది నల భీమ నృపుల బానసములేమొ

తే. చేతనా చేతనముల నీక్షింప నిచట శ్రౌతమో స్మార్తమో జ్యోతిషమ్మొ సాంగ
మంత్ర పాఠమ్మొ పఠియింప మహితగతిని గూటమైనట్లు దోఁచు నివ్వీట తాము. 4

ఉ. ఆలయ గోపురోపరి విహారము నొనర్చుచు రాజశారికా
జాలము ఋగ్యజుశ్శ్రుతుల సస్వర మాలపనం బొనర్చుటల్
శాలలపై శుకప్రతతి సామము పాడుటయున్ బదాబు వీ
సాలు ద్విజాఖ్య విస్యేడల సార్థకమున్ బొనరించు నవ్వియున్." 5

చ. అనుటయుఁ దిప్పనార్యుఁడు నిజావరజుం గని పల్కె "నీ పురం
బును దగ మంత్రికూట మనఁ బొల్పెసలారు ద్విజాగ్రహారమై
ఘనతర వేదశాస్త్ర చయ కల్పక ముస్వర సాహితీకళా
ధనదుల కాస్పదంబు ప్రథితమ్మల స్కాంధపురాణ గాథలన్. 6

తే. నవరసము లూరు శ్లోకముల్ నవత మీఱ షడ్రసాన్విత పాకముల్ చవులు బుట్ట
రచన సేయుటలో సాటిరారె వారలనుచు నుతికెక్కి రిచటి బ్రాహ్మణ కులజులు. 7

సీ. వర పశ్చిమ చళుక్య వసుధాధినేతయౌ భూలోక మల్లుని యేలుబడిని
ప్రతివిధ్యమ్మని పాలించె నివ్వీడు రాజధానిగ గుండరాజు తొల్లి
యా గుండ నృపుని రాజ్యభ్రష్టుఁ గావించెఁ గాకతి ప్రోలరాడ్ఘనుఁడు దొడరి
యప్పట్లు రూపటి యడఁగిన యీ ప్రోలు కాకతివంశ దివాకరుండు
తే. శ్రీ ప్రతాపరుద్రుఁ డమోఘ శీలధనుఁడు మఱలఁ బొందించి వేదవాఙ్మయ విధాత
శాస్త్రనేత గోపాలకస్వామి యనఁగ పేరుగనిన విప్రున కగ్రహార మిడియె. 8

ఆ. మంత్రకూట వాసి మల్లికార్జున సూరి సకల శాస్త్రవాది సత్యవేది
యాత్మతత్త్వమోది యాచార్యుఁ డయ్యెను వర ప్రతాపరుద్ర ధరణి పతికి. 9

క. నెట్టన శైలేశ్వరునకుఁ గట్టించెను దేవళమ్ము గణపతిదేవుం
డట్టులె తన కీరితి తోఁబుట్టిన శీలాబ్ధి యనఁగ బొనరిచె సరసిన్. 10

చ. అని వినుతించుచున్ బుర వరాలయ శోభల నెంతొ వింతగా
గనుచును దిప్పరాజు తమకమ్మునఁ దమ్ముని తోడఁ గూడి వే
జని ఘన గాంగవారి తట పద్మవిభాసితుఁడైన గౌతమీ
శుని గని మ్రొక్కి కారు కృత సుందర మందిర శోభ లెంచుచున్. 11

చ. తులు చన నేఁగు వెన్నదలఁ దూఁగు హారంగు తుఱంగలింపఁగా
శిలలను ముంచి స్థాణువుల శీర్షమునన్ ధరియించి మించు పే
రలల సృజించి భక్తభవ హారిణిగాఁ జరియించు గౌతమీ
జలమునఁ గాంచి మ్రొక్కి తలఁ జల్లుకొనెన్ గురుభక్తి యొప్పఁగన్. 12

ఉ. గౌతమిఁ గ్రుంకి మాతృపితృ కాయపు టస్థుల గంగఁ గల్పి వే
పైతృకశ్రాద్ధముల్ ప్రథిత పార్వణ పద్ధతి సల్పి భూమర

వ్రాతము నిష్టభోజ్యరస భక్ష్యపదార్థ పవిత్రిపాత్ర వి
స్పీతధనాళిఁ దన్పి పితృ శేషములన్ భుజియించి భక్తిమై. 13

క. ఆ సోదరులును భుక్తాయాసముఁ దీర్చికొనఁ జెంత నలరు జలరుటీ
భాసుర వృక్షచ్ఛాయావాస మ్మొనరిచిరి సంధె వదె నమ్మోదలజా. 14

క. మందానిలతతి శీతల చందన సదృశమయి వీచె సాయం
సంధ్యావందన కాలమ్మని తట మందొాక యెడఁ గూరుచుండె ననుజుఁడు దానున్. 15

వ. అంతఁ గవివరుండు గౌతమిం గని, సంధ్యారాగరంజితంబులగు తత్పరిసరంబుల సౌందర్యంబుల నిట్లభివర్ణింపం దొడంగె. 16

సీ. సంధ్యాతపాగ్నిలో జాతరూపనగమ్ము కరగిపాఱిన యట్టు లరుగు జలము
జలపూరములలోనఁ దలక్రిందుగాఁ దపో విధిబూని బింబించు వృక్షరాజి
వృక్షబింబమ్ములన్ విరిడోల లూఁగెడి యనిలార్భకులతోడ నాడు సవిత
సవితృబింబమునకు సరసంపుగతి దాఁగురకింత నేర్పెడి లహరీ ప్రితతులుఁ

తే. బొదల నుదక నారాయణు సదమ లాంతరంగ మన దివిభువుల కుత్సంగమనుచు
పైనఁ గల మిన్ను నడుగునఁ బరఁగు మన్నుఁగూడ నొకసారి నీలోనఁ జూడజేతు. 17

శా. గంగా భంగ తరంగ సంగత తటక్ష్మాజమ్ములం దూఁగి ప్రో
త్తుంగానీల కళావిలాసి మహీభృద్దుర్గమ్ములం డాఁగి రం
గుం గొట్టాల వసంతముల్ జిలుకు నర్కుండా నదీ యోషమై
సింగారించిన వెల్లకోక మెఱయన్ స్వీయానురాగాంకమై. 18

సీ. ఇసుకదిబ్బల నడ్డు లేర్పడ గునగున న్నడచుచు నెడనెడ నదరి దూకి
జలములపైఁ దేలి మిలమిల లాడుచు నెగయు మీనుల ముక్కున గఱచికొని
తేపకు నీటిలో దేహమ్ముల న్ముంచివచ్చి యీకల నెల్ల విచ్చియార్చి
తుంగగుంపుల మధ్య దూరి నెమ్మదిగొని పొదుగుచు నిటునటు పొరలి లేచి

తే. బారులుగ నొక్కపెట్టునఁ బైకెగయుచు ఱెక్కలాడించు చొకమఱు నక్కసాచి
అర్ధవలయాకృతిం బంతు లలరుగతుల ఖగముల స్తంభ తోరణాల్ గట్టె దివిని. 19

శా. పాఱుఁజా బకుల తోరణమ్మిటు నభో భాగాన గోదావరీ
నీరాంతః ప్రతిబింబితమ్మయి, చల న్నీలాబ్ది శైలోల్లస
ద్వారుణ్యాశ సువర్ణశోభ లపరాంభఃపూర భంగాకృతిన్
దీరం బల్లారయంగ నెండపొడ వర్తించున్ ద్రుమాగ్రిమ్ములన్. 20

తే. తత్ప్రకృతిశోభలకు దృష్టి దగులకుండ నొక భరద్వాజమును మీఁదినుండి త్రిప్పి
వెంటనే నిశాయవనిక వేసి దాచి జగతి మారించి చనిరేరొ సాంధ్యకళల. 21

కం. జలయానము డిగి కల మీవలి యొడ్డున నబకబాతి బంధించుచుఁ జేఁ
పలఱుట్టలు మొల వ్రేలన్ వల మూఁపునఁ గ్రాల జెస్తవసతుల కేఁగెన్ 22

క. అని సంధ్యాశోభలఁ గని మనమున నానందవార్ధి మగ్నుండై తూ
ర్పున నపుడే పొడిచిన చక్కని పార్వణ చంద్రుఁగాంచి కవి యిటులెంచున్. 23

తే. పద్మసంభవరచిత ప్రపంచ కావ్యమందముల రాశియయ్యు దోషాప్తిగనుట
దాని నొక కళానిధి సన్నిధానమందునుంచ సవరించు నన నోముఁ దొప్పుదివిన్. 24

తే. ఓషధీనాథు సంస్పర్శమొందు కతన నలరి సాత్త్వికభావోదయమును గాంచఁ
జెమ్మగిలె మోము లనఁగ నీ కొమ్మగమియు కాంత హిమబిందు సందోహ కలితమగును.

ఆ. విందుపడిన చంద్రునిం గాంచి సంద్రమ్ము పొంగి నింగినంటి పొరలు నంట
కన్నకడుపు పెంపు కన్గొని పెల్లుబ్బి సంతసింప నట్టి జనకుఁ డెవఁడు. 28

సీ. కడు సున్నితంబైన యొడలంచు నే ప్రొద్దు నెండ కన్నెఱుఁగనీకుండ సాదు
నెవరి కండ్లెట్లుండినవో యంచు నెడనెడఁగావిరి బొట్టు మొగానఁ బెట్టు
పాల్గారు రూపులే పగలు రాతిరి యేమిసోఁకునో యని మబ్బుకోక గప్పు
నొకడున్న వెంపొందునొకా బేల యితఁడని చుక్కబాలికలను జోడొనర్చు

తే. లేక లేకొక్క కొడుకు రత్నాకరునకు నందముల కుప్పచందప్పయద్ది యేమొ
నాల్గు నాల్గు నాళలకును నవసితెవులుఁ గొమను మొనమొన్ననే తేరుకొనె నొకింత. 27

తే. శిలలను గరంగు వితని నవ్వులకు వలచి వెన్నెల పులుంగు పిచ్చిదౌ పిన్ననాఁడె
గురుపతీ సంగమ మొనర్చు టెఱిఁగియుండి శూలి తలదాల్చె ధనికుని సూనుఁడనియె 28

తే. అక్కయా కమలాలయ యాదిలక్ష్మి యనుజుఁ డరుగుదెంచెడి నని నంత నామె
తలుపు లిడికొని యింటిలోపలికిఁబోవు నెద కళంక పంకిలమని యెఱిఁగెనేమొ. 29

తే. ఏమి పాపమొ యేటేట వితఁడు తాను పరవి ఛాయాగ్రహముఖాలఁ జచ్చిపుట్టు
కంధి 'మా రాజు' చల్లని కడుపుబలమొ బ్రాహ్మణుల గంగయొద్దు తపఃఫలమ్మొ. 30

తే. అరయఁబుట్టు కళానిధియైన నేమి యాత్మకృత పాప ఫలితమ్ము లనుభవింప
వలసియే యుండుఁగాదె యెవ్వరికైన ననుచు స్వకృతిసింహావలోకన మొనర్చి. 31

ఉ. ద్వాదశహాయనంబులు తపంబొనరించియు బ్రహ్మచర్య వి
చ్ఛేద మొనర్చుటల్ తపము సిద్ధిని గాంచదు, రామచంద్రు శ్రీ
పాద సరోజదర్శన సుభాగ్యము జిక్కనె భ్రష్ట ధర్మ సం
పాదికి నింద్రియ ప్రియవిమోదికి నస్థిర సౌఖ్యమోదికిన్. 32

ఉ. పండిత జన్మమిచ్చి రసభావ మనోహర కావ్యసత్కళా
మండితుగా నొనర్చు నిను మాధవునిన్ వినుతించి ముక్తునై
యుండక నే సుధన్ విడిచి యుబ్బి సురన్ గొని నట్లు భోగినీ
దండక మల్లి రాజ్యమదదర్పన కర్పణ పేసితిన్ బ్రభూ ! 33

క. బ్రహ్మర్మ్మఖముఖ్యుల కంతర్హితుఁడవు నీవు నీదు దర్శనభాగ్యం
బర్హులకె లభ్యమఁట నీ నిర్హేతుక కృపను గంగ నీటఁ గలిపితే. 34

ఉ. అట్టులెయైన గంగను మదంబను దావక సత్కృపాయురిన్
బిట్టుగ సన్నుతింతు మును వీటఁడి తేఁడుల వారకాంతలన్
బట్టువలెన్ నుతించు తటి పంకకళంకిత వాగ్విహార సం
ఘట్టన కాస్పదంబగు నసద్రస నమ్మదిపూతమౌనటుల్.

తే. క్రొవ్వి యొనరించు మాదగు క్రొవ్విదములఁ గడుపునం దిడి కాయుపు కదలుకొనఁగ
జముని జంకెనలం బాపి సాకుదెవరె యంబ విసుమించు పల్లాయనంబువారు. 36

తే. అని తెనుఁగునాఁటి జాహ్నవి యనఁగ నొప్పు గౌతమీరామణీయక ఘనతలెల్ల
నాత్మదలపోసి యుత్సాహ మతిశయింపఁ దన్మహత్వంబు నిటుల స్తోత్రమ్మొనర్చు. 37

క. హరి చరణ మజుఁడు గడిగిన హరుఁడౌ దలఁదాల్చి తాపమార్చికొనిన పెన్
వరదవఁట, భక్తకామిత వరదవగుట కేమిలోటు వరధుని గంగా ! 38

తే. శ్రీశు పదసరోజమ్మంటి చిల్కు తేనె నీశు వృథు శిరోజములైన యెఱుపుతేంట్లు
తెచ్చి తెట్టెగా నిడికొనఁ దెరువరియయి కాఁచిపోసె భగీరథ ఘనతపోగ్ని. 39

తే. రాకుమారియు మరి ముని రాట్కుమారి గాఁగ నవతరించుటలోనె కలదు వాసి
యనుచు భాగీరథిగ నొప్పు నమర నదియె గౌతమిగ జనించి ద్విజత్వ ఘనత గొనెనొ.

తే. లోక కల్యాణ కాంక్షావిలోల మైన యే మహాశక్తి కరఁగిన యెదవొ నీవు
మదిని బిడ్డలపై గల మమత చేఁప నరుగుదెంచునే జనని స్తన్యమువొ నీవు. 41

సీ. పొలుపారు సైకతమ్ముల పొత్తిలి రచించి సుందర దృశ్యము లందగించి
సహ్య పర్వతపంక్తి స్తనయుగ్మ మొనరించి చనుబాలు గాఁగ జీవనము బంచి
యెట్టి మాలిన్యమే సేవగింపు వడంచి మాతవై కదఁగి ప్రేమమ్ము బెంచి
యనఘులు నా ప్రజలని యభిమానించి హరునకుఁ దలకెక్కునటు వచించి

తే. యడ్డమగు చెట్లగుట్టల నాశ్రయించి హరిహరుల మందిరములకు శిరము వంచి
యాత్మజుల మీఁది యనురాగ మాలపించి మేలు యాచించెదో గౌతమీ వివంచి. 42

ఉ. కొమ్మ తనూజునిం గొనుచుఁ గూరిమి మీఱఁగ క్షీరపారవ
ర్షమ్ము లనేకముల్ గురిసి సత్కృపఁ జూపుట లాతఁ దొందు పా

య మ్మఱియుండి యజ్ఞుఁడు ననన్య శరణ్యుఁ డశక్తుఁ డార్తుఁడై
యమ్మ యటంచు నేడ్చుటయె యర్హత గాఁగల యట్టిఁ దౌటఁగా. 43

క. ఏ జీవం దేనియుఁ దా నీ జీవనములను గ్రుంక నిర్మల తనుఁడౌ
నే జీవనమైనను నది నీ జీవనగతులఁ గలియ నీవగు రీతిన్. 44

సీ. కలశపాథోరాశి క్రాఁగు పొంగును ద్రోసి యురికివచ్చిన పాల నురువు వేమొ
వీర రుద్రుని కాలి విలయతాండవ కేళి వంతుబాడిన వీణె తంతివేమొ
దురితాసురులఁ ద్రుంప శరపరంపర ముంద నాట్యమాడెడి వీరనారి వేమొ
గాలితోఁ బందెమ్ము గట్టి మ్రింగ భృశమ్ము పగబట్టి చను త్రాఁచుపాము వేమొ

తే. కరఁగిపోసిన రజత నగమ్ము వేమొ యభ్రగతి వీడు విద్యుల్లతాంగి వేమొ
పవనహతిఁ దూలు హరుమల్లు పాగవేమొ భూమిజన కల్పవల్లి ; గంగామతల్లి ! 45

తే. పతికిఁ బుట్టింట నున్నచోఁ బతి విరహము స్వామికటి నున్నఁ బుట్టింటఁ జనెడి కాంక్ష
యనుచు నాసుబోసినయట్టు లచటి కిచటి కేక రూపమ్ముతో నన్వయించి యుందొ, 46

సీ. ఉడ్డీయమాన దీప్తోర్మి పంక్తుల తోడ వల చెమ్మచెక్కల నాడుచుందు
ధారలో నొండొండు దాఁకెడు మ్రాఁకుల తోడఁ గోలాటమ్ము లాడుచుందు
వావర్తగతిలోని యాత్మప్రదక్షిణా కృతులఁ గుమ్మరిసారె క్రీడ నుందు
పూరోపరి నటించు బుద్బుద శ్రేణితో నచ్చనగిల్లల నాడుచుందు

తే. తరు గిరుల దాఁగి, దాఁగురింతలను దోఁగి వాఁకలం గూడి గుజగుజ రేకులాడి
విరుల గుత్తుల వేణిలోఁ దురుముకొనుచు బాల ఖేలావినోద సంపదల మనెదొ. 47

సీ. గగనంబులోన మేఘవ్రాత మీఁదాడ నావలు నీలోన నడువసాగు
నభమందు మెఱపొందు నక్షత్ర పంక్తులు మీనముల్ నీలోన మినుకులీను
మడు వీథి నభ్రముల్ గడగడ నుఱుమంగ భేకలోకధ్వాన భేరి మ్రోఁగు
వినువీథిలో నింద్రధనువు బ్రకాశింప గైరికాదులు నీదు గతుల మెఱయు

తే. నంబరములోన శశి సూర్యు లందగింప విలస దబ్జముల్ నీలోన విరియుచుండు
స్వర్గమున్ హసియించు నిర్ఝరివి నీవా పంగువునకుఁ బై నరుదెంచు గంగ వీవా. 48

సీ. వేదాళి కనురెప్ప వేయక కాపాడు మత్స్యావతార సంపదలు బొదల
నింద్రియమ్ముల నిగ్రహింప దివ్యామృతమ్మను భావ్యమను కూర్మతనువు దనర
నిసుక లంకల ముస్తై వసుధగాఁ గోరపై నాడించు స్తబ్ధరోమాంగ మెసఁగఁ
బ్రహ్లాద వర్ధక ప్రక్రియా చరణల దరులందు నరుఁబోలు హరులు నాద

తే. వటువులున్ భార్గవ ద్విజవరులు వెల్గ రామ దేవాలయాంచిత సీమవగుచు
విరత గోపాల సేవిత విలయవగుచు వర పురాణ భాగవత విస్ఫురణఁ గాంతు. 49

ఉ. జీవన మాఱకుండుటలు చిత్రగతి న్నిశియుం బవళ్ళు వి
ద్రావశతం జెలంగక ప్రధావనమున్ బొనరించుచుండుటల్
పావనమైన యీ యమృత పానమొనర్చుచు నుంట లారయన్
నీ వొక దేవతాంశమని నిశ్చయమయ్యె నెడంద గౌతమీ! 50

చ. హరిపద కంజమంజుల నఖాగ్ర ముఖమ్మునఁ బుట్టి పేర్మి శం
కరుని జటాకిరీట మణి కర్బురకుంజము మెట్టినట్టి శ్రీ
సురనది వీవు నిన్గనులఁ జూచినఁ దాఁకినఁ ద్రావినన్ వినన్
బరిమళ మానినన్ గరణ పంచకపాతక పంచకమ్మఖున్. 51

ఉ. కొమ్మలు చామరమ్ము లిరుగోనల వీచుచునుండి పుష్పవ
ర్షమ్ములు గొట్ట, భూమి రుహసంతతు లిట్టటు విల్చి యాతప
త్రమ్ములు బట్ట, రేఁబవలుఁ దార లుదారులు చంద్రసూర్యులున్
సొమ్ములు బెట్ట నంబరము సొంపుల చీరలు గట్ట రాణివై. 52

ఉ. నెమ్మది నేఁగుదెంచె దఁట నీదు పదమ్ముల వేతసమ్ము శీ
ర్షమ్మును వంచి పాహి యని రక్షణ వేద ద్విజాళి స్తోత్రపా
ఠమ్ములు బాడఁ బార్శ్వగ తటమ్ము లనారత మానుకూల్య మా
ర్గమ్ముల జాడఁ జూపఁ ద్రిజగజ్జనముల్ గొనియాడ గౌతమీ! 53

ఉ. అక్షయరూపినంచు పథమడ్డు నగేంద్ర మదేభకుంభ హ
ర్యక్షమవై మహోన్నతుఁడ నేనని యడ్డము నిల్చు నమ్మహా
వృక్షములం బెకల్చి పడ వేయగఁ గూలకుజానుకూల దు
ష్పక్షము చెందునట్టి యసిపత్రమవై పయనింతు గౌతమీ! 54

చ. హరుఁడు తలం ధరించికొని నట్టి పవిత్రవు, దండకాటవిన్
ధరణిజమున్ రఘూద్వహునిఁ దానము లార్చిన పూతగాత్రి వీ
దరుల వసించు నా జనపదమ్ముల పుణ్యము లేమి పూచెనో
తరుగిరి మత్స్య కచ్ఛప పతత్రిగణమ్ము లివేమి నోఁచెనో. 55

చ. తనువును గాల్చి యస్థికలు తావక వారిని వైవ వాని యా
త్మను గొనిపోవు కాలుఁడును ద్వత్ప్రవశక్తిని గాంచి మిత్తిగొం
గనె తలవన్ని నిల్చెనని కంపము నొందుచు పీమె జోలికిన్
జనవలదంచు విష్ణుపద సన్నిధి వానిని డించి వే జనున్. 56

ఉ. ముందుగతిన్ గనుంగొనక మోహితులై పెను కాలవాహినిన్
వందురుచున్న యీ యసమ వక్ర పథాంతరవర్తులన్ వ్యథా

క్రింద దపార కల్మషుల కంధిశయానుని గల్పు గంగనే
నందువె లేమి నబ్ధి దరియౝ నదవంకల వేల నీ కిటుల్. 57

శా. తీరస్థ ద్రుమ కోటరాంతర పతత్రివ్రాతముల్ స్వాదు నీ
వారప్రాశనముౝ బొనర్చి తుష మవ్వారిన్ విసర్జించి సం
సారస్థుల్ స్వకృతాఘముల్ భవదుద స్రావంబునౝ ద్రోసి పు
ణ్యారబ్ధమ్మను భావ్యమంచుఁ గొని శ్రేయమ్మందుటౝ దెల్పెడిన్. 58

తే. నదుల నామరూపమ్ములు నదక గల్గినంతవఱకె యావల నొకటగు నటంచు
భేద బోధక మాయాపనోదక మగు నిర్మలాద్వైత తత్త్వమ్ము నిర్వచింతొ. 59

ఉ. నీ తటమందు సజ్జగతి నిల్చెడి జంతువు మేననేని నీ
శీతల వాతపోత హృతశీకర మొక్కఁడు సోకజాలు త
త్పాతకరూప దుర్మలిన పంక విముక్తి ఘటించు గౌతమీ!
జ్యోతి యొకింత వెల్గ భువిఁ జుట్టు తమిస్రము బాపుకై వడిౝ. 60

చ. అరయ మరందరూప గరళాయిత మైవలపించు కర్మసం
సరణ పథమ్మనంతయుగ జన్మజరామయ మృత్యుసార సా
గరమయి దాఁట నీని గతిఁ గాఱియవెట్టెడి నీ శరమ్ము లీ
శరనిధి నా రఘూద్వహాని శాతశరమ్మటు లింకఁ జేయవే! 61

మ. భవదీయామల కూలమృత్తికను దీవ్యత్ఫాల భాగమ్మునౝ
సవరింపౝ దిలకాకృతిౝ భృకుటిలో సాక్షాత్కృతిన్ జెందు మా
ధవుఁ డంచున్ బుధులందు రవ్విభుని మధ్యానమ్ములో నొక్కఁ మా
రవలోకింపఁగఁ జేయవే భువనమాన్యా! ధన్య గోదావరీ! 62

తే. అనుట నది యట్లై యని పచ్చనాకు దీసి శిరమునం బూన్చికొని బాసజేసి చెప్ప
ననఁగ వనగొమ్మ తానొక్కఁ డంబుధారఁ దేలి కవి కగపించె నవ్వేళ నచట. 63

ఉ. అంతటఁ బోతరాణ్మణియు నయ్యుపరాగము సోము సోఁకు టొ
క్కింత యెఱింగి మిన్నెగసి యేఁగెడు గంగ మునింగి లేచి త
త్ప్రాంత మనోజ్ఞసైకత వితర్దిక నొక్కెఁడ ధ్యానమగ్న సు
స్వాంతరతిౝ సుఖాసన విభాసితుఁడై శివభక్తి యొప్పఁగౝ. 64

మ. కనె నంతర్ముఖుఁడై యతం డపుడు వీఁకౝ భ్రూకుటిన్ దృష్టివ
ర్తనముల్ సంధిలఁజేసి యీశ్వరునిలో దర్శింతునం చయ్యెడౝ
గనె లోనవ్వసియించి యద్దువడు రాగద్వేష రూపమ్ములో
యన మిశ్రస్థితి నాట్యముల్ సలుపు తామ్రీ వీల వర్ణాదులన్. 65

ఉ. చందురు మోమునన్ సుకవిచంద్రు ముఖాంబుజ సీమ నొక్కఁడే
చందమునన్ రజస్సు తమ సమ్మనలోహిత కృష్ణవర్ణముల్
సందడి గాఁగ వేడబము సల్పె స్వరూపము లోపమంద రూ
పొందు పొగల్ రగుల్కొని సముజ్జ్వల కీలల దాఁచుకైవడిన్. 66

ఉ. ఎన్నఁడు దర్శనమ్మిడ విదేమి పరీక్ష యటంచుఁ దాను పో
తన్న మహార్తి పూర్ణహృదయాబ్జము వెన్నవలెన్ ద్రవింప వా
ల్గన్నుల నశ్రులొల్కఁ బులకల్జనియింపఁగ మేన భక్తిమై
మిన్నులు గాంచి కేల్మొగిచి మేకొను గద్గద విస్వనమ్మునన్. 67

మ. ఎదలోనన్ గృపలేదొ నీకు నటుగా కే భక్తిహీనుండనో
చదలన్ లేవొ రవీందుకాంతు లవి గాంచన్ నేనె యంధుండనో
యిది నీ లోపమొ నాదు పాపమొకొ సర్వేశా! విచారింప నా
మదికిన్ దోఁచ దిఁకేమి సేయుదును మున్మార్గంబు జూపింపవే! 68

చ. విసుగు జనించె నీ జగతి వేమఱు చర్విత చర్వణమ్మునన్
మెసవుట నిద్రవోవుట భ్రమించి రమించుట లాచరించుచున్
పసరము భంగి నీ విషయ పంచకభోగమె సేవ్యమంచు మా
నిసి ననిపించుకొందు నవి నింద్యునివోలె నటించి యీశ్వరా! 69

ఉ. గాత్రము కాచపాత్ర త్రుటికాలము నమ్మ వశమ్ముగాదహో!
చిత్రమగున్ ధనాశ యన ఛిద్రఘటమ్మటు నింద దెన్నఁడున్
పుత్ర కళత్రముల్ వనులఁ బోయెడి దారినిఁ గొంతదూరమున్
మాత్రమె వెంట వచ్చి తమ మార్గమునన్ జను పాంథులో ప్రభూ! 70

శా. ఈ బండారముఁ జూచుకొంచు హృదయం బేమో యహంకారమున్
దాఁ బూనున్ గదె వీధి నాటకపు పాత్రల్ రాత్రమున్ మాత్రమే
నే బంటున్ మహి సార్వభౌముఁడను నేనే యంచు వర్తించి రే
పే బిచ్చమ్మని వచ్చుకైవడి నినున్ విశ్వేశ్వరుం గాంచకన్. 71

మ. పరు నిందం బొనరించి సద్యశము సంపాదింప యత్నించితిన్
బరు మోసం బొనరించి ద్రవ్యమును సంపాదింపఁగాఁ జూచితిన్
బరు హింసం బొనరించి యాత్మసుఖ సంపాదార్థినై తిన్ పరా
త్పరు విశ్వాత్మకు విశ్వరూపు నిను సంభావింప జాలన్ విభో! 72

ఉ. సంతత జన్మ మృత్యుభవసాగర మీఁదఁగ మానవత్వమే
వింతగు పోతరాజ మన వీమలవిందుగ విందుఁ గాని దు

ర్గాంత దురంత దుఃఖఫలదాయి విషద్రుమమయ్యె జీవన
మ్మంతయు ధారవోయు కృషి యంతకు నంతకు బాధలిచ్చుటన్. 73

చ. భవతరణార్థమై తగు నుపాయముఁ జూపమి నాకు వ్యర్థమా
నవతను ధారణమ్మను దినమ్మతి దుర్భరమయ్యెడిన్ తనూ
భవుఁడె యగాధకూప విని పాతదశన్ మొరపెట్ట తండ్రియై
యెవఁ డదిగాంచి తాలిమివహించు నహీశనివాస భాసురా! 74

సీ. పద్మాక్ష దర్శన భాగ్యహీనములైన కన్ను లంధవరాటకములు గావె
జగదీశ సత్కథాశ్రవణ దూరంబైన శ్రుతులు కోటర బిలాకృతులు గావె
యచ్యుత గుణకీర్తనామృతం బానని నాలుక పేరితాగ్ని కీలగాదె
వనమాలి నిర్మాల్యవరగంధ మెఱుఁగని నాస యుమ్మెత కనుపారిసగాదె

తే. విష్ణు పదపద్మ సేవనా విరహితమగు కరము ధరమొల్చు నుప్పలికరముగాదె
పరమపదనాథ విషయ సద్భక్తిలేని మేను బడిశంపు టెర మ్రింగు మీనుగాదె 75

వ. అని యిట్లీశ్వర సందర్శన కుతుహలాయత్త చిత్తుండయి యార్తింగొని యున్నతఱి. 76

తే. రాహుకబళిత సోమోపరాగ మేగ శుద్ధుఁడయ్యె కళానిధి బుద్ధుఁడయ్యె
గౌతమీ నిర్మలోదక స్నాతుఁడగుచు సొరిది విబుధుడు నంబర శుచి నొనర్చె. 77

మ. భసితస్నిగ్ధ పవిత్రలాంఛనల సత్పాలుండు రుద్రాక్ష దా
మస మాలంకృతచారువక్షుఁడవి కంపత్ కించి దున్మీలితా
క్షిసమాలోకిత నాసికాగ్రుఁడు సమగ్రీవా శిరఃకాయుఁ డు
ల్లసితాత్ముండుఁ బ్రశాంతచిత్తుఁ డగుచున్ లక్షించుచున్నంతలో 78

చ. ఒదవె సుషుమ్న ద్వంద్వ పవనోర్మికలందు లయించె నెంతయున్
గదలిక లేనివారివలె గాలిఁ జలింపని దీవె యట్టుల
న్మదతను వీడు బుద్ధి గతిమత్సరుఁడై గ్రసియించు రాహువున్
వదలిన సోముభాతి నమనస్కతనంది వెలింగెఁ జేతముల్. 79

ఉ. కోటి రవి ప్రభాపటలి ఘూర్ణిలి క్షీరరసాబ్ధి పొంగ వే
కోటి నటత్తటిచ్చటలు గూడి తరంగతతుల్ పెనంగె ము
క్కోటి సుధాంశు చంద్రికలు గూలి కరంగి నురుంగు లెత్తెఁ ద
త్కూటములోఁ గనెన్ సుకవి కోమల నీలనవాంబుజాకృతుల్. 80

ఉ. ఆదిని నీలవర్ణము దళాగ్రముఖమ్ముల శ్వేతకాంతి పు
ష్పోదరసీమ సాంధ్యకళ లొప్పు మనోజ్ఞ త్రివర్ణమిశ్ర వ

మ్మోదకరాంబు జద్వితయము న్గనుమండెను భానుఁ దేని ని
మ్మేదిని విట్టి తమ్మితమి మీఱఁగనం దని యాత్మ నెంచుచోన్. 81

ఉ. కోకనదద్యుతుల్ కమల కోమల పాదతలమ్ములై మనన్
శ్రీకరపుండరీక సురుచిప్రకరమ్ము నఖామల ప్రభా
నీకము లయ్యె నీల నలినీదళముల్ పదయుగ్మమయ్యె మున్
దూఁకెడి పాండుపత్రి రుచిదోఁచెను హాటకచేల రూపమున్. 82

సీ. పద్మరాగప్రభన్ బరిహసింపఁగఁ జొచ్చె రమణీయమౌక్తికరాజి యనఁగ
రమణీయమౌక్తిక సముదయంబును మించె హరి నీలమణి కళావరణ మనఁగ
హరి నీలమణి కాంతి నపహసింపఁగవచ్చె హాటకధామ సత్కూట మనఁగ
హాటకచ్ఛాయల నవహేళన మొనర్చె మరకత శోభావిసర మనంగ

తే. శ్రీనివాసాంఘ్రియుగ సరసీరుహాంతవిలస దంగుళీ నఖసీమ తళుకులీను
గాంచ నాంబరాంచలమంటు కరము మెఱయఁ బూర్వకాయంబు విస్మితపూర్వకముగ. 83

తే. దర్శన మొనర్చి పోతన తల్లియొడి నిస్తన్యమాని రెండవ పయోధరము వెదకు
చంటి బిడ్డని భంగిలోఁ గంటఁజూచి యూర్ధ్వకాయది దృష్టివై యున్నయంత. 84

ఉ. ఆకసమంటి కూలెను సుమాంజలి వర్షము దివ్యగంధముల్
బ్రాఁకెను సామగానములు బర్వెను సర్వమునన్ సమైక్యమై
శ్రీకరమై జగత్త్రియ వశీకరమై భువనైక సేవ్యమ
ప్రాకృత దివ్యమంగళ సుపావన విగ్రహ శోభలేర్పడెన్. 85

సీ. నీరదశ్రేణులు నీలాలకము లయ్యె నఖిల దిఙ్మండలం బాస్యమయ్యెఁ
జంద్ర సూర్యులు మహచ్చక్షు యుగ్మంబయ్యె ననిలుండు ఘ్రాణాకృతిని ధరించె
నుభయ సంధ్యారాగ మోష్ఠద్వయం బయ్యెఁ బలుతారకలు దంతపంక్తులయ్యె
నద్రికూటంబు లాయతభుజాంతరమయ్యె శిఖరముల్ వరకరస్థితి వహించె

తే. సింగిణులు మణికంకణశ్రీఁ జెలంగెఁ జంచలలు నుత్తరీయంపుటంచులయ్యె
నూర్మియుక్త రత్నాకరం బుదరమయ్యె విశ్వరూపంబు హరిగ సేవించె సుకవి. 86

సీ. హాటకమణి కల్పితాలేఖ్య విలసిత మకరతోరణ వస న్మంటపాంత
వరతారకాగణ స్ఫురదంబరాయిత మణిదీప వృక్ష సంపద్వితాన
యనుపమ శిల్ప శోభాకీర్ణ నవరత్నభాసుర స్వర్ణసింహాసనాంక
మణిమంజరీ లంబమానాంచలోద్దీప్త భర్మదండసితాత పత్రయుక్త

తే. స్వర్ణకృతగోపురాఢ్య రాజతసుకుడ్య మరకత స్తంభకూట సన్మణి కవాట
విద్రుమ ద్వారగేహళీ వికృతహీర వివిధరత్న సోపానయా భవనసీమ. 87

సీ. ఉదయదర్ధార్కబింబోద్దీప్త శైలాగ్రమన మణిమకుట ప్రభాత్తశీర్షు
పర్యావృత పటీరచారుశాఖిక యనఁ జండ కోదండ రాజత్కరాబ్జుఁ
దప్తజాంబూనద స్థగిత వీలమ్మున శ్రీమత్పిశంగ కౌశేయ కాయు
సౌదామినీయుత సజలనీరద మన నవని జాసహిత వామాంకభాగు

తే. స్వీయడిండీర మండితోద్దీయమాన భంగరంగ న్మహార్ణవ భాగ మనఁగ
లలితమౌక్తికదామ విలాస లాస్య చిత్రితవళీయుతోదర సీము రాము. 88

ఉ. కాంచి నమస్కరించి యిరు గన్నుల యందుఁ బ్రమోదబాష్పముల్
నించి శరీరమెల్లెడ జనించిన పుల్కల పారవశ్యతన్
మించి ప్రమోదడోలికల మీఁద వసించి మహానురక్తి సే
వించెను రాలు స్త్రీలయి జపించెడి సుందర పాదపద్మముల్. 89

వ. ఇట్లు సేవించి శ్రీ విభున కభిముఖుండై కవివరుం డమందానంద కందళిత హృదయార
విందుండై యిట్లని స్తుతింపం దొడంగె. 90

ఉ. కంటిని నీ పదద్వయినిఁ గంటిని నీ మహనీయమూర్తి ము
క్కంటికి వేయికండ్ల తెర గంటికి నాల్గు మొగాల మేటికిన్
గంటికిఁ గానరాని నినుఁగంటి మదక్షుల నేనె నమ్మ లే
కుంటిని జన్మ ధన్య మనుచుంటి భవ మ్మడుగంటె నచ్యుతా! 91

తే. కనులో భక్తవాత్సల్యంపు గనులో తెలియ శ్రుతులో ప్రణవరూపమ్ములో శ్రుతులో తెలియ
ముఖమొ భవ బంధముక్తిసమ్ముఖమొ తెలియ పదములేయౌనో యిహపరపదము లగునో.

మ. ఓహో! ఎక్కడి దివ్యతేజమిది యోహో! యేమి సౌందర్యమో
హో హో! యెంతటి సౌకుమార్యమిది యోహో! యెట్టి లావణ్యమౌ
మాహాబాహ్య మదృష్టపూర్వ ముపమానోక్తి న్నిరూపింపఁగా
సాహిత్యంబు గలాదె వాణికి ననంత శ్రీముఖ శ్రేణికిన్. 93

ఉ. ఎవ్వని దివ్యరూపనిధి నెవ్వని సన్మహి మార్ణవావధిన్
రవ్వయు నవ్విరించి ముఖనాదిత వేద మెఱుంగ లేదొ నే
నెవ్వఁడ నిర్వచింప నసియించి భువిన్ దివి నంట వోవఁగా
నవ్వదె లోక మెంతయును నాదగు సాహసచర్యకున్ హరీ! 94

సీ. కలజీవనం బేఁగ వెలరు బాతెడి నీలమేఘంబు నీదగు మెయికి నీడె?
పక్షకాలమునఁ గళాక్షయమ్మును బొందు కుముద బాంధవుఁ డీ ముఖమున కెనయె?
రవి యస్తమింపఁగాఁ దవిలి నిద్రించెడు కమలంబు లీ కన్నుగవకు జోడె?
పామరు నోటిలోఁ బడ దోషదుష్టమౌ శ్రీకార రూపమీ చెవికి సరియె?

తే. సరసమగుటనొ నీ కంటి చలువఁగనుటొ శ్రుతిని వినదించుటో నీదు చూలగుటనొ
యంతొ యింతొ పోలికనొందు నస్థ్వాతఁగనె లేనియెడ నీకు వాని పోలికలవేవ ! 95

తే. చందనాగరు ఘనసార సౌరభాబ్ధి మందరాకృతి మథియించు మణిమయ బలి
బృందజాత సుధాంబు ఫేనేందువులగు చామరాహతి రవికేతు చలన మెసఁగె. 96.

తే. సరస సౌందర్య మార్దవ సౌకుమార్య సంపదకు నీ పదమ్ముల సాటిరాక
నీ చరణ పీఠికల కుతి నీతలాడ యడఁగి క్రిందయి యోటమి నమమతించె. 97

ఉ. అందమునందు నీకు సరి యందము కంతుజయంతు లాదిగా
నందఱు సుందరుల్ బళిరె ! యందఱు నీ కొనగోటికేని ముక్కా
విందును నీదురూపు కనువిందు నొనర్చితి విన్నినాళ్ళ కే
మందును దృష్టిదాకి సగమందెదవో యనిపింతు రాఘవా ! 98

ఉ. నడభువి కెంపు లీను చరణమ్ము, రమామణి నాట్యరంగమా
వెడఁదయురమ్ము, జానువుల వ్రేలు కరమ్ము, జూపు దోఁపుఁ జే
సెడి నగుమోము. సత్కృపలు చేఁపెడి కన్దొవ లంటి నంత మా
పెడి ననిపించు నీ యొడలి చెల్వము విల్వల శ్రీసగ మ్మగుఁగా. 99

సీ. నీ పేర్విన భవాబ్ధి నీళ్ళు మ్రింగునదేల జలధి బంధన ఘట్టముల వినియెనొ
యింద్రియ దశకమ్ము నీవనఁ దలవంచు దశముఖ విధ్వంస దశ నెఱిఁగెనొ
నీ పదమ్ములఁ గాంచి నెఱి ఱాతి గుండెయున్ గరఁగు గౌతమసతి కథల వినెనొ
నిగ్గాంచి హృదయమ్ము నిశ్చలస్థితి నొందుఁ బవనాత్మజుఁడు కట్టువడు టెఱిఁగెనొ

తే. పది యధర్మంపు తలలేని పాడిదప్పి చనవి ధర్మంపు టొక తలన్ సమయవె యని
యేత దవతారమును దాల్చి క్ష్మాతలమున నాటకం బాడి ధర్మమ్ము జాటినావె. 100

తే. అదిగొ ! మా తల్లి సీత నీ యంకసీమఁ గదలి యొడినొప్పు మేరు నగమ్ము కరణి
మెఱయుచున్నది చిఱునవ్వు సిరులు గురియ సరియె వరలాసతికి విరుసత జగముల 101

తే. జనకుఁడే యాదిజననికి జనకుఁడయ్యె ధాత్రియే లోకమాతకు ధాత్రియయ్యె
నాథుఁడే మానినికి జగన్నాథుఁ డయ్యె నట్టి మా యమ్మ సీతమ్మ యంఘ్రిఁ గంటి. 102

మ. క్షమకున్ బుత్రికవౌట యో జననీ ! యచ్చంబౌ గుణంబే కరం
బమరెన్ నీకును ద్రోహికాక మల బ్రహ్మాస్త్ర ప్రయోగ వ్యథా
క్రమితాంగుండయి కావుకావుమని యార్వన్ జూడలేవో నృపా !
క్షమియింపందగుఁ గావుమంచనెడి యీ కాకం బుఁటం చాడవే ! 103

సీ. రత్నాకరం బదే రత్నపుష్పవితాన కనకలతాసూతికా గృహమ్ము
పద్మమే సతి పాదపద్మ లాస్యమునకై సౌందర్య రసకళా మందిరంబు

మారకుమారుఁడే మారమణీమణి గర్భశుక్తిస్థ ముక్తాఫలంబు
హరి యురమ్మేచారు హరిణాక్షియౌ రమాకాంతామతల్లి యేకాంతగృహము

తే. ఆ మహాలక్ష్మి జనకు భాగ్యమ్మ పండి ధరణి దాఁచిన లిబ్బియై దొరకెనంట
యీ మహానిధిఁ దా జగత్స్వామి కొసఁగి వినుత వైకుంఠపదమును గొనియెనంట. 104

మ. ఘన రత్నాకరగర్భ గహ్వరతటిన్ గాలించి సంపాదనం
బొనరించెన్ హరియే యమూల్యమణి నత్యుత్సాహమే పార నా
జనవీ రత్నమునే హరించె ఖలుఁ డాస్యంబుల్ పదిన్ దాల్తు నే
ననియో గుండియ లెన్ని గావలెనొ యూహన్ సేయఁ డున్మాదుఁడై. 105

క. మగవారినె వలపించెడి మగవాఁడగు రామచంద్రు మది దోఁచిన బల్
మగువ వఁట తల్లివగు నీ సొగసెన్న వశంబె తమ్మిచూలికి నైనన్. 106

తే. నీదు ప్రక్క నుండి నెగడుచుండుటఁగాదె యంబ! రాముఁ డెంతొ యందగాఁడు
మెఱుఁగులీను జాతి హరినీలమణి యేనిఁ బసిఁడి మసలిగాదె పసఁ జెలంగు. 107

క. అని నతిసేసెడి కవి దరి మనుజుఁడు జనుదెంచి లోకమాన్య కవివరా!
విను శ్రీరామ నృపాలుఁడు గొనిరమ్మనె నంచు నతనిఁ గొనిచనె నచటన్. 108

ఉ. నవ్వులు నవ్వు ముద్దు వదనమ్మునఁ బువ్వుల రువ్వు భాషణల్
నివ్వటిలంగ సాదర మనీషను స్వాగత మిచ్చి మెచ్చుచున్
మవ్వపుఁ గేలుదోయి సుమనస్సమవాయము జల్లి చెంగటన్
రవ్వలపీఠిఁ జూపి యిటుఁ లం దయచేయుఁడటంచుఁ బల్కుటన్. 109

క. ఆ కవి కెటు దోఁచక హరి యీ కరణిన్ బల్కు నౌర! యిదియేమని యా
లోకించు జెప్పవేయక యా కోమల విగ్రహమ్ము నతి పరవశుఁడై. 110

ఉ. వేగమె లేచి శౌరి కవి వేదికఁ గూర్చొనఁజేసి చేతికిన్
బాగఫలాక్షతల్ గలుగు పుత్తడి పల్లెర మిచ్చి యిట్లనున్
ధీ గరిమమ్ము మీఱఁ గడుఁ దియ్యని తెన్గులొనర్చి శ్రీమహా
భాగవతమ్మొసంగి కృతిభర్తను జేయుమి నన్ను సత్కవీ! 111

క. అనుటయు నతఁ డాశ్చర్యమ్మును గొని యిట్లనియె నీకుఁ బోలునె యిది యో
యనఘా! నిజమా లేకయె నను పరిహాసమ్మొనర్పనా యీ పలుకుల్. 112

ఉ. నా తరమౌనె 'యో యనిన నా' యనరాని విమూఢ జన్మనో
పూతచరిత్ర! నిన్ గృతి విభూషితుఁ జేయుచు మెప్పు గాంచఁగా
నాతిని రాతిగా నటులొనర్చిన గౌతము బ్రహ్మతేజ మెం
తో తపియించి నీదు పదధూళికి నై నను సాటివచ్చెనే? 113

శా. పేయాఋల్ కవిపండితాగ్రణులు పృథ్విన్ వెల్గఁగా నీపదు
పాశ్రియుండే త్వదమేయ భవ్యకరుణా పాంగైకపాత్రుండుగా
నేయే జన్మ తపోవిశేష మొకటో యేకమ్ము లెత్తైరా హరీ!
నీయాస్థానకవీంద్రునొట కిటు పంచెన్ నా యదృష్టమ్మహో. 114

తే. దేవ! తావకాంఘ్రియుగ ప్రభావమునవె కపివరుండు నాఁడొక మహా కవివరుండు
గాఁడె యో సుధాంబుదమ! నీ కరుణవృష్టి కరయ నిమ్నోన్నత విభాగ సరణి గలదె?

చ. పులగము మీఁది పప్పు ధనపూర్ణులపైనె మొగంబు మెప్పు లో
కులు బడు పేర్మి, సాగరునె కోరిగదే నదు లిల్లు నింపు మే
ఘలములు మేఘము ల్గురియు సర్వసమానముగా నటుంచు దీ
నుల దరిఁ జేర్పవచ్చితె మనోహర నీల నవాంబుదాకృతిన్. 116

ఉ. ఈఁదెను రాళ్ళు నీళ్ళ పయి నేలె ప్రపంచము ప్రాణి గాని నీ
పాదుక, గడ్డిపోఁచయును బ్రహ్మశరంబయి కాల్చె కాకమున్
మోదెను గోఁతిమూక పదముష్టి హతిన్ దితిజాలి నెల్లరన్
నీదు బలమ్ముఁ జూచికొని నే నటు లీకృతి వ్రాయఁబూనుటల్. 117

చ. అనుకొనలేదు నేను కలనైనను భాగవత ప్రబంధమున్
దెనుఁగు నొనర్పనేర్తునని దేవ! యహేతుక జాయమాన పా
వన కరుణా కటాక్ష విభవమ్మెదిజేయఁగ శక్తినీదహో!
యినకులభూషణా! కదల దీవు తలంపనిచోఁ దృణాగ్రమున్. 118

క. అనియెడి కవి భ్రూమధ్యమ్మున హరియుఁ దిరోహితమ్ము బొందెను నతఁడున్
దన సర్వస్వము గోల్పడు వణిజుని క్రియఁ గనులు దెఱచి వందురఁదొడఁగెన్. 119

తే. అతుల కంఠావరోధ రోమాంచ బాష్పకలితుఁ డగుచును నార్తిమైఁ గలఁతపడుటఁ
గాంచి తిప్పనార్యుండు తత్కారణమ్ము నడిగె దివ్యదర్శన కథన్ నుడివె సుకవి. 120

క. చిత్రమగు నతని కథనము తత్రత్యజనంబు విస్మితస్థితి విని నీ
గాత్ర స్పర్శమ్మున నీ ధాత్రియు గౌతమి పవిత్రతన్ గాంచె ననెన్. 121

క. సోదరు వాక్కులఁ దిప్పన మోదమ్మున వినుచు హృదయమున మహదాశీ
ర్వాదము నొనరిచి పొగడన్ బోఁదొడఁగిన నాల్క నాఁపి పుచ్చెన్ మెచ్చెన్. 122

తే. కొఱకు లెడపి గబ్బిలములు గుడికిఁ జేరి స్వర్బహిష్కృతిఁజెందు త్రిశంకు కరణిఁ
గలఁకులన్ వ్రేలియాడెను గెలఁకు లెల్లఁ దెలివిగొనెఁ బుల్గులన్నిదగ్రి మొలయఁ బల్కె.

వ. అంతఁ బోతనార్యుం డగ్రజు చరణ సరసిజంబుల వ్రాలి యిట్లనఁ దొడఁగె 124

తే. "అదొక యాలాపనమొ కల్లయైన కలయొ కరణ మెచట భాగవతానుకరణ మెచట
ఎచటి వ్యాసనారాయణుం డెచటి నేను నాక మెచట సృగాల మాణవక మెచట ? 125

క. అచతుర్వదన బ్రహ్మయు నచతుర్భుజ విష్ణువ నిటలాంబక శంభుం
డు చతుర్వేదాచార్యుఁడు సుచతురధిషణా విశేష శోభితుఁ డతఁడో. 126

చ. చదివినవాఁడఁగాను. గురుసన్నిధి నెన్నఁడు నేను సాహితుల్
కుదురుగ నెప్డొ తీఱికగఁ గూర్చొనినప్పుడు పొద్దుబుచ్చఁగా
నెదొ యొక గ్రంథమున్ దెఱచి యిష్టమువచ్చినయట్టు లర్థముల్
గుదిరిచి నేను గూడ నిలఁ గొండొక పండితరాజు నైతినే." 127

వ. అనుటయుఁ దిప్పనార్యుం డతని కిట్లనియె.

తే. భానురాక మున్ దెలుపు తత్ప్రభలఁ గాంచి నమ్మినగు పద్మినికి వంచనమ్ము గలదె ?
స్వప్న మద్ది భావిఫలసూచకము గాదె ? యనుజ ! నీ భవిష్యత్తు ముదావహమ్ము. 129

తే. సాధకుని కిల సుఖ దుఃఖచయము లరయ నెంతమాత్రము నడ్డుల నిడఁగలేవు
పూని రత్నాకరంబును బొందు నదుల మిట్టపల్లమ్ము లడ్డును బెట్టఁగలవె ?" 130

క. అని తిప్పనార్యుఁ డచ్చటి పనులన్ని ముగించి త్వరగఁ బయనంబై పో
తనఁ గూడుకొంచు నల్లన మనికిన్ జేరఁజన మార్గమధ్యము నందున్. 131

ఉ. ఏకశిలాపురిన్ విడిచె నీశ్వర పూజ నొనర్పఁ, బోతరా
జీ కథ నెల్ల నచ్చటి మహీసురపాళికిఁ బండితాళికిన్
బ్రాకటరీతి మోఁకఱిలి భక్తి నివేదనముం బొనర్చె నే
నీ కృతి వ్రాయఁబూనుట యదెట్టులఁటంచు ననుజ్ఞ వేడుచున్. 132

ఉ. వారలు పోతనం గని యపార సమాదర భావ బంధుర
శ్రీ రహియింప నిట్టులు వచించిరి "ధన్యులు నిన్ను గన్న నీ
వారలు నీవు నీ తెనుఁగు భాషయు దేశము మేము. బద్ధసం
సారుల నుద్ధరింప నిటు జన్మ ధరించితివేమొ సత్కవీ ! 133

శా. ఆచంద్రార్కము నీదు పేరవ సమస్తాంధ్ర ప్రజానీక మ
న్నా ! చేయెత్తి నమస్కరించు నెపు డాంధ్రశ్రీ తలం దాల్చ నీ
ప్రాచీనప్రజ కీ కృతిన్ గనుటకై ప్రాప్తమ్ము లేదయ్యె న
ర్వాచీనప్రజ నోఁచిపుట్టుకొనె నీ వాక్యామృతం బానఁగన్. 134

మ. జయ సంవత్సర చైత్ర శుద్ధ ప్రతిపత్సంప న్ముహూర్తంబునన్
నయమొప్పన్ నవరాత్రికవ్రతము దీవ్యద్బ్రహ్మసత్రంబు న

ధ్యయన స్తోత్రము వ్యాస భాగవత సప్తాహంబు నొప్పార న
వ్యయుఁడౌ శ్రీహరి కంకితమ్ముగఁ గృత్యారంభమున్ జేయుమీ:" 135

వ. అనుచు వచింప నివ్విధి బుధజనానుగ్రహంబు వడసి బమ్మెరకున్ జనుదెంచి, భాగవత
రచనారంభ కుతూహలాయత్త చిత్తుండయి యున్నఁ దద్వత్సరంబున. 136

చ. అడవిని గండ్ల కద్దుకొననైనను బేరకు నీరు జిక్క దా
మడుఁగులు నెండఁగాఁ జెఱువు మంగలమయ్యెఁ బొలాలు బీడుగాఁ
బడెఁ, బ్రజ వానకై మొగమువాచి కనుంగొనసాగె లోక మ
ట్టుడికినయట్టు లయ్యెఁ గొనయూపిరి నుండెను గొడ్డుగోవలున్. 137

ఉ. బొత్తుగ ధైర్యమే యుడిగిపోయెను రైతుకు, వంచినట్టి న
డ్మెత్తఁగ దీఱకుండు నతఁ డీఁగల దోమలఁ గొట్టుకొంచు నా
గిత్తల వైపు జూచుకొని ఖిన్నత నెన్నుదురంటి యేమి యా
పత్తను, గత్తివాటిడ రవంతయు మోమున నెత్రు లేదెటన్. 138

ఉ. చండకరుండు నుద్ధృత విశాత నిదాఘ సహస్రకోటి దో
ర్దండ పటుప్రతాపుఁడయి ధారుణి నెల్లెడ గడ్డిపోఁచ లే
కుండఁగ మాడ్చె నెత్తిపయి గొట్టుటరీతియె కాని నోరులే
కుండిన గొడ్ల పొట్టపయిఁ గొట్టెనఁటన్న నిదేటి భావ్యమౌ ? 139

తే. కలదు హలము పొలమ్ము గోబలము కాపు లెపుడు దున్నెదమని వాన కెదిరిచూతు
రాకట దైవబలమ్మె లేకున్న నరుఁడు గవ్వకుం గొఱగాఁడు బింకమ్మె పాడు. 140

క. పడె కఱవు బిచ్చగాం డ్రెగఁబడిరా పశువులను మేఁతఁబడయక నెత్తం
బడె లోకమంతఁ గటకటపడెఁ బ్రజ కన్నీటివానఁ బడె నెల్లెడలన్. 141

సీ. కడుపుఁ జూపుచు గుండెఁ జెడబాదికొనుచన్న మవ్వయవ్వో యని యఱచుబొట్టె
తలక్రిందు వాఁకిటఁ దపమొనర్చుచు బికిరమునకై యార్చు బైరాగివాఁడు
కడప దండమ్ముల నిడుచు నాగని లేపి గానదోలిక మూఁపు గారడీఁడు
పిల్లలకోడియ ట్లిల్లిల్లు దిరిగి మర్కటము లాడించు సింగని సవారి

తే. పొత్తిగుడ్డ మాడకు సూనె బొట్టఁటంచుఁ బురిటిబిడ్డ నడ్డముగ వీఁపునకుఁ గట్టి
తలపయిం బుట్టతో గోసరిలుచు దిరుగు పచ్చిబాలింత కొఱవంజి బిచ్చగత్తె. 142

క. తేలిన యెముకల గూఁడుల వ్రేలఁగఁ బేలికలు గ్రుడ్లు వెదలి క్షుధాగ్నిన్
గోలెడి యసువుల నిట్టటు నాలోకించెదరు బీద లలపుల్లెలకై. 143

తే. మూఁకలై పొంచి దొంగిలు కాపుల పయి గురుగురుమఁటంచు నాకెదు కుర్కురములఁ
జేత ఱాఁతఁ గొట్టుచు లాగి చింపుకొనుచుఁ బొరిగఁ గలహింతు రెంగిలి పుల్లెలకయి. 144

వ. అంత నొక దివసంబునఁ బోతన నియతాత్ముఁడై ఋష్యశృంగుని సచ్చరిత్రంబు సర
స్తటమ్మునఁ బురాణవైఖరి నుడువుటయు. 145

చ. తొలకరి వానకుం బొలము దున్నిరి కాఁపులు నింటిలోని గిం
జలు జని మంటిలోఁ బడెను సన్నగ లేచెను చేనులంత వా
వలె కఱవయ్యె నా చెఱువునం గల నీరును బిక్కె నెత్తినో
ఱలు దెఱచెన్ బొలాల్ కృషికలోకపు కష్టఫలమ్ము దక్కమిన్. 146

ఆ. చెఱువులోన నున్న చేరెఁడు నీరు మా కనిన మాకఁటంచు దినము రేయి
జగడమాడుకొంచుఁ జాలిచాలనియట్లు పొలము దడుపుకొనుచుఁ బొక్కుచుండ్రు. 147

ఆ. తలలఁ దలలఁ బగుల జలము మా కీయకయున్నఁ జూడుమనుచు నొకరు బలుక
నేమి యాశయున్న దెబ్బగాల్వదె వరి యను నిరాశనూర్పు దనర నొకఁడు. 148

తే. కాఁపొకఁడు తాను నీరటికాని దరిసి పొలమునకు జలం బీయవె ? తెలిసె నీదు
బలము కరణమిచ్చినది రేపటికిఁ జూడు మీఁదు గతి యని మెలివెట్టు మీసకట్టు. 149

వ. ఇట్లు దుకోదరపరాయత్తుండును, మధుపానమత్తుండును, వివేక విహీనుండును, నపగ
తాత్మాభిమానుండును నగు నక్కర్షకాపశదుండు, 150

తే. ఉన్న పుడిసెఁడు నీళ్ళు మీ యొక్క పొలము నెట్లు తడుపుకొందురొ నేను నీ దినమ్ముఁ
జూచెదనుగాక యని యగ్గి నుడులు దిరుగు చూపులన్ నీరటి మొగమ్ముఁ జూచిపోయె.

క. కోపోద్దీపిత మతియై కాఁపు పలుకు శ్రుతి విదారకములగు కటువా
గ్రూప శరమ్ముల నీరటి కాఁపా పోతనను నొంటి గని వినిపించెన్. 152

ఆ. “పోచిగాని యెగసిపోఁత యింతింతగా దెత్తిపోయవచ్చు నేతములను,
తప్పఁద్రాగి యేమొ తలతిక్కగాఁ గూసె వానిఁ బట్టఁ దాళ్ళు వసుధ లేవు. 153

క. ఏమగునో కరణము పని యీ మాపులఁ జూడుమనుచు నెగసిపడుచు ను
ద్దామత మీసము దువ్వెను స్వామీ ! వాఁడెంచ నొక పసర మనవచ్చున్. 154

క. ఏమైనను గానీ మీ రీమాపు పొలాల దరికి నేఁగవలదయా !
పామై కఱచును గట్టైయుఁ జీమయుఁ బులి యగును దాను చెడ్డదినాలన్.” 155

వ. అవి చెప్పఁగ విని పోతనార్యుండు మేరునగధైర్యుండు, సమయోచితచర్యుండును నగుచు
నగుచు నిట్లు పలికె. 156

క. “తత్త్వము నెఱిఁగియు నిటు ధీరత్వము విడనాడనేల ? రాముఁడు గలుగన్
సత్వర మేఁగెదఁ దమస్సు సత్వమ్మున కన్న నధిక సత్వయుతంబే ?” 157

క. అన విని నీరటికాడును 'సనుదెంచెద మీదు వెంట స్వామీ!' యన నీ
వనవసర మే నొకండనె పనియెదనని రాత్రి సుకవిచంద్రుఁడు నేఁగెన్. 158

సీ. కనుపాపలకు భ్రమల్ గలిగించి వలపించు దెసల మొగాలకు మసి నలంది
రంగురూపుల నంతరంగాల బంధించి వెలయు వస్తువుల నీడలను మలిపి
నానాత్వమును జూపి నవ్వించి యేడ్పించు ఘన జగచ్చక్షువుఁ గప్పివైచి
యిహలోక ప్రకృతి విరహితత్వ మిడు నూర్ధ్వ తారకాలోకాల ధ్యాన మించి

తే. యెత్తు వంపుల భేదము నెఱుఁగనట్టి సర్వసముఁడును శబ్దసంచయమ దెల్ల
గల్లయను మౌనిరాజు సంకల్ప వర్జితుఁడును శాంతికాముఁడు తాత్త్వికుఁడు తమస్సు.

ఆ. అవధి రహితమైన యాకాశలోకమ్ము నాక్రమించి మించి యలరె తమము
తమములోనఁ దోఁచు తత్త్వోపదేశమ్ము తనువుగొన్న యట్లు జనియె సుకవి. 160

తే. చెంపఁ గొట్టి దాఁగఁగవచ్చు చీఁకటి యది కారునలుపుల నీను నా కటికరాత్రి
యలరె ఘనరూపమవిన నేమనుట లింకఁ బొరిగ నేత్రతారకలపైఁ బొరలు గ్రమ్మె. 161

క. చీఁకునఁ గల జీవమ్మటు మైకపు వలఁ జిక్కువడిన మానవు నట్టుల్
వేఁకటి నొదిగిన శిశువటుఁ జీఁకటిలోఁ బడుచు నిదురఁజెందెను జగముల్. 162

ఆ. అలతమమ్ము భీకరాకారమును దాల్చె ననఁగ నొక్క దార్ఢ్యతనుయుతుండు
లాఘవమ్ము మెఱయ లగుడ హస్తుండయి యరుగుచుండెఁ జెఱువు దరికిఁ ద్వరగ. 163

చ. అరిగి తటాక ప్రాంతముల నన్నిదిశల్ గని యెందు మందుకుఁ
నరుఁడనఁ గానరాఁడుగదె! నాదగు ధాటికి నెంతవానికిన్
జ్వర మరుదెంచు నీ చెఱువు జాడకు రాఁడిఁక నీరటీఁడు నా
వరి మడులందు ముందు తన పాదము లుంచఁడు పోతరాజునుఁ. 164

చ. అనుకొని ప్రక్కకాలువల నన్నిటిఁ దిన్నగ మూసి నీరముఁ
దన వరిచేలకే మలుపఁ దత్పరివాహ వరాంతికమ్మునఁ
జనిపెను మ్రానుకాయ స్వభుజాబలవైదుషిఁ బైకి లాగి నీ
ర్గానువెడ గుల్పసీమ నెదో కుట్టినయట్లయి భీతిజెందుటల్. 165

క. బక్కరయితు హృదిఁ దబుకు తబుక్కను నాళాలతా విలోకద్యుతులై
యొక్కొకతటి వినువీధిని ఛక్కుమనుచు మెఱసియాడు శంపాకాంతిఁ. 166

ఉ. కాంచి స్పృశింపఁ బోవుటయుఁ గస్సని నిల్వున లేచి శీర్షమా
డించి ఫణమ్ము విప్పి తను డీకొనవచ్చెడి నాగు గాంచి రో
మాంచ శరీరుఁడై మతొక మార్గముఁ గానక భీతిమాని దై
ర్యాంచితవృత్తి వ్యాళకరణాంచిత వాలముఁ గేలఁ దాలిచెఁ. 167

తే. ప్రళయరుద్ర విజృంభితపాణి యగుచు విలయతాండవ కాళికా వేణి యగుచు
భయద యమహస్త సంచలత్పాశమగుచు నాగు కాలాగ్నికీలయై నాట్యమాడ. 168

చ. ఒకపెల త్రాడుజోడు వలె వ్యోమపథాంతర సీమలఁ గడుఁ
వడివడిఁ ద్రిప్పి త్రిప్పి తనువల్లిక పూసలపట్టు వీడఁగాఁ
గెడ పెయినట్లు నేల మతికెఁ జితికెఁ దల వ్రక్కలౌచు, నా
ఘడియనె మూర్ఛరా నురువుఁ గ్రక్కుచు నేలను గూలె నాతఁడున్. 169

వ. అంత నచ్చటికి వచ్చిన పోతన యాతని దురవస్థఁ గని మనమ్మున ఘనమ్మగు నక్కటిక
మ్మూని విద్వేషమ్ము మాని, యా ప్రాంతమ్మున నొక మూలిక నన్వేషణమ్మొనర్చి,
శిలాతలమ్మునఁ బేషణ మ్మొనర్చి, నాసికాపుటమ్ములం బోసి, సంత ఘృతసంగతుఁడగుచు,

ఉ. నిద్దురనున్న మానవుఁడు నిశ్చలచిత్తము తోడ నవ్వుచున్
ప్రొద్దుటఁ గన్నులం దెఱచి పొల్చెడునట్టుల లేచి యాతఁ డా
పద్దశ మాని, స్వీయ తను పార్శ్వగతుండగు మానవుఁ శిలఁ
రుద్దిన మూలికన్ గనుల ముఁగని వానికి మ్రొక్కి యిట్లనెన్. 171

క. "నా పాలిటి దేవుఁడ వీవో పావన చరిత ! యిట్టు లొంటిగ నన్నున్
గాపాడ వచ్చినాఁడవు నీ పే రూరులను దెలియ నేర" నఁటన్నన్. 172

చ. "తదుపరి యూరు పేరును విదానముగా వివరింతుఁగాని నీ
యెదఁ గల బాధలేవొ యొకయించుక మున్వెనుకాడఁబోక నె
మ్మదిగ వచింపుమన్న ! పెర మానిసిగా నను నెంచకన్న ! నీ
పదమున ముల్లు నాఁట మునిపంటను లాగెద" నన్న నాతఁడున్. 173

ఉ. "తప్పకఁ దీర్చెదే విను మెదం గల బాధల, నీరు నీయకే
తిప్పలువెట్టు రైతుఁ బలుతీరుల బోతన తాను నేరితోఁ
జెప్పుకొనఁ వలెన్ గడుపు చెక్కలగున్ వరిచేలు గాంచ నే
తప్పును లేదు వాని గుడి తల్లికిఁ బట్టి బలిం బొనర్చినన్." 174

ఉ. కాఁపిటు లాడినంత నతి కష్టముతో నతఁ డిట్లనెన్ "మహా
పాపియె పోతరా జతనిఁ బట్టి బలిం బొనరించినంత నీ
తాపముఁ గోపమెల్ల శమితం బగునే యటులైనచో యిదో
నీ పొలమెల్ల నీరిడితి నే నిఁకఁ బోతనఁ బట్టియిచ్చెదఁ. 175

చ. ఇదొ చురకత్తి నీ మొల నభీష్టముఁ దీఱఁగ నిప్పు డాతనిఁ
మొద లఱఁ దుంపుమింక విడిపోవును బీడ" యటంచు శీర్షమం
దుఁ దవరు కంబళిన్ మునుఁగుతోఁ దలపాగను లాగి కాసెమన్
విదిలిచి బొమ్ముసాఁచి మను విల్చె నతండు మహా ప్రశాంతుఁడై. 176

క. నిలిచినఁ గని రైతునకున్ దల దిరిగెను గాళ్ళు వడఁకెఁ "దండ్రీ! మీరా
తెలియక నే నెంతటి పనిఁ దలపెట్టితిఁ గ్రూరుఁడన్ గృతఘ్నుఁడ సదయా! 177

ఆ. ఇట్టి పాపి కింకఁ బుట్టఁగతులులేవు పులి యఁటంచు గోవుఁ బలికిగాను
బూనుకొంటి మీదు బానిసన్ మన్నింపుఁ దనుచు నశ్రు లురల నంఘ్రి వ్రాలె. 178

క. కన్నీరు తోడ నభమును బన్నీరుల జల్లులట్లు పటపటమనుచున్
సన్నని చినుకులు గురియుట నన్నీటం మురిసెఁ సుకవి యాశాలతికల్. 179

ఆ. నిఖిల భువన మోహినీకాంత విరహాగ్ని యద్దిరాట్టు స్వాంతమందు మెఱపె
జాలిగుండె మేఘు సరసవర్తనఁ గాంచి తరువు లెదఁద మెచ్చి శిరము లూఁపె. 180

తే. మొగిలు వగకాని వగల యేడ్పులను బైకిఁ జూపు మెఱుఁగుల ప్రేమనఁ జూచి భ్రమసి
చల్లఁబడిపోయె గగన సుస్వాంత మపుడె శీతలానిల కరసమాశ్లేష మొసఁగె. 181

క. ఈ కఱవులఁ దొలఁగింపఁగ సాకేతపురీశు కృపను జడివాన బడెన్
కాకలుదీరెను చేలకు భేకపునోళులను విజయభేరులు మ్రోఁగెన్. 182

తే. ప్రజల జీవన చింతాభరమ్ము తోడ భూమిఁ బట్టి కృశించెడి పొలములఁ గని
ఘన వినిర్ముక్త బాష్ప గంగా ప్రవంతి నమృతభాండముల్ దివి నుండి యవనిఁ దొరలె.

సీ. ఎవనికై సింగిణి నవరత్నఖచిత సుస్వాగత ద్వారమై చదలమెఱయు
నెవనికి దివి సాఁగు నేకాధిపత్యమ్ము సూర్యచంద్రులు తేఱి చూడలేరు
ఎవ్వాని కలయిక నెలమి భూదేవికిఁ బులకలై సస్యంపు మొలక లెదుగు
నెండి సీర్నీరని గుండె వ్రియ్యఁ దటాక మెవఁ దప్పులిడ వింత నెగసియాడు

తే. ధర కెవఁడు జీవనములన్ని ధారవోసి యంతరించునొ సుకృతిగతాయు వనఁగ
నట్టి ఘనుఁడు ఘనాఖ్యతో నలరఁ డెట్లు? వానిపై నగ్రపీఠికన్ వైవ డెట్లు? 184

ఆ. పోతనార్యుఁ గొట్టఁబూని వచ్చినయట్టి కాఁపు బండగుండె కరఁగి కరఁగి
వానజాలుతోడ వరిపంటలకు జంటయైన పోతరాజు నాత్మ గలిసె. 185

చ. తెలతెలవాఱ వచ్చె వృషధీరుఁడు కొట్టము ముందు మందలోఁ
దొలియెదయైన వత్సపయి దూఁకి తమిన్ రమియించి మించి బె
బ్బులి వలె అంకెవైచి మనుపట్టను గొమ్మునఁ జిమ్మె ధేనువుల్
విలువఁగఁ జొచ్చె వత్సములఁ బ్రేమరసమ్ములు పాలు చేఁపురాన్. 186

తే. పూను నపకృతిఁ దలఁపక జ్ఞానియైన పోతరాజు కాఁపుగృహమ్ము పొంత కేఁగి
యాలుపిల్లల కారైతు నప్పగించి వేగుటయు నింటి కరిగి యువ్విధిఁ దలంచు. 187

తే. తలఁప దోషిని దండనసలుపు కంటె దోష మూలకారణమును దునుముటొప్పు
తెగులుఁ బోకార్చువాఁడు వెజ్జగునుగాని యరయఁ దెవులుగొంటునె చంప యముఁడుగాఁడె

తే. అగ్ని నగ్నితో నార్పఁగనగునె జగతిఁ బగను బగతోడఁ దీర్పఁగవశమె సామ
దాన భేద దండోపాయతతుల నెందు సామగతియె శాశ్వత శత్రు జయము గూర్చు. 189

క. ఆపన్నుండయి మనమున నోఁపికలేనట్టి యజ్ఞుఁ దొనరుచు దొసగుల్
కోపింపరు విజ్ఞులు దయ దీపింపఁగ నతని దరికిఁ దీయుదు రెందున్. 190

ఆ. బాల్యమందు తాము బహిరింద్రియమ్ములు దుర్బలత్వ దశను దొరలిపడును
పడిన సుతుని జాలిపడి లేప జనయిత్రి తనను దాను దిట్టికొనుచుఁ గూర్మి. 191

ఆ. యౌవనమున నల్లె యంతరింద్రియములు సత్వహీనగతిని జాఱిపడిన
నా యువకుని గాంచి యలుగక విబుధుండు పొరిగ జాలినంది బుద్ధిగఱపు. 192

వ. అని తలంచె నంత నా వత్సరంబున. 193

తే. రైతు కృషి మెచ్చి కురిసె వర్షమ్ములైన గొట్టపు తెగుళ్ళ తగిలి పోఁగొట్టెఁ బంటఁ
గలవు రాక్షసి విహరించె మరలఁ దాను నందులకె ప్రిమృత వృత్తి యటండ్రు కృషిని.

తే. ఎవఁడు వచ్చినన్ బోతన యింటి ముందు నంతొయింతొ పెట్టకయె పొమ్మనుటెఱుఁగరు
దండు విటు మేప గరిసెలన్ ధాన్యమింక నడుగుదేలెనా బదుళల కవధిలేదు. 195

క. ఏ పూటను సాపాటన రాపిడిగొని యతిథి శతము రాజిలు నింటన్
రేపెటులన మాపెటులని కాఁపురమది రోజు కొక్క గండం బాయెన్. 196

క. ఉన్నది లేనిది గృహమం దెన్నం డారయఁడె వార లెదురైనను బో
తన్న భుజింపక చనవల దున్నది మన గృహమఁటంచు నొగికొని వచ్చున్. 197

క. ఈ దశఁ గని తిప్పన సతి యాదృతి నేకాంతమరసి యనె పెనిమిటితో
మీదయ సంసారము నిఁక నీఁదుట ప్రాణమ్ము పైకి నేతెంచుఁ జుఁడీ ! 198

క. తమ్ముఁడు నా ప్రాణము నే నమ్మితి వాఁడేమి చేసినను సరెయనుచున్
గిమ్మనకయున్న సన్న్యాసమ్ముం గొని జోలెఁ దాల్చి చనుగతి యొదవున్. 199

క. నిప్పచ్చరమ్ము నోర్వక చెప్పితిననుకొనకుఁ డిట్టి చిన్నని తమ్ముల్
గొప్పఁగ నాకున్ గల రిలఁ గప్పెంతయొ కాలు నంతఁగనె చాఁపవలెన్. 200

క. తన్నున్ మాలిన ధర్మం బన్నే యున్నంతలోన నొకరి కిడకు మిం
తన్నమను పాపులెవ్వరు కన్నం బోఁగల్గువంత కాటుక తగునే ? 201

క. ఊరంతకు సత్రము నెయి గాఱఁగఁ బెట్టవలెననినఁ గావలదా సం
సారముపైఁ బడివచ్చిన వేఱుం గాఁపురము సేయ వీరికిఁ దెలియున్. 202

క. ఆయన మీ యంతటివాఁడాయె మరే మనఁగవచ్చు నందులకే యిఁకఁ జా
మీయంతట మీ రుండుఁడు వేయేండ్లకుఁ దప్పదెందు వేర్పడుట లనన్. 203

క. పిల్లలు గలవాఁ డతఁడే యిల్లుం బట్టించుకొనక యిటు చేసినచో
నెల్లిన్ మీగతి యేమగు మెల్లఁగ జాగ్రత్తపడుమె మేలిక మీఁదన్. 204

క. మీకు నొక రాజకీయా స్తోకోద్యోగ మ్మిడంగ సుగుణాకరుఁడా
యేకశిలా నగరేశుం డేఁకటఁ గబురంపెనంట నేఁగం దగదే ? 205

తే. ఇరువురము మన మయ్యెడ కేఁగునెడలఁ దమ్మునకు గృహభారము తలపయిఁ బడి
తెలిసివచ్చునే యొడుపున మెలఁగవలెనొ యటులు గాని మందతనికె యగు శ్రమమ్ము.

వ. అని జాణతనం బుప్పతిల బహుభంగుల మచికెక్కెడు గతి నిట్లు బలుకుటయు. 207

క. పదపడి యిటు పల్కెడి యమ్మదవతి నుడువులను వినుచు మందస్మితుఁడై
యెద నేమి తొనఁకులాడక కదలని జలధియయి చల్లఁగా నిటు బల్కెన్. 208

తే. "ఆత్మ నపచార మెఱుఁగదే నన్నదెపుడు కాదనం డెదురాడఁడు కన్నకొడుకు
కన్న మిక్కిలి నను గాంచి గౌరవించు వేఱుబడుమన నాకెట్లు నోరువచ్చు. 209

ఉ. తల్లిని దండ్రి నట్లె నిజదార నయోధ్యను రాజభోగ్యమౌ
విల్లును వీడఁజేసి వని కీడిచి లక్ష్మణుఁ బిచ్చిసేయు నా
యుల్లము నద్గ నేర్పడు సహోదరబంధ మఁటన్న నెట్టిదో
పిల్లలయాటలే తెలియఁ బ్రేమమహోదధి లోతుపాతులన్. 210

ఉ. జూదము నాడి రాజ్యమును సొత్తును భార్యను దమ్ములన్ పణో
న్మాదత నోడి యెంతొ యవమానముఁ గూర్చిన నోర్చి పెంపుసొం
పేదియు ధర్మరాజ విజయేష్టికి రక్తపుధార నాహుతుల్
గాఁదగఁజేయు పాండవనికాయమెఱుంగు సహోదరార్థముల్. 211

తే. రామలక్ష్మణులును బాండురా ట్సుతులును సవతితల్లి పుత్రులెకదె జగతి నట్టి
వారి సౌభ్రాతృతయె యట్లు వరలుచుండ లలన ! యేకోదరుల వీడుటలెటొ చెపుమ ! 212

తే. శుద్ధ మణిహార సూత్రిత సోదరతను హేయగతిఁ ద్రెంచఁగల్గు కసాయి యెవఁడొ
కోఁతియగు వాలియో సురారాతియైన రావణుఁడొ యంధ కౌరవరాట్సుతుండొ. 213

తే. ధరఁ గళత్రాది సకల బాంధవుల మఱలఁ బడయవచ్చు సోదరు నెట్లు బడయఁగలము
పెట్టుశోభల మఱల రాఁబట్టవచ్చుఁ బుట్టు సౌందర్యమేఁగ రాఁబోదు తిరిగి. 214

ఉ. సీతమ వంటి మా వదినె శ్రీరఘురాముని నేలు నీవు నో
భ్రాతృమణీ ! పరిసూపితలఁ బాసిన దుఃఖము నెల్ల నల్లనా

చేతము విస్మరించుమనటు జేసితిరంచు వచించుఁ గూర్మిమై
నీ తెఱఁగేను బల్కనతఁడేమి దలంచునొ నీ వెఱుంగవే. 215

చ. కొడుకులు బిడ్డలా మనల కూరిమి నారయు వారెవార లం
చడలెదు వారలేమి మన కన్యులె నిక్కపుఁ బ్రేమ నాతఁడే
కొడుకని నీదు చెల్లెలినె కూఁతురుగాఁగఁ దలంప నింతకే
యిడుమలు లేవుగాదె మనకేటికి వేఱుతలంపు మానినీ! 216

చ. పుడమిని గన్నవారయిన బుద్ధివిహీనత నున్న నెంతయే
నెడఁద తపింపఁగాదె పరులే ననుకూలత నున్న నింక నా
కొడుకులు నెత్తికెత్తునది కొత్త యదేమి? వృథాతలంపు లె
ప్పుడు మన నోట నాల్కయయి పొల్చెడి పోతన పుత్రుఁ బోలఁడే? 217

చ. కడచెను జాలకాల మిఁకఁ గల్గిన జీవిత మల్పమిప్పు వే
ర్పడి తులతూఁగు భోగ్యములు భాగ్యము లెయ్యవి యెంతఁ గల్గినన్
గుడువఁగఁ గూడుఁ గట్టుకొన గుడ్డయు దక్క మరేది ప్రాణి వెం
బడి గొనిపోవఁడీ పగటి భాగవతమ్ములు స్వప్నతుల్యముల్. 218

తే. కఱవులో నిడు దాన మొకఁడు ఫలించుఁ దగినకాలాన నాఁటు విత్తనమువోలె
నవసరము లేనియెడ నిడునట్టి యీవి యది యకాలపువర్ష తుల్యమయి చనును. 219

తే. అతిథి సత్కారమనిన మా యన్వవాయమున ధరణిఁ బెట్టినదిపేరు మొదటి నుండి
యట్టి యాచారమున వన్నెబెట్టు తమ్ముడౌర! నా సొత్తు తానేమి యపహరించె? 220

తే. నే నెఱుంగుదు మన యింట నిన్నమాపు చంటిపిల్లలు పస్తులు సలిపిరనుచు
నయిన నతిథి సంతృప్తికై నాచరించు నదుపవాస మేకాదశిన్ బదిగమించు. 221

క. ఏవిధినో కఱవుకాలముఁ దా వెడలం ద్రోయు నింట తమ్ముఁడు, మనమున్
నీ వనినటు లీ దినముల జీవన మోర్గంటఁ గడవఁజేయుద మబలా! 222

శా. ఇంటన్ లేదొక విత్తు నేఁడిఁ కెటులం దేణాక్షి! గౌరీకృపన్
గంటే గర్భగతార్భకున్ గుడుపఁగాఁ గల్పించెఁ జన్పాల మే
ల్పంటన్ పండ్లు జనించనప్పు డిటు చన్పాల్వోసి రక్షించువా
రుంటల్ దంతము లిచ్చి యన్నమిడ లేకుంజెట్లు సంభావ్యమౌ? 223

క. అనియెడి తిప్పన దరి పోతన జని కించిద్విచార తత్పరమతియై
"యనఘా! రేపటి యత్నమ్మునకై మన పల్లెదరికిఁ బోవుదునె" యనన్. 224

క. "సోదర! యీ దిన మేమిది యీ దైవ పరీక్ష పిల్ల లాఁకలి యనఁగన్
ఖేదము తఱుముచువచ్చు నికేది"క్కని కంట నీరు నిడఁ బోతనయున్. 225

ఆ. తలను వ్రాల్చి యూర్పులొలయించి గిజ్జని కంట నీరుగ్రమ్మ గద్గదికను
"బోయివత్తు మనకుఁ బురుషోత్తముఁడె దిక్కుగలఁ"డఁటంచు నల్లఁబలికి చదివె. 226

క. లోకములో నిఱుపేదలు నీ కఱవుల బాధపడుట వీక్షించినఁ జీ
కాకుపడి తేళ్ళు పాములఁ బ్రాఁకినగతి వేదనమ్ము బడి కడు వగచున్. 227

తే. ఆపరాని దరిద్ర దుఃఖాశ్రునదుల గండివడు నీతులను దాతికట్ట లెన్నొ
మండుటాఁకలి డొక్కల మంటకొడిలఁ దప్పుకొనలేక మసియైన ధర్మ మెంతొ. 228

వ. అని పరితాప మొందుచుఁ బోతన దారిం జనుచు విచారభారమతిగా వినువీధిన్ గాంచి
యిట్లెంచఁ దొడఁగె. 229

సీ. ఈ దూదిపింజల నేకి పోయునె వాని దరహాసదుగ్ధముల్ విఱిగిమింట
నిచట మషీమణి నెవఁడొల్కఁబోసెనో లయమొందె నక్షరలక్ష లిందు
నీ జాజు పూఁతల నెవఁడల్కె గగనముగా దన మేనిరక్తాల ధారవోసి
యీ ధూమపుంజమ్ము లెగయ నాకసమందు దహియించు మానసేంధనము లేవొ

తే. యా నిరాశా మహావృక్షమం దడంగి యెన్నియో భగ్నజీవుల హృదయ వాంఛ
తములు కనులఁ గట్టుచు నాకసమునఁ దిరుగుఁ బ్రబ్బు లబ్బని తీవలై మబ్బులందు. 230

క. అని మిన్నుగనుచు పథమునఁ జనుచుండెను దీనజనుల స్వాంతస్థిత వే
దనముల కేడ్చుచుఁ దీర్పం దనచేతంగామి హరిని దలఁచుచు మ్రొక్కున్. 231

వ. అంత నా వీథిలో 232

సీ. తెగమాసి పిట్టగూడగు తలంగల చింపి గొంగడిలో శవి గూరుచుండఁ
బెరిగి పెన్మ్రాచిగాఁ బరఁగు మీసముల గడ్డముల నంటుకొని వంటకము మెఱయఁ
గడుపుమంటకుఁ ద్రావు గంజిచుక్కలు రాలి పొట్టపైఁ జారికల్ కట్టి మెఱయఁ
జీరపేల్పడి మాసి చిల్లులుబడు గోఁచి వేనోళ్ళ దైన్యమున్ విశదపఱుప

తే. వెంటఁ బడి పిల్లలుగా రాళ్ళు విసరుచుండఁ గొసరి మ్రొక్కుచు నెగఁబడు కుక్కదాడిఁ
దద్దఁ దప్పించుకొనుచు జేత నొక చిప్ప పేలికలు వ్రేల్మొలను వచ్చె భిక్షు వొకఁడు. 233

మ. తనమై క్రొవ్వువె నూనెఁ జేసికొని యాత్మజ్యోతి రూపాటిపో
కనిమిత్తార్థము నిల్వఁ ద్వగ్గతకన త్కంకాళమో యాఱఁగ
గట్టిన చేపన్ బలెనుండి శల్యభృత నాడీమండల మ్మెంచఁగ
ప్పిన జీర్ణాంబర మంటఁ గట్టుకొనియే వ్రేలాడు దారిద్ర్యముల్. 234

క. ఇంటింటి కరుగుచును "మీ బంటుకు బానిసను గింత బారెయ్యవ్వా!
కుంటోణ్ణి వున్నెముంటది"యంటయు నే తల్లికిగా దయలు రావయ్యెన్ 235

తే. అఱచి యఱచి నోరెండలే దరుగు మరుగు మనుచు నూరెల్ల నొకచో పాటయ్యెనయయొ
పెట్టిననె కాని పోనని గట్టి పట్టుబట్టి కూర్చొనె నొక కొట్టు పంచముందు. 236

క. తులదోడన్ దులయైనది యిలనాయుధ మొండుగలదె హీనధనత్వ ప్రళయము
బాపగ లక్ష్మీ లలనాందోళిక యనంగ రహియింపననెన్. 237

ఉ. కుక్కను బిల్వనా యనుచుఁ గోమటి యొక్కఁడు వచ్చి తాత సొ
మ్మొక్కఁడ దాఁచఁబెట్టినటు లేమొ పదేపది 'బుక్కెఁడేయి కా
ల్మొక్కెద నవ్వ' యంచు నిలుముంగిటఁ బాఁతినయట్టులుంటి వౌ
మ్మొక్కఁడికే నఁటంచు బిగియించుకొనెన్ దలుపుల్ ధవాలనన్. 238

ఉ. దిక్కఁలు పక్షినై యిటుల దిర్మిమ్మరుచుంటి నొకొక్క యింటి కిం
దొక్కరుఁ బెట్టరెందుకని యుంచెను దేవుఁడు చావు పెట్టడం
చక్కలు తమ్ములో యయిన యా దిశలంగని చెప్పి గ్రుడ్ల నీ
ర్గ్రుక్కుకొనున్ నిరాశ కనుగోనలలో నిజ రాజ్యమేలఁగా. 239

ఉ. ఎవ్విధినోర్తు నాఁకలి దహించుకపోయెడి పొట్టప్రేవులో
యవ్వ ! రవంత బువ్వ నిడుఁడమ్మ ! మహాసుకృతమ్ము గల్గు నా
యవ్వయు నమ్మ వీ రయిన నన్నము లేదను వారెయంచునున్
నవ్వఁదొడంగె వస్త్రముల నందను వంటిన చింపి బొంతలన్. 240

క నేలఁ బడవైచి వార్రిలెన్ గోలుచు వీఁపునకు నంటుకొనిన కడుపుతోఁ,
గాలెడి యిల్లును గనవళమే లీలన్ గాలు కడుపు వీక్షింపనగున్. 241

తే. క్రయికుఁ డొకఁ డింతలో వస్తు కాంక్షియగుచుఁ బిలిచె నా సెట్టి నతఁడల్లఁ దలుపుతెఱచె
కాంచె నప్పటికిని బిచ్చగాఁడు కొట్టుముందుఁ గూర్చొని కొసరి కేల్మోడ్చె నంత. 242

శా. మానంబేమియు లేక నీవు మఱలన్ మా యింటిమున్ వచ్చి యా
స్థానంబున్ గలిపించుకొంటివటరా ! చండాలుఁడా ! చచ్చినన్
గానీ నీకొక విత్తుఁబెట్ట ననుచున్ గద్దించి క్రుద్ధాత్ముఁడై
తానా వైశ్యుఁడు కాష్ఠమొండు గొని మూర్ధంబంట రువ్వన్ వడిన్. 243

ఉ హస్తము నెత్తి పోతకవి యా సమయమ్మున వద్దువద్దు సూ
శస్త్రముగాదు నీ కనుచుఁ జప్పున నడ్డము వచ్చెనంతలో
విస్తుల కోప వేగవశ విర్గళితంబయి కట్టె పోతరా
జ్హస్తము దాఁకి గాయమున మానుషతం బొనరించె నంతలోన్. 244

ఉ. కొట్టిన 'శ్రీహరీ !' యనుచుఁ గొందొక సేపు శిరమ్ము కేల్గవన్
గట్టిగ నొక్కిపట్టి వెతఁ గ్రిల్పడియెన్ రుధిరమ్ము వెల్లువన్

గట్టెను గండ్ల చీఁకటులు గ్రమ్మెను భిక్షువు దీని గాంచుచోఁ
దట్టుకొనంగలేక స్మృతి దప్పిపడెన్, హతుభంగి మోముపైన్ 245

తే. గాయ మదిగాదు వైశ్యుని క్రౌర్యమద్ది నోరు విప్పి తా నవ్వుటఁ జేసుకొనియె
రక్తవాహినిగాదు తద్రాక్షసాతి వక్ర దౌర్మార్గ్య బీభత్స వర్తనమది. 246

ఉ. గాయము నుండి నెత్తురొలుకన్ దలడిల్లు నమాత్యుఁ డొక్కెడన్,
నా యను దిక్కులేని కరుణస్థితి నొప్పి యరణ్య రోదనం
బాయెను బిచ్చగానిగతి, హా! కనఁజాలను బేరిదుష్కృతిన్
ఛీయన భాను డస్తగిరి జేరెఁ గ్రుధారుణ దారుణాస్యుడై. 247

తే. దారి దడి గట్టినట్టి పాంథజన మతని ఛీ యననివారె పాపమ్ముచేసి రచట
కవి స్వదుఃఖమ్ము మరచి భిక్షువును దరిసి కరుణఁగాంచి జడీకృతకాయుడగుచు 248

క. జొటజొట గారెడి క్రొన్నెత్తుటఁ దడిసెడి మోము వలువఁ దుడుచుకొనుచు న
చ్చటఁ బసుపు నద్ది రుధిరోత్కటధారల నాఁపి భిక్షుతనువుని మురుచున్. 249

తే, శ్రవణముల మూసి నాల్కపై జలమొకొక్క చుక్క దడిపి వక్షము గీఱుచుండు నంతఁ
దెలివిఁబడి పోతన ముఖేందుఁ దేఱిచూచి దుఃఖ జలధు లుప్పొంగు కన్దావల నతఁడు. 250

మ. ఒరుకేలన్ నుదురంటి మ్రొక్కి గురు భారోష్మయుక్తోచ్ఛ్వాస బం
ధుర నాసాగ్ర విమోచదశ్రుకణ సందోహాంచితాస్యమ్ము నా
హరి వీవే యని పత్రపుష్ప ఫలతోయన్యాయ సంభావనా
గరిమన్ వ్రాల్చి కృతజ్ఞతన్ దెలుపు పెన్ గాద్గద్య వాగ్వైఖరిన్. 251

తే. "ధరణి వినువంటి దయగల దండ్రి లొక్కరిద్దఱుండమి నీ లోకమెట్లు విల్చు
నీవు చేయఁగా బ్రదికితి నేఁడదెట్లొ యెంతనుచుఁ దీర్తు నీ ఋణమేను దండ్రి!" 252

ఆ. వె. అనుచు లేవఁబోవ నాయాసపడఁబోకు భయము లే దొకింతఁ బండుకొనుము
తొలిపోయె గండ మేలాగొ హరి కృపననుచుఁ బోతనార్యుఁ డాత్మనలరి. 253

ఉ. ఎంతవి తీర్తు నీ ఋణము నే ననుచుంటి విదేటిమాట మా
కింతకు నేఁడు నీ బ్రదుకు టియ్యదియే పదివేలఁటంచు న
త్యంత ముదశ్రుపూర్ణ నయనాబ్జ మరందఝరీ తరంగముల్
గంతు లిడన్ గపోల తటిగాపిలఁ బోకని వీఁపు దట్టుచున్. 254

మ. పవనాజస్థితి వ్రాలి ఘూకణ పరిచ్ఛన్నాంగుఁడై యున్న మా
నవుపై హృత్కరుణాబ్ధిజాత నయనాంచచ్ఛుక్తి నిర్ముక్త బా
ష్పవితానామల మౌక్తిక ప్రకరమున్ వర్షించి యా బీద పా
జివెలం గట్టుటనో పరేశపతి వాఙిన్ వీడి తానేగుటల్. 255

ఉ. అప్పుడు తెప్పఱిల్లి యలనల్ల వసుంధర నాని లేచి క
న్విప్పుచు నల్గెలంకుల సవిస్మయతన్ గని పోతనార్యుతో
నిప్పగిదిన్ వచించు "నిటు లెబ్బఱిక మ్మదలేక యేమి యీ
తిప్పలఁటంచు నెంచకయె దీనుని నన్ దరి దీసినాఁడవే. 256

తే. పున్నెముల పంట"వని మేని మన్ను దులిపికొనుచు భిక్షువు సుకవిఁ కన్గొనుచు భక్తి
భాగవతకృప నీ పయిౝ బఱఁగు నిదియె చేకొనుము నా కృతజ్ఞతా చిహ్న మనఁగ. 257

క. ఈ కద్ది యినుపమొల యిది నా కగుపడె వచ్చుచుండ నడిమార్గమునన్,
నాకేల దీని సిరులె కైకొనుఁ డని పోతనార్యు కరమున విడిచెౝ. 258

తే. ఇద్ది గంటమఁటం చితఁడెఱుఁగఁ దనుచు దానిగొని వానిగొని నిజధామ మేఁగె
నంత నా సాధ్వి వచ్చిన యాత్మనాథుఁ గాంచుచున్ విస్మయ విషాదకలిత యగుచు. 259

మ. "అయయో! శీర్షమునందు గాయ మదియే మా యుత్తరీయం బసృ
జ్మయమైపోయె నిదేమి ఘోరము జగన్మాన్యుండవౌ నిన్నయో
మయ చిత్తంబున నిట్లు నొంపఁగల దుర్మార్గుండెవం డట్టి దు
ర్నయముౝ దాముఁ దెటోర్చె''నం చతలు భార్యంగాంచి తా నిట్లనున్. 260

చ. "వెతపడనేల బేల! కడి బిచ్చముకై యితఁ డొక్క యింటిమున్
నతుఁడయి నిల్వఁగా నిలయ నాయఁకు డుద్ధృత దండపాణియై
యతిశయ విత్తలోభమతి నొదల మోదగ రువ్వె నప్పుడే
వితనికి నడ్డమేఁగ నది యీ విధి నా తలఁ దాఁకె నేమనౝ. 261

చ. ఘనమగు నౌషధక్రియల గాయము మానును గొన్నినాళ్ళ కీ
యనఁ దను హత్యజేసిన మహావృజినం బది యెన్ని జన్మలం
దనుభవమున్ బొనర్పఁ జను నజ్ఞుఁడు వైశ్యుఁ డెఱుంగలేఁడు మేల్
ధనమదమత్తచిత్తుఁడయి తద్దురితంబుఁ దొలంగఁజేసితిౝ. 262

తే. పాపముల నుండి రక్షింపఁబడె నతండు వితతమృతిని జయించెఁ దా నితఁ"డఁటంచు
దన కళత్రమ్మునకుఁ జూపి దయలు బుట్టఁ గథన మొనరించు నిటులా బికారి చరిత : 263

తే. "కన వశమ్ముగా దీతని గతిఁ దలంపఁ జెప్ప వశముగా దీతని స్థితిని గాంచ
నితని లక్ష్యమ్ము నిడువార లెవరు గలరు మానినీ! తా నితఁడు నొక్క మానవుండె. 264

ఆ. ఒలువ నారలేక పలుక ప్రాణములేక క్షుత్పిపాస నడఁగి క్షోభఁజెందుఁ
బ్రీతితోడ నీ దరిద్రనారాయణు నన్న మొసఁగి తన్పఁ బున్నె మొదవు." 265

క. అన నా మానిని 'మాపటికని బిడ్డల కొఱకు దాఁచినట్టి ప్రసాద
మ్మును గొనివచ్చెద'నని లోఁజని తన భర్త దానిఁ ద్రోసి చనె నోతువెదో. 266

క. 'చిఱుతలు దినినటు గాదెవో పెరవారి కొకింతఁ జేరఁ బెట్టుటగావో
గిరమంత వ్యర్థమయ్యెను గటువున వాంతియను టిదియె కదె యని వగచున్. 267

సీ. కనులు పెద్దవిజేసి కడుపు చిన్నదిజేసి మనము నెంతయుఁ జంపుకొనుచునుండి
యుప్పిడి చప్పిడి నున్నట్లు గుడుచుచు నదియులే లిదియులే దనకయుండి
యుండి లేముల నొక యొకుపున సవరించి బొమ్మపై వెండ్రుకవోలె నుండి
తినకున్నఁ దిన్నయట్లు నటించి గృహ మేఁగుదెంచువారిని సవరించి పిదప

తే. నున్నదా యింత పిల్లల కూర్చిపెట్టి డొక్క నంటగట్టుకొనుచు వక్కివక్కి
గుడ్లలోఁ బ్రాణములు బెట్టుకొనుచునైనఁ బొగచి మూసినట్టులు పైకి పొక్కదింత. 268

తే. బానసము లోపలికిఁ దాను వచ్చునపుడు కనులు మొగము విప్పారఁ దన్గాంచి యెంతొ
యాసగొనియున్న భిక్షుకాస్యమును దరియు కాళ్ళ రిక్తహస్తమ్ములు గట్టివైచె. 269

క. అంతటఁ బోతన తా నీ యింతి వెదలి మరలిరా దిదేమి యఁటంచున్
మంతనమొనర్ప నా యమ చెంత కరిగి సకల మెఱిఁగి చింత మునింగెన్. 270

తే. అతిథిగణ మేఁగుదెంచ నేమందమన్న నాలుకన్ ముల్లు గ్రుచ్చు మనస్సు జచ్చు
క్షితిని సంసారికిం గల చిక్కులెన్నొ నిజ మెఱింగెనవొ దేవ ! నీవ యనును. 271

తే. యాచకాభీష్టపూర్తి ధనాలి సనియెఁ గావి వితరణాపేక్ష యెక్కరణిఁ బోవు
వాఁక నీ రింకె నిరత ప్రవాహసరణి గమనపథమది మార దొక్కరవమైన. 272

చ. కలిగిన లోభికన్న నొక గవ్వయులేని యుదారుఁ గొల్వ సత్
ఫల మొదవున్ గటు ప్రకృతిభాసు నపార దురాశ నబ్ధిరా
త్రిలకుని గొల్వఁ ద్రాగుటకుఁ దీర్థము బుట్టదు వాహినీతల
మ్ములు గత జీవనమ్ములయి పొల్చియు నా చెలమున్ జలమ్మిడున్. 273

చ. ఇది యిటులుండఁ బోతనను హింసలఁబెట్టిన పెట్టి గుండెలో
నెదో యొక విప్లవమ్మడర నీగతి నెంచఁదొడంగెఁ బోతరా
జెదను మదీయ దుష్కృతికి నేమి ప్రతిక్రియ సేయఁబూనెనో
మొదలె పదాంబుజద్వయికి మ్రొక్కి క్షమింపుమఁటంచు వేడెదన్. 274

చ. అనుకొని తక్షణమ్మె హృదయమ్మున ధైర్యము దెచ్చుకొంచు వే
జని మొగసాలలో నెదో విచారత నొప్పెడి తిప్పనార్యు పా
ద విహితశీర్షుడౌచుఁ గలతంబడి యేడ్చుచు "నాదు తప్పు వా
ట్టన నిడుకొంచుఁ దమ్ముని యెడంద బ్రసన్నమొనర్పవే ప్రభూ !" 275

వ. అని బహుభంగులఁ బ్రార్థించి. 276

ఉ. "మీరలె తల్లిదండ్రు లిఁక మీరయ యేటికి చేయి చప్పనన్
జాలెను నేఁడు నాదు గ్రహచారమునన్ దవలె వారిఁ గూర్చి నా
జాలుల వేల ద్రవ్యము వ్యయంబొనరింతు ననామయంబు చే
కూరినఁజాలు మీర లెది కోరిన నద్ది యొనర్తు సువ్రతా!" 277

చ. అన విని బేరి నారసి సమంచితవృత్తిని దిప్పరాజు నీ
మనమును గుర్తెఱింగితిఁ బ్రమాదవశం బిటులయ్యెనంచు లోఁ
జని యనుజున్ గనుంగొని ప్రసన్నమతిన్ మదినచ్చ బల్కి య
ల్లనఁ గొనివచ్చె. బిమ్మ కవిరాజు పదమ్ముల వ్రాలి యిట్లనెన్. 278

చ. "అలుగకు మో ప్రభూ! కుమతినై యిటు ద్రోహమొనర్చినాఁడఁ గ
న్నులు నిను గాంచ సిగ్గిలు ననున్ క్షమియింపవె, నిన్ను గొట్టు చే
తులు విని కాలిపో నెడఁద తుత్తునియల్ బడఁగోయుచుండె నా
యిలుకిలు ధారవోతు మిము హింసనొనర్చిన పాప మేఁగునే?" 279

చ. అని వగపొందు బేరి మెద నారసి పోతన పల్కె నిట్టులో
ధనికుఁడ! మాయలోఁ దవిలి తప్పులొనర్పకు మీ సమస్త చే
తన హృదయాంతరాళ మణిదర్పణ పీఠిక రాముఁ డొక్కఁడే
కనఁబడు నేరి మానసము గాయమొనర్చిన నాతఁ డోర్చునే? 280

చ. అన విని భిక్షు వేఁ జనుము నావలి కించుక దారి వీండనెన్
జనము దొలంగి యోరఁజనెఁ జయ్యన నేఁగె నతండు వారలున్
జనిన యొకింత సేపటికి జాడయె లేఁదని బైట నెల్లెడన్
గని రెటఁ గానరామిఁ దమకమ్మునఁ దెల్పిరి పోతనార్యుకున్. 281

వ. అంత సహోదరరాజు నత్యంతాశ్చర్య విషాదమగ్న మానసుండై. 282

తే. కుంటివాఁడు వేరెవ్వరు దంట లేరు నడికిరేయి యెచ్చటికని నడచిపోవుఁ
బడియెనో మూర్ఛనొంది యెప్పట్లనయిన ననుచుఁ గాగడాల్ గొని జాడనరయ నుఱుకు.

తే. అతనితోఁ బాటు జనము లూరంతఁ గూడ వదియవైచి చూచియు నెటఁబడయ రతని
పోతన యెడంద పరిపరి రీతు లుఱుక భావన మొనర్చి యారాటపడియె నిట్లు. 284

చ. చిటికను వేయు మాత్రమునఁ జీఁకటిలో నెటు మాయమాయ లే
దెటఁ బడిపోయెనో తమువ దేమగుఁ గైతవ భిక్షుకుండుగా
విటఁ జనుదెంచెనో ప్రభువు రెక్కడి పాటను నెవ్వరేని నా
కిటులని చెప్పరై రను విరెయ్యది దిక్కను నేడ్చుచున్ గనున్. 285

ఉ. పేలిక వ్రేలుమూఁపు, పృథివిం బడి ధూళిని గ్రాలు వీపునున్
జాలిని గొల్పుచున్ గటిక స్వాంతము నీరొనరించు చూపు, పై
దేలిన శల్యసంతతుల దిక్కఁటియున్న కుచేలు రూపు, నా
కేలున గంట ముంచి తిలకించిన శ్రీపుఁ గృపా ప్రదీప్తునిన్. 286

ఆ. తలఁచి తలఁచి యెపుడుఁ దలవంచి విలపించి కలువరించు నీరు కనుల నింపఁ
బిలువఁబంచి కృతిని వలచిన కథ నెంచు జలదరించి మేను పులకరించ. 287

ఉ. అన్యుఁ డెవండు గంటము సమర్పముం బొనరించు నా కహో !
ధన్యము నాదు జీవితము తావక సేవన మి ట్లనన్య సా
మాన్యము కండ్ల నాడెడి యమానుష భిక్షుక ! నీకుఁ గావ్యపుం
గన్య నొసంగి పట్టమును గట్టెద శాశ్వత సాహితీ మహిన్. 288

క. మును సార్వభౌమ రూపతఁ గనిపించితి ధ్యానమయ జగమ్మున నెటు వ
చ్చెను జిప్ప చేతి కిపుడో యనఘా. నీ లీల లీ యనంతాకృతులున్. 289

చ. సకల జగత్కుటుంబమును సాఁకెడు తల్లి సమస్త కాంక్షలున్
సుకరముగా ఫలింప మముఁ జూచెడి పూచెడి కల్పవల్లి మా
వికముల పంట లీనెడి వినిర్మలహాస సుధాతరంగ వా
టిక యగు పాలవెల్లి వికటించెనె నీకు రమామతల్లి తాన్. 290

ఉ. భార్గవియున్ వసుంధరయు భార్యలు, జాహ్నవిబిడ్డ, రాజ్యమో
స్వర్గము, దేవతల్ ప్రజలు, సస్యములో సుధ. లాఁడుబిడ్డమో
దుర్గ యదేమొ వామనత దోసిలి యొగ్గితి విర్జరారి కీ
దుర్గతి యేల నీ కృతి సుదుర్గ్రహమై కనుపించు నచ్యుతా ! 291

చ. ప్రకట సువర్ణసూన రుచిభాస్వ దమూల్యదుకూలమేవి ఖం
డకిత మహామలీమస పటచ్చర సంహతు లేవి విశ్వనా
టక బహు వేషధారి వగుటన్ సమకాంక్ష ధరింతు వాది గా
యకునకు నీకు నెయ్యెడ సమావసరమ్ము స్వరమ్ము లేదునున్. 292

తే. నీలిమబ్బుల తెరమాటు నెఱిగ దాఁగి కండ్ల మెఱసిపోయెడి తటిత్కాంతిమాల
పథముఁ జూపించుననుటకు బదులుగాఁగఁ జిమ్మచీఁకటులే కండ్లఁ గ్రమ్మఁజేయు. 293

వ. అనుచు వాదమ్ము లుడిగి తాదాత్మ్యముం జెందుటయు, 294

తే. తమ్మునిన్ వలెఁ దిప్పన తాను గూడ విస్మితుండయి జగమునె విస్మరించి
యల్లనల్లన స్మృతిగొని యశ్రు లురల భక్తిభావ బంధురగతి బలుకు నిటుల. 295

తే. "అతఁడు భిక్షుకుఁడగునె యా హరియొ హరుఁడొ వచ్చి కృతిలేఖనకు గంటమిచ్చె నిటులు
భాగవత లేఖనమున కుపక్రమింపవలయు నిఁక నాలసింపఁగా వల" దఁటంచు. 296

చ. పలికిన నగ్రజున్ గనుచు భక్తియుతుండగు పోతరాజు ని
శ్చలమతి నిట్లు వల్కెఁ గృతి సంలిఖియింపఁగ నేమి గావలెన్
దెలియవిదేది మీకు. క్షితిదేవత లేక శిలాపురంబునన్
బలుకరె బ్రహ్మసత్రమిది భాగవతమ్ము రచింపుమంచునున్. 297

ఉ. క్షామగతిన్ రుజాభిహతి సస్యవినాశముగల్గు టిప్పుడే
రాముఁడు తాను సత్కృతిని వ్రాయఁగ గంటమొసంగు టిప్పుడే
భూమిసురల్ ముహూర్తమిడి పుస్తకమున్ రచియించు ముందు నీ
నేమము నాచరింపుమని నిర్వచనం బిడు టిప్పుడే కదే! 298

మ. అవిరామమ్ముగ నన్నసత్రములు యజ్ఞాంతమ్మునన్ దక్షిణల్
కవి సత్పండిత విప్రసంతతికి సత్కారమ్ము తోరమ్ముగా
సవరింపం దగు మార్గమెయ్యదియొ నా స్వాంతమ్మునన్ దోఁచదం
చు విచారించుట లూరుజుండు కరముల్ జోడించి తా నిట్లనున్. 299

మ. "అనఘా! మీరలు చింతసేయవలదీ యాగంబు సర్వంబు నా
వనజాక్షుండు కృపాకటాక్షవిభవ వ్యాపార మేపారఁగా
నొనరించున్ బరిపూర్తి నాకు గురుతుల్యుల్ మీరు, నా మేను నా
ధనధాన్యం బఖిలమ్ము మీదు పదపద్మం బందు నర్పించితిన్." 300

వ. అన విని పోతనార్యుండు, 301

క. "పదపడి పశ్చాత్తాప మ్మెద నొదవఁ బవిత్రమయ్యె నీ యీ జన్మం
బదియే చాలున్ రూకలు మొదలగునవి యీయ నీకుఁ బోలునె" యనఁగన్. 302

తే. ఈ ధనమ్ము మీ కెపుడు ననిష్టమనుచు నే నెఱుంగుదు స్వామి! మన్నింపవలయు
రాము సేవన్ వ్యయింప సార్థకముఁ జెందునని యొసంగి కైకొన దత్తహరణ మేమొ!

ఉ. రావు శిరోమణీ! ప్రతిఫలమ్ము నొసంగఁ దలంతు వేని దు
ర్భావత వీఁ డొనర్చు ఘనపాతకతూల నగాలి గాల నీ
సేవకునిన్ భవత్కృతి విశేషములన్ వినిపించి భారత
శ్రీవిభుఁడౌ పరీక్షితుని శ్రీశుకు లట్లు తరింపఁ జేయవే! 304

ఉ. ఇంతియె చాలు"నంచు వచియించెను మ్రొక్కులువెట్టి సెట్టి తా
నంతఁ గవీంద్రు నాస్యము ముదంబు వికీర్ణ మనస్సరోవరా
భ్యంతర సీమ సొంపెనఁగు స్వర్ణసరోరుహమై హసించ "నీ
స్వాంతము సంతసింపఁ గృతిసారము నే వినుపింతు నీ" కనెన్.

తే. కవి కళానిధి వాక్సుధల్ చెవులఁ గురిసి నంత నచటి జనాలి మోదార్ణవమ్ము
లవధిరహితమై పొంగె వైశ్య ప్రవరుఁడు 'నెంత ధనమేనిగాని నే నిత్తు' ననియె. 306

ఉ. సెట్టి యిటాడినంత నటఁ జేరినవారు మిథః ప్రసంగముల్
వెట్టిరి, ఇంట మూల్గి చనువిత్తము లెంగిలి చేతఁ గాకినిన్
గొట్టఁడు గాని దుర్వ్యయము కోట్లనఁ బెట్టు నదంత వెంటఁ దాఁ
గట్టుకపోవునే ? సుకృత గ్రంథములన్ రుచిబుట్టె నేఁటికిన్. 307

తే. ఆ యుదంతము నింతకు నంతఁజేసి చెప్పుకొను లోకులకు భక్తశేఖరుండు
పోతరాజన దేవునివోలె నుండు నఖిల ధనధాన్యవృష్టి వర్షనగఁ గురియు. 308

ఆశ్వాసాంతము

క. సారతర నిగమ వీధి విహారా ! కైతవ హిరణ్య హరిణాజిర వి
ద్దారక సింహకిశోరా ! శ్రీరమణీ చిత్తచోర ! శ్రీరఘువీరా ! 309

చ. భవభయహారకా ! మధుర భావ భవాకృతికారకా ? మనో
భవరిపుతారకా ! నిగమపావన పాత వినష్ట పద్మసం
భవరిపుమారకా ! విమత బౌద్ధవ పుర్వరధారకా ! విప
న్నివహనివారకా ! విరత నిర్మల ధర్మగుణ ప్రచారకా ! 310

ప్రహరణకలిత

ఇనకుల విలసద్ధి మకరవదనా ! వనవిధితనయా వరవనసదనా !
దనుజతను విఘాత కనరకదనా ! ఘనముని జన సంగత శత మదనా ! 311

గద్యము

శ్రీమద్భరద్వాజగోత్ర పవిత్రాపస్తంబసూత్ర, ప్రథిత సూరిజనమిత్ర, బక్కయ్యశాస్త్రిపుత్ర
వాగేశ్వరీ సమాసాదిత, వైదేహీవర నివేదిత సరసకవితావిలాస, సహజ
పాండిత్యభాస, వరకవి విధేయ, 'వరదార్య నామధేయ ప్రణీతం
బైన పోతన చరిత్రమను మహాప్రబంధమ్మునందు
పంచమాశ్వాసము.



శ్రీ ర స్తు.

శ్రీ వాగీశ్వర్యై నమః




## రచనోపక్రమము - రామ పద్యపాద పూరణము

“ నిమిత్తమాత్రం భవ సవ్యసాచి ”


రామా ! పావన శబ
రీ రామార్పిత సుమ బదరీఫల కామా !
సూరినుత గుహ క్షిత
సారస పదసీమ ! క్షీరసాగర ధామా ! 1

తే. భాగవత కావ్య రచనా విభాసురమ్ము త్వత్పదాంకిత కవితా సుధాయురమ్ము
శుభకరమ్ము పోతనకవి సుచరితమ్ము వినవె శ్రీరామ ! శ్రీకంఠ వినుత నామ ! 2

సీ. నవరసంబులు జిల్కు నవ కావ్యము విధంబు నవవత్సరాది తా నవతరించెఁ
బంచాంగములు తరు పంచాంగముల యట్లు జీర్ణపత్రముల వర్జించి యొప్పె
శుకపిక ద్విజము లోపిక శుకద్విజులటుల్ తరుణ భాగవత గీతములు పాడెఁ
దోరణమ్ములు లేమితో రణమ్మును సల్పి పచ్చపచ్చగ కాంతి పాదుకొల్పె

తే. యువత కుసుమాయుధుని వలం దవిలి యాడె సవిత ప్రకృతికామినితో వసంతమాడెఁ
గవిత నూత్నాబ్దమునకు స్వాగతముఁ బాడె నాఁడె కవివాణి తెరవీడి నాట్యమాడె. 3

సీ. లక్ష వత్తులదీప వృక్షదీధితుల హారతు లిచ్చె కింశుక ప్రసవ వనిత
మధుపూర్ణ చషక సంపన్న హస్తాబ్జయై నెమ్మిగాంచెను బద్మినీ లతాంగి

మంజుల ధవళ చామరపుంజ పాణియై విసరసాగె శిరీష కుసుమయోష
చివురు కేలెత్తి యంచిత పికామృతకల స్వనమొప్పఁ బిల్చె రసాలబాల

తే. లేఁతయాకు పయ్యెదమాటు లేమ రంభ మధురఫల భోజనములిచ్చె మాధవునకుఁ
గొమ్మలెల్ల సింగారించుకొని రహించి ప్రియవసంతునిపైఁ బూలవృష్టిఁ గురిసె. 4

ఉ. మాధవుఁ డేఁగుదెంచెనని మాలతి మల్లికలెల్ల నవ్వుచున్
వీధుల సౌరభమ్ములికె వేఁపలు ముత్తెపుసేస దోసిటల్
మాధవుఁ డీతఁడే యనుచు మౌళిని జల్లె రసాలరాగ స
మ్మాధురులన్ సుమించి ఫలమార్గము వట్టె వసంతుఁ గూడుటల్. 5

చ. కిలకిల నవ్వి పూలు పరిఁకించె, శిరమ్ముల నూఁచె భూరుహ
మ్ములు, నల తీవదోలికల మోదతనూఁగె శకుంతజాతి, కో
కిలములు స్వాగతాభ్యుదయ గీతము లాలపనం బొనర్చెఁ, దా
మలికుల ఝాంకృతుల్ శ్రుతుల హార్దతఁ దంబుర మీటెఁ దోఁటలన్. 6

సీ. అలివేణి మత్తకోకిలవాణి చూతపల్లవపాణి సకల ఋతువులరాణి
వల్లితనువిలాస ఫుల్లప్రభాభాస మల్లికాహాస చంపక సునాస
నవరత్నచయవర్ణ నైగనిగ్య వికీర్ణ కుసుమాభరణపూర్ణ, వసనపర్ణ
దోలాయితసుగాత్రి పాలాశసుమవక్త్రి తరుణాబ్జనేత్రి సౌందర్యధాత్రి

తే. మంజు మంజరీ వక్షోజ మహితతేజ చారు సౌరభలిప్త రంభోరుదీప్త
సరస సుమనస్సమేత ప్రసన్నచేత భోగ్య ఋతుమతి వాసంతభూప యువతి. 7

ఉత్కళిక

విరహ తాపమ్ములో వేఁడి గ్రీష్మము లూర్చె
మేఘ సందేశమ్ము మెఱయఁ గనులు జెమర్చె
శారద జ్యోత్స్నలోఁ జారుహాసము విప్పె
హేమంతమున మోద రోమాంచమున నొప్పె
శిశిరమ్ములోనఁ దన జీర్ణవస్త్రము లొల్చె
నల వసంతమున నూత్నాలంకృతులఁ దాల్చెఁ
గుసుమాకరుని గూడుకొనియాడె భూమహిళ
సతి హృద్వికారములె ఋతుషట్కమయ్యె నిల. 8

తే. హరనయన కృశాను క్రోధహతిని బొంది మరుఁ డనంగు డయ్యె వసంత మైత్రివలనఁ
ప్రథిత కేతకీ పుష్పకృపాణ తూణ శాతసూన శిలీముఖ సహితుఁడయ్యె. 9

ఉ. స్థాణు జటాచ్ఛటాటవి విశాతకశాయిత ఫుల్లమల్లికా
బాణముల న్నిగుడ్చి పగఁ బాపికొనెన్ గుసుమేషు వుద్ధతిన్.

పాణిని మోడ్చి స్థాణువుల పట్టవసిఁ శరణమ్ము వేడఁగా
వేణువు లూఁదె దర్పకుని వీరజయాంకము లౌచుఁ గోకిలల్, 10

తే. పల్లవించు తరుల నీడఁ జల్లనగుచు విరియు పూవుల పుప్పొడిఁ బరిమళించి
మలయపవనుండు మాధవు మైత్రిఁగూడి యరుగుదెంచె దినాంత సంధ్యాకృతిఁ గొని. 11

వ. అంత నయ్యవసరంబున, 12

క. శ్రీరామాలయ మందునఁ బ్రారంభమ్మయ్యె భాగవత సప్తాహ
శ్రీరాజిత నవరాత్ర సమారాధిత బ్రహ్మసత్రి యజ్ఞోత్సవముల్. 13

క. శారదరాకా శశిఁ గన వారాన్నిధి మింటి నంటి వర్తించు క్రియన్
శ్రీరామచంద్రుఁ గనుగొన నూరూరి జనమ్ముతోడ నుప్పొంగె సభల్. 14

ఉ. పండటు లొల్చి చేతనిడు పక్కిని గన్నులఁ గట్టి నట్టులన్
బండిత పామరావళికి బాలక వృద్ధ జనాళికిన్ మదిన్
నిండెడి యట్లు భాగవత నిర్వచన మ్మొనరించెఁ బోతనా
ర్యుండు క్రియాతరంగ రహితోదర మయ్యె సభాంగణాబ్ధియుఁ. 15

సీ. ఆ వ్యాస భగవానుఁ డావేశమయ్యెఁ దా నితనిపై నని వచియించు వారు,
వాణి యీ జిహ్వాగ్రవశవర్తినిగఁ దాండవించునో యని ప్రశంసించువారు,
అభినవశుకుఁ డీతఁ డన నెంతమాత్రము నఱయె లేదని కొనియాడువారు
భాగవత పురాణ ప్రవచన మ్మనిన నీ యవనిఁ బోతన సామ్మె యనెడివారు

తే. అల పరీక్షిత్తువోలె నేఁ డాత్మలెల్ల భువిని దరియించె ననుచుఁ జెప్పుకొను వారు
నైరి యాహూతులై సభ నధివసించు పండిత ప్రకాండులు కవి ప్రముఖులెల్ల. 16

క. ఘన హరిగుణ కథనమ్ములు విన వీనుల విందొనర్చె విష్ణ్వర్చనముల్
కను పండువయ్యె సుఖ భోజనము హరి భజనము లచటి జనముఁ దనిపెన్. 17

ఆ. వె. విష్ణు కథలు చెవుల విమలమ్ము లొనరింప నిరత మన్నదాన నియతి గల్గి
భుక్తి ముక్తి నిచ్చు పుణ్యకార్యము లందుఁ బాలుగొననివాఁడు పశుసముండు 18

వ. అంత సుకవిశేఖరుం డగు పోతరాజు. 19

మ. ఇటు సప్తాహము పూర్తిగా నచటికై యేతెంచి యున్నట్టి యు
ద్భట దోషజ్ఞ కవీంద్రకోటి విలసత్పాదార విందమ్ములన్
నిటలం బంట నెఱంగి యిట్లనియె మన్నింపఁ బలెన్ నీవి దొ
క్కటి విజ్ఞప్తిగలాదు దాని నెటు లాజ్ఞాపింతురో పండితుల్. 20

మ. "మును నా ధ్యానమునన్ రఘూత్తముఁడు తమ్ముల్ గొల్వ పేరోలగ
మ్మున రత్నాంచిత సింహ పీఠగతుఁడై భూపుత్రికఁ గూడి ద

ర్శన భాగ్యం బిడి నన్ను గాంచి సుకవీంద్రా! ప్రేమమై నీవు తె
న్గున శ్రీ భాగవతమ్ము గూరిచి కృతిన్ గూర్పన్వలెన్ నా కనెన్. 21

క. తక్కిన పురాణములు పేరెక్కిన కవివరులు తెన్గు లెలయించియు ము
న్నొక్కరు భాగవతార్థము పక్కాణింపరట దీని వదలిరొ నాకై. 22

క. నిక్కముగ నట్టి భాగ్యము దక్కెను నా కహహ! యెంత ధన్యుఁడ విల నా
కెక్కడి మృత్యువు నమవిడి యక్కైవల్యంబు నెచటి కరిగెడి నింకన్! 23

క. ఇది భగవదాజ్ఞ యేమున్నది నాశ్రమ మిందు మూఁగ నాల్కన వాణిన్
బొదలించి పంగువున్ గిరి నదులన్ దాఁటించు ప్రభువు నాయెడఁ గలుగన్. 24

తే. కావునన్ బుధాశీర్వాద కలితు నగుచు భాగవత లేఖనమున కుపక్రమింప
వలతు నన఼గ మహొప్పొంగి యప్పాజ్ఞతతియు నార్య! 'నిర్విఘ్నమస్తుతే' యనుచుఁ జనిరి.

వ. తదనంతర మప్పోతరాజు, 26

ఆ. వె. మహిత వేదశాస్త్ర మర్మము లెఱుఁగక భాగవతము నెట్లు బలుకువాఁడ
నముచు దత్తగురుని యపరావతారమౌ స్వీయగురుని మదిని జింత సేసె. 27

క. తలఁచి చిదానం దాశ్రమ విలసద్గిరి గహ్వరముల వెలసి సమాధిన్
జెలఁగెడి గురువరుఁ గని స్తుతి సలిపె నిటుల్ భక్తిభావ సంయుతమతియై. 28

గురుస్తుతి

శ్లో. గురుర్బ్రహ్మా గురు ర్విష్ణుః గురుర్ దేవో మహేశ్వరః
ఇత్యార్యోక్త్యా పరం బ్రహ్మ స్తుతిం కర్తుం సమారభే. 29

శ్లో. హంసారూఢో వేదమూర్తిః మనః పద్మాసనే స్థితః
చతురాస్య స్త్వమే వార్య గురుర్ బ్రహ్మేతి నిశ్చయాత్. 30

శ్లో. శ్రుతిం శ్రుతిం స్మృతిం బుద్ధిం కలా సాహిత్యమాననం
దర్శనం దర్శనం పాదం పదం దివ్యదలం కృతిం
త్వలం కృతిం యథాయోగ్యం కృత్వా స్థిత్వా తవాననే
వాణీ కాదంబి నీ భూత్వా పీయూషం సం ప్రవర్షతి. 31

శ్లో. స్థిత్వా దయాబ్ధి విలయే హత్వా నాస్తికసోమకం
నిగమానాం సముద్ధర్తాహీతి మీనోఽక్షితాం గతః 32

శ్లో. జరామరణ జిత్సుధారస సమాశ్రి యో విబుధ జీవనావన చణో
తవాంఘ్రి సరసీరుహః నితిధియా నివార్య కమతేశ్వరః పదమభూత్. 33

శ్లో. సంసారాంబుధి మగ్నబద్ధ ప్రకృతే రుద్ధర్తు ముద్యన్మనః
ప్రస్థానత్రయ భాష్యబంధుర సుధాసించ ద్విరించి ప్రభం
మందస్మేరనవేందు సుందర చిదానందాననాబ్జం తవ
అజ్ఞానాంధతమిస్ర వారక వరాహశ్శ్రియుతం భ్రాజతే. 34

శ్లో. ప్రహ్లాదరక్షణ పటుర్హిరణ్య దానాతినిపుణ ఏషగురుః
దానవనాశాన స్సినృసింహ ఏవేతి కోనజానాతి. 35

శ్లో. అస్మి బ్రహ్మహమితివై త్రిపదా వరణే భవాఞ
దేహాహంకార బలినం జిత్వా భవసివామనః. 36

శ్లో. జన్మ ప్రాపణహేతు త్వా ద్ధత్వా కర్మాఖ్యమాతరం
జ్ఞానరూప కుఠారేణ త్వమసిహ్యత్ర భార్గవః. 37

శ్లో. భవాబ్ధి బంధనం కృత్వా జిత్వేంద్రియ దశాననం
ఆత్మారామ స్త్వమేవాసి వైదేహీ ముక్తి కాంతయా. 38

శ్లో. నరస్యచోపదేష్టారం బ్రహ్మన్ సత్యాధినాయకం
ధర్మపక్షే స్థితం చత్వా వందేకృష్ణ జగద్గురుం. 39

శ్లో. పశ్యల్లలాటం సర్వజ్ఞం మౌళిన్యస్త కలానిధిం
తారకస్యోపదేష్టారం కామ నాశంకరం భజే. 40

శ్లో. అహోమూర్తి త్రియాకార తవ పాదరజః కణం
పోతనార్యం భవచ్ఛిష్యం కృపయాలోకయ ప్రభో. 41

వ. అని నుతించు పోతనార్య భక్తికి నానంద పరవశుడై. 42

శ్లో. శ్రీకర శ్రీధర స్సర్వమంగళావహ సద్గురుః
పోతనా యశ్రియం దద్యా త్సర్వమంగళ దోభవేత్. 43

క. అని యాశీర్వాదమ్మున్ బొనరిచి వాత్సల్యజలధి పొంగులువాఱన్
గనె సుకవి చంద్రునిం బోతనయున్ గురువరుని గాంచి తా నిటు నుడివెన్. 44

ఆ. "తామొసంగు రామతారకనామ సంస్మరణ సేయ నొక్క తరుణమందు
స్వామి ! రామచంద్ర సందర్శనమ్ము లభించె దాశరథి వచించె నిట్లు. 45

తే. 'బాదరాయణి విరచిత భాగవతము నాంధ్రభాషాసుధా కృతి ననువదించి
కృతి నొసంగెద వేని స్వీకృతి నొనర్తు' నని వచించి యంతర్హితుఁడయ్యె స్వామి ! 46

తే. భాగవత రహస్య మెఱుంగ బ్రహ్మతరమె ? తెలిసి పలుకఁగ నా మహాదేవు వశమె ?
హరిని విశ్వరూపి నెఱుంగఁ దబ్జభవుఁడు మోహినీ మాయలకె కూలి ముగ్ధుఁడయ్యె. 47

క. నే నెవఁడ నతిరహస్యంబై నలువకుఁ దెలియరాని హరిజన్మగుణా
ఖ్యానంబుఁ దెలుప తత్త్వజ్ఞానానుభవం బెఱుంగకయె గురువర్యా! 48

క. కల్లయగు మాయ వివరము ముల్లోకమ్ములకు నాదిమూలంబై ప్రో
ద్యల్లీల వెలుఁగు తత్త్వము నెల్లన్ దెలియంగ జ్ఞాన మెఱిఁగింపఁదగున్. 49

క. అంతట నుండియు నీశ్వరుఁ డంతటికిని నంటకుండునఁట స్వామీ! యీ
వింతెట్లు పొసఁగు"నన మునికాంతుం డా కవిని గూర్మిఁ గని యిటు వల్కెన్. 50

సీ. "ఆకస మటు నిర్గుణాకారుఁడై మబ్బు భేదముల్ తానయి వెలయుచుండు
వాయువట్టులు శుభ్రవర్తనుఁ డగుచు దుర్గంధ సుగంధ వికారి యగును
జలములవలె నెట్టి చవిలేక యుండియు రుచులన్ని తానయి రూపుఁగాంచు
నద్దమ ట్లేరూప మందకుండఁగ నుండి యన్నిరూపములు తానయి వెలుంగు

తే. రూపులన్ని తా నగుచు నే రూపులేక పేరులన్ని తా నగుచు నే పేరులేక
విశ్వమును దాను గాంచుచు విశ్వమునకుఁ గనఁబడనియట్టు లుండెడి ఘనుఁడతండు. 51

సీ. ఎవని ప్రేరణఁ గనుల్ భువనమున్ గనఁగల్గుఁ గనఁజాల దెవని నా కన్ను తాను
ఎవని సత్తువతోడ శ్రవణముల్ వినఁగల్గు వినఁజాల దెవని నా వీను తాను,
ఎవఁడు శక్తి నొసంగఁ బ్రవచించు నీ వాక్కు పలుకలే దెవని నా వాక్కు తాను,
ఎవని యాశ్రయముతో హృదయ మెప్డు తలంచుఁ దలఁపలే దెవని స్వాంతమ్ము తాను,

తే. అంతరింద్రియ బహిరింద్రియముల కెవ్వఁ డందకుండ లో వెలుపల నమరియుండు
నట్టి వేదాంతవేద్య జ్ఞానైకసాధ్యు నాత్మ నీశ్వరుఁ డనుచు నీ వరయు మెపుడు. 52

ఉ. సుత్తియ తప్తలోహమును సూది మొదల్ గునపమ్ము రూపులన్
మొత్తుచు నామరూపచయ మూలకమౌచును వానిఁ గూడి కిం
చిత్తును దాను మారనటు చిత్తు పిపీలిక నుండి బ్రహ్మయౌ
మొత్తపు సృష్టి వృద్ధిలయ మూలకమై యవికారియై మనున్." 53

వ. అని మదువు గురూపదేశ వాక్యంబులు వినుచుఁ బోతన సంశయబాధిత చేతస్కుండై
యిట్లనియె. 54

తే. "ఆత్మ సాపేక్షలేక దేహమ్మునకును బాధయే లేదు దేహ సంబంధముననె
యాత్మ సుఖదుఃఖసంగతు లనుభవించు నేల? యానందరూపున కీ వెతలన. 55

క. పటుతర వహ్నిజ్వాలలఁ ద్రుటి నార్పెడి జలము లుష్ణతీవ్రతఁగను దా
మెటులనిన మధ్య వచ్చిన ఘట సంబంధమ్మె ముఖ్యకారణ మరయన్. 56

వ. జలము స్వభావలక్ష్య మగు చల్లఁదన మ్మఱి కారణాంతర
మ్ముల నుపలక్ష్యకోష్ణతమ బొంది పదంపడి శీత రూపతన్

లలిఁ గొను నాత్మ తా నటుల నంత సుఖాకృతి నుండి దేహపుం
జెలిమి నలంత నొంది వగఁజెందున దెయ్యెడ నిల్వదాత్మకున్. 57

క. చంచల చిత్తుఁడు మత్తుఁడు పంచేంద్రియ విషయ లోభ పరతంత్రుఁడు నా
సంచిత కర్ముఁడు శ్రీహరిఁ గాంచఁగలఁడె ?" యనెడి కవిని గని ముని పలుకున్. 58

క. "అలలం గలఁతపడెడి యా జలనిధిఁ గన నగునె కర్మసాక్షినటులె చం
చల చిత్తమ్మున దేవునిఁ దలఁచినచో నెటులు వాని దర్శన మొదవున్. 59

ఉ. ధర్మము దారి, దేహ మరదమ్ము దశేంద్రియముల్ ధురీణముల్,
శర్మదమోక్ష మాలయము, సారథిరూపుఁడు బుద్ధి, యాత్మయే
కర్మగుఁడైన యాత్రికుఁడు, కామము సర్పముఁ బాట ప్రక్కచేల్
దుర్మద దూషితంబు లయి దూఱు వృషంబులు ప్రక్కచేలలో. 60

క. మానసరశ్మిని జేకొని జ్ఞానేంద్రియ యుగ్యముల వశంబున నిడుచున్
సూనృతపథముల నడుపుచుఁ దానై తన నుద్ధరింపఁ దలకొనవలయున్.'' 61

ఆ. అనుచుఁ దపసి తెల్ప నా కవి యిటువల్కె "మాయ త్రోయ వెదఁగు మార్గమంద్రు
మాయ యెద్ది ? గెలుచు మర్మమెద్ది ? యొకింతఁ దెలుపుఁ" డనిన యోగి పలికె నిటుల. 62

సీ. భానుతో నంబుద పటలమ్ము లేర్పడి భాను బింబముఁ గప్పి ప్రబలుచుండు
జలముతో శైవాలజాలంబు లేర్పడి జలరూపమునె యదృశ్య మ్మొనర్చు
జ్వలనునితో భస్మసంహతి జనియించి జ్వలనాకృతినె కప్పి యలరుచుండుఁ
బట్టు పురువునుండి ప్రభవించు గుణరాజి కీటక రూపముఁ మాటు పఱచు
తే. నాత్మతోఁ బుట్టి పెరుఁగు మాయావధూటి యట్లె యాత్మరూపమును మాయంబొనర్చు
దాని హఠయోగి వైరాన దాఁటఁ జూచు రాజయోగి మైత్రిని బంధరహితుఁడగును. 63

ఆ. నాది యనెడి రూపనామాత్మకము మాయఁ నే నటంచుఁ బల్కు జ్ఞాని బ్రహ్మ
నాది యనెడిది విడనాడ ముక్తుండయి పూరుషోత్తముఁ డగుఁ బుడమి నరుఁడు. 64

తే. కాంచ జీవుఁ డీశ్వరుఁడను గాంతి దీపికవిధి నుందురు గుణమయ యవనికయగు
మాయకాంతిన్ నిరోధించు మండుదివ్వె నంట భసితమౌ మాయ తా నంటదీశు. 65

సీ. పరదుఃఖ దుఃఖిత్వ పద్ధతి పక్వమై పరమార్థకర్మనాఁ బరఁగుచుండు
భగవద్వియోగార్తి భరియింపరాని దీనాలాపమే భక్తి యన రహించు
సత్యశోధనలోని స్వస్వరూపావాప్తి జ్ఞానరూపమ్మనంగా నెసంగు
నిస్వార్థ వాంఛా వినిర్మల వృత్తమ్ము వైరాగ్య రూపాన వరలుచుండు
తే. మానసమ్మున విజ్ఞాన మనన మొప్ప వాక్కునన్ జక్రిగుణగాన భక్తి దనరఁ
గార్య కరణాన నిష్కామకర్మ మెనఁగ నొప్పు మనుజుండె యుత్తమ యోగివరుఁడు. 66

సీ. వసుధ నిత్యానిత్యవస్తు వివేకమ్మె జ్ఞానయోగమ్మునఁ గలుగు ఫలము
తలఁప నిహాముత్ర ఫలభోగ వర్జన వైరాగ్య సాధనన్ వడయు ఫలము
శమ దమ సాధన షట్క సంపత్తియె కర్మయోగమ్మున గల్గు ఫలము
మోహ సంబంధ ముముక్షత్వ సంసిద్ధి భక్తియోగమ్మునఁ బరఁగు ఫలము

తే. జ్ఞాన భక్తి వైరాగ్య తత్వాను సేవ్య మానమానసానంద రసానుభూతి
విశ్వమున భాగవతరూప వృత్తి నెఱపి తమ మడంచును శాశ్వత ధామ మొసఁగు. 67

ఆ. మత విరుక్త తత్త్వమార్గము లెన్నేనిఁ బ్రాణికోటి గమ్యపథ మొకటియె
దిగినచోటి నుండి తిన్నగా వచ్చినమార్గ మెఱిఁగి చనిన మనికిఁ జేరు. 68

క. వేదమ్ములు దార్శనిక వివాదమ్ములు, స్మృతి పురాణవాక్య వ్యాఖ్యా
నాది ప్రస్థానత్రియనాదములీ తత్వమునె వినన్దగఁ జెప్పున్. 69

ఉ. కర్మము రూపభంగ తను గాంచును మృద్ఘటమట్టు లెయ్యెడన్
నిర్మలమయ్యు జ్ఞానగతి, నిత్యమునున్ మననైకశీల స
ద్ధర్మము వీడ శుద్ధిరహితస్థిత తామ్రక పాత్రమై చనున్
శర్మద భక్త్యుపాయమను స్వర్ణఘటమ్మె శరణ్య మెందునన్. 70

క. కావున భక్తిప్రదమగు శ్రీ విష్ణ్వవతార రూపశీల విభవ సం
భావన మెసఁగన్ భాగవ తావిష్కరణమ్మొనర్పు మాంధ్రము నందున్. 71

క. వారక శ్రీహరి కృప నెఱవేఱంగల దిట్టి కార్యనియతి"యన నమ
స్కార మ్మొనరిచి పోతన యూరున్ జేరంగ నరిగె నొకదినమందున్. 72

తే. అన్నకును మ్రొక్కి శుభసమయమ్ము నందు స్నాతుఁడై యాత్మగేహ విస్ఫీతులైన
శ్రీరఘూద్వహావిన్ సాంబశివునిఁ జేరి నతులొనర్చి యేణాజినస్థితిఁ జెలంగి. 73

చ. కనులను మూసి కేల్మొగిచి కావ్య మవిఘ్న సమాప్తి నొందఁగా
మనమున రామతారక సుమంత్ర పరాయణుఁడౌచుఁ ద్రాటిక
మ్మనఁ దొలి గంటమూనుకొని మల్చె మహామతి "శ్రీగణాధిపా
యనమహ" యంచు దేవగణ హారపు మేరువుఁ బోలు వేలుపున్. 74

సీ. ప్రజ్ఞాన వర్షదౌపనిషదామృత వారి ధరము యుష్మాక సుందర కచమ్ము,
అఖిల కలాప్రపూర్ణామల సాహితీ చంద్రబింబము నీ హసన్ముఖమ్ము,
పూతకర్మ జ్ఞానహేతు బోధక సచ్ఛ్రుతియె తావకీన శ్రుతిద్వయమ్ము,
నిత్య ధర్మవ్రత నియమ ప్రచారక స్మృతి సంచయమె భవన్మతి పథమ్ము,

తే. ఐహికాముష్మిక ఫల స్తనాంగణమున ముత్ కృదుపమాద్మలంకారభూష లాడఁ
దత్త్వదర్శనశాస్త్ర నేత్రముల తోడఁ గృపఁగనవె నీవి వాఙ్మయా కృతిని వాణి! 75

ఉ. మానిత సత్కవిత్వ మ్మను మాధురి తావక మానసాబ్జ, మౌ
గానకళా విలాస పరికల్పిత సుస్వరశోభ వాక్కు, రే
ఖా నవవర్ణచిత్రిత వికాస విలేఖనముల్ త్వదీయ సత్
పాణి పదాననాబ్జ రసభావ వికారకృతుల్ సరస్వతీ!" 76

మ. అని వాగీశ్వరి సంస్తుతించి హృదయం బానంద పీయూష వా
హినిలో బాలమరాళ లీలలను బిట్టీఁదాడ మోహాప్తి ని
ర్గుణ తత్త్వాంచిత విశ్వనాటక కథా కుర్వాణ నిర్వాణరూ
పుని స్తోత్రమ్ము నొనర్పఁ గావ్యగతి నుద్బోధించు గాథాదిలోన్. 77

సీ. ఎవఁడు శూన్యాంకమై యెటనుండి గాంచిన నాద్యంత మేర్పడ కలరుచుండు
నెవఁడు శూన్యాంకమై యీ విశ్వమంతటిన్ దన యావరణమందె దాఁచఁగల్గు
నెవఁడు శూన్యాంకమై యీ నవాంకమ్ములఁ దన నుండి సొంత ముత్పత్తిచేయు
నెవఁడు శూన్యాంకమై యీ యంకె లన్నిటిన్ దనపైనఁ దాల్చి పెద్దగనొనర్చు
తే. నగుచు శూన్యాంక మెవ్వఁడీ యంకెలన్ని వ్యయములైన నొక్కఁడె తాను వరలుచుండు
నా స్వరూప విరహితుని నఖిలరూపు పరమ పూజ్యు నమూల్యు నవ్యయు నుతింతు. 78

తే. రూపులన్ని తానయి కనుపాపయట్లు నిజ సితాక్ష్యంతరస్థకనీనికముగ
నల మహోదధి వలయితాజాండ మెల్లఁ బాలనము సేయు నా పరబ్రహ్మ నెంతు. 79

చ. నవగతి విశ్వకావ్య రచనా పరికల్పనమందు పద్మసం
భవ సతియౌ సరస్వతిగ భాసిలి లోకకుటుంబ రక్షణా
ర్జవమున విష్ణుపత్నియయి రంజిలి భూతలయ క్రియార్భటిన్
శివసతియౌ భవానిని భజింతుఁ ద్రిమూర్తుల కాదికారిణిన్. 80

క. వ్యాసున్ మృగచర్మాసన భాసున్ విజనీలతను విభాజలదాను
ప్రాసున్ నిగమత్రయీ విలాసున్ మదిఁ గొల్తుఁ గవి కలా విన్యాసున్. 81

క. సకలాగమ నిగమోపాసకునిన్ భాగవత ఫలరసగ్రా సద్గా
యకునిన్ శుకునిన్ వ్యాసార్భకునిన్ నుతియింతు ఘోర భవతారకునిన్. 82

క. అని యిష్టదేవతా ప్రార్థనముం బొనరించి కవి వితానమ్మును గూ
ర్చి నమస్కరింపఁగాఁ దన మనమున నిటు లెంచు విగత మత్సరమతియై. 83

సీ. నవకావ్యవాణీ ప్రణయభోగి వాల్మీకి మహనాదికవి పితామహుఁడు గాఁడె
పంచమవేదమై పరఁగె వ్యాసుని కైత నరుఁడీతఁడన నెట్లు నాల్కవచ్చుఁ
గాళిదాసుని సొత్తుగా నయ్యె నుపమ యా కవి కుపమాన మీఁగలఁడెవండు
భవభూతి సకల మీ కవిపేరనే వెల్గె నీకైత కిదు మూల్య మిలనుగలదె

తే. బాణ మాఘహర్షమురారి భారవులను సమర జయదేవ దండి మహాకవులను
సరసగీర్వాణ వాక్సుధాధురుల ధరణి కిడిన గీర్వాణు లిఁక వారికెందు కొదువ. 84

ఉ. వ్యాస వినిర్మితంబయిన భారత సంహిత నాంధ్రభాషలో
వ్రాసి జగమ్ము లెల్లను సెబాసన భాసిలినావు భారతీ
శాసక నన్నపార్య ! శిరసావహియింతు త్వదంఘ్రినాకు నా
వ్యాసుని స్వాంత మర్థమగు పద్ధతిఁ జెప్పవయా దయామయా ! 85

చ. పలుకు లతాంగి మా తెలుఁగు పందిట మొగ్గదొడంగి వాడవా
డల కెగఁబ్రాఁకి బాసల మిటారుల యౌదల మేలుబంతియై
నిలిచెనఁటన్న నేఁటికిని నీయదె దీపము మాకు. మా కుల
మ్ముల కిలవేల్పు వీవె తొలిమ్రొక్కులు నీయవె నన్నయాగ్రణీ ! 86

చ. పిలిచినఁ బల్కు వాణి సుకవీ ! భవదీయ కృతాంధ్ర భారతా
మల నిలయాంగణాంచిత సుమప్రకరమ్ముల తేనెలూర నా
ప్రళయసముద్ర వీచికలపై నెమరీఁతల నీఁది యెయ్యెడన్
నిలిచెడి కావ్యరాజమన నీయదె తిక్కకవీంద్రరాణ్మణీ ! 87

ఉ. కలిగె నెవండు మా తెలుఁగు గడ్డన విశ్వకవీంద్రుఁ డన్న నిన్
దొలి వచియించి వేఱొక మనుష్యుని జెప్పఁగ నొప్పుఁ గావ్య క
ర్తలకు మహత్తరాంధ్ర వసుధాస్థలి నన్నముఁ బెట్టిపోయినా
వలఘుమనీష ! మా కులము కంతకుఁ బెత్తల వీవె తిక్కనా ! 88

ఉ. వాగనుశాసనుండు బుధవంద్యుఁడు నన్నయ యాంధ్రభారతో
పాగత కావ్యసృష్టి చతురాననుఁ డయ్యెను దిక్కసూరియున్
బాగుగఁబెంచి విష్ణువయి భాసిలెదాని ముగించుపట్ల నీ
వీగతి సత్ప్రబంధ పరమేశ్వర రూపుఁడవైతి వెఱ్ఱనా ! 89

ఉ. తల్లి యఁటంచుఁ దిక్కకవితాప్రసది మ్రొగ్గెను దెన్గువంకకే
తొల్లిటి దేవభాషయిలుదోఁచి తెనుంగున నింపె నన్నభ
ట్టల్లితి వీవు సంస్కృతము నచ్చు తెనుంగు సమాంశమెత్తి మేల్
మల్లెలు మొల్లలున్ బొదిగి మాలికఁగూర్చెడి కైత నెఱ్ఱనా ! 90

మ. విమలంబైన భవత్కవిత్వరస వాక్పీయూషపేయ ప్రవా
హము లా మూఁడును జోడుగోడె లటు సౌహార్దమ్ముతో నొక్క ది
క్కు మహైక్యమ్మయిపోయె భారత కథాక్షోణిన్ త్రివేణీ సమా
గమతీర్థమ్మయి మాకు నిత్యము నమస్కారైక యోగ్యమ్ముగాన్. 91

చ. తెలుఁగు పఠించువాఁ డతఁడు దేవుఁడైనను నమ్ము నిత్యమున్
దలఁచుకొనన్వలెన్ బ్రతిదిన మ్ముదయమ్మున లేచి కొన్నితే
పలు తమ భవ్యభారత ప్రబంధసుధారస మొంటఁబట్ట మ్రో
డులను జిగిర్చి సత్కళలెటుల్ వెదజల్లవు కావ్యసీమలన్. 92

మ. ఇలపై మీవలె నాంధ్రభారతము వేరెవ్వారలున్ జేయఁగాఁ
దలఁపన్ జీవితకాల మంతయుఁ బ్రయత్నం బెంతొ కావించుచున్
దలక్రిందుల్ దపమున్ బొనర్ప నొక పద్యంబే నిటుల్ వ్రాయుటల్
కలలో వార్త వృథాశ్రమ మ్మటుల సంకల్పించు రెవ్వారికేన్. 93

తే. అల త్రిమూర్తు లేకమ్ముగా నవనియందు వ్యాసభగవాను నంతటివాఁడు బుట్టి
భారత మొనర్చెనదె తెన్గులో రచింప మూఁడు జన్మములెత్తె నా ముసలి తపసి. 94

తే. విరత మీకాలనిర్ఝరిణీ తరంగ గర్భముల జీర్ణమొందు లోకమ్ములెల్ల
సతత జగదతీతాక్షరాకృతిని దాల్చు కవివరుఁ డొకండె యెదురీఁదఁగలడు దీవి. 95

మ. కవి గంటమ్మన నాకలోక పరిషద్గాంగేయ సౌధంపు శం
కువుఁ గంబమ్మనఁ బోలదే యతని సూక్తుల్ వెల్గు సత్తాళప
త్రవితానమ్ములు దేవపీఠమునుజేరన్ స్వర్ణసోపానముల్
సవరించున్ గదె యాతఁ డివ్యసుధపై సాధించు స్వర్లోకముల్. 96

సీ. చనుబాల ధారయై మనుమాతృ నిర్మల ప్రేమలో సంజీవిభావ మరసి
రక్తోగ్రధారయై రగులు యోధాగ్రణి పాణిలో లయకాల పాశమరసి
కన్నీటిధారయై కరఁగు దుఃఖార్తుని నెదఁదలో బడబాగ్ని పొదలనరసి
ప్రణయాంబుధారయై మనుకాంత క్రేగంట బ్రహ్మాండ వృక్షంపు పాదులరసి

తే. సకల రసధారలున్ దన సహజ మధురసార కవితా నిరర్గళధారలోన
సంగమింపఁగా నమర నిర్ఝరిణివంటి ప్రతిభతోఁ గవి కావ్యకల్పకముఁ బెంచు. 97

చ. నవయువతీవిలోల నయనప్రసవస్మిత శోభఁ గ్రోలి దుః
ఖవికలు బాష్పవార్ధి పరికల్పిత వీచులఁ దేలి యా క్షుధా
ర్త వివశగర్భ గహ్వర విరూపతమమ్ములఁ దూలి యాడటన్
కవివరు ప్రాణవాయువులు గాన మొనర్చును గావ్యవేణువున్. 98

మ. సుకవీంద్రామృత వాక్య వర్షసరసస్రోతస్వినుల్ కావ్య ప
త్రికుటీరాంచితసీమఁ దేమనిడ లుప్తప్రాయ సామ్రాజ్య నా
యకవృత్తమ్ముల జీవము ల్మొలిచె వారాచంద్ర తారార్కమం
దకళంకోజ్జ్వల కీర్తి చంద్రికల మధ్యన్ దివ్యులై వెల్గఁగన్. 99

తే. కవి కరామృతస్పర్శను గను చరితలు మృతియె లేని శాశ్వత జీవయుతము లగును
కవికరామృత స్పర్శను గనని కథలు స్థితములయ్యును సంతతమృతము లగును. 100

ఉ. ఈ మహనీయకావ్య ఋషు లిచ్చిన సత్కృతిజాత తత్త్వపూ
ర్ణామల సాహితీ ధన మహత్వభరమ్ము శిరమ్మువంప నే
నేమిఁద లేనఁటంచు జతనెత్తిన నా దగు రిక్తహస్తముల్
తాము ప్రణామరూపతను దన్పను వీరి నఁటంచు నెంచెదన్. 101

శా. రామన్నట్టి మహాకవి ప్రవరులారా! మీదు క్రొంగబ్బముల్
గానన్నోఁచను దేహమస్థిర మిలా గర్భాన రత్నాల కిం
దేనాఁడున్ గలవున్నదే గుణికిఁదా మేలా వయోలింగముల్
యీ నా కావ్యముఖమ్మునన్ నతులు మీకే వేళ గావించెదన్. 102

ఉ. యోగివరేణ్య శ్రీశుక ముఖోజ్ఝితమై విలసిల్లు శ్రీ మహా
భాగవతమ్ము వేదసురపాదప ముక్తఫలమ్ము సుమ్మహో!
భాగవతాగ్రగణ్యులును భావుకులౌ రసికావతంసులే
త్రాగుదురెందుఁ దద్గతసుధారసముల్ భువి మోక్షకాములై. 103

సీ. భగవంతు నిత్యసంబంధమ్ము గలదౌట ప్రకృతి సర్వస్వమ్ము భాగవతము,
ఆత్మ యీ సకల భూతాంతరారాముఁడై రమియించువాఁ డౌట రాముఁ డతఁడె
వరరాగలయగతిన్ స్వరవిభేద పథాలఁ బలికెడి దీ విశ్వభాగవతమె
విశ్వభాగవతంపు వీణెతంత్రుల మీటి పలికించు నా రామభద్రుఁ డెందు
ఆ. నతఁడొకండె యంచు నద్వైతగతిఁ జాడి విడుపుఁ గనెద నింక వేఱొకండు
గలఁ డటంచు నన్యగాథల నల్లుచుఁ దెగని వలలఁదగిలి పొగులనేల? 104

ఉ. తా జగదాఖ్య భాగవత తత్త్వమెఱింగియుఁ బల్కుటబ్రహ్మా
భ్రాజితుఁడైన శూలికిని జానమగండగు తమ్మి చూలికిన్
బ్రాఁజదు వేని యేనిఁగని పల్కఁగ నోడునా యా రహస్యమున్
నే జతగూర్చెదన్ విబుధ నిశ్చితముల్ విని కన్న యంతలో. 105

క. అని నిజకృతిపతి యగు నా యినకుల భూషణుని స్వీయహృదయమ్మున భా
వన సేయ మోహనాకృతిఁగొని మును బ్రత్యక్షమయ్యె గోపాలుఁ డటన్. 106

ఉ. అంతనె వ్రాయు గంట మటులాఁపి తలంచును పోతనార్యుఁ డీ
వింత యిదేమి నాదయిన వీక్షణపంక్తులఁ దాండవించు వే
దాంత వినోది గోకులవిహారి, రఘూత్తముఁ డేడి? యెంత వే
వింత మనం గనంబడఁడు విస్మయమౌ నిదియేమి చిత్రమో, 107

తే. అనుచుఁ గుంద సత్కవి స్వప్నమందు నాదు జానకీజాని సనుదెంచి తా నిటులను
వగవనేటికి శ్రీ భాగవతపుఁ గృతిని నేనెవిందు దానికి నొక్క వియతిగలదు. 108

క. శ్రీరామాకృతి సీతాభామిని సొమ్మగుట నిట్టి భాగవతకృతిన్
మామక కృష్ణాకృతిఁగొను సోమస్థితి నిశివిబొంపు సూర్యార్చివలెన్. 109

మ. అని యా రామవిభుండు స్వప్నమునఁ దా నంతర్హితుండైన యం
తనె మేల్కాంచి హృదంతరాళమున మోదంబంది గంటమ్ము కే
లను గీలించి స్వకావ్య కన్యకకు లీలన్ గోపబాలున్ గృతీ
శుని గావించి వచించెఁ బోతకవియున్ సొంపారు షష్ఠ్యంతముల్. 110

క. వినువాఁడ నే ననుట నా యినకులవల్లభుని కృతిని నెసఁగెకి స్కంధా
దివి వంత్యమ్మున సంబోధనమును గావించి కృతిపథమ్మున నతపున్. 111

సీ. జలద మృదంగార్భటుల కమ్రప్రాసమౌ నెమిలిసాముల వింత నృత్యమెత్తి
గళసీమ నవరత్నముల సరుల్ దిగవైచి కులుకు గువ్వల బింకములు గడించి
గాంగవీచీమాలికల నుయ్యేలల నూఁగు రాజహంసల విహారములఁ దోఁచి
మత్తేభ డోలాయమానయానములోవి టీకుటాకుల రాచకీవి గెలిచి

తే. సురటిముత్యాల చెండ్ల మేల్పొగసు నగవు లోడికలు గట్టఁగా సుధలొలుకు తెలుఁగుఁ
బలుకుఁ జెలివైన యాయువుపట్టులేరి గోస్తనీపాకమున శైలి గుస్తరించె. 112

సీ. నింగి నల్లేద్పుచు విలువెల్ల నీరయి కరఁగిపోయెడు మేఘు కరుణ నెఱిఁగి
కడలిరౌద్రమున లోకము మ్రింగ నోర్జాఁపవచ్చు నుప్పెనల భీభత్సమెంచి
కనుమూఁతవడఁ దటిత్కరవాలములఁ ద్రిప్పి మింట గర్జిలు వీరమేఘు నరసి
యొడ్డు భూసతితలన్ గడ్డి నత్తలవైచి పొరలి నవ్వెడి కంధి నురువులఁగని

ఆ. యబ్ధిరాజు సంగమార్థియై యలచేతి సైగసేయ నదిప్రియుల నలము
చటు విటుం జనుచును నరుదెంచ సిగ్గిలురుదుల ప్రణయభావ సరణి నరసి. 113

క. శృంగారాదిక నవరస సంగతులన్ విశ్వగత రసస్ఫురిత కలా
భంగిమములం గ్రహించుచు సింగారించెన్ స్వకావ్య సీమంతవతిన్. 114

క. అతి సుప్రసిద్ధములు, వ్యాకృతి సమ్మతములును, జీవ కృత్స్నములు, రసో
చితి సఖములు, శ్రుతి సుఖములు వెతకకమును వచ్చిపడును వేల పదమ్ముల్. 115

శా. వాణీ దివ్యగళాభిశోభిత వట ద్వైదూర్యదామ ప్రభన్
వేణీ బద్ధశిరోజరాజిత చల స్నిగ్ధేజహారద్యుతిన్
శ్రోణీమండిత మేఖలామణి లసచ్ఛోభన్ సమాసాది వా
క్ఛ్రేణిన్ దీరిచి ముద్దు పద్దెముల సంసేవించు కావ్యాంగనన్. 116

సీ. కోలాటముల నాడుకొందు రచ్చరలు తా మతని యంత్యప్రాస గతులలోన
పుష్పవర్షములు గుప్పుదురు దేవతలు తా మతని సత్పద గుంభనారభటుల
నేడువారాల సొమ్ములఁ దాల్చును వాణి యతని వ్యంగ్యాద్యలం కృతులలోన
నఘమర్షణ స్నాన మాచరింపును విష్ణువతని భక్తి రసామృతాబ్ధిలోన
తే. నతని వేదాంత వీథులనరుగు నరుని దరిసి కనుగీఁటు ముక్తి కాంతాలలామ
యతని భాగవతాలయ మ్మతిథి తతికి విష్ణు కీర్తనామృతముతో విందు నిడును. 117

ఉ. ఆరయఁబంచదార చవు లద్దిన ముద్దు పదాల తేనియల్
గాఱు మనోజ్ఞభావములు గల్పిన పాకపు పాలమీఁగడల్
చేరలఁబంచు భక్తిరససింధువు, పోతనకైత యన్ననో
రూరదె ధాతకేనిఁ జెవి యొగ్గక తప్పునె వాని తాతకేన్ 118

తే. ఒక్కనాఁడేకతంబున నుండి భక్తిఁ బోతనార్యుఁడు భాగవతేతిహాస
మగు గజేంద్రమోక్షణ కథ ననువదింప నా గజేంద్రార్తి హరి విను టరయుచుండె. 119

మ. అల వైకుంఠపురమ్ములో నగరి నంచారంభమున్ జేసి యా
వల నావంతయుఁ దోఁపకున్కి యట నా పద్యమ్ముఁ జాలించి యే
కెలనన్ శ్రీవిభుఁడుండె నయ్యెగల నే కృత్యంబు గావించుచుం
డె లలిన్ జూడకచేయకే కరణివానిన్ వ్రాతునం చెంచుచున్. 120

తే. గ్రంథలేఖన మంతటఁ గట్టిపెట్టి మదికి నెమ్మదియైనను మఱల వ్రాతు
ననుచు వేకువ నభ్యాశమందెయున్న పల్లియకుఁ బోయెఁ దొందర పనినిగూర్చి. 121

క. మల్లన నైషధకావ్యము వల్లించుచుఁ బొలములందు వరిమళ్ళకు నీ
రెల్లపల మార్చి తొలిదెస నల్లనఁ గనుచుండె విస్మయావృతముఖుఁడై. 122

సీ. క్రతుధూమములమాఁగి కడు చెమర్చెడి మేన వెలిబూదిపూఁతలు పలుగు సూప
గోష్పాదపరిమితిన్ గొమరొందు సిగముడి విడివడి మెడలపై వ్రేలియాడ
వెడఁదవక్షమ్మున వెండితీవియ లట్లు మెఱుఁగు జన్నిదముల వరుసలొరయ
వస్త్రకచ్ఛమ్ముల పరిదీర్చి కట్టిన మడుఁగుదోవతి చెంగు కదలఁగ్రమ్మ
తే. కుశలు సమిధలు కట్టగాఁ గూర్చి కట్టి చంక నిఱికించి బ్రహ్మతేజంపుఁ గళలు
దాఁగక మొగమ్ముపై నట్టె తాండవింప దరియవచ్చెను భూసురవరుఁ డొకండు. 123

ఆ. వచ్చి తానమాడి ప్రాగ్దిశ నుదయింప నరయు భాస్కరునకు నర్ఘ్యమిడుచు
సంధ్యవార్చి వేదసంహిత చదువుచు నల్లనల్ల వచ్చి మల్లనఁ గని. 124

క. "బమ్మెర యిదియేనా? యిట నమ్మహనీయుండు పోతనామాత్యుఁడు క్షే
మమ్మే కద? యిత్తఱి సదనమ్మున యా సుకృతి దర్శనమ్మగునె?" యనన్. 125

ఉ. "భూసురరాణ్మణీ ! నిగమపూరణ ! జ్ఞానఖనీ ! నమస్సులన్
జేసెద వేనవేలు తమ సేవన మబ్బుట సుప్రభాత మీ
వాసరమే ప్రదేశము భవత్పద సంగతిఁ దీర్థరాజమై
భాసిలెఁ దావకాఖ్యఁగొని పావనమై మను నెట్టి వర్ణముల్." 126

చ. అనియెడి మల్లనార్యుని స్మితాంకుర సుందర చంద్రికాద్యుతుల్
తన కరుణాపయోంబు నిధులన్ గిలిగింతలువెట్ట భూసురుం
డనె నిటు "వత్స ! యేమగు మహాత్ముఁడు పోతన నీకు నిట్టి నీ
వినయ వివేక భాషణల విస్మయమందెడి డెంద మద్దిరా ! 127

క. విను రామశర్మ యందురు నను, వసతి యమోఘపురము నాఁబడు గ్రామ
మ్మనఘా ! నీ వాగ్వైఖరిఁ గనఁ బోతన కాత్మజుఁడవుగా మదిఁ దోఁచున్." 128

క. అన విని మల్లన బాడబుఁ గని మీ రెఱుఁగని దొకండు గలదే స్వామీ !
ఘనతర వేద సరస్వతి యను మాటలు నమృతమగుట లదియెటు పొసఁగున్." 129

క. మల్లన ద్విజవరు నింటికి నల్లనఁ గొనిపోయి లోని కరిగి బిరానన్
దల్లిని గని తద్విషయం బెల్లను వచియించె నెనక మెసఁగెడు ప్రీతిన్. 130

క. అన్నాతి విప్రవరునకు మన్ననమై మ్రొక్కి పలికె "మహనీయా ! మా
పున్నెమ్ము కలన యుష్మత్పన్నతపద మస్మదీయ సదనమునఁ బడెన్. 131

ఆ. మీదు దర్శనమున మీఁదయ్యె మా జన్మ ధన్యజీవులందు మాన్యచరిత !
యింట వారె యున్న నీవేళ నెంతగా సంతసించువారొ స్వాంతమందు. 132

ఉ. ప్రక్క వెలుంగునట్టి యొక పల్లియ కేగిరి నేఁడె వారు మీ
రిక్కడి కేగుదెంచుట లోకింత యెఱింగినఁజాలు వైళమే
చొక్కపు భక్తిమై నచటఁ జొప్పడు కార్యము విస్మరించి తా
మొక్క క్షణమ్ములో నడచి యూరును జేరఁగవత్తు రింతకున్." 133

చ. అనుటయు భూసురోత్తముఁ డహర్పతి తేజవిలాస భాసురా
ననమున స్మేర శారద నవాంబుజముల్ వికసింప నా సతిన్
గని యిటులాడె "నాతఁ దొక కార్యపరాయణ చింత మంది యా
పని యొనరింపకుండ నెటు వచ్చుటలౌను ? ఫలించఁ దత్కృతుల్. 134

శా. చేతో మోదమొసంగు నీ వినయ సౌశీల్యంబు శీతామృత
స్రోతస్సుల్ ప్రవహించు సాదరవచ స్తోమంబులున్ గాంచ నా
పోతన్నన్ గని నట్టులై యెదఁద యుప్పొంగున్ సతీ ! యింక మీ
యాతిథ్యంబున నేమి లోపమగు గేహశ్రీవి నీ వుండఁగన్. 135

తే. 'యావదమేత్, శ్రోత్రియస్స్యాన్న' మనిరి బుధులు నేఁటి దేవతార్చనము మీ నిలయమందుఁ
జేసికొని నా నివాసమ్ముఁ జేరఁబోదు" ననుట లాసాధ్వి విప్రున కనియె నిట్లు. 136

తే. "వేగఁ బిల్లల కన్నాలు పెట్టి యిపుడె తాన మొనరించి మడుగు నుదాల్తు తమదు
దేవతార్చన యగునంత దిగును వంట" యనినఁ "దొందరేమియును లే"దనె ద్విజుండు.

ఉ. గిల్లినయంతఁ బాల్గారియు గింజల లేఁతని మొక్కయెన్నులన్
వెల్లని నూఁగువోని పువుపీదని పందిరి దోసపిండెలున్
మల్లెను విప్పుచున్ గనుల ముందర నిల్చిన చిట్టిబొట్టి యా
పిల్లలఁ బిల్చి యిప్పుడను బ్రేముడి వారిని గారవించుచున్. 138

చ. చెఱువున కేగి స్నానమును జేసి పదంపడి సంధ్యవార్చి మం
దిరమును జేరి శ్రద్ధమెయి నేమము దప్పక వైశ్వదేవమున్
జరిపి కుశేంధనాది మఖ సాధన సంతతి గట్టిపెట్టి యా
శ్వర వర దేవతార్చనము భక్త్యనురక్తి నొనర్ప నేగుటల్. 139

చ. కనఁబడెఁ దాళపత్రి పరికల్పితకోశ మొకండు దేవతా
ర్చన కడఁ బ్రక్కఁ జెక్కఁబడు చక్కని గంటముతోడ దానిఁ గ
న్గొని "యిది యే ప్రబంధ మొక కొంచెము దీనిని నేఁ బఠింపవ
చ్చునె?" యని విప్రవర్యుఁ డటఁ జొప్పడు మల్లనఁ గోర నాతఁడున్. 140

క. "అది యాంధ్ర భాగవతమో, సదయా! యద్దాని మాదు జనకులు బుధ స
మ్మద మొదవ రచనసేసెను సదమలమతిఁ గృతిని రామచంద్రున కిడియెన్. 141

ఉ. ఇంక వచింపనేల యొకయింతక దేవర దృష్టియే పడన్
సంకునఁ బోయు తీర్థమయి శంకలు వంకలు దీటి శారదై
ణాంక వినిష్కళంక ధవళాయిత పూర్ణకళా విలాస శో
భాంకితమౌచు దోషరహితాకృతి నీ కృతి తేజరిల్లదే!" 142

వ. అనుచు వచించి, 143

క. "ఇందుధర పూజనము సేయందగు ఘనసార కుంకుమార్ద్ర హరిద్రా
చందన కుసుమ దళాక్షత సందోహముఁ దెత్తు"ననుచుఁ జనె మల్లనయున్, 144

చ. చనఁగనె గ్రంథరాజమును జప్పున విప్పి పఠించి యేదొ క
మ్మన నొకయింత వ్రాసి తొలిమాదిరి దానిని గట్టిపెట్టి పూ
జనము నొనర్చి తీర్థముఁ బ్రసాదము సాదరమొప్ప నింటిలో
జనమున కిచ్చి భోజనము సల్ప నుపస్థితుఁడైన యత్తఱిన్.	145

తే. "ప్రొద్దుపోయెను దమరి కీ పూట భోజనమున" కనుచు వచించె నన్నాతిమిన్న,
"యెటులు పిల్లలుగల యింట నింతకంటెఁ బ్రొద్దుటన్ వంట యగు"నంచు భూసురుండు.

క. పిల్లలతో వేఁగించుచు నిల్లెఁడు పనిజేసి పోపి యిటులీ పాకం
బెల్లను క్షణమునఁ జేసితి తల్లీ! నీ యోర్మి యతులితంబనఁ జెల్లున్. 147

చ. సదమలచిత్తుఁ డంచిత ప్రసన్న వచస్కుఁ డపేనుఁ డాత్మకో
విదుఁడు విశుద్ధవర్తనుఁడు విష్ణుపదాంఘ్రి సరోజమగ్న ష
ట్పద హృదయుండు దారుఁడును బండితకల్ప మహీరుహంబు నాఁ
గఁ దనరు పోతరాజతని కాంతగఁ బుట్టుట కెంత నోచితో. 148

చ. కడుపు ఫలించె, సజ్జనుఁడు కాంతుఁడు చిక్కెను గల్గి నంతలోఁ
బిడికెఁడు సాద మెక్కరికిఁ బెట్టఁగ నోఁచితి వంతె చాలు నె
క్కుఁడు విభవమ్ము గల్గియును గోటికినిం బడగెత్తి పిల్లికిన్
బిడుచను వేయరా పిసిని పీన్గుల సొమ్ము విషమ్ము గాదొకో! 149

ఉ. ప్రాఁతి రహించు నా సహజ పాండితి నంచిత రామభక్తితోఁ
బోతన యీశ్వరాంశ మనఁబోలును నీవును నన్నపూర్ణవై
యాతని వెంట వచ్చితి వహో! యతిథుల్ తమ యింటి వాఁకిటన్
జేతులు గట్టువారి నభిషేకములన్ గొనుఁ గల్పవృక్షముల్. 150

క. పాతక ఘనౌఘ ఝంఝూవాతము సంసారఘోర వనధి గతజన
వ్రాతోద్ధారక గురు గుణ పోతము విను మతిథి వితతి పూజన మంబా! 151

ఉ. తా నుపవాస ముండియు క్షుధా పరితప్తున కాతిథేయమే
మానవుఁ డిచ్చు నీశ్వర సమానుఁ డతండన, నా క్షుధార్చిలో
దానవకర్మ కానన వితానము దగ్ధము గాఁగ దేవసం
తానము హవ్యభాగ పరితర్పితమై కొనదే నివాళులన్. 152

క. మిన్నక యభ్యాగతు లెట మన్ననలం గొనుచుఁ దృప్తి మసలెద రంబా!
యన్నము బెట్ట కెపుడు కలవన్నదియే యుండదట్టి యాలయమందున్. 153

తే. అతిథి మధుకర వితతియే హస్తకమల మంటి మాధుకరామృతం బానుచుండుఁ
దత్కరాంబుజ మధుమయ ధామమందుఁ గమల నిలయతా నిజమందిరములఁ దీర్చు. 154

క. నీయట్టి గేస్తురాండ్రకుఁ గాయముగల ఫలిత మతిథిగణ పూజనమే
శ్రేయస్కర మిద్దియె నిశ్శ్రేయసకర మిదియె యేమి చెప్పుదుఁ దల్లీ! 155

ఆ. నీదు చేతి వంట నిజముగా నమృతోపమానమగుచు నీదు మాన్యతవలె
మఱవరాని రుచిని మనియె నమ్మా!"యని భోజనమ్మొనర్చె భూసురుండు. 156

వ. అంత నా సాధ్వీలలామంబు, దివ్యతేజోభాసురుండగు నా భూసురున్ గని. 157

ఆ. "వారు నేఁటిరాత్రి వఱకుఁ దప్పక వత్తు రుండి దర్శనమ్ము నొసఁగుఁ"డనిన
"నటు వచింపఁబోకుమని ప్రయాణాయత్తుఁడైన విప్రుఁ గాంచి యతిప పల్కె. 158

ఉ. "ఇంట భవాదృశుల్ గురువు లెవ్విధి పాదము నుంత్రు పున్నెముల్
పంటలుపండె మా నుదుటి భాగ్యము నిండి వెలుంగుచుండె మా
కంటికిఁ గాన వచ్చెడి జగత్పతి తేజులుగారె మీరు, మీ
వంటి మహాత్ములన్ గన భవమ్ములివమ్మటు లాఱిపోవొకో! 159

ఉ. ఇంకొకపూటఁ దాము వసియించినమే"లని పల్కెనా మె "యో
పంకజనేత్రి! పోవలె నవశ్యముగా" నవె విప్రుఁ, డింతి యే
ణాంక మనోహరాస్యమపు డన్నయొ తండ్రియొ యేఁగుచున్నటుల్
సంకటమొందు గుండియకు సాక్ష్యమొసంగఁగఁ "బోయిరం" డనెన్. 160

ఉ. భూసురుఁ డేగె వేకువనె పోతన తా నిలుజేరి స్నానముఁ
జేసె స్వదేవతార్చనముఁ జేయుటకై చన గ్రంథ మెవ్వరో
తీసిన యట్టులుండె నిది దీసిరె వారని కాంచఁ బూర్తిగా
వ్రాసి కనంబడెఁ దనదు భావనకందని పద్యపాదముల్. 161

క, మల్లనను బిలిచి "పద్యము నల్లిన వారెవరు పూర్తియయ్యె నదెట్టుల్
తెల్లముసేయుమి"యన నతఁ డల్లన భూసురుని విషయ మఖిలముఁ దెల్పెఁ. 162

క. తెలిపిన నానందాశ్రులు జలజల ప్రవహింప హర్షసంగత రోమాం
చల సత్తను సంగతి నిశ్చలవృత్తి న్నిలిచి మానసమునఁ దలంచెన్. 163

ఆ రామశర్మ యంట నామ, మా వాసము ధరణిలో నయోధ్యపురవరమఁట
తానె యగుచు నిట్టు లానవాల్నుడివిన నింక నాదు మదికి శంకయేల? 164

సీ. కానలో నలదిక్కు లేనట్టి పక్షికి దహనసంస్కార విధమ్ము నెఱపి
పాపభూత భయార్తి బండబాఱిన నాతి నాత్మీయ పదధూళి నలఁదిలేపి
కులముదక్కువ కూడుఁ గుడుచు సెట్లనకుండ రేఁగుబండ్లకె ముక్తి భోగమిమ్మి
సాటి సామంతుఁడు మేటిచుట్టము కాని మునిబోయతో నిజభుజము గల్పి

తే. పక్షిఋక్ష చికోత్రిడాది ప్రాణికోటి నరులు వానరులనక సోదరులవోలెఁ
గనెడి నీ ప్రేమమది క్రొత్తగాదు నాకు రాజితదయాసముద్ర! శ్రీరామభద్ర! 165

తే. భిన్నమగు వజ్రమున వజ్ర మన్నయటులు నీదు పదపద్మరజమున నాదు రజము
పాయు ననుటకు నా మునిపత్నిసాక్షి యనుచుఁ దత్పరగతధూళి నలఁదుఁదలను, 166

ఉ. ధన్యులు మత్సతీసుతులు తారకనాముని రాము నిట్లు సా
మాన్య నరాకృతిన్ గని యమర్త్యత నొందిరి మద్గృహమ్ము స

మ్మాన్యత(గాంచె నా మహితుమంజు పదాంబురుహాల్పపాంసు సౌ
జన్యమునన్ మదుగ్రభవ సాగర శోషణముఁ బొనర్చుటన్. 167

మ. మును ధ్యానమ్మున క్షత్రియాకృతిని నా మున్ వైశ్యరూపమ్ము నా
వెనుకఁ శూద్ర దరిద్ర శూద్రవపువుఁ వీక్షింప(గా(జేసి నా
వనఘా ! బ్రాహ్మణవేష మిత్తఱిని ప్రత్యక్షంబు గావింప నీ
తనువౌ నాలుగు వర్ణముల్ పురుషసూక్త ప్రక్రియన్ గాంచితిఁ. 168

మ. భవమున్ బాప(గ నాది నీదు ముఖలావణ్యంబు సేవించి బా
హువులఁ బూజనొనర్ప హస్తముల కర్ఘ్యోదక్రియఁ సల్పి యూ
రువులన్ సన్మణి పీఠవాటికల నారోహింప(గా(జేసి పా
దవరాబ్జమ్ముల( గూర్చి మ్రొక్కకయెటుల్ త్వత్పూజ పూర్ణమ్మగున్. 169

మ. "అల వైకుంఠపురమ్ములో నగరిలో నామూల సౌధమ్ము దా
పల మందార వనాంతరామృతసరః ప్రాంతేందు కాంతో పలో
త్పల పర్యంకరమా వినోదియగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము పాహి పాహి యన(గుయ్యాలించి సంరంభియై.'' 170

మ. అను నా పద్య పదమ్ములన్ హరి పదాబ్జాభాసమున్ సల్పి గా
యనతఁ బాడుచు( గండ్ల కద్దుకొని భక్త్యావేశసమ్మగ్న చే
తను(డై బాహ్యప్రపంచముఁ మఱచి సోత్కంఠతన్ స్రవద్బాష్ప పూ
రనిపాతోష్ణ జలాభిషేకముల నారాధించువానిఁ దమిఁ. 171

క. అద్దిర శ్రీహరి విరచిత పద్దియమిది యనును దాళపత్రము గొనుచున్
ముద్దిడుకొను గనుదమ్ముల నద్దుకొనున్ మౌళి(దాల్చు నలముకొను నెదఁ. 172

తే. సతత బాష్పావరుద్ధదర్శనము గదుర( గనులు దుడుచుచు( జదువు నక్షరమొ పదమొ
తన్మయానందము గళమ్ము( దట్టిపట్ట బాష్పగద్గదస్వన మొప్ప( బఠనముడుగు. 173

సీ. ఒగినక్షర మ్మొక్కటొకటె యీ రచనలో నక్షరాకృతి రహస్యమ్ము( దెల్పు(
బద మొక్కటొక్కటి పరికింప నియ్యది పరమపదావాస పథము( జూపు
నర్థమీకృతి( బరమార్థమ్ము బోధించు భావమెంచ మహానుభావత నిడు
రసము లీ కవిత నారసిచూడ(గా దయార్ద్రిత 'రసోవైస నారాయణ' యను

తే. పద్యమిది తాను బ్రహ్మనవద్యమైన నిత్య సత్య స్వరూపసాన్నిధ్య మిడును.
ఆర్తరక్షణ కీ ధ్వని యన్వయించు వాస్తవమ్మిద్ది హరి చేతి వ్రా(తయగుట. 174

తే. రూఢి నిట్లు జ్ఞానానందరూపు(డవయి భాగవత కృతికై కోరవలెనె నన్ను ?
అంతలోనె నీ పెత్తనమ్మరుగ( గలదె ? నమిత ఫలశాఖలఁ దరూన్నతియడ(గునె? 175

తే. ఎంతవాఁడును దావకాహేతుక దయఁబడయకున్న నీ కృతివ్రాయ పాత్రుఁ డగునె
వాయుదేవతావ్యాజ కృపాప్రసరణ లేక యగ్నితానై వెల్గునే కరణిని ? 176

ఆ. సుతుని యేడ్పు చెవినిసోక సుత్తలమొంది గృహము బయటకుఱుకు గేస్తువోలెఁ
గలవ పాన్పుడిగ్గి కరిచెంత కున్నట్లు వ్రాలిపడవె నీవు వనజనయన ! 177

ఆ. ఇట్టు లఱుకుచుంటి రేమయ్యెనని యడ్గు భార్య కెఱుకసెప్ప వ్యవధిలేక
బాహ్యజగతి మఱచి పడిపోయె విడిపోయె ననుచుఁ జనెడి కరుణ కవధిగలదె. 178

ఉ. పోతన యీ తెఱంగు తలపోయుచునుండెను లోకు లెల్లరీ
నూతన వార్త నారసియనూన ముదంబుధి మున్గి విస్మయో
పేతమనస్కులై సుకవి వీరునిగాంచి నమస్కరించి "యో
పూత చరిత్ర ! శ్రీశుకులుఁ బుట్టిరిగాదె భవత్స్వరూపతన్. 179

ఉ. తావక దర్శనమ్మొదవ ధన్యములయ్యెను మాదు జన్మముల్
శ్రీవిభుఁ దేగుదెంచి విరచించె భవత్కృత పద్యశేష మా
హా ! వినవయ్యె నే కనఁగనయ్యెనె యీ కృతిముందు నెందు నా
పావన పద్యపాదముల భాగవతమ్మది వేదమై మనెన్. 180

ఉ. ఆ రమణీయ గేయరచ నావసరంబెటఁ గల్గె వ్రాయఁగా
నేరని తీరులెయ్య విఫణిప్రముఖ ప్రతిభావిశేష వి
స్ఫారమనీషలౌ సుకవి చంద్రులకున్, ద్విజరూపమూని యా
శ్రీరమణీ విభుండు విరచించిన పద్య పదమ్మెదో యనన్. 181

ఉ. వారలనున్న వేరి యిటువల్కెను "భాగవతాంతరస్థ గా
ధారచనా విశేషము శ్రుతమ్మొనరింతును నీ కఁటంచు మున్
మీరు వచింపరే సొబగుమీఱఁగ హర్యవతార సత్కథా
సారము లానతిచ్చి యఘసంహతులన్ దునుమాడరే సుధీ !" 182

వ. అనుటయు నప్పోతనార్యుండా బేహారిన్గని యిట్లనియె. 183

క. నవరసభరితమ్మగు మా భవగుణ గానామృతమ్ము ధర నెల్లరకున్
భవరోగహరము చిత్తశ్రవణ సుఖాకరము శుభకరము సుందరమున్. 184

క. శక్తికి లొంగక శాస్త్రపు యుక్తికిని నతీతుఁడగుచు నుండు నృహరి తా
భక్తికి వశుఁడై శాశ్వత ముక్తిప్రదుఁడై వెలుంగు ముందుఁ జెలంగున్. 185

సీ. పెరయింతి దరి నున్న బిడ్డ మాతను గాంచి కైసాచి యేడ్చెడి కాంక్ష భక్తి
పదసేవ యొసఁగి నా పతి దయన్నను జూచు టెపుడను విరహిణి యేడ్పు భక్తి
దారితప్పిన బాటసారి యూరున్ జేరఁ బడియెడి తహతహపాటు భక్తి
బంధితుం డల యాత్మబంధువున్ గని స్వీయ ముక్తికై యేడ్చు నాసక్తి భక్తి

ఆ. ముక్తికాంత భోగమునకు సర్వస్వము త్యాగమొసఁగు ప్రేమధనము భక్తి
శౌరి రూపశీల సమితి నవిచ్ఛిన్న తైలధార వంటి తలఁపు భక్తి. 186

ఆ. అఖిల భుక్తములను హరియించు జఠరాగ్ని యటులు పుణ్య పాప హతినొనర్చి
యంబు భేదము దుపసన్ధిఁ జేర్చెడి గంగ వడువు హరి సమైక్య మిడును భక్తి. 187

క. మేదిని సనాథ యగు నున్మాదత నాడెదరు సురలు నాకస్థితులై
మోదింతురు పితరులు భక్తోదయమైనంత హరికి నుత్సవ మొదవున్. 188

తే విత్తరూప విద్యాకుల భేదముడిగి ముక్తసంగులై చరియించు భక్తపరుల
నాశ్రయించెడివాఁడుకా కన్యుఁ డెవఁడు కలిని భవవార్ధి తరియింపఁగలఁడు తలఁప. 189

తే. కులము తరియించుఁ బూతయై యిల వెలుంగుఁ దీర్థములు సుతీర్థములయి తేజరిల్లు
శాస్త్రములును సచ్ఛాస్త్ర ప్రశస్తిగాంచు భక్తజనన సంస్పర్శన భాషణముల. 190

క. వాదమ్ము లుడిగి మూకాస్వాదన గతి హరిగుణానుభవ పీయూషో
న్మాదుండై యేకాంత వినోదత నగు నేడ్చు వాకొనున్ దనుదానే. 191

ఆ. ఔరసుఁడని విధికి నామ్నాయ ధన మిచ్చె సతి యఁటంచు రమకు స్వాంత మొసఁగె
నైననేమి భక్తుఁ డార్తుఁడై పిల్చిన వీరి విడిచి పుచ్చి వెడలివచ్చె. 192

క. ఆ కథ వినిపించెద మీ రాకర్ణింపుఁడు గజేంద్రుఁడను భక్తునకున్
శ్రీకర మోక్ష సుఖమ్మును నేకరణి నొసంగె మకరి నెటు తెగటార్చెన్. 193

వ. అని యిట్లు పోతనార్యుండు భాగవత కథాసారంబును తోరంబుగ వినిపించుచు, 194

శా. దారిద్ర్యంబులు వెంటనంటి తరుమన్ దర్పోద్ధతిన్ క్షామముల్
శ్రీరాజత్కృషి లబ్ధ సస్య ఫలరాశిన్ బొట్టబెట్టన్ సదా
భారంబెల్లను జానకీరమణు శ్రీపాదమ్ములం బెట్టి సం
సారమ్మెట్టులైన భాగవత భాషాయోష నర్చించుచున్. 195

సీ. వ్యాసాశయములకు వ్యాఖ్యానమో యన రసవదర్థమ్ము లింపొసఁగ గూర్చు
బాదరాయణి సూత్రభాష్యమ్ములో యనఁ దత్త్వ రహస్యార్థ తతి వచించు
సాత్యవతేయు భాషాయోష భూషనాన్ వరలి మూలమునకు వన్నెబెట్టుఁ
బారాశరి గ్రంథ సారసర్వస్వమో యన నిగమాంత బోధన మొనర్చు

తే. దలఁప ద్వైపాయన శుకావతారము లన భక్తిభావ రసావేశ పథములందు
మూలమును మించి వర్ణించి ముందు జనుచుఁ బోతనాంధ్రానువాదముల్ మోదమొసఁగు.

క. అనితర సాధ్య రసోన్మజ్జనమున మే న్మఱచి యితర జగతి మఱచుచున్
ఘన కావ్యానందముతో ననిమిష పురిఁ గావ్యధరణి నమరుచుచుండున్. 197

మ. కవిచంద్రుం డొకనాఁడు తాను దశమ స్కంధమ్మునన్ రుక్మిణీ
నవ లావణ్య వయోవిలాసముల విన్నాణంబుగా వర్ణనల్
చవు లూరం బొనరింప బాల కమరెన్ సత్కేశ బంధమ్మటం
చు వచించెన్ సుకవీంద్రు బాల కమరెన్ జోద్యమ్ములై తోఁచఁగన్. 198

తే. బాల కమరె నఁటంచును బల్కె సుకవి బాల కమరె నిక్కమె యని బాధపడుచు
నతని సతి వచ్చె నేమయ్యెననె కవీంద్రుఁ డంతఁ దనయను జూపి యిట్లనియె నామె. 199

తే. ఆఁకటికినయి తినుట కేమైన నొసఁగుమనుచు మారాము నొనరించె నాత్మజాత
యేమియును లేవనఁ గనెద నిష్టపడమి దాని మఱపించుటకు నయి దలఁచి నేను. 200

తే. మీదు నాయనగారు రుక్మిణీ వివాహ కథను వినిపించుచుండిరి కాంక్ష నీవు
దాని వినుము నీకును ముందుఁ దగినవరుఁడు దొరకి త్వరగం బరిణయమ్ము జరగునంటి.

వ. అనుటయు లజ్జావనత దరహసితవదన యగుచు మూఁపు నుండి మునుజాఱు పయ్యెంట ముంగేలనంటి వెనుకకుఁ దిగిచి సవరించుకొని, 202

శా. అమ్మా : యన్ని యబద్ధముల్ వలుకుదీవా పెండ్లి నా పెండ్లిఁ దా
నెమ్మాడ్కిన్ బొనరించు దీని వినువారెవ్వార లేనేగతిన్
నమ్మంజాలుదురంచుఁ బల్కెఁ దన వెన్కన్ గ్రాలు పెన్గుంపటిన్
నెమ్మేనన్ ధరియించు చీరచెఱఁ గగ్నిన్ గాలుచున్ గాలికిన్. 203

క. రగులుకొనె మంటకొడిమైఁ దగిలిన నమ్మా యటంచుఁ దా నార్చెను నే
దిగులొంది కంటి, నిలువున నెగసిన పెనుమంటఁ దవిలి యేడ్చెడి తనయన్. 204

ఉ. కాంచినవెంటనే యుఱికి కాలెడి వస్త్రము నేలరాచి ధై
ర్యాంచితవృత్తి మంటగమి నార్పితి నేర్పుగ నంతలోనె చే
లాంచలమెల్ల దగ్ధమయి యాత్మజకున్ మెయి బొబ్బలెక్కె నే
గాంచఁగలేక క్షౌద్రమును గాయముపై వెసఁ బూసి నెంచితిన్. 205

క. తేనెఁ గొనితేర నే గదిలోనికిఁ జనియుంటి నంతలో నాత్మజయున్
మైనొదవు మంటకోర్వక పానీయాంబువుల దగ్ధపార్శ్వముఁ దడిపెన్. 206

తే. మాక్షికముఁ గొనివచ్చి యాత్మజ ముఖమ్ముఁ గాంచితిన్ మేనఁ జలువలు గ్రమ్మ దేహ
విస్మృతినిగొని పడియుండె వెజ్జ నొకనిఁ ద్వరగఁ బిలిపింపుఁడని యఱ్ఱిలురలఁ బల్కె.

తే. పతియునపుడె వైద్యులఁ బిల్వఁ బంచెవారు క్రిమత వివిధౌషధోపచారము లొనర్చి
వేఁడి జనియింపమిన్ గృషి విఫలమగుటఁ గాంచి మౌనత నిట్టూర్పునించి రంత. 208

తే. అచట నర్ధిశల్ మౌనమ్ము లలముకొనియె మోములెల్ల విషాదాబ్ధి మునిఁగియుండెఁ
బ్రతినిముస మేమొయను పెనుభయము హెచ్చెవెజ్జగమి నాడి నరయుచు వెడలఁదొడఁగె.

ఉ. వారిటు లేఁగుటల్ దలఁచి వారిజనేత్రియు నన్ను బిడ్డకున్
దూర మొనర్తురే యనుచు దుఃఖము నాఁపుకొనంగలేక మై
తోరముగా వడంక వెతతో సుతమోమున మోముఁ జేర్చుచున్
బోరున నేడ్చె నన్విడిచిపోదువె నా చిటితల్లి యంచుఁ దాన్. 210

తే. పోతనార్యుఁడు సతినేడ్వఁబోకు మనుచు బిట్టువారించి ధృతి చిక్కఁబట్టుకొనుచు
వగవకుము శౌరి మనకిట్టి వంతలిడునె వాని కల్యాణకథ లేను వ్రాయువేళ. 211

మ. నరుఁ డీ సంసరణాపదంబునిధి మున్కల్ వేయుచున్నప్పు డా
హరి స్మర్తవ్యుఁడటండ్రు ప్రాజ్ఞులిటు దుఃఖాంభోనిధిన్ మున్గి వం
దుర నాకేటికె వాని సచ్చరణ భక్తున్ వీతిహోత్రిజ్వలత్
కరముల్ తోఁకను దాఁక వా దొరయె నా కాపయ్యెనంచున్ మతిన్. 212

చ. కలఁతలుమాని సత్కవిశిఖామణి న్యస్తభరాత్ముఁడై సుని
శ్చలగతి రుక్మిణీరమణి చారుతరాకృతులన్ రచించుచో
నెలఁతకు జవ్వనమ్ము కడు నిండి వెలింగెనటంచుఁ బల్కెఁ, ద
త్కులసతి ప్రాణముల్ తనయకున్ గడు నిండి వెలింగెనం చొగిన్. 213

ఆ. కనులు విచ్చి బిడ్డ కాంచె వేడిన్ గూడెఁ దనువు నదిగొ యమ్మ యనుచుఁ బల్కె
నా తపమ్ము పండె నా భాగ్య మిటులుండె రెండవ జనువయ్యె గండమేఁగె. 214

ఆ. ఇట్లు మీదు కవిత లీ బిడ్డ సుఖదుఃఖ గతుల కన్వయించు కత మదేమి
యనెడి సతిని గాంచి యానందపరవశుఁడగుచు సుకవి యిట్టు లనఁదొడంగె. 215

క. హరి కల్యాణమె యివ్విధి నరుకల్యాణమ్మటంచు నమ్మించుటకై
హరి యిట్లొనరిచె జేలా! హరియే నరమానసాంతరాత్మ యగుటచే. 216

క. హరి కల్యాణము వినునెడ నరుకల్యాణమగు ననఁగ నా కూఁతురె తాఁ
బరమాదర్శమ్మని తన గరితను రుక్మిణీ వివాహ కథ వినుమనియెన్. 217

వ. అన నవ్వనితయు కీరసందేశమను కథ యిదియే కదా యనుచు ఘనభక్తి వెలయ విన
నుత్సహింప, కవికుల తిలకుడు పోతన నుడువం దొడంగు. 218

## ఆశ్వాసాంతము

క. అనుచిత కామ విదూరా! అనన్య సామాన్యబల మహాహవ శూరా!
ఘనతర నైగమసారా! మనోజ్ఞరూప జితమార! మహిత విచారా! 219

ఉ. శ్రీరమణీ మణిప్రణయ చిత్తసరోరుహభృంగ! మారవి
స్ఫార ధనుర్విముక్త శతపత్రి ప్రవర్షదపాంగ! భక్తికా

పాక నిమగ్నచిత్త నిజభక్తవరేక్షణ చాతకోల్లస
న్నీరద సుందరాంగ ! రమణీయ దయాబ్ధితరంగ ! రాఘవా ! 220

మాలిని

శమిత విబుధ భారా ! సర్వ వేదార్థసారా !
దమిత కుమత వీరా ! ధర్మశాస్త్రావతారా !
భ్రమగుణవి వివారా ! భక్తమాయా విదూరా !
సుమనస సుకుమారా ! సోల్లి సద్వజ్రసారా ! 221

గద్యము

శ్రీమద్భరద్వాజగోత్ర పవిత్రాపస్తంబసూత్ర, ప్రథిత సూరిజనమిత్ర, బక్కయ్యశాస్త్రిపుత్ర
వాగీశ్వరీ సమాసాదిత, వైదేహీవర నివేదిత సరసకవితావిలాస, సహజ
పాండిత్యభాస, వరకవి విధేయ, 'వరదార్య నామధేయ ప్రణీతం
బైన పోతన చరిత్రమను మహాప్రబంధమ్మునందు
షష్ఠాశ్వాసము.



శ్రీరస్తు.

శ్రీ వాగీశ్వర్యై నమః




## కృత్యపహరణము - వరాహకృత కృతి సంరక్షణము

"నహి కల్యాణ కృత్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి"



కర! రిపు భీకర! వర
సాకేతపురీశ! లోక సంకట నాశా!
ప్రాకట వైభవ జిత సుర
లోకేశా! వికచ కమలలోచన రామా! 1

గీ. అపహృతాంధ్ర భాగవత కోశావనంబు శ్రీ వరాహావతార సంసేవనంబు
అఖిల సౌఖ్య సంతోష శుభావహంబు వినవె యీ కృతిఁ శ్రీరామ! విమల ధామ! 2

చ. ప్రకృతి లతాంగి మిత్రు నెడఁబాయుట కోర్వక మూర్ఛనొందె నా
తికనులఁ జీఁకటుల్వొడమెఁ దిన్నగ నా యమ సేవదేర్ప మం
చుకణము జల్లుచుఁ విసరఁజొచ్చెను శీతలమందమారుత
ప్రకరము నా యుషస్సతి ప్రభాత ఖగస్వనవీణ మీటుచుఁ. 3

ఉ. అక్కట! యామినీ యవనికాంతర కైతవ నాటకస్థమౌ
టక్కరి స్వప్నలోకపు విడంబనలోఁ బడి దారితెన్నునుఁ
జిక్కక దేవురించు ఘన చేతనకోటిని బుంజురాయఁడున్
గొక్కరకో యటంచుఁ దొలికూఁతలఁ బిల్చె నిజాలయాళికిఁ. 4

తే. కమ్రప్రాగ్దిశావ్యాప్త రాగ స్రవంతి అర్కమిత్రు స్వాగతగీతి నాలపించి
విశ్వసఖి వేయి కన్నులు విప్పి కాంచెఁ దెల్లవోవ నిశీథినీ వల్లభుండు. 5

క. చీఁకటి తెరలను జీల్చెడి బాకులగతి నరుగుదెంచు బాలార్కుని ది
గ్వ్యాకీర్ణ కిరణ సంతతి సోకుట ప్రకృతిహిమ బాష్పశోకము లుడిగెన్. 6

తే. కనులు మూసినఁ గారుచీఁకటులు మసల కానిపించెడి స్వప్నలోకానుభూతిఁ
గనులు దెఱచినఁ బ్రత్యూషకాంతి, దిశలఁ గ్రాలి మఱుఁగొనర్చెడి యింద్రజాలమయ్యె. 7

క. ఆనాఁటి యుదయమునఁ దన యాననము విషాదరేఖ నలమ వికలయై
శ్రీనాథు తనయ నారసి తా నిట్లనె లక్ష్మి స్నేహతత్పరమతియై. 8

తే. నేఁడు నిదుర లేచుటతోడనే యదేమొ యెపుడు నవ్వులు నవ్వుచు నెసఁగునట్టి
సిరిగలుగు నీ మొగమ్మది చిన్నవోయి యున్నదేల తెల్పుమి నంతయొట్టె వదినె! 9

క. అనియెడి లక్ష్మిని మరదలిఁ గని శారద మాఱుపల్కకయె నిల్చి కనుం
గొనలంటి యశ్రుధారలు చినుకుం బూసలను గురియ క్షితి నిట్లనియెన్, 10

తే. మది వడంకెడి లక్ష్మి! యస్మజ్జనకులు తెవులుగొని గురువేదనఁ దవిలియుండి
యమ్మలికనొంది నను జేరరమ్మటంచుఁ బిలిచినటులు నా కొక పీడకల బడియెను. 11

చ. అనుటయు నర్వమాంబ యిదియంతయు వారల వెన్క నుండి తా
విని తన తండ్రి గూర్చి దురపిల్లెడి శారద నూఱడింప ని
ట్లను విల నీ వదృష్టవతివై నను దల్లికి నోచుకొందు వెం
త నుడువుమమ్మ జావఁ బినతండ్రిగదే తన తండ్రి యన్నచోన్. 12

ఆ. తాము గనిన కలలు ధరణిపా లనియెద రింతమాత్రమునకె యేడ్వనగునె
వట్టి బేలవనుచు వచ్చెడి కన్నీరు దుడిచి దరికిఁదీసి నుడువు నిటుల. 13

ఉ. ఇట్టులు నెంజిలిం గొనుచు నేడువఁగూడునె పిచ్చితల్లి! నే
డెట్టులనేని నీ విషయ మేర్పడ నంతయుఁ జెప్పి మామ న
ప్పట్టుల కంపి, నీదు పితృపాదు ననామయ వర్తమానముం
గట్టిగ నీవు కూర్మి వినఁగా నొనరింతు నొకింత సైచినన్. 14

చ. భయమిక నేలటంచుఁ దల పల్మరు దువ్వుచు గారవించుచున్
నయన భృతాశ్రువుల్ చెఱఁగునం దగనద్ది శిరోజ సంతతిం
గయిని సవర్చిదూరమునఁ గల్గిన వారిని గూర్చి యేడ్చు నీ
చెయిదము లెస్సగాదు విరచింపుము తండ్రికి జాబొకండనెన్ 15

ఉ. ఆదుకొనంగఁ బల్కు తన యత్తను గాంచఁగ దుఃఖమెంతయున్
జేదుమరాఁగ, గండివడెఁ జెక్కుల నశ్రుతటాక మంత క

డ్పొదరబట్టె నెట్టవడి యొక్కెడ కన్నులువాచెఁ దల్లి ప్రా
పేదినవత్సయై పొగిలి యేడిచె శారద నీరదాభయై. 16

ఉ. ఆ పసిబిడ్డగోడు హృదయమ్మునఁ జేయిడి చల్లసేయఁగాఁ
ద్రోఁప వశమ్ముగాక యెది దోఁచఁగనీయని కత్తికోఁతతో
నోఁపఁగలేక వీడిచన నొక్క పదమ్మనురాక బాష్పముల్
జేఁపిన పాలయట్లురలి చెక్కుల మిత్తడిదూఁక నిట్లనున్. 17

తే. జనకునకు నెందుఁ గొమరుపైఁ దనరు ప్రేమ యాఁడబిడ్డపై నుండుట లరిదిగాదె
తనయువీడిన మనలేని దశరథుండు దుహితనర్థింప రోమపాదున కిడండె! 18

వ. యనుచు నుపలాలించి యచ్చోటు విడిచని, 19

క. అంతేవాసిపటలి కేకాంతమ్మునఁ గావ్యశిక్ష గఱపెడి కవిదా
పొంతజని యీ యుదంతము నంతయు నక్కటిక వొడమ నంగన నొడివెన్. 20

చ. నుడువుట లా కవీంద్రుఁడు తనూభవు మల్లన నల్లఁ బిల్చి య
య్యెడఁ జనఁబంచె, నద్దివిని యింగితమారసి చట్టుమూక బి
ట్టడఁకువ యుల్లసిల్ల నతులై మనవిం బొనరించిరే మున్
గొడుకులవోలెఁ గామె, చనఁగూడదె యయ్యెడకున్ గురూత్తమా! 21

చ. అనుటయు నగ్గురుండు మది నగ్గలమౌ వెనుగూర్మి, శిష్యులన్
గని యిటు వల్కెనేఁ బనుపఁగాఁ జనునాత్మజుకన్న నాదు నో
టనుటకు మున్నె మీరయి ప్రయాణమొనర్తుము మే మటంచు వా
కొని సుతుకన్న మిన్నలయి కూరిచినారలెదన్ ముదమ్ములన్. 22

ఆ. అనుబెచాలు మీర లరిగిన యటులయ్యె జదువు వెనుకఁబడును జనుటకతన
మల్లనార్యుఁడేగి మఱల వైశమెవచ్చు నింతకొఱకు మీర లేగనేల? 23

ఆ. అకట! రాచకొండ యన నేమిదలఁచితి రిచట నచటఁ గలదె యెంతమాట
లేఁతకారుకూన లే తెన్ను పెనుపయనంపు టిడుమలను సహింపఁగలరు. 24

చ. గురువరుఁ డిమ్మెయిన్ బలుకఁగొంకున మిన్నకయుండి యెట్టులే
నరిగెదమంచు నీవె యనుమన్నను నీ వనురాయటంచు నొ
క్కరి నొకరట్టె త్రోఁసికొనఁగాఁ దెగువం బొనరించి వారి ము
గ్గుర నిటువల్కె ముందు వడికొండిక నారయ తా రయమ్మునన్. 25

ఉ. ఇంకను గాదుకూడదన నేగుట గీగుట మానమే యిటుల్
పెంకితనమ్ము సేయ నొక పేరిమివచ్చునె మాకు వేడ్క నా
పెంకియకేగి చూతమనుటే యదిదప్ప మరేమిలేదు మే
మంకిలి సెప్పువారమె మహాశయ! దేవర యాన కెన్నడున్. 26

సీ. సకల విద్యాలోల సర్వజ్ఞసింగమక్ష్మాపాల పాలిత స్వర్గసీమ,
సరసపండిత కవిజాల రాజమరాల సేవిత సుమనస్సరోవరమ్ము,
ఆంధ్రనైషధకర్త యఖిల కలాభర్త కవిసార్వభౌముఁడు గలుగు నెలవు
పోతరాజ కవీంద్ర పూతవాగ్వర్ణిత భోగినీ విలసిత భోగభూమి

తే. సకల సుకలాకదంబ శ్రీశారదాంబ చారు మంజీర మంజుశింజాని నాద
ముఖరితాఖిల రోదసీ ముఖవికాసభాస రాచకొండను గాంచు నాసగలదు. 27

క. పని వినెద మనుపుఁడనఁ బోతన తన తనయులను బిట్టు దవ్వుల కనుపన్
మనమున మును వెనుకాడెడి జనకునివలె నెనరుగొనియెఁ జనిరం డనఁగన్. 28

క. అనుభవములేని బిడ్డలు పెనుపయన మ్మందు మిమ్ము పీడించెడి వా
ఘన సాధకబాధకములు 'వినుఁడీ' యని నుడువఁదొడఁగె విరిసెడి కూర్మిన్. 29

తే. ఎండ పవలు రే లనకుండ సతము వెఱ్ఱిసాహసమున్ బూని వెడలవలవ
దాపదలు చెప్పిరావు ముందరుగునెడల నెపుడు కన్గల్గి మెలఁకువ నేగవలయు. 30

సీ. కన రెండుదారులు కలిసియుండినచోట నెది మార్గమరసి ముందేగవలెను
నడినెత్తిపైఁ బ్రొద్దుబడకముం దూరంటితిని యెండబుచ్చి మున్ జనవలయును
దారిలో నీళ్ళున్న స్థావరంబులఁగని యొక చెంబు నీర్వట్టి యుంచవలెను
పరిగ నింకను గన్మసకగాక మునుపల్లె తా వేగి కనుమల్పి పోవలయును

తే. అడవి వచ్చినయెడల ధైర్యమ్ము జెప్పుకొనుచుఁ బదిలమ్ముగాఁ గూడి చనవలయును
దారి ములుముట్రి జూచుచుఁ దరలవలెను ఒకరి నొక్కరు వీడి ముందుఱుకవలదు. 31

తే. పయన మనఁగనె యుబలాటపడుచునుండి రిల్లు వీడి యెఱుంగరు పిల్లతనము
లేమితెలియు నాఁకలికయి యింత సత్తుగుడుము నడుకులు నిడుదని పడఁతి పల్కె. 32

తే. పూని మఱునాఁడు చీఁకటితోనె వారి పయనమొనరించి తా నూరుబయట వఱకు
కలిసి చనుదెంచి యెడఁద నుమ్మలిక గదురబేగి సుగమేగిరండిఁక నాఁగుదు ననె. 33

తే. అని యిటులు వారలను సాగనంపి యచటఁ దనదు సస్యాళినారయఁ దా నరిగెను
సింగరాజును నారయ గంగనయును నుల్లమున సంతసమ్ము పెల్లుబుకఁ జనిరి. 34

క. చనుచున్ ముచ్చట లచ్చటలను బెట్టుచు నడచినట్టులనె మానసమం
దునఁ దోఁచుటలేదని త్రోవన లరుగిరి ఝరులతరుల వర్ణింతురొగిన్ 35

సీ. గగనమంటప వాహక స్తంభగణ మనసూటి నభమ్మునే చూపు తరులు,
ఆకాశభవన మధ్యస్థకుడ్యములన నిలువెల్ల దృష్టుల నిల్పు గిరులు,
వల్మీకముల వీడివచ్చు సర్పములనఁ జయ్యనఁ బ్రవహించిసాఁగు ఝరులు,
అల తమోయువతీ రహస్యాలయములన బావురుమని కనఁబడు పొదరులు,

తే. మోహరము బన్నినిల్చు చమూతతులన నడుగు మునువేయనీని గుల్మాళివఱులు,
కాంచ నడిపవల్ చీఁకటుల్ గ్రిమ్మఁజేయు భయద సాంద్రాటవియిదని పల్కు నొకఁడు.

సీ. చదలు నంటఁగ నిక్కు సాలాగ్రముల నెక్కి కూఁతలనిడెడి కపోతసమితి
తలక్రిందు మఱ్ఱియూడల డోలికల నూఁగి మొగి పల్లటీల్ వైచి యెగయు కపులు
చెదపుర్వులం బీల్వఁజేరి వల్మీకాళి గులగుల గోరాడు నెలుఁగుబంట్లు
లలివన్నె విసనకఱ్ఱల చెన్నుతఱి కొత్తషడ్జగాన మొనర్చు సర్పభుక్కు

తే. టివ్వుమని సుడిగాడ్పులురేపు ధూళి నెండుటాకులు గలగల నెగురునొకట,
తరుల కొనగొమ్మలందేనె పెరలువ్రేలు దర్శనీయమై వని భయదమను నొకఁడు. 37

ఆ. ఇంతయేని కన్నులెత్తిచూడఁగ నీని కిరణములకు మాటు కేలునొడ్డి
తల నొకింతయెత్తి తిలకించి మధ్యాహ్న భాను సింగరాజు తా నిటులను. 38

ఆ. రెండు జాములయ్యె మండుకపోయెడి నెండలింక నేగుచుండరాదు
నీడపట్టుజూచి నిలుచుటే మేలని పలుకు నాస్యఘర్మసలిల మూర్చి. 39

ఉ. చండకరుండు వహ్నికణజాలము దిక్కులఁ గ్రిక్కసాగె బ్ర
హ్మాండము తప్తభాండమయి యంటఁగరానటు గ్రాగెడిన్ సుప
ర్ణుండు నభఃప్రదేశమున నూల్కొని రెక్కలుసాచి నిశ్చలాం
గుండయి యాడెఁ బ్రాణితతి గ్రుమ్మరఁగన్ బయిలోడె నియ్యెడన్. 40

ఉ. తానల ప్రాగ్దిశారమణిఁ దగ్గతిఁ బశ్చిమ దిక్సతీమణిన్
బూనికఁగూడ రాగరసపూర్ణుఁ డనంబడు నంశుమాలి యీ
భానుఁడు మధ్యవర్తిగ నభమ్ముననాడె సహించువారె వా
రేను యథార్థవాదినన నెంతయు లోకవిరోధియౌ గదా ! 41

శా. కాలాగ్ని ప్రతిభాసమాన జఠరక్ష్మాపాల దుష్పాల నా
భీలక్షుద్ధ నిరంతరజ్వలిత హృద్వీథుల్ వెలార్చెన్ బ్రజా
జాల మ్మిట్లన నీ పలాశసుమనస్సంఘాత కేతుచ్ఛటా
జ్వాలా తోరణకారణమ్ము ఋతువైప్లవ్యమ్ము సాధించెడిన్. 42

సీ. బడినోళ్ళఁ దెఱచెడి వడదాఁక శోషిల్లి వృక్షశాఖల నహో ! పక్షిచయము,
వగరుకొట్టెడి నూర్పులెగయఁ గన్నరమోడ్చి తరులఛాయల సోలి హరిణసమితి,
మోదానఁ బొరలెడి ముట్టెలపైఁ దేల్చి పల్వలంబుల మున్గి పందిగములు,
బీజముంచిన యంత లాజయైపడునట్లు క్రాగెడు నగ్నినాగ్రావ వితతి,

ఆ. ఎండమావులంటి యేగు శశమ్ముకాల్ నాకికొనుచుఁ బొదలదూఁకు నొకట
మడువు నడుగుజలములుడుకౌటభే కాలిదరుల బొఱియలరసి మఱువుసొచ్చు. 43

ఉ. తెల్లగఁ గానిపించెడినదే నది దోఁగి జలమ్ముదాగ్రి యా
చల్లని వృక్షరాజముల ఛాయల కొంచెము విశ్రమించి ముఁ
మెల్లగ నేగవచ్చు తలమించిన దెండ వశమ్ముగా దిఁకన్
భిల్లులు వేఁటమాని తమ పేఁటల బాటలబట్టి రల్లదో! 44

ఆ. పైన గ్రీష్మహతికిఁ బగిలిపోవు శిరమ్ము క్షోణినంటి నంత చుఱ్ఱుమనుచు
నంటుకొనెడి పదములని శ్రీఘ్రగతి వార లేఱుదాపు మట్టిఁ జేరుకొనిరి. 45

వ. అంత నాబాలకవిత్రియంబునున్ గ్రీష్మార్కపటుప్రతాపజనితోష్మాయాసంబుల నాత్మీయ శీతలచ్ఛాయాసాహాయ్యంబున శాంతింపఁజేసి విశ్రాంతి నొసంగు క్షితిజరాజంబునకుఁ కృతజ్ఞత నివేదింపనోయన నొక్కొక్క రొక్క పద్యరత్నంబున నిక్కరణి నభివర్ణింపఁ దొడంగిరి. 46

ఉ. పచ్చల పర్వతమ్మొ ధరబట్టిన చల్లని యాతపత్రమో
వచ్చుచుఁబోవు పాంథులకె వారును గట్టని ధర్మసత్రమో
యెచ్చట దిక్కులేక చరియించెడి పక్షికి నిల్వనీడ నే
నిచ్చెడి భూ కటాక్షమొ రహించినదీ బహు పాదవృక్షమై. 47

తే. వామనుఁడు త్రివిక్రముఁడయి వఱలినాఁడొ! యణువు బ్రహ్మాండరూపమై యడరెనేమొ!
యష్టదిశ లాక్రమించి మిన్నంది వ్రేళ్ళదట్టె పాతాళ మీ మట్టిచెట్టు తాను. 48

సీ. నిశియుం బవళ్ళును నిజమాతృభూమిని గొల్చు దేశారాధకుని భుజములొ!
ఒరుగాల నిల్చి యుర్వరదాపముడుపఁగాఁ దపమొనర్చెడి జటాధారి జడలొ!
పెనఁగు జంఝూప్రభంజను గల్లముల చపేటరుచి జూపెడి జెట్టి కరతలములొ!
తిగ్మమరీచి ప్రదీప్తకాండోత్కరాహతిఁ గ్రాలు యోధుగాయముల గములొ!

తే. యనఁగ శాఖాశిఫాదళారుణఫలాళిఁ బరఁగి వర్ధమానస జీవపర్ణశాల
యైన వటభూరుహమ్మని యభినుతించి కనిరి ముందున్నయేటి నుత్కంఠ మీఱ. 49

సీ. నెఱియలఁ దొంకలన్నెఱి విభిన్నాకృతి నిరువంక లంటుచు దరులెసంగ,
విమలతోయము లానవేరుల సారించి దరుల నందందు పాదపము లమర,
తనతోడి సికతాణుతతులల్ల నడుగంటి పొరలిరా నురవడి ఝరమువోవ,
నమలాంతరిక్ష పటాదర్శమై వారి శుద్ధాంతరాశముల్ జూడ నొప్ప,

తే. నచటచట సైకతంబుల నలరు తుంగచువ్వలన్ శైవలాదులు జుట్టియాడ
నుఱుకు భుజగంబు భంగి విద్యుల్లతాంగి పరువులిడు భాతిఁజను శ్వేతపటము రీతి. 50

క. తీరగు నడగలుగు నదీతీరమ్మును జేరఁజనిరి తీఱ నలసటల్
వారిని గని యా ఝరమును వారిని గొని తాపముల నివారించెఁ దమిఁ. 51

క. ఆడిరి యిసుమును గొని, నీరాడిరి చన్నీటఁ బొరలియాడిరి యేటన్,
తోడిరి చలమల, నెటికొనియాడిరి జలములను, దూలనాడిరి యెండన్. 52

క. జాడించిరి మడిపంచెల, జోడించిరి కేల్విభావసున, కడుకులకున్
దోడుంచి గుడము నిఁక నోరాడించిరి రుచికి, శిరములాడించి రొగిన్. 53

సీ. తరుతల గలిత పత్రి ఫలాదికము కేలఁ ద్రోసివే స్థలశుద్ధిజేసె నొకఁడు
పరిసర భూములం బడియున్న తగుపాటి గుండ్రాళ్ళ నంతికన్ గూర్చె నొకఁడు
కూలిన యెండు మ్రాఁకుల కొమల్ విఱుచుచుఁ జెచ్చెరఁ జిదుగుల దెచ్చె నొకఁడు
లీలమై దావదగ్ధాలాతమును బేగికొనితెచ్చి చిచ్చురగుల్చె నొకఁడు

తే. పాక మొనరించి యిటు తామరాకుల నిడి కుడిచి భుక్తశ్రమమ్ముల నుడిపి మెల్ల
చల్లఁబడుటయు వేతొకపల్లె జేరి యందు నిదురించి వఱువాత నరిగిరంత. 54

శా. చేరంబోయిరి రాచకొండఁ ద్రిదివశ్రీ మించు ప్రాకార దు
ర్గా రామాంగణ భర్మ హర్మ్య ఘనరథ్యాగోపురాట్టాలక
ద్వారోద్భాసిత తోరణ ధ్వజమహోద్దండన్ కళాకాండ ను
గ్రారాత్యున్మథనప్రతాప విజితాజాండన్ బ్రచండన్ వడిన్. 55

చ. చని యట వెల్గుబాటలను జక్కని పేఁటలఁ బూవుఁదోఁటలన్
గన మినుముట్టు కోటల సికన్ నటియించు కపోతియాటలన్
గొనబగు తీయమావి నునుగున్నల కోకిలగుమ్మ పాటలన్
గనులను నొప్పగించి తమిఁగాంచుచు నిట్లనుకొందు రొండొరుల్. 56

ఉ. చక్కనిచక్కి యీ నగర సౌధరమాంగన వక్షసీమ బ
ల్మక్కువఁ దాల్చు నుల్లబము మాడ్కి నగళ్ళను జుట్టి యాడెడిన్
పెక్కు రుచుల్ నవాంబరము ప్రేముడిఁ గోమలి తాను వేనలిన్
జెక్కిన కొప్పుబిళ్ళ యనఁ జెల్వమరున్ రవి గోపురోపరిన్. 57

సీ. ఐరావణము పెక్కు లాకారములు దాల్చి మందలై యిచటఁ బెంపొందెనేమొ!
రజతాచలమ్ము గహ్వర ముఖంబులఁ బూని పంక్తులై యీ సీమఁ బరఁగెనేమొ!
కామధేనువు పెక్కు నామరూపములూని తండలై యిచట కొల్వుండెనేమొ!
అజమరాళంబు బహ్వాకృతుల్ ధరియించి శ్రేణులై యీ వీటఁ జేరెనేమొ!

తే. దివిని గాఁగ నీ భువిఁ దీర్చి దిద్దనెంచి భవన వనమయ్యెనో నందన వనవాటి
దీని ముందు శూన్యమ్మెందు త్రిదివమనఁగ దివికి నిచ్చెన లిడెనొ యీ భవనరాజి. 58

క. అనుచు నొకరినొక రద్దిర! కనుమిది యన నదదొ దానిఁ గాంచుమటంచున్
వెనుకెపుడు గనని యీ పత్తనపుం జెల్వంబు నెంతొ తలఁచి మును జనన్. 59

ఉ. వారు నృసింహభూప సముపస్థితమై తనరారు రాట్సభా
ద్వారము డాసి వే నృపతి దర్శనమున్ బొనరింప లోజనం
గోరి పదమ్ము ముందిడిరి, కోపముతో నొక వృద్ధుఁ డచ్చటన్
వారల నడ్డగించి చనవల్దని యాఁపెను వేత్రిహస్తుఁడై. 60

చ. కవులము మేము క్ష్మాపతిని గన్గొన నేగుచునుంటిమన్న మే
మ వెఱుఁగ మిందు మీర లెవరైనను నేమి నృపాలు నాజ్ఞ నొం
ది వెడలు టొప్పులేనియెడ దేవుఁడు వచ్చినఁగాని లోజనం
గ వలనుగాదు మీ వలనఁ గల్గును మాకట నొద్దు కంటిరే! 61

చ. అనవుడు వారు వానిఁ గని యా నృపు చెంతకు నీవ యేగి ద
ర్శనమునకై కవుల్ మువురు చాల తమింగొని వేచియుండిరం
చనుమని రిప్పు నే నరుగనంచు వచించె నతండు, వానినిం
గని కడు బుద్ధిమంతుఁడవు కావలి కావలె నీవలెన్ భువిన్. 62

వ. అని పలికిరంత, 63

చ. కినిసి యతండు వారలను గ్రిందును మీఁదును జూచుచున్ బలే
మనుజులు లెండి! యం చుఱుము మాడ్కిని ఖంగున లేచె నాజి సే
యనో యన మీర లెట్టి కవులైనను నేమగు నేమి చేతురో
కనియెదగాక! నన్ దెగడికై తలనల్లుఁడు లెండు సొండనెన్. 64

ఉ. కాంచి మొగమ్ము చించుకొని కంఠము నూసరవెల్లి యట్టు లు
బ్బించి నరాలు దేల బుసవెట్టుచుమై వడకాడ శక్తికిన్
మించిన కోపమూని యటు మించఁగనాడెను వారి నెట్టులే
న్గొంచపువాఁడు పెత్తనము గూడిన నాచఁడు కాచఁ డిందురినిన్. 65

ఉ. అంతట వానిఁ గాంచి యిటులాడిరి వారలు నద్దిరయ్య! నీ
కెంతటి కోపమున్నదిర యేమనఁజెల్లును, నాఁడు నాఁడు యో
చింతువొ ముందు ముందొగిని చిన్నతన మ్మరుదెంచునంచు బ
ల్వింతయె, యూరు దూర మటవీస్థలి దాపగు నిట్టివేళనున్. 66

చ. కురిసిన మేఘమై యరసికుం బలెఁ దెల్లమొగమ్ము వైచె మే
లుక్కురులవి, బోసినోటి గుహలోఁ బడి శాశ్వత మస్తమించె సుం
దర దరహాస చంద్రికలు, త్వగ్గతి జోలెలు వ్రేలియాడె, న
స్థిర నవయౌవనద్యుతి గతించెను మేన కళాయి పూఁతయై. 67

మ. ఎవరోయీ! చనుచుంటి వీ విచటినుం డేయూరి కీ త్రోవ నీ
జవసత్వార్థము లేరు దొంగిలిరి నీ చర్మంపు జోలెల్ సతం

బెవరి౯ బిచ్చమునెత్త నూఁగిపడు నీవీ రీతి భీతుండవై
యెవరి౯ జూచి వడంకుచుంటి విటు నీవే దండధారుండవై. 68

ఆ. దండ మిడమి నొక పదమ్మేని ముంగల నడవనీయ దురక వడఁకఁజేయు
పండ్లు రాలిపడియు బలమాఱియు జరారి కఱకుమారియట్లు కొఱుకు నిన్ను. 69

చ. వయసొక కోడెత్రాఁచువలె వచ్చి యి టన్నెముపున్నె మెర్గన
ట్టి యదువ బాల్యముం గని వడిన్ నునుమీసలు దువ్వి త్రోసెగా
ని యబల తా నెదుర్కొనఁగనే వడి వంగి జయింపలే కిటుల్
వయిచెను దెల్లమోము భువి బాలవిభూతికి శ్రేయమబ్బునే! 70

తే. ప్రేతముఖమయ్యె నడుమున కూఁతగొనమిఁ గూర్చొనఁగలేవు తల ముగ్గుగుల్లయయ్యెఁ
గాళ్ళు మూఁడయ్యె నీ చేతికట్టెగూడి తప్పదిఁకఁ దలక్రిందైనఁ దాత పేరు. 71

సీ. కడు జీర్ణవస్త్రాల నిడు సూడిదలుగాఁగ నరవంగి కృశియించినట్టి తనువు,
ఎఱుకజెప్పెడి నేఁడు దిరిగిన పంచాంగములఁగొని నీ వాక్కు బలము తొలఁగి,
విగతజీవనఘన విధివిధానము జాటువెల్లనౌ నీ తలవెండ్రుకలును,
అంధకారపురూపు నద్దమ్ములిడి చూపుఁ జూపుమాసిన కంటిపాపజంట,

తే. ఎవ్వరోయి నీ పయి బండలెత్తివంచి, తలకు సున్నమురుద్దిరి తాళ మిడిరి
వాక్కునకుఁ, గన్నులం దుమ్ముమై చిరింక మనఁగలేవు తాతా! చాలదినము లిచట. 72

సీ. వింజామరమ్ములు వీచుచునున్నవి దరిసిన జరకు నీ నెఱియుకురులు,
వెక్కిరించుచునుండె పెక్కురీతుల నీదు బొక్కినోరి లోకమును గనుగొని,
అడవికే దారితీయఁగసాగె మునుముందు గమియించు నీ చేతికఱ్ఱ తాను,
ఊయలలం గట్టి యూఁపుచుండెను మృతిన్ బలహతి నూఁగుచు వంగు వపువు,

తే. అప్పుడపు డీ ప్రపంచ వృక్షాంతికమున విసరు ఝుంఝూనిలార్భటిం గసరుకాయ
లెన్నియో రాలిపడుచుండ నెంతవఱకు తొడిమ బిగిపీడు ఫలములు పడకయుండు. 73

ఆ. పండుటాకు తరువునుండి రాలెడివేళ నింగి నిటునటాడు భంగినెల్ల
కనులగట్టు మూటగట్టి ప్రయాణమై యరుగు నీకు నింటి నరసినపుడు. 74

సీ. పండ్లునూఱకు పరపక్షులపై నవియేమొ యొక పల్లులేకుండ నూడఁబెఱికె,
మలినబుద్ధిని మానవలెనంచు ముదిమి నీ తలపైని నీలిమఁ దఱలఁజేసె,
అరవంగు బాలేందునందు కల్మష మున్నెవలదు గర్వంబని వంచెనడుము
దండపాణి భయముదప్ప శ్రీహరి ముందు దండాకృతింబడ దండ మొసగె

తే. ముదిమి యొనరించు నుపదేశమును జెవినిడి మానవా! నీదు దేహమ్ము మాఱెఁగాని
మానవా మూర్ఖవర్తన మానసమున? మేలు కొనుమింక వేవేగ మేలు గనెదు. 75

వ. అనినంత నా ముదుకండు వారి కవిత్వోపదేశమ్ముల విని తన ముదిమినెంచి యిట్లని
చింతింపం దొడంగె. 76

తే. నాదు స్వర్గసామ్రాజ్యమ్ము నాశపఱచి త్రోయుచుంటివి నారకాంధువునఁ బడఁగ,
వెనుకకిటు లొక్క యడుగును వేయ నీవు సఖపునర్దర్శనావకాశమ్ము లేదు 77

వ. అనుకొని వారిం గాంచి, 78

సీ. అతిబాల్యమున భూమి నడుగిడలేకుంటి వార్ధక్యమున నట్లె వఱలుచుంటి
పసితనమ్మున బోసిపాపనై పడియుంటి వృద్ధాప్యమున నట్లె వెలయుచుంటి
బాలుఁడనై యెందుఁబడక పీడకయుంటి ముదుసలినై సెజ్జ మూల్గుచుంటి
బుడతనై యాధారపడియుంటి నొరులపై ముదుకనై భూభారముగనె యుంటి

తే. మధ్యవచ్చిన యౌవన మహితసుఖము కాలపురుషుని గాలానఁ గ్రాలునట్టి
యెఱ యని యెఱింగితిని లేమినేల యిట్లు జీవనమునకు దూరునిజేయు నన్ను. 79

వ. కాన రెండవ బాల్యమగు నిమ్ముదిమిని వదరిన కాఱులఁ జిత్తమునకుఁ దేవలదార్యులని, 80

క. అనుటయు ముగురాతనిఁ గనుగొని నీ వార్ధకము పైనఁ గూర్చితి మీకై
తను దనివి గల్గెనే నీ వనిన మనోవాంఛ పూర్తియయ్యెనె చెపుమా! 81

క. దేవరపంతమె నెగ్గెను మా వచ్చిన బాటఁబట్టి మరలుదు మిఁక మీ
భూవరుని మీరె చూడుఁడు కావలసిన నేగి దేవుఁ గాంతుము గుడిలో. 82

ఉ. అందులకే మముంబనుచు నార్యుఁడు బమ్మెరపోతరాజు తా
నిందయొనర్చు రాట్సభలు నీచములంచును మాటిమాటి కి
ట్లెందఱి కాళ్ళపట్టుకొని యేగ నృపుండిడు కల్మికన్న గో
విందు పదాబ్జసేవల లభించినలేమియె చాల మేలనన్. 83

తే. ఎట్టెటూ మిమ్ము బంపినదెవరు తాను బొమ్మెరన్ వసియించెడి పోతరాజె?
యనుచు ముదుకండు తన యల్క వెనుకఁబట్ట వారి నడుగుచు సదసద్విచారమతిని. 84

ఉ. నాయనలార! మిమ్ము కవినాథుఁడు పోతన బంచినాఁడె తా
మీయది యాదిలోనె వచియింపకపోయితి రెంతమాట మి
మ్మీయెడ నాఁపువార లెవరేగుఁడు శీఘ్రమెలోని కిప్డు నా
ప్రాయముఁగూర్చి తెల్పిన సువాక్కుల జ్ఞానమువచ్చె ధన్యుఁడన్. 85

క. అని వారిపదము లంటుచు నను క్షమియించుండటంచు నగవొప్పఁగ వ
ల్దన నాదరించి లోనికిననిపెన్ స్వీయాపరాధ మాత్మఁ గలంపన్. 86

వ. అంత రాజ సభాంతరాళమున, 87

సీ. ధ్వనివృత్తిరసరీతి పాకశయ్యాలం క్రియాదీప్తి నుడువు మహాకవులును,
అస్తినాస్తి విచికిత్సావబోధక హేతువాదనారతులౌ విపశ్చితులును,
కురుళాంతరాలోల సరసిజదృక్కథ న్నిధువనశీల గాణిక్యపంక్తి
పాంచతాంత్రిక నయోపాయ చతుష్టయ చతురులౌ నాశ్రివ సచివవరులు
తే. చేరి స్తోత్రమ్మొనర్చు వందారు జనములోఁగి కనుసైగనాడు దాసీగణమ్ము
కొల్వఁగా హజారమ్మునఁ గొల్వుదీర్చి సింహపీఠికన్ దీపించు సింగనృపుని. 88

క. సవిధప్రదేశవిలసితు నవహితచిత్తుని బ్రణత జనార్తిహరుని వై
భవ సమవధీరితేంద్రుని నవలోకించిరి కవీంద్రు లాప్యాయముగన్. 89

క. నయపారదర్శినకు తోభయు విద్వజ్జనవిధేయుఁ బరికించి వటు
త్రయ మొక్కొక పద్యముతో 'జయీభవ!' యటంచు బిట్టు సన్నుతిసల్పెన్. 90

చ. అని వినుతింప ఱేఁడు దరహాస మనోజ్ఞనవేందు చంద్రికా ?
ధునులు సదస్సమాగత సుదూరపథక్లమ పీడ్యమాన చే
తనవటు మానసోత్పల నితాంతవికాసకమై చెలంగ ని
ట్లనియె సుధానదాలఁ బరిహాస మొనర్చు విలాసభాషలన్. 91

ఉ. భారత సంహితన్ దెనుఁగుబాసల దిద్ది కవిత్రయ మ్మిలన్
దారవతార మెత్తరుగదా! యనిపించెడి నాంధ్రమాత మేల్
హీరములన్ గనెన్ మిము కవీంద్రకిశోరములార! యెట్టిపుం
భారతి మీ గురుండగు సుభాగ్యముకై భువినోఁచి పుట్టెనో! 92

తే. తలఁపమూవురు మూఁడు వేదములుగాఁగఁ జెడిన యే కార్యమది చక్కఁబడఁగ నుండ
నవతరించితిరో మీర లవని, మీదు ఘనయశస్సాంద్ర చంద్రికా కాంతులెవియో! 93

చ. నిజవినివాస మెద్ది యవనీసుర పోతములార! తామిటుల్
విజయము సేయు కారణము వీనుల విందొనరింపరే యటం
చు, జనము సూచుచుండఁ గడుఁ జోద్యముగా నెదురేగి వారలన్
భుజములఁ గ్రుచ్చి పీఠములఁ బూనిచెఁ గా కవి కన్నులెఱ్ఱగాన్. 94

వ. అంత వారు నప్పార్థివ పుంగవుం గనుంగొని, 95

సీ. వాల్మీకి యాది కావ్యపుఁ బుట్టతేనెలో మునిఁగి తేలిన దొడ్డ తెనుఁగు తేఁటి
వ్యాసనిర్మిత భాగవత మహార్ణవముల నమృతీకరించు నాంధ్రాంబుదమ్ము
కాళిదాసోక్తి శృంగార మానస సరోవరవిహార మొనర్చు పరమహంస
భాగవతరసాల ఫలభోగి శుకయోగి పలుకు లావర్తించు తెనుఁగు శుకము
తే. సహజపాండితీ ప్రతిభావిశాల యశుఁడు నిరత హరిభక్తిమగ్నవాణీ వివశుఁడు
బమ్మెరనివాసి జ్ఞానసంపద్విభాసి సత్యఖని పోతనార్యుఁ డస్మద్గురుండు. 96

ఉ. భక్తుఁడు రామనామ మధుపాననిమగ్న ప్రమత్తచిత్త సం
యుక్తుఁడు గోస్తనీరస సముద్గరణ ప్రతిభా వియజ్ఝరీ
సిక్త సుమోపమానసహజ సిద్ధవచోవిభవాప్త పాండితీ
శక్తుఁడు గర్హ్య లౌకికపరిసక్తి విరక్తుఁడు సంగముక్తుఁడున్. 97

మ. విగతాడంబరవేషి నాస్తిక కథావిద్వేషి స్వర్గాంగ తో
యగభీరస్మితభాషి మోక్షపథ తత్త్వాన్వేషి గోపాల బా
లగుణాకీర్ణరసపరిపూర్ణ మధురాలాపాతి సంతోషి స్వా
నుగతాశార్ణవశోషి భక్తపదరేణువ్రాత సద్భూషియున్. 98

మ. మహనీయుం డగు మామకీనగురురాణ్మౌనీందుఁడెందున్ ముదా
వహమౌ దేవరపాండితీ మహిమ విద్వత్పక్షపాతమ్ము మీ
తుహినాంశు ప్రతిమానసద్యశము మాతోఁ జెప్పియుప్పొంగ మే
ము హజారమ్మున నేలికన్ గనుట లెప్డోయంచు భావించుచున్. 99

సీ. సకల విద్యాలోల సర్వజ్ఞసింగమ క్ష్మాపాలపాలిత స్వర్గసీమ,
సరసపండిత కవిజాల రాజమరాళ సేవిత సుమనస్సరోవరమ్ము,
ఆంధ్రనైషధకర్త యఖిల కళాభర్త కవిసార్వభౌముఁడు గలుగునెలవు,
పోతరాజ కవీంద్రపూత వాగ్వర్ణిత భోగినీవిలసిత భోగభూమి

తే. సకల సుకళాకదంబ శ్రీ శారదాంబచారు మంజీర మంజుశిం జానినాద
ముఖరితాఖిలరోదసీ ముఖవికాసభాస రాచకొండనుగాంచ నాసగలదు. 100

క. అని యడుగ మొన్నవారాజ్ఞ నొసంగిరి మీ రచటికిఁ జనుఁడంచును నా
యనుమతి శ్రీవారివి దర్శనములు లభియించె జన్మసార్థక మనుటల్. 101

వ. అక్కవికుమారకుల కలభాషణంబులు పలుభూషణంబులవలెఁ జెవుల మివుల రుచి
గొల్ప నప్పార్థివుండు తాను. 102

చ. అకట ! మహానుభావులు మహాకవిచంద్రులు వారిపేరు నే
టికి నమృతాభమై చెవిబడెన్ హృదయమ్ము పవిత్రమయ్యె నేఁ
డొక సుదినంబనామయత నుందురె వారు కుటుంబయుక్త మా
సుకవిత యే కథావనికి సూక్తిసుధారసవృష్టియౌ నన్. 103

క. కవులప్పలుకులు విని పార్థివుతో నిటులాడిరోక్షితివరా ! శ్రీ భా
గవతపురాణము తెన్గున భువి బొగడన్ రచనసేయు పోల్పేమనుటల్. 104

క. తాలోత్తుంగ తరంగ విఖేలన్నవరస సుధాప్రకీర్ణ సురధు నీ
దోలా లీలాలాలస బాలమరాళములు తెన్గు భాగవత కృతుల్. 105

క. పండిత పామర రంజక మండిత మృదు మధురపద సమాసోపేతా
ఖండ ప్రతిభాయుత రసభాండాగారమ్ము లాంధ్ర భాగవత కథల్. 106

క. నంద యశోదా నందన సుందర సురుచిర కథాభిశోభిత బ్రిహ్మా
నంద క్షీరాంబుధి ఘన బంధుర వర్షమ్ము లాంధ్ర భాగవతోక్తుల్. 107

క. శ్రీరామచంద్రి పదయుగ సారస మకరంద బిందు సందోహాంభః
పూరా నర్గళపారావార విహారమ్ము లాంధ్రి భాగవతరతుల్. 108

క. కలిమలి నాఖిలదల దుజ్జ్వల భక్తి జ్ఞానపూర్ణ వైరాగ్య విని
శ్చల తత్త్వస్థల దిహపర ఫలరససారమ్ము లాంధ్ర భాగవత ఋతుల్. 109

క. అని యిట్లభివర్ణనముం బొనరిచి పారిషదు లెల్ల బొమ్మలగుచుఁ గ
న్గొనఁ బోతనార్యు శిష్యులు వినిచిరి మచ్చునకు దాన వెలయు కవితలన్. 110

వ. ఒక్కనాఁడు పోతన రాహుగ్రస్తసోమోపరాగ సమయంబున నభ్రంక షోత్తుంగతరంగ యగు గంగన్ మునింగి సమీపస్థిత సైకతస్థలంబున బద్ధపద్మాసనస్థుండై యీషదున్మీలిత నయనయుగళుండునై యీశ్వర ధ్యానానుష్ఠాననిష్ఠాగరిష్ఠుండునై యుండుతఱి, ఇనకుల వంశ పయఃపారావార రాకాసుధాంశు సంకాశుండును, నిఖిల చరాచరభూతేశుండును, కౌసల్యాగర్భ శుక్తిముక్తాఫలపాత్రియుండును, ఆషాఢ వినీలనీరదకాయుండును, ఆర్త సంరక్షణ శీలకరుణరసాలవాల విశాలరక్త నలినదళనేత్రుండును, సకల శుభలక్షణ సంశోభితమనోహరగాత్రుండును, కుండలమణి మయూఖ మండల మండనాయమాన ప్రిఫుల్లగల్ల విరాజితుండును, హరవిరించి సురప్రముఖ నిఖిలలోక పూజితుండును, స్మేరకోరకితచారుముఖాంభోరుహ విభ్రాజితుండును, కనకమయచేలధరుండును, చండ కోదండశరుండును, అనల్పకల్పతరుశాఖాసన్నిభప్రోల్లసదాజానుబాహుయుగళుండును, విముక్తనిజభక్తనిగళుండును, కటక కేయూరహారగ్రైవేయ సకలాంగసంశోభితమణి మయాభరణుండును, నిఖిలలోక శరణ్యప్రిబుద్ధశారదారవిందచరణుండును, జనకజా వల్లభుండును, సనకాది మునిగణదుర్లభుండును దయాశరధియునగు దాశరథి సాక్షాత్కరించి, యాంధ్ర భాగవతకృతినిర్మాణమున కాజ్ఞాపించు తెఱంగెఱింగించి మరియు గజేంద్రిమోక్షణ కథావిధానరచనావసరంబున శ్రీరాముఁడు పూరించిన "అలవైకుంఠ పురంబులో" యను ననవద్యహృద్యపద్యభాగంబును వినిచి తద్విశేషంబుల వివరించి, రుక్మిణీకల్యాణ నామకా సాధారణగాథాపూరణవేళావిశేషంబున "బాలకమరె" నను పద్యభాగంబును వ్రాయుతఱి పోతన కూఁతున కనుభూతమైన యగ్నిప్రిమాదంబును వినఁజెప్పి, "నెలఁత యావనంబు నిండివెగ్గె" నను పద్యలేఖనావసరంబునఁ దద్విప దుపశమనోదంతమ్ము నంతయు సంతసమ్ము పెల్లుబికి యోడిగిల నుడివి యచటి శ్రోతల శ్రుతికుహరంబుల పీయూషంబుల వర్షించి ప్రిజానీకమునంతటి భక్తి విస్మయ భావబంధురము గావించి, 111

సీ. ప్రహ్లాద చరితలోఁ బద్యాళి నొక కొన్ని గజరాజ మోక్షణ కథలఁ గొన్ని,
కమఠావతార సద్గాథామృత మొకింత మోహినీ విలసనమ్ముల నొకింత,
వామన సత్కథా వైభవమ్ము నొకింత ఆది వరాహ మాహాత్మ్య మింత,
శ్రీకృష్ణలీలా విశేషగాథ లొకింత రుక్మిణీకల్యాణ రూపమింత.

తే. సరవి శ్రీరామ చరితా ప్రసక్తి కొంత చతురసాత్రాజితీయుద్ధ సరణి కొంత,
అంబరీష సచ్చరితామృతం బొకింత పాడి వినిపించి రనుపమ ఫణితి మెఱయ. 112

క. అవిరళగతి హరిగాథల శ్రవణానందముగ నింత చవిగొని భళిరే!
భువి నప్రతిమానమ్మీ కవితామృతమనుచుఁ బొగడెఁ గవిలోకమ్మున్. 113

ఉ. ఇందు కళాప్రసారమొ మహేంద్రపురీ సుర దీర్ఘికాస్రవ
న్నందన భూవిహారమొ క్వణత్కలవేణు సుధాంబుపూరమో
చందన శీతవాతపరిచారమొ పుల్లనవారవింద ని
ష్యంది మరందబిందు రససారమొ పోతన కావ్యసారమో! 114

క. పోతన కవితల నమృతపుఁ బోఁతనవలె ముత్తియంపుఁ బోఁతన వలయు౯
బోతనఁ బోల్ కవి భువిని నభూతో నభవిష్యతి యని పొగడు నృపతియున్. 115

శా. నానాసూనకళావిలాసరస విన్యాసమ్ముల౯ వారు భూ
జాని స్వాంతము మోదడోలికల నుత్సాహమ్ముతో నూఁపుటల్
శ్రీనాథుండు స్మితాననామలరుచిక్షీరార్ణవావాసియై
తానాకైతల నాలకించి యతిమోదస్వాంతుఁడై యిట్లనె౯. 116

చ. చిలుకలతోడి స్నేహములు జేయుచుఁ గూసెడి కోకిలమ్మతోఁ
గలహము బెట్టికొంచు నవకంజదళాక్షుల కల్కి పల్కుల౯
వెలితిని జూపు చెల్వముల వేణు నినాదము లూఁది దిక్పఙుల్
తలలొగి నూఁపు మేల్పదములన్ నడయాడఁగ నందె వైచెనో! 117

ఉ. అచ్చపు సంస్కృతాంధ్ర మహదబ్ధుల మందరముల్ మథించఁగా
వచ్చు సుధారసమ్ములకు వన్నెలుదిద్దెడి కావ్యధార క
మ్మచ్చిన దీయు తీవియల మచ్చుల నిచ్చు మనోజ్ఞశైలి పూ
ల్విచ్చిన నందనోప వనవీథుల కాదను పద్య గద్యముల్. 118

క. బమ్మెర పోతన శిష్యులె కమ్మని మీకైత మోదకారిణి, యట మా
యమ్మాయి శారదయు కుశలమ్మే యన వారు బుద్ధిలాఘవ మొప్ప౯. 119

క. కవి సార్వభౌములే తా మవిదితమతి నిందు మేము హనుమంతుని మున్
ప్లవగంపుఁ గుప్పిగంతులను విధంబున నేమియేమొ నుడివితి మార్యా! 120

క. క్షమియింపవలెను, నేటికిఁ దమ దర్శనమొదవె జన్మ ధన్యమ్మెఁక మా
దు మనోరథ మీడేరెను తమకొక లేఖ నిదె శారద యని యొసంగన్. 121

తే. మొదటఁ గవి లేఖఁ గొనిచూడ ముదము మెఱసె మధ్య గాంచిన కన్నీటిమబ్బు గ్రమ్మె
కొనవఱకు నశ్రువర్షమ్ము గ్రుమ్మరించెఁ దద్వ్యథావర్షమున జేఁడు తా మునింగె. 122

తే. కవివరా ! యంత క్షేమమ్మెగద ! యటంచు క్షితిపతి వచించె, నా కమ్మ చేతికిడెను
దాను శ్రీనాథుఁ, డది గొని మానసమున నిట్లు చదువఁదొడంగె క్షోణీంద్రమౌళి. 123

తే. "మామకీన పూజ్యపితా ! నమశ్శతములు భక్తి నిడి క్షేమచింతనపరత నుండి
ప్రియతనూజ శారద వ్రాయు మనవి చిత్తమునకుఁ దెత్తురటంచుఁ బ్రార్థన యొనర్తు. 124

తే. వ్యాధిబాధితులగుచు నవ్యాజ కృపను నన్ను దరిదీసి మీరేడ్చుచున్న యటులు
స్వప్నమును గాంచు టాది నా స్వాంత మేమొ పలుతెఱంగుల భావించి పరితపించు. 125

తే. తల్లిలేని పిల్ల యటంచు దయదలఁపక నన్ను నీవిట్లు మఱతువం చెన్నఁడెంచ
నమ్మ చనినట్లు నేఁగూడ నరిగితినని యనుకొనెదొ జ్ఞాపకమ్మునకైన రానొ. 126

తే. కడుపుప్రేమ మెవ్వరినేని గట్టివైచు నీ మనసు నేను జ్ఞప్తిరానిలిచె నెట్లు
కని కననివారలైతిరీ కాలమునకునైన మిము సాఁకు మగబిడ్డనగుదె నేను. 127

తే. జాబు గనినంతఁ దావకస్వాంతమందు దయదలఁచి వచ్చినన్ జూడఁదలఁచియుంటి
రాకయున్నచో రెక్కలురాని పిల్లపక్షివలె దిక్కులంగని పలవరింతు." 128

క. అనియెడి యా శారదలేఖను గని నిలువెల్ల రాజు కరఁగెఁ గడుపునం
బెనవేసికొనెడి దుఃఖమ్మును నిముసమ్మాఁపి యూర్పుబుచ్చి యిటులనెన్. 129

తే. గాన మొనరించురాగ సంగతినిదప్పు గారడీనినె ఫణమార్చి కసరికొట్టు
కుపిత నాగసుందరి బుసల్గొట్టుచున్న రీతులఁగుగాని యివి జాబు వ్రాఁతలగునె ? 130

తే. త్రోవదప్పి కాఱడవిని దేవురించు తల్లికొఱకింట వత్సమ్ము తల్లడిలుచుఁ
బదిగఁ బలవించుచున్న యంభారవంపు మ్రోఁతలగుఁగాని యివి జాబు వ్రాఁతలగునె ?

క. అనవిని శ్రీనాథుఁడు నృపుఁగని యెద నుమ్మలికగదురఁగా గద్గదని
స్వనమొప్ప బాష్పపూర్ణనయనములఁ 'జనఁదలఁతు నెల్లి 'యనె నది వినుచున్. 132

తే. ఆర్య ! మీ రేగవలను గాదనుటకొఱకుఁ గనినవారికి నోరు రాఁగలదె యిపుడు
వేగినంతనె వేగ మీరేగ నగును బయనముకనయి నాయత్తపడుఁ డటంచు. 133

మ. ధరణీపాలుఁడు సంధ్యవేళ యగుటల్ దర్బారుసాలించి సా
దర మొప్పన్ గవి సార్వభౌముఁగొని యుద్యానోర్విఁ గ్రీడార్థమై

చరియింపన్ వడి లేచెఁదోడనె సదస్యశ్రేణితో నమ్రులై
వరసామంతులు మంత్రులున్ దొలఁగి త్రోవన్ జేసిరా విగ్నతన్. 134

శా. ఆ రాజేంద్రుఁడు తత్కవీంద్రుఁగొని దీవ్యత్పుష్ప సౌరభ్య వి
స్తారంబై మృదుశీతవాతకృత సత్కారంబునై హంసికా
వారాంచన్నవ సాంధ్యరాగవిలసద్వాఃపూర సిందూరకా
సారంబై రహినొప్పునా పవనసంచారంబు గావించుచోన్. 135

శా. నౌకారోహవిహారవృత్తి నలల న్నర్తించు పద్మాంగనా
నేకోత్సేకవిలాసహాస ముఖకాంతిన్ దారకాపోల్లస
న్నాకాదర్శ మనం జెలంగు సరసిన్ నానాగతుల్ జుట్టి య
స్తోకాసక్తి వనస్థమంటప శిలాసోపానముల్ డాయుచోన్. 136

వ. తనూజానురాగ వివశీకృత చేతస్కుండగు కవి సార్వభౌమునకు. 137

సీ. నలినపర్ణాలోల జలబిందువులఁ గాంచఁ దనుజ లేఖాక్షరతతి స్మృతివడె,
వికసితవనరుహ పత్రికరమ్ముఁ గనఁగూఁతు నగవులు కనులలో నాట్యమాడె,
కలహంసకూజిత విలసనమ్ములఁ గాంచఁ దనయభాషణములు దలఁపువచ్చె,
కాసారమగ్నరాకా చంద్రబింబమ్ముఁగన బిడ్డ వదనమ్ము కనుల మెఱసె,
తే. అలలఁ జెలరేఁగు కొలని నీరరసినంతఁ గలఁతనిడు కూఁతుపేర్మింపుఁ దలఁపులెగసె,
పెనఁగొనిన పద్మలతఁగాంచఁ దనయపైన నల్లుకొనియున్న మమతలు పెల్లుబికెను. 138

ఉ. పోతము డిగ్గి యభ్రగకపోతము భాతి సరోవరాంచిత
స్ఫీతజలంబులం గల విచిత్రవిధూపలజాల నిర్మిత
శ్వేత మనోజ్ఞమంటప వివిక్తసుఖాసనసీమఁ బ్రేమమై
క్ష్మాతలనాథుఁ డా సుకవిసత్తముతోడ వసించి సాదృతిన్. 139

క. బమ్మెర కేగుదురార్యులు కమ్మని శ్రీ భాగవత సుకవితామృతముల్
సమ్మతిఁ ద్రావుచు నిక మును మమ్మే మఱచెదరటంచు మనవి యొనర్పన్. 140

శా. తానా సత్కవి జేనిఁగాంచి యమితోత్సాహమ్ము దీపింపఁ బ్ర
స్థానోద్వేగవశాత్ముఁడై పలికెనో ధాత్రీశ్వరా ! యేలికన్
నే నెల్లేమఱువాఁడఁ గావ్యరసపానీయంబు సేవింప నెం
తేనిన్ దేవరలేనిదా కొఱఁత నన్వేధించు నశ్రాంతమున్. 141

చ. పరసు ఉదారచిత్తులును సత్యవచస్కులు సాహితీకళా
విరతులురావు సింగధరణీపతు లాత్మఁ దలంపనేమి దు
ష్కరమిటగాదె భాగవత కావ్య కథాశ్రవణమ్మనంగ న
క్షరగతి దానినే వినఁగ స్వాంతమునం దలపోతు సత్కవీ ! 142

శా. నాఁడా వ్యాసమునీంద్రుఁ డెన్నియొ పురాణంబుల్ తగన్ వ్రాసియున్
బాడంజేసియుఁ దానదెందులకొ తృప్తస్వాంతుఁ డింతేనియున్
గాఁడయ్యెన్ దుద, భవ్యభాగవత సత్కావ్యామృతం బొక్కఁడే
యీడౌ నిన్నిటికంచు నుల్లమున నూహించెన్ రచించెన్ దమిన్. 143

ఉ. అన్నివిధాల మాతృకకు నన్నయొ తమ్ముఁడొ యన్నయట్లు పో
తన్న కృతాంధ్రభాగవత మందముచిందు నొకొక్కచోటఁ దా
మిన్నగనుండునా యన భ్రమింపఁగఁ జేయుచునుండె నోరు లే
కున్నది ప్రస్తుతింప నెవఁడుర్విని దత్కృతినాథుఁడొ నొకో! 144

చ. సరసగుణాఢ్య సత్యరత సన్నుతశీల స్రగాద్యలం క్రియా
భరితసుశోభితార్థ యన పద్యమనోజ్ఞ పదధ్వని క్రమ
స్ఫురితవచోవిలాసిని విశుద్ధచరిత్ర సువర్ణగాత్రి యి
ద్ధరఁ బితకన్నునుం బతిని దన్పునుగాదె సమస్తరీతులన్. 145

క. ఎయ్యదివినినఁ బరీక్షితుఁ డయ్యక్షర పదమునందె నఘరహితుండై
త్రయ్యంతసార మా కృతి వెయ్యాఱు భవమ్ములందు వినఁ జిక్కునొకో! 146

చ. అనుటయు నింగితజ్ఞుఁడగు నట్టి మహాకవి సార్వభౌముఁ డా
మనుజపతిం గనుంగొనుచు మానసవీథుల సంతసమ్ము తా
నినుమడిగాఁగ నిద్ది తమ కీడగువాంఛ యవశ్యమేను బో
తన కిదితెల్పి తత్కృతి ముదంబెసఁగన్ గొనివత్తునియ్యెడన్. 147

సీ. ఈ ప్రజాతతికెల్ల నెవ్వాని క్షాత్రమ్ము ఛత్రమై శీతలచ్ఛాయ లొసఁగు,
ఈ తెలంగాణ మహీరాజ్ఞి నే పాణి ఫణియయి తలఁదాల్చి భద్రపఱచు,
ఈ యాశ్రితావళి కేతేని దానమ్ము ధనమయి దారిద్ర్య దైన్యమడఁచు,
ఈ ద్విజసంతతి కే భాగ్యఫాలమ్ము ఫలమయి వాంఛాసఫలతనిచ్చు,

తే. లలిని శ్రీదేవి భూదేవివలచు నెవని వాణి రాణించు నే ముఖవనజమందు
సర్వమంగళాకృతికి నా స్థాన మెవ్వఁడతఁడు కృతిపతి యగుట భాగ్యాతిశయమె. 148

తే. మున్ను భోగినీ దండకమును రచించి తమిని సర్వజ్ఞులకు నంకిత మ్మొసఁగఁడె
పోతరాజు తానయి నేఁడు భూధవుండు కృతిని యాచింపఁగా నిరాకృతి సలుపునె. 149

చ. అనవుడురాజు తాను గవినారసి యాదృతి నిట్లు వల్కెనో
యనఘచరిత్ర! మీదు తనయామణి శారదఁ గావ్యశారదన్
దన వెనువెంటఁ దీసికొని తత్కృతికర్త భవాపహర్త పో
తన ఘన పత్తనమ్మునకుఁ దా నరుదెంచుట మేలుగాదొకో! 150

చ. అని పెదదండనాథుని సహోదర మొప్పఁగఁ బోతనార్యునిన్
గొని చనుదెంచ నాతఁడు మనోహరచామరచిత్రరాజలాం
ఛనములతోడఁ దూర్యగుణసంగత హాటకయాప్యయాన వా
హన ఘనవైభవ మ్మెసఁగ నమ్మహితాత్మునిఁ దెచ్చునియ్యెడన్. 151

ఉ. సంచితపుణ్యకర్ముఁడు విశాలమనస్కుఁడు వీతదైన్యుఁడున్
పాంచదమోఘ భాగవతభవ్య మహాంధ్రపురాణ సృష్టికిన్
గాంచ నగర్వుఁడుఁ విగతకల్మషుఁడిద్ధ చరిత్రు డాతనిఁ
గాంచి తెలుంగునాడు కడు గౌరవముంగొనె ధన్యంగనెఁ. 152

ఉ. వారి పదాబ్జధూళి భవవారిధి తారణసేతు భూత మె
వ్వారి గృహమ్మునం దొకలవమ్మది సోకునొ తద్గృహస్థ దు
ర్వార విపద్దవానల విజృంభితకీలలు పూలమాలలై
తీఱును దాపమాఱుఁ దలదీర్చిన దుర్విధిమాఱు నెంతయున్. 153

క. అన విని శ్రీనాథుండును మనమునఁ బెను సంతసమ్ము మల్లడిగొన నో
జనపాలా ! మీ యభిమత మొనరించుట లెస్స మీకు నొదవు శుభమ్ముల్. 154

తే. అనుట మన్నియ శ్రీనాథు నభిమతమ్ము తెలిసియుపవనిఁ వెసవీడి తెల్లవాఱ
ను త్తరీతిఁ బోతనకవి యూరు జేరననిపెఁ బరివారమును మహాఘనతమీర. 155

వ. అంత నొక్కెడ స్వప్నగతుఁడై రవికులతిలకుండు పోతనతో నస్మదాలయమున
భవద్రచిత భాగవతంబు సాంతము వినిపింపవలయు విన నుత్కంఠ గలదనుటయు. 156

ఉ. బమ్మెరలోనఁ బోతనయుఁ బండితపామర భక్తలోకముఁ
రమ్మనిపిల్చి తాను దగవ్రాసిన మేల్మి కవిత్వసంపదల్
కమ్మని యాంధ్రభాగవత కావ్య కథామృతధార లొల్కు మే
ఘ మ్మనఁగా వచించుసరి కన్నులఁగట్ట దశావతారముల్. 157

వ. అంత నొకనాఁడు పోతనార్యుండు భాగవతేతిహాసంబుల నుతువుచు ననంతకోటి భగవ
దవతారలీలలే భాగవతరూపమై యలరు నందును విశేష భగవద్విభూత్యంశ సంభూత
ములై యేకవింశత్యవతారంబులు గ్రాలు నందును ముఖ్యంబులై దశావతారంబులు
వెలుఁగొందు నీ పదింటఁ బ్రధానములైన రామ కృష్ణ నరసింహావతారంబులు ప్రత్యక్ష
లక్ష్మీవిశిష్టంబు లగుటకతనఁ బూర్ణంబులయి రూపొందె నందు పరాత్పరుండు నిజ
రూపంబగు శ్రీమన్నారాయణాకృతిన్ గజేంద్రదుఃఖ విమోచనంబు గావించె. మీనావ
తారంబునఁ బ్రళయవార్ధిలో విహరించు పాఠీనంబు పోల్కి, చేతనుని సంసారాబ్ధిని
సంతరింపఁజేయుటకు మదాజ్ఞాపితంబులగు శ్రుతిసంతతులే ప్రమాణంబులని, వేద

విరోధి మదనుశాసనావధి నుల్లంఘించినవాఁడు గావున క్షంతవ్యుండు గాఁడని సోమకరాక్ష సాపశదనిబర్హణంబును బ్రిబల తార్కాణమ్మొనరించి చూపె.

కూర్మావతారంబున నాపై భారముంచి నన్ను సేవించు విబుధులు గిరికరణి స్థిరంబగు తమ ధిషణావిశేషంబున వేదమహోదధి మథియించి తజ్జనితజ్ఞానకాండామృతంబు ద్రావి కూర్మంబు పగిది నింద్రియ సంయమనంబు గల్గి సంసారజలధి తరియించి యమరత్వమునొంది యస్మదనుగ్రహపాత్రులగుదురు. స్వార్థపరులును విపరీతజ్ఞానసంపన్నులును నగు వామాచారపరాయణు లాసురీ ప్రకృతిబద్ధ బుద్ధులై యజహరాదులనైనఁ బరిభ్రమింపఁజేయు మాయామోహినీ పరవశులై విఫలమనోరథులై చనియెద రనియె.

వరాహావతారంబున విశ్వనిర్మాతనై నిఖిల చరాచర పరిరక్షకుఁడనగు నేనె యివ్వ సుంధరాధినాయకుఁడనని గుర్తెఱుంగక క్షోణీకోణశతాంశపాలకులగు నృపాధములు నల్పీభూతములగు తమ జయవిజయ విశేషంబుల నాధారమొనర్చుకొని భూమండలమును స్వీయానవధికాశామహార్ణవంబుల ముంచి పీడించుతఱి బంటుతనము కుంటువడఁజేయు ప్రోద్రితనమ్మొప్పు క్రోడంబనై కోఱంజీరి తత్కాళంకపంకిలయగు పుడమి నొడుపున నడుసునఁ మడఁగి చను నాగరకందంబు చందంబున సముద్ధరింతునని తెల్పె.

నారసింహావతారంబున నేనే శ్రియఃపతినై సర్వాంతర్యామినై యొప్పు సర్వేశ్వరునని యెఱుంగక హిరణ్యకశిపులైన ధనాశాపాశబద్ధుండై యా సురకృత్యంబుల ధర్మాచరణ పరాయణుల మనంబుల ఘనంబుగా నొంచి ప్రహ్లాద హాని గల్పించి లోకంబుల శోకాకులంబు గావించి మించు మదకరుల పొదింగొననెంచి హరిరూపు ధరించి దుష్టశిక్షణ శిష్టరక్షణ గావింతునని యెఱుంగఁ జెప్పె.

వామనావతారంబున నీ సకలచరాచరాత్మకంబగు విశ్వంబు మత్కృతంబు మదధీనంబు మామకీనంబని యెఱుంగక నిఖిలంబు నిజార్జితవిత్తంబె యని జ్ఞానరహితుండై కర్తృత్వబుద్ధియు ఫలసంగసక్తచిత్తంబును గల్గి దానం బొనర్చుచు నఖర్వగర్వంబునఁ బరంగి బలియైనవాని యహంకారంబును పాతాళం బంటం ద్రొక్కిపెట్టి నీ త్రిలోకదానంబేని నస్మదీయ పదత్రయ పరిమితికిఁ జాలదని విక్రమించి చూపింపఁ ద్రివిక్రముఁడనై తినని తెలియఁ బల్కె.

పరశురామావతారంబున నిజబాహుబల దర్పోద్ధతిఁ గోబ్రాహ్మణ శుభాభ్యుదయంబును బ్రజాకుశలంబు నేమఱచియున్న క్షత్రియకులాంతంబు గావించి బలాధిక్యంబున మెఱసితినని వచియించె.

రామావతారంబున లీలామానుష విగ్రహుండనై స్వధర్మ రక్షాదక్షుండనని పేరొందితిని. మహామహులకు యుద్ధముచేయ శక్యముగాని సంసారమను నయోధ్యను

దశేంద్రియ విశిష్టమగు ప్రకృతి యనఁబడు దశరథుఁడు సత్వరజస్తమోగుణంబులను కౌసల్యా కైకేయీ సుమిత్రలను భార్యలతోఁ గూడి యాసురీప్రకృతి నడంచు దైవీ ప్రకృతిని రక్షించుచు, నమరపదవికి నర్హునిగాఁజేయు. ధర్మార్థకామ మోక్షములను రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులను సంతానము గాంచు సంసారి రాముఁడను ధర్మ స్వరూపము నారాధింపఁ దక్కిన పురుషార్థములు తమంతతాము వలచివచ్చునని చెప్పితిని.

కృష్ణావతారంబున మాయామానుష విగ్రహుండనై నరునకు విశ్వరూప సందర్శనం బొనర్చి గీతాజ్ఞాన ముపాస్యమని తెలిపి మాయారూపిణియగు ప్రకృతి మద్వశంబున నున్నదని బహుభంగుల నొప్పి యతిమానుషంబులగు చర్యల నిరూపించితినని పల్కె. రామావతారంబున ధర్మంబుదైనఁ గృష్ణావతారంబున మోక్షంబుదగు నుత్కృష్టతం జాటి యర్థకామంబుల కన్న ధర్మమోక్ష పురుషార్థద్వయం బాత్యంతిక సుఖప్రదంబులని విశదం బొనర్చె. అందులకీ యవతార విశేషంబుల దివ్యదృష్టి నాలోకించి సమస్తకల్యాణగుణామృతోదధియగు శ్రీమన్నారాయణుని గీర్తింపఁజెల్లు.

బుద్ధావతారంబున జన్మమృత్యు జరావ్యాధిపీడితాత్మలకు నిశ్శ్రేయసమార్గంబు నుపదేశించి భూతదయాచరణప్రాముఖ్యంబు నుల్లేఖించుచు త్రికరణములగు కాయిక వాచిక మానసికంబులఁ జేయరాని యపచారంబుల నిరూపించె. పరభూతంబుల హింసించుటయుఁ బరద్రవ్యస్తేయము నొఁర్చుటయుఁ బరకాంతలం గూడుటయు శారీరకదోషంబులనియు, అనృతప్రలాపంబు లాడుటయుఁ గొండెముల నుడువుటయు నశ్లీలవాక్యంబులఁ బ్రలాపించుటయు వృథాజల్పన మాచరించుటయుఁ బరనింద నొనర్చుటయు వాచికదోషంబులనియు, దురాశాపాశబద్ధుఁడగుటయు రాగద్వేష సంగతి నరిషడ్వర్గాధీనుఁడు నగుట నజ్ఞానజన్యములగు మానసికాపచారముల నాచరించుట యగుననియు నీ త్రివిధాపచారముల నాచరించుట తగదనియు, జన్మజరా మృత్యువులును నిష్టానిష్ట వియోగప్రాప్తి కర్మఫలంబులును నలభ్యవస్త్వాశాదులు దుఃఖ ప్రాపకములనియు, తద్వినాశకారు లష్టాంగయోగములగు సమ్యక్ దృష్టి సమ్యక్కల్ప నము సమ్యగ్వచనము సమ్యక్కర్మ సమ్యగ్జీవనము సమ్యగ్వీర్యము సమ్యక్స్మృతి సమ్యక్ సమాధి యనునవి యనియుఁ దెలిపి, ఫలంబుల రుచి పలలంబున లేదనియుఁ బాల తేనియల యందలి రుచి కీలాలంబుల లేదనియు హింసాత్మకంబులైన యాహారంబులు మృతంబులనియుఁ బువ్వు నొవ్వనట్లు పూఁదేనియలఁ గ్రోలు మధుకరంబు రీతి సురభిని పరిరక్షించి క్షీరంబులఁ బానమొనర్చు కీలారిభాతి యమృతాహారం బొనర్చుట లెస్సయనియు మృతాహారంబును భుజించువారు దానవులనియును నమృతాహారంబును నొనర్చువారు మానవాతీతులగు దేవతలనియు నట్టి యమరులు సర్వ సుఖాది నిర్వాణప్రాప్తులకు సమర్థులనియుఁ దథాగతావతారంబున నిరూపించెనని చెప్పుచు నొక్కొక్క యవతార కథావిశేషంబులెఁ దెలుపుఁచు నొక్కనాఁడు వరాహావ

తార గాథావిశేషంబుల వినిపించుతఱి నానందపరవశులై యఖిలమ్ము మఱచిన యచటి
ప్రజ లందఱుం దన్మయత నందుటయు, 158

చ. ఇరువదిమంది సైనికు లహీన బలాఢ్యులు ముందు వోవఁగా
నర పదిమంది యాశ్వికు లహర్పతితేజులు వారి వెన్క రా
నిరువు రమోఘులౌ రథికులేగఁగ మధ్యన దండనాథునిన్
బరిజనమంటి కొల్వ వడి బమ్మెరజేరిరి వార లయ్యెడన్. 159

శా. అశ్వస్యందనయాప్యయాన గజవిన్యాసంబుతో డంబుతో
శశ్వచ్ఛత్ర మనోజ్ఞచామరల సత్సామ్రాజ్య చిహ్నాళితో
విశ్వాశాభృతతూర్యరావములతో బీతేల యంచున్ బ్రజన్
విశ్వాసంబులఁ దేల్చు సద్భటులతో విచ్చేయ నచ్చేరువన్. 160

మ. పరివారంబది వెంటనంట మగధుల్ బల్ రీతులన్ వీరతా
బిరుదంబుల్ పఠియించుచుండ ధరణీ వీరాతివీరుండు సం
గరసింహుం డలరావు సింగసుమతిక్ష్మాపాల దీవ్యచ్చమూ
వరనాథుం డరుదెంచు నన్న నుడువుల్ వ్యాపింపఁగా నల్దెసల్. 161

మ, అరుదెంచున్ సమధిష్ఠితోజ్జ్వల మనోజ్ఞాశ్వంబు నుచ్చైశ్శ్రవ
స్స్ఫురణమ్మున్ గలిగింప ఖడ్గ మురగస్ఫూర్తిన్ గటిన్ వ్రేల నం
గరకాయంచులు మించులై గగనభాగం బందు వాతాహతిన్
మెఱపుల్ జిమ్మఁగఁగాక పక్షనిలస న్మేఘాంతరాంతంబులన్. 162

ఉ. అక్కడి శ్రోత లొక్కమొగి నక్కజ మందుచు నశ్వ సైన్యపుం
డెక్కల చప్పుడెక్కడ నిటే వినవచ్చు నటంచుఁ గాంచ నా
ప్రక్కనె రాజపూరుషుఁడు బంగరుశాటి మెఱుంగు కొంగు న
ల్దిక్కుల నాట్యమాడఁ జనుదెంచుచునుండె సభాభిముఖ్యుఁడై. 163

తే. అంబరమునంటి మెఱయు శంపాకృతులన నచ్చటచట జరీయంచు లందగింప
వలయిత ఫణీంద్రసిత కళేబరము కరణి శీర్షసీమ నుష్ణీషంబు చెలువు గులుక. 164

ఉ. తీరగు రాజసమ్మునకు దిక్కగు మోము గభీరదృష్టి కో
పేరునుగేరు నాసికకు శీవిగ నిట్టటు నీలకాంతులన్
బారులుదీరు తేఁటులన భాసిలు మీసలు దగ్రపౌరుషాం
కూరత వెల్గఁ జిర్నగవు క్రొన్నెల వెన్నెలగాయ శీవిమై. 165

క. అరుదెంచి తేజిదిగి కవి చరణములకు నంజలించి సాధునుతా ! మీ
వరదర్శనమ్మునన్ భవతరణ మ్మొనఁగూడె జన్మ ధన్యతఁగాంచెన్. 166

తే. అనుటయుం బోతనార్యుండు నా క్షణంబె తత్కథావిధానమ్ము నంతకె ముగించి
గ్రంథమును గట్టిపెట్టి యాగతుల స్థితుల సకలమెఱిఁగె నిట్లాడె నా సైన్యపతియు. 167

చ. కవికుల కల్పభూజ మరిగంధ గజాంచితసింహరాజ మా
ర్దవగుణశీలరూప మురు శాస్త్రకళా ప్రతిమానదీప మైం
దవకుల దుగ్ధవార్నిధి సుధారసహారి శరీరధారి మా
యవనిపుఁ డార్య! తానవినయమ్ముగని నిమ్మనవిన్ బొనర్చెడిన్, 168

చ. ఎవని సుధీప్రపంచమున నెంతయు భక్తిమహోదధుల్ మహో
త్సవగతి రామచంద్రి ముఖదర్శనముం గని నాట్యమాడునో
యెవని మనంబు వెన్నుఁడన నిట్టె కరంగును వెన్నయోచుఁ దా
నెవనిముఖాన వాణి మథియించును విష్ణుకథా సుధానిధుల్. 169

చ. ఎవఁడల వేదసారమన నెంతొ ప్రశస్తిని గన్నయట్టి భా
గవత సుధాబ్ధినంతటి నగస్త్యుఁడనం బుకిలించి మించెనో
యెవఁడల వ్యాసమౌనికృతి కెన్నిమొ వన్నెలు తీర్చిదిద్దె నా
కవితిలకుండు తద్రచితకావ్య మనామయతన్ జెలంగునే. 170

మ. తలక్రిందుల్ తపముం బొనర్చినను బోధ్యద్వేదశాస్త్రంబులన్
బలుమాఱుల్ పఠియించినన్ హరిహరబ్రహ్మాదులే పూరుషున్
గలనైనం గనలేరొ యా నృహరివీఁకన్ వచ్చి పూరించెఁ దా
నిలనే సత్కవి పద్యశేషమతఁ డూహింపన్ నరాకారుఁడే. 171

ఉ. రాజసబుద్ధి నజ్ఞులపరాధ మొనర్చిన జ్ఞానదృష్టి వి
భ్రాజితులౌ మహాత్ములది పాటియొనర్పరుగాదె స్వర్ణదీ
రాజిత నిర్మలాంబువుల రాశులు వైవఁగళంకపంక ని
స్తేజములై యెసంగునె విశిష్టచరిత్రులనన్ దయాంబుధుల్. 172

తే. మావలన నెట్టి దొసఁగులు మసలెనేని వాని క్షమియింపవలయు ననూనచిత్త!
ఘనము లట్టులే యెప్పుడున్ ఘనహృదయము వరదయావృష్టి గురియు నివ్వసుదసమత.

మ. క్షితి శ్రీ భాగవతాంధ్రభవ్య కవితా సీమంతినీ సద్గుణ
ప్రతతుల్, రమ్యకళావిలాస విలసద్భావోన్నతుల్ శారదా
కృతి మేల్వన్నెలుగూర్చె ముక్తి వనజాక్షిన్ జెంతకున్ దార్చె నే
కృతి యా సత్కృతినంది విష్ణుపద సత్క్రీడన్ వినోదించునో. 174

ఉ. తావకసత్ప్రబంధ కవితా నవలోక సుధారసాబ్ధి సం
సేవనభాగ్య మబ్బుటలు జేకురఁ బున్నెము లెన్ని సేయుటో

దేవర పాదపద్మవరతీర్థమరంద మిళిందరూప సం
భావితమౌ శిరోజములఁ బావనతంగను బెన్నఁడో కదే! 175

వ. అనుచు నస్మన్నృపాలుఁడు భవదర్చితభాగవత శ్రవణ కౌతుకాయత్తచిత్తుండయి యుండె.

ఉ. కావున సాహితీత్రిదివ కల్పకరూపులు తాము, వాణికిన్
దావలమై సుకావ్యగుణదర్పణమై భవత ప్తచేతనో
జ్జీవనమౌ త్వదీయ కృతిశేఖరముంగొని చాతకాంబుద
శ్రీ వెలయంగరావలయు సింగనృపాలుని రాజధానికిన్, 177

మ. తమకై వాకిట వేచియున్నవదె మా ధాత్రీశు పాల్యంకికల్
రమణీయాశ్వములున్ గజంబులు రథవ్రాతంబులున్ సత్కవీ!
సుమమట్టుల్ తలఁదాల్చి దేవరను మా క్షోణీశు సాన్నిధ్యమున్
శ్రమ కించిత్తును గల్గకుండఁ ద్రుటిలోనన్ జేర్పమే ధీమణీ! 178

తే. ఔర! మిముఁబోలు పుంభావభారతీ లలామ నిజయశోమౌక్తికదామ మగుట
నతిని దలఁదాల్చి యుచితసత్కృతి నొనర్ప రహిని గర్వించు మాదు సామ్రాజ్యలక్ష్మి. 179

వ. భవ్యగుణసనాథ యగు భవత్కావ్యశారదతోఁబాటు కవి సార్వభౌము ననుంగుపట్టి
యగు శారదన్ వెనువెంట గొనిరమ్మని మనవిం బొనరించిరనుటయుఁ బోతన
యాతని నాలోకించి స్మితపూర్వకభాషణం బొలయ, 180

చ. నరపతి యాంధ్రభాగవత నవ్యకథా శ్రవణాభిలాషియై
వఱలుట మామకీనఘన భాగ్యమటంచుఁ దలంతు నన్ను సా
దరగతిఁ బిల్వఁబంచుట లెదన్ ముదమంది కృతజ్ఞతా వచ
స్ఫురణ మెలర్పనుంటి దయజూపుటె చాలనుకొంటి నియ్యెడన్, 181

ఉ. నాదగు స్వప్నమందు రఘునాథుఁడు తా నరుదెంచి వాకొనెన్
వేదవిచార! తావకవినిర్మిత భాగవత ప్రబంధ మా
మోదము మీఱఁగాఁ బఠనమున్ బొనరింపుము జన్మముక్తికిన్
మూదలయైచనన్ బ్రజవినన్ సకల మ్మకళంకమై ఖరిన్. 182

క. కావున సదయతనిది మీ భూవిభునకుఁ దెల్పుఁడనఁ జమూపతియనె నే
నేవిధినైనన్ మిముగొనిపోవలదా నృపాలునాజ్ఞ పూర్తియొనర్పన్. 183

తే. తమకుఁ దెలియనిదొకొ మాకు దాఁటరాని దధిపునాన యటంచు సువిదితచరిత!
కాన మాపయి సుంతయక్కటికమూని విజయమొనరింపఁదగు రాచవీటికెందు 184

క. అనుటయుఁ బోతన స్మేరాననమొప్పఁగ నచటి దండనాథునిగని యి
ట్లను మీ నరేంద్రుతోనే మనవి యొనర్చితినటంచు మాటాడుఁ డిటుల్. 185

క. శరణార్థిననుచు రాక్షసవరుఁడగు రావణుఁడు తాన వచ్చిన నేనిం
బరిరక్షించెదనను హరి చిరాయురారోగ్యభాగ్యుఁ జేయుత ! నృపతిం. 186

ఆ. అరుసుపనుపుదాఁట నలవియే మూకని తామె యిటులు పట్టుదలవహింప
రాము నానదాఁట నీ మహినెవఁడేని దెగువసేయు ననుట నగవుగాదె ? 187

సీ. ఎవని మున్‌జన సగమ్మేగు ప్రాణమ్ము లా బలియుని గుండెలో మలికియయ్యె,
దేవేరి యెదనేఁచు దేవేంద్రసుతునైన గతిలేని పక్షినిగా నొనర్చె,
పదితల లొకటియై పశువృత్తిఁ జనుదెంచ నొరుగోల యముపీటఁ దటిమివైచె
ఖరవృత్తి దూషణాకరమైన శలభాళి బాణాగ్నికీలలఁ బడఁగఁ ద్రోచె

తే. వసుధ నేవేళ మల్లు లెవ్వానియానఁదల ధరింత్రు సుగ్రీవాజ్ఞ దాఁటరాని
దనుచు నట్టి సుగ్రీవుని నాజ్ఞవెట్టు రాజరాజాజ్ఞనేఁ ద్రోచి రాఁజనునొకొ ! 188

వ. అనుటయు నచ్చమూపతి పోతనంగని, 189

తే. నేను మీకు నుడువుపాటి వానిఁగాను నృపుని యభ్యర్థనమ్ము మన్నించు టొప్పు
భూపతియును విష్ణ్వంశసంభూతుఁడగుట తమ రెఱుంగరె యనుటఁ బోతన యిటాడు.

సీ. ధరణితోఁబాటు నీ వరతారక లెవానికై నాడు వింతబొంగరము లగునొ
పవలురేల్ వెలుఁగీను రవిచంద్రు లెవ్వాని కరుణా కటాక్షవీక్షణము లగునొ
ప్రాణిసంతతి కెల్లఁ బ్రాణమై యొప్పారు వాయువెవ్వాని యుచ్ఛ్వాసగతినియొ
విశ్వనాటకమెల్ల వీక్షింపఁగాఁ జేయఁగోరి యెవ్వఁడు సూత్రధారి యగునొ

తే. నిన్ను నన్ను మన్నియను నీ నిఖిల భూతకోటి నెపుడు రక్షించెడి కోటిసూర్య
వరకళా భాసమానుఁడై వఱలు నెవఁడొ వానిసాటియొ రాజులీ వసుధఁ గలరె ? 191

ఆ. శీతనగమురీతి సికతాణువును ఖ్యాతినశ్మరూపమైన యంత మాత్ర
సమతగనునె యట్లె క్ష్మాపతి విష్ణ్వంశనలరి నంత శ్రీ నృహరికిఁ దులయె ? 192

క. అది విని యచటి జన మ్మతి ముదమందెను సుకవిఁ బొగడి మ్రొక్కులిడెను దా
నది విని సేనాపతి కెంపొదవఁ గనుల నిట్టులను కవీంద్రుని మోలన్. 193

ఉ. ఎవ్వని రాజ్యమం దటులె యెవ్వని పాలనమందు సత్కవుల్
నొవ్వాక యింతలేక వర నూత్నకవిత్వ మహత్వ సంపదల్
నివ్వటిలంగ భుక్తియును నిస్తుల ముక్తియుఁ గూర్చుకొంటిరో
యవ్వసుధేశుఁడే పిలువనంపిన నిట్లు తిరస్కరింతురే ? 194

శా. దుర్వార ప్రతివాది వాదతిమిరాస్తోకౌఘ మార్తాండుఁడున్
గర్వోన్మత్త విపక్ష గంధగజ సంఘస్వప్న కంఠీరవుం

దుర్వీశాగ్రిణి యర్థికల్పకము కావ్యోద్యాన వాసంతమా
సర్వజ్ఞాంకితు నిట్లవజ్ఞ సలుపన్ సంభావ్యమే సత్కవీ! 195

వ. అది విని పోతన యతనిం గాంచి, 196

ఉ. నశ్వర రాజ్య సంపదల నశ్వర యౌవన జీవనమ్ములన్
నశ్వర భోగభాగ్యముల నమ్మిన మానవు నాశ్రయించుచున్
విశ్వవిధాత నచ్యుతిని విశ్వచరాచర భూతరక్షకున్
శాశ్వత సౌఖ్యదాతను విచారము దక్కి త్యజింప నొప్పునే? 197

చ. అన విని దండనాథుఁడు మహాకవి నారసి కోపతాపముల్
మనమున నంతకంతకును మల్లడిగొంచుఁ గలంప మిర్రింగి యే
మనుటకు నోరురాక తన యాత్మ నదేమి దలంచెనో వెసన్
దన పరివారముం గనియెఁ దత్క్షణ మెల్లరు విచ్చుకత్తులన్. 198

చ. మును గల గ్రంథరాజమును ముట్టిరి చుట్టును దత్ప్రజావళిన్
జనుమని హెచ్చరించిరి లసత్ కృతిరత్నము నెత్తి నెత్తినన్
గొనిచన నేమి దోఁచకయు గోడవలెన్ నిలిచెన్ గవీంద్రుఁడున్
మన మెరియంగ నోట నొక మాటయు రాక యెదిర్పలేక తాన్. 199

క. అచ్చట నున్న ప్రజావళి యిచ్చెయిదముఁ గాంచి వ్రేలునిడి ముక్కుపయిన్
జిచ్చవడి కాంచుచును నిది యచ్చపు టన్యాయమనుచు నాడెన్ దెగువన్. 200

తే. రామ చైత్య ముఖద్వారసీమ జేర వారు గ్రంథమున్ గైకొనివచ్చిరంత
నూరుకూరును దడిగట్టియున్న యచటి ప్రజల కధినేతయన ముందు వచ్చె నొకఁడు.

సీ. భూజన సంస్తుత్య భూరి బలాఢ్యుండు నభినవ యువమారుతాత్మజుండు,
వర వృషోన్నత ఫాలవక్షో విరాజితుం డర్గళా సదృశ బాహాన్వితుండు,
దృఢసంధి బంధ సందీప్త వజ్రశరీరి మల్లకోటీర సీమా విహారి,
నవయౌవనోదితానర్ఘ తేజోరాశి పరిపూర్ణధైర్య సంపద్విభాసి,

తే. అనవరత సత్కథా శ్రవణాభిలాషి సత్య ధర్మ సంగత సాధుజన హితైషి,
అనృత విద్వేషి స్మితపూర్వకాభిభాషి స్వచ్ఛవర్తనుఁడౌ కృషీవలుఁ డతండు. 202

త. అతనిని సేనాపతి యతి కుతుకంబునఁ గాంచి యోర! గొట్టె బలిసి ప
ర్వతముల డీకొనినటులో మతకరి! నీ వెదిరిబలము మతిగన వనినన్. 203

వ. అంత నా జగజెట్టి సేనాపతిన్ గని, 204

ఉ. పొత్తము నెత్తి నెత్తుకొని పోయెదవే తెరువాటుకాని య
ట్లుత్తమ వీరవంశమున నుద్భవమంది త్వదీయ పౌరుష

మిమ్మ త్తెఱఁ గాలఁబోలిన కవీంద్రుల యందొ, యదెంతొ కొంత నా
కుత్తుక నుత్తరించి మఱి కొంచరుగం దగు గ్రంథమం చనెన్. 205

ఉ. అంతనె యాముషేనికల యొదల నాడెడి కోడెసింగమై
చెంతఁ జెలంగువాని కడఁ జేలగుడమ్మను డుస్సికొంచు వి
క్రాంతి వెలుంగ నెన్నడుము కాసె బిగించి కరాన మట్టినొ
క్కింతగ రుద్దికొంచు మొగ మెత్తినగా నతఁడేగి వేగతన్. 206

ఉ. పొంగెడు కండెముల్ కరుడు నొల్చెడి కండలు మేన వీరతా
గాంగజలాల మీలగుచు గండెసఁగన్ వడిఁ ద్రుళ్ళియాడఁ బూ
ర్ణాంగము నంటు వజ్రకవచాకృతిఁ బెట్టనికోటవోలెఁ గే
లం గల కోల రక్షనిడ లాయుచు మార్తురనొంప డాయుచున్. 207

ఉ. శూరత యొప్ప లాఘవము చొప్పడ వేమరు సాముచేయుచున్
వారలఁ దాఁకి ముందడుగు వైవఁగనీ నటు లార్చిపేర్చె న
వ్వీర శిరోవతంసుఁ గని విక్రముఁడౌ దళవాయి పోరె మేల్
పౌరుషమొప్ప నొదలను ఖాసిలు కోశము వీడ కెందునున్. 208

ఉ. నాలుక గేరుచున్నదిదొ నా యసి కూసము వీడు సర్పపుం
బోలిక నిన్ను నంజుకొను బుద్ధిని నీ యొఱవీడి యింక నీ
వాలక ముండఁబోదు మది బాగుగ మున్వెనుకల్ దలంచి వే
మేలుకొనంగఁ జెల్లుఁ జెయి మించినవెన్క సవర్ప వచ్చునే ? 209

వ. అనుటయు నమ్మొనకాని పలుకుల సరకుగొనక యా జగజెట్టి, 210

చ. కరమున వెల్గు దండమది కన్గవకున్ గనరాని యట్టులన్
బిరబిర ద్రిప్పుచున్ భటుల పీఁచ మడంచుచు నెందుఁ దానయై
యుఱుముచు శత్రుశీర్షముల నుద్దవడిన్ జని ఫక్కఫక్కనన్
దుఱు మొనరించుఁ జిమ్మిపడి తోడనె నెత్తురుటేర్లు వాఱఁగన్. 211

క. బెడిదపు టడిదము లగుడము విడివడి కడుఁ బోరుచుండ వెస లగుడము తా
నడిదపుఁ బిడికిటి ముడిపైఁ గడువడిఁ దాఁకుటయు నొచ్చి కత్తిని జార్చెన్. 212

క. వలకేలు కైదువున డా పలికేల్ దలవెల్గు భాగవత కోశముపైఁ
జెలఁగన్ వలకై పట్టా తొలఁగెన్ దిరిగికొన వలను దోఁపమిఁ గడఁకన్. 213

క. అటఁ గల శిల లేఱుచు నుద్భటగతి రువ్వినను నవియుఁ బటపటమని తా
మటు నిటుఁ ద్రిప్పెడి కట్టకె పటుతరగతిఁ దాఁకి చనునుఁ బడ వతని పయిన్. 214

ఉ. వేమరు నేకలవ్యుఁ దలపించును మించును వీఁడు నేర్పుఁ దా
నీ మహి నిట్టి నేర్పెచట నెవ్వఁడు వీనికి నొజ్జయంచున్
బూమెలఁ బన్ని యగ్గలపుఁ బోకలఁ గొన్ని దలంచి పొంచుచున్
దామొకశై కృషీవలుని దాఁకిరి బాకులు దూసి యెల్లరున్. 215

వ. అంద ఱొక్కమొగిన్ బొదివిన నవ్వీరులం దా హొంతకారి సాము సేయుచు. 216

సీ. ఒకమాఱు సరి నిల్చి యుద్రిక్తతం బోరు శత్రుల మణిబంధ సంధులెడల,
ఒకమాఱు సింగమ ట్లుప్పర మ్మెగయును బగతుల పుఱియలు పగులుచుండ,
ఒకమారు దేగయట్లొయ్యనేలకు వంగు గుల్ఫాస్థికలు చిట్లి కూలిపడఁగ,
ఒకమారు దుసికిల్లి యొనరున్ వెలివచ్చు నరిమూఁక పసులటుల్ పరువునెత్త

తే. నిటు లతఁడు సేయు సాంపారాయికముఁ గాంచి గుండె లదరఁగ మా పాలి దండధరుఁడు
వీఁడటంచును బ్రత్యర్థి వీరభటులు తీండ్రపుగు వేండ్ర మెరియింపఁ దెరలుచుండ్రు. 217

క. అచ్చము భీముఁ డితని యనిఁ జొచ్చి బ్రతికివచ్చుటనిన సోద్దెమటంచున్
నొచ్చుచు మెచ్చుచుఁ బ్రతిభటు లచ్చేరువఁ బోవవెఱతు రంతటిలోన్. 218

క. ఱని తెఱఁగున సింగంబులు వెనుదిరుగుచుఁ దోఁకముడిచి వెడలఁగనగునే
ఘనుఁడగు క్షత్రియుఁ డెందును మును నిడుకొను యశముఁ బ్రాణముల బలి నిడియున్.

క. అనికిన్ దొరకొనవలె మీరని సేనాధిపుఁడు వల్క నవ్వీరులలో
ఘనుఁ డొకఁడు మందగతి వెనుమును దిరిగెడి యతని దండమును నిశితాశిన్. 220

తే. వైచుటయు నది ఛట్టని వ్రక్కలింపఁ బడియె గండ్రికల్ రెండుగాఁ బుడమి నంత
సృణి విహీనుఁడై యొప్పు మాస్టీని పైకిఁ దిరుగఁబడు మదేభములయ్యె నరిగణములు.

వ. అంత నా జగజెట్టి, 222

ఉ. వాతెఱ పంట నొక్కుచును వాలుబొమల్ ముడివెట్టుచున్ జ్వలత్
జ్యోతులభాతి నేత్రములు శోభిల ముక్కుపుటంబు లుబ్బగా
బ్రాఁతిగ శ్వాసయాఁడ గనుఁబ్రామునెఱుల్ చెవిసం దిముడ్చి తా
నాతఁడు రుద్రుఁడయ్యె, రిపు లందఱు పైఁబడి రొక్కపెట్టునన్. 223

క. తెగరేఁగి పగల నొండొరు బిగికౌఁగిటఁ బెనఁగు చొకట విరిసెడి ధూళిన్
పొగ నెగసెడి కీలల గతి నగపడి యగపడక యాజి నాడదొడఁగుటల్. 224

వ. అంత నొక్క యింతి వెనువెంటఁ జనుదేర, 225

సీ. పడియ నప్పుడె వీడి పదుపుతోడం గూడి పఱతెంచు నొక్క సూకరము కరము
గురు బలీవర్దముం బరిహసించెడునట్టి గొప్ప నెమ్మెయి చాల యొప్పు మిగుల,

కాఱులు చూపుల నగ్నిగోళమున్ సుడిజుట్టఁ గోఱల నెలవంక కొన లిగుర్ప,
వాలమ్ము వాలమ్మువలెఁ ద్రిప్పియాడుచు శ్రవముల తిక్కించి చవుకళించి

తే. దిక్కులన్ ఘుర్ఘురధ్వనుల్ పిక్కటిలఁగఁ, బెరెములు వాఱుచును బ్రజల్ బీతుగొనఁగ
దారి కడ్డంబుగా నిట్టి పోరు జరుగు నచ్చటికి వచ్చి మునుజన నలవిగాక. 226

క. బెదరుచు నటునిటు గాంచును జెదరఁగఁ దన మందఁగొట్టఁ జేయెత్తు నరున్
బెదరించు ఘుర్ఘురధ్వని గొదగొద నిట్టట్టు తఱిమికొట్టున్ బిట్టున్. 227

చ. ముసముస మూర్కొనున్ బుడమిముట్టె నొగిన్ బిగఁబట్టుచున్ బ్రజన్
రుసరుసగాంచి పొంగుఁ దనురోమము లెయ్యెడఁ గొయ్యబాఱి ము
ల్కొసలయి నిల్వ మూఁపుపయిఁ గోలము వాలము నార్చుఁ గొండకున్
బొసఁగెనొ యింద్రియమ్ములన ఘూరిభయంకర విక్రమూర్ఛటిన్. 228

క. అదిగని యొక కుర్కురపుం గొదమ పిడుగు పగిదినుఱిమి కోలాధిపు నా
యదనెంచి తఱిమెనదియుం గదనంబొనరించు మొన నొకనిఁగని తాఁకెన్. 229

ఉ. తాఁకినయంతలో నతఁడు ధారుణిఁగూలెను వాని నెత్తినన్
బ్రాకటరీతి నొప్పెసఁగు భాగవతమ్మది నేలవ్రాలె నా
మూఁకకు మూఁక ఘోణిశిరమున్ బరులన్ వడి మోదసాగె మే
ల్పాకుల నీటెఁలన్ సురియవంకిణులన్ జముదాడిపోటులన్. 230

వ. అక్కటియును. 231

చ. వెనుకకు నొక్కమాఱడుగు వేయుచుఁ బొంచును రూపు కుంచిత
మ్మును బొనరించి యొక్కపరి ముందరుదెంచును ఘుర్ఘురస్వన
మ్మొనరిచి మేనుబెంచి నటలుద్ధతి నిల్వ నశల్యపర్వత
మ్మన మొనదాఁకు తాఁకునకు నందఱుఁ జిందఱవందఱై చనన్. 232

సీ. శశ్వదరాళ దంష్ట్రికరాళాస్యంబు ప్రళయార్కబింబమై భయముగొల్ప,
ఉత్క్షిప్తనిజవాల విక్షేపగతిఁ గశాఘాతమై చతుర్దిలన్ గలఁతవెట్ట,
క్షురసన్నిభ నిశాతఖురహతక్షోణి నరాతి కన్గవ ధూళిరవలునిండ,
అరిగజస్వాంత భీకర ఘుర్ఘురధ్వనుల్ క్ష్వేళావిరావ ప్రసిద్ధిగొల్ప,

ఆ. పాదయుగము మధ్యవడి తూఱుశరమనన్ దాఁకు నొకటఁబగఱ ధరణిఁగూల,
చీఱుగోర రక్తసిక్తాంగులై భటుల్ తాళవృక్షగతుల నేలఁగూల. 233

క. కందముఁ జెప్పినఁ గవియగుఁ బందిని హతమార్చు నతఁడె బంటనుచు జన
మ్మందుఱు దీనిని గూల్చమి నెందుకు బ్రిదుకనుచు రిపులునేగి రొకటియై. 234

చ. అసువులకుం దెగించి యొకటై కిటిఁ గుప్పిరి యీఁటెపోటులన్
బసగల యంపకోలలను బాకుల మ్రాఁకులఁ బట్టిసమ్ములన్
ముసల కుఠారముద్గర సమూహములన్, వడిఁదాఁకి యవ్వియున్
గొసలకువంగి చీలి భువిఁగూలె నయస్సదృశాంగ సంగతిన్. 235

సీ. నగశృంగ నిర్గతాపగలట్లు భిన్నమూర్ధములఁ గీలాలంబు ధారలొల్క,
పుష్పితపాలాశ భూరుహప్రక్రియ క్షతరిపుకాయసంహతి చెలంగ,
వేలావినిర్భిన్న వికలితకల్లోల విసరమై యరిసేన వెన్కకరుగ,
హతమూల పాదపప్రతతులై పరిపంథిని చయమ్ము లొకపెట్టు నేలవ్రాల,

తే. నిలిచి పైఁబడి ముంగాళ్ళనెత్తి చఱచు నేరుపునఁ గాళులం దూరి చీఱిపెట్టు,
ఉఱిమిచూచుచు నొకపరి తఱిఁకొట్టు వడిగఁ దాకుచు ధరణిపైఁ బడఁగనెట్టు. 236

క. దురమొనరిచెఁగిరి యరి యుక్కిరిబిక్కిరిగా నజీవగిరి వరమటు పో
కిరితనము వీడి రిపులక్కిరిఁగని మ్రొక్కిరి మురారికిటి రూపనుచున్. 237

ఉ. ఈ కరణిన్ విపక్షతతి నే పడఁగించి వరాహరాజ మ
స్తోకపరాక్రమం బడరఁజూచు నరిన్ దగనిల్చి సత్కృతిన్
దాఁకిన వాని గుండెల విదారణమున్ బొనరింతునో యనన్
జోకఁ జతుష్పదాంతర విశుద్ధపదమ్మునఁ గోశ మొప్పఁగన్. 238

క. అచ్చెరువడి యచ్చటి ప్రజ లచ్చేరువకేగి స్వామి ! యాది వరాహా !
యొచ్చెము దీర్పఁగఁ దా మిటువచ్చితిరే యనుచు శిరమువంచిరి భక్తిన్, 239

తే, అపుడు పడవాలు కుఱఁగలి కరుగుదెంచి మొక్కవోయెడు తఱిఁబంది యొక్కపెట్టు
పైఁబడంజనె మొనకాఁడు భయముజెంది వెనుక వెనుకకుఁజనె దండు విచ్చిపోయె, 240

క. క్రోడపు రూపముఁగని యా నీడకునుం భయముజెంది నిల్వఁగ లేమిన్
బోఁడిమి చెడి యోడితిమని యూడనిబాడెదరు దిక్కుకొకరై పగతుల్. 241

శా. స్వామీ ! తా మిటు లాంధ్ర భాగవతరక్షన్ సేయఁగా వచ్చినా
రేమీ యజ్ఞవరాహరూపమున, నే నేమందు నా భాగ్యమున్
మీ మహాత్మ్యమెఱుంగ బ్రహ్మకుఁ దరమ్మేయంచుఁ దాఁ బోతరా
జామాత్యుండు నతి న్నుతించి ధృతి డాయంబోవ నక్కోలమున్. 242

చ. జలధి తరంగముల్ దొలఁగ శాంతగతిన్ విలసిల్లు చొప్పునన్
జలదము గర్జన మ్ముడిగి సౌమ్యగతిన్ నడయాడు చాడ్పునన్
వెలసెఁ బ్రసన్నదృష్టి, సుకవీంద్రునకున్ గృతి నొప్పగించి యా
వలఁ జనెనేదొ తా నటకువచ్చిన కర్జము పూర్తియైనటుల్. 243

తే. వెంటనంటి పర్వెత్తుచు వెడలనేని@ గంటికిం గానరాని వేగమున నుఱికి
యంతలోనె యదృశ్యమైనట్టి పోత్రినెంచి భక్తిమై@ గేలు జోడించె సుకవి. 244

చ. అట గుమిగూడి నట్టి జనమంతయు వింతనుగొల్పు తత్కృతిఁ
గిటి యసమానపౌరుష మొగిఁ సుకవీంద్రుని భక్తిభావముఁ
బటుతరమల్ల తల్లజుని బాహుబలంబును వేయినోళ్ళ@ బ్రి
స్ఫుటగతి సన్నుతించుచును బోతన పాదములంటి మ్రొక్కుచున్. 245

చ. ధరణిని శ్రీ శుకాంశమిటు తా నవతారము@ దాల్చె బద్ధులౌ
నరుల సముద్ధరింప@ బ్రితినం ద@గబూని యటంచు నెంచె, న
ల్లరిగి శిరమ్మువంచి వినయమ్మొనరం బ్రిణమిల్లె జెట్టి, సా
దరగతి వాని@ గౌ@గిటనుదార్చి కవీంద్రు@డు పొందరిపుందమిఁ. 246

చ. వపువున రోమహర్షమొదవం గనుగోనల సమ్మదాశ్రువుల్
కృపలనుజే@పి మైత్రియను కేదరముఁ హరుముంజి మౌక్తిక
స్నపనవిధిం బొనర్ప@ గవి సత్తము@డర్మిలి, జెట్టి ! నీదు సా
యపు ఋణమీ@గు తెన్నుగన నన్న నతండిటులాడె భక్తిమై. 247

మ. వినవే వ్యాళకరాళదంశహతి నుద్విగ్నాంగు@డై యుండ@గా
మును మా యయ్యకు మందొసంగి వడి పామున్ జంపి రక్షించుటల్;
తను వింతింతలు కోసి యిచ్చిన@ గవీంద్రా ! మీ ఋణం బీ@గ@జా
లనుపాయంబు గలాదె మీకు నొక మేలుం గూర్ప@గా నేర్తునే ! 248

క. కిరి యసమానపరాక్రిమ మరివర్గము నవలనెట్టి యక్కజ మొదవం
బరిరక్షించెను గృతినిది యొరులవశమె దానిరాక యొనగూడె నిటుల్. 249

తే. అంగవించి పిశాశియై వింగడముగ@బోరె నరిగుండెలగల నవ్వారిగా@గ
నిరులడంచు పెన్మినుకుల బరణివోలె@ దఱిమె రిపుగణమ్ముల@గిటి పరుషగతుల. 250

వ. అని పల్కుటయు@ పోతన యచ్చేరువంగల సూకరంబుల మూ@క నుపలక్షించి నంత వాని చెంతనె వెలుంగు నొక యింతి కంతుచేనాడు పూబంతి యన వింత చెలువమ్ము లీను నెమ్మేను సంపె@గల సొంపులను బంపకమొనర్ప, కరువలి చిఱుతగమి చెఱుప విరియు నెఱికురు లొక్కెడ నగవుల నొక్కులుదేలు చెక్కులవ్రాలి వ్రేల వానిలో నుండి చౌకళించు కర్ణవేష్టనంబుల కాంతులు తాపింఛ చ్ఛదగుచ్ఛంబుల సందుగొందుల నుండి స్వర్ణదీధితుల విరజిమ్మెడి యరుణోదయమ్ములం దల@పింప, నాసికఁ సణిపిన ముక్కర నగవుచుందురుని పరిధి యన@ బరువమ్ములీన సదమలచ్ఛదనా చ్ఛాదిత కదళికా కాండయుగ్మమ్ము చెలువమ్ములీను జానుపర్యంత విలసితంబగు వలువ కాసియం గ్రిలెడి యూరుద్వయ కాంతులు చెన్నార, 251

క. చన్నుంగవ కంపింపఁగ నన్నువకౌ నల్లలాడ నాననమందున్
బిన్న నగవొప్ప నేనుఁగు గున్ననడన్ వచ్చెఁ బల్లెకోమలి యటకున్. 252

తే. వచ్చి కవివరుం గని తల వాల్చి మ్రొక్కినాఁడు గ్రాసవాసోదైన్య పీడమడఁగి
వసట గొనియున్న నా కన్నవస్త్రములిడి మనిచినారు దానిని మీరు మఱచినారు. 253

మ. అవిధిన్ వెంబరవిత్తు పల్లెదొర నన్నానాఁడు తా నెంతయే
నవమానింపఁగఁబూన వాని కల విద్యాబుద్ధులం జెప్పి యా
తెవులుం బాపరె సామి ! తామనిన, నెంతే సంతసం బయ్యెఁ జా
లవి యెల్లం దెలిసెన్ వరాహతతి నీదౌ మందయౌ నేమనన్. 254

తే. ధనముఁ జూపించి నా శీలమును హరింప దొరకొనిన బల్విసాళియౌ దొరను గొల్చి
టుడిగి పందిమూఁకను సాఁకుచుందు ననిన నడిగెఁ గవి పోటుపంది నీ దగునె యనుచు.

చ. అది విని యత్తలోదరి యిటాడెను సామి యిదెంత చోద్యమౌ
నది పెదయైన పందిగమి నారసి యెయ్యెడ నుండి వచ్చెనో
గొదకొని మందఁ జొచ్చె నెడఁగొట్టిన పోదొక పల్లె నుండి తా
నెదౌ పదుపున్ ద్యజించి తెరు వించుకఁదప్పి యిటేగుదెంచెనో ! 256

మ. అని భావించుచుఁ గ్రోడ సంతతుల నిత్యాపస్సమీ పావనీ
జనితానేక కుటన్నటాశనమునన్ సంతుష్టి గల్పింపఁగాఁ
గొనిపోవం జనుదెంతు నంతఁ దమ సత్కోశమ్ము నిద్దానవుల్
గొనిపోవం గమకించు దృశ్యమది నాకున్ గానన‌య్యెన్ సుధీ ! 257

మ. కన నీ చర్యలు దుస్సహమ్ములని పక్కిం గల్గు నా కుర్కుర
మ్మును నేనై యుసికొల్పితిం గనలు నపోత్రిన్ దగన్ జూపి యం
తనె తా నయ్యది హీరమ ట్లుఱిమి నూత్న క్రోడమున్ వెంటనం
టెను దా నక్కిటి తెన్నుగానక భటానీకమ్ముఁ దాఁకెన్ వడిన్. 258

తే. స్తబ్ధరోమమ్ము తా నిట్లు తాఁకినంత విచ్చిపోయెను మొన, కృతి విడిచి యనుట,
దాని విని కవి యిదియెల్ల దైవనిర్ణయమ్మటంచును వచియించి యభినుతించె. 259

ఉ. మున్ను త్రయీవితానమును మూర్ఖుఁడు సోమకుఁ డెంతొ బూమియన్
బన్ని హరింపఁగా శకులిభావము నంది నిశాటుఁ గూల్చి వా
రాన్నిధి నున్న వేద విసరమ్మును గ్రమ్మఱ బమ్మకిత్తు వా
పన్న శరణ్య ! మత్కృతి శుభస్థితి నిచ్చితె సూకరాకృతిన్. 260

తే. చిన్నవాఁడను నే నెందు నిన్ను వీడనను స్తనంధయుఁ దక్కఁ దా జనని యెందుఁ
బెద్దవాఁడను నేను నీ యొద్ద నుండననెడి సుతుని భారమ్ము మోయం గలాదె ! 261

తే. ప్రబల నైచ్యాను సంధాన భావమూను న్యస్తభరుఁడె భవాంబుధి న్నిస్తరించు
మునుఁగు నజ్ఞుఁ డహంకార ఘన భరమున బెండ్లు దేలును వాహినిన్ గుండ్లు మునుఁగు.

ఉ. కావున నీ గుణానుభవ గానమొనర్చెడి వంశి ముంచలే
వీ విపదం బుధుల్ త్రిజగదీశ్వర! యంచు వచించె సూరియున్
జావును దప్పి లొట్టవడెఁ జక్షువనంబడుచు న్వడంకుచున్
భూవిభుఁ డంపినట్టి బలముల్ మెలమెల్లనఁజేరె వీటికిన్. 263

ఉ. వీటికిఁ జేరి జేని గని వృత్తము తిన్నఁగ విన్నవించె న
ప్పోటు ప్రగండు గండడఁగి పొక్కుచు స్రుక్కుచు బిక్కమోర న
చ్చోటి కవీశుభాషణల చొప్పును గయ్యపురీతి పోరు న
మ్మేటి వరాహ సాహసపు మేలిమి మేవడి యొప్ప నివ్విధిన్, 264

మ. 'అవనీపాలకుఁ డార్యభక్తిమెయి మిమ్మాహ్వానముం జేయ రా
జవరేణ్యోచిత లాంఛనాంచిత గజాశ్వస్యందనాందోళికా
ధవళ చ్ఛత్రసుకేతు చామరల సత్తౌర్యత్రికానీకమై
భవ సంభావిత భర్మనిర్మిత మహాత్పాల్యంకికన్ బంపెఁ దాన్. 265

మ. కవిరాజా! భవదీయ కావ్యము వినం గాంక్షించియున్నాఁడు భూ
ధవుఁ డత్యంతము మీరు దానిఁ గొని యేతద్వ్యాప్యయానోపరిన్
భవదీయాంఘ్రులఁ బూన్చి పావనమొనర్పన్ వేడెదన్ మీరు పై
శ్రవణాభుండగు జేఁడు నేఁడె సలుపున్ స్వర్ణాభిషేకమ్ములన్. 266

క. అలఘుమతి సహజ పండితు లధిపతి సర్వజ్ఞుఁ డేమి యనవలె "మణినా
వలయం వలయేన మణి" యటులు శోభించెదరు నెప్పుడును దా ముభయుల్. 267

క. అమ్మహిపుఁడు పరుషాచరణమ్మున మిము నొంచ "బ్రాహ్మణస్య క్షణం కో
ప"మ్మని మీరలు దాని మనమ్మున నిడరంచు సుకవినాథ! యెఱుఁగుదున్. 268

వ. అనుటయు నా కవివరుండు నన్నుం గాంచి, 269

చ. నరపతి పిల్వఁ బంచుటలు నాకు ప్రమోదకరంబె వారికేఁ
బరమ కృతజ్ఞుఁడన్ నృహరి పాయక జేని కొసంగుఁ గావుతన్
సిరులును రాజ్యసంపదలు చేకుఱుఁగాక! చిరాయు రున్నతుల్
మఱవను వారి మేలు నృపమౌళికి నా వినతుల్ వచింపుఁడీ! 270

తే. స్వామి రాముఁడు నాదగు స్వప్నమందుఁ దాను సాక్షాత్కరించి పోతన కవీంద్ర!
మధుర వైఖరిన్ నీ కృతి మద్వసతిని సొంతము పఠింపు మేనును సంతసింతు. 271

క. అనియెన్ గావున నేనెటు చనుదెంచఁగ వలనుపడును? శౌరి యనుజ్ఞన్
వినిపింపుఁడు నరపాలునకని పల్కె నృపతియు విష్ణుపంటిని నేనున్. 272

ఉ. అంత నతండు వల్కెఁ దుహినాద్రిని బోలుచు వాలుకాణువుల
సుంత శిలాకృతిన్ గలిగి శోభిల నందుఁ జరింతురే సురల్
వింతలు నీదు వాక్కులనె వీనులకున్ వెగటై కవీంద్రు వాక్
సంతతి విన్నయంత నెద కాఱియవెట్టెను దాల్మి దూలఁగన్. 273

ఉ. ఈ మహి నే మహామహితు నీద్యకరోరగమౌళి తా శిర
స్సీమ భరించు నప్పుడమిఁ జెన్నెసలారెడి వస్తువాహన
స్తోమము లమ్మహీధవుని సొమ్ములుగావె యటంచు నాదు హృ
ద్ధామమునం దలంచి కవితాసతి నాక్రమణమ్మొనర్చితిన్. 274

చ. అది గని మారుతాత్మజున కన్నయొ తమ్ముఁడొ మేటి సింగపుం
గొదమయొ నాఁగ మల్ల రణకోవిదుఁడై మను హొంతకాఁడు మ
మ్మెదిరిచి కట్టు త్రిప్పుచును నెక్కటి కయ్యమొనర్చి పేర్చె నా
యెద పులకించు నాతని మహోశిత సంయుగ పాండితి స్మృతిన్. 275

వ. అంతలో నొక శ్వేతవరాహంబు, 276

ఉ. ఆ మెసలారు వేలుపుల హ_త్తియొ దంష్ట్రిగ నొప్పు మిత్తియో
యేమనఁగా వలెన్ గృతిని నే నొక చేఁగొని వేఱకేల సం
గ్రామ మొనర్చుచుండఁ ద్వరగాఁ బరతెంచి పిఱుందఁ దాఁకె నే
భూమిని గూలనెత్తిఁ గల పొత్తము వేఱొకచోట రాలఁగన్. 277

తే. జలధి నింకించు బాడబానల మనంగ నడవి నంటి దహించు దావాగ్ని యనఁగ
నలుగెలంకుల బలియురం గలఁతవెట్టి దాఁచె గ్రంథమున్ నాల్గు పాదాల నీడ. 278

తే. మన వరూధినీ వేశంతమును గలంప గొదగొదన్వచ్చు సమదద్విరదము గాని
యదొక సామాన్య సూకరం బగునె స్వామి! దానిమై నాఁగవెన్ని శస్త్రంబులేని. 279

తే. నరవి నిజవాల విక్షేప జాతవాత ఘట సముద్ధూత మక్షికాపటలి యటులు
మన మొనం దోలె నక్కిటిం జెనకు నట్టి యక్కిరీటియు మైమయి నరుగఁగలఁడె. 280

తే. ధరణినాథ! దాని నొకింత దరిసినంతఁ బ్రళయకాలానలజ్వాల ప్రాకినట్లు
తాళఁజాలని గతి మేనఁ దాపమొలయు వెనుక నిట్టివి దురమందు గనమదెందు. 281

శా. స్వామీ! యజ్ఞవరాహమే యదియు మా జన్మంబు ధన్యంబుగా
మే మవ్వోత్రిని గాంచఁ గల్గితిమి పేర్మిన్ జన్య ఖేలామిషన్
సామాన్యుండొకొ పోతరా జతనికిన్ స్వప్నాగతుండౌచు శ్రీ
రాముండున్ గృతి నాలకించుటకునై రంజిల్ల యాచింపఁడే. 282

ఉ. ఇంతటి రామభక్తుఁడు కవీంద్రుఁడు పోతన యంచు నెంచకే
నెంతయు స్వామిభక్తి వెలయించి కృతిన్ గొని రాఁదలంచుచు
న్నంతనె సూకరాకృతి నహర్పతితేజుఁడు శౌరి దాని క
భ్యంతరమున్ బొనర్చె హరునైన నదల్చెడి పెన్మగంటిమిన్. 283

తే. అసువులొడ్డి పోరాడుటకైన మేము సిద్ధులమె కాని యప్పటి స్థితిని గాంచ
భగవదపచారమే కాక భాగవత మహాపరాధమ్మగు నటంచు నాత్మ యాఁపె. 284

క. దాని విని సింగభూపతి మానసమున నేమి దలఁచి మసలెనొకానీ
తా నొకటి రెండు ననకయె శ్రీనాథుని గాంచె నేమి సేయుట లనఁగన్. 285

తే. చూపు దీర్ఘ విచారణ స్ఫురణఁ దనర నధిప ! నేనును నొక్కమా అటకుఁ జనెద
నాజ్ఞయిండనె శ్రీనాథుఁ డతి గభీర వదన మొప్పఁగ నృపతియు వల్లె యనెను. 286

శా. ఆ రేయిం దగఁబుచ్చి సత్కవియు దానై నిద్రిపొర్దిదుండఁగా
నే రాజేంద్రుని యానతిన్ బయనమై నిర్ణీత యానాది సం
భారమ్మల్ వెనువెంట రాఁ బరిజన వ్రాతమ్ము లేతెంచఁ బెం
దూరమ్మున్ బరతెంచె శిష్యజన సందోహమ్ము సేవింపఁగన్. 287

సీ. రవి యశశ్శ్రీ ధిక్కరణసేయు నిజ యశఃప్రభలని పగటి దివ్వటులు వెల్గ,
భవదాంధ్ర సంస్కృత కవితకు సాటిలేదని చామరముఖమ్ము లభినయింప,
తా మష్టదిశలు నిన్నలధరించె నటంచు స్వర్ణపాల్యంకిక చాటుచుండ
కనకాభిషిక్త సత్కవి సార్వభౌమ దిగ్జయయాత్రలని తూర్యచయము మొరయ

తే. సకల సుకళాసనాథ ప్రశస్తగాథ విగతపరవాది బాధ వాగ్విశ్వనాథ
సాధు ! శ్రీనాథ సుకవీంద్ర సార్వభౌమ బహుపరాకని మాగధుల్ బలసికొలువ. 288

సీ. నవరసాలకు మెచ్చి నవరత్నఖచితహైమాంగుళీయకవార మలమ్రేళ్ళ,
శ్రోత్రితల శ్రుతిఁ గళాశోభగూర్చెడి కైతలని రత్నకుండలా లొనరఁ జెవుల,
ముత్యాలఁ బోల్పదమ్ములఁ గూర్చు ఘనభావసారమంచెద ముత్తెసరులు మెఱయ,
ఈ కవిత్వపుశయ్య లెంతొ మార్దవమంచు జలతారుపట్టుశయ్యలు రహింప,

తే. జగతి దిగ్దంతులనుచుఁ బ్రశస్తిగనిన నిఖిల కవిగురు బుధకళానిధుల యెదకు
నితని పేరు సింహస్వప్న మెపుడటంచు నలరు సింహాస్యవలయ ఘంటారవమ్ము. 289

క. పొగరొలయ మత్తుఁ గనులొప్పఁగ గద్దియ దిగని రాజ్యవైభవరమ యీ
మగరూపుఁగొనిన పలుకుల వగలాఁడింగాంచి వలచివచ్చి పయిఁబడెన్. 290

క. శ్రీ యన వాణీ రూపము శ్రీ యన లక్ష్మీకిని నాఖ్యచేకుఱు నుభయ
శ్రీయోగ మొనరఁ బూర్ణ శ్రీయుతుఁ డితఁడగుటఁ జెల్లె శ్రీనాథాఖ్యల్. 291

క. సంకోచపుష్ప మృగమదసాంకవ ఘనసారసూన సౌగంధ పయ
స్సంకలిత లలితమలయజ పంకవిలేపాంక పీతవసనము వెలయన్. 292

వ. పాల్యంకికన్ సుఖసుప్తి నొలయుచుండ, 293

చ. వరపరిరంభణాప్తి నరవార్చిలునవోఢ నిరీక్షణాళి య
ల్లరవిరి మల్లెమొగ్గసరు లా యఱుతంబడి నాగు గున్నలై
పరమపదమ్ములోనఁ బెనుపాముపయిన్ బవళించునట్టి శ్రీ
వరుఁడితఁడే యనున్ సుకవి విశ్రుతనామము సార్థమొందఁగన్. 294

ఉ. తెమ్మయొకింత యాఱునటు తేపకు నీళులముంచి చల్లనౌ
కమ్మని వట్టివేర్వసనకట్టులఁ దాలిచి శిష్యబృందముల్
సమ్మతివీవఁ దత్పవనలాలిత డోలలఁ గూర్కు నేత్రమో
యిమ్మహిముందు స్వప్నసుఖహీన దివమ్మనుగాంచ నే ననున్. 295

ఉ. శేముషి నబ్బురమ్మొదవు చెక్కడ మొప్పెడి స్వీయగౌర శో
భామల గుండెలన్ మెఱపియాడఁ గవీశ్వరు సింహకంకణాల్
సామజదంతపేటి వెఱ స్వాస్యమువిప్పు విడెమ్ము సేతకై
మోములఁ గ్రమ్మి దిక్తటులముంప సితాభ్ర సుగంధ సింధువుల్. 296

ఉ. చిత్తము చిత్తమాజ్ఞయని సింహసమానులు పండితాగ్రణుల్
బత్తిని గన్ను సన్నలను బర్వెడుచుందను గొల్వ నల్వలో
కోత్తర వాగ్వధూటిని మహోన్నతపీఠికనుంచి ధారుణిం
బెత్తనమీయ నీ సుకవి పేరిటఁ బుట్టెనొకోయనన్ జనున్. 297

చ. ఘనతరశాస్త్ర దర్శననికాయము స్వీయవినిర్మితాఢ్య కా
వ్యనికర మాంధ్రసంస్కృత మహత్తర శబ్దనిఘంటుకోటి పా
వనతమ వేదభాష్యసమవాయము బండ్లకు నించమించు నీ
తని తలలోన నిన్ని మనఁ దానొక పుష్పకమోయనన్ జనున్. 298

క. ఎదురెవరులేక తాననినదియే వరవేదవాక్యమై వఱల రసా
స్పదమైన కావ్యసరసిన్ మదగజ విహరణమొనర్చు మది ముదమొదవన్. 299

సీ. నవరత్నభూషణ నివహమ్ము లొకపెట్టె దీనారనిష్కసంతాన మొకట
సరిగంచు కాశ్మీరశాలువ లొకపేటి బహుళార్ఘ కౌశేయపటల మొకట
సురుచిరరజత వస్తువ్రాత మొకపేటి పరిమళ ద్రవ్యసంపదలు నొకట
పారాహుషారులౌ భటులతో నశ్వముల్ కదముద్రొక్కుచు నలుగడలు నడువ

తే. ఖాద్యపేయ పదార్థసంకలిత శకటవితతి సూదగణమ్ముతో వెంటనంట
రాజవిభవమ్ముతోఁ గవి రాజరాజు సమ్మతిం బమ్మెరంగూర్చి చనఁదొడంగె. 300

తే. అందలము కొంతదవ్వేగి యచటనిల్చె ముందరిగినట్టి శిష్యసమూహ మెదురు
వచ్చి యేతత్తటాక పార్శ్వమున నెసఁగు వనమునం గూర్చితిమి సుఖవసతి ననిరి. 301

చ. అన విని మావితోఁపుదరి నందఱి కన్నిగతుల్ గుడారముల్
బొనరుప వానిలో విడిసిపొల్చెను దత్పరివార వారమె
ల్లను, గుమిగూడు నా కలకలమ్మునఁజెట్లఁ శకుంతజాతి భీ
తినెగసెఁ, బల్లెఁ బొందినగతిం గనిపించె వనోర్వినెల్లెడన్. 302

తే. పార్శ్వగత తటాకోదక భాగములను స్నాన సంధ్యాదికమ్ములన్ జపతపములఁ
దీర్చి కవిరాజు శిష్య సమర్చితుఁడయి స్వర్ణపీఠిక న్వ్రాలెడి సమయమందు, 303

ఉ. అంగనయోర్తు మన్మథ సుమాస్త్రసమాన మనోజ్ఞభీత సా
రంగ విలోకనమ్ముల మరాళనిరాసకయాన వైఖరిన్
సంగడిఁ దీరు రత్నకళ చాడ్పున సుందరరూప రేఖలన్
బంగరుపళ్ళెమూని జయాభారతి హారతు లీయవచ్చునాన్. 304

ఆ. అరుగుదెంచి యెలమి నా కళానిధిఁగాంచెఁ గామనాబ్ధి విరియఁ గన్నుదోవలు
చంద్రదర్శనమున జలధిపొంగినరీతి సంతసమ్ముపొంగెఁ జానకపుడు. 305

క. కన్నులఁ జకచక మెఱయుచు మిన్నులు దిగివచ్చిపడిన మెఱుపుఁ దెఱవయై
యున్నది యనఁ జెలువారెడి యన్నెలఁతన్ గని కవీంద్రుఁ డాత్మ నిటెంచున్. 306

ఆ. చెక్కిచేసినట్లు చెలువము దలఁపించుఁ బోఁతబోసినట్లు పొంకమమరుఁ
బటము వ్రాసినట్లు బరఁగు భామినిరూపుఁగాంచ మూఢుఁగూడఁ గవి నొనర్చు. 307

సీ. లలిఁ గల్వపూవురేకులకుఁ గాటులువచ్చి పడఁతి కన్నులలోనఁ బర్వులెత్త,
నగవు చంద్రులరాలు సొగసు ముత్తెపుఁజాలు నాసామణిం బరిహాసమాడ,
భావజార్థమ్ములొ ప్రణయమూల్యమ్ములన్ బొమదోయి ముడివేసి పొత్తిదిసేయ,
గురుకుచోద్ధతి వయస్సరసిజ ముకుళాప్తిఁ బైఁటయాకుం ద్రోసి బయటఁబడఁగ

తే. ఘనజఘన మహోన్నతపీఠిక న్వసించి రమ్యయౌవనదివ్య సామ్రాజ్యలక్ష్మి
సమద గజయానములపయి స్వారిసేయ నతివకుతుకమ్ముతో నిట కరుగుదెంచు. 308

చ. అని యిటు లాత్మనెంచెడి మహాకవి సన్నిధికేగుదెంచి యా
వనిత సుధాస్మితేందువు త్రిపాగుణగుంఫిత నీల నీరదాం
గణమున దాఁగియాడ మిముఁ గాంచఁగఁ గల్గిన జన్మ ధన్యమా
నని ఫలపుష్పసంతతుల నర్పణ సేసి నమస్కరించుటల్, 309

చ. యువతి నమస్కరించుటయు నొప్పగు కీల్జడ యట్టిటున్ మనో
భవుఁడను గారడీఁడు లలిఁబాడెడి నాగసరంపు సొంపులన్

దవులుచు నాడుచున్న నలదాౘ్రచన నొప్పెఁ, గవీంద్రుఁడల్లె నా
నవల మనోజ్ఞవేణి మదనప్రణయాగమ సూత్రభాష్యముల్. 310

సీ. ఘనవర్ణమునకుఁ జెందును ప్రేమపాశమ్ములని కేశనీలిమ లచ్చుగుద్దు,
కన రెండురూపులా వెనుక నొక్కటెయని పాపటముందయి పల్కుచుండు,
అనురాగవర్తన మ్మకృమమ్మను సొంపెయని కురుల్ వంకలై తనరుచుండు,
విమలప్రణయ బంధవిశ్లేష మెపుడు దుస్సహమంచు నెఱికురుల్ జడలనల్లు,

తే. స్నేహవస్తువుల్ వీనికెచెందుఁ, బూలు పూజలనుజేయు, వీని నెప్పుడును నగ్రపీఠ మిట్టివారిని దలఁబెట్టిమోయుఁ, బ్రీతికరము వీని చిక్కులు బాపిదువ్వ. 311

క. అని వర్ణించుచుఁ బ్రణతింబొనరిచి లలిలేచినట్టి పొలఁతినిగని యో
వనితా! నీవు సమర్పించిన సుమఫలపత్రవితతి చెలువే మనుటల్. 312

సీ. పవనకుమార సంస్పర్శ మ్మదెట్టిదో యరనవ్వి మరియు నీ విరిపడంతి!
గీ. అనుట లామె కన్నుల సిగ్గు పెనఁగులాడె.
ఈ లేఁతవిడె మాకు లేయోష్ఠమిధునానురాగ సంగతిని జీర్ణశద గనునొ!
అనిన స్మితమొప్ప నామె యాననము వ్రాల్చె.
చేమంతిపూబంతి చెల్వుఁ గుల్కునిది నారంగమో తరుకాంత రసహృదయమొ!
అనఁ దరుణి లజ్జ నవరించుకొనెఁ బయంట.
తుంబీఫలమ్ముతోఁ దులదూఁగు నీ చూతఫలభార మే కొమ్మ పదమునదుము
అనఁ జెఱఁగుదిద్ది ప్రీడఁ గూర్చొనెను వనిత. 313

వ. అంత నా యింతి కవినాథుం గాంచి, 314

తే. శైలి మల్లెపూదండల నేలుఁ గావ్యరసము లంటిన గురియు నా రంగమందుఁ
గ్రాలెడి ప్రసాదగుణము రసాలమంచుఁ బల్కు నివియెల్లఁ గవిసార్వభౌమ! యనుట.

క. కవయిత్రివిగాఁ దోఁచెడి భవదీయ విశుద్ధ సరసభాషలు విన నో
యువతీ! తావకవృత్తము సవిశదముగఁ దెల్పుమనుటఁ జాన యిటాడెఁ. 316

సీ. మా తండ్రి జంగమ మఠపతి యీ తోఁట కధిపతి మంత్రి మంత్రార్థవేది,
ఆ మహాభాగున కాత్మజాతను నేను సాహితీ సత్కళాసక్తమతిని,
పేరు కళావతి, నీరేజ భవతుల్య! కవిలోక దర్శనాకాంక్ష మెండు.
పంచకావ్య కదంబ పఠనం బొనర్చితి నాంధ్ర సంస్కృతభాషలందు మీదు

తే. కీర్తి వింటి దర్శింపఁగా నార్తి నుంటి మామకీన దైవబలమ్ము మంచిదగుటఁ
దామె విచ్చేసితిరటంచుఁ దాత నుడువఁ దమి నరుగుదెంచి సేవించి ధన్యనైతి. 317

ఉ. భేషని రాట్సభాస్థలులు వేలకు వేలొగిఁ గ్రమ్మరించు స
ద్భూషణ హైమనిష్క జలపూరములం జలకమ్ములాడి ది

వ్యౌషధకల్పమై కవి జనావళి నోళులఁ గట్టివైచు మీ
నైషధ కావ్యవాణి నటనంబును గాంతు నుతింతు మీ మతిన్. 318

తే. రమ్య నవరస రత్నాకరములఁ ద్రివ్వి మహిని విలసిల్లు దేవర మహితపాణి
నొక్క రత్నాంగుళీయక ముంచ నెంచు నస్మదీయ మౌఢ్యమ్ము క్షమార్హ మనుచు. 319

క. తన ముద్దుటుంగరమ్మును గొని యాతని కేల నుంపఁగోరెడి సుదతిం
గనుగొని శ్రీనాథుం డిటులను స్మితపూర్వాభిభాషణానన మొప్పన్. 320

క. సుమతులు కుమతులనక యొగి భ్రమియింపంజేసి లోభపఱచు మనోజ్ఞ
ప్రమదాలాభంబు ధనాగమమును నిరసింపఁ గమలగర్భుని తరమే ? 321

ఆ. పిచ్చిబుట్టి హరుఁడు వెన్వెంటఁ బరుగెత్తె మోహినీస్వరూపమును గనుగొని
సిరికి హరియె యురమె సింహాసనమొనర్చె ననుట లామె యిట్టులనె నతనికి. 322

ఉ. నీతి విబాహ్యవర్తనల నిర్భర దైన్యగతిన్ లభించు నా
నాతియు రంభయైనను ధనప్రకరమ్ము కుబేర కోశమేన్
బాతక హేతువంచుఁ దృణవద్గణనన్ ద్యజియించి మించు శ్రీ
పోతనఁ బోలు సత్కవుబు పుట్టరొకో యన నాతఁ డిట్లనున్. 323

ఉ. ఓరకుఁ బెట్టు మప్పలుకు లో వనజాయతనేత్ర ! యిందు సం
సారములేని దెవ్వరికి ? ఛాందసులై లభియించినట్టి బం
గారముఁ బాఱవైచి మనుగడ్డల నేఱికొనంగ వీరు దీ
క్షారతి ఋష్యశృంగులను గౌశికులన్ దలదన్ని పుట్టిరే ? 324

శా. వ్యాపారమ్మెదిలేని మానవుఁడు బ్రహ్మజ్ఞానియై త్యాగవి
ద్యాపారమ్మిటు వల్లెవేయు నఱచేతన్ లక్ష్మి తా నాట్యమున్
జూపెన్ బోపెను ద్యాగవర్తనల నచ్చోఁ జూరుకుం జెక్కి తా
రేపీ వేళకుఁ బోతనార్యుఁడన వేఱే కాఁడెటో చూచెదన్. 325

క. అన నా వనితయు నుంగరమును నాతని వ్రేల నుంచి మ్రొక్కుచుఁ దా ని
ట్లను నా పోతన నర్థము బొనరిచికొన మీరు నుడువఁబో రిటు లెపుడున్. 326

ఉ. మాఱునె పోతనార్యునడ మాన్యవరా ! యిలఁ జంద్ర సూర్య సం
చారము మాఱదేల యుడు సంతతులుం గతిఁ దప్పవేల, బం
గారము, నిప్పులోన మనఁగా నరుణద్యుతి వెల్గి యగ్నికిన్
వేఱయిపోవ నల్లనయి వ్రీలెడి యాయసమై చెలంగునే ? 327

మ. మొగమోటంపుఁ బొగడ్తలన్నఁ గడు వైముఖ్యంబు సూచించుఁ దీ
వ్రగతిన్ డీకొను కష్టసంతతుల కావంతేనిఁ జింతింపఁ డా

ఖగరాడ్వాహనుఁ దక్క వేఱొకని ముం గైసాఁచి యాచింపఁ డీ
జగతిన్ గల్గునె పోతరాట్కవిని బోల్జన్మంబు లెందున్ బుధా! 328

తే. తత నిసర్గ మనోజ్ఞ రత్నప్రభయగు సహజ పాండిత్య సంభూత సరస కవిత,
ఆత్మగౌరవకర సువృత్తాభిరతియుఁ బూర్వజన్మ సంచిత తపః పుణ్యఫలము. 329

తే. అమిత బల ధన గర్వ నిరంకుశాధికార మదమత్త సామ్రాజ్యకమల ముందు
పలుకు వెలఁదికిఁ దలవంపు గలుగనీక సాఁకె నెవ్వండు పోతనస్వామి దక్క. 330

తే. బ్రహ్మదేవుఁడు వచ్చినన్ భక్తపోతనార్యు నెదఁ ద్రిప్పలేఁడు సూఱాఱొనర్చి,
యిట్టు లనుచుండె నీపెయం చెడఁద మీరు వేఱుగా నెంచవలవ దుదారచరిత! 331

ఉ. అక్కట! చిన్ననోట నిటు లాడితినే పెద పెద్దమాటలం
నిక్కముగాఁగ వీని మది నిల్పకుఁ డార్యవతంస నేను మీ
కొక్కటి మీదు శారదయు నొక్కటియా క్షమియింపుఁడంచుఁ దా
సక్కమలాయతాక్షి కవి యాజ్ఞను గైకొని యేగె నయ్యెడన్. 332

ఆ. ఆడి యాడి మాయమైనట్లు చనె నీమె చిటికలోన వనము చిన్నవోయె
ననుచుఁ గవియఁ బయనమగుటకై దొరకొనఁ దోఁటసామి వచ్చి దోయిలించె. 333

వ. అంత నతనిఁ గాంచి శ్రీనాథుండును, 334

ఆ. కట్టనట్టి యిల్లుఁ గనరాని గేస్తునై తావకీన హృదికి దర్పణమయి
చలువనీడ తోడ స్వాగతమ్మిడు మీదు వనికి మీకు ధన్యవాదము లివె. 335

క. తెలివి గలది నీ కూఁతురు ఫలపుష్పము లొసఁగి స్వీయప్రతిభా రూపా
దులు తేటపడఁగ మాతోఁ బలుకాడి క్షణమ్ము ముందె పయనించె ననన్. 336

ఆ. కవివరేణ్యుఁ గాంచి సవినయ వైఖరి నవనతాస్యుఁడగుచు నాతఁ డిట్లు
పలికె నిపు డిచటికిఁ బరతెంచు పొలఁతుక నాదు కూఁతురగుట నమ్మఁజాల. 337

ఆ. స్వాస్థ్యముడిగి యొడలు సరిలేమి నా కూఁతు నింటిలోన నుంచి యే నొకండ
వచ్చినాఁడ నిటకు వచ్చిన యా కన్య యెవరగుట లెఱుంగఁ గవివతంస! 338

క. అనుచుం మఠపతి శ్రీనాథునితో నన నెడఁద నెదియుఁ దోఁపక యతఁడుం
వెనుకయు ముందును నాలోచన మొనరిచి యాత్మ నిట్లు సంభావించెం. 339

క. ఈనాఁటివఱకు నాకుం దా నెదిరిచి మాటలాడఁ దడఁబడు నెవఁడుం,
నే నొక్కటి మీ శారద తా నొక్కటియా యటంచుఁ దరుణి యిటాడెన్. 340

తే. పోతనార్యుని మెప్పించి భూధవునకుఁ గృతిగ నిప్పించెదను భాగవతము నంటిఁ
దపమొనర్చి బ్రహ్మయును బోతన యెడంద మార్చలేఁడని పల్కె నీ మగువ మిన్న. 341

క. కాదుగదా! విధి శారద లేదాపెయె తండ్రి యెఱుఁగలేనటు వచ్చెన్
బూఁదోఁట కనుచు మనమున నేదేదో తలఁపురాఁగ నేమేమొ యనున్. 342

ఉ. అంతటిలోనె ఛాత్రనివహమ్ము మహాకవినాథుఁ గాంచి య
భ్యంతర మేమియున్ గలదె యార్య! ప్రయాణమొనర్ప నల్ల యే
తెంతురె, యాప్యయాన మది దేవర రాకకు వేచియుండె నా
నెంతయు సంతసమ్ము కడలెత్తఁగ నెక్కెఁ గవీంద్రుఁ డేగితాన్. 343

ఆశ్వాసాంతము

క. సనకసనందన మునిజన, వినుతా! దశకంఠనాళ విదళనకరమా
ర్గణ విద్యాపారంగత!, ఘన గుణ మణికోశ! కుంభకర్ణ వినాశా! 344

చ. కలికలుషాబ్ద పర్వత విఖండదురు ప్రళయ ప్రభంజనా!
సలలిత రూపశీల గుణసంపద శేషజనానురంజనా!
యలఘు మమత్వమోహ మదిరాంధతమః ప్రవిభేదకాంజనా!
విలసిత జానకీ హృదయ విశ్వ వియత్తరుణార్క! రాఘవా! 345

మణిగణనికరము (వృత్తము)

సకల భువన నుత సరసిజ చరణా! యకలుష ముని హృదయ గణ విహరణా!
చకిత విబుధజన చయ భయహరణా! వికట దనుజకుట విటపవి దళనా! 346

గద్యము

శ్రీమద్భరద్వాజగోత్ర పవిత్రాపస్తంబసూత్ర, ప్రథిత సూరిజనమిత్ర, బక్కయ్యశాస్త్రిపుత్ర
వాగేశ్వరీ సమాసాదిత, వైదేహీవర నివేదిత సరసకవితావిలాస, సహజ
పాండిత్యభాస, వరకవి విధేయ, 'వరదార్య' నామధేయ ప్రణీతం
బైన పోతన చరిత్రమను మహాప్రబంధమ్మునందు
సప్తమాశ్వాసము.



శ్రీ వాగీశ్వర్యై నమః




## శ్రీనాథ కృత పరీక్ష - పోతన విజయము

“ నమే భక్తః ప్రణశ్యతి. ”


రామా ! కల్యాణగుణా రామా !
సకల జన మనోభిప్రాయ !
ప్రేరిత రాజ్య విధాన
శ్రీరాజిత కరణ ! మణి విశిష్టాభరణా ! 1

గీ. ఆంధ్ర కవిసార్వభౌమ దివ్యాగమనము మహిత భాగవత కృతి విమర్శనంబు
సుకవి పోతన విజయ సంశోభితంబు శౌర్య విజితేంద్ర ! శ్రీరామచంద్ర ! వినవె. 2

ఉ. బమ్మెర గ్రామసీమఁ బొలపమ్ములరన్ బరతెంచి కాంచె న
ద్దమ్ములఁ బోత్తటాకముల దాపునఁ జూపుల దోఁపుజేయు క్షే
త్రమ్ముల శాలి సస్యహరితమ్ములఁ దెమ్మెర నూఁగు తాలవృ
క్షమ్ములు లేవనెత్తిన ధ్వజమ్ముల నెమ్మది నేగు వాఁగులన్. 3

సీ. తాళవృక్షమ్ములు తలలూఁపఁ జుక్కలనాడు గాత్రధ్వనిఁ బాడు గౌడు
చేలెల్ల నానందడోలల నూఁగ మంచియ నెక్కి పాడు కృషీవలుండు
కలరుతమ్ములను గోకిల లాలపింపఁగాఁ గొసరి పాడును బూరిగోయు తరుణి
మ్రాఁగన్ను నిడి మేఁత మఱచి గోవులు నిల్వఁ బిల్లఁగ్రోవిని నూఁదు గొల్లబొట్టె

తే. దిక్కులెల్లఁ బ్రసన్నదీప్తి వెలుఁగొంద మలయ పవనుండు చలువలు పులుముచుండు
నల దిగంతాల వ్రేలాడు నంబరమున నద్రిపంక్తులు నీలంపుటంచు లిడును. 4

తే. గట్లచఱియల నలరు వృక్షముల కోమల కొనల కెగఁబ్రాఁకి యురణముల్ కొఱికి తినఁగ
మచ్చికను బచ్చికను గాంచి మట్టిదిబ్బ యొడ్డులకు నెక్కి మేయు నాఁబడ్డ లొకట. 5

ఉ. సమ్మతి నేగియేగి కవిసత్తముఁ డొక్కెడ నాఁగి, దీప్త ఫా
లమ్మునఁ గ్రమ్ము చెమ్మట జలమ్ముల వ్రేలు మడంచి యార్చి కే
ల్దమ్మి హలమ్ముఁ బూనిచి పొలమ్మును దున్నుచు నింక లేఁతప్రా
యమ్మున నున్నయట్టి తన యల్లుని మల్లనఁ గాంచి పిల్చె మున్. 6

చ. పిలిచినతోనె మల్లనయు విస్మితుఁడై కని మాతులుండుగాఁ
దెలిసి హలమ్ము వీడి కడుఁ దీవ్రగతిన్ బరతెంచి క్లాంతిమైఁ
దొలఁగ హృదిన్ ముదంబుధులఁ దుంగతరంగము లంగవింప ము
న్నిలిచి శిరమ్ము వంచి పదనీరజముల్ స్పృశియించె సాదృతిన్. 7

మ. అనురాగ మ్మతివేలమై పెనఁగఁ దా నత్యంత సంతుష్టిమైఁ
గనియెన్ సత్కవి సార్వభౌముఁడును వీఁకన్ భాగినేయున్ శిర
మ్మున హస్తమ్మిడి దీవనల్వలికెఁ బెంపున్ సొంపు దీపింపఁగా
మనవారందఱు పిన్న పెద్దలును క్షేమమ్మే యటంచున్ దమిన్. 8

ఉ. మీ దయ వల్ల నెల్లరము మేమిట సేమము మీదు రాకకై
సోదరి నేను శారదయుఁ జూచుచునుంటిమి. యుష్మతోడ, మీ
రీ దిన మేగుదెంతురని యేను వచించితి శౌరి సత్కృపన్
నాదగు వాదమే గెలిచె నాఁగలియాన యనం గవీంద్రుఁడున్. 9

ఉ. అక్కజమౌను నీ శ్రమము నారసినంత నిదేమి వింత తా
మక్కట ! బావగారిటుల హాలికులై రిది యెప్పు డింతకున్
జొక్కపు గంట మోసరిలి సుందరమౌ ములుకోల చేతికిన్
జిక్కెనె తక్కువేమి విలసిల్లెను హాలికవృత్తి విత్తమై. 10

తే. హాలికుండయి పశుపతి యగుట కతన నేలికలకెు మా భావుకుం డేలికయ్యె
భూమిపాలున కొదవు విభూతి గలుగ భూమిపాలురఁ గొల్చునె పోతన యన. 11

ఉ. ధీనిధియైన మల్లనయు దీని వినన్ హృది మండిపోవుచున్
మానిసిరూపుగొన్న యభిమానమొ ప్రాణము లూనివచ్చు స్వే
చ్ఛానయగాంగపూరమొ కశాహత సింహకిశోరమో యనన్
దా నిటులాడె మాతులుని దర్పమయోక్తుల నీసడించుచున్. 12

ఉ. బాలరసాలసాల నవపల్లవకోమల కావ్య కన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైన నేమి గహనాంతరసీమలఁ గందమూల కౌ
ద్దాలికులైన నేమి నిజదారసుతోదర పోషణార్థమై. 13

ఉ. ఏలిక వెంటనంటి తమ రిందుర్లిలుచందుర్లిలటంచుఁ బొట్టకై
నాలుక పాడుచేసికొను నారకహేతువుకన్న సత్కవుల్
హాలికవృత్తిఁబూని వసుధాంగన నీ హరిపత్నిఁ గొల్చుటల్
పోలవె మామ ! పాలకుల బోయిలకై బరువౌట గొప్పయే ? 14

క. అది విని శ్రీనాథుఁడు తన యెద గాలము గ్రుచ్చినట్టు లెంతయుఁ గష్ట
మ్మొదవఁగ పల్లననారసి పదపడి యిట్లనియె వ్రేటువడు నాగంబై. 15

తే. పసులపై మన్కి యాధారపడుటకంటెఁ బాలకులపైన నాధారపడుట ఘనము,
భూసతింగొల్చి బలుపంతఁ బొందుకంటె భూధవు లొసంగు మన్ననల్వొందుటొప్పు. 16

మ. అని శ్రీనాథుఁడు నర్మగర్భ పరిదీప్తాలాపముల్ వల్కుటల్
విని మేనల్లుఁడు మల్లనార్యుఁడను నో విద్యాధనా ! హాలికుం
డన మీ కింతటి యెల్లిదంబగుట నాకాశ్చర్యమౌ విశ్వజీ
వనసంధాన సుధాంబుదమ్మతఁడనన్ భావంబునన్ దోఁపదో ! 17

సీ. హాలికు నుదుటిపై నలరఁజెమ్మట జాలుపాలకు నుదుట ముత్యాలచాలు,
మడిదున్ను హాలికుమైఁ జిల్లఁ బంకంబు మన్నియమైపెల్లు మలయజంబు,
బడుగు హాలికుచేతి పశుపతిత్వసమృద్ధి భూపాలుచేతి ప్రభుత్వసిద్ధి,
అదరు క్షేమమడంచు హాలికు హలవృత్తి క్ష్మాపతి రిపుఁగూల్చు ఖడ్గశక్తి,

తే. హాలికుఁ డొనర్చు భోజ్యపదార్థసృష్టి జనవిభుని రాజ్యధనకోశ కనకవృష్టి
నరపతికి రైతు కోటపునాదిగుండు, ఏలికలకును నేలిక హాలికుండు. 18

చ. మును జనకుండు హాలికతఁ బొందియె రామునకిచ్చె సీత నా
జనకుఁడె తిర్గి హాలికుని జన్మము నెత్తెనొయేమొ లేమి మ
జ్జనకుని నాంధ్రభాగవత సత్కృతి కన్య నొసంగుమంచుఁ దా
నినకులశేఖరుండు వచియించి గ్రహించునె పండితాగ్రణీ ! 10

చ. ఘనుఁ డితఁడంచు నెవ్వనినిగాంచి సరస్వతి కోరివచ్చి వ
ద్దనఁగఁ బదమ్ములంబడియె నద్దిర ! యెవ్వని పద్యశేషమున్
బనివడివచ్చి యచ్యుతుఁడె పాదము లొక్కెడఁ బూర్తిసేసె నా
ఘనతరహాలికుండె మన కన్నుల నిండకయుండెనే మనన్, 20

చ. అన విని సత్కవీంద్రుఁడును నల్లన నవ్వి యిటాడెనింక నా
వెనుకటి గాథల న్నెమరువేయకు నాదు మహత్త్వసిద్ధి నీ
కనులకుఁ గానిపించునని కన్గవమూయుచు భారతీసతిన్
మనమున నెంచి కేల్మొగిచి మల్లన గన్గొనవెండి యిట్లనెన్. 21

తే. ముందుగల పల్లకీకొమ్ము మోయునట్టి బోయిలార ! మాఱాడక భుజములిడక
తొలఁగిపొండు, వెన్కలవారు తొంటిరీతి నడువుఁడనె నెల్ల రక్కజ పడుచుఁగాంచ. 22

వ. వా రట్లొనర్చినంత, 23

చ. వెనుకటివోలెనే శిబిక వేగముతో నడయాడ దానినిన్
గని వడి మల్లనార్యుఁడొక గంతిడి క్షేత్రనిపాతసీరముం
గొని యొక వాహమున్ విడిచి గుండియ నగ్గలికమ్మెలర్ప ని
ట్లనియెను భక్తియుక్తి నెద నబ్బురమొంది జనమ్ము గన్గొనన్. 24

చ. విలసిత ధర్మవర్తనుఁడు విశ్రుత సత్యపథానుగామి ని
శ్చల హరి భక్తియుక్తుఁడగు సత్కవిపోతన పద్యశేషమున్
వలచి మురారి చేతఁగొని వ్రాయుట నిక్కమయేని నిప్పుడీ
హలము వృషమ్ములేక నడయాడుత నెప్పటి యట్టు లిద్దరన్ ! 25

తే. అనుచు మల్లనార్యుండొక హలవృషమును విడువ సీరమెప్పటి యట్లు నడువఁదొడఁగె.
దాని నంతయుఁ గాంచి తత్రత్యజనము లచ్చెరువు నొందెఁ గవి కీర్ష్య రెచ్చిపోయె. 26

తే. వెనుకఁగల పల్లకీకొమ్ము విడువుఁడనుచుఁ బల్కె బోయిలం గవి సార్వభౌముఁడంత
విడిరి వాహకుల్ పల్లకి నడువఁదొడఁగె గనుల నమ్మలేకుండిరి కాంచువారు. 27

ఉ. వాయువె హంసనాఁ జెలఁగి వాహకుఁడై శిబికాభర మ్మిటుల్
మోయఁ దొడంగెనో ద్రుహిణమూర్తి యితండనికాక యున్నచో
వేయి కనుల్ మఱుంగయిన వేల్పుల రాజితఁడంచు మేఘముల్
పాయక తాల్చునో యనుచుఁ బ్రస్తుతి సల్పె జనమ్ము లత్తఱిన్. 28

ఉ. మాతులు నందు వెల్గ నతి మానుషశక్తిని గాంచి యల్లుఁడున్
జోతలొనర్చి యింతటి యశోధనుఁ డిట్టి మహాత్ముఁ డైహిక
స్ఫీత ధనార్థ మర్థులకుఁ జేతిని జాఁచుటె యంచు నెంచుచున్
బైతృక నిస్తులోన్నత పరిభావము నాత్మఁ దలంచి యిట్లనెన్. 29

ఉ. అక్కమలా మనోహరుఁ డహర్పతితేజుఁడు రాఘవుండె తా
నిక్కముగాఁగ మజ్జనకునిం గని "పోతన సత్కవీంద్ర ! మీ
చక్కని కావ్యకన్యక నొసంగుఁ" డటంచు వచించెనేని నీ
యొక్క వృషమ్ములేక హల మూర్విని బూర్వగతిన్ జరించుతన్ ! 30

చ. అనుఁచు జనమ్ములెల్ల వినవాడుచు మల్లన యుల్లమందు శ్రీ
జనకసుతా మనోహరు మసారవినీలశరీరు నెఁతయున్
మననమొనర్చి ధ్యానవి నిమగ్న నిమీలితనేత్రుఁడౌట వే
జనఁ దొడఁగెన్ హలమ్మదె వృషమ్ములు లేక పొలమ్ము దున్నుచున్. 31

ఉ. చేఁగల శూలమెత్తి వృషశేఖరుతోఁ జను రుద్రరూపుఁ డో
నాఁగలి తోడ గెల్చు యదునాయకుఁడౌ బలభద్రరూపుఁడో
తా గెలిచెన్ మహత్వమున ధాతను బోల్ ప్రతిపక్షినంచు న
చ్చోఁ గల లోకులెల్లరును స్తోత్రమొనర్చిరి మల్లనార్యునిన్. 32

తే. అర్థకామార్థమై శారదాంబఁ గొల్చు శంసనీయమౌ కవినాథు శక్తినంత
ధర్మమోక్షార్థ మా చక్రధరుని గొల్చు భక్తిభావ విభ్రాజిత శక్తి గెల్చె. 33

ఆ. అంధతమసమందు నగ్నికీలలు దీప్తిజెందినటులు సుకవి చిత్తసీమ
నోటువడుటవలన నుదయించు తామస వృత్తి యందు నీర్ష్య పెచ్చుపెరిగె, 34

తే. పరిపరి విధాల నిర్బంధపఱచియైనఁ బోతరాట్కవీంద్రుఁడు సింగభూధవునకు
భాగవత మంకిత మొసంగు పథకములను సిద్ధమొనరింతునని కవి చింత సేసె. 35

వ. అంత, 36

సీ. వరుణుండు చలిగాఁగ విరచించికొనినట్టి పండు నిప్పుకల కుంపటి యనంగ,
చీఁకటి ప్రళయమ్ము చేకూర్ప జృంభించు నపరాబ్ధిగత బాడబాగ్ని యనఁగ,
శాంతి విశ్వమును మ్రింగఁగ నోరు దెఱచిన కాలరాక్షసి వక్త్రగహ్వరమన,
వ్యోమాంబరీషాన నుడులాజలన్ వేఁపఁ బోరి రాఁజఁబెట్టిన ప్రొయ్యి యనఁగ,

తే. రతి విరక్త కాషాయాంబరములఁ దాల్చి కళ లుడుగునట్టి మోమునన్ గాంతి దఱుఁగు
చూపులన్ చెట్లగుట్టల ప్రాపుగొనుచు వాఁడిదప్పిన ముదుకఁడై వంగెఁ బ్రొద్దు. 37

చ. పిలిచెను గూళ్ళ పుల్గులను విశ్వము సాంధ్యకశారుణాబ్ధిలోఁ
గలిసెను లోకజీవనద కర్షకదేహనిదాఘ వృష్టియున్
వెలిసెను శ్రాంతినిం గనక వేసరు గోతతి పాద మొక్కెడన్
నిలిచె దినమ్ముపై నిశలు నిప్పులు గ్రక్కెను దారకాకృతిన్. 38

మ. పులకించెన్ దొవకన్ను లిందువు సరోముగ్ధాంగనా జీవన
మ్ములఁ జిత్రించెను రాగసంగతులు మబ్బుల్ మాటుగన్. గబ్బిల
మ్ములు దీక్షల్ త్యజియించె, ఘూకతతి విస్ఫూర్తిన్ నభోమండల
మ్ములపై రాజ్యములేలె సంతమసరాణ్ముఖ్యోత్పతద్దృష్టులై, 39

మ. అల శ్రీనాథకవీంద్రమౌళి నిజ శిష్యాయత్తుఁడై యూరి వె
ల్పల నొప్పారు తటాక నిర్మలజల ప్రాంతంబులన్ స్నానసం
ధ్యలు గావించి దరిం బురిం గనియె నోత్కంఠతన్ సుఖాందోళికా
మల పర్యంకమృదూపధానవికసన్మస్తప్రశస్తాకృతిన్. 40

చ. తత ఘనతూర్య నిస్వన వితానములన్ బ్రవిదీప్త తారకా
యితకర దీపికా నిచయ హేతి విధానములన్ ద్విజోక్తవి
శ్రుతనిగమక్రమోల్లసిత సుందరగానము లీడ్యగోశతాం
గతురగ యాప్యయానములు గ్రాలఁ గవీంద్రుఁడు జొచ్చె నప్పురిన్. 41

క. మెండగు నీ విభవముఁ గన దండిపబువు పెండ్లియొ దొర దండెత్తుటొయై
యుండునని యూరికూర్ మై నిండన్ గనులొనరిచికొని నెటికొంతు రొగిన్. 42

ఉ. ఆ పయనమ్ము పోతన గృహాంగణసీమల నాఁగె వెంటనే
లోపలి నుండి లక్ష్మి యిలులోఁగలిమున్ బరతెంచి కాంచి లో
నాఁపఁగరాని మోదగతి నర్గి పితం గని పల్కె నయ్య ! నేఁ
జూపెద రమ్మ మామ నొక సొంపుల పల్లకిలోన నింటిమున్. 43

క. అన నాశ్చర్యము సంభ్రమమును బెనఁగొనఁ బోతరాజు ముదితుండై వ
చ్చెనె మామ యనుచుఁ దానది వినుటయె తడ వింటి వెలికి వెడలెన్ వడిగన్. 44

క. చని కట్టెదుటనె పోతన జనపతి వైభవసనాథు సత్కావ్యకళా
ధననాథు న్నిగమాగమ ఘన విజ్ఞాన ప్రబోధుఁగనె శ్రీనాథున్, 45

క. పోతన నాతఁడు, నాతనిఁ బోతనయు మిథోనురాగపూర్ణకటాక్ష
కూతిన్ గాంచిరి కుశల ద్యోతక వాక్సుధలు స్మితవిధువులన్ దొరలన్. 46

క. శ్రీనాథుని కడఁ బోతన శ్రీనాథుని పజ్జ నొక కుచేలుని లీలన్
దా నగపడు హృదయముఁ గనఁ దానొగి శ్రీనాథుఁడగుఁ గుచేలుఁ డతఁ డగున్. 47

సీ. కాశ్మీరుశాలువ గడబిడం గని తాను నవ్వుచుండఁగఁ జిన్గు నారపంచె,
పట్టుపుట్టమ్ముల పరువు మర్యాదలఁ జినబుచ్చ మోఁకాలి చెఱఁగుగుడ్డ
కర్ణకుండల రత్నకళల రంధ్రాన్వేషణము సేయ రిక్తకర్ణయుగళమ్ము
శ్రీనాథ మణిహార సింహాస్య వలయాలఁ దులదూఁగి మించఁగాఁ దులసిమాల

తే. దైవదత్త బలాఢ్యుఁడు తా నిలుచును బరులపై నాసపడువాఁడు పడుననుచును
నందలముపై బరుండు బావయ్య నపుడు క్రింద నిలిచిన తన రూపు క్రేణి సేయ. 48

తే. గాఢ గర్వాంధకార దృక్కార్ష్ణ్యమెల్ల శీత దరహాస చంద్రికం జెదరఁగొట్టి
యెదిరికొనితెచ్చె శ్రీనాథు నింటిలోకి భాగవతపాణితోఁ గాని పనియుఁ గలదె ! 49

ఉ. పల్లకి డిగ్గి కాలు గడపన్ సరి నుంచెనొ లేదొ యంతలో
సల్లలితాంగి శారదయు సంబర మంబరమంట వచ్చె. నా
తల్లి యటంచుఁ బల్కి స్వసుతం దరిదీసి శిరంబు మూర్కొనన్
వెల్లువగట్టె ప్రేమరసవృద్ధి సుతా పితృ బాష్పవృష్టిలో. 50

ఉ. అల్లన లోనికేగి సుత నంకమునన్ దగఁ జేర్చి కూరిమిన్
జెల్లెలిఁ గాంచి నీ యొడలు సేమమె, ముద్దులబిడ్డ లక్ష్మియున్
మల్లనయున్ సుఖంబె యన మానిని మ్రొక్కుచుఁ బల్కె నగ్రజా!
యెల్లరు లెస్స, నిన్ననుమి నెంతయు బెక్కొనె శారదాంబయే. 51

చ. అన విని యశ్రుపూర్ణ నయనాకుల దృష్టిఁ గవీందుఁ డంక సీ
మనలరు శారదం గనుచు మక్కువ నక్కునఁ జేర్చి గద్గద
స్వనమున గారవించి నెఱి చక్క నొనర్చుచు మెల్ల గద్దువం
గొని మొగమెత్తి మూర్కొనుచుఁ గోమల గల్లయుగంబు దువ్వుచున్. 52

క. జనని సనినపుడె నీయీ జనపతి వశ చేతసుఁడగు జనకుఁడు సనె, నీ
జననియు జనకుం డత్తయె జననీ! నీ కుండిలేని జనకుఁ డితఁడనన్. 53

సీ. బాలా వినోద విఖేల నార్థంబయి తళుకుల నీను పుత్తళిక లిదుగొ!
సౌందర్య జనక ప్రసాధనార్థంబయి మణిమయ స్వర్ణభూషణము లిదుగొ!
స్త్రీ తను శోభావిశేషవర్ధకములౌ వరమూల్య విలసితాంబరము లిదుగొ!
సరసజనామోద సంధాయకంబగు పరిమళద్రవ్య సంభార మిదుగొ!

తే. వివిధ ఖాద్య పదార్థ సంవిలసితములు బహుళ రుచికర ఫలపూర్ణ భాసురములు
రమ్య సౌరభాన్విత పుష్పరాజితములు చందనపు మందసములని నందన కిడె. 54

క. తన బిడ్డ వలెనె యీ పోతన బిడ్డం గూడ దరికిఁ దార్చుచు లక్ష్మీ!
కొనుఁ డీ ఫలాదు లీవు వదినెయును దమిఁ గలిసి పీనిఁ దినుఁడీ! యనుచున్. 55

క. ఈ తెలఁగున నొక్కించుక కూఁతునుగని ముదమునంది గురుధిషణుని నా
పోతన నారసి భాషాచాతురి బొలయంగ సుకవిచంద్రుఁడు పల్కెన్, 56

తే. పెండ్లి యీడేగుదెంచెను బిడ్డకనుచు లగ్న నిశ్చయమునకుఁ దలంపు గల్గి
సకల సన్నాహములతోడ సుకవివర్య! వచ్చినాఁడను వేఱ భావమ్ము వలదు. 57

క. రాజాస్థాన సుకవినై రాజిలుటన్ రాజ లాంఛనమ్ములతోడన్
రాఁజెల్లెన్ బోతన కవిరాజా! శ్రమ యొసఁగినాఁడ క్షమియింపఁదగున్. 58

సీ. పదులనుమించు విపశ్చిద్గణంబులు శతమునుమించు శిష్యవ్రజంబు
గుల్మసంఖ్యాకమై కొల్చియుండెడి సేన పగటి దివ్వటులూను పరిజనంబు

స్తంబేరమాళ భాస్వద్ధురీణశతంబు నుష్ట్రచతుష్టయం బొప్పుమీఱు
స్వర్ణపాల్యంకికాసం వాహనగణమ్ము తూర్యవాదన కళాచార్యవరులు

తే. వందిమాగధ బృందంబు వైణికాది గాన విద్యావిశారదుల్ ఘనతఁగనిన
నర్తకీ జనంబులు, కవణములు కనవు పసుల కిడువారు పలువురు పాచకులును. 59

తే. వరుసనొక శతమ్ము నమించు పరిజనమ్ము కలరు మా వంతులాదిగాఁ గవివరేణ్య!
ఇందఱి భరించు శ్రమము మీ కిడుదునెట్లు భయపడకుఁడు మాశ్రమ మేమె పడెదమింక.

ఆ. భవ్యచరిత! నాదు పరివార మెచ్చోట నేది మెసవునదియె యేను దినుట
తగును మీరలన్యథా భావనమొనర్పవలదటన్న సుకవి పలుకు నిటులు. 61

శా. బావా! యిప్పుడు మీరు మా కెటులు సద్బాంధవ్యముం గూర్తురో
మీ వారెల్లరు గూర్తుర త్తెఱఁగునెమ్మిన్ వారలం వేఱుగా
భావింపందగు నొక్కొ! శూన్యపథిలో భాసించునెట్లిందు వా
శేవన్దారక లొప్పియుండవొకొ పాటిందప్పి వర్తింతురే? 62

శా. ఆహారంబది యొక్కఁ డొక్కనికినై యర్పించుటల్ కల్ల లీ
దేహాలిం సచరాచరమ్ములగ నే దివ్యుండు సృష్టించుచున్
గేహంబం దిడువాఁడొ వాఁడె యిడురక్తిం భుక్తి నట్లొప్పవే
నూహింపందగు నన్నదాత యని పాత్రోర్విం మహద్దర్వినిన్. 63

ఉ. కావున మద్గృహమ్మననె కాదనకన్ హరి యిచ్చు నంబలిం
ద్రావుటలొప్పు ప్రాణము విధమ్మన మానముగూడ బీదలం
దావిడఁజాలకుండు నిదె తక్కిన యత్నమొనర్చువాఁడ మీ
దీవన లున్నఁజాల్ మరొకతీరున భావనసేయఁ జెల్లునే! 64

చ. అనుచును లోనికేగి తనయాత్మనిటుల్ తలపోసె రాఘవా!
కనుగొన నింటిలోన నొక గవ్వయులేదిటు నిన్ను నమ్మి నా
మనమున నిర్భరుండనయి మాట యొసంగతిఁ దావకీన పా
వన పదభక్తులెయ్యెడ నభాగ్యులనం వినలేను నీ నడిం, 65

ఉ. మన్నియ నాశ్రయించు నొక మానవుఁ డింతటి శక్తియుక్తుఁడై
నిన్ను మనంబునందుఁ గడు నిశ్చలభక్తిని విశ్వసించునన్
బన్నము పాలుసేయు ననఁ బల్కువెలందికి నీకె యెంతయుం
జిన్నతనంబుగాదె జననీ! యిపుడేగతి రక్షసేతువో! 66

సీ. పదదర్శనమ్మిడఁ బదవాక్యదర్శన సందోహమనఁ గండ్లముందె యాడు,
కన్నెత్తి చూతువేన్ జ్ఞానభానూదయ మ్మోనగూడు నూహాగగనపథాల,

హసియించుచో నవరసకళానిధు లుద్భవింతురానంద సింధ్వంతరముల,
కనికరమ్మునఁ బల్కుఁ గావ్యకన్యాలంక్రియా రసధ్వని రసనాగ్రవర్తి

తే. యగును, భారతి ! నీ యక్షరాకృతులను నక్షరార్థప్రదుండగు హరికొసఁగితి
ధరణిపతులకై నిడను ముక్తామణులను వెలఁగఁబోతురె కర్కంధుఫలములకని, 67

క. ధర్మార్థకామమోక్షము లర్మిలినిడు తల్లి వీవె యని వినియెద నీ
మర్మముదెల్పుము కవి దగు కర్మంబిదియేమి నృపునిగని కయిసాఁపన్. 68

సీ. తీవంచమోముల దిట్ట చేపట్టినజాణ వీ వీరాని చదువుగలదె !
కడుపు బంగారు బొక్కసముజేసిన మేటివనిత వీ విడలేని ధనముగలదె !
నిక్కుపుజగపుమన్నీని పట్టపురాణి వరయ నీ విడలేని వరముగలదె !
కైటభదైత్యారిగా దిలికోడల వెదియొ నీ విడలేని పదవిగలదె !

తే. అంబ ! త్వత్పదసేవనాలంబ దీప్త భక్తవర్యులు భువి నెందురిక్తులనెడి
యర్థరహిత జల్పనముల నాలకింపఁజాలఁ కావ్యకాసార మరాలబాల ! 69

క. సత్యశివ సుందరాకృతి నిత్యముగా నా మొగాన నిల్తువుగదె యీ
భృత్యునితో నీ విప్పుడసత్యముఁ బలికింతువమ్మ చదువులరాణీ ! 70

ఉ. ముందు సురాళికై యమృతమున్ దగ మోహిని బంచినట్లు మ
న్మందిరమందు భూమి సురమండలికిన్ మధురాన్నపానముల్
విందు నొసంగరాదె యరవింద దళాయతనేత్ర ! శారదా
సుందరి ! యంచు వేడనొక సుద్దియిటుల్ విననయ్యె వాకిటన్. 71

ఉ. పోతన సత్కవీంద్రులు ప్రపూత చరిత్రులు మందిరమ్ములో
నీ తరుణమ్మునందు వసియింతురె. సత్కవిదర్శనార్థమై
పూత చరిత్ర శ్రీ భువనమోహిని జ్యోతిపురంపురాజ్ఞి వి
స్ఫీత యశస్కుఁ బాల్కురికి వేలుపు నీశ్వరుఁ గాంచి వచ్చెడిన్. 72

చ. అనుటయుఁ బోతనార్యుఁడు మహాదృతిడాసి మదీయభాగ్య మే
మనవలె మీదురాక యని యాడుచు యానమునల్ల లోనికిం
గొని చనుఁడంచు వాహకులకుం దగు మార్గముఁజూపి గోష్ఠమం
దున వృషపాళిఁ దోలుఁడని తోడుతవచ్చిన బండ్లతో ననెన్. 73

ఆ. మేఘమందు మెఱయు మించు దీవియఁబోలి కాచపాత్రి దీపకళికవోలె
వెల్లమబ్బులందు వెలుఁగు సుధాంశువై యద్దముల సవారియందుఁ జెలఁగి. 74

తే. పూర్ణసౌందర్య జలనిధిఁ బుట్టి పెరుగు భార్గవి నెవారో వలబన్ని పట్టిరనఁగ
వలిపమగు నుల్లబంబున వెలుఁగు లీను వెలఁది యాందోళికను వీడి వెలికివచ్చె. 75

చ. కవివరుఁ డేగుదెంచి తనకై సవరించిన మేల్భవంతిలో
నవసతినిం బొనర్చి చెలి నర్మిలి పోతనఁ జేరఁ బిల్చి తా
నవిరళ భక్తియుక్తి నిటులాడెను సత్కవిచంద్ర ! నేను మీ
కవితల నాలకించుటకుగా నరుదెంచితిఁ గూర్మి పేర్మిమై. 76

చ. ప్రణత జనార్తిహారకునిఁ బాల్కురికేశుని సోమనాథునిన్
ఫణికృతభూషణాంచితుని భాగ్యవశమ్మునఁ గాంచి మ్రొక్కి ల
ర్పణముఁ బొనర్ప వ్యాసకృత భాగవతమ్మును భక్తిఁ బోతరా
ణ్మణి తెనుఁగుం బొనర్చెను వినం దగునంచు వచించిరయ్యెడన్. 77

చ, అది విని నేను బోతన మహాకవి దర్శన భాగ్యమై భవ
మ్మొదవునటంచు వచ్చితి నిటుల్లమునం గలదొక్క సంశయ
మ్మది తొలఁగింప వేడెద స్మరాంతకు నచ్యుతుఁ డెట్లు మోహినీ
మదవతి రూపమూని నిజమాయ జితోస్మియనం బొనర్చెనాన్. 78

క. ఒక క్రేవ భావుకుండు మఱొకవైపున వీరి రాక యొనగూడెను దా
నొకచే సమయమ్మున నే నిఁక మునుగల కర్జమేమొ యెఱుఁగ నటంచున్. 79

వ. పోతన తన యంతరంగమ్మునఁ జింతింప నమ్మదవతి యతనింగని, 80

తే. ఇంక నొక విన్నపముగల దీడ్య చరిత ! దానిఁ జిత్తగింపఁదగు నిదానగతిని
నే సహస్ర భోజనమును నిర్వహింపఁ దలఁచితిని శివార్పణముగా దాని నిచట. 81

ఆ. జరుపుఁడనుచు సకల సంభారము లొనర్పఁ బరిజనమ్ము బిల్చి పంపు సేయ
వల్లెయనుచు వారలెల్ల వస్తువులను గొనుచు బానసమున నునిచి చనిరి. 82

ఆ. సూదజనము లెంతొ మోదమ్ముతోడుత భక్ష్యభోజ్య లేహ్యపాయసముల
సిద్ధపఱచి త్వరగ శ్రీనాథుఁ డాదిగా విప్రతతుల కిడిరి విందు లంత. 83

క. పోతన సాదరగతి నతిచేతో ముదమెసఁగ రాణిఁ జేరంజని య
న్నాతికి నాతిథ్యంబిడఁ బూతమతిన్ స్వీయసతిని బోరి నియమించెన్. 84

ఉ. కూరుచు విందు లక్కజము గొల్పఁగ సత్కవిశేఖరుండు వి
స్తారముద మ్మెదం గదుర ఛాత్రియుతుండయి పోతనార్యుతోఁ
జేరి భుజించి తమ్ములము సేయుచు బాన్పున మేనువ్రాల్చి పెన్
గూరిమి నాంధ్రభాగవత కోమల కావ్యకళా పరిలుబ్ధుఁడై. 85

తే. ఘనుఁడు శ్రీనాథకవి శిష్యగణములెల్లఁ గొలువఁ బోతనకవిఁ బిల్చి పలికె నిట్లు
నీదు భాగవతాకాశ నిర్ఝరమునఁ దానమాడించి ముత్స్వర్గధామ మిడవె. 86

చ. భవహరమై సమగ్రరసబంధురమై భగవద్గుణామృతా
సవరుచిరమై కళారమకు సాగరమై కవిలోక లోచనో
త్సవకరమై నిరర్గళ నిసర్గమనోహరమై తనర్చు భా
గవత కవిత్వమేను వినఁగా నిను గోరెడివాఁడ సత్కవీ ! 87

క. అన విని పోతన స్మేరానన మొప్పఁగ బావఁగాంచి నా భాగ్యము మీ
రనుటయె చాల్పదివేలని వినయ సుధాస్రవదుదారవిధు వదనుండై. 88

క. అనఘా ! మీ ముసు నేఁ గవినని చెప్పగ సిగ్గువడెదనైనను మిముబోల్
ఘనులకడఁ జదివిననె సంకునఁబోసిన తీర్థమగుచుఁ గొమరొందుఁ గృతుల్. 89

ఉ. వీరి విలాసభాషణము వీనుల విందిడ నింగితజ్ఞుఁడౌ
నారయ లోనికేగి సుమనస్థమరందము నా ప్రబంధమున్
దోరపు భక్తిఁ దెచ్చి వినతుండయి పీఠికనుంచెఁ దా నమ
స్కార మొనర్చి పోతనయు సాదరబుద్ధిని విప్పెఁ దత్కృతిన్. 90

తే. అపరమోహినియై భోజనామృతమ్ము నిడిన రాణి వాంఛితముల నెలమిఁదీర్ప
మోహినీ సత్కథా సుధావాహినులగు ఘట్టములె గాన మొనరించెఁ గవివరుండు. 91

ఆ. అతని కావ్యగానమది జెవిం బడినంత నాగుపాము లీల నూఁగెఁ దలలు,
అతఁడు చదివి చదివి యాఁపె నా వెనుకయుఁ నదె ధ్వనించెఁ జెవులఁ గదలవెదలు. 92

శా. శ్రీనాథుం డల పోతరాజ కవితా శ్రీ మోహినింగాంచి బ్ర
హ్మానందాబుధి నోలలాడుచును దీవ్యన్నందనోద్యాన సం
తాన శ్రీహరి చందనోపగత శీతచ్ఛాయలందుఁ సుధా
పానోన్మత్తునిరీతి మైమఱచెఁ గావ్య స్వర్గసంవాసియై. 93

ఆ. జోలబాడు నంత బాలుండు నిశ్చల చిత్తుఁడగుచుఁ గూర్కజెందు శక్తి
యచటి బుధులయెడఁద నావేశమై మేని చలనమడఁగె నోరు పలుకుటుడిగె. 94

క. శ్రీనాథసుకవియున్ జకితాననుఁడై యతనిఁగాంచి యను నిటు బావా !
యీ నా జన్మము ధన్యము తా నీ కవితామృతంబు ద్రావుట కతనన్. 95

తే. లలిత వాక్యరసాల పల్లవవితాన ఖాదనోన్మాదులై తాము గండుకోకి
లములు కలహించు ధారావిలాసరుచుల స్వేచ్ఛఁ గ్రీడించు రాయంచ చేడెపిండు. 96

తే. హరి జగన్మోహినిగఁ బృథ్వి నవతరించి యమృతమునుబంచె నాఁడు తా నమరతతికి
నీ కృతుల నేఁడునుఁ మోహినీలతాంగి మనుచు విబుధుల కమృతభోజన మొసంగి. 97

సీ. లలితపదమ్ములే లలితాపదమ్ములై ధారుణీజన శిరోధార్యతఁ గనె,
భావార్థములు రమ్యభావజార్థమ్ములై భువనైక మోహనస్ఫూర్తి గాంచె,

వృత్తమ్ములు మరాళవృత్త రూపమ్ములై సుర నరలోక సంస్తుతుల నందె,
సుమధురాలంకృతుల్ సుమనోమనోహరాకృతులై ప్రజా నమస్కృతులఁ గొనియె

తే. ధ్వనులు చతురాననోదిత ధ్వనులఁ బుట్టు శ్రుతులయ్యె పండితావళి శ్రుతులఁ దన్పు
నీదు కృతి రసఖండమ్ము నిర్జరాళి కమృతభాండమ్ముగా వెలుఁగందె ననఘ! 98

ఉ. ఎక్కడి పాండితీ ప్రతిభ లెక్కడికైత లదేమి ధార తా
నొక్క మహాసముద్ర మది యూహ యెటాడ దిఁకేమి జెప్పు దీ
విక్కరణిన్ రచింతువని యెంచను, నేనన నెంతఁ బృథ్విలో
దిక్కులు నాలకించు సురదీర్ఘికలన్ విలిఖించు నీ కృతుల్. 99

చ. నవరస సాగరాళికి ఘనమ్మగు కాల్వలు దోఁడి ముత్తెముల్
రవలు తెలుంగు బంగరు పొలమ్ముల నారిడి పెంప నివ్వి నీ
కవనపుఁబేర భాగవత కావ్యపుఁ గోండ్రిలఁ బండి సాహితీ
భవనము నింపె నాంధ్రరస వాఙ్మధువర్షక! కావ్య కర్షకా! 100

చ. రసమయభావ దివ్య మధురాజితమౌచు సువర్ణవర్ణప్రో
ల్లసితమునై పదాంబుజ దళస్థలి నర్థరమల్ వసింపఁ గా
వ్య సుమకుమారి ప్రాజ్ఞహృదయ భ్రమరావళిఁ దన్పి దేవతా
ప్రసవమనన్ సురల్ శిరముపై ధరియింప వెలుంగు భావుకా! 101

ఉ. మూలముడాఁగ నంతకును ముద్దగు నాకృతి దాల్చి స్కంధశా
ఖాళిని దేలి యెంతొ హృదయంగమ పుష్ప సమోక్త్యలంక్రియా
మాలికలల్లి పత్రపథి మంగళరేఖలు దిద్ది సత్ఫల
శ్రీలిడు వేదకల్పతరుసీమల సీయిల నాఁటె నీ కృతుల్. 102

క. శిల్పి కవి గాయకుఁడు నిజ కల్పిత సామ్రాజ్యసౌధ ఘన శిఖరాగ్రా
నల్ప హిరణ్మయ సుమమృదు తల్పముల శయింతురి రససుధామధు రతులై. 103

క. సుంతయు నీ కృతి గన నజునంతటివాఁడైనఁ బదములంటి నమించుఁ,
చింత యుదయించు నీ కళయంతయు శాణశిల క్రింది యందమ్మగుటల్. 104

సీ. వెడల వింతియెకాని యడుగిడ్డ చోటెల్ల ముత్యాలపంటలు మూల్గవొక్కొ!
దర్శింపనొల్లవు ధరణీపతులఁ గాని చనిన కన్నులఁ గప్పికొనరె నిన్ను!
మాట వెచ్చింపవు నోట నీ వనినంత సిరుల వర్షమ్ములు గురియకున్నె!
కోరవింతియె కాని కోరుచోఁ దీరైన దేవేంద్ర భోగాలఁ దేలవొక్కొ!

తే. ఆత్మలో ధన ఘనతల నభిలషింప వింతెకాని నీలోనఁ దలంతువేని
కనకమయమ్ముగాదొకో నీదు మనికి యెల్ల విజయదుందుభుల్ దశదిశల్ వేగవొక్కొ!

చ. పుడమిని బెక్కు చోటులకుఁ బోవనె పూజ్యుఁడగున్ విపశ్చితుం
డడుగని దమ్మయైన నిడదండ్రిగదా ! గిరి గహ్వరమ్ములన్
బడుకొనియుండు సింహ ముఖపార్శ్వములన్ జనుదెంచి మమ్మిదో
కుడువుమటంచు నెందు మృగకోటులు చుల్కనజెంది పల్కునే ? 106

ఉ. నీదగు విద్యకున్ మరియు నీ యసమాన కుశాగ్రబుద్ధికిన్
నీదు కవిత్వసిద్ధి కవనిన్ వసియించెడి యెవ్వఁడేని సం
పాదిత సంచితార్థముల బంగరుగోడలు బెట్టువాఁడు నా
కేదియు వద్దు వద్దనఁగ నీవె కనంబడుచుంటి భావుకా ! 107

తే. నావు డప్పోతరాజు శ్రీనాథుఁ గాంచి యిట్లు వల్కు బావా ! తిన నింత తిండి
కట్ట బట్ట జిక్కిన రాము కరుణ వలన నంతె చాలు ధనాశల కంతు గలదె ? 108

తే. విలువగల రత్నమును దానె వెదకికొంచు మానవుఁడె వచ్చు, రత్నమ్ము మనుజు కడకు
వెదకుచుంబోవ దీ విశ్వవీధి నదియుఁ దా సువర్ణమైత్రినె శిరోధార్యమగును. 109

క. 'దేహి' యను చొక్కరికి నీ దేహికరముఁ జాఁచు కన్నఁ ద్రెళ్ళుట మేలౌ
వాహిను లల్పములయ్యును సాహసమతి నుదధి కొసఁగ సాగు జలాలన్. 110

తే. త్యాగమున నాత్మశక్తి వర్ధనము నందు స్వార్థమునకయి యాచింప సమయు నద్ది
యనుడు శ్రీనాథుఁ డంతఁ బోతనను గాంచి పల్కు నిట్లు లోకజ్ఞాన పటిమ మెఱయ. 111

తే. లక్ష్మి కోపింప విష్ణులీలా విలాస ఘన జగన్నాటకం బెల్లఁ గట్టువడును ;
అర్థమది చతుర్విధ పూరుషార్థ వితతి నల ద్వితీయమై యద్వితీయతఁ జెలంగె. 112

ఉ. అర్థములేని మాటవలె నర్థవిహీనుని జీవనం బిలన్
వ్యర్థముగా గతించుఁ దృణవద్గణనం బొనరించువాని య
భ్యర్థన లోకమెల్లఁ దుద భార్యయుఁ బెన్మిటియై యెదిర్చి వా
క్యార్థమొనర్చు మేఁక మెడనాడు స్తనమ్మతఁ దన్న నింతకున్. 113

ఉ. వేగిన యంత నీ దినము వెళ్ళుట లెట్లని నెత్తిపట్లతో
నే గతియించుఁ బొద్దు మతి నిర్ధని కొక్కెడ నిల్వ. దేరికేన్
లోఁగి చరింపఁగావలెను లోపల నెంతటి ప్రజ్ఞయుండియే
నూఁగదు వేగదాత్మ మెయినుండియె చంపు ననుక్షణమ్మునన్. 114

చ. కుడువఁగనైన నర్థితతి గోరినవేళలఁ జేతి నిండుగా
నిడుకొననైనఁ బృథ్వి సకలేప్సితముల్ నెఱవేర్ప శ్వాసముల్
విడువఁగఁ బిల్వనైన నిజవిత్తమె కారణమద్ది లేమి ముం
దడుగిడలేఁడు జీవుఁడరయన్ హరికైనను బెట్టుచుట్టమా. 115

క. పులి మేఁకయౌను ధనముం దిలకించిన యంతమాత్ర, నెఱి మేఁకయు బె
బ్బులియౌను ధనము పాణిం గలిగిన మాత్రాన వినుము జ్ఞాననిధానా! 116

తే. కలిమి గలవాని శవమునుం బలుకరింతుర వేఁడు నిర్ధనుఁ గన్నెత్తి చూడరెవరు
ద్రవ్యవంతుని వాక్కు వేదంపు ఋక్కుమిడుకు బీదపల్కులు చెవిఁబడు ములుకులు.117

ఆ. ప్రతిభగల్గువాని పజ్జ విత్తమెయున్నఁ బ్రకటపఱచు దాని పదిగుణములు
సకలలోపములను సవరించి సరిదిద్ద ధనముకన్న మిన్న ధరణి సున్న. 118

మ. పరదారగ్రహణమ్ము పాపమనుచుౝ భావించు చందమ్మునౝ
బరవిత్తాహరణమ్ము దోషమనుటల్ భావ్యమ్ములౌ పాండితీ
స్ఫురణం దత్సముపార్జనమ్మునకునై పూనౝవలెౝ దానితో
నౌరులన్ దన్పుచుఁ దా భుజింపవలె వాఁ డొక్కండె ధన్యుండిలౝ 119

శా. ఆలోచింపుము సద్గురూత్తముల నార్యశ్రేష్ఠులన్ బంధు మి
త్రాళిన్ భృత్య కళత్ర పుత్రసముదాయంబుౝ దయాస్నేహ భ
క్త్యాలోకాంచిత రాగరంజితులఁ జేయన్ బెట్టిపోయంగనున్
శ్రీలక్ష్మి కరుణాకటాక్ష విభవశ్రీలే కదా మూలముల్! 120

శా. ఈ సేద్యమ్మున కేమి వచ్చినను మీకేమౌను మేల్పంటరాఁ
గానో వీసమొ కల్గ మీ వ్యయములౝ గంధాక్షతల్గావు తా
నీ సంసారము సండ్లులేని పులి, సొత్తెంతేనియుౝ దెచ్చినన్
బాసంగమ్మునకైనఁ జాలదెపుడుౝ భావింపుమో భావుకా! 121

ఉ. దానమునందుఁ గర్ణుఁడను తావకకీర్త్యకళంక భాను శో
భానవరూపరేఖల నభమ్ము లిభమ్ముల నెక్కి చాటఁగన్
వేనకువేల నిగ్గడిగి పెట్టిన యప్పులఁ గోండ్ర దీర్చునే
యేనుఁగు లెక్కనైన ఋణమేకుల రాటముతోడఁ దీఱునే? 122

క. అనుటయుఁ బోతన శ్రీనాథుని యుపదేశాశయమ్ము తుది మొదళులునున్
మనమున కెక్కఁగ నాతనిఁగని యిమ్మెయిఁ బల్కె నిర్వికారహృదయుఁడై. 123

ఆ. ఆర్య! మీకుఁ జెప్పునంతటి వాఁడనుగాను గాని మనవి గల దొకండు
వినుఁడు దేనికతన మనమున నే నిప్పుడింత తృప్తిగాంచి యెసఁగువాఁడ. 124

ఉ. ఆఁకలి దప్పులున్ మరియు నాతపశీతవికార బాధలన్
సోఁకఁగనీని సౌఖ్యతతి క్షోణి నరావసరమ్ము లింద్రియా
సీకముఁ దన్పి దాన మదినించు సుఖాళి మనోవినోదముల్
వీఁకమెయిన్ నరుండెపుడు వీని నిమిత్తమె ప్రాఁకులాడెడిన్. 125

సీ. అవసరమ్ములు నిందిర్రియ వినోదము లటంచు నరమనోభీష్టమ్ము లిరు తెఱఁగులు;
అవసరసేవన మ్మసువులమై నిల్పుఁదమి వినోదము లిందిర్రియములఁ దన్పు.
నొగివినోదమ్ము లాయువునెల్ల హరియించు నవసరసేవ జీవామృతమిదు,
ధాత్రి నిందిర్రియ వినోదములకుఁ దుదగాన మవసరసేవన కవధిగలదు,

ఆ. అవసరములు పూర్తియగును న్యాయార్జనఁ వేడ్కఁ దీర్పదెంత విత్తమేని.
అవసరమున కన్ననధిక మార్జించుచు ధనముఁ గొనుట దొంగతనమటంద్రు. 126

తే. అధిక విషయసంసేవన మ్మగు వినోద మవసరాకృతింగొని వ్యసనాఖ్య నలరి
తనను సేవింపకున్న ఖేద మొనగూర్చు నతి వినోదసేవనము దుఃఖాకరమ్ము. 127

సీ. తన యక్కఱకు డబ్బుదాఁచు లోభమ్మొప్పు పరధనాహరణ లోభమ్ము తప్పు
నిజవస్తువులపయి నిల్పు మోహమ్మొప్పు అన్యవస్తుగత మోహమ్ము తప్పు
తనసతిఁ నియతిఁగూడిన కామగతి యొప్పు పరసతిన్ గవయు కామరతి తప్పు
తన ప్రాణరక్షకై తగిన కోపమ్మొప్పు పరవినాశక కోపభరము తప్పు

తే. స్పర్ధగల్గిన యట్టి మాత్సర్యమొప్పు పరుననూయగాఁజూచు మత్సరము తప్పు
సదభిమానపూర్వక మదచర్యయొప్పు దురభిమానదూషిత మదనిరతి తప్పు 128

వ. అని పెద్దల సుద్దులు మును వినుచుందు మిందిర్రియవినోదము లేల ? 129

సీ. జిహ్వకెంతయు రుచి చేకూర్చు మధురాన్న పానమ్ముల న్మేని బర్రిదుకుగలదె ?
మెత్తగా నొరసెడి మేల్పట్టు పుట్టమ్మునన మానసంరక్షణము గలుగునె ?
భవ్య సౌందర్య సంపదల దర్శింపమిఁ గన్నుల దృష్టి తాసన్నగిలునె ?
పరిమళ మిశితార్ద్రి పవనముం బీల్వమిఁ బ్రాణమ్ములకు భంగపాటు గలదె ?

తే. అవని నాత్మ స్తవమ్ముల నాలకింపకున్నచో విను శక్తి తాఁ జన్నె ? బుధుఁడు
బర్రిదుకుకై వీని సేవింపవలయు మితిగఁ గాని యిందిర్రియ సేవకై కాదు బర్రిదుకు. 130

తే. ధనము వచ్చు కాలమున వర్తనము మలినమగును జనువేళనే శుద్ధమగుఁ దలంప
నెదుగు వర్షర్తువందు వాహినుల నడలు మలినములగు గీర్రిష్మమున నిర్మలములగును. 131

ఆ. దాన భోగనాశ తతులంచు మూఁడవ స్థలను బొందునట్టి ధనపుగతుల
దాన ముత్తమమ్ము తా నది యేవేళ వెంట వచ్చు మిగత లింట నుండు. 132

తే. ధనము యౌవన మవని మద్యమ్ము వోలె మత్తుగొల్పి వివేకమున్ మఱుఁగుపఱచు
శుద్ధ విషసేవ యారోగ్య సూచన యనఁ గీలెఱిఁగి వాడుకొన నవి మేలుగూర్చు. 133

తే. వాయు కృష్ట కాదంబినీ వారమట్లు ఘన సముద్దీప్త విద్యుత్ప్రకాండములగఁ
బద్మదళ గత తరళ శంబరము కరణి స్వప్న సమము జీవనము యౌవనము ధనము. 134

క. ధనమన లక్ష్మియె కదె! యా వనితను విశ్వస్వరూపవర్తియయిన వి
ష్ణుని సేవల నుంపందగుఁ దన కని హరియించు నరుఁడు తగు శిక్ష గొనున్. 135

క. లీలఁ బ్రవహించి చన నదిఁ గ్రోలు మెరక పల్లమెత్తుగడ్డయు మడుఁగౌఁ
గాలప్రవాహ సరణిఁ గుచేలుఁడును గుబేరుఁడగును శ్రీపతి యతియా. 136

సీ. ధర్మమ్ము తా నర్థధర్మమ్మునై కామధర్మమై మోక్షైక ధర్మమగును,
అర్థమ్ము తాను ధర్మార్థమై యుక్తకామార్థమై నిత్యమోక్షార్థమగును,
కామమ్ము తా నర్థకామమై సద్ధర్మ కామంబుగా నొ్మోక్షకామమగును,
మోక్షమార్థిక బంధమోక్షమై కామ నిర్మోకమై సుఖదుఃఖ ముక్తినొసఁగు

ఆ. ధర్మమూలముపయిఁ దగ నర్థకామాది వృక్ష పత్ర పుష్ప వితతి దనరు
మోక్షఫలము నందు మూలమౌ ధర్మము జెడఁగనీకయున్నఁ బడమి నరుఁడు. 137

తే. అనిన శ్రీనాథుఁ డా పోతనార్యు పల్కు లన్నియును గూడ వేదవాక్యమ్ము లటులు
శ్రద్ధమై విని యెన్నెన్ని జన్మ లీవు ఋషివె, లేకున్న నిను వేద మెటులు వలచు, 138

క. నీవలె నిల్లెఁడు జనములు కేవల విజ్ఞానధనులె కిల్బిషరహితా!
భావింపఁ దలకు నొక రుచిగా వెలయుఁ బ్రపంచమనినఁ గవి యిట్లనియెన్. 139

చ. సతికి సుతాళికిన్ మహిత సౌఖ్య సమున్నతి గూర్పనెంచి పె
న్మతకరియై నరుం డనుదినమ్ము ధనమ్ము గడించిపెట్టుఁ దా
నితరుల మోము మెప్పుకయి హీనకృతుల్ వొనరించి మించి దు
ర్గతులను ద్రెళ్ళి యాత్మ కపకారమొనర్చికొనంగఁ జెల్లునే? 140

తే. ప్రకృతి బంధుజన ప్రేమ పాపములకు దారిదీయక మానదు తద్విధమ్మె
యాత్మలెల్ల బంధువులని యరయు ప్రేమ నరుని యజ్ఞాన జలధికిఁ దరణి యగును. 141

చ. తెలియనివేళ డోల నతిదీనత నగ్నశరీరధారినై
మెలఁగితి మానమేర్పడఁ దమేయ సుమప్రభలీను వల్వలన్
వెలసితి నజ్ఞతా నిరతి వీటిఁడినై చెడినాఁడ, జ్ఞానమున్
దెలిసితి నిప్పుడట్లె చెడ దీపము గైకొని నూత దూఁకుటల్. 142

తే. నాదు జీవితమ్మిగతి నడువనిమ్ము ముందు నీ బిడ్డ సుఖపడి మురియునట్లు
నీదు జామాత కీ నీతి నేర్పుకొనుము మ్రోఁకు కన్న వంచినయట్లు మలఁగు మొలక, 143

ఉ. పోలిక మేనమామలను బోలఁగవచ్చును భాగినేయుఁడీ
మేలు వచింపు మాతఁ దెద మెచ్చునన న్గవిరాజరాజు తాఁ
బాలను గొట్టినన్ దిరిగి బుక్కనవేసినయట్టులౌర! మీ
బాలురు వారునున్ సహజపండితు లొడ్డులు జెప్పనొప్పునే? 144

క. అదిగాక నీ సుతుఁ డతఁడు గదె! వితొకటిడినఁ జెట్టొకటి మొల్చునెటుల్
మొదలే మొగురము లావనఁ దుద దూలమ్మనిన నిజము దోఁచునె యనుచున్. 145

క. పరిహాస భాస భాషణ మరంద రసవృష్టి బావమఱఁదు లిరువురున్
జిఱునగవు పూలగుత్తులఁ బరస్పరము జల్లుకొనుచుఁ బడుకొనిరి నిశిన్. 146

ఉ. వేకువయౌటఁ బోతన కవీంద్ర నిరుక్త గజేంద్ర మోక్షణ
ప్రాకట సూక్తులన్ నిదురబాసిన సత్కవి సార్వభౌముఁడున్
మేకొని కాల్యముల్ నెఱపి మేవడి సోదరరాగ వేగ శో
భా కమనీయకర్ణ సుఖభాషలఁ జెల్లెలిఁ గాంచి యిట్లనెన్. 147

తే. సోదరీ! శారదన్ నీదు సుతగ నెంచి సాఁకితివి నీ ఋణమ్మిఁకఁ జాలననుట
సేవ నా కోడలున కేను జేసికొంటి నేమి చోద్యమ్మటంచు నా లేమ వల్కె. 148

శా. ఆ పల్కుల్విని యాడెఁ జెల్లెలిక సత్యంబద్ది మీ బిడ్డయే
రేపైనన్ దమి మీ కరమ్ముల సమర్పింపన్ వలెన్ గాదె, వే
మీ పిల్లం బొనరించుకోవలయు సుమ్మీ! సోదరీ! య త్తఱిన్
నాపై భారముదించి నట్టులగు నన్నన్ నాతి తా నిట్లనెన్. 149

క. ఇట్టులు కొమరుని గననెది పట్టించుకొనండు మీదు బావ, చిఱుతఁడో
చెట్టువలె నెదిగెఁ బిడికెం డెట్టులుబడు ననుచుఁ జింతయే లేదనుటల్. 150

తే. కవి పలికె నిప్పుడేది తక్కువబడినను సవరిచెదఁ గాని పరిణయ సమయమందు
పలమొ తులమొ మీరలు పిల్లపై నిడికొన నలువురం బ్రతిష్ఠయు భూషణమ్ము మీకె. 151

తే. కావునన్ నేఁడె కోకను గట్టఁబెట్టి విడెముబెట్ట మీ సొమ్మునఁబడును దుహిత
నాభరము వాయు, నాభరణమ్ము లిదుగొ! పట్టుపుట్టము లివెయని భగినికిడెను. 152

ఆ. భ్రాత యిట్టుపల్క భామిని యానాఁడె పతి యనుజ్ఞవడసి బంధువులకు
బొట్టువెట్టి మీరు భోజనమ్మునకు మా యింటికనుచుఁ జెప్పి యెలమివచ్చె. 153

క. పొంగుచు శారదకపు డభ్యంగన మొనరించెఁ గుడుపులయ్యెను గట్టా
లంగొని సింగారమ్మున నంగణమునఁ గూడెఁ బేరటాండ్ర నివహముల్. 154

చ. చిలుకల చాలు వ్రాలినటు చిత్రముగా సరివేలు మామిడా
కుల పలుతోరణమ్ములను గూడిన శీతలకాయమానసం
విలసితసీమఁ దూర్యములు వీనుల విందిడ మంత్రపాఠముల్
జెలఁగ నుపాయనమ్మొసఁగి చేలము గట్టఁగఁ జేసిరంతటన్. 155

మ. బలిమిన్ లక్ష్మియు నామె కాళ్ళఁ బసుపుం బారాణియున్ దిద్ది న
వ్వులకై బుగ్గలకింత రాచి యిదొ పస్పుంగుంకుమన్ బెండ్లిదొ

కళవచ్చెన్ వదినే! మొగమ్మున కనన్ గంజాక్షి వ్రాల్గన్నులం
దలుగుల్ వాఱు త్రపాతరంగిణుల నీదాఁడెన్ మిలన్మీనముల్. 156

క. మల్లన కెల్లరు మెచ్చఁగ సెల్లా పాగా నొసంగి శ్రీనాథుండున్
జెల్లెలి యుల్లమ్మలరఁగ నల్లుని జేసికొనె మేనయల్లుని గూర్మిన్. 157

ఉ. మక్కువ ఫాలమందున సమర్చిన కుంకుమరాలి కొద్దిగా
ముక్కుపయింబడన్ జెదరి ముంగురు లా యమపాయమూరు లేఁ
జెక్కుల వ్రేల వ్రేళ్ళపయిఁ జెల్విడగోరఁట కెంపువన్నియల్,
మ్రొక్కెడెఁ బెద్దబెద్దలకు ముద్దియ గద్దియ డిగ్గి సిగ్గుమై. 158

క. ఇంచుక వ్రాల్మోమునఁ గొమ్మించనఁ జిఱునగవు మెఱయ మెఱుచీర జరీ
యంచులు జీరాడఁగ రాయంచనడన్లోని కరిగె నలశారదయున్. 159

తే. శారదయు మల్లనయుఁ బరస్పరము స్వీయరూప సంపదలన్గ్రోల నా పదుగుర
నోపలేమిఁ గన్గొని రోరయోరకనులఁ బశ్యతో హరత్వమ్మటఁ బ్రకటపడఁగ. 160

క, రాశిగణకూట మైత్రి ప్రకాశింపన్ లగ్న పత్రికన్ వ్రాసి తమిన్
శ్రీ శుభమస్తని మల్లన కాశీర్వాదమ్ము సేసి రవనీ సురులున్. 161

ఆ. అగుట లగ్న నిశ్చయమ్మువచ్చిన పెద్ద లెచటివార లచటి కేగిరంతఁ
బట్టుపుట్టమూని భాసిల్లువదినెను గాంచి లక్ష్మి తండ్రికడకుఁ జేరి. 162

మ. ఒడిలోఁ గూర్చొని గద్దువన్నిమిరి ఊఁహూఁ నాయనా! యంచెదో
నుడువంబోయి నొకింతనిల్చి మొగమం దొక్కింత గారాబ మే
ర్పడ వీక్షించుట లేమి గావలయు నా బంగారు తల్లీ! యటం
చడుగన్ శారదకిడ్డ చీర కొనియీయన్రాదె నా కొండనెన్. 163

క, అనుటయు శ్రీనాథుఁడు పోతన యొడి నున్నట్టి సుతను దాఁగొని లక్ష్మీ!
యని దలమువ్వుచు నేఁ దెత్తును నరపతి కరుణ మరొకతూరికి ననియెన్. 164

క. కలవారి సుఖముఁగని నీళుల మ్రింగుచునుందు రురక లోకమున దరి
ద్రుల బిడ్డలు నిజవాంఛలు ఫలియింపని పూవులనుచు భావింపరెదన్. 165

ఉ. వెంటనె సత్కవీంద్రుఁగని వెల్వెలవోయెడి లక్ష్మిమోము గ
న్గొంటయుఁ గూఁతు కిట్లనియెఁ గోమలభావుఁడు పోతనార్యుఁడే
మంటివి, నీదు పెండ్లివఱకా సరిగంచుల పట్టుపుట్టమే
యింటికి రాదెటుల్ నడిచి, యీయఁడెటుల్ మన రాజరాజు తాన్ 166

శా. శ్రీనాథుండును బాలికం గనుచు లక్ష్మీ! వారి బ్రశ్నింపు మీ
తానా రాజెటులీఁ గలాఁడో యతఁడే సంస్థాన భూపాలుఁడో

యే నామంబున నొప్పువాఁడొ యనఁగా నీ చిత్రమౌ ప్రశ్నకున్
దానా పోతన కూఁతుకిట్లనె సమాధానమ్ము వెట్టం గవిన్. 167

శా. వాణీ శతిత్రిపురాంతక ప్రముఖ గీర్వాణాదు లెవ్వాని దృ
క్కోణానుగ్రహ నిగ్రహమ్ములకుఁ బొంగుం గ్రుంగులం గాంత రీ
క్షోణీకోణ శతాంశపాలకులు రాజుల్ వానిలో నొక్కఁ సూ
క్ష్మాంబుస్థానముఁ బోలఁ జాలుదురె తా నారాజె మా రాజగున్. 168

సీ. పర్వతమ్ములు గాఁగ బడుగు బండల గుండ్లఁ బనివడి యెవఁడు కుప్పలుగఁ బోసె,
నదులుగా నీ నీళ్ళ నానా ముఖమ్ముల వలయునం చెవఁడు కాల్వలను దీసె,
పఱచిన ట్లంతటఁ బచ్చిగడ్డినదెంతొ యక్కఱ యని చేల నల్కెఁ నెవఁడు,
వివిధ గుల్మ లతాది వృక్షాల నడపుల నవసరమని తోఁట లెవఁడు వేసె,

తే. చీఁకటింటి కాఁపురము నేఁ జేయుపెట్టు లనుచు విధుభాను దీపమ్ము లభ్రసీమ
నవసరములందు ముట్టించి యార్పు నెవఁడొ యా జగత్కుటుంబియె మాకు రాజు తాను.

సీ. అవనీ మహారాజ్ఞి కనిపెనే మారాజు పచ్చిక మేల్వన్నె పట్టుచీర
గగనకాంత కెవండు కట్టఁబెట్టెను రేయి నీలిరంగుల జరీపూల చీర
దిక్సతి కేవేళ తెచ్చియిచ్చు నెవండు పంచవన్నెల సన్నమల్లుచీర
ఇరు సంజలం దెవ్వఁ డిచ్చుఁ బ్రాక్పశ్చిమాంగనలకు లేఁతచెంగావి చీర

తే. హరిణ శార్దూల శుక పిక హంసకేకి నికర తృణవృక్ష ఫలపుష్ప నివహములకుఁ
గల చరాచరాదుల కయి వెలియనట్టి చీర లెవఁడిచ్చు నా మహోదారుఁ డొసఁగు. 170

శా. ఈ గీతాగురు నన్న నన్యగతిఁ దామే యే జనుల్ చింతనా
భోగాయత్త విపత్త చిత్తులగుచుఁ బూజింతురో వారిదౌ
యోగక్షేమము నే వహింతునను ధీరోదారు గంభీరునిఁ
శ్రీ గోపీజనచిత్తచోరుఁ గొలువం జేకూరవే కోరికల్. 171

శా. అల పాంచాలి మహా సభాంగణమునన్ హా కృష్ణ ! హే ద్వారకా
నిలయా ! యచ్యుత ! నే ననాథనుజుమీ ! నీ వి ట్లుపేక్షించినన్
దొలఁగు న్మానము రక్షసేయుమని చేతుల్ సాఁచి యాచింప వేల్
వలువల్ పంపిన చక్రి భక్తతతికిన్ వస్త్రమ్మొకం డీయఁడే ? 172

శా. సిరికిం జెప్పఁడు శంఖ చక్రయుగమున్ జేదోయి సంధింపఁడే
పరివారంబును జీరఁ డభ్రగపతిన్ బన్నింపఁ డాకర్ణికాం
తర ధమ్మిల్లము చక్కనొత్తఁడు గజ ప్రాణావనోత్సాహియౌ
కరుణాసింధువు, భక్తకోటి మొఱ లాకర్ణించి రాఁ డెట్లనన్. 173

శా. బావా! యంచుఁ గవీంద్రుఁ డిట్టులనె నీ భావమ్మనం దన్యథా
భావింపం దగ దొక్క సంశయ మిటఁ బాధించెడిన్ నన్ను. దా
నా వైకుంఠుఁడు శంఖ చక్రయుగళిన్ హస్తమ్ములం దాల్పకే
వేవేగన్ బఱతెంచెనం చనెద వెబ్బంగిన్ బొసంగున్ నుడుల్. 174

చ. మఱచితి మింటిలో నొకట మందుల సంచి నటంచు నాశ్వినుల్
త్వరగతి రిక్తహస్తములఁ దా మరుదెంచిరయేని వారలె
ట్లు రుజలఁ బాపువారొ యెదలోన విచారము సేయు మీవె శ్రీ
హరి కరి కేమి సేయుదు నటంచుఁ దలంచి యుఱేగుదెంచె తాన్. 175

ఉ. అక్కట! దారి నేగెడి తృషార్తుఁడు కూపము డాయబోయినన్
బొక్కెన త్రాడు కేలఁగొని పోవలయుం గదె రిక్తహస్తుఁడై
చుక్కలు జూడ లాభమటఁ జొప్పడునే యని విస్మితాస్యుఁడై
ముక్కున వ్రేలు పైచుకొనఁ బోతన యాతని గాంచి యిట్లనున్. 176

క. తన బిడ్డ నూతఁ బడెనని వినినంతనె బావి దరికి వెస నుఱికి యుర
మ్మును బాదుకొనుచు నేడ్చెడి జననికిఁ ద్రాళ్ళు గొనిచను విచార మొలయునే? 177

క, తల గొట్టుకొనుచు సుతకై పిలపించెడి తల్లిఁ గాంచి వృథయం డ్రితరుల్
తలపైఁ బడి వచ్చినచోఁ దెలియుం దమ కప్పుడు కడుపుతీపి యన నెదో. 178

ఉ. ఈగతి వార లిర్వురు సహేతుక వాద వినోద వైఖరిన్
ధీగరిమమ్ము మీఱ స్మితదీధితు లొప్పఁగ గోష్ఠపార్శ్వసీ
మాగత వేదికోల్లసిత మంజుకటస్థలి నుండ సన్నికృ
ష్టాగతుఁడైన దూత యొకఁ డంజలి సంఘటియించి యిట్లనెన్. 179

క. ఇదె కర్ణాటక భూపతి సదమలగతిఁ బోతనార్యు సన్నిధి కనిపెన్
విదితగతి లేఖ నొకఁడన నది గొనెఁ బోతనయు నెంతొ యాప్యాయముగన్. 180

మ. అతఁ డా లేఖను స్మేరకోరకితాలోలాలోక నేత్రాభి శో
భితుఁడై కాంచి పఠించి శ్యాలకుని కర్పించెన్ హసించెన్, గరాం
చిత పత్ర మ్మఖిలమ్మనుం జదివి తా శ్రీనాథుఁడున్ హర్షసం
గత రోమాంచశరీరుఁడై స్వస్పృహితాకాంక్షన్ వచించెన్ దమిన్. 181

మ. ఇది కర్ణాటక సార్వభౌముని సుధా హృత్పద్మ కోశమ్ములో
నదులై ప్రేమ మరంద బిందువులు విన్నాణంబుగా నాట్యసం
పదలన్ జిల్కిన మోత్రిత వ్రాఁతలగుచున్ బత్రీకృతిం దాల్చె నం
చెద భావింపుచు నీ క్షణ మ్మచటి కీ వేగం దగున్ భావుకా! 182

ఉ. నిక్కముగా నదృష్టమన నీ యదియే యని చెప్పవచ్చు నీ
వెక్కడఁ గోర నక్కడనె యెన్నియొ గ్రామము లగ్రహారముల్
జెక్కిన రాగిశాసనముజేసి యొసంగెదనంచు వ్రాసినాఁ
డక్కట ! లక్ష్మిరాఁ దడక నడ్డము బెట్టుకొనంగఁ జెల్లునే ? 183

ఉ. కోరకమున్నె నిన్ను సిరికూర్మి వరించినయంత సోదరా
కారత హాసచంద్రుఁడు మొగమ్మునఁ బుట్టెను మోదవార్ధి పొం
గారెను మిన్నుముట్టెను, రమాంగన సంగతి మోము దమ్మి వి
ప్పారెను సారసారిఁ గని యబ్జ మిటుల్ వికసించె నేమనన్. 184

సీ. ఈవు సంస్థాన కవీంద్రుండవై యుండఁ గాంచఁగా భాగ్యంబు గల్గుటెపుడొ !
ముంతపోఁతగ నీకు ముత్యాల రత్నాలఁ గనకాభిషేకముల్ గలుగుటెపుడొ !
నీ భాగవతకోశ నిర్జరాంగనను నేఁ గృతినంది యెపుడు ధన్యతను గనుదొ !
గండపెండెరము నీ కాల వెల్గఁగ భద్రగజముపై నూరేగఁ గాంచుటెపుడొ !

తే. అనుచు నువ్విళులూరు పేరాసతోడ వఱలుచున్నాఁడ నీ దయవచ్చుటెపుడొ !
పోతన కవీంద్ర ! కవి కులాంభోధి చంద్ర ! యనుచు లిఖియించె నింక నే మనఁగవలయు.

తే. పుడమితేఁ డిట్లు ప్రాధేయపడుచు నీకు వ్రాసికొనినాఁడు చనుటలో దోసమేమి ?
యెద్దు నాఁగేలిఁ గైఁబూని యెంతకాల ముర్వి నొక హాలికుఁడవయి యుందువనిన. 186

ఉ. బాలరసాలసాల నవపల్లవకోమల కావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుట కంటె సత్కవుల్
హాలికులైననేమి గహనాంతరసీమలఁ గందమూలకౌ
ద్దాలికులైననేమి నిజదార సుతోదర పోషణార్థమై. 187

క. అని యా పోతన రాట్సభలను మను కవి కష్టసుఖములను వాకొను, ని
న్ననుకొనకు బావ ! నీ మాటన వే తెల్లరకు జరుగ దట్లనుచు నొగిన్, 188

ఉ. నిక్కముగా వచింతు నవనీపతి మన్ననమాట గాంచఁగా
నక్కఱ పూర్తియౌ వఱకె యావల వారిని మందలించినన్
జుక్కల నాడు కన్నులిటు జూడను జూడరు వారి మానస
మ్మొక్కటు లుండ దా మరులు నొద్దికఁ బామును ముద్దుగొన్నటుల్. 189

శా. నా కీతం డనుకూలుఁడంచు ఖలు సన్మానించు తేఁ డట్టివాఁ
డాకాలంబున నా ప్రదేశమున దీపార్చిః క్రియన్వెల్గునై
జాకీర్ణ ప్రతిభా విభాసితుఁడు తానై వెల్గు మార్తాండు న
ట్లేకాలమ్మున కే ప్రదేశమున కెందీ విశ్వ విశ్వంభరన్. 190

క. ధన యౌవన ప్రభుతలు మద్య నిషేవణము లివి మూడు నైక్యముగా సే
వన మొనరుచు నృపునింకే మనవలెనో నీవ యెడద నరయుమి బావా! 191

క. ధనిమణియగు సుజ్ఞానత దనరినఁ దా వెల్గు నొరులఁ దా వెల్గించున్
ధనిఫణి యగు నజ్ఞానతఁ దనరినఁ దా వెఱచు నొరులఁ దా వెఱపించున్. 192

సీ. కాళ్ళు లేక చరింపఁ గల్గువాఁడన నెప్పు డాందోళికాగామి యగుచు నేగు,
ఘనతరా జీర్ణరోగగ్రస్తుఁ డగువేళ గాలిమేపరితనమ్మోలి వఱలు,
వినతిపత్రము గాంచి వినతు లాలించుటఁ జక్షుశ్రవత్వము సార్థపడును,
విత్తార్జనమునకై వేలబద్ధములాడ రెండు నాలుకలఁ జరించఁగలుగు,

తే. ఉరక కసుబుసులాడు మహోగ్రవదన వైఖరుల వక్రతమములౌ వర్తనముల
ఛత్రఫణదీప్త ధనిక రాజన్యఫణుల నీడ నుండ నెవ్వారికి కీడు దప్పు? 193

చ. మనుజన నన్ను మించి చను ముఖ్యుఁడవా యను, నొక్క యగ్గువె
క్క నిడిన నీవు వట్టి కొఱగాని జడుండవటంచుఁ దిట్టుఁ, బ్ర
క్క నడచినంత నా సమముగాఁ జననర్హుఁడవౌదు వేమనున్
గన నెటు వోయినన్ శ్రమయె క్ష్మాపుఁడు పల్లెరుగాయ చాడ్పునన్. 194

చ. స్తుతిని బొనర్పఁగా నితఁడు చూచుచునుండెను బొట్ట నింపఁగా
నతులిత భక్తి నంచుఁ బరిహాసమొనర్చును, మిన్నకున్న స
మ్మతిఁ బ్రకటింపఁ, డాశ్రితుఁడు క్ష్మాపతి సన్నిధిలోన నెప్పుడే
గతిఁ జనినన్ శ్రమంబె మఱకత్తెర సందిడు పోకకైవడిన్. 195

ఉ. ఎన్నఁడు జచ్చినావనిన నేడు యుగమ్ముల క్రింద నన్నయ
ట్లున్ననె కాని, వారి కడ నొక్కెడనుం దల యెత్తి కాంచఁగాఁ
గన్నులఁ దాండవించుచును గన్పడవే ప్రళయార్కబింబ మిం
కన్నము నీళ్ళు నడ్గుటయె యాలును బిడ్డను గండ్లఁ జూచుటే. 196

ఉ. పెఱలకు నొంటి మన్నయినఁ బెట్టని వట్టి పిశాచిరాజులం
దఱిఁగని దానకర్ణ బలి దాతల పైఁడి మెఱుంగు రుద్ది నో
రఱుగ నుతించి భూపతి కృతాఘము మ్రింగుచుఁ బొట్ట నించుటే?
హరి హరి! వారి మోముగను నంతటి పాపమె లేదటంచనన్. 197

క. ఇది విని శ్రీనాథుఁడు తా నెద నేమనుకొనెనొ గాని యేమి యనక తా
వదలి చనె నా స్థలమ్మును బదపడి త్వరితగతి నేదొ బని యున్నట్టుల్. 198

క. ధీనిధి పోతన యయ్యెడఁ జేనుం జెల్కలను గాంచి శ్రీనాథునితో
వే నిలయము జనుదెంచన్ దా నా గృహిణియును బోతనకు భ్రాతకునున్. 199

క. పాదక్షాళనమున కుష్ణోదక మిడి ప్రేమదీపి తోత్సాహగతిన్
మోదమతి బానసమ్మున మోదక భక్ష్యోపహారముల నిడి కుడుపన్. 200

తే. అంత లక్ష్మి శారదఁ గని యనియె వదినె! నన్ను గూడి యాడక యెన్నినాళులయ్యె
నాడుదమె చెమ్మచెక్క నా నయ్యువిదయు బొత్తిగా సమ్మతింపకపోయె వ్రీడ. 201

క. నివ్వాళు లిడఁగ లజ్జకు నవ్వనిత విలోల మోహనాక్షులు, మేనన్
జవ్వనము నిండుకొన నెచఁ బువ్విల్తుని కేదొ కొఱఁత పూర్ణంబయ్యెన్. 202

సీ. లోలదృక్కులకుఁ బాతాలిడ్డ యొజ్జల నచ్చనగిల్లల నాడవెఱచు
నడుమునఁ గ్రొమ్మించు నాట్యముల్ గఱపిన చెమచెక్కలాడఁగా సిగ్గుపడును,
అలరించి మొలకనవ్వుల నేర్పు గురుపీఠమగు బొమ్మపెండ్లి సేయంగనోడు,
అడుగుఁ దమ్ములకు రాయంచ నెన్నడ నేర్పు గుజగుజ తేకాడఁ గొంకుచుండు,

తే. చిన్నతనమల్ల జాఱుటన్ సిగ్గు మీఱెఁ బరికిణీ చీరగా మాఱి పయఁటఁ గోరె,
ఆడమగ భేద మేర్పడె నంతకంత కేమొ తెలిసినట్టులు భావ మేర్పడియెను. 203

క. విచ్చలవిడి పల్కదు పలు విచ్చి నగదు పూర్వమటులు వెలఁది మగని మేల్
ముచ్చట దీసినఁ గనులం దచ్చుపడన్ లజ్జ నిలువ దచ్చట క్షణమున్. 204

తే. పెండ్లిముచ్చట లత్యంత ప్రేమతోడ వినును దన వంక నెవ్వరున్ గనకయున్న,
కనిసఁ దన వైపు దానిని గప్పిపుచ్చ నన్యవిషయ సమ్మగ్నయైనటు నటించు. 205

చ. ఎడనెడ బంతిపూఁ బసిఁడి యీఁతల నీనెడి వంగతోఁటలో
మడవలు మార్చి నీరిడెడి మల్లన నల్లనఁ దొంటిరీతి వా
విడిచి తలెత్తి బావ! యని వేమరు బిల్వదు పూలఁగోరఁగా
బిడియపడున్ మగండనుచుఁ బేరిడినంత నదేమి చోద్యమో! 206

ఆ. పూలతోఁట కేగఁ బుట్టెఁడు ప్రేమమ్ము గలదు గాని చనదు పొలఁతి తాను,
లక్ష్మి నెట్లొ జేసి లాలించి మీ యన్న నడిగి పూలు దెమ్మటంచుఁ బనుచు. 207

ఆ. ఒంటి నేగి బావ కంటంబడిన నేమి యగునొ యనెడి సంశయమ్మొ లేక
యెవ్వరేనిఁ గనిన నేమనుకొందురో యనెడి భయమొ యామె నరుగనీదు. 208

తే. చివురు సౌరుల సొంపారు చింత నీడఁ గనకగిరికాంతు లెగఁజిమ్ము ఘాసరాశి,
వెండి బెత్తాలగమి నేలు నెండు చొప్పగడ్డి కెగఁబడి మేయు లేఁగలు జెలంగ. 209

తే. ఇంతు లిరువురు గూడి తా మెలమిఁ బెరటిబావి కడ నాటిపెట్టిన బంతిచెట్లఁ
బోఁకబంతుల రుద్రాక్షపూలచెట్ల రంగురంగుల ముద్దగోరంటచెట్ల. 210

తే. అలరి యలికిపూసిన చిన్ని తులసిగద్దె పందిరికిఁ జుట్టురా ముద్దబంతిపూల
దండ తోరణల్గట్టి సుందరతఁ దనరఁ బసుపు కుంకుమలన్ రంగవల్లి దీర్చి. 211

వ. ఒండొరు లిట్లనుకొనిరి, 212

తే. పొట్ల కన్నె సమర్తాడెఁ గట్ల నవ్వెఁ బచ్చపందిటం బిచ్చుకల్ ముచ్చటాడెఁ
జెలువ మొలయ సీతాకోకచిలుక పిండు మనము లుప్పొంగఁ బేరంటమునకు వచ్చె. 213

తే. పసిఁడిగిన్నెలఁ బారాణి పసుపుఁదెచ్చె రాచగుమ్మడి పూబాల, రవలజోతి
హారతు లొసంగెఁ గునుకు పూసారసాక్షి, కట్లపూలేమ కుంకుమబొట్లు దిద్దె. 214

తే. అలరు చిక్కఁడుతీవ నీలాంబరాలఁ జుక్కఁ లుదయించెఁ జలిగాలి చక్కఁవీచెఁ
బందిళులు మేడపైఁ బూలపాన్పు వేసె నాచరించె గర్భాధాన మలికులపతి. 215

తే. వన్నెబీర బిడ్డలనెత్తి చన్ను గుడిపెఁదమినిఁ బయఁటాకు కొంగులో దాఁచుకొనుచు
గర్భభారాల సొంగసంగతులఁ దనరి నెలలు నిండిన గుమ్మడి నేలవ్రాలె. 216

ఉ. గుమ్మడి పూఁబడంతి పదకూర్మములం బసుపంటఁ గట్లపూఁ
గొమ్మలు పుప్పొడిన్ స్వగృహకుంజములన్ గనపచ్చువారి ఫా
లమ్ములఁ గుంకుమ మ్మిడఁగ లక్ష్మియు శారద పేరటాండ్ర వే
సమ్ములఁ బూలుగోసికొని సల్పిరొగిన్ తులసమ్మపూజలన్. 217

క. పట్టుంగుచ్చులఁ గన్నులు గుట్టనెసఁగు సీతజడలఁగొని వదినె తలం
బెట్టెను లక్ష్మియు వదినే ! కొట్టన్వచ్చు జడయనుచుఁ గొంచెము నగుచున్. 218

తే. పూలమోకలంగని యెంతొ జాలినొంది నీరు దోడెదన్ బాదుల నీవు దడుప
వా ! యనుచు శారదయొ తాను బావిలోనఁ జేఁదవైచె నుత్సాహము చెంగలింప. 219

ఉ. నీరునుజేఁది గోలెమును నింపఁదొడంగెను శారదాంబ బం
గారమువోలెఁ బెంచుకొనఁగావలెఁ జెట్ల నటంచు, లక్ష్మియున్
బేరును బేరునున్ వరుసబెట్టి జలమ్ములఁ బోయసాగె సిం
గారపుఁ గన్నులం దనను గన్గొను లేఁగకు మొల్లతీఁగకున్. 220

క. నోళుల విచ్చెడి పక్షులపోలిక నొక్కొక్క మొగ్గ పలువిప్పెను బూ
బాలల పరిశాంతగతులన్ లాలించుచు దోలనూఁపె లతికాంగనయున్ 221

సీ. కంకణ కింకిణీ క్వాణఝణం కృతుల్ గిరకగానములకు స్వరములల్ల
మంజుల మంజీర శింజానినాదముల్ జలఘటమ్ములఁ దాఁకి జగడమాడ,
కాంచీగుణాంచిత సంచలత్తను మధ్య మసియాడు చేఁదాడు ననుకరింప,
సరసదుత్తుంగకు చాం నోత్తరీయంబు సరివదంబు పాతచిత్రము రచింప,

తే. భ్రష్టఘర్మంబు మౌక్తికవృష్టి గురియఁ గ్రాలు బుసలమైఁదీవియ సోలియాడ
కరయుగము జంటనాగులై సరసమాడ జలముఁజేఁదె నుల్లాసాతిశయము మెఱయ. 222

వ. అంత లక్ష్మిశారదంగని, 223

క. నూఱంకెలెంచులోననె నీరును జేఁదవలె బిందె నింపనువలె నీ
నేరుపుఁ జూచెదననియెన్ శారద సరెయనుచు నూతజార్చెన్ జేఁదన్. 224

క. మదవతి నెమ్మెఁదీవియ సదమదమై సాఁగితూఁగ జలములఁ ద్రాడున్
వదలుట లాగుట బిందియ నుదకము వంచుటలు తెలియకుండఁగ జేఁదున్. 225

తే, వడివడిగఁ జేఁదు నాపెకేల్బలము నొకట తట్టుకొనలేక యా ప్రాఁతత్రాడు తెగెను
బొక్కెనయొ నూతఁబడె నపుడొక్కమాఱె చప్పుడయ్యె గుభిల్లని జలములందు. 226

క, చేతఁగల నిండు బొక్కెన నూతం దెగిపడిన యంతనో వెన్కకె య
ట్లా తెఱవపడియె, లక్ష్మియు భీతి వదినె మడిసెనంచు బిట్టుగ నార్చెన్. 227

క. ధ్వని యీ గతి చెవిఁబడుటయుఁ దినువారలు తినెడి యట్లదే పరువు వెలిన్
మును వెనుక లరయకుండన్ జనుదెంచిరి పోతనాది సకల జనమ్ముల్. 228

క. తొలుతన్ శ్రీనాథుఁడు విహ్వల చిత్తుండగుచు లక్ష్మి నడిగెను దల్లీ!
జలముల దిబ్బని శబ్దమ్మొలసెను శారదయె కూలె నొకొ నూతయనన్. 229

తే. అంత లక్ష్మి తా నార్తిమై నతనిఁగాంచి తత్తఱంబల్కెఁ జేఁద నూతఁబడి వదినె
బావివైపు మ్రొగ్గియు వెన్కఁబదము జాఱి మించిపడెను లేచినవేళ మంచిదనుచు. 230

క. అన విని పోతనఁ గన్గొని యనె శ్రీనాథుండు నీవ యరయుము బావా!
వినఁగనె తినువాఁడను చేతిని గడుగుకొనకయె వచ్చితినిగాదె వెసన్. 231

వ. అని శారద నారసి దరిదీసి వెఱచుకొనవుగదె యనుచు వీఁపు నిమిరి నా భాగ్యంబు మంచిదయ్యె గండము గడచిపోయె నెందులకీ చందంబునఁ దొందరపడెద వాపదలు చెప్పివచ్చునే కనుగలిగి మెలఁగవలెననఁ బోతనార్యుం డిట్లనియె. 232

క. తన బిడ్డ నూతఁబడెనని వినుతోడనె బావిదరికి వెసనుఱికియు రొ
మ్మును బాఁదుకొనుచు నేడ్చెడి జననికిఁ ద్రాళ్ళుగొని చను విచారమొలయునే? 233

క, తలఁ గొట్టుకొనుచు సుతకై విలపించెడి తల్లిఁగాంచి వృథయండ్రి తరుల్
తలపైఁ బడి వచ్చినచోఁ దెలియున్ దమ కపుడు కడుపు తీపియననెదో. 234

క. అని పోతనమును దాసిరికిని జెప్పఁడు చక్రిమేనిఁగేలఁ గొనం దే
గెను భక్తుని మనుపఁగ హరి యను పద్యముఁ జదివి నిజమె యనిపించెఁ గవిన్. 235

క. ఆ నాఁడట నిదురించి నిదానమ్ముగ వేగినంతఁ దాఁ బోతనతో
శ్రీనాథుండును దిప్పనఁ గానంగా నేగె నోరుగంటికిఁ బ్రేమన్. 236

ఆ. అరిగి నగరుగాంచి యందందు విఱిగిన శిల్పఖండములను జేరఁబోయి
కాకతీయ వంశ ఘనతఁ దలంచుచుఁ గంట నీరువెట్టెఁ గవియుగళము. 237

తే. కూలిచను కోటతో గుండె కూలిపోవఁ జెదరు శిల్పముంగని ధృతి చెదరిపోవఁ
జూడలేమని కనుపాప లోడిపోయి తిరుగు కన్నీటిసుడుల రూపఱిమునుంగ. 238

వ. అంత శ్రీనాథుండు పోతనంగని శిల్పసౌందర్యముం జూపుచు నిట్లనియె. 239

ఉ. నీలపురాలదంతములు నీడలు గన్పడమల్చు శిల్పఖం
డాలఁ జలత్కలాధునుల నర్తిలు ప్రేక్షక నేత్రపద్మముల్
వాలెముగాంచియో వడియవైచిన తుమ్మెద వర్ణముల్ కళా
శాలల గట్టుకొన్నవిటు చైత్యవిరాజిత దేవమూర్తులై. 240

ఉ. క్రాఁగిన సాఁగగా నినుముగాదిది గట్టిగఁ గొట్టఁ జిట్లు పెన్
మూఁగ శిలల్ పఠించెనిటు మోహనశిల్ప వినోదగీత మీ
తీఁగలు పూవు లాతఁడిటుఁ దీర్చెడిచో నివి మాఱనేమొకో
మాఁగినకఱ్ఱ కోఁతగను, మైనపుఁ బోఁతగ నీలిపూఁతగన్. 241

చ. కలకలలాడు లేనగు మొగమ్ముల జీవము లొల్క నృత్యముల్
సలిపెడి శిల్పకామినులు జాఱెడి చీరలఁ గోర్కులూర న
వ్వులునగు చెంతకాల మిటు లుందురయారె ! యిదెంత వింతయే
చిలిపిగుణాల శిల్పితమిచే గిలిగింతలవెట్టె వీరల౯. 242

సీ. శిల్ప లోకాశ్రితుల్ జీవకళాస్ఫూర్తి సతతముండెద రిట మృతియె లేదా ।
లలితయోషావయోలావణ్య మించుక జాఱవో దియ్యెడ జరయలేదా ।
గజసింహ సంహతుల్ గలిసియుండిన విందు జాతివైరమ్ముల జాడలేదా ।
తరులతా ప్రసవసంతతి నైగనిగ్యమ్ము తఱుఁగ దీ జగతిలోఁ గఱవె లేదా ।

తే. శిల్పి యులిదెబ్బతోడ శాసింపఁబడిన యీ మహీతల స్వర్గ మహీనకళల
జన్మ మృత్యుజరామయ క్షామములను బ్రహ్మ సృష్టిలోఁ గల్గు లోపములఁ దీర్చె. 243

సీ. ఆంధ్రోన్నతి న్నిల్వుటద్దము లిడి చూపుమోము గన్పడవెల్గు ముద్దుశిలలు,
దివిముట్టె నీ కాకతీయ సత్కీర్తినాఁ దనరు నింద్ర సభార్తతాండవములు,
తలఁదాల్పఁ దగిన దాంధ్రిల శిల్పమనిరాల వలచి వచ్చిన పూలు దెలుపు నొకట,
కాకతిసామ్రాజ్య కాంత కొడ్డాణము గూర్చెడి నోర్గల్లు కోటగోడ

తే. రాలు స్త్రీలయి పూలయి రమ్య కావ్యరసము లొల్కించు మధురాక్షరాలు గాఁగ
హరిహరాదులు నిశ్చేష్టులగుచు శిల్పి శిల్పపు న్వలలోపలఁ జిక్కువడిరొ । 244

క. అనుటయుఁ బోతన శ్రీనాథునితోనను బావ ! యల్లదో కనుగొను మీ
కునెదుట నీలాచల మన ననుపొంద శయించిమించు నందీశ్వరునిన్. 245

తే. కదలెడిని మూఁపురంబదో గంగడోలు వ్రేలు నటుదోఁచుఁ జెవులూఁగు విధమగపడు,
పంచ కరిగినఁ గొమ్మ్మ నాడించదుగద ! ప్రాణమున్న యాఁబోతిది ప్రతిమగాదు. 246

ఉ. ఎందును గాంచనందె కనునేమి చివాలున లేచిరాదుగా
యందెలు గజ్జియల్ గొలుసు లా మెడగంటలు మాఱుమ్రోఁగఁగా
నందముగాఁ బరుండి నెమరానుచు జీవము గ్రుక్కుచున్నదీ
నందిని గాంచి మర్లుగొని నాకెడిరా యెదమైన ధేనువుల్. 247

ఉ. నీఱలు మేఁత ముట్టకయు నిద్దురవోకయు నేలఁబట్టె ని
ట్లేల తెనుంగునేల వృషభేశుఁడు, బాపురె! యాంధ్ర రాజ్యపుం
బాలన మస్తమించె నిఁకఁ బాలిడు నాలను జీల్చి మెక్కెడు
షాకలము దాపురించెనని స్వాత్మఁ దలంచుచు బండబాఱెనా? 248

ఉ. ఖండిత పాదపక్షముల, ఖండిత చంచుపుటాంగకాళి హం
సాండజముల్. దివమ్మెగసియాడవొ కాక స్వహంతృదౌష్ట్యముల్
పండిత శిల్పిమేల్ ప్రతిభఁ బంచఁగ నాఁగెనొ యాంధ్ర హంసముల్
బండలునై పయోజలవిభాగ మొనర్పఁగ నేర్చె నిద్దిరా! 249

తే. పొలపుఁగట్టె తా గొడ్డలి పొట్టఁజొచ్చి కులపుఁగట్టెల నన్నింటి గూల్చినట్లు
హైందవుండె తౌరుక్యునియండఁజేరి జాతి విద్రోహచర్యలు సల్పెనిటులు. 250

తే. నాఁటి రామపాద రజఃకణంపు శక్తి దాఁగెనేమొ యీ శిల్పిహస్తాల, నిందు
బండలై బెండులుగ మల్చఁబడుచుపడుచు లచ్చరల మచ్చులగుచు నాట్యం బొనర్త్రి 251

తే. ధరణిపై మానవుఁడు జీవితంబునెల్లఁ బేరు బెద్దఱికమునకే ధారవోయు
సృష్టికిం బ్రతిసృష్టిని జేయు శిల్పి యూరుపేరు జెప్పుకొనంగ నోరులేదు. 252

వ. అనుచు శిల్పిని సంబోధించి. 253

ఉ. గండశిలల్ త్రిమూర్తులయి కాంలఁగ శిల్ప వినోద వేదముల్
బండలఁ దొల్చి పారమిడు బ్రహ్మకు నీకు జగత్తులో గుడీ
గుండములేని దీనదశ గూరెనె? యూరును బేరు నానవాల్
రెండును జెక్కనక్షరములే కఱవా బరువా? కళానిధీ! 254

తే. తావకీన నిర్మిత శిల్ప ధాత్రిలోన నల పిపీలిక మొదలు బ్రహ్మాదులకును
దావొసంగిన నీ యశస్తరుణి యందు నిల్చుటకె యొక్క చేరెఁడు నేల కఱవె? 255

ఉ. కొండలఁ దవ్వుకొంచు నిను గోరుచువచ్చెనొ శిల్పకాంత తా
నిండిన పేర్మి నామెఁగన నీ విటు కొండలఁ దవ్విపోతువో
రెండిటిలోని మర్మము నెఱింగిన దొడ్డ రహస్యవేత్త లీ
బండల గుండియల్ గరఁగు భాషణల న్నటియించు నీ యులుల్. 256

మ. తులువల్ కన్నుల నిప్పులద్దికొని తుత్తున్కల్ బడన్మొత్తినన్
దలలం గొట్టినఁ దోఁక లూడ్చినను నిద్ధాత్రిన్ దగన్ బూడ్చనే

నలిదెబ్బల్ దిని బిట్టుగట్టిపడి నీ యూహాప్రపంచమ్ము తా
నిలిచెన్ బో యెదురీఁది కాలజలధిన్ నిర్నిద్ర భద్రాకృతిన్. 257

తే. వెతకి చిరజీవియైన పర్వతవరునకుఁ దమిని రసగంగతోడి పాదాలు గడిగి
ధారవోసితి శిల్ప సుతామతల్లి నమరలోక మ్మిచట బొమ్మలగుచుఁ గాంచ. 258

తే. కాలగర్భమ్ము లోపలఁ గలిసి చనిన చరితములకు జీవమువోయు సత్కవియును
సాధుశిల్పియుఁ గాన నా సత్కృతులను తల ధరింతురు పూజింతురు ధరణి జనులు; 259

క. మనమున సంతోషాంబుధు లనుపమగతిఁ బొంగఁ బోతనార్యుఁ డిటాడన్
విని శ్రీనాథ సుకవి యాతనిఁ గని యిట్లనియెఁ జతురతర భాషణలన్. 260

మ. ఇల భూపాలురె కాదె సత్కవుల నిట్లేపారఁ బోషింతు రం
దులకై వారిని సంస్తుతించుట లెటుల్ దోసంబు లౌనన్న వా
రల శైల స్థిరకీర్తికాయముల సంరంక్షింప మోదింప నీ
కళలే హేతువు లౌటఁగాదె యిటు రక్షంజేతు రుర్వీపతుల్. 261

చ. వనతరు లట్లు సత్కవులు వర్ధిలఁగావలెఁగాని రాజపో
షణమను కృత్రిమాదృతికి సొంతము స్వేచ్ఛను విక్రయించి వా
రనునటులాడి యా పవని యందలి తొట్ల నెసంగు చెట్లనం
దనరి జలమ్ము వోయని దినాలఁ గృశించి నశింపఁ జెల్లునే? 262

చ. కవికి మహీధవుండు ఘన కర్బురరాంకవ రత్నరాసులన్
మివుల నొసంగు రాజున కమేయ ధనావళి రత్నగర్భతా
నవిరత మిచ్చునట్టియెడ నవ్వసుధం దగఁగొల్చు టొప్పదే
స్తవగతి రాజులం గొలిచి దైన్యమహోదధి మ్రగ్గ నేటికిన్? 263

చ. స్వవశ సువృత్తి సేద్యమును సల్పుచు మేదిని గొల్చుటొప్పు భూ
ధవులను గొల్చుటెంతొ సుఖద మ్మయినన్ బరదాస్యబద్ధ పా
శవికని హీనవృత్తియగు స్వాతిశయమ్మును జంపు నద్ది స
త్కవులు నిరంకుశుల్ కళల దాస్య సుఖమ్ముల కమ్మఁజూతురే? 264

తే. రాజు హృదయమ్మునం దనురాగ మెదుగఁ బెంపు సేయుఁ గోపించినఁ జంపివేయు
నివ్వసుంధర పెంచుట లెఱుఁగుఁగాని చంపు టెఱుఁగదు తను గొల్చు సాధుజనుల. 265

క. అని యిరువు రిటులు శిల్పమ్మును గని వినుతిం బొనర్చి మురిపెముతోఁ ది
ప్పన వసతికిఁ జని యతనిం గని జోతలొనర్చి కుశలగతు లారయుటల్. 266

క. ఆతఁడు వెస నెదురుగఁ జని చేతులు జోడించి యురముఁ జేర్చి మహా సం
ప్రీతిని శ్రీనాథుని గని చేతమ్మానందపూర్ణ సింధువు లీఁదన్. 267

క. ఎన్నాళుల కెన్నాళులకి న్నిలయపుఁ దోవ్రి దొరకె నేమందును నా
పున్నెమ్ముల కలిమిని మిముఁ గన్నులఁ గాంచంగ నోచఁ గలిగితి ననుచున్. 268

క. లో నరిగి యర్ఘ్యపాద్యసు పానీయోదకముఁ గొనుచుఁ బరతెంచె నొగిన్
శ్రీనాథుం డదిగని బావా! నీ కీ శ్రమయె యనుచు భక్త్యనురక్తిన్. 269

ఆ. తిప్పనార్యుఁ డెలమిఁదెచ్చు నీటింగొని కాలు సేతు నొకటఁ గడిగికొనుచు
నాచమనమొనర్చి యరుఁగుపైఁ బఱచిన కొప్రిందివాసి లోనఁ గూరుచుండె. 270

క. కలయక కలయక కలసిన కలయికతో నతి ప్రమోదకరహాసఝురిన్
గలహంసలు చెలరేఁగి సకలలోకము మఱచి తమిని గలహించె లలిన్. 271

తే. అచటినుండి పోతనలోని కరిగి యల్ల తల్లివలెఁజూచు వదినెతోఁ దనయు లగ్న
విషయమెల్ల వాకొని దాన వివిధములగు మున్నుబఱతెంచు సిలుగుల ముచ్చటించె. 272

క. ఆ మాటలు నీ మాటలు మా మీ కుశలమ్ములాది మాటాడుచునుౝ
సామీప్యములోనే గల శ్రీమల్లన పెండ్లిగూర్చి చెప్పె సకలముౝ, 273

ఉ. ఆ యదనుం గనుంగొని మహాకవి తిప్పనతో నిటాడె మీ
రే యెఱిఁగింపుఁ డిప్పుడొనరించుట లేవియొ, పెండ్లి కార్యముౝ
జేయుటలెట్లొ, నా కిపుడు చేతను లేదొక గవ్వయంచు వా
పోయెను మీదు సోదరుఁడు పోలునె మేనరికమ్ము వీడుటల్. 274

తే. నీదువాంఛ యనుజునితో నెఱపఁజేతుననుచు మీరలు నేఁడు నా కభయమిడిన
నమృత మస్తనియందు మీ యాలయమున నటులఁగామి నీరానక యరుగువాఁడ. 275

క. అని డగ్గుత్తిక గదురం గనులన్ నీర్నిండఁ బ్రిణతిగావించుచు నా
యనుఁగుం బిడ్డకు నియ్యెడ జనకులు మీ రేను మనియుఁ జనియు నొకటియే. 276

వ. అనుటయు మీ యాజ్ఞ తలధరింతు నాజ్ఞయిండని తిప్పనవల్కౕ శ్రీనాథుడిట్లను,

గీ. సింగభూపాలుఁడే కృతినిం గొనంగఁదలఁచి ననుఁ బంపెనన వాని తలనుదన్ను
విజయనగరసామ్రాజ్య భూవిభుఁడుకాంక్ష నడిగె కృతి మన భాగ్య మేమనగలనిఁక. 277

మ. అల కర్ణాటక రాజశేఖరుడు తానై పంపె నీ బ్రాహ్మణుౝ
విలిఖించెన్ దగఁ బత్రికన్ గృతికినై వేడ్కోలు గావించె నం
దులకై నీ యనుజుండె యీయకొనఁడెంతో చెప్పితిన్ నేను ముం
గల యీ కార్యభరమ్ము మీదె యనుచుౝ గాఢమ్ముగా నమ్మితిన్. 278

చ. అతనికెకాదు నాకును మహాశయ! మీరలె యన్నలంచు న
మ్మితి నెదలోన, నేఁబలుకు మెత్తనిమాటల గోటమీటె భూ
పతి వగు మన్ననల్ గలసివచ్చునె కోరినయంత, యుష్మదా
నతి శిరసావహించునని నమ్మి యిటుల్ గొనివచ్చితిన్ జుడీ! 279

శా. శ్రీనాథుం డిటువల్కు భాషణములన్ స్వీయాంతరంగమ్ము సుం
తైనన్ నిల్వఁగ నోపమిన్ గరఁగి నీరై పోవఁ గన్దోయివలం
దానా తిప్పన తత్కవీంద్రుఁ గని ప్రోద్యద్భక్తి భావమ్మునన్
నే నీ కార్యము నెగ్గఁజేతు ననుజు న్నెర్పొంద విన్పించెదన్. 280

ఆ. నాదు మాటపైన నమ్మకం బెలయుచో ఖేదపడకుఁడంచు కేలుబట్టి
స్నానమునకు లేపి షడ్రసమృష్టాన్న కలితుఁజేసి సెజ్జ నొలయఁజేసె. 281

క. ప్రస్థానపు టలసట సనస్వస్థాత్మం డగుచుఁ జారుశయ్యోపరి భూ
పాస్థానకవియు నిద్రావస్థంగనెఁ దిప్పన యిటువల్కె ననుజుతో. 282

ఉ. ఎన్న వయస్సులోన నొక యించుక చిన్నవెయయ్యు జ్ఞానమం
దన్నల కన్నవీవనుచు నాత్మ నెఱుంగుదు నొక్కనాఁడు నే
నన్నది కాదటంచు నెదురాడవు గీచిన గీటు దాఁటఁబో
వన్న ! సతంబు నాయెడల నట్టులె యుందువటంచు నెంచెదన్. 283.

చ. వరమతి ! నిన్నుగాంచి బుధవర్గము సన్నుతిసేయ నాత్మలో
మురియుదు మాదు వంగడము మొత్తము ధన్యతగాంచె నిన్నుబోల్
చిఱుతనుగాంచి పెంచి చిరజీవిగవెల్గి యశమ్ముఁగాంచు మే
కరణిని నాదుపల్కు వృథగాదని యెంచి వచింతునియ్యెడన్, 284

తే. ఒడళులే వేఱు మానసమ్మొకటె యనఁగ రామ సౌమిత్రు లెంతయుఁ బ్రేమమనిరి:
రామ పదభక్తుఁ డెప్పు డగ్రజుని మాట దాఁటువాఁడుగాఁడనుట తథ్యమ్ముగాదె. 285

ఉ. నీరము కొంచెమున్న ధరణింబురదం బొనరించి యంటగాఁ
జేరు విశుద్ధు మైలవడఁజేయును వెల్లువగా స్రవించు వాః
పూరములెల్ల మైలలను బోనడచున్ గన నల్ప విద్యతో
పూరుషుఁ డాశ్రితుంజెఱచుఁ బూర్ణకళానిధి మన్చు నెల్లరన్. 286

ఆ. శుద్ధబుద్ధి గల్గు సుమతి విజ్ఞానము లల్పమయ్యుఁ బ్రజకు హాని నిడవు
పూతసైకతములఁ బొల్పారు చెలమ నీరల్పమయ్యుఁ ద్రాగ ననువుపడును. 287

తే. పూర్ణవిద్వాంసుఁడవు శుద్ధబుద్ధి నొప్పు నింగితజ్ఞుఁడవగు నీకు నేను జెప్పఁ
దగిన దేమియులేదు విద్యానిధియయి పూజ్యుఁడగు భావుకుని వాంఛ పూర్తియగుత. 288

తే. రామున కొసంగు కృతిని భూరమణునకిడ సురల కిడనెంచు హవినెందు శునకమునకు
నొసఁగుట లటంచుఁ దెలియుదు విసపువేళ వచ్చిపడె నేమి చేయంగవలయు ననఘ ! 289

తే. బ్రహ్మ మా రాఘవుఁడు కవిబ్రహ్మ యితఁడొ యెఱుఁగకయె మాటయిచ్చితి నితనికేను
నా యొసఁగుమాట పూర్తి నొనర్చువాఁడ వీవెయని నమ్మినాఁడ నీ యిష్టమింక. 290

తే. ఇదియె భగవదభీష్టమో యేమొ లేమినిట్టి క్లిష్టపరిస్థితు లేలవచ్చు
స్వప్రయత్నమ్ముల కతీతసమయమందు వాని యిచ్చయే యనుకొనవలెను గాదె. 291

ఆ. ఘనుల జీవనములు కష్టమయమ్మౌట వారి శీలములకు వన్నెయిడును
జాతి మణులకెల్ల సానల యొరపిడుల్ నృపుల శిరముకెక్కు నెపముతోనె 292

తే. కావునన్ నీవు చింతింపఁగావలవదు మాన్యుఁడగు రాముఁడుండ సమర్థుఁ డతఁడు.
ఏది యెట్లుగావలయునో యెఱుఁగు భక్త రక్షకుఁ డనారతము సత్యపక్షపాతి. 293

చ. అనుటయు నన్నమాట కెదురాడఁగ నోడుచుఁ బోతరాజు తా
ననుపమభక్తి స్వీయరచితామల భాగవత ప్రబంధముఁ
దన శిరమందుఁదాల్చె మును దారినిబట్టఁగ, ఛాత్రు లెల్లరుఁ
ఘనతర దివ్యదీధితులఁ గ్రాలు కళానిధి నంటు తారలై. 294

క. వెనువెంట బయలుచేరన్ గనుగొనలఁ నీరు నిండఁ గరుణాసింధో !
యినకులతిలకా ! యజ్ఞుఁడఁ గనుపాపన్ రెప్పవోలెఁ గావుమటన్నఁ. 295

శా. శ్రీనాథుండును పోతనార్యు గనుచున్ స్మేరాననుండై కవీం
ద్రానీయాత్మజు పెండ్లి కార్యమది రెన్నాళ్లిం కశేషించె
కల్యాణానంతర మేగవచ్చునని, సాలంకార కన్యా ప్రదానా
నుష్ఠాన విధింబొనర్చె సుముహూర్తావాప్తి యేపారుటల్. 296

వ. అనంతరంబ, 297

శా. తానా పోతన సాగిపోవుటకు ముఁ దాదాత్మ్యయోగస్థితిన్
ధ్యానించెఁ హరి నన్న పాదములచెంతఁ శీర్షముఁ వంచి మే
లౌ నీ యిష్టము పూర్తియౌననుచు దివ్యాశీస్సులం గాంచెఁ దా
శ్రీనాథుం డెదవొంగ నా జతనముల్ సిద్ధించెనంచున్ దమిఁ. 298

వ. అంత శ్రీనాథుండు పోతనం గని, 299

క. నీ యనుమతి నృపుఁ డెఱిఁగినఁ బాయక వాహనములంపు బ్రాహ్మణు నట కి
ప్డేయనుపు మనియెఁ గవిరాజీ యధమున కెవియు నేల యేగుదు ననియెఁ. 300

ఉ. నీటగు దర్శన మ్మొసఁగి నిర్మల భాగవతానువాదముఁ
దేట తెనుంగు సేసి సుకృతీ ! కృతి నాకు నొసంగుమన్న నీ
మాటనుదాఁటి నే నరకమార్గముఁ బట్టితి నిప్పుడెంతయున్
దాఁటఁగరాని దగ్రిజుఁడు తానిడు నానతియంచు రాఘవా ! 301

ఆ నీకు కృతి నొసంగు నిస్తులభాగ్యమ్ము దురితమతికి నాకు దొరకునెట్లు ?
ఆకుపసరు లాను నధమ కీటమునకు సుమమరందపాన సుఖ మొదవునె ? 302

ఉ. ఏగుట కెంతమాత్రి మెద నిచ్చయె లేదదియేమొ పాదముల్
సాగుచునుండె వెన్కవరొ సత్వరమేగు మటంచు నెట్టుచుజ
వేగిరపెట్టుచుండిరన, విచ్చని మొగ్గను దుంచి తేనియల్
త్రాగుటకే శిలీముఖము దర్పమెలర్పఁగ సాహసించెడిన్. 303

చ. సుకవివతంస! యాంధ్రికృతి సుందరి నిమ్మనె రాముఁ డేనునుజ
ద్రికరణశుద్ధిగా నొసఁగితిఁ హరి కీ కృతి నేలవచ్చె దా
నికిఁ బ్రతిబంధక మ్మిపుడ నే గురు సన్నిధియైన మెట్టు నా
మకకుధరమ్ముఁజేరి తగుమార్గము వేడెదనంచు నెంచుచున్. 304

తే. నిరత హరినామ చింతనాపరవశుఁడును న్యస్తభరుఁడగు పోతన నగరి వీడి
ఛాత్రులం గూడి యటకు యోజనములఁగల మెట్టు రామప్పవెలసిన గట్టు నరసి. 305

శా. వీఁకన్ డాసెఁ బతత్ ప్లవంగకరగుర్వీ కంపితక్ష్మారుహా
నీకాపాతిత పత్రపుష్ప ఫలదన్ నీలాంబర చ్ఛత్రిదం
డా కారోత్కట తుంగ శృంగతట దీవ్యత్ క్షౌద్ర కోశస్రవ
న్నాకాస్తోక సుధారుచిన్ శుభకరిన్ నారాయణాం చద్గిరిన్. 306

సీ. డోలల్లతాకుంజ తాలపత్రము లనారత చలత్కర్ణ శూర్పములు గాఁగ,
గండ శైలోత్పాత గళదంబుపాతముల్ గండజమద పూరగతుల నీన,
అభ్రంకష న్మంజులాద్రి శృంగా కృతులుత్క్షిప్త శుండాన మున్నతిగన,
హరిహర చైత్యగోపుర వరప్రాకార వితతి యంబారి యాకృతులఁబూన

తే. నముచిసూదనుఁడై రావణమ్ము నెక్కి జగడమొనరింప, శివునిఁ గేశవునిఁ గూడఁ
దనదు పృష్ఠమ్ముపైఁ దాల్చి దాడివెడలు మదగజంబనఁ దనరె నమ్మహితనగము. 307

క. అంతటఁ బోతన మణిగిరి పొంతంగల మెట్టుకుధరమును గనుగొని స్వీ
యాంతేవాసి గణమ్మున కెంతయుఁ దన్మహిమలెల్ల నెఱిఁగించు నిటుల్. 308

## ఆశ్వాసాంతము

క. శ్రీమహితరూపశీలా! కామిత ఫలదానలోల! కాంచనచేలా!
రామా! త్రిభువనపాలా! భూమితనూజానుకూల! పుణ్యవిశాలా! 309

ఉ. శ్రీరఘురామచంద్ర! సువి, శిష్టప్రతాప జితామరేంద్ర! శృం
గార కళావిలాస బల కల్పితమారకు మారకేంద్ర! వి
స్తారిత కీర్తిసాంద్ర! మదదర్పిత రాక్షసహస్తి మస్తకో
న్మూలక కేసరీంద్ర! గుణభూషణదీప్త నరేంద్ర చంద్రమా! 310

స్రగ్విణి

శేముషీవైభవ, శ్రీలసత్ప్రాభవా!
భూమిజానాయకా!, ముక్తిసంధాయకా!
కామితార్థప్రదా! కాండ విద్యాహ్రాదా!
హ్రీ, మహీ, శ్రీయుతా! ఏకపత్నీవ్రతా. 311

గద్యము

శ్రీమద్భరద్వాజగోత్ర పవిత్రాపస్తంబసూత్ర, ప్రథిత సూరిజనమిత్ర, బక్కయ్యశాస్త్రిపుత్ర
వాగేశ్వరీ సమాసాదిత, వైదేహీవర నివేదిత సరసకవితావిలాస, సహజ
పాండిత్యభాస, వరకవి విధేయ, ‘వరదార్య నామధేయ ప్రణీతం
బైన పోతన చరిత్రమను మహాప్రబంధమ్మునందు
అష్టమాశ్వాసము.



శ్రీ ర స్తు.

శ్రీ వాగీశ్వర్యై నమః




## వాణీ ఖేదాపనోదము — కృతి శైథిల్యము

“ కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన ”


రఘుకుల నాథా ! విబు,
ధారాధిత పాదపద్మ ! యవ్యయ సద్మా !
ధీరోదాత్త మనీషా ! సూరాన్వయ
భూష దివ్య సుందర వేషా ! 1

గీ. అవనినాథ భాగవత కృత్యాక్రమణము ధన్య పోతన తీర్థయాత్రా గమనము
యుక్తరీతి శిథిలిత కావ్యోద్ధరణము ఆలకింపవె రామ ! పూజ్యాత్మనామ ! 2

తే. ఇది హిడింబాసుర క్షేత్రమిందు తొల్లి దనుజసుందరి తమి వాయుతనయుఁ గూడి
ధరణి “స్త్రీరాక్షసం న కర్తవ్య” మనఁగఁ గ్రాలు గణకూట శాస్త్రమున్ గల్లజేసె. 3

తే. దనుజ కాంతాలలామ సౌందర్యగరిమ మానవాధిపు వలపించె మనుజశక్తి
సంపదనుగాంచి రక్కసి చకితయయ్యెఁ బ్రకృతిగతి తలక్రిందులై పరఁగె నిచట. 4

ఉ. అంబర చుంబి శైలశిఖరావళిఁ దొండము లెత్తి దిక్కరీం
ద్రంబులు మందగొన్నటులు ధాత్రిని వెల్గెడి నీ నగేంద్ర పృ
ష్ఠంబున మందిరద్వితయ సౌష్ఠవముల్ శివకేశ వైకమ
త్యంబును మెట్టుతీర్థ విజయంబునుజాటు ననారతంబునుణా. 5

ఉ. బానలపైన బానలను బాగుగఁ బేర్చిన జంట దొంతులై
కానఁగనౌ మహాశిలలు గట్టిన యీ శిఖరాల రెంటఁ దా
నీ నగరాజు కేలుగవ నెత్తుచుఁ బాంధులఁ బిల్చి జానకీ
జానిని శూలపాణిని స్వచక్షువులం గని పోరె యిందనున్. 6

క. శివనారాయణ మంత్రోద్భవ మగు శ్రీరామనామ పదకమలయుగా
సవ మధురిమ వివరణమనఁ జివరలఁ బ్రేల్ తేనెపెరలు శిఖరద్వయిపై. 7

మ. తనకై యంబుధిఁగట్టి రావణ వధా ధ్యాయమ్ములో భక్తిమైఁ
దనువుల్ ప్రాణము లడ్డువెట్టి నిజబంధమ్మున్ విడంగొట్టు నీ
ఘన శాఖామృగ ఋక్ష పక్షితతి కైంకర్యమ్ము గావింప వ
చ్చిన సీతా కరుణాంతరంగము లదో సీతాఫలాల్ చెట్లపై. 8

తే. ప్రేమ తనువెల్లఁ గనులు గావించుకొనుచుఁగాంచు నవిగో! మందస్మితకాంతు లొల్కఁ
జల్ల శాఖాకరాలతో మెల్లమెల్ల వచ్చు నతిథుల కాహ్వాన మిచ్చునెపుడు. 9

సీ. రామకుండ మ్మిది రహిమీఱఁ గరవీర తరుసుమమ్ముల కీఁత గఱపు నెపుడు
జీడికుండమిది యసితవర్ణవాః పూర్ణశోభల నీలాల సొంపులీను
పాలకుండ మ్మిది బహునీరముల క్షీర మాధుర్య రుచిరసంపదలఁ బొదలు
గిన్నెకుండ మ్మిది చిన్నది లాంగలీ సుమధుర ఫలతీర్థ సుధల నొల్కు

తే. అల్లిపూచీటి చుక్కల యొల్లెగట్టి నాఁచువల ముసుంగుల మోము దాచుకొనుచు
జలదకన్యలీ సరసుల స్వాంతమందు సంచరింతురి జీవనము లర్పించియెపుడు. 10

తే. హరియె రాముఁడుగా నదిరి యవనిగాఁగ నబ్ధి సప్తకపారితనిధ్యమ్ము బూనె
సప్తకుండమ్ము లిందు మజ్జనమొనర్ప సప్త జన్మార్జితాఘముల్ సమయునెందు. 11

తే. ఇందు తృణకాష్ఠజలవృద్ధి కందమూల ఫలసమృద్ధి నీవరిధాన్యకుల వివృద్ధి
కందరాలయ సంసిద్ధిగల్గు కతన నిరత మునియోగి గణతపోనిలయ మిద్ది. 12

క. ఒక్కటి రెండు దినమ్ములు నిక్కమ్మీ క్షేత్రమందు నివసించుట లీ
ముక్కంటిని శ్రీరామునిఁ జక్కఁగ సేవించి పిదపఁ జనఁదగు నార్యా! 13

క. మును మీ రేగుఁడు వెనుకం జనుదెంచెద నే నటంచు జనపతి తా నం
పిన బాడబు మునుబంచెను దన శిష్యగణమ్మునరసి తగ నిటులాడెన్. 14

క. కనుఁడదొ మన పెన్నిధిరాముని సన్నిధి దాపునంటి ముక్కంటియు నా
వనచరపతి దనరెన్ నతిఁ దనగతి దాశరథి యడుగుఁ దామరలనుచున్ 15

క. హనుమకు మును నభివాదన మొనరుపవలె ననుచు మ్రొక్కులొనరించి ప్రద
క్షిణగతి ముమ్మారులజని కనె నినకులమణిని చైత్యగర్భ గృహమునన్. 16

మ. కని సాష్టాంగ నమస్కృతుల్ మనసుతో గావించి సేవించి యా
ర్తిని హే దాశరథే! దయాజలనిధే! దీనుండహీనుండఁ బా
పిన నన్నెట్లు క్షమింతువో యనుచు స్తంభీభూతచైతన్య వ
ర్తనుఁడై లెంపలువైచుకొంచు నతుఁడై ప్రార్థించె నా మీఁదటన్. 17

క. హరు నద్రిజాతసు మనోహరు నఘహరు మృత్యుహరు మహావిషహరునిన్
స్మరహరునిం బురహరుఁగని కరముల జోడించి భక్తిగాంచి యిటెంచున్. 18

సీ. అమృతంబు గరళంబు సమదృష్టిఁ గైకొంచుఁ దలయందు గళమందుఁ దాల్చినావు
నిప్పుల నప్పుల నొప్పిదమ్మగురీతి సెగకంట సిగయింటఁ జేర్చినావు
యోషలంబెను సర్పభూషలన్ వేషమందంగ సంగతినుంచి యలరినావు
భూతినిన్ రజతవిభూతి నొంటను నింటబొట్టుగాఁ బట్టుగాఁ బెట్టినావు

తే. పూలలో రాలలో నుండఁజాలినావు సురల నసురులఁ గరుణతోఁ జూచినావు
తాపసులవోలె నను బోలు పాపిజనులఁ బ్రోతువని వచ్చినాఁడ శంభో! శివ! భవ! 19

క. మునుదాసుల యఘతతి విషమునువలె దిగమ్రింగి సుకృతపున్ లవమును గ్రో
త్తనెలంబలె నొదలనిడి తన కొమరుని లీల నేలుదైవము నెంతున్. 20

వ. అని తన శిష్యులం గాంచి, 21

క. హరుఁ డీతఁడు హరి యాతఁడు హరిహరులను నొకటిగాఁగ నతికికనన్ స
ద్గురువయ్యెను దిక్కన కవివరుఁ డద్వైతామృతమ్ము వసుధను బంచన్. 22

ఆ. కన మతములు పెక్కు గమ్యమింత కొకండె భాషలెన్నియైన భావమొకఁడె
పర్వతమున కేగు పథములు వేరేని నగ్రిమందుఁజేర్ప నన్ని యొకటె. 23

క. అని యా నిశి యచ్చటనే కను మలిపెను వేగుటయును గాల్యక్రియలన్
బొనరుప స్నానార్థము వెలిజనుదెంచెను ఛాత్రి నివహసంయుతుఁ డగుచున్. 24

ఆ. గుట్టపైనఁ గల్లు గుండు గుండునకెల్ల గంతులిడుచు శిష్యగణము వెడలె
క్షితిని బ్రహ్మచారి శతమర్కటములకు సముఁ డటన్నమాట సార్థపడఁగ. 25

సీ. సరి యొకే పత్రానసాపడ నగునని పాలాశపర్ణ సంపదకు మురిసి
ఫలియించె నదె తరూపరియంచు నూరించు శీతాఫలప్రాప్తి శిరము నూఁపి
కననయ్యెఁ బొట్టికాకరకాయలని త్రెంచి శాకషడ్రుచులెంచి చంకగొట్టి
కడ్డీలఁబోలు చక్కని పుల్లలని త్రుంచి దంతకాష్ఠావాప్తి గంతువేసి

తే. పుట్టతేనియంగని నాల్క లొట్టవేయ నమిలిపురిఁగాంచి కన్నులింతలుగ విప్ప
కలువపూల్గోసి సంతోష మొలికియాడ నుబ్బి చెలరేఁగి బాలకు లుత్సహింత్రు. 26

సీ. అదుగో! కోఁతులమూఁకలవె మఱ్ఱియూడలం దలక్రిందు వ్రేలునం చలరు నొకఁడు
కడుపునం బసికందు కఱచియున్నం దూఁకుఁబడు నద్దిరాయని పల్కునొకఁడు
ఎక్కుశాఖనె పట్టి త్రొక్కి నాలుగు కాళ్ళ నూఁపుచున్నది యని చూపునొకఁడు
గుండుపై నెమ్మదిఁ గూర్చొని మైగోకికొని నోట నెదో కొట్టుకొను నటంచు
ఆ. రాత రువ్వి, చూడరా! గుఱ్ఱు గుఱ్ఱని బొమలు చెవులు నిక్కఁబొంగి వంగి
పైనదూఁకి వచ్చిపడినట్లు జడిపించుఁ గనులు పండ్లుతెఱచి కనుననొకఁడు. 27

ఆ. వస్త్రవితతి తెల్లవడునట్టు లుతుకుచుఁ జెట్టుకొమల కారఁగట్టివచ్చి
కొమ్మనుండి నీటఁ గుప్పించి దూఁకుచుఁ గుండమదర నీఁత గొట్టుచుండ్రి. 28

క. శక్తియు నుత్సాహము గురుభక్తియు స్వేచ్ఛావిలాస భంగిమలెల్లన్
రక్తిని రూపొందిన యటు వ్యక్తంబగు నచటి డింభవర్గములోనన్. 29

ఉ. స్నానములాడి భక్తిమెయి సంధ్యలు వారిచి పత్రపుష్పముల్
తేనియలూరు పండ్లు కొనితెచ్చిన క్రొందులసీదళమ్ములున్
ధ్యాన నిమగ్నుఁడై గుడిని దాశరథిన్ మనసారఁగాంచు దీ
క్షానిధి పోతరాజగురు సన్నిధినుంచి వచించి రీగతిన్ 30

క. ఫలపుష్పంబులు తులసీదళములు శ్రీ రాఘవార్పితముగాఁ గను నీ
కెలనంగల యర్చకు కరముల నిడఁగావలెనె సుకవి భూషణ! యనుటల్. 31

ఆ. అర్చకుండె వెలికి నరుదెంచి యూరు పేరరసి పోతరాజు చరితమెల్ల
శిష్యగణము లెలమిఁ జెప్పుచుండన్ విని కరముమోడ్చి భక్తి గౌరవించి. 32

ఉ. మీరలు పోతనార్యులె యమేయగుణాఢ్య! రఘూత్తముండు దాఁ
గోరిన యంత భాగవతకోశము తెన్గు నొనర్చి సత్కృతిన్
గూరిచినారలంచు గుణకోవిదు లెల్లరు నూరనూర నో
రూరఁగఁజెప్ప విందును మహోదయ! ధన్యము నాదు జన్మమున్. 33

ఉ. మా రఘురామదేవునకు మామలు శ్రీ జనకాంశతోడ నీ
ధారుణి జన్మమొందితిరి తా మిది యెంతయు నిక్కమెందు మీ
పేరును విందు ముందు కనువిందగు దర్శనమబ్బె నేఁడు బం
గారము మాకు మా యతిథిగా నిటఁ దాము వసింపఁగోరెదన్. 34

ఆ. అనుచుఁ బ్రొద్దుగలుగ నర్చన మ్మొనరించి బహువిధాతిరుచ్య పక్వభోగ
ములను రాఘవునకు ముందు నివేదించి విందొనర్చె సుకవివిభున కెలమి. 35

తే. హరికి నంజలి ఘటియించి యర్చకుఁడిడు శ్రీశు తీర్థప్రసాదముల్ స్వీకరించి
భక్తి శిష్యగణమ్ములు బఱచినట్టి శయ్య మైవ్రాల్చి సుంత విశ్రాంతిగొనుచు. 36

చ. కలకల నవ్వుచున్నటులు కన్నులలోన దయారసాపగల్
జలజల జాఱుచున్నటులు చక్కని మోమొక మాటయంచెదో
వలుకఁగఁ బోవుచున్నటులు భక్తుల నొద్దకు సుప్రసన్నతన్
బిలుచుచు నున్నయట్టు లగుపించెడి శ్రీరఘుమూర్తిఁ గాంచుచున్. 37

శా. జీవ మ్మొల్కెడి తావకీనప్రతిమన్ సేవించి లోనించు నా
భావాక్షిద్వయి వేరెదిక్కు మరలింపం జాలరా యేలరా
దేవా! నా మొర లాలకించియును నిద్రింపం దలంపేలరా?
లేవా యీ శిలలోన నుండియును రాలేవా ప్రభావాన్వితా! 38

చ. పుడమి జనమ్ము కావ్యవధువున్ హరి కిచ్చె నితండటంచు నన్
నుడివెడివారి కీ స్థితిని నోరిడి యేగతిఁ జెప్పువాఁడ నే
నుడివిన మాట దప్పిన జనుం డనిపించితి వీనినంచు నా
నడకను గూర్చి నీ విటులు నవ్వుచునున్నటుదోఁచు రాఘవా! 39

ఉ. నమ్మినవాని నిట్లు చెడనాడి మహా హసియించుచుంటి వీ
కొమ్మను గోరి చేసికొని కూళల పాలొనరించె నూరు పే
రమ్మొడువోయెనే యరరె! యాలిని నేలఁగఁజాలనట్టివాఁ
డిమ్మహి రాముఁడంచు నిహిహీ! యని నిన్గని నవ్వరే జనుల్. 40

క. ఆనాఁడు జానకీపతి దానవపతి బంధనమునఁ దగులుకొనె నయో!
యీనాఁడు భాగవతపతి మానవపతి చేతఁ జిక్కి మసలునొ యేమో! 41

క. నిన్నుం గట్టుకొనిన యే పున్నెపుటిల్లాలు సుఖముపొందె రఘుపతిన్
గన్నెత్తి చూడ గుండియ లున్నవె యెవ్వనికినైన నో రఘువీరా! 42

తే. హృదయవాసన లీనుచు నెసఁగు మొగలిపూలకై జీవనము ధారవోయుచుంటి
కాని తోడ్తోడనే కంటకములఁ గూడఁ బెంచుచున్నాఁడననుచు భావించనైతి, 43

తే. అనుచు శ్రీరాము నిటువలె నాత్మఁదలఁచి స్వీయమానసావేదన జెప్పికొనుచు
నుండఁ గనుల మీఁది కదేమొ యొకవిధమగు మత్తు జనుదెంచె హృదయార్తి మఱపుదట్టె,

ఆ. గాఢనిద్ర గాదు కాదు జాగ్రదవస్థ చెట్ల గాడ్పురొదలు చెవిఁబడెడిని
దనువు గల్గి లేని తన్మయావస్థతా నావరించె నేదొ యతని కపుడు. 45

ఆ. భాగవతము శీర్షభాగమం డిడి తాన యేగుచున్నయట్టు లెదకుఁ దోఁచె
గగన సాగరములు గర్జానినాదాల హుంకరించెఁ గవికి జంకొదవఁగ. 46

ఉ. అప్పుడె యాఁగిపోయెఁ బద మంబరసీమను గాంచు నంతలోఁ
దెప్పలుగాఁగ నబ్దములు దివ్యగతిన్ విహరించె వానిలోఁ

జిప్పిలుచుండెఁ బాదరససింధువు వెండి కరంగి పాఱె నాఁ
గుప్పలుగాఁగ నొక్కపరి కోటి వెలుంగులు జిమ్మెఁ జంచలల్. 47

ఉ. అట్టి వెలుంగు జాడ నొక హాటకరత్న విమానకాంతి గ
న్పట్టెను దాన వీణఁ గొని భామిని కోమల రూపరేఖలం
గట్టిన పట్టుపుట్ట మలకల్ మలకల్‌గొని గాలిఁ దేలుచున్
జుట్టిన మేఘపంక్తులకుఁ జుట్టరిక మ్మొనఁగూర్ప నేర్పుమై. 48

ఉ. ముట్టిన మాసిపోవు నవమోహనరూపముఁ గొంచుఁ గన్నులన్
గట్టె విమానయాన మిటు కాంచుచునుండఁగఁ బ్రక్క నొక్కతే
పెట్టున నేల వ్రాలె నది వీడి కఠోర కుఠార ధారలన్
గొట్టిన కొమ్మవోలె సతి కూలిపడెన్ దన చెంత వంతమై. 49

ఉ. పుట్టి మునింగిపోయినటు మోమునఁ గొంగిడి యేడ్చెఁ గన్నులం
బెట్టిన కాటుకల్ చెదరి నిగ్గుబుగ్గల నీలికాలువల్
గట్టఁగఁ గన్ను లెఱ్ఱవడఁ గంపము నొందెడి గాత్రవల్లితో
'నిట్టి తలంపె లక్ష్మియును నేనును నొక్కటిగాదె నీ' కనెన్. 50

ఉ. వెట్టికిఁ గాంచినావె నను వేసకు వేల్ గొని కన్నకూఁతురున్
బొట్టకులేక యమ్ముకొనఁబోలునె బాలిశుఁడౌ నృపాధమున్
ముట్టనటంచువల్కె గుణముక్త సుమౌక్తికపాళిఁ బోలి చ
న్మెట్టల నశ్రువర్షములు నెట్టన జాఱఁగ గద్గదోక్తులన్. 51

వ, అనునంతం బెనువంతం బొగులుచున్న యవిదిత నిజవృత్తాంతయగు న న్నెలంత
నవలోకించి కవికుల తిలకుండు, 52

క. రతివో విశ్వకళా భారతివో శ్రీ సతివా లేక రాజముఖీ ! పా
ర్వతివో నీకే నిడు నవమతి యేదొ యెఱుంగఁబల్కు మా దయ ననుటల్. 53

సీ. అరయఁగా నేను విద్యా స్వరూపిణిని బ్రోద్యద్బ్రహ్మవిద్య నా యాత్మ యెందు
విబుధ శిరోధార్య విజ్ఞానశాస్త్రముల్ జ్ఞానేంద్రియములయి క్రాలు నాకు
విశ్వ నిర్వాహక వృత్తివిద్యల వెల్లఁ గర్మేంద్రియములనంగాఁ బరంగు
కవిత గానము చిత్రకళ నాట్య లాస్యముల్ నాణ్యమౌ నా కరణత్రయములు

తే. సుకవి చతురాననములు మామక గృహములు నవరసాభోగరసికమానస సరసుల
నాడెదను మనీషా రాజహంసి నెక్కి కైత కెగ్గొనర్చుట లెదం గలఁచుటగును. 54

తే. నరపతుల పేరి రావణాసురల కీవు నన్ను తెగనమ్మఁజూచుట న్యాయమగునె ?
హరికిడందగు హవిని గుక్కురమున కిడఁదగునెయని తిరోహితయయ్యెఁ దరుణి యంత,

ఆ. తెలివివచ్చి దిశలు తిలకించి యేమియుఁ గానరామి బాష్పకలిత నేత్రుఁ
డగుచు నహహ! ధన్యమయ్యె నా పుట్టువు తావకీన మహిత దర్శనమున. 56

క. ఏణీ! సదృశాపాంగ శ్రేణీ! ముఖకమల సంపరివృత మధులిడ్
వేణీ! వాణీ! వీణా పాణీ! 'తుభ్యన్నమోస్తు' పద్మజురాణీ! 57

చ. వలవల కంట నీర్వడిపి వందురుచున్న భవత్స్వరూపముఁ
దలఁచిన నాదు మానసము తల్లడిలుఁ క్షుధ కాలుబిడ్డలుఁ
మలమల మాడి చచ్చినను మంచిదె కాని భవత్పవిత్రని
స్తుల నిరవద్యరూపమును దుచ్ఛుల కమ్మను నమ్మ భారతీ! 58

ఉ. కాటుక కంటినీరు చనుగట్టుపయిం బడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల! యో మదంబ! యో
హాటక గర్భురాణి! నిను నాఁకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాట కిరాట కీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్మ భారతీ! 59

సీ. కాటుకం గడుగు నీ కన్నీటిఝరులు నా యజ్ఞాన మాలిన్య మపహరించె
పయ్యంట నింకు నీ బాష్పవీచికల నా యా శార్ణవం బెల్ల నాశమయ్యె
ఆర్తిమై కురియు నా యశ్రువర్షముల నా సంసార దావాగ్ని సమసిపోయె
తత బాష్పధారలోఁ దడిసిన చనుగట్టు మాతృ వాత్సల్యమ్ము మదిని నింపె

తే. తలపయిన్ నాదు భాగవతము నిడుకొని తప్పక ప్రమాణము నొనర్చి చెప్పుచుంటి
హరిహరులు వచ్చి చెప్పిన నంబ! యింక నిన్ను కర్ణాట కీచక నీచుల కిడ. 60

చ. సరియె హిరణ్యగర్భు దొరసానికి నీ కెపరేని భారతీ!
సిరికిని కైటభారియగు శ్రీహరికిన్ గరిమఁ స్నుషోరుసుం
దరివయి విశ్వకావ్యరచనాచణు సన్ముఖపద్మమందిరేం
దిరవగు నీదు మానసము నీచత నేఁచినవాఁడ మూఢుఁడన్. 61

ఉ. ఈ క్షణమందె నీకు కృతినీయనటంచును లేఖ కన్నడా
ధ్యక్షున కంచువాఁడ నిది యారసి నాకు నృపాలమౌళి యే
శిక్ష నొసంగినన్ సరియె శీర్షము వంచి సహించుకొందు నఁ
రక్షణసేయ దిక్కు రఘురాముఁడు లేఁడెటొ చూడ నెంచితిన్. 62

క. అని తన ఛాత్రున కొక లేఖను వ్రాసి యొసంగె నరిగి కర్ణాటపతిన్
గని యొసఁగుమంచు సింగన చనియెను నద్దానిఁ గొంచు సాదరబుద్ధిన్. 63

ఉ. అంత సమీపమందె కననౌ మడికొండ వసించు మేటి ది
గ్దంతులు వేదశాస్త్ర పరతత్త్వ విదగ్రణులుఁ బురాణవే

దాంత విపశ్చితుల్ నిరుపమాంధ్ర సుసంస్కృత కావ్యకర్తలున్
బంతులు దీఱి పోతకవి భాగవత శ్రవణార్థమై తమిన్. 64

ఉ వచ్చిన, వారిఁ గాంచి గురుభక్తిని వందన మాచరించెఁ దా
సచ్చరితుండు పోతనయు, సాదరబుద్ధిని వారు కౌతుకం
బచ్చుపడంగ మ్రొక్కులిడి యాకృతి భాగవతంబె ? జన్మకున్
వచ్చె శుకాంశ మాదృశుల బద్ధుల నుద్ధరణం బొనర్పఁగన్. 65

క. అనుచుం బూసరులను గళమున నునిచిరి నిగమ మంత్రపూతాక్షతలం
గొని యాశీర్వాదములం బొనరిచి ఘన పుష్పవృష్టి ముంచిరి సుకవిన్. 66

తే. సూత శుకులను గరఁగి యచ్చునను బోయి పోఁతనా వెలుంగొందె నీ పోతనకవి
భయద భవవార్ధితారణోపాయమైన పోతరూపమై పోతన పుట్టెననిరి. 67

ఆ. పేరు పేరు వరుసఁబెట్టి వారందఱ నర్చకుండు పరిచయం బొనర్చె
వారిఁ గాంచి సుకవివర్యుండు ధన్యోస్మి యనుచు మ్రొక్కులిడుచు ననియె నిట్లు. 68

ఉ. ఎక్కడ నున్న సద్గుణము లేనియు నౌదలఁ దాల్చుటందు వే
రొక్కరిఁ గాంచి ముందర 'నహో !' యని వెన్కల వెక్కిరింపకే
మక్కువ భ్రాతృవత్సలత, మత్సరమున్ విడనాడియుంటలో
నిక్కపు టొజ్జబంతులయి నిల్చెద రీ తెలగాణ సత్కవుల్. 69

క. సరళ హృదయు లాత్మస్తుతి పరాఙ్ముఖులు గర్వరహిత ప్రతిభాఢ్యులు దం
భరహితు లీ తెలగాణన్ వెలయు కవుల్ తొనఁకనట్టి నిండు ఘటమ్ముల్. 70

తే. చదువుకొననట్టి నేనేడ సకల వేదశాస్త్ర సారార్థపూర్ణులీ చతురులేడ
విగత మత్సరధిషణులౌ విజ్ఞులెందు నరవపువు దాల్చు చంద్రశేఖరులు గారె. 71

తే. మణిగిరియు మిమ్ముఁ బోల్ జాతిమణులఁ గాంచి యనవరతము సార్థకనామ యగునుగాత!
నిజముగా మీదు విజ్ఞాన నిష్ఠఁ గాంచ నిచటనేఁ బుట్టనైతినం చెదఁ దలంతు. 72

క. ఇటులను పోతన నారసి యటఁ గల దోషజ్ఞులెంతొ యాశ్చర్యముతో
నెట నెట మీ యవతారము ఘటియించునొ యదియె కాశికాక్షేత్రంబౌ. 73

సీ. తగనాంధ్ర రఘువు ప్రతాపరుద్రుఁ డొసంగు స్వర్ణవృష్టిం బాఱు చదలువాఁక
ప్రథిత విద్యానాథ పండిత కవులను వెలయించు చదువుల వేల్పుగిడ్డి
తెనుఁగుగడ్డకు రత్నదీపమై వెలుఁగొందు పోతరాణ్మణి నిచ్చు పుడుకుమ్రాను
అఖిలాంధ్రరాష్ట్రమ్ము నవలీల నేలఁగా రాజధానిగ వెల్గు రచ్చపట్టు

తే. ఆడబడుచైన చారు శిల్పాంగనామతల్లికై వేయి స్తంభాల యిల్లు గట్టి
యరణమిచ్చిన దొడ్డ యిల్లాలు, మేలి పంటపొలము రత్నముల కోర్గంటి స్థలము. 74

క. కళలకుఁ గేంద్రము సంపన్నిలయము ప్రథితాంధ్రలోక నిర్జరకృత భూ
తల నాకము దంతమ్ములు పులియున్ దెలగాణమనినఁ బొరి నమరులకున్. 75

తే. ఔర ! తెలగాణ నడిగడ్డ యాంధ్ర రాజధాని నోరుగల్ సీమ నుద్భవము నొందు
తావకీన జన్మ మదెంతొ ధన్యమనినఁ బోతనయు వారిఁ గాంచి యీరీతి వల్కె. 76

తే. పోతరాజన నెంత యీ పుణ్యభూమి నడుగడుగున విద్యానాథులనిన పుట్లు
కో యనఁ బ్రతాపరుద్రులు కోటిమంది వత్తురిట జన్మగొనుట తపఃఫలమ్ము. 77

సీ. ఓరుగల్ కోటలో నొక గంట నిలిచిన నాంధ్రుల పౌరుషం బర్థమగును
ఓరుగల్ సరసి నీ రొకనాఁడు ద్రావిన యబల రుద్రమదేవి యన నెఱుంగు
ఓరుగల్ శిల్పమ్ము నొకమారు గాంచినఁ దెలగల ప్రతిభలు తెలిసివచ్చు
ఓరుగల్ వాయువు లొకతేప పీల్చిన నాంధ్రు స్వేచ్ఛావాంఛ లవగతమగు

తే. ఓరుగల్కోట పే రెద నొక్క తడవఁ దలఁపఁజాల్ తెల్గు చరితోన్నతుల నెఱుంగ,
ఓరుగల్గడ్డ నున్నట్టి యొకొకశిలను బిలిచిన నొహో యనుచుఁ బల్కుఁ దెలుఁగువెలుఁగు.

క. ఏకశిలా నగమటు ప్రత్యేక సమర్థుఁడన లోకువెఱుఁగఁడు ప్రతివాఁ
డేకశిలా నగరావని వీఁకన్ దెల్గు జిగిమెండు వీటన్ గోటన్. 79

వ. అని వినుతించుటయును, 80

క. అచ్చటి ప్రజ పోతనకవి ముచ్చట విని ముగ్ధులగుచు మురియుచు స్వామీ !
యిచ్చట మా కెల్లర కొక యిచ్చగలదు మీకు శ్రమము నిడవలె ననుచున్. 81

క. భాగవతవర్య ! త్వత్కృత భాగవత సుధారసమ్ము పానమొనర్పన్
వేగిరపెట్టు మనమ్ములు స్వాగతములు మీకు కావ్యశారదకునివే. 82

క. అన విని పోతన స్మేరానన మొప్పఁగ వారిఁ గాంచి నా భాగ్యము మీ
రనుటయె చాల్ పదివేలని వినయ సుధాస్రవ దుదార విధులోచనుఁడై. 83

క. అనఘాత్మలు మీ మును గవినని చెప్పఁగ సిగ్గుగలుగు నైనను మిము బోల్
ఘనుల కడఁ జదివినన సంకునఁ బోసినఁ దీర్థమగుచుఁ గొమరొందు కృతుల్. 84

ఉ. వీరి విలాసభాషణలు వీనుల విందిడ నింగితజ్ఞుఁడౌ
నారయ ప్రిక్క వెల్గు సుమనస్థ మరందము నా ప్రబంధమున్
దోరపు భక్తిఁ దెచ్చి వినతుండయి పీఠిక నుంచెఁదా నమ
స్కార మొనర్చి పోతనయు సాదరబుద్ధిఁ బఠించఁ బూనికన్, 85

తే. ఆది మదభీష్టదైవము నా రఘువరు నీలజీమూతగాత్రు విశాలనేత్రు
ధర్మమూర్తి నాచంద్రార్క ధన్యకీర్తిఁ బరమపూరుషు మత్కృతి భర్తనెంతు. 86

ఆ. ఎచటి సూర్యవంశ మెచ్చటి నే నని ఘనుఁడు కాళిదాసె వెనుకవోవ
సూర్యవంశ సూర్యుస్తుతిచేయు గంటము సూర్య దివిటీఁబట్టి చూపుటగును. 87

తే. ఘనుఁడు వాల్మీకిమౌని జగద్ధితమగు నతుల శతకోటివిస్తరమైన రామ
చరిత మిరువదినాల్గువేల్ సంగ్రహించెఁగరి జలధి మున్గెనన మశక మొకలెక్క. 88

మ. అనుచున్ రాఘవునెంచి శ్రోతల యభీష్టావాప్తి గావింప మో
హన వాగ్వైఖరియొప్ప భాగవత సప్తాహంబు గావించెఁ బో
తన సీతాపతి సన్నిధానమున శ్రోతల్ మంత్రముగ్ధాఖులై
విన మా జన్మతరించెనం చన హరిన్ వీక్షించెఁదా భక్తిమై. 89

వ. అప్పోతన కావ్యరాజము న్విని సంతసంబున నంతరంగంబు లుప్పొంగ శ్రోతలిట్లని
నుతించిరి. 90

చ. కలరవమొప్ప నొక్కపరి గాన మొనర్చినఁజాలుఁ గోకిలల్
వలచును హంసముల్ తలలువంచును డోలలఁదేలు చేతముల్
తల లవి నాగుఁబాముల విధమ్ముగ నూఁగును దేహ మున్నటుల్
తెలియదు బాగుబాగనక తీరది కెంతటివారి కేనియున్. 91

సీ. రసములు మధుసుధారసములఁ ద్రావించు నర్థసంపద వాంఛితార్థ మొసఁగు
ధ్వనివిపంచిక కల ధ్వనుల సొంపులు నింపుశయ్య కోమల సుమశయ్యఁదేల్చు
భావముల్ మహిత ప్రభావమగ్న నొనర్చుఁ బదములు సాయుజ్యపదము నిడును
ఛందోవిధమ్ము స్వచ్ఛంద సౌఖ్యమునిచ్చుఁ గృతులు మనోహరాకృతులఁ జూపు

తే. నవరసమ్ములఁ జవులూరు నవ్యగతులఁ గమ్మ ద్రాక్షారసమ్ము పాకమ్మొనర్చి
విబుధసముదాయమున కెందు విందొనర్చు దొడ్డ దొరసాని యీ యమాత్యుని సువాణి. 92

ఉ. పాయక సేయు తెల్గుల తపమ్ములపంట, మహాంధ్ర భారతీ
స్వీయపదోల్ల సద్వలయ సింహనదజ్జయఘంట, సాహితీ
ప్రేయసి కావ్యలక్ష్మి కనువేసిన చక్కనిదంట పోతరా
ణ్ణాయకుఁడంట యెల్ల కవినాథుల సత్కృతిఁగొంట చోద్యమే. 93

వ. అని వినుతించు సమయంబున. 94

క. సాయుధరక్షకభట సముదాయ పరీవృతుఁడు భద్ర దంతావళ శో
భాయుత పృష్ఠారూఢుం డా యెడ కరుదెంచె నొక బలాధిపుఁ డతఁడున్. 95

తే. రాజలాంఛనాన్వితుఁడు పరాజితారి రాజదత్తాఢ్య బిరుద విరాజితుండు
బాహుబల విక్రమ క్రిమోచ్ఛాసితుండు భీమకాయుండు సింహగభీరముఖుఁడు, 96

మ. పరివారంబులతోఁ జలద్భటులతో భద్రేభరాజంబుతోఁ
దురగానీకముతో దిశాముఖ రణత్తూర్య స్వరావర్త సుం
దర రాగాచింత తాళమేళనముతో ధాత్రీసుర స్వస్తిమం
త్రిరమాగానముతో విపశ్చితులతోఁ దా నేగుదెంచెన్ రహిన్. 97

క. అంతట సింగన వారల చెంతం జని కాంచి యచటి సిబ్బందిని న
త్యంతాశ్చర్యచకిత హృదయాంతరుఁడై యడిగె నొకని నతఁ డిటు నుడువన్. 98

శా. వీరెవ్వారలు ? కన్నడేశ్వర సభా విద్వాంసు, లవ్వారలో ?
యా రాజేంద్రుని వాహినీపతులు, కార్యంబేమి విచ్చేయఁగా ?
శ్రీరామాంఘ్రి సరోరుహార్చక మనీషిం బోతనార్యుం గనన్,
వారిచ్చోటఁ గలారటంచు నతఁ డాహ్వానించె నా యిర్వురన్. 99

క. వారలు పోతనఁ గని జోహారుల నర్పించి సరసనాసీనులునై
భూరమణు వినతి వినిచిరి సారమతికిఁ బోతరాజచంద్రున కిట్టుల్. 100

క. శుకుఁడో యీయన తాను జనకుఁడో యవతార మెత్తినాఁడని ప్రజ మీ
యకళంక కీర్తిసామమునకు ఘన. జట నల్లుచుండె నలుదెసలు భువిన్. 101

తే. కవికులాగ్రణీ ! యిదె నమస్కారశతము లర్పణ మొనర్చి తమకు నే నంపు వినతి
కృతి సమర్పణోత్సవము లంచితగతులను సిద్ధపఱచి మీ రాక నీక్షించుచుంటి. 102

క. అంతనె పోతన కవివరు నంతే వాసిని నటంచు నవనిసురుఁడు నా
చెంత కొకఁ డేగుదెంచి ప్రశాంతగతిన్ నా కొసంగె జాబు నొకండున్. 103

చ. తమకము మీఱ జాబుగొని దానిని గాంచెడి నేను నాదు నే
త్రములనె నమ్మనైతి నిది తథ్యము మీదగు వ్రాలె యైనచో
శ్రమ యనకుండఁ దామె యొకసారి యిటన్ దయచేయ నొప్పు స
ర్వమును నెఱింగినట్టి కవిరాజుల కెక్కువ వ్రాయలేనిఁకన్. 104

ఆ. అనుచు జేనియాజ్ఞ వినిచె రాజాస్థానపండితుండు సుకవి వల్లభునకు
దంతి నధివసించి దయచేయవలెనని విన్నవించె సైన్యవిభుఁడు కవికి. 105

చ. అది విని తాను బోతన సమాదరదృష్టుల వారిఁ గాంచి నే
ర్పొదవఁగ నిట్లువల్కె విబుధోత్తములార ! తలంప నేటికిన్
విదితమొనర్చె మానవుఁడు వీథి నటించెడి కీలుబొమ్మ యం
చెదియొ యదృశ్యశక్తి యిటు లీతనిపైఁ గల సూత్రధారుఁడై. 106

తే. కాంతిలేక వర్ణంబుండి కనఁబడనటు గాలిలేమి శబ్దము వినఁగలుగమి నటు
లవని దైవేచ్ఛలేమి మానవుని యత్నమింతయునుగూడ ఫలియింప దెయ్యెడలను. 107

క. దానము దాతృవశమ్మని మానసమున నెంచి కృతిని మహిపున కిడగాఁ
బూనితిఁ గృతికన్యక యది తానై వరియించె హరిని దాశరథివరున్. 108

ఉ. ఈ గతిఁబల్కు పోతనకవీంద్రున కా దళవాయి పల్కె శ్రీ
భాగవతమ్ముఁ గన్నడ నృపాలున కంకితమిత్తు నంటి రి
ట్లాగమసారవేత్తలు మహాకవులైన భవాదృశుల్ బుధుల్
త్యాగమొనర్చు వస్తువుఁ బదంపడి కైకొన జౌర్యమందురే. 109

వ. అనుటయుఁ బోతన కవీంద్రుండా దండనాథుఁగని యిట్లు పల్కె. 110

తే. ఇత్తుననుచును దాత వాక్కీఁడగవచ్చుఁ బ్రతిగృహీత కైకొన నాసపడఁగవచ్చు
మనుజ సంకల్పములకు పైమనెడి శక్తి యిచ్చలేకున్నఁ గొనుటగా దిడుటగాదు. 111

తే. సూనహృదయమ్ము మధువు నిచ్చుటకె విప్పెనర్థియై మధుకరము పేరాస నరిగె
వాయువంతలో దాని నివ్వసుధరాల్చెఁ గుడుచు మధుకరప్రాప్తమొ కుసుమగతియొ. 112

క. వరకవి పల్కులు విని యా ధరణీపుసేనాని యిటులు తా నుడివెఁ గవీ!
సిరికిని ధరకును వరుఁడగు నరపతి విష్ణ్వంశజుండనన్ వినలేదే. 113

తే. బలి హరిశ్చంద్ర శిబిచక్రవర్తు లెందు సత్యమునకు సర్వస్వమొసంగి నార
లిత్తునని నల్వురన్ మాటనిచ్చి మనుజుఁడాడి తప్పిన ముఖము క్రిందగు నటంచు. 114

తే. శ్రుతి కఠోరవాగ్వ్యవహారగతిని దనరు దండనాథునిగాంచి పోతన యిటాడె
నావును గసాయి కిత్తునం చాడితప్పు ముఖము క్రిందైన మీఁదైన ముఖము ముఖమె. 115

ఆ రాజెవిష్ణువఁట ధరాదేవి శ్రీదేవి యతని భార్యలగుచు నలరుకతన
వేయి తలలనీడ విష్ణుత్వముంటలు తెలిసికొనమి గద్దె దిగుటలగును. 116

తే. ధరణిపతి ప్రజాకంటకత్వము వహింపఁ బురియె తలక్రిందులై రిపు సరణి వఱలు
నలఘు దోషాతిరేకమ్ము కలన నెప్పు డంతరించును రాజత్వ మవనియందు. 117

చ. అన విని దండనాథుఁడు క్రుధాగ్నిశిఖల్ గరళాపగల్ దిర్లో
చనుఁడు హరించినట్టు లతిశాంతముగా దిగమ్రింగి నిప్పులై
గనుగవ కెంపులీనఁగ ముఖమ్మున నెత్తురు గ్రమ్మ నిట్లు మా
మనుజపతిన్ గవీంద్రు లవమానము సేఁత సహింపరాదనెన్. 118

ఆ. రాజులెందుఁ దాము రత్నహారులు నౌట భాగవతము మాదు పాలిసొమ్ము
రాకుమారి నిడ నిరాకరించిన మించి రాక్షసమునఁ గొందురిరాజు లనియె. 119

క. అది వినిన పోతనార్యుని హృదయము భగ్గుమనిమండె నెంతయుఁ గ్రోధా
స్పదమైన వదనబింబ మ్ముదయత్ప్రళయార్కశోభ నొప్పనిటు లనెన్. 120

తే. కవికిఁ గావ్యమ్ముపై నధికారమేగె చెలువ కిష్టవరుంగోరు స్వేచ్ఛలేదు
రెక్క కష్టమ్ముపైఁ బ్రాణి హక్కునున్న రత్నహారులు తామెందు రాజులౌట. 121

తే. చలన మెఱుఁగని యీ ప్రజాస్థానమందు దొరలు పైనుండి క్రిందికి దొరలుచుంద్రు
చుక్కలేవేళ క్షతిలేక చూచుచుండ శశికళాభంగ మొందుచుఁ జను సతమ్ము. 122

చ. ఇగురుచవచ్చుఁ బాదపము లెప్పటియట్లె కుఠారధారలన్
దెగియుఁ దరుప్రకాండ మతి తీవ్రమహోగ్ర ప్రవాహ వేగ ప
న్నగహతిచే సమూలపతమ్ముగనుఁ, నృపపీడనన్ బ్రజల్
నెగడుదురెట్లొ రాజెటులు నెగ్గుఁ బ్రజాశ్రు ప్రవాహధాటికిన్. 123

ఆ. తేనెటీఁగ లొసఁగు తేనెఁ గైకొని వానిఁజంప సాహసించు జడుఁడు తాను
పువ్వు నొవ్వకుండఁ బూఁదేనెఁ గ్రోలెడి తేఁటివర్తనమ్ము తెలియఁగలఁడె? 124

ఉ. చందనశాఖి గంధవహసంచలిత మ్మయి శైత్యమిచ్చుఁ బెం
పొందెడి యగ్ని తత్పవనయోగమునన్ బరితాపపెట్టు నా
చందమునన్ బ్రభుత్వమొక సజ్జనుఁ గూడఁ బ్రజాహితుండు గా
నందము నొందు దుష్టుఁడు ప్రజాహితుఁడౌఁ బ్రభుతాభియుక్తుఁడై. 125

తే. రాజనని రాముఁడే రాజు, రాజ్యమనిన రామరాజ్యమె రాజ్యమ్ము భూమి ననుచు
సూర్యచంద్రులు పవలురేల్ చుట్టివచ్చి దివ్వెటీలిడి చూపరె దివిని భువిని. 126

తే. అల సహస్రశీర్షుఁడు సహస్రాక్షుఁడైన విశ్వరూపధారియె తాను విష్ణువంట
విష్ణు సత్కళాయుతుఁడె పృథ్వీపతియఁట రాముఁడేకాక ధరణి నా రాజెవండు. 127

తే. అరయ రామచంద్రుఁడె సహస్రాక్షుఁ డగుట భూరిజనపీడక బలాసురారి యయ్యెఁ
బ్రజలె తా నను విశ్వరూపధరుఁ డగుటఁ జాకి వానిమాటకు నయి సతిని విడిచె. 128

ఆ. ఒక్కనోరు తినెడి యోగిరమ్మదియెల్ల నింద్రియాళిఁ బుష్టినిచ్చు నటులు
సకల ప్రజకు శీర్షసదృశుఁడౌ శ్రీరాము జయము మానవాభ్యుదయముగాదె. 129

ఆ. ఇంద్రియ ప్రతతుల నెయ్యది నొచ్చిననేనిఁ దానె బాధనొంది యేడ్చు
మనముపోలె నతఁడు తన ప్రజల్పొందెడి వెతలనెల్ల ననుభవించువాఁడు. 130

క. అనుచు నిటువల్కు పోతనఁ గనుగొని మానసమునందు కటకటఁ బడుచే
మనఁజాలమి ననకుండన్ మనఁజాలమి సైన్యపతి సుమతి కిటులాడెన్. 131

తే. అంగబల మర్థబలము విద్యాబలమ్ము గలిసి ప్రభుబల మ్మగుటలు తెలిసికొనిన
మీరలిటు మాటలాడెడివారుగారు భూపతికి మాటనిచ్చి తప్పుకొనఁదరమె. 132

క. ఏతటి స్వపరబలములను బ్రాఁతిన్ గుర్తించి నడచు ప్రాజ్ఞుఁడిటు వలెన్
జాతిని గుర్తిద్ది కవీంద్రులు చేతిని నొప్పించుకొనుట క్షేమ ప్రదమే? 133

ఉ. అడ్డుగలాదె భూపతుల యాజ్ఞకు నియ్యది మంచి యిద్దియో
చెడ్డ యటంచు వాకొనక చేయవలెన్ దలవంచి యెంతయున్
గ్రుడ్డిగ, మాఱు బల్కనిటు గూడునె రాజహితమ్ము మాన్పుటల్
గొడ్డలి నానవేయుటలు గొంగడినిం గొని వెల్లజేయుటల్. 134

ఉ. కాలకరాళ సర్పముఖగహ్వర మందున వ్రేలి నుంపఁగాఁ
బోలునె మత్తతన్ నిదురవోయిన సింగము నూఁపి లేపఁగా
నేల నృపాలుతోడఁ బగ యెంతయుఁ గీడనఁ బోతనార్యుఁడున్
వ్రీలు నవేంధనాహుతిని వెల్గు మఖాగ్ని శిఖాభుఁడై యనెన్. 135

తే. చాలు మీ భాషణము లోర్వఁజాల నింక భీతిలుట భీతిఁగొల్పుట పాతకములు,
అవి నిరంకుశుఁడగు కవి కంటలేవు, ఆతఁడన నక్షరముల మహీతలపతి. 136

చ. ధరణిఁ బ్రజానురంజకుఁడె తాను నృపుండు ప్రజారివృత్తిచేఁ
బొరల నృశబ్దము న్విడినఁ బుండటు లెంచఁబడున్ జమూరమా
వర ! వ్యజనాభిషేకపట బంధము లాదిగ లాంఛనమ్ము లా
నరపతికున్నయట్టులె వ్రణంబున కుండుటచే నదెట్లనన్. 137

సీ. ఈఁగ వ్రాలఁగనీక యెంతేని శ్రద్ధతో వాలవ్యజనపు సేవన మొనర్తు
గాయంపు మలినమ్ము కడిగివేయుటకునై యనుదిన మ్మభిషేకమును బొనర్తు
గాలి దాఁకిన నింకఁ గలఁకఁబాఱునటంచుఁ బట్ట బంధమున గుప్తం బొనర్తు
కఠినాసన మ్మీడ గడగండ్ల నిడునంచు దిండుగద్దియలఁ గూర్చుండఁబంత్రు

తే. శాంతినొందు దేవా ! మముఁ జంపఁబోకుమనుచు శైత్యోపచారాల ననుపఁజూతు
రంతకున్ బుద్ధిరాకున్న నాది మూలమంటఁ గోయింత్రు శస్త్రవైద్యమ్ముతోడ. 138

తే. కపటవర్తనాచణులగు నృపుల ముందు నభిమతాన్యాయమే న్యాయమై చెలంగుఁ
గుటిలతరకూట నీతిముకురము నందు నెడమ కుడియగున్ గుడియఁ దా నెడమ యగును.

తే. ధర్మగుణ జపమ్మొనరించు ధరణిపాలు నాలుకయె యెఱగప్పిన గాలమెపుడు
మేదినిన్ రాజకీయమ్ము మేడిపండు ప్రభువులకు స్వార్థరుజ తలఁ బరఁగుచుండు. 140

సీ. దైవప్రదత్తమౌ ధారుణీ శకలమ్ము నాది నాదని గుండె బాదుకొనును
తా నంబుదము వోయు దానోదకముఁగొనఁ బన్నులిమ్మని వంచి బండలెత్తు
కర్షకు చెమటోడ్చి గడియించు ధనమును దాతసొమ్మట్లు గోతముల నింపు
నిజరాజ్య రక్షకై నిరుపేద ప్రజసైన్యమని కత్తికోఁతల కప్పగించు,

తే. అవనిఁ దత్కృతి నిశ్చేష్టయగుచుఁ గాంచుఁ గాంచు వెలవెలబోయి మేఘమ్ము దివిని
గోతములు గాంచి నోర్మూసికొనఁ దొడంగె నొఱను జొరెఁ గత్తి మోమెత్తి తిరుగలేక.

ఆ. ఒక్క ప్రభుత చాలు నున్మాదరోగంబు విత్తబలము కల్గ మత్తుతోడు,
అజ్ఞుఁడైన యువకు నలమిన నివి రెండు ప్రళయ తాండవమ్ము సలుపఁడేల ? 142

సీ. ఇలఁ గుచేలుండు తా నలకుబేరుఁ డగు నే ప్రభుకటాక్షమునకుఁ బాత్రుఁడగుచు
అల్పతృణమ్ము బ్రహ్మాస్త్రమై యడరునే క్ష్మాపాలు మహదనుగ్రహము వడసి
మొఱకు బోయండేని వరకవీంద్రుండయి వెలుఁగునే దొరకంటి చలువ వలన
గతిలేని పక్షికిన్ గరతలామలకమ్ము ముక్తియే నృపుదయా మూలకముగ

తే. సత్యపాలన కెవఁడు రాజ్యమ్ము విడిచె ధర్మరక్షకెవ్వఁడు కళత్రమును వదలె
నర్థబల మంగబలము విద్యాబలమ్ము వానివే వాఁడె జనమనోవసుధ నేలు. 143

తే. సామమున లభించు జయమ్ము శాశ్వతమ్ము దానఁ బరిపంథి మనసుతో దాసుఁడగును
దండ దౌర్జన్య సముపార్జిత విజయమ్ము ఆదిమూల మంటని తరుచ్ఛేదనమ్ము. 144

తే. తమకుఁ దామె యీ దౌర్జన్యతంత్రులెల్ల సాగినకొలంది మ్రోఁగియే సమయమందొ
తెగును టుప్పని తంబురతీఁగలట్టు లనినఁ బడవాలు కినుక సైన్యమును గాంచె. 145

క. సన్న యొనర్చెను సేనకు మిన్నొరయుత టిత్తులనఁగ మెఱసెను గత్తుల్
మిన్నకయుండెను బోతన కన్నులు మూఁతబడె నచటఁ గల జనములకున్. 146

క. ముసరెను సైన్యము నాలుగు దెసలం బ్రజ గుండెలెల్ల దిగ్గ రనంగా
నసినాగంబుల కొంతులు కసుబుసులాడెన్ హరించె గ్రంథం బతఁడున్. 147

క. స్వామి సమక్షము నందే యేమీ యన్యాయమంచు నేడ్చె జనమ్ముల్
రాముఁడు శిలయై చూచెను భూమియు నాకసముఁ దెల్లవోయె నపుడటన్. 148

క. పొత్తము వోయినయంతనె చిత్తరువయ్యెను సదస్సు జీవముడిగె రే
కెత్తిన మౌనవ్రత ఘన భిత్తిక భంజించి సుకవి వెండి నిటాడెన్. 149

క. పలికినది భాగవత మిటు పలికించినవాఁడు రామభద్రుఁడు నేనుం
బలికితి భవభయహర మని యిల దానిం ద్రుంప నంప నీశుం డతఁడే. 150

వ. అని దయాసాంద్రుఁడగు రామచంద్రున కభిముఖుండై, 151

ఉ. నాఁడు పరోక్షమం దసురనాథుఁడు జానకినిన్ హరించె నీ
నాఁడు భవత్సమక్షమున నా కృతికన్యను దస్కరించె నీ
వేఁ డనిలాత్మజుండు నిటు రెప్పను వేయక కాంచుచుండె ముం
దెలకొ నే నెఱుంగ నిఁక నెవ్వరు రక్షకులో రఘూద్వహా ! 152

ఉ. నాఁడు వరాహరూపమున నా కృతి రక్షణసేసినాఁడ వీ
నాఁ డిటు లీ వుపేక్షఁ జరియింపఁగ హేతువదేమి స్వామి ! నే

నాడిన మాటఁ దప్పి కృతి నన్య నరేంద్రున కీఁ దలంచుటల్
చూడ సహింపరానిదని శూర శిరోమణి ! యల్కఁబూనుటే ? 153

ఉ. కాని, యెటేని నాదు కృతికన్యక తాను హరి న్వరింతునన్
బూనికనుండె నాపె మొగముం గనియైనను స్వీకరింపవే
దానవవైరి ! నాఁడల విదర్భ తనూజను రుక్మిణీమణిన్
దానయి రుక్మి నొంచి యరదమ్మునఁ గైకొనిపోఁడె కృష్ణుడున్. 154

మ. అల కాకాసురు నొంచఁగాఁ దృణము బ్రహ్మాస్త్రమ్ము గావించు నీ
యలఘు ప్రజ్ఞల నేడ దాచితివి దృప్తాంభోధి నింకించి పెన్
జలధిం గట్టి సురారిఁ గొట్టి యవనీజాతాత్యయోపేత ని
స్తుల నిర్బంధ విముక్తిసేయుటను నెచ్చో నేగె సీతారావరా ! 155

మ. అనుచుం బోతన యాతనంబడుచుఁ దా నర్కాన్వయాంభోధి సో
ముని శ్రీరాముని నార్తి మీఱఁ గనుచున్ మ్రొక్కుచుంబలెన్ నిల్వఁగా
జనముల్ సేనలుపోవు దారిఁ గనుచున్ సంతాపముం బొందుచోఁ
గననై రందు హయాధిరూఢులయి వీఁకన్వచ్చు యోధాగ్రణుల్. 156

వ. అందు వారి నందఱన్ ముందరన్. 157

తే. మార్కొనఁగవచ్చు వర విక్రమార్కుపోలె మారువేషాన నున్న కుమారుపోలె
విజయలక్ష్మి వరించిన విజయుపోలె వచ్చుచుండె వీరాగ్రణి వాజి నెక్కి. 158

ఉ. నాలుగుకాళ్ళ కందుక మనం బయిలేచి స్ఫురన్మరుత్తరం
గాలను నీఁదులాడు క్రియఁ గాయము చక్కనఁ జాఁచి జూలు నా
ట్యాల నొనర్పఁ గర్ణములఁ డప్పన వెన్కకు మోడ్చి చామర
శ్రీలను దేలు వాలము విచేష్టత నిల్వ సఫేన వక్త్రమై. 159

ఉ. గాలిని దేలు ధూళి నడుకాలికి నంటఁగనీక వాయువే
గాలను మించి కుక్ష్యధరకాయము భూస్థలి నంట సాగు పా
దాల చకాపకల్ వరుస తాళమువేయ జరీబుటాల ము
ఖ్మాలు కడానిజీని, నవకమ్ముల జుమ్మను సుస్వరాళికిన్. 160

ఉ. సూటిగ బాణమెట్లటులు చూచుచునుండఁగవచ్చె నశ్వ మ
చ్చోటికి దానిపై నలరు శూరుని వ్రేల్ గిరజాలు బాగుగా
దీటిన కోరమీసములఁ దీవ్రతఁ దాడినొనర్ప గాలి బా
హాటముగాఁ జలించు జరియంచుల యంబరమీనెఁ జంచలల్. 161

మ. గుడవర్ణంబుల నూనె నిగ్గులవి యల్గుల్వాలుమై నిండ నా
ల్గడుగుల్ ఫాలము పాలమీఁగడల ఛాయల్ పుక్కిలింపన్ వడిన్

గడుఁ బొంకమ్మగు కందరమ్ములను జక్కం జెక్కు శిల్పమ్ములోఁ
బడెఁ బ్రాణమ్మన నొప్పు లక్షణయుతాశ్వం బందు వచ్చెన్ వడిన్. 162

చ. మెఱికలవంటి సైనికులమేయ బలాఢ్యులు సర్వ రంగసం
గరగతి నుక్కుఁ బీములయి కాకలుదీరిన శూరు లొక్కనూ
ర్గురు పెను జాగిలమ్ములగు నశ్వములం గటిబద్ధ ఖడ్గభా
స్కరులయి సైన్యనాథు వెనుకం జనుదెంచి రటన్ హుటాహుటిన్. 163

తే. వారి వెన్కఁ జీమలబారువోలె శస్త్రపాణులౌ యోధుల సముదయమ్ము
పరువులిడు ఘోటకమ్ములపై వసించి యేగుదెంచె నుపొంగు వాహిని యనంగ. 164

ఉ. అత్తఱిఁ గన్నడీల కెదురై యరుదెంచిన వీరుఁడున్ శివ
మ్మెత్తిన రుద్రరూపమన నేపు దలిర్పఁ బరాక్రమించి తా
నిత్తెఱఁగాడె దర్పిత మదేభనికాయ శిరోవినిర్గళ
చ్చిత్త మెలర్ప గర్జనముసేయు మృగేంద్ర విభీషణార్భటిన్. 165

ఉ. కన్నడులార ! మీ రిటులు కావ్యవధూమణినిన్ హరింపఁగాఁ
జన్నె ? మలీమ్లుచుల్ నెఱపు చైదము లియ్యవి శూరలోక మా
త్రోన్నతి కెగ్గొనర్చు కృతు లొప్పునె మెప్పగు రావుసింగభూ
భృన్నయపాలనమ్మెపుడు వీని సహింప దొకింత యేనియున్. 166

ఉ. భాగవతమ్ము సింగమనృపాలక రాజ్యరమా కళాలయో
పాగత దివ్యదీపము, విపక్షపతంగవితాన మామిష
శ్రీగఁ దలంచి పొంచి ధృతిఁజేకొని పోవఁగడంగె మిత్తికిన్
స్వాగతమిద్దియంచుఁ దమ స్వాంతములం దలపోయ రింతకున్. 167

చ. ఎదు రెవ రుందురంచు నెద నెంచి మదించి యిటేగుదెంచి యి
మ్మొదవును బోలు సత్కవిని మోఱకులై బెదరించి సత్కృతిన్
ముదమునఁ గొంచు నేగెదవు ముందడుగైనఁ గదల్పలేవు వి
న్నదుమఁగవచ్చు మామకఖరాసికి నుత్తర మీయకుండఁగన్. 168

సీ. వల్మీకనిర్యాత వర భుజంగార్భటిన్ గనుబుస్సు లాడెడి యసిని గనెదొ
జలధర నిర్ముక్త సౌదామినీ నాట్యగరిమ నాటాడెడి కత్తి నెంతొ
జలధి వినిర్గతోజ్జ్వల హలాహలకృతపోత్రతమై యాడెడి హేతిఁ జూతొ
అపగత ధూమహోమాగ్ని హోత్రజ్వాల పోలిక వెగయు విప్పాలుఁ దలఁతొ

తే. ఆజి నారవీడి వీరవిహారగతులఁ గట్టి పట్టి నిన్ ధరఁ గూల్చి కాల్చిపెట్టి
మధుసుధాభాండ సన్మణి మౌక్తికముల వడువు గొనిచను శ్రీభాగవత సుకృతిని. 169

ఉ. బెట్టిదులైన కన్నడి గభీషణవైరుల శీర్షపంక్తులన్
గొట్టెద నారికేళ ఫలకోటిగ, గుండెలఁ జెండి పూలుగాఁ
బెట్టెదఁ బ్రేవులం బెటికి వీథులఁ దోరణపాళి వ్రేలఁగాఁ
గట్టెద నాంధ్రవీరరమకై రతనాల నివాళిఁ బట్టెదన్. 170

చ. పిడుగులు గూలినట్టు లరిభీకరుఁడై వడగల్లు రాలి న
ట్లడరి తెలుంగువీరుఁ డిటులాడెడి భీషణఘోషణమ్ములన్
గడగడలాడె నందుఁగల కన్నడ సైన్యము లాంధ్ర సద్భటుల్
విడివడి దీవి జుట్టుకొను విస్తృతవాహినులయ్యె నల్దెసల్. 171

క. దుమ్మెగయఁ బోరు తనువులు గ్రమ్మెడి పొగలోన రగులు కాష్ఠమ్ములుగాఁ
జెమ్మటలు తైలములుగాఁ జిమ్మెడికీలాల మగ్నిశిఖలై తేలన్. 172

వ. యుద్ధాగ్ని రగులునంత నప్పట్ల, 173

చ. పొగరొలయంగ నిట్లుడుకుఁబోతుతనమ్మున నెంచి యెంచమిఁ
దెగ సురకాయలన్ నఱకుదే యిటు మాటలకోట లేటికిన్
మగఁటిమి గల్గినఁ బిలుకుమార్పు మెదిర్చిన వైరివీరు లం
దగ ననుచున్ దెలుంగులను దాఁకిరి కన్నడ వీరసైనికుల్. 174

ఉ. ఈ విధి సాంపరాయక విహింసకవృత్తిఁ జమూద్వయంబులో
జీవమువాసి శీర్షములు చిట్లి గళమ్ములు త్రెస్సి కుక్షిలోఁ
బ్రేవులు ప్రోవులై వెలికివ్రేలఁ గరమ్ములు వ్రీల రక్తవి,
సావముసం గళేబరము జొమ్మలివాలఁ బరాక్రమించుచోన్. 175

సీ. సామొప్ప నడిదముల్ శంపాలతలుగాఁగ నెగయు పరాగముల్ మొగిలుగాఁగ
వీరాట్టహాస విభీషణారావముల్ పర్జన్యగర్జాప్తిఁ బరిఢవిల్ల
వడిఁజిమ్ము నెత్తురుల్ వర్షధారలుగాఁగఁ గఱకుటమ్ములు వడగల్లుగాఁగ
వఱదలై వాహినుల్ పరువులెత్తుచునుండ మార్కులై శత్రులు మహినిఁగూల
తే. కనడిగులతోడఁ దలపడి తెనుఁగు వీరు లాహవము సేయుటం బ్రావృడాగమనపుఁ
దరుణమేపారె నరిగ్రీష్మతాప మెడలెఁ దెనుఁగు భువి భాగవతలక్ష్మి దీప్తినొందె. 176

మ. వరవీరార్క కరోగ్ర ఖడ్గకిరణ వ్రాతాహతారాత్యుడు
స్ఫురణం జొప్పడు సంగరాంగణ నభశ్శోభా ప్రభాతమ్ములో
నరసందోహ ముఖారవిందములు నానందాబ్ధి నోలాడుచున్
విరిసెన్ నూతన జీవనాన్వితములై వేమాఱు దర్శించుచుఁ. 177

క. వసుధ జయలక్ష్మి తెల్గుల వసమగుటయుఁ గనడ వీరవర్యు లసూయఁ
బసమించు రంభఁ గలయఁగ నసిధారాపథము లంటి యరిగిరి దివికిఁ. 178

క. వైరిగణమాజి నీ గతి నేరాళము సమయఁదమక మెనక మెనఁగమున్
దారుచుఁ జంచు చరణహతి వారల పొలసులను దినుచు వరలె ఖగమ్ముల్. 179

క. హతశేషులు తుక్ఖార ప్రతతింబడి చెట్టుకొకరు పరువెత్తిరహో
బ్రతికిన బలుసాకులు దిని క్షితి మసలఁగవచ్చు ననుచుఁ జింతిలి వంతన్. 180

క. శ్రమ యనక తెల్గు వీరులు భ్రమియించు పరఘూసముత్కరముఁదోలి కరం
డముఁ దెచ్చు కరణి వైరుల సమయింపఁగఁజేసి కృతిని సాధించివడిన్. 181

తే. విజయలక్ష్మి వరించిన వేడ్కసొబగు వికచముఖ పంకజమ్ములం బ్రకటపడఁగఁ
గత్తలాని కూటువలెక్క, కవివరుండు బరఁగు భూధరమార్గమ్ము బట్టిరాఁగ. 182

ఉ. ఎవ్వరు వీరు క్రమ్మఱనిదేటి మహాప్రళయ మ్మటంచుఁ బె
న్నివ్వెఱపాటు గ్రిందుకొన నిల్చె జన, మ్మరుదెంచినట్టి యా
క్రొవ్వడి కాఁడునున్ సుకవి కుంజరు లీ నగమందు నుందురే
క్రొవ్విన వైరిఁగూల్చి కృతిఁగొం చరుదెంతుననెన్ జనుల్ వినన్. 183

ఉ. నవ్వుమొగాల వారు "కవినాథుఁడు తాను వసించునిందె మా
నెవ్వగఁబాపి మాదు కృతినింగొని తెచ్చిన మీ ఋణమ్ము మే
మెవ్విధి నీఁగువారమొకొ యెంతొ కృతజ్ఞుల"మంచుఁ బల్కుటల్
మవ్వపు వారువమ్ము క్షణమాత్రము భూస్థలి నాఁగకుండుటల్. 184

ఉ. కళ్ళెములాగి యశ్వము నెకాయకినాఁపి చలించు రెండు నం
కోళ్లనుదన్ని లాఘవము నూల్కొని దిగ్గనడిగ్గి ప్రేమమై
వేళ్ళఁజెలంగు కళ్యమును వీఁపునవైచి స్పృశించి దువ్వుచోఁ
గాళ్ళ వెలుంగు పావలొడికమ్ముగ సాహిణియాడెచ్చె నయ్యెడన్. 185

తే. దళపతియుబేగి కవినాథు దరికివచ్చి మ్రొక్కి ప్రక్కనాసీనుఁడై ముదము మీఱఁ
గనడిగుల గెల్చి కృతిని గైకొనిన వితమునంత వివరించి కవిఁగని యనియెనిట్లు. 186

చ. ప్రణిధి ముఖమ్మునందెలిసె భాగవతమ్మును మీరు కన్నదేం
ద్రునకుఁ గృతిన్ సమర్పణమునన్ సలుపం జనుచుంటిరంచు మా
మనుజపతిం గవీంద్రు లవమానము సేయుట పాడియౌనె త
ద్ధనకనకాది వస్తువులు తక్కువయుండునె మీకు మాకడన్. 187

ఉ. ఒప్పియు మీర లియ్యకొనకుండుట లిప్పుడ తెల్లమయ్యె నా
మెప్పె మిమున్ దృణీకరణముం బొనరించెను గ్రంథ చౌర్యమే
మెప్పగు కర్జమంచుఁ, దొలి మీరలె మా నరపాలు నానతిన్
దప్పక యందు వచ్చునెడఁ దద్విధమేమని విన్నవించెదన్. 188

సీ. ఇంద్రగోపుర కాంతులీను రాంకవముల మనసైన హోంబట్టు మంజిడులను
బహుళార్థయుతములౌ బన్నసరమ్ముల నవరత్నఖచిత స్వర్ణవలయములఁ
దృణకాష్ఠ జలవృద్ధి నొనగూడు నగ్రహారాదులఁగల ధౌత హర్మ్యములను
గదను ద్రొక్కెడి జాతికత్తలాణమ్ములఁ బగటి దివ్వటులొప్పు పల్లకీల
తే. విరియువాలవ్య జనపాళిఁ బరిజనముల ముమ్మరమ్ముగానిడి కవి ముఖ్యుఁజేసి
స్వర్ణపుష్పాలఁ బూజించి క్ష్మాధవుండు జాతిరత్నాలఁదుల తూఁచుఁ బ్రీతిఁజూచు. 189

చ. ఇపుడును మించిపోయిన దదేమియులేదు కవీంద్రచంద్ర! మీ
యపహృత కావ్యరాజము మహాదృతిఁ బ్రాణము లడ్డువెట్టి మా
నృపమణి గెల్చుకొంట లది నేరుగ వారికెచెందె దాని నో
విపులయశస్క! మీరు నృపు వీటికివచ్చి గ్రహింపఁగాఁదగున్. 190

చ. జనపతి యాజ్ఞలేక యిడఁజాలము తత్కృతి మేము మీకు సిం
గనృపతి సన్నిధానమునఁ గావ్యముగైకొను టొప్పు దానితో
ననుపమ గౌరవాదరము లంచిత సంపదలబ్బు మీకు నే
మనియెద రింగితజ్ఞులు మహాకవిశేఖరు లంచు వాకొనన్. 191

వ. అంత నప్పోతరా జాతనింగని యిట్లనియె, 192

సీ. ఎవ్వాని హృదయాబ్జ మే ప్రొద్దు విహరించుకలుముల పడఁతి యేకాంతగృహము
ఎవ్వాని సన్నిధి నీ రత్నగర్భతా ఫణిశయ్యఁ దలదాఁచుకొనిన లిబ్బి
ఎవని నాభిపయోజ భవనమ్మునన్ వాణికుల ముద్ధరించెడి కోడలమ్మ
ఎవని సంసారాన శివ సర్వమంగళ యొడిఁజాపుకొను నాడపడుచు తాను
తే. మాయ యెవనిద్వారమ్ము మున్ మను యవనికగంగ యెవ్వానిదగు కాళ్ళఁగడుగుమడుఁగు
సురలు నే ప్రొద్దులెవని కింకరులు తాము తాదృశుండగు హరి వేడఁ దక్కువేమి? 193

తే. ఉపనదీనదసంగతి నూటజెలఁగు మహిత సంస్కారసంగతి మాట వెలుఁగుఁ
దెలిసినంతలో మీ రిట్లు పలుకుటొప్పు నాకుఁదెలిసిన విధమునే నడచుటొప్పు. 194

తే. మధుప మంబుజసంగతిన్ మధువిమత్త చిత్తమున నిజధామంపుఁ జింత మఱచి
రజనిగని ముకుళించు నీరజమునందు జిక్కిమడియు వినిర్ముక్తి ఫక్కిగనక. 195

సీ. ఇల మృదంగమునకు నెడమయుఁ గుడియునా నిరుపక్కగతు లెప్పుడెఱుఁగు టొప్పు
బోనమ్ము నిచ్చలు భుజియించుఁ బలికింప ధనధన శబ్దాలఁ దనరి యెడమ
తఱుఁగని బోనమున్ దన పొట్టనిడుకొని ఓంకారటంకృతి నొప్పు కుడియొ
కుడిపైన ముక్కాలునడక శోభించును నెడమపై పావలా నడకతగును
తే, రాగపటగుప్త చర్మసూత్రము బిగించి శ్రుతిఁ జెడకయుంచి లయకాలగతిఁ జరించి
"తద్ధితరి"యంచు మ్రోగింపఁదగ రుచించుఁగాని యెడమ మ్రోఁగుచునున్నగతియె సున్న.

మ. తరణోపాయమటంచు భాగవత తత్త్వంబే నిటుల్ పాడితిన్
సరి తా నద్దిలభించె సార్థకము మజ్జన్మంబు నాపైన ని
ద్ధర నా భాగవతంబు వెల్గుత పరాస్తంబౌత నా కేమి ! యే
కరణిం జూచిన సర్వరక్షకుఁడు సాక్షాద్రాముఁ డే నెవ్వఁడన్ ? 197

మ. ధరణిన్ దారసుతాలయార్థ ఘనతా ద్రవ్యమ్ములన్ నమ్ముచున్
బరసౌఖ్యమ్ములె లేవటంచు మమతన్ బాధల్ వడున్ మూఢుఁ డె
క్కరణిన్ దాను స్తనంధయుండు జననీ స్తన్యమ్ములం గోరిలు చా
బరి వేరొండుపయోధర మ్మలరుటల్ భావమ్మునం గాంచఁడో. 198

సీ. బహుదినసంగమ్ము బలిపిపోయిన పుత్రిగుఱిచి యమ్మలికమ్ము మఱువమెందు
పుట్టిన యంతనే గిట్టు నిసుంగుకై వెతయంతగాఁ బీడ వెట్టదెందు
ఉండియుండి నిజాప్తుఁ డొక్కసారియె హఠాన్మరణ మొందఁగఁ గుంద పెరఁగు నందు
పలునాళు లా మయబాధితుండై బంధువరుగ నెంజిలి తీవ్రమగుచురాదు

తే. నాది నాదను భావమ్ము పాదుకొనిన కలన మమతానుబంధమ్ము కలఁతవెట్టు
కాదు కాదను భావమ్ము గలుపుచుంట సతతవైరాగ్య సిద్ధిచే వెతలడంగు. 199

ఉ. అందులకేను నాకుఁ గృతియందు వివృద్ధినిజెందు సంగ బు
ద్ధిం దునుమాడ నాత్మఁగడుఁ దీవ్రకృషిన్ బొనరింతు మిమ్ము నే
మందు విరాగభావ మొక మందయి శాంతిని గూర్చుఁగాక నా
డెందము నందువే దెలుపుఁడీ నరపాలున కీ యుదంతమున్ 200

తే. విశ్వకల్యాణ విజ్ఞాన వృష్టికొఱకుఁ గవులు సత్కావ్యలేఖన క్రతు నొనర్త్రు
విఘ్న ఝంఝానిలమ్ములు వీవకుండ నెపుడు సర్వేశ్వరుఁ డనుగ్రహించుఁగాక ! 201

తే. విజ్ఞుఁడయ్యును మాత్సర్య వివశుఁడగుచుఁ జేయు దుష్టకార్యము లన్నఁ జిత్రమేమి ?
మేఘ సంఛన్నగాఢత మిస్రమందుఁ గన్నులుండియు నంధుఁడై కానఁగాదె ! 202

వ. అని మరియు మా రాముఁ డాజ్ఞనిడ నిటులెవత్తునని సేనాని నంపి శిష్య సందోహము
నారసి యిట్లనియె. 203

తే. మహిత వేదనాదోదూయ మానలూన వృంత జలజమ్ము మామకస్వాంత మిపుడొ
నేల వ్రాలెను, జీవన శ్రీలఁజిల్కు మలయపవనమ్ము దీని మేల్కొలుపలేదు. 204

తే. రోఁత జనియించె షట్పదగీతికలను బాలవృడంబుద వృష్టిలోఁ బస నశించె
బాలభాస్కరకిరణ సంస్పర్శమింక నన్ను నవ్వింపఁగాఁజాల దెన్నటికిని. 205

తే. రాగరంజిత పారిజాత భోగములన నరుచిఁగొనె రామచంద్ర దివ్యాంఘ్రియుగళ
సన్నిధానంబె నా దగు పెన్నిధాన మితర విశ్వంబుతోఁ బనియేలనాకు ? 206

తే. బ్రతికి నన్నాళ్ళు మాత్సర్యభావమూని చచ్చు వెనుక పాయసభక్ష్య శ్రాద్ధ మొసఁగి
తామె మెసవి లోలోఁ దృప్తిఁ దనరుచుండి మొసలి కన్నీరు విడుచు నీ మూర్ఖజగతి. 207

తే. స్వార్థయుత విశ్వమలిన సంస్పర్శములకు మన్మనోదర్పణము గ్రుడ్డిమసక గ్రమ్మి
ప్రభుని సారూప్య ప్రతిబింబ భాసితముగ నెసఁగదిట నుండినను దూరమేగనిండు. 208

తే. ఈ ప్రయాణము తుదలేని దిందు స్వపథ విలసితోపాంతకాసార జలధిమునిఁగి
నవ్య వస్త్రధారణము నొనర్చి పేర్మిఁ దెచ్చుకొనినట్టి చద్దిని దిని చననగు. 209

తే. ఈ యనంత నీలాకాశ తోయనిధుల యుభయ పక్షాలఁ దరియించి ప్రభు విభూతి
నలరు నుత్తుంగ భర్మహర్మ్యాగ్ర శిఖరభాగముల వ్రాలి శాంతిగాఁ బ్రతుకనిండు. 210

తే. ఆ మహోన్నతస్థానమ్ము నధివసించి సూక్ష్మదృష్టితో నట నుండి చూచు నాకు
నద్రికూటంబె కలభ మట్లగపడునన మదగజంబొ పిపీలిక మాడ్కిఁ దోఁచు. 211

చ. అనుచు వచించి పోతనయు నద్దినమంద వసించి రేయి ని
ద్రను గను శిష్యసంతతిని దక్కజనమ్ములఁ గాంచి విఘ్నముం
బొనరుపకుండ లేచి రఘుమూర్తికి వందన మాచరించి యో
యినకులవల్లభా ! యనుచు నెంతయు నార్తివచించు నీ గతిన్. 212

ఉ. శ్రీరఘురాణ్మణీ ! భవదశేష కృపామహిమన్ మదీయ సం
సార ప్రబంధ గ్రంథి నొకసారి సడల్చి మమత్వ సత్వ వి
స్తార మడంచి జ్ఞానగురు చక్షువు నిచ్చి భవత్పదాబ్జశో
భారత భక్తిభావసుధ పానమొనర్పఁగ నీవె నిత్యమున్. 213

చ. అనుచు మహాకవీంద్రుఁ డపు డైహికభోగములెల్ల రోసి లోఁ
దనరు కళత్ర పుత్ర మమతల్ తగఁగోసి ప్రపంచ మోహమున్
వెనుకకుఁ ద్రోసి రామపద నీరజముల్ నుతిజేసి భక్తిమై
ఘనతర తీర్థయాత్రలను గాంచఁగనై తలపోసి యిట్లనున్. 214

శా. స్వామీ ! వేఱొక దిక్కు గాంచ నిఁక నా సర్వస్వమున్ నీవె నేఁ
గామాంధుండను గాన, నిన్ని దినముల్ కానంగలేనైతి నిన్
ధీమాంద్యంబున, జవ్వనంపు మదిరన్ దీపించు మైకమ్ముతా
నీమైఁ దోఁచు జరాభరాప్తి నెటకో యేగున్ ననున్ వీడుచున్. 215

తే. మానవీయ జీవన దినమార్గమధ్య గత తృతీయ యామమ ! వార్ధకమ ! తమిస్ర
మిశ్ర సంధ్యా ప్రదోషమా ! మిత్రవైరి ! స్వతను పూర్ణేందు కృష్ణపక్షమ ! నమోస్తు ! 216

చ. వనితల వ్రాలు చూపులకు వ్రాలుచుఁ గాళుల భ్రూవిలాస న
ర్తనలకు నాట్యమాడుచు స్మితస్ఫురదానన పద్మసద్మ బం

ధనమునఁ బ్రాణపంచక మదభ్రమరాళి బలిం బొనర్చు యౌ
వన మదిరాపరిమత్తతలు వ్యర్థగతిం దిగజాఱెనే తృటిన్. 217

ఉ. వేడుక వచ్చినాఁడఁ బృథివీతల యాత్రికుఁ గాంచుచుండఁగా
మూఁడవజాము మించెఁ దుదముట్టెను దెచ్చిన రొక్కమెల్ల నీ
నీడ యదేమొ కాని పుడమిం బొడువై నడయాడసాగెఁ దాఁ
గూడఁగఁ బోవునో తిమిరకూట నిగూఢ నిశిధ మాతృకన్. 218

చ. అరుసము తోడ భార్య యని యాత్మజులంచును నెన్ని యెన్నియో
బరువుల మోసిమోసి కడు వంగెను గ్రుంగెను మూఁపులున్ జరా
శరధి తరంగ భీకరవిసారమునన్ ముదుతల్ వడెన్ గళే
బరమున మృత్యుభోగ్యమయి పండెనుబోఁ దలకాయ యెల్లెడన్. 219

క. బిగి వీడిన నరముల వల తెగిపోయిన పంజరానఁ దేలు శుకంబై
యెగసి చనె నందమనునది గగన చలచ్చంచలానుకారిణి యగుచున్. 220

క. కటికకాలుఁడు సంసార గహ్వరమున వచ్చిపడిన జీవులకు యౌవన వనస్థ
జీవన గ్రాసములను నిశ్చింత మేపి పెంచుటలు కోఁత కనుచు భావించ రయయొ! 221

క. అనుచున్ బోతన యీగతిఁ దన మతిఁ దలపోసి శిష్యతతి నంతయు న
త్యనుపమ వాత్సల్యంబునఁ గనుగొని దీవించి యేగఁగా దొరకొనుచున్. 222

క. సూర్యోదయ పర్యంత మవార్యగతి న్నడచె సుకవి పదిక్రోశము, లా
చార్యుం డేఁడని శిష్యులు పర్యటన మొనర్చి వెదకి పడయ రెచటనున్. 223

క. పోతన యాతన లనకయె చేతమ్మున హరిపదాబ్జ చింతనమెదుగన్
నూతన సత్వమ్మొప్పఁగఁ బ్రాఁతిన్ జనపదము లూళ్ళు బాటలు దాఁటున్. 224

సీ. శీతలచ్ఛాయా పరీతకాననరాజి గోవింద వాత్సల్యగుణము నరసి
మధురతోయాపూర మహిత నిర్ఝరపాళి శార్ఙ్గి సత్కరుణ రసము గ్రహించి
కందమూలఫలాది ఖాద్యవస్తూత్పత్తి హరి జగద్రక్షణ బిరుదు దలఁచి
వరణీయ మలయ పవన సుఖస్పర్శల విష్ణుకల్యాణ కృద్వృత్తి మెఱిఁగి

తే. లలిత ఘూసార్ద్ర పులినశయ్యలఁ బరుండి బాలగోపాలు సుకుమార భావమెంచి
శకునశ్రుతి సుఖావహకలస్వనము వినుచు సామగానలోలుని గానసరణిఁ దెలిసి, 225

తే. మేఘరూపమ్ములన్ హరి మేను దలఁచి చంచలలకాంతులన్ శార్ఙ్గి చక్రమరసి
గర్జలన్ శంఖ నిస్వానగతుల నెంచి చేతమున నిట్లు దలఁచు నప్పోతనకవి. 226

సీ. ఎవనికై సింగిణి నవరత్నఖచిత సుస్వాగతద్వారమై చదల వెల్గు
ఎండి నీర్ నీరని గుండె వ్రియ్యు తటాక మెవ డప్పులిడ నింత యెగసియాడు

ఎవనికి దివి సాగు నేకాధిపత్యమ్ము సూర్యచంద్రులు తేరి చూడలేరు
ఎవ్వాని కలయిక నెలమి భూదేవికిఁ బులకలై సస్యంపు మొలక లెదుగు

తే. ధర కెవఁడు జీవనములెల్ల ధారవోసి వర మొసఁగి తిరోహితుఁడగు హరి యనఁ జను
నట్టి ఘనుఁడు ఘనాఖ్యతో నలరఁదేల వానిపై నగ్రిపీఠి కన్పైవదేల? 227

తే. పూలఁ గలసిన తేనెయైపోవు నద్రిరాలఁ గలసిన నశనియై రాలునేల
పుష్పగర్భాసవమొ వజ్రపుంఖితమ్మొ ఘనహృదయ మర్మమిది యనఁగల రెవరిల? 228

సీ. ఆకాశ వనధి నా యమృతాంబు ధరముల ప్రక్క నీ యశనిపాతమ్ము లేల
విశ్వసౌధమ్ములో వెలుఁగీను రవి ప్రక్క ఘోరమౌ నిబిడాంధకారమేల
జలధిగర్భమ్ములో విలువైన రతనాల సరస జలగ్రాహచయ మదేల
నలుదిశల్ వీచెడి మలయమారుతముతోఁ బ్రళయ ప్రభంజనపటలి యేల

తే. సురభిళ మరంద రసపూర్ణ సుమలతాళి ప్రక్క విసమొల్కు నలతాచుపాములేల
మధుర జీవన స్వర్గసంపదల తుదల నిరత భీకర మరణంపు నిరయమేల, 229

తే. గాలి యూయెలయగు తీవె కాఁపురమిడి పరిమళములీను మధురసపాన మొసఁగి
యాప్తమిత్రదర్శనగతి హర్షపఱచి పూలబాలను బడఁగూల్చనేల స్వామి! 230

తే. మట్టి నంతయు జతగూర్చి మనసుఁ జేర్చి ప్రేమతో నిల్పుకొనిన యీ పిట్టగూండ్లఁ
బొందికగఁ గట్టికొనిన యీ బొమ్మరిండ్లఁ గాలఁదన్ని కూల్చెడి శిశులీల లేల? 231

సీ. పొలుపైన మువ్వన్నె పులికళాసమ్ములోఁ గ్రౌర్య సామ్రాజ్యంపుఁ గాఁపురంబె
ఆకలము గ్రసించు హరిణ తపస్వి యీ పులిమన్నియకుఁ గూర్మి భోజనంబె
అలరు దండను బోలె నలరు సర్పము నోటఁ గాలకూటవిషంపుఁ జాలనంబె
పలు వన్నియల నీను చెలువంపురాశి మయూరమ్మునకు సర్పపారణంబె

తే. ప్రకట సుఖదుఃఖమయతను బరఁగుచున్న ద్వంద్వవిధ సృష్టిరచన కాంతర్యమేమి
పాత్ర తెరనేటు తెరచాటు పాడి యాడు నాఁటి వెల్గుల చీఁకట్ల నాటకంబె, 232

వ. అనుచు నిజమనఃపద్మంబున రక్తనళినదళ విశాలనేత్రు నీలజీమూత మనోహరగాత్రు మణిముకురమంజుతరకపోలుఁ బోద్యదర్ధేందు సుందరనిటాలు గురుతమో విదారక సురుచిరదరహాసుఁ బ్రణతార్తి హరశీలదయార్ద్రవిలాసు దురితనిశాట మదగజ హర్యక్షు రమాకాంతా సమాక్రాంత పీన విశాలవక్షు మౌనిజన మనోహారు మణిమయాభరణ శరీరుఁ గనన్నిషంగు విజితానంగు వైభవవిజిత మహేంద్రు వైదేహీపతి శ్రీరామచంద్రుఁ దలంచుచు మార్గాయాసంబులకుఁ జలింపక యేళ్ళు దాఁటి యూళ్ళు గడచి పట్టణంబులఁ గాంచి పర్వతంబులఁ జరించి పుణ్యనదీ నదంబులం దోఁగి గణ్య క్షేత్రతలంబుల నాఁగి యోగిజనంబుల దర్శించి వారి వాగమృతపానంబులకు హర్షించి

దారిమధ్యం జిక్కు ఫలంబులం గుడుచుచు జలంబులం ద్రావుచుం గష్టసుఖంబుల
గణింపక నష్టమోహుండై గ్రామైకరాత్రంబుగాఁ జని చని, 233

సీ. ఊర్ధ్వ విష్టప సప్తకోపరిఁ జెల్వారు వైకుంఠభవన నివాసుఁడనఁగ
వరశేష ఫణితను వలయ సప్తకముపై వసియించు శ్రీశ్రీనివాసుఁ డనఁగ
సప్త జన్మార్జిత సత్పుణ్యధనరాశి వెలమాఁగు పరలోక ఫలమనంగ
తను సమంచిత సప్తధాత్వతీత నిజాంతరాత్మ శోభిలు పరమాత్మయనఁగ

తే. ఏడుకొండలపై నిల్చి యెల్లజనుల కభయదానమ్మొసంగు శ్రీ హస్తముద్రఁ
దాల్చి భక్తమనోభీష్టదాయియైన వడ్డికాసుల వేంకటరెడ్డిఁగాంచి. 234

వ. ఇట్లభివర్ణించం దొడంగె. 235

ఉ. పాదయుగంబు కల్పతరు పల్లవ పుష్పకృతంబు; స్వచ్ఛగం
గోదక సన్మరంద కృతయోగి జనేక్షణ భృంగసమ్మదో
త్పాదకరంబు, నిత్యనిజభక్త మహోగ్రభవాబ్ధి తారక
శ్రీ దవహిత్రయుగ్మ మనఁ జెల్వమరున్ ధర వేంకటేశ్వరా ! 236

మ. హరి నీలాభమృదూదరావని గభీరావర్త నాభి హ్రదాం
తర సంజాత మనోహరాబ్జ సుఖసద్మం బందు వాగ్భర్త బం
భరమై వేదమరంద పానరతి నున్మత్తుండునై సేయు సు
స్వర సామశ్రుతిఁ దృప్తిగాంతువె పరేశా ! వేంకటాద్రి ప్రభో ! 237

ఉ. కౌస్తుభరత్నచంద్ర సువికాసకమై సరసప్రపూర్ణమై
నిస్తులహీర మౌక్తిక వినిర్మిత నిర్మలహారపూరమై
శస్తనవాంబు దద్యుతివిసారి భవద్గురు వక్షపీఠిఁ దా
విస్తృతివెల్గ నబ్ధియని పీడదు నిన్ రమ వేంకటేశ్వరా ! 238

చ. అతులిత రామణీయక మహార్ణవమందునఁ బుట్టి రత్నసం
తతులను జుట్టి లక్ష్మికయి దండల నండఁగనుండి వేద సం
గతిఁగొను నీ గళంబు వరకంబువుకే సతతంబు సద్గుణ
ప్రతతులఁ జెప్పుచున్ బ్రణవపాఠము నేర్పదె వేంకటేశ్వరా ! 239

ఉ. శ్రీప ! స్వభక్త షట్పద సుసేవ్య భవద్వదనారవింద సం
దీపిత మంజులాధరము నిస్తుల భోగరమానురాగ ని
క్షేపము దంతపంక్తులు విశిష్ట శుచిస్మితి కుందకుట్మలా
క్షేపకకాంతి నాశ్రితుల సిల్గుటిరుల్ దునుమున్ రమాధవా ! 240

ఉ. భాసుర భ్రూయుగమ్ము సుమబాణుని దివ్య శరాసనమ్ముగా
నాసికయుం దరస్మితము నాట్యదపాంగము లయ్యనంగ బా

జాసన ముక్తచంపక సుహారకృతార్జున మల్లికాంబుజ
ప్రాసములై జగన్నయనపర్వములై మనె వేంకటేశ్వరా ! 241

ఉ. నీటగు పద్మరాగ హరినీల హరిన్మణిహీ రతారసత్
కూట మహోజ్జ్వలార్ఘ్య మణి గుంఫితమై పదియాఱు వన్నెమేల్
హాటక రత్నదీప్తిఁ దనరారు కిరీటము ప్రాఙ్నగాగ్ర స
ద్వాటిఁ జనించు భాస్కరుని భాతి వెలుంగెడి వేంకటేశ్వరా ! 242

తే. ధన్యమయ్యెను మజ్జన్మ తావకీన దర్శనమ్మున శేషకు ధరనివాస !
క్షితిని మత్కృత శ్రీ భాగవత పురాణమునకు ఫలము నీ దర్శనమ్మనుచు మ్రొక్కి. 243

చ. సురుచిర దృక్సరోజముల సూనశరుం బ్రసవించు మించు శ్రీ
హరి యగు శ్రీనివాసుఁ బ్రణయామృత పూర్ణమనస్సరోవర
స్ఫురిత తరంగడోలికల పొంపుగఁ దూఁగెడి రాజహంసి న
ద్దరి నలమేలుమంగ నొగి దర్శనముం బొనరించి యావటన్. 244

వ. కరిగిరి కరిగి వపాపరిమళోల్లాస వాసితాధరపల్లవుం డగు వరదరాజవల్లభుం గని, 245

ఉ. పాయని మాయవోలెఁ దన పట్టు సడల్చగనీక నక్ర మా
ప్యాయగతిన్ మదద్విరదపాద మభేద్యత సంగ్రహింప నీ
సాయముఁగోరి వేడ నది సత్వరముక్తి నొసంగితీవు నిన్
బాయఁగలేని భక్తిఁ దలపైనిడి హస్తినగేంద్ర మయ్యెఁగా. 246

ఉ. హస్తిగిరీంద్ర ! నేను కరియట్టులె సంసృతి సాగరమ్మునన్
నిస్తుల మోహదాహమున నీచమమత్వ జలగ్రహగ్రస
న్మస్తకయుక్తి జ్ఞానలవమాత్ర విహీనుఁడనై చరింతునే
హస్త యుగమ్మునెత్తి బహుళార్తిని వేడుదు శ్రీ మనోహరా ! 247

ఉ. సుందరరూప ! నీదు పదశోభలఁ ద్రావెడి కంటిపాప లిం
కెందఱదేమి చెప్పినను నెందును గాంచవు తల్లి చన్నులన్
విందులుగోరు పాప లవి వీడుమటన్నను నేడ్వకుండఁగా
నుందురె ? తావకాంఘ్రి విడనొప్పదు నా మనమెప్పుడుం హరీ ! 248

చ. ఉదరదయామృతోదధి మహోర్మికలై వఱలొప్ప వానిపై
ముదముగఁ దారహారముల ముద్దగు నుర్వులు పర్వులెత్త సొం
పుదనరు సుళ్ళరూపమరు పొక్కిలితో నయనాబ్జ జీవన
ప్రదమయియుంట దాని నెడఁబాయవు దృక్కులు దేవరాడ్వరా ! 249

శా. సౌందర్యార్ణవ దుగ్ధముం స్మరసుమాస్త్ర వ్రాతముల్ బిట్టు నా
నందో బ్రహ్మయటన్న నాదమొల్లయన్ దర్శిచ్చన్ భవద్రూప పా

జాసన ముక్తచంపక సుహారకృతార్జున మల్లికాంబుజ
ప్రాసములై జగన్నయనపర్వములై మనె వేంకటేశ్వరా ! 241

ఉ. నీటగు పద్మరాగ హరినీల హిరణ్మణిహీ రతారసత్
కూట మహోజ్జ్వలార్ఘ్య మణి గుంఫితమై పదియాఱు వన్నెమేల్
హాటక రత్నదీప్తిఁ దనరారు కిరీటము ప్రాఙ్నగాగ్రస
ద్వాటిఁ జనించు భాస్కరుని భాతి వెలుంగెడి వేంకటేశ్వరా ! 242

తే. ధన్యమయ్యెను మజ్జన్మ తావకీన దర్శనమ్మున శేషకుధరనివాస !
క్షితిని మత్కృత శ్రీ భాగవత పురాణమునకు ఫలము నీ దర్శనమ్మనుచు మ్రొక్కి. 243

చ. సురుచిర దృక్సరోజముల సూనశరుఁ బ్రసవించు మించు శ్రీ
హరి యగు శ్రీనివాసుఁ బ్రణయామృత పూర్ణమనస్సరోవర
స్ఫురిత తరంగడోలికల సొంపుగఁ దూఁగెడి రాజహంసి న
ద్దరి నలమేలుమంగ నొగి దర్శనముం బొనరించి యావటన్. 244

వ. కరిగిరి కరిగి వపాపరిమళోల్లాస వాసితాధరపల్లవుం డగు వరదరాజవల్లభుం గని, 245

ఉ. పాయని మాయవోలెఁ దన పట్టు సడల్చగనీక నక్ర మా
ప్యాయగతిన్ మదద్విరదపాద మభేద్యత సంగ్రహింప నీ
సాయముఁగోరి వేడ నది సత్వరముక్తి నొసంగితీవు నిన్
బాయఁగలేని భక్తిఁ దలపై నిడి హస్తినగేంద్ర మయ్యెఁగా. 246

ఉ. హస్తిగిరీంద్ర ! నేను కరియట్లులె సంసృతి సాగరమ్మునన్
నిస్తుల మోహదాహమున నీచమమత్వ జలగ్రహగ్రస
న్మస్తకయుక్తి జ్ఞానలవమాత్ర విహీనుఁడనై చరింతునే
హస్త యుగమ్మునెత్తి బహుళార్తిని వేడుదు శ్రీ మనోహరా ! 247

ఉ. సుందరరూప ! నీదు పదశోభలఁ ద్రావెడి కంటిపాప లిం
కెందఱుదేమి చెప్పినను నెందును గాంచవు తల్లి చన్నులన్
విందులుగ్రోలు పాప లవి వీడుమటన్నను నేడ్వకుండఁగా
నుందురె ? తావకాంఘ్రి విడనొప్పదు నా మనమెప్పుడుఁ హరీ ! 248

చ. ఉదరదయామృతోదధి మహోర్మికలై వళులొప్ప వానిపై
ముదముగఁ దారహారముల ముద్దగు నుర్వులు పర్వులెత్త సొం
పుదనరు సుళ్ళరూపమరు పొక్కిలితో నయనాబ్జ జీవన
ప్రదమయియుంట దాని నెడఁబాయవు దృక్కులు దేవరాడ్వరా ! 249

శా. సౌందర్యార్ణవ దుగ్ధముఁ స్మరసుమాస్త్ర వ్రాతముల్ బిట్టు నా
నందో బ్రహ్మయటన్న నాదమ్ములయన్ ద్రిచ్చన్ భవద్రూప పా

శా. శ్రీరాజిల్లులసద్భుజాంతరతటిన్ జెల్వారు శ్రీ కౌస్తుభా
కారంబుల్ గనఁ బూర్వశైలతట సాక్షాదుద్భూత బాలార్క శో
భారక్తిం గలిగించు దాసనయనాబ్జ శ్రీ వికాస ప్రభా
పూరంబుల్ ప్రవహింప నాదు కయిమోడ్పుల్ రంగనాథ ప్రభో! 258

తే. అద్ది శ్రీవత్సచిహ్నమో యాశ్రిత జనదోష భోగ్యతాచిహ్న విభూషణంబొ,
వైజయంతియో యది రమావారిజాక్షి సుందరాపాంగ కాంతియొ సూరివినుత! 259

చ. తిలకమదమ్ము కొంజెమరు తేమ నొకించుకజాఱ దానితో
నలికమునందు ముంగురులు నట్టిటు దాఁగురుమూఁతలాడఁ గుం
డల మణికాంతిగండముల నాట్య మొనర్చుచు సుస్మితద్యుతిన్
వలపులఁగూడఁ గన్దొవ కృపారసవారిధి నీఁదులాడెడిన్. 260

తే. పైఁడికొండ కూర్మి ప్రసవించు హరినీలమణి యనంగ స్వర్ణమకుట మందు
సొగసు లీను నీదు సుందరవదనారవింద మెపుడు కనుల విందొనర్చు. 261

ఉ. తావక దివ్యమంగళ సుధామయ విగ్రహ దర్శనమ్మునన్
బావనమయ్యె జన్మ భవబంధము లూడె మహాఘవార్ధికిన్
నావ లభించె ఘోరమగు నారకబాధ నశించె ముక్తికిన్
ద్రోవజనించె నిన్ను గనుదొన్నెల రెప్పలవిప్పి త్రావెదన్. 262

శా. చక్షుశ్శ్రోత్రవిభుండు తావకవపు స్సౌందర్య సారామృతం
బక్షీణంబగు కాంక్షహెచ్చ ద్విసహస్రాక్షి ప్రభాలోకనన్
నిక్షేపంబటు గ్రోలి తృప్తిదనరన్ నేనంచు నే మోములన్
వీక్షింపన్ జనుదెంచు భక్తజనులన్ వే రీతు లూరించెడిన్. 263

తే. తమ్ముఁడై పుట్టి నీ సేవదప్పఁ డితని నన్నుగాఁ జేసికొనిన నీ యండ విడఁడు
జన్మజన్మల నీ పరిచర్యసలిపి యతిపతిగ నీతఁ డిలఁజాటు మతమె మతము. 264

వ. అని యచటు విడిచి రామానుజ జగద్గురు పీఠాసీనుండగు నుభయ వేదాంత విద్యానిధియుఁ బరమ ప్రసన్నుండును నగు నొక్క యతిపతి నాశ్రయించి తాపపుండ్ర నామ మంత్రయాగాది పంచసంస్కారముల వడసి విశిష్టాద్వైతమతనిష్ఠాగరిష్ఠుండై భగవద్రామానుజముని ప్రభావంబు నంతరంగంబునఁ జింత సేసి శ్రీరంగరాజ సన్నిధానంబు వీడి పెన్నిధానంబు వోల్కి భూతపురి వెలయు భాష్యకార దివ్యమంగళాకార సందర్శనం బొనర్చి యాపాదాగ్రము సేవించి భావించి యత్యంత భక్తియుక్తుండై యిట్లనియె. 265

సీ. కాంతిమతీ గర్భకమలజుం డగుటనో కాంతి మతిం గల్గి కడలవెల్గె
మూకముక్తి నొసంగు మునియౌటఁ బ్రాణుల మూఁకల కెల్లను మోక్షమిడెను

భూతపురీశుఁడై పొల్చుటో నృపసుతా భూతమున్ విడిపించి పూతఁ జేసె
అల యనంతాశమై యలరుటో హరిసేవ నలయ నంతటి శక్తి నలవఱిచెను

తే. ఉభయ జిహ్వాల శేషుఁడై యుండుటేమొ యుభయ వేదాంతములను సముద్ధరించె,
తిరిగి రామానుజాయనా దరి కనుటలొ మహిని "రామానుజాయ నమః" యనఁబడె. 266

శా. ఆర్యా! మీరలు దోషభోగ్యులని నే నాలించితిం గాని మీ
భార్యం దప్పులు మూఁడు గాంచియె యెడంబాయంగ న్యాయంబె మీ
కార్యం బీ యిల సర్వభూతచయ మోక్షప్రాప్తియౌటల్ సతీ
చర్యల్ జన్మఫలప్రదంబు లగుటల్ శంకించి పొమ్మంటిరో! 267

ఉ. దేవర పాదసాక్షి యెటఁ దెల్పను మీరిడు మంత్రరత్న మా
త్రావన! యంచు నిచ్చకములాడి గురుం డిడుపెన్ రహస్య మా
శ్రీవరు గోపురాగ్రమునఁ జేరి సితోపలమట్లు బంచ వే
పోవునె రెండు నాలుకల పూర్వపు పోకడలో యనంతుఁడా! 268

తే. హరియు ధరణియుఁ దమతమ బరువులన్నియును భరింప శేషుఁడ వీవె యని తల నిడ
నిహ పరమ్ముల పేరట నెసఁగునట్టి ద్వయవిభూతుల మీ దొరతనము వెల్గె. 269

ఉ. జాయను వీడి శ్రీధరుని సన్నిధి నేమరకుండ దాస్యముఁ
జేయఁగ దీక్ష, వల్కల సుచేలము దాలిచి మౌనివృత్తినిం
బాయకయుండు లక్ష్మణుని పద్ధతి మీనడ నుంట మీరువా
రే, యని భూజను ల్బిలిచిరే మిము రామసహోదరాఖ్యచే. 270

సీ. బహుధాన్య ముఖచయ భంగమ్ము నొనరింప ముసలియై మఱియెనే మునివరుండు
ప్రబల మాయావాది పరవీర శిరములు నాగేలి చేఁతల లాగె నెవఁడు
అల యాదవ ప్రకాశార్య శిష్యుండగు గోవిందు నన్నయు గురు వెవండు
దోష భోగ్యత్వ నిర్దుష్టతం దెల్ప దుర్యోధనాదుల పక్షమూనె నెవఁడు

తే. అట్టి యతిపతి బలరాము నపరరూప మనిన నిర్వివాదాంశమై యలర దెట్లు,
ఆరయఁగా జగద్గురువు రామానుజుండె హరి జగద్గురు వగుట రామానుజతనె. 271

తే. శేషరూపుఁడై దండమ్ము చేతఁ గొనఁడు రాజదండ మొకఁడు దాల్చె లక్ష్మణుఁడయి
హలముసల దండయుగమూనె బలుఁడగుచును బూనె దండత్రయమ్ము రామానుజుఁడయి,

తే. నాల్గు పాదాల ధర్మమ్ము నడచెఁ గృతయుగమునఁ, ద్రేతాయుగమున నొకటియు ద్వాప
రమున రెండుఁ గలిఁ మూఁడు సమయుకతన దండములఁ బెంచె యతిరాజతత్త్వమూర్తి.

ఉ. తావక భాష్య వాక్చయ సుధారసముల్ తలకెక్క వాణి నో
దేవరవారి శ్రీపదమె దిక్కన నాఁడె జనింపనైతి మీ

సేవ యొనర్ప భూతపురి సీమల, నేఁటికి నామరూపమౌ
దేవరవారి శ్రీపదమె దిక్కఁగుసుమీ యతిరాజ దేశికా ! 274

క. గురునకుఁ దిరుమంత్రమ్మిడు వర శిష్యుం డనినఁ బుడమి వంచకుఁడగు బా
పురె ! యాదవ ప్రకాశక గురునకుఁ దిరుమంత్ర మొసఁగి గురువనఁబడవే ! 275

సీ. వృద్ధత్వమందిన వేదత్రయమునకు దండత్రయమ్ము నూఁతగ నిడియెను
మోహించివచ్చిన మోక్షైక లక్ష్మికిఁ గాషాయవస్త్రమ్ము కట్టఁబెట్టె
పదములం బడివచ్చు మదవతి వాణికి వేదాంతనిధులఁ ద్రవ్వి తలకెత్తె
హరిపదమ్ములు మేన స్థిరనివాస మొనర్ప సౌధోర్ధ్వపుండ్రముల్ జతపఱచెను
తే. హరియె గీత వచించె రామానుజుఁడయి యహియె భాష్యమ్మొనర్చె రామానుజుఁడయి
వేల తలలు దాలిచి వేనవేల నరుల కర్మభారమ్ము తన కంటఁ గట్టుకొనియె. 276

ఉ. రాక్షసరాజు లెల్లరును రక్తపిపాసువులై జనించి రీ
దక్షిణదేశమందె యని తత్పరతన్ యముఁడేలు నీ దిశన్
శిక్షకుఁ జేతి నిండ పని చిక్కఁనటంచును వాని గర్వమున్
దక్షత నార్ప నీ విటులు దక్షిణదేశమునం జనించితే. 277

చ. అని వినుతించి వైష్ణవమతాంచిత మంత్రరహస్య మర్మముల్
తన కెఱిఁగించు గ్రంథ సముదాయము నెల్లను నార్యసన్నిధిన్
విని మనన మ్మొనర్చి కనువిప్పు జనింపఁగ న్యస్తభారవ
ర్తనుఁడయి యేగి భక్తిమెయి రంగసతీమణి గోదఁ బాడుచున్. 278

సీ. వాణియే పూఁబోణి వశవర్తినిగమారి పదముల నమృతసంపదలఁ జిల్కఁ
శ్రీవామ యేలేమ శీలసంపదమెచ్చి సాపత్న్యసంగతి సమ్మతించె
శ్రీరంగనాథుఁడే సీమంతిని శిరోజ ముక్తదామములకు భక్తుఁడయ్యె
పార్వతి యే సతీవ్రతదీక్ష నెదమెచ్చి నిరతాక్షయ సువాసినీత్వమొసఁగె
తే. ఉర్వి వ్రజకాంత లే యింతి యొజ్జలైరి పూతబృందావన మెవర్తు పుట్టుచోటు
పితయగుచు విష్ణుచిత్తుఁడే సతినిబెంచె హరి వినోదనా శ్రీగోద నభినుతింతు. 279

మ. హరి నారాయణుఁదప్ప వేరొకని నే నంటంగఁ బోనంచునో
సరసీజాయతనేత్ర ! తావకశిరోజ స్నేహ సద్వాసనన్
విరిదండల్ నునువేణి వీడి హరికిన్ వే నోఖలం జెప్పునో
సరసీజాక్షుఁడు వీనిఁగోరుట రహస్యంబింక నే ముండునో. 280

చ. జనని ! భవమ్ముఖాంబు రుహసద్మమునన్ హరిషట్పదాకృతిన్
గొని ప్రణయామృతాధరముఁ గ్రోలుచు 'నీ వెది కోరుదానవో

వనరుహనేత్రి ! తెల్పు'మని పల్కిన 'నీ ప్రియదాసులైన నా
తనయుల తప్పు పొట్టనిడి త్రాణమొనర్పు' మటంచు వేడవో. 281

ఉ. గోద యటన్న గౌతమియె గోదవు నీవ సరోజనేత్రు శ్రీ
పాదము లంటివచ్చి హరిభక్తపరీవృత పాపతాపముల్
మోదతఁ బారఁద్రోలు రసపూర్ణ ప్రవాహము గోముఖాన ని
మ్మేదిని నొల్కవోయుటలు మేలొనగూర్పు నడం జరించుటల్. 282

ఉ. వేద నినాదసారముల వీనుల విందిడు తేనెతేటలో
శ్రీదయితా మనోహరుని చిత్తమెలర్చెడి పూలతోఁటలో
మోదతఁ జేతనోద్ధరణముం బొనరించెడి పైఁడికోటలో
గోద రచించినట్టి యదు గోపకుమారునిఁబాడు పాటలో. 283

సీ. భృంగసంగతి నెప్పుడెంగిలి బ్రతుకులై పొల్చుటనో మోము ముడుచుకొనును
పంకజాతములై కళంకితమ్ములగుట వనములన్ మసలును వంచనమెయి
కామాగ్ని రగిలించు కందర్పశరమౌటొ లలిఁ గళానిధిఁగాంచ లజ్జ నొందు
గతివిహీనములౌట గళదఘ్న జలముల నొరుగాలుపైఁ దప మ్మొనరఁజేయు

తే. ఆ సరోజముల్ భవదంఘ్రితో సమగతిదూఁగఁ గనువిప్పొనర్పు మిత్రుఁడు వెలుంగఁ
జెలఁగి శ్రీ లక్ష్మిపదముల చెలిమిచేసి కోటి జన్మలెత్తియు వాని సాటిగనవు. 284

సీ. నీ దరస్మితకాంతి నెఱిగ నోఁకినఁజాలు నజ్ఞానతమసమ్ము లంతరించు
నీ వాగమృతధార నిచ్చగ్రోలినఁజాలు సంసారమృగతృష్ణ సమసిపోవు
నీ పదాశ్రయణము నియతిఁ బొందినఁజాలు వైకుంఠ పదపీఠి వలచివచ్చు
నీ దయావీక్షణ నివహమ్ము సోఁకిన బద్ధజీవుఁడు విష్ణుభక్తుఁ డగును

తే. ధరణి విల్లిపుత్తూరెంత తపమొనర్చి నిన్నుగన నోచుకొనియెనో కన్నతల్లి
నీదు నామమ్ము స్వర్లబ్ధి నిఖిల వస్తువాహనసమృద్ధి వాక్సిద్ధి వడయఁజేయు. 285

మ. హరి బృందావనమందె చిక్కునని తానా బృందయున్ సర్వదా
వరదాంఘ్రిద్వయ పూజనాభిరతి శశ్వన్మోద సంరంభయై
ధరణిన్ వెల్గ నటంచుఁ బుట్టితివె తద్ధామంబునన్ గోపికా
విరహప్రేమమె శ్రీ పరాత్పరపదాప్తిన్ గూర్చునం చాడవే. 286

వ. అని వినుతించి, 287

ఉ. అచ్చటినుండి పోతన మహాకవి దక్షిణ తీర్థయాత్రలన్
బొచ్చెములేని భక్తి నెదపొంగెడి యత్యనురక్తిఁగాంచి తా
వచ్చుచు నొంటిమిట్టఁగల వారిజమిత్రకులాబ్ధి సోమునిన్
సచ్చరితున్ రఘూద్వహునిఁ జఱువులం దమితీఱఁ గాంచుచున్. 288

క. ఆ యహమచట వసించెను రేయిన్ స్వప్నమున నొక్క తేఁడగపడి యో
శ్రీయుత మీ కృతికిప్పు డపాయము చేకూరెఁ జెదలు భక్షించుఁదమిన్. 289

ఆ. అనఘ ! నీవు దీక్షఁదనరి యిచ్చోటనెయుండు మేను దాని నుద్ధరింపఁ
జనుచునుంటి నీదు మనమున ననుమాన ముడుగుమింక శుభము లొదవునీకు. 290

తే. అనుచుఁ బల్కి యాతఁ డంతర్హితుండయ్యె నిదురవోవు సుకవి బెదరిలేచి
హరి గుణానుభవము నార్తిమై నొనరించి కాలకృత్యములను గ్రమతఁ దీర్చి. 291

ఆ. రామ ! గ్రంథ మిట్లు నామరూపమ్ములు వడయకుండ భూమి నడఁగియుండ
నాదు జీవితకృషి నష్టమ్ము నొందింపభూరి కృతినివాౘ్రియఁ బురికొలుపుటొ. 292

ఆ. స్వామి ! నాదు గ్రంథసంక్షేమ మెఱుఁగమిఁ గుడువననుచు దీక్షఁగొనియె సుకవి
వచ్చుపోవు భక్తవరులు శ్రీ పోతన గాథతెలిసి యెడఁద బాధనొంద. 293

ఆ. భాగవతమె యన్నపానంబు లిఁకనాకు తత్ప్రబంధపఠన తత్పరతను
వేళఁబుచ్చువాఁడ వెడఁగునై చెడనేలయనుచు వ్యాసకృతిని హర్షమొదవ. 294

ఆ. చదువ, వేల జనము లది గాంచి వినుటకు రాఁదొడంగి రెంతొ రయము మీఱ
నార్త భక్తి సుకవి యాఖ్యాయికలఁ జెప్పు స్వకృత భాగవతము స్మరణ రాఁగ. 295

వ. అశ్రుపూర్ణనేత్రయుగళుండగుటయుఁ బార్శ్వమునందె వసించు శ్రోతల నొక్కఁడగు
యోగిపుంగవుండు లేచి కవివర్యా ? యిట్లు విలపింపనేల ? యేడు రాత్రులును భగవ
దవతార కథా విశేషంబుల నాఱుగతిఁ గావ్యగాన మొనరింప నాలించి హరి ప్రసన్నుం
డగు. భవద్రచితమగు భాగవతంబన పాయత నున్న వార్త మీ చెవిం బడునని తెల్పి
చనియె. అంత నతండు నత్యంత భక్తియుక్తుండై హరిగుణగానం బాఱుగతి సప్త
రాత్రంబులు శ్రుతిపర్వంబుగా శ్రోతృజనాఘలతాల విత్రంబుగా బాడుటయు తద్గానా
మృతార్ణవమందు మునింగి చేతనాచేతనంబులు పునీతంబులయ్యె. 296

ఉ. అంతట భూధవుం డొకఁ డహర్పతితేజుఁడు వీరమౌళి తాఁ
బంతముఁ బూని సింగమ నృపాలుని స్వప్నము నందు నొక్కనాఁ
డెంతయు శౌర్యదీప్తిని నహీన పరాక్రమ పౌరుషాప్తి న
త్యంతము క్రోధ ఘూర్ణితజపారుణలోచనుఁడై మహోద్ధతిన్. 297

తే. నాదు కృతికాంత నీగతి నాశపఱచి యశము నేమి గడించెదో యధమ చరిత !
యనుచు గల్లోపరిచ పేటికను బటుగతిఁ గన్నుల స్ఫులింగములు రాలఁగాఁ జఱచెను. 298

తే. అపుడు నృపమౌళి మదినెదొ యదరిపాటు గదుర నిదుర మేల్కాని నలుగడలు గాంచి
యౌర ! యిది స్వప్నమని నిల్వుటద్దమందు దద్రిశోఫారుణ కపోలతలముఁ గాంచి. 299

క. ఇది స్వప్నమొ వాస్తవికమొ యెది తోఁచుట లేదటంచు నెద నాశ్చర్య
మ్మొదవఁగఁ గాల్యము లొనరిచి పదపడి యొడ్డోలగమునఁ బఱతెంచి వగన్. 300

తే. స్వప్నవృత్తాంతమును సభాసదుల కెల్ల నెఱుకపఱచి నా వలన ముందెట్టి దొసఁగు
పొసఁగె నింతటి శిక్ష నా కొసఁగి రెవరు స్వప్నగతవృత్త మేరీతి సత్యమయ్యె. 301

తే. రాయ లెవ్వ రాతని కృతిరమణి యెవతె ? రమణి కే నొనర్చిన యపరాధమేమి
స్వప్నగతి నిట్లు నను శిక్ష సలుపనేల స్వప్నశిక్ష ప్రత్యక్షానుభవ మిదెట్లు. 302

ఉ. ఏమియుఁ దోఁచ దీ విషయ మెల్లనయోమయమై తనర్చునే
ధీమహితుండు నాదు కల దీర్చి మనమ్ము గలంచు ప్రశ్నకున్
శేముషి యొప్ప నుత్తరము చెప్పునొ యాతఁడె మాన్యుఁ డెందు నే
నా మహనీయ విగ్రహున కంజలి సంఘటియింతు భక్తిమై. 303

వ. అనుటయు, 304

మ. అల శ్రీనాథుఁడు దేవి వాక్కు విని తా నత్యంత చింతాసమా
కుల చిత్తుండయి యిందుకొల్వమరు తత్క్షోణీశునిం గాంచి మీ
రలుకం జెందనటన్న నొక్క విషయం బాద్యంత సత్యంబు నేఁ
బలుకం బూనితి నన్న సింగనృపుఁ డప్ప్రాజ్ఞున్ విలోకించుచున్. 305

ఉ. సత్కవి సార్వభౌమ ! విల సద్గురు దివ్యమనీష ! మీర లీ
షత్కరుణం దలంచి కడు శ్రద్ధవహించి యిదేమి స్వప్నమో
మత్కృత దోషమేదొ యణుమాత్రము దాఁచక చెప్పనొప్పు మీ
హృత్కమలంబు నాదు కుశలేందిరసద్మ మటంచు నెంచెదన్. 306

చ. అని వచియింప సత్కవి ధరాధిపుతో నిటులాడె నేలికా !
మును గనదేశుసైనికులు పోతన భాగవతాపహర్తలై
చన మన సైన్యముల్ పఱచి సత్వరమే పరిపంథి సేనలన్
దునిమి జనమ్ము మెచ్చఁ గృతితోఁ జనుదెంచుచు రాచకొండకున్. 307

ఉ. పోతన సత్కవీంద్రుఁగని పోటుమగంటిమి దండనాథుఁ డీ
రీతిగఁ బల్కెనో కవివరేణ్య ! జయించిన కోశమిద్ది మా
క్ష్మాతలనాథుఁడే స్వయమొసంగును వీటికి నేగుదెంచ మీ
చేతికటంచు, నా సుకవిశేఖరుఁ డియ్యెడరాఁ దలంపమిన్. 308

ఉ. రామున కంకితమ్మయి విరాజిలు తత్కృతిఁగొంచు సైన్య మీ
ధామము జేరవచ్చినది ధారుణినాథులు దాని నెయ్యడన్
ప్రేముడి నుంచినారలొ నివేదనముల్ గొని నిత్య ధూపదీ
పామల పూజలొంది తనరారెడి సత్కృతియద్ది యెందునన్. 309

ఉ. దేవరస్వప్నమం దరుగుదెంచి క్రుధారుణ లోచనద్వయిన్
దావకగల్లసీమ నతిదర్ప మెలర్పఁగఁ గొట్టినట్టి యా
భూవిభుఁడే రఘూద్వహుఁడు పొల్చెడి తత్కృతికన్య వానిదౌ
దేవి యవశ్యమిద్ది గుఱుతించి వచింతు హితాభిలాషమై. 310

చ. సదమలశీల ! సాధుజన సత్కృతలీల ! దయాలవాల ! యీ
యుదయమె పోతనార్య రచితోత్కృతి భాగవత ప్రబంధమున్
బదిలముగాఁగ బమ్మెరకుఁ బంపుట భావ్యమటంచు నెంతు నే
నిది పరమేశ్వరేచ్ఛ యెదురీఁదఁగఁబోలునె యేటి కెందునున్. 311

తే. అనుచు నిటువల్కు కవినాథు నమృతవాణి నాలకించి తాఁడిదియె సత్యంబటంచు
సమ్మతించి సత్కవి నాదు స్వాంతమందు నెసఁగు విషయమ్మునే సెలవిచ్చెననుచు. 312

క. పడవాలు నరసి పొత్తము నెడసేయక రాజసభకు నెటులున్నదో య
వ్వడువునఁ గొనిరావలె నీ యొడయుని యానతికి నన్య మొదవక యుండన్. 313

ఉ. పల్లకి యందు గ్రంథమిడి భాసుర వైభవలీల దివ్వటీ
లుల్లసిలంగఁ దూర్యరవ మొప్పఁగ భూవర లాంఛనాలు సం
ధిల్లఁగ సైన్యయుక్తముగ దీప సుధూప నివేదనార్చనన్
మెల్లనఁ గొంచుఁబోయి కృతి మేవడిఁ బోతన కిచ్చి రాఁదగున్. 314

క. అను నమ్మనుజాధిపుతోఁ గను లార్ద్రముగాఁగ నుడుల గాద్గద్యమ్మున్
దనరఁగ శ్రీనాథుఁడు పోతన దేశము వీడి యెటకో తాఁజనె ననియెన్. 315

వ. అనుటయు నాతఁడు, 316

ఉ. ఆతతరామ పాదవికచాబ్జ మరంద మిళిందరూప వి
ఖ్యాతుఁడు పోతనార్యుఁడొక కారణజన్ముఁడు పూజ్యుఁ డిట్టులే
నాతనికిం బొనర్చితి మహాపకృతిన్ గుమతిన్ గ్రుధారతిన్
జ్యోతినిగాంచి మ్రింగఁ జనుచో శలభమ్ము ఫలమ్ము నొందునే. 317

ఆ. నేను లేను హరియె నిఖిలకర్మములకుఁ గర్తయంచు నెంచు ఘనునిగలఁచ
దర్పణమ్ము ముందు తగనిల్చి తనుదానె వెక్కిరించుకొనెడి వెకలిగాఁడె. 318

ఉ. వేగ మొసంగఁగావలెఁ గవి ప్రికరమ్ములు వెంటనేగి శ్రీ
భాగవతమ్ము నప్పరమభాగవతోత్తము నింటి యందిఁకన్
జాగునొనర్పరాదనుచు క్ష్మాపతి యీగతి బల్కు నుల్కు తా
నేగి చమూవిభుండు కృతి నేలిక సన్నిధి నుంచి యిట్లనెన్. 319

ఉ. ఈ కృతిపేటికన్ వెనుకనేఁ గొనివచ్చిన నాఁట నుండి యుం
దాఁకినవారె లేరు వసుధావర ! పెట్టియ మూతి విప్పినన్

బాకిటరీతిఁ గోశమునఁ బర్విన ధూళిని దుల్పి పంపుటల్
చేకురునంచుఁ బల్కి తన చేతనె మూఁతను విప్పె నాతఁడున్. 320

తే. మందసమ్మును దెఱచిన మాత్రనందు చెదలుపుట్టయై కోశమ్ము చెదరియుండెఁ
దన్మనో విదారకదృశ్య దర్శనమున గుండెలాఁగిన యటులయ్యెఁ గుతలపతికి. 321

తే. అయ్యయో! కృతి చెదలు పాలయ్యె నకట! యెంతపనియయ్యె నీ విపు డేమిసేతు
ననెడి నృపుఁ గాంచి సేనాని హా! యికెట్టులనుచు నోరును దెఱచెఁ బ్రజాళి యఱచె. 322

ఉ. కన్నుల నీరుగ్రమ్మెను జగమ్ములె మున్గినయట్టులయ్యెఁ దా
నున్నది లేనిదేమియును నొక్క రవంతయుఁ దోఁచదయ్యె మే
ల్మిన్నులు విర్గివచ్చి తల మీఁదనె కూలెను దుఃఖమేఘ సం
ఛన్న వికర్తనుం డగుచు క్ష్మాపతి యాత్మఁ దలంచె నీ గతిన్. 323

తే. ఆంధ్రదేశంపుఁ బూర్వ పుణ్యముల పంట యాంధ్ర హృదయ విజ్ఞానోదయార్క బింబ
మగు తెలుఁగు భాగవతముఁ గొం చరిగినాఁడ వేది యను జాతిఁ గన మొగమ్మేది నాకు.

ఉ. రక్తములోడ్చి చెమ్మటలు రాల్చి దరిద్రము నాశ్రయించి మేల్
మౌక్తికహార పంక్తులను మాటలుగా జతగూర్చి వానితో
భక్తి సుధారసాబ్ధులను బంచెడి భాగవతమ్ము వ్రాసి స
న్ముక్తికి దారిఁ జేయు రసమూర్తికి ద్రోహము నాచరించితిన్. 325

తే. బ్రతుకు లర్పించి వ్రాసిన కృతి వియోగ ఘోర చింతాభరమ్మది దారసుతులఁ
గడకు జన్మభూమిని గూడ విడువఁజేసెఁ బోతనా! యెట్టి యాతనఁ బొందినావొ! 326

తే. అనఘుఁ డవ్వోతరాజు తా నంకితమ్ము నీయ నీ గ్రంథమనినంత రాయలౌర
బలిమిమై దాని గొని మట్టిపాలొనర్చె నను నపఖ్యాతి నా పేర నతికిపోయె. 327

సీ. పోతన కృతి నిట్లు పాఁతిపెట్టె నితండు సాహిత్య విద్యా విశారదుండె
వరకవి హృత్పీడ నెఱుఁగఁడయ్యె నితండు సర్వజ్ఞ బిరుద విస్తారయశుఁడె
ఆంధ్రభాషాయోష నణఁగఁద్రొక్కె నితండు దోషజ్ఞ కవిలోక పోషకుండె
కవి నిరంకుశతయే కాపాడనోపఁ డీ రాజు భాస్వత్ప్రజారంజకుండె

తే. అనుచు నోటికి వచ్చినయటులు లోక మాడదొకా రోళ్ళ రోకండ్లఁ బాడదొక్క
కాలమెందు నీ యక్షరధూళి నాదు పైన బేర్వెట్టి తూర్పారఁబట్టిపోయు. 328

తే. చచ్చినను దప్పదింక నీ మచ్చ నాకుఁ బుడమి నిట్టి గ్రంథమ్మింక పుట్టఁబోదు.
ఈ యపఖ్యాతి కొఱకు నే నేడ్వఁగాని గ్రంథనాశమ్ము నా యెదన్ గాల్చిపెట్టు. 329

శా. అందాలన్ విరఁజిమ్ము సత్కృతి. సువర్ణానూన శోభాలస
న్మందార ప్రసవమ్ము నక్షరసుధా మాధుర్య సంధానని

ష్యంది స్వాదు మరందగాంగమని మత్ స్వాంతంబు తా నెంచె నీ
చందం బక్షరతల్ క్షరమ్మగుట లాశ్చర్యంబుగాఁ దోఁచెడిన్. 330

ఉ. ఇచ్చటి కేల తేబడియె నంతటి గ్రంథము నాతఁ డియ్యెడన్
వచ్చిన నెట్టులుండెడి దవార్య ముదమ్మున గౌరవించి నే
నిచ్చెడివాఁడఁ గాదె కృతి, నెందుల కియ్యెడ రాకపోయె నా
సచ్చరితుండు, నే నయిన సాదృతి నీ కృతిఁ బంపనైతిగా. 331

ఉ. తప్పు నొనర్చి యిట్టులు వృథా పరితాపముజెంది కుందుచో
నిప్పుడు లాభమేమి యపుడీగతి రాఘవుఁడైన స్వప్నమం
దిప్పగిదిం బొనర్చు మనఁదేటికి నింతకు నా చరిత్రలోఁ
దప్పక యిట్టి మచ్చయది దాఁకొననున్నది గాక వేఁతొకో! 332

చ. అనుచు క్షితీంద్రుఁ డిప్పగిది నాత్మఁగలంగుట దండనాథుఁడున్
మును గల పెట్టెలోఁ గృతిని ముంచిన యచ్చెదమట్టి నల్ల నే
ర్పొనరఁగ రాల్చి పత్రముల నొక్కొకటిన్ విడఁదీసి చూచి వా
నిని పుటసంఖ్యలం గ్రమత నిల్పి నృపాలుని గాంచి యిట్లనెన్. 333

చ. నరవర! మీరు నెమ్మనమునన్ వగమానుఁడు గ్రంథరాజమున్
బురువు లొకింతె మేసె మన పూర్వపుఁ బున్నెము కల్మి దీనిలోఁ
బరక నశింపఁగా మిగులు భాగము రాముఁడు రక్షసేయఁడే
సరసులు సాహితీవిదులు స్వాములు సత్కృతి పూడ్చిపెట్టుచే. 334

ఆ. అనిన వారు నోరి నవనిత్రి మొనరించికొనుచె కాక ప్రభువు ఘనత చెడునె
ప్రభువు నాన నెంతొ భద్రమ్ముగా దీనిఁ బంపువాఁడ నేఁడె బమ్మెరకును. 335

ఆ. బట్ట గాల్చి పైనఁ బారవేయు జగమ్ము గణన సేయరాదు జనపతులన,
చెట్టుగాలి లేని దెట్టు లూఁగునటంచు నమ్మ మనుజులందు రిమ్మహినినె. 336

క. అనుచున్ జనపతి సత్కృతి ఘనతర సన్మానపూర్వకముగా శ్రీనా
థుని వెంటనొసఁగి బమ్మెర జనపదమున కనిపె వినయసంభ్రమమతియై. 337

తే. దాని నెంతొ వైభవమొప్ప మానసమున సంతసముపొంగ శ్రీనాథ సత్కవీంద్రుఁ
డెలమిఁగొనిపోవ సంక్రాంతి యేగుదెంచెనంత నంతట బంతి చేమంతిపూచె. 338

వ. సంక్రాంతి శోభలంగని శ్రీనాథుండు తాను, 339

తే. క్రాంతికారిణి మకరసంక్రాంతి లక్ష్మి తెలుఁగు వాకిళ్ళలోని కేతెంచుటఁగని
తళిగె దినరాజు కళలు తా నుఱికి యుఱికి పయనమొనరించు జనహితపథము లరసి. 340

చ. గడగడలాడు విశ్వమనఁగా వడఁకందొడఁగెన్ జనమ్ము దాఁ
గడు వినయమ్ముతోఁ గరయుగమ్మును గట్టి కుళాయిబెట్టి ముఖా
బడిపడి వంగి వ్రాలి నిజభక్తిని జాటుచు నగ్నిదేవుఁడుం
బుడమిని రేబవల్ నిదురపోక శ్రమించె జనానుమోదియై. 341

సీ. కడపల చేరెలన్ గనకాంబరము గట్టెఁ బసపుకుంకుమల లేపనపు గొనబు
తలపైన ముత్యాలకలికి తురాయిడె గొబ్బెమ్మకొక పిండికూరకొమ్మ
నవధాన్యవిసరంబు నవరత్నములఁదాపె రంగవల్లి శిల్పరంగపీఠి
మన్మథుండు జయాప్తి మకరధ్వజంబెత్తెఁ జెఱుకువిల్ విశ్రాంతి ధరణివ్రాలె

తే. గీమువిడి బదరీఫల కోమలాంగి తియ్య తియ్యని తలపులు తీవబారఁ
బఱచు ముగ్గు తివాచీలఁ బందుకొనుచుఁ బొరలియాడెను సంక్రాంతి పురుషుఁగూడి. 342

సీ. అనలాహుతిఁగ నిన్ను హతమార్చు నొక్కండు తరణి కరంబుల తరుమునొకఁడు
కంబళి సురులొడ్డి కట్టివేయునొకండు కవచధారియయి నిన్నవయునొకఁడు
చెలిసాయమున నిన్ను బిఱుకుమార్చు నొకండు మైరేయరతిఁగెల్చు ధీరుడొకఁడు
తలుపులు బిగియించి వెలిద్రోయు నొక్కండు ముడిచిపండుకొని నిగ్గెడపు నొకఁడు

గీ. వరధనుస్సంక్రమణ హిమశరవివృష్టి దశదిశలముంచి వడకింతు ధరణి ననుచు
మిడిసిపడనేల నో చలీ! జడధిరాజ దత్తప్రాణుండవని విదితమనె విరహి. 343

తే. మకరసంక్రాంతి హేమంత మంజుగతులు అంగముల స్నేహసంగతి నలరఁజేసి
యధరముల గంట్లొనర్చెడి విధములరసి కాంతలంగాంతు్రి పురుష లేకాంతవాంఛ. 344

తే. దంపతుల విడఁగొట్టుటొ ధాత్రి జనములరక యెండగొట్టెనటంచు నుడుకుచుంద్రు
దంపతులఁ గూడఁబెట్టుటొ ధరణిప్రజలు నౌర! చలిపెట్టెనని వడఁకాడుచుంద్రు. 345

సీ. మెఱుఁగు వాకిళులను మేఘమండలముల ముగ్గు విద్యుల్లతల్ మురిసియాడ
పసపు కుంకుమముల పచ్చతోరణములఁ దనరు ద్వారముల సింగిణులు వ్రాల
చెలఁగు సీతాకోకచిలుకలొ పడుచుల నప్సరస్సంతతు లాటలాడ
పాలదంతము లొప్పు బాలహాసద్యుతిన్ దారకాచంద్రులు గేరుచుండ

తే. అలరు బొమ్మలదర్బారు లలసుధర్మ వైభవోల్లసత్ ప్రతులను వ్రాయుచుండ
దివియు భువియు నేకమ్మగు తెఱఁగుఁదెల్పు తెలుఁగు సంక్రాంతి దీధితుల్ తేజరిల్లె. 346

సీ. రత్నకంబళము పఱచినార లిచ్చోట సభదీర్చె నొక యాంధ్ర చక్రవర్తి
రథముల నేస్గుల వ్రాసినారిచ్చోట రహియించెనొక యాంధ్రి రాజధాని
శృంగార శిల్పాలు చెక్కినారిచ్చోట నలరారునొక తేని యంతిపురము
తీవలు పూవులు దీర్చినారిటనొప్పు నాంధ్రి సారస్వతోద్యానవనము

తే. ఆంధ్ర సుందరు లీ నేల లలికి పూసిరంగవల్లికా చిత్రాలు వ్రాయునపుడు
కాంచిరో వీరమాతల కలలఁగాక మనన మొనరించిరో యాంధ్రి మాన్యచరిత. 347

తే. అనుచు భావించి హృదయ మాహ్లాదపడఁగ తాను తగు పరిజనముతోఁ దరలనెంచి
జలధివలెపొంగు సేనలో నలరుచున్న దళవరింగాంచి దరిఁబిల్చి పలికెనిట్లు. 348

తే. గ్రామజీవనమున కడ్డు గలుగవలదు సైన్యమున్ గ్రామ బాహిరస్థలమునందె
విడిచియుంటలె యెంతయొ విహితమెల్ల దండులిట మావితోఁపులో నుండవలయు. 349

క. అనుచున్ బమ్మెర వీథులఁ గనుచున్ మెలమెల్ల నేగి కవినాథుఁడు పో
తన వసతిమున్నరిగి యటఁగనె మొఱలిడు పురిటి బిచ్చకత్తెయ నొకతెన్. 350

క. కని కనికరమ్మునఁ గరమ్మున నొక రూకనిడి హృదయమున నిటు లెంచెన్
వనజభవ కావ్య కల్పనమున దోషమొ గుణమొ దీనముఖరోదనముల్. 851

తే. మాడకుంబెట్టు చము రణుమాత్రలేక బొంతలో గింజుకొని యేడ్చు పురిటికూన
నరయు నీ బీదయిల్లాలి యక్షులకును భోగిపండుగ విసమోడ్చు భోగిగాదె. 852

క, పండుగ యన ధనిభాగ్యము పండుఁగదా ! పంచభక్ష్య పరమాన్నాప్తిన్
బండుగ యనరిక్తుని పని పండుఁగదా నాఁడు పస్తుపండుట ననియెన్. 353

తే. ఊరుకూరు సంతోషాప్తి నున్నవారు కాని పోతనయింట నే కారణంబొ
పిల్లలాదిగ నుపవాసమెల్లవారు ప్రొయ్యిలోఁ బిల్లిలేవ దీ పొద్దువఱకు. 354

తే. అలుకుఁబూఁత నొనర్చినా రందఱివలె ముగ్గులను వైచినారలు ముందువలెనె
ప్రజకుఁజూడఁ గన్పడుదు రెప్పటి మనుజులె యింటిలోపలి కష్టమ్ము లెవరికెఱుక. 355

తే: మానమేగు నటం చభిమానధనులు నగుమొగపుఁ దెరదాఁచిన వగపులెన్నొ
పండు నిప్పుకలటులు కుంపటి దహింపు కనఁబడదుగాని యంటినఁ గాల్చఁగలదు. 356

తే. దివ్యతూర్య నినాదాల దివ్వటీల భవ్యరాజలాంఛనములఁ బరిజనముల
వీఁకఁ జనుదెంచు శిబికావలోకనమునఁ దరలి చను పెండ్లివారని తలఁచెఁ బ్రజయు. 357

శా. శ్రీనాథుండును గ్రంథయుక్తుఁడయి విచ్చేసెన్ గృహప్రాంగణ
స్థానంబంటి మహోత్సుకుం డగుచు నా తల్లీ ! యటంచున్ సుతన్
దేనెల్ చిందెడి తీపి పల్కులయ నెంతేఁ బ్రీతితోఁ బిల్చుచున్
లోనేగెన్ గనె నాల్గుమూల లపుడెట్లో కానుపించెన్ స్థితుల్. 358

తే. శారదా ! యని పిలుచుచు లేరె యేరుననిన యంతనె శారద యరుగుదెంచెఁ
దిండివేళల నిట్లు నిద్రించి మీరు నాకబలి దీరినట్టు లున్నారెటులనె. 359

తే. అనుడు శారద తండ్రి వదనముఁ గాంచి నాయనా! యను మాత్రన నయనయుగళిఁ
దెగిన ముత్యాలసరములై తెఱపిలేక యశ్రువుల్ నిండి తొణికిసలాడిపడెను. 360

క. పుట్టెఁడు పండుగరోజున నట్టింటన్ నిల్చి రోదన మొనర్తురె నిన్
గొట్టిరె తిట్టిరె నీ మది గుట్టువిడిచి యేల చెప్పఁగూడదు తనయా! 361

క. బావయు నత్తయు లక్ష్మియు నే వారును లేరదేల యింట ననియెఁ దా
నా వెలఁది పొంగిచను దుఃఖావేశము నడఁచి యిట్టులనె జనకునితో. 362

ఉ. భాగవతమ్ముఁ గన్నడ నృపాలుఁడు దొంగిలికొంచుఁ బోవు వా
ర్తాగమ ముత్తమర్ణశ్రుతి కంటిన యంతనె కర్ణమంటు జో
టీఁగెలవోలె నప్పులిపు డీయమి నేగమటంచు నిల్చి రీ
మా గృహగేహళిన్ గఱకుమాటలు వల్కుచు నల్కతోడుతన్. 363

ఆ. వచ్చిపోవు నట్టివారిమున్ నోనాడి చనిన జోటికెల్లఁ జని నలువుర
నవ్వుబాటుగాఁగ నక్షత్రికులరీతి నిచ్చి కదలుమనిరి రెచ్చిపోయి. 364

ఉ. పాళ్ళకు దున్నువారికిని భాగమొసంగక బండగుండెలన్
గళ్ళములోని ధాన్యమును గళ్ళములోననె పెచ్చుతోడుతన్
ముల్లెలఁ గట్టి బండ్ల నిడి మోదత నిండ్లకుఁ జేర్చి రాగకే
పళ్ళెములోని భోజనముపైఁ బడి శ్వానము లిగ్గుకొన్నటుల్. 365

ఉ. మొత్తము ధాన్యముం గొనిరి ముంగలియేఁటి కృషిం బొనర్పఁగా
విత్తన మెట్లటంచు విలపించెను బావ, యదేమొ తిండికై
విత్తొకటైన లేదిఁక నివేశనమం దెటు కాఁపురమ్ములం
చత్తయుఁ గంట నీరు నిడి యాపురుసుం చపు దేడ్చె వంతమై. 366

తే. ఇన్ని దినముల నుండియు నింట నింటఁ బుట్లు బదులులతో నెట్లొ పూట లరిగెఁ
గాని యీ దినమ్మరుగుట కష్టమయ్యె నత్తయున్ లక్ష్మితోఁ బల్లె కరిగె నిపుడె. 367

క. అనుడుఁ గవిసార్వభౌముఁడు మనమునఁ దన యనుజ వర్తమానముఁ బ్రియనం
దన నెదురుకొను భవిష్యత్ ఘన నాటకవృత్తమెల్ల కనులం దాడెన్. 368

క. క్రుంగెను గూలెను వడఁకెను బెంగంగొని గుండె యదర బెగడొందెను గ
న్నుంగవ నశ్రు ప్రవాహము గంగలు యమునలయి యల లఁగన నిట్టూర్చెన్. 369

క. తన బాహ్యప్రాణం బగు తనయం గుండియల నద్దితల మూర్కొనె నే
మనక పెను మ్రోడుగా నిల్చెను రోదసిమౌన మావులించెను గడలన్. 370

క. కనలేను నీ శ్రీమమ్ముల ఘన మృష్టాన్నము నేయి గాఱఁగ నిడి సాఁ
కినవాఁడఁ గాదె నాతోఁ జనుదె మ్మత్తింటి సుఖము చాలయ్యె ననన్. 371

ఆ. ఈపు నన్ను గొంచునేగ నేమనుకొందుఁ బావ, యత్త యనుచుఁ బలుకుచున్న
పడుచుపిల్ల హృదయ భావమ్ములను గన్నతండ్రి యేమి తెలియుఁ దల్లి గాక! 372

క. శారదయును శ్రీనాథుం డీరీతి విచారత ప్తహృదయాన్వితులై
మారాడక నిలువ ముఖద్వారము కడ నరుడువచ్చు ధ్వని విననయ్యెన్. 373

తే. అంతలో సింగనృపతి కోశాధిపతియు వింతగతి నేగుదెంచి యచ్చెంతనున్న
సుకవి సార్వభౌముని గాంచి జోతములిడి నృపతి యాజ్ఞయం చిటులు విన్నపమొనర్చె.

తే. బాలభానుండు నన్నయభట్టు సుకవి యవనిఁ దిక్కన మధ్యందినార్యముండు
పోతరాజు రాకాశర చ్చీతకరుఁడు తక్కు నాంధ్రి సత్కవిపాళి తారకాళి. 375

సీ. ఆంధ్ర సాహిత్య నీలాకాశపథసీమఁ బార్వణశశి యాంధ్రిభాగవతము
ఉద్భాసదాంధ్రి కావ్యోద్యాన వనరాజి వరకల్పతరు వాంధ్రి భాగవతము
ప్రథితాంధ్రికవిదేవ మథిత భాషాంభోధిఁ బ్రిభవించు సుధ యాంధ్రిభాగవతము
పోతరాజానీత పూతాంధ్ర భూతల స్వర్గంగ మహితాంధ్రి భాగవతము

తే. భక్తలోక చింతామణి ముక్తలేఖ సౌరభేయ భాగవత మస్మద్గృహమునఁ
జెదలు భక్షించి జీర్ణావశేషమయ్యె నష్టపరిహార మర్పింప నాతరంబె. 376

ఉ. ఐనను నేను భక్తి నొక హాటకనిష్క సహస్రిమున్ సమ
ర్పణముఁ బొనర్తు నీ నృపుని ప్రార్థనమున్ విని వీని స్వీకృతిన్
బొనరిచి జీర్ణభాగమును బూర్తి నొనర్పఁగఁజేసి మన్మన
మ్మునఁ బరితృప్తిఁ గూర్చి యఘ ముక్తునిగాఁగ నొనర్ప వేడెదన్. 377

ఆ. అనుచు తేఁ డొసంగు నర్థమ్ము సకలమ్ము సుకవి సార్వభౌము నికటసీమ
నుంచి యెంచి హస్తయుగ్మమ్ము జోడించి యాజ్ఞయొసఁగుఁడనుచు నరిగెఁ బురికి. 378

ఆ. అంత మల్లనార్యుఁ డరుదెంచి నంతనె సకల విషయములను సుకవి కూర్మిఁ
దెలియఁజెప్పి కృతి చెదలు పట్టి చెడినట్టి వెలితి దీఱఁ బూర్తినలుపు మనియె. 379

చ. అనుటయు మల్లనార్యుఁడు వ్యథాన్వితుఁడై కవినాథుఁ గాంచి మ
జ్జనకులులేని యీ వెలితి స్వాంతమునుం గలఁచు గ్రింథలే
ఖన మొనరింపనోప నిఁక గంగన సింగన నారయాళి వ
క్కణ లిఖియించి పంచి త్వరగాఁ బిలిపించెదనంచు వాకొనెన్. 380

ఉ. మల్లన ఖేదపూర్ణముఖమండలమున్ దిలకించి మాతులుం
డల్లన బుజ్జగించి హృదయమ్మున బెంగఁగొనంగఁ బోలునే
చెల్లెలు పొంగ జాడఁ గని చెచ్చెరఁ దెచ్చెద బావ నింతకీ
పిల్లలు నీవు నింపకయు భీతిలరాదని చెప్పి యేఁగెఁ దాన్. 381

తే. మల్లనయు ధైర్యవిలసిత మానసమున శిథిలితస్కంధ కృతి పూర్తిజేయు కొఱకు
ఘనుల సింగనాదులఁ గళాధనులఁ బ్రథిత కవులఁ బిలిపించి వ్రాయింపఁగాఁ దొడంగె.

తే. ఈశ్వరేచ్ఛ కెయ్యెడ నెదురీఁదలేక వారు పోతనార్యునికి జోహారొనర్చి
యిష్టదైవమ్ము దలఁచి విశిష్టఫణితి సరస గద్య పద్యముల రచనమొనర్త్రు. 383

## ఆశ్వాసాంతము

క. భానుకుల రత్నదీపా! జ్ఞానానందస్వరూప కౌశికమఖ సం
త్రాణ! దళితోగ్రచాపా, దాన విజితదీన సూనృత విజిత భువనా! 384

ఉ. పురుష మనోహరోల్ల సద పూర్వకళామయ దివ్యరూప! ని
ర్జర నరదైత్య సన్నుత విశాలయ శోన్విత సుప్రతాప శ్రీ
ధరణి సుతా మనోజ్ఞముఖ తామర సామర భానుదీప సుం
దర దరహాస భాస కరుణాహృత సన్ముని తాప! శ్రీపతీ! 385

## ప్రియంవదా వృత్తము

సుకవి వర్ణిత విశుద్ధ వర్తనా!
వికట దైత్యగళ వృంత కర్తనా!
సకల దుష్ట మదశక్తి భంజనా!
ముకుర సన్నిభ కపోల రంజనా! 386

## గద్యము

శ్రీమద్భరద్వాజగోత్ర పవిత్రాపస్తంబసూత్ర, ప్రథిత సూరిజనమిత్ర, బక్కయ్యశాస్త్రిపుత్ర
వాగేశ్వరీ సమాసాదిత, వైదేహీవర నివేదిత సరసకవితావిలాస, సహజ
పాండిత్యభాస, వరకవి విధేయ, 'వరదార్య నామధేయ ప్రణీతం
బైన పోతన చరిత్రమను మహాప్రబంధమ్మునందు,
నవమాశ్వాసము.



శ్రీ రస్తు.

శ్రీ వాగీశ్వర్యై నమః




## కృతి ప్రాప్తి - ఫల శ్రుతి

"సర్వ ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ"


నాథ! వేద విదిత
జ్ఞానానంద ప్రబోధ గాన వినోదా!
బాణైక హత విరాధా!
మౌనీంద్ర ధ్యాన యోగ మానస సౌధా! 1

తే. ఉరుత రాంధ్రభాగవత సముద్ధరణము ఆంధ్ర సుకవి దీక్ష సమాప్త్యాచరణము
ఆంధ్ర వాగ్వధూటికి నమూల్యాభరణము వినవె దశరథపుత్ర! పోతన చరిత్ర. 2

వ. అంత శ్రీనాథుండు పోతన మహాకవి నన్వేషింపఁ బ్రౌఢ దేవరాయల యాస్థానంబున
కేఁగి యన్నరపతి సహాయంబుఁ గోరనెంచి నిండు కొలువుండు నన్నరనాథుఁ గాంచి
దీవించి యర్హాసనాసీనుండై యిట్లనియె. 3

సీ. మహి నెట్టి దేవరాణ్మణి రాజ్యపాలన మింద్రుని ప్రౌఢత్వ హీనుఁజేసె
ధరణి నే రాజన్య దండనాథుల శక్తి స్కంధుఁ జిన్ని కుమారుగా నొనర్చె
భువి నే నృపాలు సత్కవిపండితుల బుద్ధి గురు శుక్రులన్ మౌఢ్యచరులఁజేసె
వసుధ నే నృపువీటి వారాంగనల ధాటి కనువిప్పు లప్సరోగణముల కయి

తే. ధాత్రి నే రాజు సుందరోద్యాన మరసి దేవ తరురాజి పంచత్వభావమందె
నే నగర మమరావతి కెదురుదిరిగి విజయపూర్వకాభిఖ్యతో వెలసె నుర్వి. 4

తే. ఎవని నవలక్షసైన్యాళి యేపుగాంచి దివి నవగ్రహ బలము నిద్రింపదో నిశి
నెవని గిరిసన్నిభములగు నిభము లరసి తెల్లవోయె నైరావణ దిగ్గజమ్ము. 5

సీ. ప్రాక్పశ్చిమాంభోధిఁ బర్వెత్తు తరఁగ లే రాజ్యలక్ష్మికిఁ జామరములు వీచు
వింధ్యాగ మే రాజ్య వీరమాత శిరాన ఛత్రమై శీతలచ్ఛాయఁ గూర్చు
సింహళం బే రాజ్య సీమంతినీపాద మణిపీఠమై చెంత మసలుచుండు
గంగమ్మ కృష్ణమ్మ తుంగమ్మ యే మాత పదము లర్చించి సంపదలఁ బొదుగు

తే. సరస కవిసార్వభౌముఁ డే స్థానమందు వినుత కనకాభిషేకమ్ము గొనియెఁ గూర్మి
నా మహారాజ్య వైభవ మభినుతింప నజు తరమె ప్రౌఢ దేవరాయావనీంద్ర! 6

ఉ. లోహములన్ సువర్ణమెటులో యటులే విలసిల్లుచుండు నీ
దేహములందు మానవత దీప్తివహించిన నందునుఀ గళా
స్నేహమొనర్చు మానవుఁడు జీవకళాభృత రత్నప్రోల్లస
న్మోహన భూషగాఁగ జగముల్ తలఁదాల్ప వెలుంగు నెయ్యెడఀ. 7

ఆ. రాజ పోషణమున రాణించు సత్కళ లబ్ధకాయమానలతగ వెల్గు
ప్రభుని పోషణమ్ము బడయని సత్కళల్ విధవ వయసువోలె వితగనేఁగు. 8

మ. కళలన్ బోషణమున్ బొనర్చు దొర వీఁకఀ శుక్లపక్షమ్మునన్
వెలుఁగుల్ జిమ్ము సుధాంశుబింబమనఁగా విప్పారి యొప్పారు, స
త్కళలఀ బోషణసేయనట్టి ప్రభువీ ధాత్రీస్థలిన్ గృష్ణప
క్షలసత్ క్షీణశశాంకబింబమన నష్టం బందు వ్యక్తిత్వముఀ. 9

క. కావునఁ బ్రభువులు కావ్యకళావన దీక్షను వహించి యతుల యశస్సం
సేవితులై తిరనఁగ మద్భావుకు కృతి నడుగుటలె నిదర్శన మధిపా! 10

ఉ. తా నొకటిన్ దలంచుకొన దైవము వేఱొకటిన్ దలంచిన
ట్లే నొకటిన్ బొనర్చుటకు నెంచఁగ నింకొకటయ్యెనన్న భూ
జాని కవీంద్రు నారసి హసన్ముఖుఁడై యిటులాడె సత్కవీ!
నేను గ్రహించినాఁడ మును నీవిట కంపిన జాబు మర్మముల్. 11

తే. కావ్యశారద శ్రీరాముఁ గని వరించె ననుచుఁ బోతన యెంతచెప్పినను వినక
నాదు సైనికుల్ పొరపడినారు కృతిని నపహరించి యథార్థము నరయకుండ. 12

సీ. కవి పోతనార్యుండు కావ్యశారదఁ గొని యరుదెంచ వాణిఁ బ్రత్యక్షమగుచు
రాముఁడు దక్క వేఱె మానవులు నన్ను నంకితమ్ముగొన ననర్హులనుచుఁ

గాటుక కన్నీరు గండభాగమ్ములఁ బ్రవహింప నీగతిఁ బల్కెనట్టు
లా పల్కు లాలించి యాదృతిఁ బోతన తన భావమును మార్చుకొనినయట్లు

తే. నాకు లేఖ నొక్కఁడు వ్రాసినారు మీర లదియుఁగాక పల్లకి నెక్కి యరుగు మీకు
బమ్మెరగ్రామ పరిసరప్రాంత మందు గలుగు సంఘటన యొకండు తెలిపినారు. 13

క. తలఁచికొనిన నద్దానిన్ బులకలు మేనన్ జనించుఁ బుణ్యచరిత్రా!
యిలలో మీ యవతారమ్ములు కారణగర్భితములు మునితుల్యమ్ముల్. 14

సీ. పాల్యంకి కోభయ పార్శ్వములం గల వాహకులన్ మీరు వదలి యేఁగుఁ
డనుచుఁ దద్యానమ్ము నాకాశ గతవి మానాకృతిం గొని చను టరసినంత
మార్గ పార్శ్వమ్మున మడి దున్నుకొనుచున్న తావక జామాత తండ్రి నెంచి
రాముఁడున్ శారదారమణి మజ్జనకుని భక్తికి వశులయి పరఁగుచెందు

తే. సత్యమేని యీ సీరము జంటయెద్దు లవసరములేక దున్నెడి ననుచు యుగ్య
యుగ్మమును వీడఁజేసె నా యుర్వి నప్పు డెద్దులే లేక నాఁగలి యిటటు దున్నె. 15

మ. అది నేనున్ వినినంత భారతికి మీ యందున్న వాత్సల్యసం
పద కంటెన్ ద్విగుణమ్ము పోతన పయిన్ భాసిల్లుటల్ సత్యమం
చెద భావించితి నింతెకా దతనిపై నేవేళ శ్రీరామచం
ద్రి దయాదృష్టియుఁ బూర్ణవృష్టి గురియున్ దానంచుఁ దెల్లంబగున్. 16

ఉ. కావునఁ బోతనార్యపయిఁ గత్తిని గట్టుట లాత్మహత్యకున్
దావల మంచు సైన్యములె తప్పు నొనర్చినవంచు నెంచి నే
ర్పావహిలంగ శాంతగతి నచ్యుతు వేడుచునుంటిఁగాని నే
భూవిభుఁడైన సింగమయ పోరునకున్ దలవంచి కాదనన్. 17

చ. కవి నృపమౌళి యాదృతినిగాంచి ముదమ్మెదనించి పల్కె భూ
ధవ! భవదీయ చేష్టితము ధర్మవివేకయుతమ్ము దూరదృ
ష్టి విలసితమ్ముగాక నృపసింహముపై శరభాకృతిన్ వడిన్
గవిసి దురంబొనర్చి జయగర్వమునన్ దులఁదూఁగకుందురే. 18

తే. గజపతులె యపజితులైరి కఱకు తురకపాదుషాలె సలామిడి పదములంటి
కొలిచిరన సింగభూపతి బలమదెంత విక్రమించిన మిము మించు వీరుఁడున్నె. 19

తే. మీరు క్షమియించుటంజేసి మిగిలెనింక సింగభూపతి, యైనను శ్రీరఘుపతి
దా నతని క్షమియింపక తగిన బుద్ధికఱపిన విశేషవార్త మీ కెఱుకపఱతు. 20

సీ. అవధారు రాజేంద్ర! యవనిజాపతి మహీపతి వేషమొలయ స్వప్నమున నేఁగి
వడి చెంపఁగొట్టి మద్వనితను జెఱబెట్టి నశియింపఁజేయుట న్యాయ మొకొ!

ధర భక్తజనములఁ దరియింపఁజేయ నత్తరుణి నా కిడవేని ధరణినాథ!
సకలనాశమ్మును సమకూరఁజేతు నీ కని తిరోహితుఁడయి యరిగె నంత

తే. నరపతియు మేలుకొని దర్పణమునఁ గాంచి దదుగ్రశోఫారుణ కపోలతలము నరసి
యచ్చెరువునొంది సభలోని యఖిల జనుల కెఱుకపఱచె స్వప్నఫలం బిదేమియనుచు. 21

ఉ. అప్పుడు తేనిగాంచి యిటులాడితి సింగమ మేదినీశ! మీ
రిప్పటికేని మేల్కొనుట లెంతయు నొప్పును బోతరాట్కృతిన్
మెప్పని తెచ్చి నిత్యమును మేవడిఁ బూజ లొనర్పకుండుటల్
తప్పని రామచంద్రుఁడె కృధన్ మిము నివ్విధి శిక్షజేసెనో. 22

చ. అనుటయు తేఁడు తత్కృతిని నా క్షణమే కొనితెండటంచుఁ బం
చిన దళవాయి యేఁగి కృతిఁజేర్చిన మందస మందుఁదెచ్చి కాం
చినఁ జెదపట్టియుండి కృతి చేడ్పడుటల్ వగఁజెంది దాని న
ల్లన దులిపించి జీర్ణకృతులన్ సరిదిద్ది సముద్ధరింపఁగన్. 23

తే. నష్టపరిహారమునకయి నరపతియును స్వర్ణనిష్క సహస్రమున్ సాదరగతి
నొసఁగి పాల్యంకికన్ గోశముంచి భక్తి భక్తకవి కిచ్చిరమ్మని పంపెనన్న. 24

ఉ. ఆలయమందుఁ బోతన మహాకవి జాడనుగాన కేను మీ
పాలికి జాబువ్రాసి యిటు పంపితి దక్షిణ తీర్థయాత్రలన్
వాలెముగాఁగ దర్శన మొనర్చెదనంచు వచించె వెన్క భూ
పాలవరేణ్య! వేగరులఁ బంపి కవిన్ వెదకింపఁగోరెదన్. 25

తే. అనుచు లేఖలో వ్రాసితి నార్యచరిత! యెచట నున్నదియేమేని యెఱుకపడెనె
యనెడి శ్రీనాథ కవిఁగాంచి యవనిపతియు నొంటిమిట్టన్ గవివరేణ్యుఁడుంట తెలిసె. 26

చ. అనుచు వచించినంతనె మహాకవి మోద మెలర్పఁ బోతనన్
గనుగొన నేఁగె నెంతొ త్వరగాఁ బయనించుచు నొంటిమిట్ట రా
ముని వరమందిరాంగణము ముందొక పందిరి క్రింద నందఱన్
ఘనతరదీక్ష రామగుణగాన మొనర్చెడి పుణ్యరూపునిన్. 27

వ. ఇరువురు నాశ్చర్యచకితాననంబుల నప్రయత్నంబుగ డగ్గఱు పదంబుల నొకరినొకరు. 28

ఉ. కాంచిన యంత నొండొరులు కౌఁగిళులన్ బిగియించి మేన రో
మాంచము లుప్పతిల్లఁగను లశ్రు పరంపరఁ గ్రుమ్మరింప మా
నాంచితులై వివర్ణవదనాక్షుల గద్గద నిస్వనమ్ములన్
మించిన ప్రేమ సేమమొక మీకన మీకని పల్కరించుచున్. 29

ఉ. ప్రేక్షక నేత్రపద్మములఁ బ్రేముడి బాష్పమరంద మొల్కఁ హ
ర్యక్షయుగంబు లొక్కయెడ నందముగా జతగూడి యాడు న
ట్లక్షులఁ దన్పనెంచి రిటు లద్దరి; వీరలు వేదతార్క్ష్య స
త్పక్ష సమాకృతిం గొనిన ధర్మపు మోక్షపు రూపులం బొగిన్. 30

మ. తమి శ్రీనాథుఁడు పోతనార్యుఁగని యేతద్రీతిభాషించె నేఁ
డమితానందము నొందె నాదు హృదయ మ్మార్యా! భవద్దర్శన
మ్మమరెన్ జన్మతరించె గెల్చితివి న న్నాసాంతమున్ నీవు నీ
శ్రమలెల్లన్ ఫలియించె భాగవతమున్ జేఁ జక్కె నింకేమనన్. 31

సీ. అవధరింపుము కవీశాగ్రణీ! హరి మహీపతి వేషమొలయ స్వప్నమున నేఁగి
వడి చెంపఁగొట్టి మద్వనితను జెఱపెట్టి నశియింపఁజేయుట న్యాయ మొక్కొ!
చెఱ వీడఁజేసి చెచ్చెరనాకు తత్కాంత నర్పింపవేని యో యవనినాథ!
సకల నాశమ్మును సమకూరఁజేతు నీ కని తిరోహితుఁడయి యరిగెనంత

తే. నరపతియు మేలుకొని దర్పణమునఁ గాంచి దద్రుశోఫారుణ కపోలతలము నరసి
యచ్చెరువునొంది సభలోని యఖిల జనుల కెఱుకపఱచె స్వప్నఫలం బిదేమియనుచు. 32

ఉ. అప్పుడు పేనిఁగాంచి యిటులాడితి సింగమ మేదినీశ! మీ
రిప్పటికేని మేల్కొనుట లెంతయు నొప్పును బోతరాట్కృతిన్
మెప్పని తెచ్చి నిత్యమును మేవడిఁ బూజ లొనర్పకుండుటల్
తప్పని రామచంద్రుఁడె క్రుధన్ మిము నివ్విధి శిక్షజేసెనో. 33

చ. అనుటయు పేఁడు తత్కృతుల నా క్షణమే కొనితెండటంచుఁ బం
చిన దళవాయి యేఁగి కృతిఁజేర్చిన మందసమందుదెచ్చి కాం
చినఁ జెదవట్టియుండి కృతి చేడ్పడుటల్ వగఁజెంది దాని న
ల్లన దులిపించి జీర్ణకృతులన్ సరిదిద్ది సముద్ధరింపఁగన్. 34

తే. నష్టపరిహారమునకయి నరపతియును స్వర్ణనిష్కసహస్రమున్ సాదరగతి
నొసఁగి పాల్యంకికన్ గోశముంచి భక్తి భక్తకవి కిచ్చిరమ్మని పంపెనన్ను. 35

ఉ. ఆలయమందు భావుకమహాశయ! మీరలు లేమిఁజేసి భూ
పాలుఁడు పంపినట్టి కృతి భాగవతమ్మును మల్లనార్య చే
తులనిడి జీర్ణకావ్యపు కృతుల్ దగఁబూర్తి యొనర్పఁగోర మీ
యలఘు వియోగభారమతి నాతఁడు నియ్యకొనందు దీనికిన్. 36

తే. శిష్యుఁడగు గంగానార్యుని సింగనార్యు నారయాదులఁ బిలిపించి నయముమీర 37
శిథిలిత గ్రంథమును బూర్తిజేయుమనియె వల్లెయని వ్రాయఁగడగిరి వారలపుడె.

తే. మీర లింటలేకుంట లీ తీరు జరిగెఁ బొత్తమునుగొని మీరలె పూర్తిజేయుఁ
డనిన సత్కవీ! శ్రీరాము నాజ్ఞ లేమివ్రాయు మీ కృతులనిన నా వలనఁగాదు. 38

క. పలికెడిది భాగవతమఁట పలికించెడివాఁడు రామభద్రుండఁట నే
పలికిన భవహరమగునని తొలి వాక్రుచ్చితిని దానిఁ దొలఁగఁ దరంబే. 39

తే. భాగవతమును వ్రాసెడి భాగ్యమిటులు జిక్కెనని యొక్కతటి సంతసించు నన్ను
దరిసి శిష్యగణమ్ములో గురువరేణ్య! యా యదృష్టము మాబోంట్ల కబ్బునెయన. 40

ఉ. దైవకృపా విశేషమునఁ దప్పక మీకును నట్టి భాగ్యమో
పావనచిత్తులార! యొకపట్టునఁ గల్గఁగవచ్చునంటి ని
ష్ఠావిధి నీ సుభాగ్యమది యబ్బెను వారికి నేఁడు నాకునున్
భావమునందు సంతసము పర్వులువెట్టెడి నేమి చెప్పుదున్. 41

ఉ. నాకును స్వప్నమందు రఘునాథుఁడు దర్శనమిచ్చి పోతనా!
నీ కృతికిన్ బ్రణష్టత జనించెను మైళమయేఁగి తావకాం
ద్రీకృత భవ్య భాగవతనిస్తుల కావ్యరమావనమ్ము నే
వీఁకనొనర్తు నిందె కవివీరులు దీక్ష వసింపఁగాఁదగున్. 42

చ. అనుచు నృపాకృతిన్ బయనమయ్యెను రాముఁడు సప్తరాత్రముల్
ఘనతరదీక్ష భాగవత గాన మొనర్చుచు నిందెయుంటి నే
ననఘ! నువార్తవింటి భవదాగమనమ్మున. నార్తరక్షకుం
డనుపశక్తిశాలి కమలాక్షుఁడు నమ్మినవారి సొమ్మనన్. 43

శా. శ్రీనాథుండును బోతనార్యుఁగని మున్ సీతాంగనాశీల సం
త్రాణంబున్ బొనరించినట్లె కృతికాంత న్నేఁడు రక్షించె వి
జ్ఞానానందమయ స్వరూపమగు నీ జన్మంబు ధన్యంబు బా
వా! నా సోదరి నిచ్చి కాల్గడుగు సద్భాగ్యాప్తి నే ధన్యుఁడన్. 44

ఉ. ఇమ్మహి మిమ్ముఁ బోల్సుకవి యెందు లభించు నిదెల్ల మా యదృ
ష్టమ్మనఁజెల్లు మీరలిఁక సమ్మతి బమ్మెర కేఁగుదెంచుచో
నిమ్ముల బంధుమిత్ర జనులెల్లరు సంతసమంద నందఱన్
గ్రమ్మఱవారు మీరు తమకమ్మున భాగవతమ్ము గాంచనౌ 45

చ. అనుటయుఁ దాను బోతన మహాద్యుతి నిట్లను నొంటిమిట్టలో
ననె నసియింప నాజ్ఞనిడె నాకు రఘూత్తముఁడింక నేను సిం
గనృపతి సమ్ముఖమ్మునకుఁ గ్రమ్మఱ బమ్మెర కేగనొల్ల వా
రినె యిటు వచ్చునట్లు లొనరింపఁగదే సుకవీ! మహామతీ! 46

వ. అనుటయు, 47

తే. అంతలోనె భటుండొకఁ డరుగుదెంచి యుత్తరమ్ము చేతికొసంగి తత్తఱముగ
వెడలిపోయె శ్రీనాథ కవిప్రవరుఁడు లేఖ చదివి పోతన్నకీ లీల నుడివె. 48

తే. నేఁటికిని సరిగా నొక నెలదినములెయుండె శ్రీరామనవమీ మహోత్సవములు
నపుడె భాగవతమ్ము రామాంకితముగఁ గృతి సమర్పణసేయు టుచితములగును. 49

మ. అనుచున్ రాయలు భక్తివందనశతం బర్పించి యీ రీతి లే
ఖను బంపించెను మీకు సమ్మతమొకో కవ్యగ్రణీ! యంచు వా
కొనె శ్రీనాథుఁడు పోతనార్యుఁడును నాకున్ సమ్మతంబంచుఁ దె
ల్పెను శ్రీనాథుఁడు తత్ప్రబంధమును దెప్పింతుఁ సుధీ! యే ననెన్. 50

వ. అంతఁ బోతన ద్విజకుల జలధిసోముం డగు కవి సార్వభౌమున్ గని మహాకవీ! రాజు లహంభావపూర్ణ మత్తగజంబు లని స్వానుభవంబునఁ దెలియఁ గలిగితిని. రామాంకిత మహోత్సవంబు లేర్పఱించుటలో నింకేమేని రహస్య మిమిడియుండునో యని శంక గలిగెడినన శ్రీనాథుం డిట్లనియె. భావుకా! సకల రాజన్యలోకంబునకు నీ యకళంక చరిత్రంబు కనువిప్పు గల్గించెను. తమ బలంబుకన్న దైవబలం బెక్కువ యని గ్రహింపఁగలిగిరి. దైవభక్తుని దేవేంద్రుఁడేని నిర్జింపలేఁడను నిజము నెఱింగిరి. ఈ యంకితోత్సవము లేర్పఱచుటలోని యాంతర్య మనన్యసామాన్య ప్రతిభాపాండిత్య విభాసితంబును భవబంధ లతాలవిత్రంబును భక్తిభావ బంధురంబును నగు మీ కావ్యంబునందును బరమ భక్తాగ్రేసరులగు మీ యందును గల పూజ్య భావంబే తప్ప నన్యంబుగాదని యెఱుంగఁదగు. నే నింతకుమున్నె మీ చరిత్రం బాతని కాద్యంతం బెఱింగించితిని. నృపాలుఁ డింతకుముందొనర్చిన ప్రమాదకృత దోషంబునకుఁ బ్రాయశ్చిత్తంబుగా నే తత్కార్యం బవశ్యం బాచరణీయంబని, బమ్మెరకుఁ జని శ్రీనాథుం డతని కుటుంబమున కానందవార్త నెఱింగించి బంధు మిత్రాదులతోఁ బోతన పుత్ర కళత్రాది జనంబులతో శిష్యజనములచే జీర్ణోద్ధరణ మొనర్పఁబడిన భాగవత ప్రబంధ మతి భాసురగతిఁ గైకొనివచ్చినంత శ్రీరామోత్సవం బేతెంచె, కృత్యంకితోత్సవ సంభారంబు లేపారె. 51

క. కువలయపతి కిరువంకలఁ గవిపండితు లవల వందిగాయకబృందం
బవలఁ బ్రజ నడువ సీతాధవు లలి నెదిరికొనితెచ్చు తరుణమునందున్, 52

సీ. క్షేత్ర సర్వస్వమ్ము యాత్రిక సముదాయపూర్ణమై బహుజనా కీర్ణమయ్యె
నేత్రపర్వంబయి నిలయాంగణం బెల్ల మండపతోరణ మాన్యమయ్యె
శ్రోత్రపర్వంబయి శ్రుతిలయాన్విత తూర్యవాద్య మత్యంత మాస్వాద్యమయ్యె
వేత్రహస్తమ్ముల వింజామరమ్ముల భక్తబృంద మ్మభివ్యక్తమయ్యె

తే. స్వస్తి మంత్రపాఠమ్ములఁ జదువ ద్విజులు అనిలసుత వాహనారూఢుఁడగుచు స్వామి
వెడలి కల్యాణమండప వేది జేరెఁ గలకలము మీఱె జనము గుంపులుగఁ జేరె. 53

సీ. పండిత కవిరాజమండలి యొకప్రక్క సామంత నృపవరస్తోమ మొకట
వేదశాస్త్రాగమ విద్వాంసు లొకవంకఁ బ్రఖ్యాత గాయకప్రతతి యొకట
సచివ సేనాపతి సముదయ మ్మొకక్రేవ వందిమాగధ జనబృందమొకట
నవరోధ కాంతాజనవితాన మొకదెస వేశ్యామనోహర దృశ్యమొకటఁ

తే. గలిగి కొలువుదీరినయట్లు గానఁబడెడి రాము సన్నిధిన్ దాసుఁడై రాయలుండ
విభున కిరుదెసల్ విద్యా వివేకములన వెలసి శ్రీనాథ పోతన లలరుచుండ. 54

ఉ. రాయలవారి భద్రగజరాజముపైఁ గృతిరత్న ముంచి యా
ప్యాయత సత్కవుల్ కుసుమవర్షములన్ గురిపింప భక్తిప
ర్యాయత నారయాదులును నట్టటు కర్పూర చామరమ్ములన్
వేయుచునుండఁ దూర్యరవ విస్తృతియొప్ప వివాహ వేదికిన్. 55

ఉ. కైకొనివచ్చి భాగవత కావ్యరమన్ బ్రజలెల్ల భక్తిన
స్తోకగతిన్ బ్రసూనదళ శోభనవర్షము గుప్ప మాగధుల్
వీఁక నుతింప రాజ కవివీరులు స్వాగతమీయ నైదువుల్
జోక నివాళులెత్తఁ గృతి సుందరపీఠిక నుంచి రయ్యెడన్. 56

వ. అంత గురు విప్రజనానుజ్ఞాతుండయి రామపాద భృత్యుండగు సహజ పాండిత్యుండు, 57

తే. శోభ లొల్కెడి ప్రతిసర సూత్రబద్ధ పూతపాణియై సంకల్ప పూర్వకముగ
రామ పదములు గడిగి తీర్థముల భక్తి శిరముపైఁ జల్లుకొనె హరే వరద! యనుచు. 58

తే. పోతనార్యుఁ డానందాశ్రుపూర మొల్క వరదు పాదసన్నిధి నుంచె భాగవతము,
రామగళసూనహార మా గ్రంథము పయి నూడిపడెఁ గృతికాంతఁ బెండ్లాడెననఁగ. 59

క. జనులెల్లరు నా దృశ్యము కనులం గని యద్భుతమ్ము కాకుత్స్థకులే
శుని మాహాత్మ్యమ్మని పోతన భక్త్యతిశయము వే విధమ్ములఁ బొగడన్. 60

క. కరతాళధ్వానము లంబర మంటెను నగుమొగాలఁ బ్రజలెల్లరు శ్రీ
వరదుని తల నక్షతలం గురిసిరి మురిసిరి ప్రణతులఁ గొల్చిరి భక్తిన్. 61

క. పూమాలలతో మాలెలతో మాలలనాధవుండు తులఁదూఁగుచు శ్రీ
కామినితో సాటిగఁ గృతిభామిని జేపట్టి శోకవార్ధిని గట్టెన్. 62

క. అచ్చము పెండ్లికొడుకు కళ వచ్చెను రఘువరున కిట్టి వైభవములతో
నెచ్చట దృష్టి దగులునో పచ్చవిలుతునయ్య కనుచుఁ బ్రజ శంకించెన్. 63

తే నీరజాక్షి నీ విరహాన నేలఁ బట్టెననుచు మోహనరాగమ్ము నాలపింప
ధీంతెననకిటతై" యంచు దేవదాసి లాస్యములకు మృదంగముల్ లయలు వైచె. 64

క. ఆయెడఁ గల కవులకు శ్రీరాయలు నూట పదియార్లు రాంకవము లిడెన్
శ్రీయుతుఁడౌ పోతనకు నమాయికతన్ దండ మిడి క్షమాపణ వేడెన్. 65

వ. అంతఁ బోతనార్యుండు భాగవత మోక్షప్రదత్వము నిరూపింప ఫలశ్రుతి వినిపించు తలంపున మున్ను పరీక్షితుండు భాగవత శ్రవణమున ముక్తిగాంచిన తెఱం గిట్లభి వర్ణింపఁ దొడంగె. 66

తే. హస్తినాపురమందుఁ బ్రశస్తికెక్కెఁ జంద్రవంశ విఖ్యాతుఁడౌ చక్రవర్తి
పుణ్యఖని సాత్త్వికుఁడు ధర్మపుత్రుఁ డనుఁగు తమ్ములున్ నల్వు రభయప్రదాతచక్రి.

సీ. ధర్మమిట్టులు నున్నతస్థాన మంచెనా సౌధాగ్రములు నిక్కి చదలు నంటు
భీమ ప్రతాపాగ్ని బిరుదులెత్తె ననంగ హేమధ్వజాళి మిన్నెక్కి యాడు
నర్జున కీర్తి కాంతాహాస పుష్పదామమనఁ జంద్రాశ్మ హర్మ్యతతి తనరు
నకులుండు హత దుర్జనకులుం డనుటఁ దెల్ప నరబెచ్చు బెణకని పుర కుశలము

తే. ఔర ! సహదేవమై యొప్పుననుటకేమొ గృహగృహమ్మున దేవమందిరము వఱలు
శ్రీమనోనాథు కరుణా విశిష్ట మనఁగ శ్రీయుతంబయి యలరు నే సీమఁ గనిన. 68

సీ. శమనుండు స్వసుత రాజ్యంబౌట కతననో యొకపాపి నే నట నుండనీఁడు
వాయువు నిజసూను వసుధయౌ కతననో నాతిశీతోష్ణయాన మ్మొనర్చు
నిందుఁడు నా కొడు కేలు రాజ్యంబని సస్యానుకూల వర్షములు గురియు
నశ్వినీదేవత లస్మదీయ సుపుత్రికుల సీమ యని రుజల్ గలుగనీరు

తే. ఈతిబాధా విరహితమై యిటుల వఱలు నఖిల దిగ్దేవతానీక హరిహరాబ్జ
జాత కరుణా కటాక్ష సమర్థమగుచు నా పురమన శకుఁడు హస్తినాపురమ్ము. 69

తే. అందుఁ బాండవ మధ్యముఁ డగుచుఁ దనరు నర్జునునకు సుభద్రయం దతులశౌర్య
బల పరాక్రమశాలియై ప్రభవమందె శూలికి నజేయుఁ డభిమన్యు బాలకుండు. 70

తే. అతని యాత్మజాతుఁడు పరీక్షితుఁడు తాను మాతృగర్భస్థితుం డయి మనేడి వేళ
మహి నపాండవమ్ముగఁజేయ మదిఁ దలంచి వానిఁ జంప శక్తిఁ బ్రయోగపఱచె ద్రౌణి.

క. గర్భస్థితుఁడై వెతపడు నర్భకుఁడును ద్రౌణి యంపు నద్భుతశక్తిన్
నిర్భీతి హరి దునుముటయు స్వర్భానుత్య క్తభాను సరణి వెలింగెన్. 72

వ. అంతఁ గొంతకాలంబునకు ధర్మజుండు పరీక్షితుని రాజ్యాభిషిక్తు నొనర్చి మహా ప్రస్థానంబు సేయం జనుటయు నొకనాఁడు ధర్మదేవుండును భూమియు వృషభ గో రూపంబులు దాల్చి భాషింపఁ బరీక్షితుం డది విన సమీపించెఁ దోడ్తో గలిపురుషుండు

నృపాకారంబున మేయు గోవృషంబులఁ గాలం దన్నె నవియుఁ బంచితిలి భయ
విహ్వలభావంబు నొందుటయు దుష్టనిగ్రహంబునకు శిష్టరక్షణంబునకు స్రష్టరాజుల
సృష్టించె నట్లు సేయనిరాజు రాజ్యభ్రష్టుం డగుననుచు, 73

ఆ. తపము శౌచ మటులె దయయు సత్యంబును౯ ధర్మగతి చతుష్పదంబు లవనిఁ
జనియె మూఁడు కాళ్ళు సత్యపాదమె దక్కె దాని నితఁడు దునుమఁబూనె నకట! 74

క. ఇతనిని నే దునుముదునని శిత కరవాలమున, మీరు చింతిలవలదం
చతి సాహసమున నురికిన క్షితిపతిఁ గని ప్రణతులిడి వచించె నతండున్. 75

క. జదనాథా! నీ యానతి నొనరింతును నన్ను జంప నుడుగుమి యన నీ
ముని వసతులఁ బూజార్హ్వాస వనభూముల వీడి వెడలవలెనని నృపుఁడున్. 76

తే. అపుడు నృపుఁగాంచి కలి యనె నవనినాథ!
దండధరుని పోలిక నన్ను ఖండనమ్ము
సేయ నరుదెంచు నిను గాంచఁ జెదరె నెదయు
నెందు నే నుందు దయఁబూని యెఱుఁగఁజెపుమ! 77

వ. అనుటయు నరేంద్రుఁ డక్కలిని గాంచి, 78

చ. కలి భువి నుండఁగా సుకృతకార్యములన్ దలపోయఁజాలుఁ ద
త్ఫలము లభించు, దుష్కృతము తద్గతిఁగాక క్రియం బొనర్పనే
ఫలిత మొసంగు నాత్మలకుఁ బాయక శ్రీహరి నామకీర్తన
మ్మలె ముని దుర్లభంబయిన మోక్షగతిన్ సమకూర్చు నెయ్యెడ౯. 79

ఉ. కావునఁ గీడులో నొకటఁ గల్గెడు మేలయి పొల్చు నీ భువిన్
నీవు వసించుటల్ వినుము నిర్భరహింసల, స్త్రీల లోపల౯,
ద్రావు సురాదిపానములఁ, దద్విధి ద్యూతమునాడు చోటులన్,
స్థావరమున్ బొనర్చుకొని క్ష్మాస్థలి నీవు వసింపఁగాఁ దగున్. 80

తే. స్వర్ణమూలంబులైన నసత్య, వైర, కామ, మద, చౌర్య, చర్యలు గ్రాలునట్టి
స్థలములందు భవన్నివాసంబు లెసఁగుఁ గాక యని కలిన్ నియమించి కరిపురిఁ జని. 81

క. సురవినుతుఁ డా పరీక్షి న్నరపతి మృగయా వినోద నవ్యోత్సాహ
స్ఫురదంతరంగుఁడై వని కరిగె నొకటఁ గ్రూరమృగ నిహన నార్థంబై. 82

తే. ఉచ్చులన్ బన్ని వల లొడ్డి మచ్చువెట్టి జాగిలంబుల నుసికొల్పి డేగపాఁజు
విడిచిపెట్టి యీఁటెలఁ బట్టి వింట నారి నెక్కువెట్టుచు మృగయులు పెక్కుగతుల. 83

క. తఱిమిరి మృగముల నృపుఁడు౯ శరభ వ్యాళ కరి ఖడ్గ శార్దూల వృకో
త్కర హర్యక్ష గణంబులఁ బొరిఁబొరి వేఁటాడి యలసిపోయి పిపాస౯. 84

క. దరిఁ గల ఋష్యాశ్రమమున కరిగి శమీకుఁడు సమాధి నలరుచునుంటన్
గుఱుతింపక నీరడుగుచుఁ బరిపరి విధములుగ నతనిఁ బ్రార్థించె నతిన్. 85

చ. అతఁడెది పల్కకుండుటకు నాత్మ నొకించుక యల్కఁబూని యీ
గతి నతిథిన్ జలార్థి నొక కంటఁ గనుంగొన విద్ది న్యాయమే
క్షితి సురవర్య ! యంచు గతజీవ సరీసృప మొండు దెచ్చి యు
ద్ధతి ముని కంఠమందు నిడె దాని శమీకసుతుండు కన్గొనెన్. 86

చ. కని నృపు డాసి, మజ్జనకు కంఠము నందు విషోరగమ్ము ని
ట్లునిచితివౌర నీకు నిది యుక్తమె వారు తపస్సమాధిలో
మునిఁగిరటం చెఱుంగవొకొ మూర్ఖ నృపాధమ ! తక్షకోగ్రదం
శనమున నేడు నాళ్ళరుగఁ జత్తువుగాక యమోఘమౌ నుడిన్. 87

వ. అనుచు మునీంద్రుండు శపించినంత జనపతి బహువిధంబుల ఖేదించి కర్తవ్యం బెద్ది యని మునిజనంబు నడుగు నంత భగవద్గుణానుభవంబు లాపన్నివారకంబు లని చెప్పి యవధూత యగు శుకుం డొకం డీ భాగవతానుభూతిన్ బ్రసాదింప సమర్థుం డని నుడువుటయు, 88

తే. ఐహిక సుఖాదికము రోసి యస్థిరమగు దేహమోహమ్ము వీడి సందేహముడిగి
గంగ నచ్యుత కరుణాతరంగ నార్తిఁ గాంచి ప్రాయోపవేశ దీక్షను వహించి. 89

క. హరిగుణ గానమొనర్చుచు నిరయ వినాశకుని శుకుని నిర్లిప్తగతిన్
బరఁగెడి వ్యాసార్భకునిన్ హరిగుణ మోదకుని దర్శనార్థము వేడన్. 90

సీ. షోడశాబ్దప్రాయ శోభిత దేహుండు బ్రహ్మ విద్వర కళాభాసముఖుఁడు
సౌందర్య సందీప్త సకలాంగక యుతుండు ముక్తికాంతా మనోమోహనుండు
పరతత్త్వ చింతనాపరవశ చేతనుం డరిషట్కరహిత సదాచరణుఁడు
విష్ణుమమానస నిలయ సంచారుండు మాయావి నిర్లిప్త మానసుండు

తే. వర గురుండు ద్వంద్వాతీత వర్తనుండు వేదవేదాంత విజ్ఞాన విలసితుండు
భాగవతదీప్త హరికథా వ్యాసరతుఁడు శుకుఁడు ప్రత్యక్షమయ్యె నా క్షోణిపతికి. 91

క. అతఁడా శుకయోగిన్ గని యతిభక్తి నమస్కరించి యమలచరిత ! నా
వెత వినుమని స్వవిషయము విదితమొనరిచి నాకు మీరె దిక్కని వేడన్. 92

క. ముని యతనిన్ గని యిటులను జనపాలా ! తప్పుకొనఁగఁ జాలని మృతికై
మనమునఁ జింతిలఁ జనునే జనన మరణ రహిత ముక్తిసాధన గలుగన్. 93

ఆ. జనన మరణ వృక్షసంప్రాప్తిఁ బొందించు విషయ సంగకర్మబీజ మొకటె
దాని జ్ఞానవహ్ని దగ్ధముగావించి బంధముక్తిఁ బరమపదవిఁ గనుము. 94

ఆ. దుష్టకర్మ నరకదుర్గతి నొందించుఁ బుణ్యకర్మ స్వర్గభూతి నొసఁగు
వాని రెంటివిడుము పంకమున్ జలమును నంటకుండ వెడలు నబ్జమటులు. 95

ఆ. సకల జగతివిడిచి చచ్చువారిని గాంచి చావు దప్పదనుచు క్షణమెతలఁచు
సంసృతిన్ మునింగి చావునేమఱు వ్యక్తి మదిరద్రావి నిజము మఱచినట్లు. 96

ఆ. నాల్గునాళ్ళుండి నాశమౌ మేనికై సకల సుఖవసతులు సంతరించు
నద్దెకొంప నెంత దిద్దితీర్చిననేమి వెడలుమనిన దినము విడువవలెను. 97

ఆ. ఆత్మతరణమునకు నవయవమ్ము లొసంగ నవయవసుఖములకె యాత్మయనును
ప్రొద్దుగ్రుంక నెడ్ల పులుమేపుటందిఁకఁ దనదు మనికిఁ జేరుకొనుట లెపుడు. 98

ఆ. మేనుగాంచి యిదియె నేను నేనని పల్కు మేని నిచటవిడిచి నేను జనును
అది యెఱింగియుండి యాత్మ నేనని యెంచఁడిట్టి యజ్ఞవిషయమే మనఁదగు. 99

ఆ. ఆ వయములు జరయు నసమర్థశైశవ మ్మిహ సుఖానుభూతి కెపుడుతగవు
నాల్గునాళ్ళుండు నడుమంతరపుసిరి వయసుఁగాంచి మిడిసిపడుట తగునె. 100

ఆ. మాయవలలఁబన్ని మచ్చుగా నిడెనందు స్వల్పవిషయ సౌఖ్యసంచయమ్ము
వాని మేయఁబోయి వలఁజిక్కు నీ ప్రాణి కాలుఁడనెడి వేఁటకాఁడు మురియ 101

ఆ. జన్మ రుచికరంబె చావుమాత్రమె నా కనిష్టమను జనమ్మదెంత వింత
పాము పగయుఁ దోఁక బంధువు నా కనువాఁడు జగతి వెఱ్ఱివాఁడుగాఁడె. 102

ఆ. తానె పోవుటెఱిఁగి దారపుత్ర వియోగమునకు నేడ్చుప్రాణి ముగ్ధుఁడగుచుఁ
దలయెపోవుననఁ జెవుల పోఁగులకు నేడ్చువాని నేమి యనఁగవలయుఁ బుడమి. 103

ఉ. మానవుఁ డీ ప్రపంచమను మంజుల నాటక రంగభూమిపైఁ
దానొక పాత్రధారియయి దారసుతుల్ సహపాత్రలై మనం
గా నటియించుచున్ నియతకాలిక కైతవ బంధసంగియై
మానఁగనౌనె నిత్య సుఖమంగళసంగము సూత్రధారితో. 104

చ. తనదగు మన్కిఁ దెల్పుటకుఁ దల్లి యెటోపిన నేని యింతకున్
గనులను విప్పలేని పసికందు వెఱుంగఁగఁజాలు నెట్టు లే
మనుటకు నోరులేని శిశువార్తనినాదముతోడ నేడ్చుచో
జననియు రక్షసేయుటకుఁ జప్పునఁ దా నరుదెంచకుండనే. 105

చ. సలలిత పుష్పకోశవిలసన్మకరందము తేఁటివోలె నా
కుల పసరాను కీటకముగ్రోలఁగ నేర్పు నదెట్లు కూర్మి నా
యళి తనరూపుఁజేసికొని యానఁగ నేర్పనఁగాక, యట్టులే
యలసుఁడు సద్గురూత్తముని యండ లభింపమి నీశుఁగాంచునే. 106

ఆ. తనకుఁ దెలియనంత దైవంబె లేఁడని వచ్చినట్టు లెల్లవాగుచుండుఁ
బురుటిబిడ్డ యయ్యనెఱుఁగని మాత్రాన జనకు నునికియెంద సత్యమగునె ? 107

ఆ. చెంపఁగొట్ట దాని శిశువట్టు లజ్ఞానియాపదలు ఘటింప హరిఁదలంచు
జననమరణ రోగవినివారణమునకై హరి గుణానుభవమె యౌషధంబు 108

సీ. మనసులోఁ జెడుబుద్ధి మాన్పెడి శక్తియు మమతలం దెగఁగోసి మనుచుశక్తి
తలలోన సద్బుద్ధిఁ గలిగించు శక్తియుఁగలిగిన సద్బుద్ధి నిలుపుశక్తి
నిరతంబు హరిపదస్మరణ సేసెడిశక్తి హరిభక్తసంగంబు నెఱపుశక్తి
భక్తిపై నెప్పుడాసక్తిఁ గొల్పెడిశక్తి త్యాగమ్ము గలిగించి తనుపుశక్తి

తే. ముక్తిసంధాయక మ్మగు మూలశక్తి ధరణి శ్రీ మహాభాగవత ప్రవచన
దివ్య హరిగుణామృతపాన దీప్తి నొదవుఁగానఁ జింతింపఁ బనిలేదు మానవేంద్ర ! 109

ఆ. దేహమున్నవఱకె దివ్య సౌఖ్యములుండు నవల నన్ని సున్నయనును ప్రాణి
వపువు నింద్రియముల వ్యాపారముడిగినఁ గలలఁ బ్రియ సురతసుఖము నెటొందు. 110

ఆ. ఇహ జగమ్ముదప్ప నే లోకములులేవు పరసుఖమ్ము వట్టి భ్రమయటన్న
స్వప్న జగతినుండి స్వప్నేతరజగమ్మె కల్లయనెడి వెకలిగాదె తలఁప. 111

సీ. ఎవ్వాని యానతి నే ప్రొద్దు రవివిధుల్ పరివేళఁదప్పక సంచరింతు
రెవ్వాని యాజ్ఞతో నీ మహాతోయధుల్ వేలావధులు దాఁట వెఱచుచుండు
నెవని శాసనముల నీ ఋతుషట్కమ్ము మితిదాఁటి చనక సమ్మతిమెలంగు
నెవ్వాని కనుసన్న నీ పంచభూతముల్ తమతమ విధులు సక్రమతనెఱపు

తే. నెవని నుడి వేదవాక్యమై యెసఁగుచుండుఁ గదలదెవని యాజ్ఞయెలేక కడ్డిపుడక
యెవఁడు విశ్వమున్ శాసించు నిటులుతాను వాఁడెకద జగన్నాథుఁడై వఱలుతేఁడు. 112

తే. రాజచంద్ర ! బాహ్యాభ్యంతరముల వెలుఁగు చేతనాచేతనమ్ములై చెలఁగు నందె
జలధిగత తరంగమ్ములై సకల భూతసంచయము వానియందె భాసించునడఁగు. 113

ఆ. దేహ ముండువఱకె దేహ బంధువులెల్ల. వారెవారొ పిదప వీరెవారొ
నాల్గునాళ్ళకొఱకు నావారు పెరవారలనుచుఁ బాపవాపి మునుఁగనేల 114

సీ. నీలాబ్దములు కేశజాలమ్ములై యొప్ప సకల దిఙ్ముఖము లాస్యమ్ము లెసఁగ
సూర్యచంద్రులును జక్షుర్ద్వయంబై వెల్గ రే బవళ్ళను కంటిరెప్ప లలర
నోష్ఠయుగ్మంబుగా నుభయ సంధ్యలుగాల్రి వరతారకలు దంత పంక్తిగాఁగ
నదు లెల్లనున్ రక్తనాళమ్ములై వెల్గ సంద్రమ్ము లుదరకోశములుగాఁగ

తే. నద్రి నివహమ్ము లస్థిచయముగ వఱలఁ దరువరమ్ములు తనురుహస్ఫురణ మెఱయ
నఖిల విశ్వమ్ము నాత్మదేహముగఁ జెలఁగ వెలుఁగు నీ విశ్వరూపు సేవింపు మధిప ! 115

ఆ. దుష్టకర్మ నరకదుర్గతి నొందించుఁ బుణ్యకర్మ స్వర్గభూతి నొసఁగు
వాని రెంటివిడుము పంకమున్ జలమును నంటకుండ వెడలు నబ్జమటులు. 95

ఆ. సకల జగతివిడిచి చచ్చువారిని గాంచి చావు దప్పదనుచు క్షణమెతలఁచు
సంసృతిఁ మునింగి చావునేమఱు వ్యక్తి మదిరద్రావి నిజము మఱచినట్లు. 96

ఆ. నాల్గునాళులుండి నాశమౌ మేనికై సకల సుఖవసతులు సంతరించు
నద్దెకొంప నెంత దిద్దితీర్చిననేమి వెడలుమనిన దినము విడువవలెను. 97

ఆ. ఆత్మతరణమునకు నవయవమ్ము లొసంగ నవయవసుఖములకె యాత్మయనును
పొగ్గిదుగ్గింక నెల్ల పులుమేపుటందిఁకఁ దనదు మనికిఁ జేరుకొనుట లెప్పుడు. 98

ఆ. మేనుగాంచి యిదియె నేను నే నని పల్కు మేని నిచటవిడిచి నేను జనును
అది యెఱింగియుండి యాత్మ నేనని యెంచఁడిట్టి యజ్ఞవిషయమే మనఁదగు. 99

ఆ. ఆ మయములు జరయు నసమర్థశైశవ మ్మిహ సుఖానుభూతి కెపుడుతగవు
నాల్గునాళులుండు నడుమంతరపుసిరి వయసుఁగాంచి మిడిసిపడుట తగునె. 100

ఆ. మాయవలలఁబన్ని మచ్చుగా నిడెనందు స్వల్పవిషయ సౌఖ్యసంచయమ్ము
వాని మేయఁబోయి వలఁజిక్కు నీ ప్రాణి కాలుఁడనెడి వేఁటకాఁడు మురియ 101

ఆ. జన్మ రుచికరంబె చావుమాత్రమె నా కనిష్టమను జనమ్మదెంత వింత
పాము పగయుఁ దోఁక బంధువు నా కనువాఁడు జగతి వెఱ్ఱివాఁడుగాఁడె. 102

ఆ. తానె పోవుటెఱిఁగి దారపుత్ర వియోగమునకు నేడ్చుప్రాణి ముగ్ధుఁడగుచుఁ
దలయెపోవుననఁ జెవుల పోఁగులకు నేడ్చువాని నేమి యనఁగవలయుఁ బుడమి. 103

ఉ. మానవుఁ డీ ప్రపంచమను మంజుల నాటక రంగభూమిపైఁ
దానొక పాత్రధారియయి దారసుతుల్ సహపాత్రలై మనం
గా నటియించుచుఁ నియతకాలిక కైతవ బంధసంగియై
మానఁగనౌనె నిత్య సుఖమంగళసంగము సూత్రధారితో. 104

చ. తనదగు మన్కిఁ దెల్పుటకుఁ దల్లి యెటోపిన నేని యింతకుఁ
గనులను విప్పలేని పసికందు వెఱుంగఁగఁజాలు నెట్టు లే
మనుటకు నోరులేని శిశువార్తనినాదముతోడ నేడ్చుచో
జననియు రక్షసేయుటకుఁ జప్పునఁ దా నరుదెంచకుండనే. 105

చ. సలలిత పుష్పకోశవిలసన్మకరందము తేఁటివోలె నా
కుల పసరాను కీటకముగోగ్రిలఁగ నేర్చు నదెట్లు కూర్మి నా
యళి తనరూపుఁజేసికొని యానఁగ నేర్పినఁగాక, యట్టులే
యలసుఁడు సద్గురూత్తముని యండ లభింపమి నీశుఁగాంచునే. 106

ఆ. తనకుఁ దెలియనంత దైవంబెలేఁడని వచ్చినట్టు లెల్లవాగుచుండుఁ
బురుటిబిడ్డ యయ్యనెఱుఁగని మాతృిన జనకు నునికియెంద సత్యమగునె ? 107

ఆ. చెంపఁగొట్ట దాృివు శిశువట్టు లజ్ఞానియాపదలు ఘటింప హరిఁదలంచు
జననమరణ రోగవినివారణమునకై హరి గుణానుభవమె యౌషధంబు 108

సీ. మనసులోఁ జెడుబుద్ధి మాన్పెడి శక్తియు మమతలం దెగఁగోసి మనుచుశక్తి
తలలోన సద్బుద్ధిఁ గలిగించు శక్తియుఁగలిగిన సద్బుద్ధి నిలుపుశక్తి
నిరతంబు హరిపదస్మరణ సేసెడిశక్తి హరిభక్తసంగంబు నెఱపుశక్తి
భక్తిపై నెప్పుడాసక్తిఁ గొల్పెడిశక్తి త్యాగమ్ము గలిగించి తనుపుశక్తి

తే. ముక్తిసంధాయక మ్మగు మూలశక్తి ధరణి శ్రీ మహాభాగవత ప్రవచన
దివ్య హరిగుణామృతపాన దీప్తి నొదవుఁగానఁ జింతింపఁ బనిలేదు మానవేంద్రి ! 109

ఆ. దేహమున్నవఱకె దివ్య సౌఖ్యములుండు నవల నన్ని సున్నయనును ప్రాణి
వపువు నింద్రియముల వ్యాపారముడిగినఁ గలలఁ బ్రియ సురతసుఖము నెటొందు. 110

ఆ. ఇహ జగమ్ముదప్ప నే లోకములులేవు పరసుఖమ్ము వట్టి భ్రమయటన్న
స్వప్న జగతినుండి స్వప్నేతరజగమ్మె కల్లయనెడి వెకలిగాదె తలఁప. 111

సీ. ఎవ్వాని యానతి నే పొృిద్దు రవివిధుల్ సరివేళఁదప్పక సంచరింతు
రెవ్వాని యాజ్ఞతో నీ మహాతోయధుల్ వేలావధులు దాఁట వెఱచుచుండు
నెవని శాసనముల నీ ఋతుషట్కమ్ము మితిదాఁటి చనక సమ్మతి మెలంగు
నెవ్వాని కనుసన్న నీ పంచభూతముల్ తమతమ విధులు సక్రమతనెఱపు

తే. నెవని నుడి వేదవాక్యమై యెసఁగుచుండుఁ గదలదెవని యాజ్ఞయెలేక కడ్డిపుడక
యెవఁడు విశ్వమున్ శాసించు నిటులుతాను వాఁడెకద జగన్నాథుఁడై వఱలుతేఁడు. 112

తే. రాజచంద్రి ! బాహ్యాభ్యంతరముల వెలుఁగు చేతనాచేతనమ్ములై చెలఁగు నందె
జలధిగత తరంగమ్ములై సకల భూతసంచయము వానియందె భాసించునడఁగు. 113

ఆ. దేహ ముండువఱకె దేహ బంధువులెల్ల. వారెవారొ పిదప వీరెవారొ
నాల్గునాళ్ళకొఱకు నావారు పెరవారలనుచుఁ బాపవాపి మునుఁగనేల 114

సీ. నీలాబ్దములు కేశజాలమ్ములై యొప్ప సకల దిఙ్ముఖము లాస్యమ్ము లెసఁగ
సూర్యచంద్రులును జక్షుర్ద్వయంబై వెల్గ రే బవళ్ళను కంటిరెప్ప లలర
నోష్ఠయుగ్మంబుగా నుభయ సంధ్యలుగాృిల వరతారకలు దంత పంక్తిగాఁగ
నదు లెల్లనున్ రక్తనాళమ్ములై వెల్గ సంద్రమ్ము లుదరకోశములుగాఁగ

తే. నద్రి నివహమ్ము శల్యచయముగ వఱలఁ దరువరమ్ములు తనురుహస్ఫురణ మెఱయ
నఖిల విశ్వమ్ము నాత్మదేహముగఁ జెలఁగ వెలుఁగు నీ విశ్వరూపు సేవింపు మధిప ! 115

తే. నాస్తికత్వ మ్మమావాస్యనాఁటి రేయి ద్వైతగతి శశితారకోపేత నభము
నిర్మలాద్వైతభావమ్ము శర్మదమగు సవితఁగూడి ప్రకాశించు దివముసుమ్ము. 116

వ. భాగవతాక్షర చతుష్టయంబున 'భా' యన భక్తితో, 'గ' యన జ్ఞానముతో, 'వ' యన
వైరాగ్యముతో, 'త' యన తత్త్వంబు నెఱింగి మానవుఁడు ముక్తుండగునని చెప్పి. 117

శా. భక్తిజ్ఞాన విరాగతత్త్వములు సౌభాగ్యమ్ము చేకూర్చి స
న్ముక్తి ప్రాప్తినొసంగ భాగవతమై పొల్పొందె నిద్ధాత్రి నా
సక్తిఁ దానిఁబఠించినఁ వినిన నాసాంతంబు నిశ్శంక నా
వ్యక్తిఁ ముక్తివరించు శ్రీహరి గుణవ్యాసంగ సమ్మగ్నునిన్. 118

క. కావున సప్తాహమ్ములు సేవింపుము దాని ననుచు శ్రీ శుకుఁడుఁ ద
ద్భూవిభుని భాగవత కృతికోవిదు నొనరింప నతఁడుగొనె సన్ముక్తిఁ. 119

తే. మీర లటులె భాగవత మపార భక్తి విని తరించుటకై దానిఁ దెనుఁగుసేసి
హరికిఁ గృతినొసంగితి భవతరణమునకు ననుచుఁ దత్పుల శ్రుతిని బోతన వినిచెను. 120

ఆ. ఏ నృపాలవర్యుఁ డెటు లేలినన్ గాని నాకుఁ గల్గినట్టి నష్టమెంత
మా నృపాలమౌళి మహి ధర్మపాలన న్యాయముం బొసర్చె నా కృతి నిడి. 121

వ. అన, 122

క. జనముల మనములు సమ్మద వనధిన్ విహరించెఁ, గవి యవనిజాపతి సే
వన మొనరించుచుఁ దన జీవనమంతయు నచటఁ బుచ్చె వర మోదమునన్. 123

కావ్యోపసంహారము

క. అని యిటు లీకథ సూతుఁడు వినిచియు శౌనకమునీంద్ర విబుధులఁ గని యి
ట్లనె మున్నిందుఁ దొనర్చిన ఘనశపథము వీఁగె భక్తకవియే గెలిచెన్. 124

క. అది యెటులన భాగవతము సదమలగతి నెవ్వరేని సంస్కృతభాషన్
వదలి పరభాష వ్రాసిన ముదముగ నది చదువ భక్తి ముక్తిప్రదమై. 125

తే. చెలఁగె నే నట్టి బాసకు సేవజేతు మూఁడు జన్మలలోననె, మొదటిజన్మ
సింగభూపుఁడై పోతన శిథిల కృతుల నుద్ధరింపఁగఁజేసె, వేరొండు జన్మ. 126

ఉ. సంతసమొప్ప మెప్పయిన సత్తుళువాన్వయమందుఁ బుట్టి భూ
కాంతుఁడు కృష్ణరాయలనఁగాఁ జని యాంధ్రకృతుల్ రచించు ది
గ్దంతులఁ బెద్దనాది కవితల్లజులన్ దమి నాదరించి సు
స్వాంతముతోడఁ దెన్గు కృతి సంతతులఁ వెలయింపఁజేయు మున్. 127

తే. దేశభాషల యందునఁ దెన్గు లెస్స యనుచు నభిమానముం బూని యాంధ్రభాషఁ
బ్రౌఢ కావ్యముల్ విరచించి ప్రథితకీర్తినందు నా చంద్రతారార్క మవని యందు. 128

వ. మూఁడవ జన్మమందు, 129

క. బుధనుతుఁడై తంజాపురి కధిపుఁడు రఘునాథరాయ లనఁ జని ప్రేమన్
సుధ లొల్కు తెన్గు కబ్బపు నిధులన్ వెలయింపఁజేయు నిశిత ప్రజ్ఞన్, 130

వ. అని, 131

క. పోతనకవి చరితమ్మతి పూతము పురుషార్థ సౌఖ్య పుణ్యద మనుచున్
సూతుఁడు శౌనకమునులకుఁ జేతో మోదమున నిటు వచించెను గూర్మిన్. 132

వ. అంత శౌనకాది మునిగణంబు లా సూతుం గని మహాత్మా ! యోగిపుంగవుని యాదే
శానుసారంబు పోతన యాశుగతి నవతార విశేషంబులనే గతికావ్య గానంబొనరించి
దాశరథి మెప్పు వడసి భాగవత కోశప్రాప్తిం గొనె నా గాథల వినగోరుదు మన
నతండు దివ్యజ్ఞానంబున వాని నెరింగి యిట్లభివర్ణింపం దొడంగె. 133

క. అనల పరీక్షాకృత శ్రీ జనక తనూజా సమేత ! సాధుపరీతా !
ఘన కోసల నగరాంచిత జనపద నగరాధినేత ! సతత పునీతా ! 134

శా. శ్రీలక్ష్మీ రుచిరాన నోత్పలశశీ ! శ్రీవత్స చిహ్నాంకితా !
నీలాంభోధి మనోజ్ఞగాత్ర విలసన్నీరేజ పత్రేక్షణా !
బాలార్క ప్రతిభాసమాన వదనా పద్ధ్వాంత నిర్వాపణా !
త్రైలోక్యా భయదాన భద్రకరముద్రా ! రామచంద్ర ప్రభో ! 135

మాలిని

సవితృకుల విభూషా ! జానకీ స్వాంతతోషా !
నవ జలజదళాక్షా ! నష్టదేవారిపక్షా !
భవ జలనిధిపోతా ! భక్తమోక్షప్రదాతా !
భువన విజయకీర్తీ ! భూరి సౌజన్యమూర్తీ ! 136

గద్యము

శ్రీమద్భరద్వాజగోత్ర పవిత్రాపస్తంబసూత్ర, ప్రథిత సూరిజనమిత్ర, బక్కయ్యశాస్త్రిపుత్ర
వాగేశ్వరీ సమాసాదిత, వైదేహీవర నివేదిత సరసకవితావిలాస, సహజ
పాండిత్యభాస, వరకవి విధేయ, 'వరదార్య నామధేయ ప్రణీతం
బైన పోతన చరిత్రమను మహాప్రబంధమ్మునందు
దశమాశ్వాసము.



శ్రీ రస్తు.

శ్రీ వాగీశ్వర్యై నమః




## భక్తిగాథా నివేదనము - పూర్వ భాగము

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం"

దయితా హృద్ధామా!
వాదాతీతాత్మ తత్త్వ వైష్ణవనామా!
వేద శిరస్సీమా! సుర,
పాద పగుణధామ! భక్త పార్వణ సోమా! 1

గీ. భక్త కవివరాశుప్రోక్త సూక్తిలహరి రామ, మోహినీ, శ్వేతవరాహ, నృహరి,
చారుతర గుణానుభవ సుధారసఝరి వినవె జానకీనాథ! విశ్వనుతగాథ! 2

వ. అంత నొంటిమిట్ట సీతాపతి సన్నిధానంబునఁ బ్రాయోపవేశముం బొనర్చుచున్న పోతనార్యుం డార్తిమెయి దాశరథిం గని స్వామీ! జానకిని రావణుని చెఱ నుండి విడిపించితివి. మత్కృతిసీతం గాపాడుటకు కర్త వీవ కదా! మరచితివేమొ యందులకె మధుర సుధారస భరితమ్మగు నీ చరితమ్ములు గానమ్మొనర్తునని శ్రోతలఁ గాంచి భాగవత శ్రవణ కుతూహలాయత్తచిత్తులై యుంట లెఱింగి శ్రీరామావతార చారుకథాలాపంబుల నాళుగతిఁ గావ్యగానం బొనరింప నెంచి వాల్మీకిం దలంచి, 3

సీ. తలక్రింద రామశబ్దము జపించుటనేమొ తలక్రిందుచేసె నితర కవులకు
పుట్టనుండుటొ వేరెపుట్ట నుండం డిట్టి కవి నాఁగ్రమోఁగెను గంట మెందు

శ్రీ రస్తు.

శ్రీ వాగీశ్వర్యై నమః




## భక్తిగాథా నివేదనము - పూర్వ భాగము

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం"


దయితా హృద్ధామా !
వాదాతీతాత్మ తత్త్వ వైష్ణవనామా !
వేద శిరస్సీమా ! సుర,
పాద పగుణధామ ! భక్త పార్వణ సోమా ! 1

గీ. భక్తకవివరాశుప్రోక్త సూక్తిలహరి రామ, మోహినీ, శ్వేతవరాహ, నృహరి,
చారుతర గుణానుభవ సుధారసఝురి వినవె జానకీనాథ ! విశ్వనుతగాథ ! 2

వ. అంత నొంటిమిట్ట సీతాపతి సన్నిధానంబునఁ బ్రాయోపవేశముం బొనర్చుచున్న పోతనార్యుం డార్తిమెయి దాశరథిం గని స్వామీ! జానకిని రావణుని చెఱ నుండి విడిపించితివి. మత్కృతిసీతం గాపాడుటకు కర్త వీవ కదా ! మరచితివేమొ యందులకె మధుర సుధారస భరితమ్మగు నీ చరితమ్ములు గానమ్మొనర్తునని శ్రోతలఁ గాంచి భాగవత శ్రవణ కుతూహలాయత్తచిత్తులై యుంట లెఱింగి శ్రీరామావతార చారుకథాలాపంబుల నాశుగతిఁ గావ్యగానం బొనరింప నెంచి వాల్మీకిం దలంచి, 3

సీ. తలక్రిందు రామశబ్దము జపించుటనేమొ తలక్రిందుచేసె నితర కవులకు
పుట్టనుండుటొ వేరెపుట్ట నుండం డిట్టి కవి నాఁగ మ్రోఁగెను గంట మెందు

ఎఱుకౌటనో నాకె యెఱుక యంతయునన సర్వజ్ఞు రాము హస్తగతుఁజేసె
ఏనాదిజాతులఁ దానొకం డగుటేమొ యేనాది కవినని యెఱుఁగఁజెప్పె

తే. అవని నవకావ్యమగుటనొ నవరసములు వలచి యేఱులై యాశ్లోక వార్ధిఁ గలిసె
రాము కథయౌటనో తక్కురాజ కథలు రాము నీసాటి యను భావరాజి వెలసె. 4

తే. పుట్టఁ బెరుఁగు శ్రీశేషుని యట్టి దిట్టయనఁ బరంగు వాల్మీకి వ్రాయంగవలయుఁ
గాని నే వ్రాయననె నాదు కల మదేమొ కలమనుచుఁ బల్కె హరిపాద కమలయుగళి. 5

ఆ. అరయ రామనామ మమృత మెల్లరకును నింత తియ్యదన మదెట్లు గలిగె
సాక్ష్యమొసఁగుఁ బాయసాన్నమ్మె మత్కృత పిండనామ మిటులె యుండుననుచు. 6

ఆ. అవనిఁ గవులు స్త్రీని హరిమధ్యమా యన నెట్టి స్త్రీయుఁ జూలు పొట్టనింపి
కల్లసేయు దానిఁ గాని మా కౌసల్య యట్టిపేరు కెపుడు కొట్టుదేదు. 7

శా. బాలత్వమ్మున కుగ్గువోయ మొగమున్ బాల్గార్చుచున్ గల్కె నే
త్రాలున్ వట్టి యమాయికత్వమున కద్దాల్ జూపఁగాఁ బాలదం
తాలున్ బక్ష విభేదమున్ విడిచి నిద్రా వెన్నెలల్ గాయఁ బా
దాలున్ మానవ నాటకమ్మున కొకింతన్ దప్పు తాళాలిడున్. 3

ఉ. నేరుగ బాల్యమింక నతనిన్ విడనాడదు పాలబుగ్గ పొం
గారదు నూఁగు మీసముల కాకృతి యేర్పడ దీడువచ్చి నిం
డారఁగ రెక్కయున్ ముదురదప్పుడె రాజుకుఁ బ్రాణగండమై
చేరెను గౌశికుం డకట ! చిచ్చుడికెన్ గనతల్లి ప్రేవులన్. 9

సీ. పుట్టెడుఁ గౌసల్య పట్టియై హరి యనం బుట్టెఁడు ప్రేమమ్ము పుట్టెఁ బ్రజకు
నారి లాగెనొ లేదొ నారియౌ రాక్షసిం దాటకం బట్టి వధమ్మొనర్చె
వడి సుబాహువులు చేవయును బాఱఁగలేదు వడి సుబాహువుగుండె వ్రక్కలించె
దేవశక్తులు పూర్ణదీప్తిఁ జెందవు పూర్వ దేవశక్తుల నాజిఁ ద్రేళ్ళఁజేసె

తే. మీసములు వచ్చెనో లేదొ మీసము లిలనెవరు శూరులు లేరన భువిఁబరంగెఁ
దమ్ములనుబోల్ కనుల్ మమ్ము తమ్ములటులగాంచు నని ప్రేమఁబ్రజ తాను గాంచనలరె.

వ. అంత గాధేయుండు స్వయంవరమునకుఁగొని చను దారిలో, 11

తే. సురపతి కర రజస్స్పర్శ సుదతినాఁడు ఱాతిగామారె నీ నాఁడు రామచంద్ర
నరపతి పద రజస్స్పర్శ నాతియయ్యె ధర నధర్మ ధర్మముల కంతరమదెంతొ. 12

వ. మిథిలాపురి కరిగినంత జన కాదేశంబున శతానందుం డిట్లనియె. 13

తే. ఎవ్వఁడా మహాదేవు విల్లెత్తఁగలఁడొ వాఁడె జనకజామాతయై వఱలఁగలఁడు.
ఎవఁడు తా నెక్కిడఁగలేడొ శివధనుస్సు 'జనకజా ! మాత ! యని యనఁజను నతండు.

ఆ. రామచంద్రవదన రామచంద్రు నెడందమెచ్చు నామె సాటివచ్చు నతఁడె
యనుచు బాలచంద్రు నాకారమును నిజ తనువుగాఁ గఁజూపి ధనువు నుడువు. 15

వ. అంత, 16

సీ. నిల్లెత్తె నా రఘువీరుఁడు కౌశిక తనువునఁ బుల్కలెత్తన్ ముదముగ
భూపాల శిరములతోఁ బాటు ధనువును వంచెను జానకీ వల్లభుండు
జనకు సంశయముఁ దోడ్కొని నారి మునువెన్కలాడించెఁ బంక్తి రథాత్మజుండు
నారితోఁ బాటు శ్రీ నారీలలామయౌ వైదేహిమదిఁ దనవంక కీడ్చె

తే. అరయఁ బదునాల్గు భువనమ్ములందుఁ గూడ నెదురెవండింక నాకని యెగసియాడు
భార్గవుని దుర్మదమ్ముతోఁ బాటు ధనువు విఱిచివైచెను శ్రీరఘువీరుఁడపుడు. 17

క. చందురునిగూడు రోహిణి చందంబున సీత రామచంద్రుని గూడన్
గందొవలు విప్పె నెల్లెడ విందగు నగుమోములందు వెన్నెల విరిసెన్ 18

వ. అంత నొక్కనాఁడు ప్రజాగణంబు మనంబుల ఘనంబగు సంతస ముదయింప
నయోధ్యాధీశుం గని, 19

క. బుద్ధికి బృహస్పతివి పరిశుద్ధంబగు రాజనీతి శుక్రుఁడవై నన్
వృద్ధుఁడవు, రామచంద్రు మహద్ధర్మ గుణాఢ్యుఁ గువలయానందకరున్. 20

ఉ. రాజు నొనర్పఁగాఁదగును రాజ్యభర మ్మికఁ బుత్రశీర్ష వి
భ్రాజితమై యెసంగునన బాగనుచున్ ధరణీవరుండు ఘో
రాజిపరాజితారి నృపహాటక రత్నకిరీటదీప నీ
రాజిత పాదపంకజుని రాముని భానుకులాబ్ధి సోమునిన్. 21

క, కోసల దేశాధీశునిఁ జేసెదనని దశరథుండు జెప్పెను గైకే
యీసతి కిడు వరములు సింహాసనమున భరతునుంచి హరి వని కనిపెన్. 22

చ. ప్రసవపుమైత్రి వృంత మెడఁబాయఁగఁ జాలని లీల లక్ష్మణుం
డెసఁగుచు రామువెంట వనికేగెను సీతయుఁ బాయు పూవులోఁ
బొసఁగు పరీమళ మ్మటులవోయెను రాఘవు వెంటనంటి యీ
కుసుమము భృంగసంగతిని గోరని చంపకమయ్యె నవ్వనిన్. 23

వ. సీతాదేవి వనగమన పరిశ్రమలఁ గనులారంగాంచు లక్ష్మణుం డవనింగాంచి, 24

ఉ. కోకనదమ్ముకంటె నతి కోమలచారు పదద్వయమ్ముతో
నీ కఠినంపు భూస్థలుల నేఁగుచు దొట్రిలుచుండెఁ బృథ్వి రో !
నీకుఁ దనూజ యీమె పదనీరజ ముంచెడిచోట నై నను
నీ కఠినత్వమున్ విడు వనిం జరియించెడి సీత తా నిటన్. 25

తే. గగనచరుల దృష్టికిని ముక్క గానరాని సీత సకల మానవుల దృష్టిగత యగుట.
చనదని విధాత దేహభాజనుల కనులఁ గట్టివైచె బాష్పోదక కలననియతి. 26

క. తరుగిరులదాఁటి గంగాఝరిఁ జేరంజనెడి రాముఁజదల విమానో
త్కరగతి సురతతి కాంచుచుఁ బరమాదృతి హృదయమందు భావించు నిటుల్. 27

తే. ఎవ్వరా వృద్ధనావికుం డేటియొడ్డు నిలిచి రామచంద్రా ! యని పిలుచు నుఱక
యతనితో రోదసియు గుహాకృతిని దాల్చి దశదిశా ముఖమ్ములఁ బ్రతిధ్వను లొనర్చు. 28

తే. కానఁబడెనొ సూర్యాన్వయకాంతి యొండు మురిసి విరిసిన దాబోయ ముఖకమలము
కనుల విష్ణుపాదాబ్జము దనరునేమొ గంగ మోదాశ్రుపూరమై పొంగి పొరలు. 29

తే. పులకలం బారవశ్యమ్ము మొలకలెత్తు గళరవమ్మున గాద్గద్య మలముకొనును
వ్యక్తిగా రూపుఁదాల్చిన భక్తియేమొ మూర్తిగా దర్శనమొసంగు నార్తియేమొ. 30

తే. మీలు గనరావు బుట్టలోఁ బూలెకాని వలలఁబూనఁడు పూలదండలనె కాని
గాలములులేవు పత్రిఫలాలె కాని అద్భుతము నిషాదుండు ప్రహ్లాదుఁడయ్యె. 31

వ. అనుచు నమరు లరయుచుండ, 32

తే. మెఱుపుకరణి సౌమిత్రి ముందరుగుదేర లీల శంపాలతావృత నీలమేఘ
జాల మన శ్రీలలామతో స్వామి రాముఁ డేఁగుదెంచె బోయని గృపావృష్టిముంచె. 33

ఉ. ఆచ్చపుభక్తి రాఘవు సుధామధురాకృతిఁ గన్నుదొన్నెలన్
ద్రుచ్చిలి త్రావి యీ శిలలముండ్లఁ జరించుట స్వామిపాదముల్
నొచ్చెనటంచుఁ గేలఁగొని నొక్కుచు మ్రొక్కుచుఁ గండ్లనద్ది గో
ర్వెచ్చని బాష్పవారిఁ దడిపెన్ జడతన్ బడిపోయె నంఘ్రిలన్. 34

ఆ. చిన్నికొమరునెత్తు కన్నయ్యవలె స్వామి గుహునిలేపి యెదఁదఁగ్రుచ్చి మెచ్చి
వీఁపు నిమిరి బాష్పవృష్టితో వాత్సల్యసార మెంతొగురిసె మేరమీఱి. 35

తే. హరిని సేవించి గుహుఁ డిట్లులనియె స్వామి ! కనులు నినుగాంచెఁ గరములు కౌఁగిలించె
నెఱఁగెఁదల జన్మ ధన్యంబు హరవిరించి దుర్లభములగు పాదముల్ దొరకెనేఁడు. 36

శా. శీతాంశు ప్రతిమానసుందరదర స్మేరాననా సాదన
మ్మేతత్కాననసీమ వెన్నెలలఁ గాయించెన్ గృపాదృష్టి మ
చ్చేతోజాత తమోంధకార పటలచ్ఛేదమ్ము గావించె నో
సీతాకాంత ! నమస్క్రియార్హ ! నినుబంచెన్ గైక తా నివ్వనిన్. 37

శా. స్వామీ ! తావకపాద నీరజ రజస్స్పర్శమ్మునన్ గ్రావముల్
రామాకారముఁ దాల్చునంచు విననొ రామాంఘ్రులం దేదియే

నీ మాహాత్మ్యమొ మాయయో యెదియొకానీ యింద్రజాలమ్మొ యే
సామర్థ్యంబొ నిగూఢమై చెలఁగుటల్ సత్యమ్మనున్ లోకముల్. 38

ఉ. నాతి శపించి రాతిగ నొనర్చిన గౌతము బ్రహ్మతేజమెం
తో తపియించి నీదు పదధూళికినైనను సాటిరాదనన్
నా తరణిఁ ద్వదీయ చరణమ్ము స్పృశించిన మెత్తనైన యీ
పోతము పూతమై యువతి పోఁడిమి వెంటఁ బడం బ్రమాదమౌ. 39

ఉ. కావునఁ దావకీన పదకంజపరాగము పోవునట్టు లీ
పావన గాంగతోయములఁ బల్మరు క్షాళనముం బొనర్చి నా
నావ స్పృశింపనిత్తు నన నవ్వె రఘూత్తముఁ డంత బోయ నే
ర్పావహిలంగఁ బాదజల మాదలఁ దాల్చుచుఁ బొంగె నింగికిన్. 40

శా. దారిన్ నీరముఁ గొంచుఁబోవు తరుణుల్ తత్పూజనల్ గాంచి యె
వ్వా రీ పుణ్యులటంచు సీతఁ గని యో వామాక్షి ! యీ శ్యామలా
కారుం డేమగు నీ కనఁ గనులు బెళ్కఁ సిగ్గుచేఁ జెక్కులన్
స్మేరాబ్జమ్ములు విచ్చఁ జెప్పకయె తాఁ జెప్పెఁ నతాబ్జాస్యయై. 41

తే. అపుడు గుహుఁడెంచె, విష్ణువు నాదిదేవుఁ బరమపురుషుని గొల్చి తత్పాదపద్మ
ములఁ గడిగి పాదతీర్థము తల ధరించు భాగ్యము విదేహుఁడును నేనె పడసితిమని. 42

ఆ. చరణమున భవాబ్ధిఁ దరియింపఁజేసెడి పరమపురుష నవలి దరికిఁ జేర్చె
నింగితజ్ఞుఁడైన యినకులుం డతనికిఁ గంఠహారమొండు కాన్క నొసఁగె. 43

తే. మొదటనె కటాక్షమాల నా యెదను గట్టెఁ గరకమలమాలఁ బిదప మేఁ గట్టెపై చెఁ
దగ నొసంగెడి మంచి ముత్యాలమాల లౌర ! పై పెచ్చుగాక యేమగునో తెలియ. 44

తే. వసుధ నదిని దాఁటించెడువాని నేను భవసముద్రము దాఁటించు ప్రభుఁడవీవు ;
ఏకజాతివారము మన మెవ్వఁడేని కులమువారి యొద్దఁ బ్రతిఫలము గొనునె. 45

తే. జాలములఁ బన్ని విసరెడి గాలములకు యెఱను జూపి చేపన్ లాగు నరుఁడ నేను
జాలములఁ ద్రెంచి వదలించి గాలములను సకల భూతాళి రక్షించు స్వామి వీవు. 46

క. ప్రియతఁ బయోధి శయించుచుఁ బయోధి కల్లుండవగుచుఁ బాయసజన్మా
శ్రియుడ వగుచుఁ గౌసల్యా పయోధర క్షీర మానపడి వచ్చితివే. 47

సీ. ఆశావధుల నెందు నందఁజాలని యాత్ర గలిపించు పెనుకాల జలధిలోన
నెట నుండి వచ్చుటో యెచ్చటి కేఁగుటో మును వెన్క తీరముల్ గనఁగరావు
మ్రింగ నోర్జాఁచు తిమింగలమ్ములు నుండె నాసగొల్పెడి రత్నరాసులుండె
వాయుహతిఁ జలావర్తసంగతి నెప్డు తలక్రిందులగు నాదు తరణి నరసి

తే. నీ వధోగతిపాలు గానీయకుండ దివ్య పాదాబ్జ పోతమ్ము దిక్కు జూపి
యవలియొడ్డుఁ జేర్పఁగనుంటి వపుడు కూలి యొసఁగుమనినచో నే నేమి యొసఁగువాఁడ.

వ. అనెడి గుహుని ప్రేమ నాలింగన మొనర్చి సెలవుగొని, 49

క. సాగుచు ఋష్యాశ్రమముల కేఁగుచు క్షేత్రాదికముల నీక్షించుచు నం
దాఁగుచుఁ బుణ్య నదంబులఁ దోఁగుచుఁగొనె మునిగణమ్ముతో నాశీస్సుల్. 50

సీ. తరులతాకూట సుందరజటాజూట శోభిత చిత్రకూట పర్వతము నెక్కి
అతిలోక లావణ్య పతగిమృగ శరణ్య దండకారణ్య భూఖండమరసి
పూత నిర్ఝరఝరీ పుణ్య సంపత్కరీ గోదావరీ గానబోధ మెఱిఁగి
గోదా మహానటీ గురు తరంగితతటీ స్ఫురిత పంచకవటీ శోభఁ గాంచి

తే. పర్ణకుటి విరచించి సంబరము మించి యందు నివసించి దానవి యంతరంగ
భావ మెంచి ముక్కును ద్రెంచి పదియునాల్గువేల ఖరదూషణాదుల లీలఁ దున్రించి. 51

వ. వీరవిక్రముఁడై యుండ నాతి యగు చుప్పనాతి సీత యందచందంబుల నావేదనా
పూరితమగు డెందంబునఁ దెల్పుటయు దశాననుండు చెలియలి దశం గని కనికరించి
జానకిని హరింప మారీచుని బిలిపించి నియోగింప లేడి రూపుని యందుఁ జరించు
టయు జానకి కని రామచంద్రునితో నిట్లనియె, 52

ఉ. చక్కనిచుక్క జాతిదొరసానుల వీఁపునఁ బూని యద్దమూ
టక్కరి మబ్బుపిండుల హుటాహుటిఁ గొమ్ములఁ గ్రుమ్మిపెట్టుచుఁ
దిక్కులఁదేపి యిట్టి యవనిం బరతెంచె సుధారసమ్మెదో
యిక్కడ జుట్టుకొందునని యీ మృగతృష్ణను గాంచి భ్రాంతిమై. 53

క. ఎక్కడ నాఁగదు మిడుతటు లక్కనకమృగమ్ము నడుమ నాడెడి నోహో!
రెక్కలులేని పులుంగన నెక్కడనో భువి ఖురమ్ము లిటు మోపి చనున్. 54

క. దానిం గొని తెమ్మంచును జానకి రాఘవుని బనిచె స్వామి శరమ్ముఁ
బూనిచి కృతకమృగమ్మగు దానవు మారీచు నీచుఁ దగఁ బరిమార్చెన్. 55

ఆ. దొడ్డిదారి నుండి దొంగ కుక్కరమట్లు పర్ణశాలఁ జొచ్చి పంక్తికంఠుఁ
డందు నిందుఁ గాంచి యనుమాన మొలయక యుండునటులు మాయ నొందు దాల్చి. 56

ఉ. దానవుఁ డుగ్రమార్గణ విదారిత ఘోరశరీరుఁడై ప్రియా!
జానకి!, లక్ష్మణా! యనుజ! చచ్చితి నే నని రామవాక్య నా
దానుకృతిం బొనర్చి పృథులార్తిని గూలెను, సీత లక్ష్మణుఁ
దానయి పంపె రాఘవునిఁ దార్కొనె నేదొ విపత్తటంచునుఁ. 57

ఉ. మీసము గడ్డముం బెనిచి మిన్నిగఁ దాల్చి కమండలమ్ముతో
మోసమొనర్చు కొంగజపముం దగఁజేయుచు సోఁకు దొంగ స
న్యాసపు వేసమూని మృదుహాసము మైదములోని కత్తియై
భాసిల భిక్షభిక్ష యన భామిని స్వామినిగాంచి భక్తిమై. 58

ఉ. స్వాదగు కందమూలఫలసంతతులన్ బికిరంపు పాత్రలో
మోదమెలర్పనుంచ యతి మోసపువేసము వీడి జానకిన్
మేదినితోఁ బెకల్చి తమిమీఱ విమానమునందుఁ జేర్చి వే
పోఁదొడఁగెన్ గపోతిఁగొనిపోయెడి శ్యేనవిధాన మేర్పడన్. 59

క. హా లక్ష్మణ ! హా రాఘవ ! బాలిశుఁ డసురుండు మీకుఁ బాపుచు నన్నా
ఖీలగతిఁగొనుచు నేఁగెడి స్త్రీలోలుఁడు వీనిఁ జంపు స్థిరమతిలేఁడే ! 60

తే. ఔర ! మిథిలాధినాథుని యాడపడుచు కోసల నృపాలమౌళికిఁ గోడలమ్మ
దాశరథియగు రాముని ధర్మపత్ని దిక్కుమాలినదై యేడ్చు దినమువచ్చె. 61

చ. అని మొఱపెట్టుటల్ విని జటాయువు సాయము సేయఁగోరి వే
చని కని రావణున్ నిశితచంచుపుటోగ్ర నఖాగ్రఘాతలన్
దునుకలుగాఁగఁ జీరుచును దుక్కగునట్టులు గీఱుచుండె న
ద్దనుజుఁడు వేఁగలేక యసిధారలఁ జెక్కెను పక్షిరెక్కలన్. 62

ఉ. క్రూరుఁడు రావణుండు పులుఁగున్ భువిఁగూల్చి క్షణమ్ములోపలన్
జేరఁగఁబోయె లంక, నల శ్రీరఘువీరుఁడు పర్ణశాలలో
సారసనేత్ర నయ్యవనిజాతను గానక జానకీ ! ప్రియా !
చేరఁగరావె ! యన్న వనసీమఁ బ్రతిధ్వను లీనె నల్గడల్. 63

ఉ. దారులఁబట్టి పర్విడును దారనుగాంచమి బెంగహెచ్చుగాఁ
జేరుచుఁ బిచ్చివానివలెఁ జెట్టును జెట్టును గుట్ట గుట్టనున్
నూఱులతేపలన్ వెదకు నుగ్గుగుండియ నేడ్చు నార్పు సం
చారుల బాటసారులను జాడలవేడు నిరాశఁగూడుచున్. 64

ఉ. రామున కాలిపైన ననురాగ మదెంతయొ చూడనెంచి యో
భామిని ! కాన దాఁగితివె ! వన్యమృగంబులె పొట్టఁబెట్టెనో
బూమెలఁబన్ని దానవులు పొంచి హరించిరా గౌతమీనదిన్
దామరపూలఁగోయ జలధార నొకించుక కాలుజాఱెనో. 65

చ. తెలుపవె లక్ష్మణా ! యనును దిట్టును దిట్టుకొనున్ మహోదధిన్
గలిపెద లోకమంత యను గాంతను సీతను జూపకున్నచోఁ

ప్రళయమొనర్తు నేనను బాలిశులైన సురాసురాళినిన్
నలిపెద నీ త్రిలోకముల నా కెవరడ్డమొ చూతు నేఁ డనున్. 66

చ. జనకజ నన్నుగాంచి, 'మునుచండిక చేసిన పుణ్యమేమొ యీ
శుని సగమేన నైక్యమయి చొప్పడునంచు వచించు నన్వీడన్
క్షణమొక గండమై యుగము చాడ్పునఁదోఁచు' నటంచుఁబల్కె మా
నిని నను వీడి జీవముల నిల్పదు నిశ్చయమిద్ది లక్ష్మణా! 67

సీ. అనుచు సోదరువెంట నడవులన్ మడువులన్ జెట్టు గుట్టలఁబట్టి చింతనేఁగు
ఏఁగి యంజనిసూనుఁ డెఱిఁగింప ననుకంపనద్రి సుగ్రీవున కభయమిడును
అభయమ్మొసఁగి వాలి నత్యంతబలశాలిఁ గాండమ్ముతోనె స్వర్గతునిజేయు
చేసి కిష్కిందాభిషిక్తునిగాఁగ సుగ్రీవు స్నేహాంచితభావు నిలుపు

తే. నిలిపి యచ్చోటనుండి నెచ్చెలి యనిపిన హనుమ యబ్ధినిదాఁటుట దనుజపురిని
గాల్చి వని సీతజాడను దేల్చితెచ్చు నలఘు చూడామణిని గేలనంది మురిసి. 63

క. వానరబలమును గొనిచని తా నంబుధిఁ జేరఁబోయి దాశరథి విన
మ్రినుఁడై రత్నాకరు దానవపురిఁ జేరుకొనఁ బథమ్మిమ్మనియెన్. 69

సీ. నా యుప్పుదిని జీవనమునిల్పు లోకమ్ము విశ్వపాలకుఁడనై వెలయుదునని
నా యప్పలనుగొని నడయాడు ఘనవృత్తి ఘనులకున్ ఘనుఁడనై మనియెదనని
మా పుత్రికనొసంగ మహినేలు విష్ణుండు ఎందుఁబై చేయినై యెసఁగుదునని
అమృత భిక్షలనిచ్చి యలరింతు నమరాళి దేవతారాధ్య ప్రభావుఁడనని

తే. అంతుఁ దెలియఁగనీని యనంతుననుచు నెత్తినన్ నోరు నిడికొని మొత్తుకొనుచు
మిన్నుముట్టు గర్వమ్మున మిడిసిపడుచు నెగసిపడు మహోదధిఁగాంచి యినకులపతి. 70

ఉ. ఆనన రాగరేఖఁ బ్రళయాగ్నిశిఖాకృతి మోసులెత్తఁగాఁ
బూనిచె మేల్మరమ్ము జలపూర్ణనవాంబుద సంగత ప్రభా
స్థాన తటిల్లతాభమయిసాగు ధనుర్గుణమందు లోకసం
తానము కంపమంద సురదైత్యవరుల్ బెగడొంద రాముఁడున్. 71

తే. ధనువుఁదాల్చుట జలనిధి తనువుఁదాల్చె గుణముగూర్చ నొకించుక గుణమువచ్చె
శరమునుంచుట నుదధిలో శరములింకె జడధి రత్నాకరుండేని జడధిగాఁడె. 72

వ. అంత నా రత్నాకరుండు రామచంద్రుం గాంచి శరణాగతుండయి, 73

ఉ. ఆర్యమదివ్యతేజ! శరణాగతవత్సలతావిరాజ! మీ
కార్య మవిఘ్నతన్ వఱలఁగాఁ దగినట్టుల గూర్చువాఁడ పో

కర్యము, విశ్వసృష్టిలయ కారణరూప! శుభప్రతాప! నా
చర్య క్షమింపఁగాదగును స్వామి విధేయుఁడ మీకు నెయ్యెడన్. 74

తే. తనయముక్తికై తండ్రి బంధము సహించెననఁగ వారిధిన్ సేతుబంధనమువఱలె
సేతుపథమున వానరసేనలెల్ల లంకఁజొచ్చె రావణు హృది శంక హెచ్చె. 75

ఉ. అంగదరాయబారి దనుజాధిపుఁగాంచి మదాంధ! రావణా!
సంగరమందు మా జనకజాపతి గెల్తునటంచు నెంచుచో
ముంగల భూమిఁబూన్చు కపిముఖ్యుని యీ పదముం గదల్చు యో
ధుంగొని తెమ్ము సైన్యములతో ననికిం జనుదెమ్మటం చనెన్. 76

చ. అనవిని రావణుండు సభయందు వసించెడి దైత్యవీరులం
బనిచిన వార లంగదుని పాదము సూదిమొనంత యేనియున్
మొనసి కదల్ప లేకునికి మోమునరోసము మోసులెత్త నా
పనికయి తానె పూని కపిపాదముఁబట్టె, విభీషణుం డటన్. 77

శా. అన్నా! రావణ! నీ కిదేమిగతి నీవై సీతనర్పించి శ్రీ
మన్నారాయణుఁడైన రాఘవుని శుంభత్పాదరాజీవముల్
గొన్నన్ మేలగుఁగాదె యంచుఁ బలుకన్ క్రుద్ధాత్ముఁడై తమ్మునిన్
దన్నెన్ రాజ్యము వీడిపొమ్మనుచునుం దైత్యేశ్వరుం డంతటన్. 78

వ. దండతాడిత కాలభుజంగంబు భంగి రోషానలారుణనేత్రుండగు విభీషణుండు. 79

సీ. అన్యకాంతలమేని యంటనీయని కాంతిఁబులి కళాసపుఁజెల్వు దలఁపవలదె
పరభామినీవేణి స్పర్శింపఁగారాని నల్లనాగమని యనంగవలదె
పరసతీ మృదు బాహుబంధ సౌఖ్యమభోగ్య విషఫణిద్వయిగ భావింపవలదె
అన్యాంగనా మందహాస సుందరకాంతిఁ గనరాని తటిదగ్ని యనఁగవలదె

తే. పరవనిత చూపులనుభవబాహ్యమైన మకరనికట సరోజయుగ్మమనవలదె
కుమతి! కామాంధ! పాపకూపమునబడుట కాంచలేవని యటనుండి కదలిచనియె.

ఉ. రావణుఁడెం దపావనుఁడు లంక కళంకయె రాజ్యవైభవం
బే విధిఁగాంచినన్ భవమె యీ ధన మింధన మగ్నికీల య
ప్పావనశీల సీత తలఁపన్ నగరంబు గరం బటంచునున్
బోవిడె లంక రాఘవుని పొంత నతిన్ శరణాగతిన్ గొనెన్. 81

ఉ. అంత రఘూత్తముండు శరణార్థి విభీషణు సత్యభాషణున్
జెంతకుఁదీసి లంక కభిషిక్తుని జేసెదనంచుఁ బల్కె సు
స్వాంతముతో దశాస్యుఁడె వెసన్ శరణాగతుఁడైన విప్డు నా
వంతుకువచ్చు కోసలముఁ బట్టముగట్టెద వానికేననెన్. 82

వ. రావణుండు నిజాంతరంగంబున జానకీ విరహానలతప్తతనుండై చింతించుచుండొడంగె నిట్లు,

సీ. ఆపన్నివారకుండని రాము స్మరియించు భయదదైత్యాంగనా క్రియల నరసి
తృణతుచ్ఛము లివి నాకని తిరస్కృతిచేయు నాత్మీయవైభవ మూసచూప
అన్యకాంతలు తల్లులను బుద్ధి వొడమును కైతవరాఘవాకార మూన
ధరణిజ యాసన్నమరణమై నటుదోఁచు హతరామ శీర్షదృశ్యమును జూప

తే. ఇంకనేరీతి నాతి నా వంక దిరుగు నాజి నొనరించి రాఘవు హతమొనర్చ
టొక్కటియెతక్క వేరొండు దిక్కుఁగలదె అనిససైన్యుఁడై దైతేయుఁ డనికిఁజనియె.84

సీ. కొండలైన యధర్మకాండమ్ములిటు నేలఁ గూలుతుమన నద్రిరాల రువ్వి
వృక్షమ్ములై పెర్గు వృజినమ్ములిటు వ్రేళ్ళఁ బెకలింతు మనఁదరుల్ పెఱికివైచి
తలలెత్తు రాక్షస దౌర్జన్యమిటు గూల్చఁగలమన గోపురాగ్రముల డుల్చి
కులధర్మగతి కడ్డుగోడ లీ గతిఁ గూల్తుమనఁగఁ బ్రాకారముల్ దునిమివైచి

తే. పొలసుదిండ్ల గోతులనిడి పూడ్తుమిట్టు లనఁగఁ బరిఖలంబూకిచి యడరి తొడరి
దైత్యనాశ ముగ్రాకృతిఁ దాల్చెననఁగఁ బోరెఁ గపిసేన జయ రఘువీర ! యనుచు. 85

క. ఖండిత విద్విడ్బల దోర్దండుఁడు లక్ష్మణుఁడు ఘనుఁడు దర్పోద్ధతి ను
ద్దండత సమరాంగణమునఁ జెండెఁ ఖలచిత్తు నింద్రజిత్తుఁ మత్తున్. 86

తే. పర్వతమ్ముల పక్షముల్ పవిముఖమునఁ జెక్కి క్షోణిఁగూల్చెడి సునాసీరుతీరు
కరపదమ్ముల మార్గణాగ్రములఁ దున్మి కుంభకర్ణుని మహిఁగూల్చెఁ గోసలపతి. 87

ఉ. కాలభుజంగ దారుణ ముఖప్రవిదీప్త కరాళదంష్ట్రికా
జాలము నేలు రామకర సంగ్రథితోగ్ర ధనుర్విముంచ దా
భీలశిలీముఖమ్ము లతిభీకరలీల దశాస్యు గుండియల్
చీలిచి ప్రాణవాయువు భుజించె భజించె నజాండభాండముల్. 88

క. విరిసోనలఁ గురిసిరి కిన్నర సురగరుడోరగులు ఘనమ్మగు మోద
స్ఫురణంబున మునిజనములు పరమానందమున గొప్ప పండుగ జరుపన్, 89

క. విశిఖహతి, జనకసుత దుర్దశపీడన్ మోదమువఁదిగ్రదశగణమాదఁ
దశదిశలు శాంతిగూడఁ దశవదన వధం బొనర్చె దశరథసుతుఁడుఁ. 90

క. పరసతులఁ దరియఁజని యిక్కరణి స్వభార్యలకె దూరగతులై రనుచుఁ
శిరమురము బాదుకొనుచుఁ గరమేడ్చిరి యార్చిరసురకామిను లంతఁ. 91

క. రాముఁడు రాక్షసలోకవి రాముఁడు సద్గుణగణాభిరాముఁడు నతసు
త్రాముఁడు భామినిఁగన వనధామంబున కరిగెఁ బ్రేమ దార్కొనఁగడఁకన్, 92

ఉ. రక్కసి యాండ్రిఁజిక్కి వెతరాలెడి యత్రుల గుర్తిడ్లఁ గుర్కిక్కి దు
మ్మెక్కుటలొక్కపైన కురులిట్టటుఁ జెక్కి కృశించి వెల్లనౌ
చెక్కిలి చేతనొక్కి పలుచింతల వంతల స్రుక్కి ప్రాణముల్
జిక్కి కనుంగొనందనరె సీత కకుత్థ్సకులేంద్రు మ్రుంటగన్. 93

చ. అనుపమరూపశీల సుగుణాలయ నమ్మహిజాతసీత నా
యినకుల వల్లభుండరసి యాపు పవిత్రివె సర్వభూతముల్
గనుగొన నగ్నిఁజొచ్చి త్రిజగమ్ములు సీత వినీతపూత యం
చనఁ జనుదెమ్మటంచు సతి నగ్నిప్రవేశ మొనర్పఁజేయుటల్. 94

ఆ. చిచ్చుఁజొచ్చి సీత శీతాంగకమ్ముల బయటఁబడియె భూతచయము వొగడ
నగ్నినైన నివలనైనఁ జొక్కముపైఁడి యెట్టిమార్పులేక యెనఁగు ననఁగ. 95

శా. ప్రావృట్కాల పయోదవృష్టి మలినాంభఃపూర మేఁగెన్ దశ
గ్రీవుండై, శరదంబు పూరమయి యేఁగెఁ గుంభకర్ణుండు దు
ర్భావుండై దరిఁజేర నీనిగతి, శుభ్రిస్వాంతవృత్తిన్ బ్రిజల్
సేవింపం దనరెఁ విభీషణుఁడు తాల్మిన్ గ్రీష్మసోత స్సనన్. 96

వ. అంత విభీషణుండు రాఘవుం గని, స్వామీ! నీ చర్య లగమ్యంబులు. 97

క. ఆఁడది పరపురుషునితోఁ గూడం జన నెందు ముక్కుకోఁతలఁ బడు న
వ్వోఁడిమి పురుషుఁడు పరసతిఁ గూడఁగఁ దలపోయ మడిసి కూలునటంచున్. 98

క. రక్కసి యగు శూర్పణఖను మొక్కలుఁడగు రావణుని యమోఘాస్త్రములన్
ముక్కుడఁచియు నుక్కడఁచియుఁ జక్కని మార్గమున భువిని శాసించితివే. 99

క. శ్రీని విడి హరిని జేరిన దానవి యగు చుప్పనాతి దశ ఘటియిలు శ్రీ
మానిని జేరి హరిన్ విడ దానవపతి యగు దశాస్యు దశ గనఁడె యనున్. 100

వ. కావున శ్రీమానినీ పురుషకారంబున శ్రియఃపతి నాశ్రయించి తరింపనగుగాదె యన. 101

ఉ. తా నినవంశమండనుఁడు దైత్య విభీషణు సత్యభాషణున్
మానిత సాధుపోషణు రమాపతితోషణు శీలభూషణున్
దానవరాజ్యపీఠికి పత మ్మభిషిక్తు నొనర్చి సీతతో
నూన విమానయానమున సొంపుగ నెక్కి యయోధ్యకుఁ జనన్. 102

చ. చనుట లయోధ్యకుం దిరిగి చయ్యనఁ బ్రాణము వచ్చినట్టులై
కనఁబడె. మాతృమూర్తులును గ్రమ్మఱఁ దాము ప్రసూతలైన య
ట్లనుకొని కౌఁగిలించిరి నిజాత్మజులన్, రఘురాము నాత్మకున్
జనకుఁడు లేవిదే కొఱఁత పర్వము నెప్పటియట్ల కన్పడెన్. 103

తే. భరతుఁ డానందభరితుఁడై పాదయుగళి నక్షియుగ మద్ది యశ్రుతోయములఁ గడిగి
యడుగులందు సమ్మోళిగ లిడియె నంత ముని వశిష్ఠుండు జటివేష ముక్తుఁజేసె. 104

సీ. నక్షత్ర శోభలన్ నగుబాటు గావించు మహితాచ్ఛ మౌక్తిక మండపములు
కమనీయ మండప రమణీయ కాంతులఁ దులదూఁగు పచ్చలతోరణములు
పురుహూతచాపమ్ము నిరసించు నవరత్నపూరిత స్వాగత ద్వారములును
శృంగాటక వితర్ది రంగారు జయకేతువుల వెల్గు నలువైన కలువడములు

తే. పార్శ్వ దీప్త రంభాస్తంభ భాసమాన మార్గ జలయంత్రసించిత మార్గతోయ
రాజితా గురుధూప సౌరభ్యపూర్ణ గగనదీప్త యయ్యె నయోధ్యనగరసీమ. 105

చ. నగరులు నేత్రపర్వముగ నాలుగు మూల లలంకరించి యెం
దగపడఁ దూర్యనిస్వనము లాకసమంటఁగ మంత్రిపాఠముల్
నెగడఁగ వామసీమ నవనీసుత పీఠి వెలుంగఁ బౌరులున్
నగవులఁ బూలు జిమ్మ రఘునాథుఁడు రాజ్య రమాభిషిక్తుఁడై. 106

వ. అలరు తఱి, 107

సీ. సౌమిత్రు లిరువురు చామరంబులు వీవ భరతుఁడు ఛత్రము బట్టి నిల్వ
మారుతి శ్రీపాద నీరజమ్ములు గొల్వ భల్లూకపతి బరాబరు లొనర్ప
అంగద సుగ్రీవు లవనిజాపతి చెంత వేత్రహస్తంబుల వెలయుచుండ
ముని వసిష్ఠుఁడు స్వస్తి పనస లాలాపించ దైత్యనాథుఁడు రవిధ్వజము బూన

తే. సురలు విరిసోన గురియ నప్సరసలాడ మింటఁ దుంబురు నారదుల్ జంటఁ బాడ
నజహరాదులు జూడఁ బృథ్విజనులెల్ల నొకట గుమిగూడ రాముఁ డయోధ్యఁ గొనియె.

తే. రాముఁ డేకాదశ సహస్ర రమ్య వత్సరములు ధర్మఖడ్గముఁ బూని రాజ్యమేలఁ
గఱవు కఱవయ్యె లేమికిం గల్గె లేమి యాయురారోగ్యభాగ్యంబు లగ్గువయ్యె. 109

వ. అని యిట్లు శ్రీరాముని చరితంబు బాడి మఱునటి రాత్రి పోతనార్యుండు హరిం గనుం
గొని స్వామీ ! మోహిన్యవతార విశేషంబున నసురుల బారి నుండి సుధను రక్షించిన
చందంబున మత్కృతిని రక్షింపవే యని తదవతారకథావిధానంబు నేతద్విధం బాఱుగతిఁ
గావ్యగాన మొనర్పఁ దొడంగెను. 110

గీ. జగతి సుఖములు స్థూల సూక్ష్మమ్ములనుచు నిరుతెఱంగులు, స్థూలమ్ము క్షరము నెంతొ
సులభసాధ్యమ్ము, తద్గతి సూక్ష్మసుఖమొ యధికతర కష్టసాధ్యమ్ము నక్షరమ్ము. 111

క. బుద్ధిగ్రాహ్య మతీంద్రియ మిద్ది యనుచు సూక్ష్మసుఖము నెఱిఁగిరి పెద్దల్
బద్ధులు విషయ సుఖమ్ములె పెద్దవిగాఁ దలఁచి దాని బ్రేమింతు రొగిన్. 112

క. సురవంటిది యైహికసుఖ మరయన్ సుధవంటి దెండు నాముష్మిక సౌ
ఖ్యరమ యని కూర్మరూపత హరి తెల్పెను రెంటిలోని యంతర మెంతో. 113

తే. జ్ఞాన వైరాగ్యరాశిని నే నటంచు మారు బూదినొనర్చిన కూరుఁడ నని
మిత్తి గొంగనై విషమును మ్రింగుదునని గర్వియై మోహినిం గని కరఁగె హరుఁడు.

తే. సద్గురు సమాశ్రయణము సత్సంగగుణము శౌరి భక్తియు మాయావిదూరుఁజేయు
చక్రిధరుని నిర్హేతుక జాయమాన సత్కృపా కటాక్షమ్మున జతపడు వివి. 115

వ. ఒకమారు పార్వతీ సహితుండై పరమశివుండు హరిని దర్శించి, 116

చ. సురతతికిన్ సుధారసముఁ జొప్పడఁ బంచిన మోహినీ కళే
బర మొకమారు కన్బఱచి పావనుఁ జేయుమటంచు వేడఁగా
హరుఁ గని యట్టిరూప మెపుడైనను గాంచెదుగాక యంచు శ్రీ
హరి యరిగెన్, శివుండు దపమందు మునింగెను నంత నొక్కెడన్. 117

సీ. ప్రకృతికాంతా కృత బహుళవర్ణ సజీవ చిత్రమ్ములన వృక్షసీమలొప్ప
విశ్వయోషాగాన వివిధతాన స్వరకల్పన లన విహంగరుతి వఱలు
భువన మోహిని భావపూర్ణ ప్రణయ కావ్యబంధమ్ములన లతాపాళి యలరు
రసజగ ల్లలనావిలాస హాసానంద దీపమ్ములనఁ బూలరూప మొలయు

తే. క్ష్మాసతీమణి నిర్హేతుక ప్రభూత ఘన కటాక్షసారమ్మనఁ దనరు రుచుల
చంద్రిసూర్య సంశ్లేష సంజాతభూమి పులకితాంగమ్ములగు తృణాకలితవనుల. 118

తే. తరుల మించిన మృదుల వల్లరి యనంగ వల్లికల మించు కోమల పల్లవమన
బల్లవాప్త మనోహర ప్రసవ మనఁగఁ బ్రసవ నిర్గత మకరంద రసఝరి యన. 119

తే, కళలకుం బ్రోవు సౌందర్యములకుఁ దావు యౌవన విలాసవిధి ప్రణయింపు జలధి
రమణి యొక్కతె జగముల భ్రమలు గొల్పు స్మేరకోరకితాస్యయై వెలుపు మీర. 120

వ. చేతనొక బంతింగొని. 121

సీ. ముఖ చంద్రమండలమునకు పీడేయని యలకలు ఫాలానఁ గలియఁబడఁగ
ఘనకుచద్వంద్వ చక్రి సమమ్మెయని గళాంచితరత్నహారాళి చిక్కువడఁగ
జఘనమండలమును సరిపోలునే యని కాంచీగుణమ్ములు కలహమొంద
ఇంతిముందీ పూలబంతి యెంతని మేన మనుపట్టుపుట్టమ్ము పెనఁగులాడ

తే. ఆఁగకుండఁ జక్కఁల నిట్టు లాడుచుందు వేలనె మిడిసిపడుట ఓ యొగిరిపడుట
లనుచు శిరమార్చికొట్టు పీ యతివ యనఁగఁ గందుక క్రీడసల్పుచుఁ గాంతవచ్చె. 122

చ. వలపులు మోసులెత్తఁ జెలి వాల్గనులన్ హరుఁజూచె నంతలో
మలయపు గాలివీచె నవమల్లికపూచె సుగంధ మాత్మలన్

నిలువునదోఁచె నా మనివనిన్ బలువన్నెలఁదోఁచె శాత్రిప్యమా
కలరుతులట్ల శకుంతమృదుగాన వితానములూఁచె నుల్లమున్. 123

సీ. అందాల ఫాలమ్ము నలమి పైఁబైఁబడి ముద్దులు గొనవచ్చు ముంగురులును
కౌఁగిలింపఁగవచ్చు కనురెప్పలన్ లజ్జ పెనఁగులాడెడి సోగకనుల జంట
ఆస్యపరిమళ మ్మానగానాసమై మొనఁదేరు మునువచ్చు ముద్దు నాస
తేనియల్ జిల్కు వా తెరఁగూడి దాఁగురుమూఁతలాడెడి పలుమొగ్గవరుస

తే. అంకురితములౌ లజ్జాభయాళినోలిఁ బెనుపఁగాఁ దలలెత్తెడి స్తనమిథునము,
అరుగు స్వేచ్ఛాపదమ్ముల నణఁచిపట్టు సొరిది నెదుగుచువచ్చెడి శ్రోణియుగము. 124

క. అలరెడి యలరుంబోఁడిని దిలకించి భవుండునాపె తీరగు సొరుల్
దలఁచుచు మదిలో నూరక తలనూఁచును దనదు జన్మ ధన్యమ్మనుచున్. 125

తే. కని హరుఁడు పిచ్చియయ్యెను, గమలభవుఁడు విచ్చవడి మచ్చెకంటి తా నెచ్చటిదనె,
వజ్రి యీమె కాలికిఁ బోలవలయుననిన రంభ లూర్వసులుం బుట్టిరావలెననె. 126

సీ. తనజాతి నిస్వనమ్మనియెంచి కలకంఠి కిలకిల నవ్వఁ గోకిలలుగూయు
తన మూఁకపల్కునుకొని కల్కి వాక్సుధల్ జిలుక వన్నెల రామచిలుక పలుకు
తనగుంపు మధువాననని యెంచి పద్మాస్యయల కలంగని మూఁగు నలికులంబు
తనమంద చూచునన్కొని చంద్రిముఖి బెళ్కుయాడుచూపుల డాయు నాడులేళ్ళు

తే. తనకులమ్మె చివుర్చె మాధవరతినని కొమ్మమైగాంచి తలలూఁచె గొమ్మలెల్ల
అంత నా కాంతనారసి స్వాంతమందు నిట్లు తలపోయుచుండె మహేశ్వరుండు. 127

సీ. శాంకరి నీయమ సరిపోల్తుమనియన్న నెడమయెయగుఁగాని కుడియెటౌను
అమరవాహిని యీమె సమతయౌననఁ గాలిగోరునకుం దిగజాఱిపోయె
వాణి యీ యమ సాటివచ్చునో యనుకొన మాటలెకాక యే పాటిపొత్తు
కలుముల చెలి యీమె తులతూఁగుననుకొన సగమునకైనను సాటిగనునొ

తే. మారుబూది యొనర్చినశూరవరుఁడ నారి ననుగెల్వుమనివచ్చె నా రతి యిటు
మూఁడు శక్తులమించిన మూలశక్తి యెవతెయగు దీని నిసుమంత యెఱుఁగలేను. 128

ఉ. నవ్వులమల్లికల్ విరియ నాతి రసేక్షణపంక్తు లెయ్యెడన్
మవ్వపుటబ్జముల్ గురియ మంజువిలాస యుతాస్యబింబ మీ
జవ్వనపు న్మహోదధిని చంద్రిముఁడై మెఱయున్ సుమాస్త్రిఁ డా
పువ్వు శరమ్ములెక్కుడిడిఁ బూన్చిన నారియెకాక నారియే. 129

చ. నిశి పొగయై దిశాతతుల నిండఁగఁ, దారలు విస్ఫులింగ రూ
పశతములై దివమ్మున విభాసిల, వాయువు లూఁదు గాడ్పులై

దిశలకుఁ బ్రాఁకఁ గ్రొన్నెలయొ దీపశిఖాకృతి జ్వాలలెత్త సూ
నశరుఁడు పాంథ చిత్త సదనమ్ములఁ జల్లఁగఁ గాల్పఁ జొచ్చెడిన్. 130

చ. జలనిధి జన్మమొందుటయు శైత్యఘనోన్నతిఁ గూడియాడుటల్
చలువలు గ్రుమ్మరించుటలు సాంద్ర సుధానిధు లొల్కఁబోయుటల్
కళల విలాస మీనుటయుఁగాదె తలం ధరియింతు నిన్నిటుల్
జలధిజ బాడబాగ్నివని స్వాంతమునన్ దలఁపన్ నిశాచరా! 131

శా. సౌందర్యామృతసింధువున్ ద్రుహిణ శీర్షశ్రేణి మంథాన మా
కందంబై నవనీత ముప్పతిల వీఁకన్ ద్రిచ్చఁగా నద్ది క
న్వందో నీ తరుణీలలామ మయి రాణించెన్ బళీ! దీనివౌ
కందమ్ముల్ రమణీయతా గగన రాకాచంద్ర బాలార్కులో. 132

సీ. మీనంబు పొలసుల మేన్వీడి స్నిగ్ధతం గాంచఁ దా నీలేమ కనులఁ బడియె
కమఠంబు మృదుతను గడియింపనెంచి యీ వనిత శ్రీపాదాలు వట్టుకొనియె
కిటి యీమె మైకాంతి ఘటియింప స్వర్ణ నిష్కవరాహగా మారుజన్మమెత్తె
హరి సర్వభూత దయాభ్యాసమునకు నీ పడఁతి లోనికి వచ్చి వడుము గట్టె

తే. వామనుఁడు మెడం బడి ధనస్వామి యయ్యె రహిని రామత్రయమ్ము నీ రామ రూపు
బూని సుప్తపంచశరుఁ బ్రబుద్ధుఁజేసె ఘన జగన్మోహనాకృతిఁ గల్కి యిదన. 133

ఉ. నల్వ ననుం జయించుటకె నాతిని దాను సృజించె నిట్టులీ
చెల్వ యపూర్వసుందరి విచిత్ర విలాసిని లజ్జితాస్యయున్
బల్ వగలాఁడి క్రొవ్వయసు బంగరు రంగులు జిమ్మ జిగ్గు మే
ల్వల్వ మఱుంగు దాఁటి వెలివచ్చిపడన్ గనఁ జోద్యమయ్యెడిన్. 134

వ. అంత నా సమయంబునందు, 135

ఉ. ఇవ్వన లక్ష్మి నాఁ బరఁగి యేకతఁ గానల నేఁగుచున్న యా
జవ్వని తొట్రిలం బదము శల్యవిబాధితనంచు నార్తయై
పువ్వుల కుప్పవోలె వనభూమిని గూలెను రక్షసేయువా
రెవ్వరటంచు, నంత భవుఁడేఁగి సుసత్వర మార్తరక్షియై. 136

చ. పరమశివుండు లోక పరిపాలనముం బొనరింపనెంచి తా
గరళమునేని మ్రింగు వడి గాంగప్రవాహము మౌళిఁ దాల్చు నా
మరుని దహించుఁ గాలు దయమాలి త్రిశూలముతో నదల్చు నీ
కొఱకయి యేమి సేయఁ డిటు గొంకఁగ నేలకు బేల! యాపదన్. 137

తే. లోకకల్యాణ కాంక్షావిలోల బుద్ధి గరళభక్షకుఁడగు శూలి గల్గ నిచట
నార్తరక్షకు లెవ్వరీ యటవిలోన శల్యబాధిత నేనని జంకనేల? 138

చ. అని వనితా సమీపమున కయ్యహిభూషణుఁడేఁగ నాగులన్
గన భయమూను బొందు పదకంటకమున్ వదలించుకొందు నే
నని దవుదవ్వులం జనుచు నంగన బీతుకొనంగ నా నుడుల్
విని శశిమౌళి నవ్వి యలివేణి ! యివే మణిభూషలౌనిదో ! 139

తే. కను మనన్ బాఁపపేరులు కనకరత్న ఖచితనూపుర కంకణ కంఠహార
వితతియై కానఁబడె నాతి విస్మయపడ నంత ధూర్జటి యీరీతి నాత్మనెంచె. 140

చ. కనవలెనంచుఁ గోరు, సరిగాంచిన పోయెదవేల బేల ! ని
ల్వనుటకు బుద్ధివారు, నటు నాఁగిన హాసవిలాస భాషణ
మ్మొనరుప నాల్కయూరు, సరసోక్తులనాడిన నొద్ద జేరఁగా
మనసది మారు పాదరసమా యన నంచిత చంచలాకృతిన్. 141

తే. భాషణమ్మొనరింప నా యోష నాఁపఁ జెలి వలచునట్లు జేయ నవ్వేలఁది డాయ
స్వీయవాంఛలఁ దెల్పఁ జేజేయి గల్ప నెడఁద మిషల నన్వేషించు నెపటి కపుడు. 142

చ. శ్రవములు పుచ్ఛముల్ పదిగ సంచరియింపఁగ రాగవేగ వై
భవ మదమత్తకాయములఁ బల్మరు డాయుచు మోరలెత్తి క
న్గవ యలమోడ్చుచుం గళయుగమ్మొరయన్ మృగదంపతుల్ ప్రస
న్నవదన వీక్షణమ్మొలుక నర్మిలి నొందొరుఁ గాంచు నల్లదో ! 143

తే. నీలకంఠరాజము ముక్కు నేలరాచి ఘనమసారస్థగిత మరకత సుపర్ణ
గుచ్ఛమయ పుచ్ఛమును విప్పి కోమలగతిఁ జేరి లాస్యమ్మొనర్చు మయూరి ముందు. 144

తే. ఘనత స్వర్ణదిం దలఁ దాల్పఁగలుగు నేను నకట ! ప్రణయాపగా వేగ మాఁపలేను
సగమగు నపర్ణ కెట్లు కన్నుగవ మూతు శిరము నెక్కిన గంగ కెక్కరణిఁ దాతు, 145

తే. స్మరుఁడు పగఁ దీర్చికొనఁ గాల్చ తిరిగి నన్ను బూదియైన నన్గాల్చు నింకేది యనుచు
నలక గాలినవడిఁ గాలఁ గలదదెట్టులనుచు మదనారి నమ్మదనారి గాంచి. 146

ఆ. ఎవతె వీవు సరసిజేక్షణ ! యీకాన నొంటిగాఁ జరించుచుంటివనియె,
తాపసుల కదేల తరుణులతోఁ బనియనుచు నవ్వి పల్కె నతివఁ గాంచి. 147

సీ. కనురెప్ప వేయక నిను గాంచఁగా నిత్య సాలోక్య వరముక్తి సంభవించు
నీతో సమైక్యమై నివసించుచో సత్య సారూప్య కైవల్యసార మొదవు
మాన్య ! నీ సన్నిధిన్ మన జన్మరాహిత్య సామీప్య నిర్వాణ సౌఖ్యమబ్బు
నీతోడఁ గూడియుండినఁజాలు సంస్తుత్య సాయుజ్య నిశ్శ్రేయసము లభించు

తే. అబల ! నీదు సౌందర్య రసానుభూతి యొదవినంత బ్రహ్మానంద మిదె యటంచు
పులకితమ్మగు బుద్ధియో నలిననేత్ర ! యందులకె మునిన్ నను గృప నరయుటొప్పు.148

ఉ. ఇవ్విధిఁ బల్కె నీతఁ డనుచెవ్వరినో నను గాదనన్ మనున్
నవ్వులమాల బల్ విలసనమ్ములదోల యపాంగ దృష్టులం
బువ్వుల కోలలేయుఁ దలఁపుల్ వికసింప స్మరారి యిట్లుగా
నెవ్వఁ డెఱుంగు శ్రీ మనసిజేప్సితకావ్య యథార్థ తత్త్వముల్. 149

సీ. ఒకచోట నాడు మఱొకచోటఁ బాడు వేఱొకచోట నొయ్యార మొల్కఁ బోవు
ఒక లతన్ దాఁగు వేఱొక తీవ నూఁగుచుఁ జకితేక్షణమ్ముల నొకటఁ జూచు
ఒకటఁ బూలను గోయు నొకట మాలలఁ జేయుఁ గందుక క్రీడ నొక్కయెడ సల్పు
ఒకచో నెఱుల్ విచ్చు నొకచోట జడఁ గూర్చు చెదరు ముంగురులు పైఁ జిమ్ము నొకట.
తే. ఒక్కచో గాలి నెగయుచు దిక్కులుఱుకు జాఱు పయ్యంట లజ్జమై సరదుకొనును
మరియొకట బోరగిలఁబండి శిరము నెత్తి నఖము పంటఁ గఱచికొంచు నగుచుఁ గాంచు.

తే. చూడనట్టులె చూచును సూటిమాట లాడనట్టులె యాడును నన్యవిషయ
మగ్నయైనట్లు నటియించి మగువ మిగుల శ్రద్ధతో భర్గుశీలమ్ము సకల మెఱుఁగు. 151

తే. అంత రజతాద్రినిలయుఁ డా కాంతఁ గాంచి మరుఁడు నను గెల్వ నీదగు శరణువేడి
యుండు నా జగన్మోహినీ ! యోగశక్తి ! అఖిల భువనైకసుందరీ ! యమృత వృష్టి ! 152

ఉ. మృత్యువుఁ గెల్చితిన్ విసము మ్రింగితి దానవ మానవామరుల్
భృత్యులుగా వెలింగితిని వీరుని మారుని గంటి మంటలో
హత్య నొనర్చితిన్ భళిరె ! యక్కజమౌ నిను గెల్వఁజాల నా
దిత్యుని గెల్చు ఛాయనౌ లయమ్ముల నిల్చు ననాది మాయవో. 153

వ. అనుచు, 154

చ. పరవశుఁడై హరుండు చెలిఁ బట్టుటకై పరువెత్తు, నంతలో
గరిత లతాళి దాఁగు, సరిగా గుఱుతించి శివుండు నేఁగుఁ, దా
నుఱుకఁగ సాగు భీత హరిణోపమయై, దరిఁజేర నాతఁడా
తరువుల చుట్టు చిక్కక ప్రదక్షిణముల్ పొనరించు నిట్టటుల్. 155

సీ. ఒకసారి పొదఁ దట్టి యూడిన పయ్యెదన్ వెనుదిర్గి కాంచి నవ్వావరఁ గొనును
ఒకమారు మార్గమ్మునకు నడ్డు నిడుకేలు క్రింది మండియై కీలెఱింగి యీఁగు
ఒకతేపఁ గౌఁగింట నొదిగెనా చేఁజిక్కి మెలకువన్ దుసికిల్లి తొలఁగిపోవు
ఒకటఁ గేల్పట్టి నయ్యో ! నొచ్చెవిడుమను విడిచిన నవ్వుచు వెడలుదవ్వు
తే. లలిని జేలాంచలం బంటి లాగునంత వత్తునేనె పయ్యెదకొన వదలు మెంతొ
మంచివాఁడ వీ వనుచు నమ్మించి పొంచి కాంత విడువఁ బర్విడి విఱుగఁబడినవ్వు. 156

సీ. పోయెదుగా దనఁ బోయెదు గాదని శిరమూఁపి బెదరించు సరిగ నటులె
ఒకసారి రమ్మన నొకసారి రమ్మని బతిమాలి మ్రొక్కు నవ్వుగిది సరిగ

ఒక ముద్దొసఁగుమన్న నొక ముద్దొసఁగుమంచుఁ దన కేలుగొన ముద్దుగొనునటువలె
వచ్చితిఁ జూడనవచ్చితిఁ జూడుమంచొక యద్దు ముందిడి యుద్యమించు

తే. వచ్చి నన్నేమి చేయుదువనుచు నిల్చి హరుఁడరుగ లేడిపిల్లనాఁ బరువులిడును
జలములండాసి తన నంటఁదరియవచ్చు, శర్వుముఖముపై నెగజల్లి చానవవ్వె. 157

మ. ఘనవక్షోజభరమ్ము గ్రిక్కదలరాకా చంద్రబింబాస్య మో
హిని సమ్మోహకరావలోకనలతో నీశాను కౌఁగింటఁ జి
క్కినయట్లే లలిఁజిక్క తప్పుకొని వీక్షించుఁ, మృడుండంటఁ జం
దనమౌ నంటమిఁగాల్చి వహ్నియగుఁ జిత్రంబిద్ది యేమౌననుఁ. 158

శా. క్రీడాకందుక ముప్పరమ్మెగసిరాఁ గేలంగొనం బర్వఁ బత్
పీడా సంశిథిలీకృతం బగుచు నీవీ బంధమూడన్వియ
న్నీడాముక్త తటిద్విహంగమగుచున్ నిర్ముక్త చేలాకృతిన్
వీ్రీడాకుంచిత మోహనాంగములఁ బృథ్విన్సత్వరాసీనయై. 159

క. కాంచెన్ సఖి మోహన దృష్ట్యంచలములఁ దృప్తకాముఁడై నటు లతఁడున్
ముంచచ్చుక్లుఁడగుట లది కాంచన రజతములుగా జగమ్మునఁ గ్రాలెఁ. 160

ఆ. నారిరూపువీడి నారాయణుఁడు వల్కె గిరిశ! నాదు మాయ నెఱిఁగితివన
స్వస్వరూప మెఱిఁగి శర్వుండు తలవంచి విష్ణుమాయ నెంతొ వినుతిసల్పె. 161

తే. కాళ్ళవ్రాల నచ్చటఁగల గంగ తాను బకపకన్నవ్వె హరివెన్క భవుఁడు దాఁగె
నర్ధనారీశ్వరున కెందఱాండ్రిటంచు హరికిఁ దోఁబుట్టువగు దుర్గ సరసమాగె. 162

వ. అంత హరి హరుం గనుంగొని, 163

తే. అతను వైరి! సురాసురు లమృతపాన కాంక్షఁదముఁ దాము గలహించు కాలమందు
రూఢి నీ జగన్మోహినీ రూపమొంది సుధనసురులనుండి గ్రహించి సురలకిడనె. 164

వ. అనునంత హరింగని పురహరుండు, 165

సీ. బడిశామిషార్థమై యెడలేక యాసమై జలములనాడు మత్స్యంబు భాతి
జ్వాలాఫలాశ నాశాలోలుపత నెప్డు చదలునందాడెడి శలభ మట్లు
ఘన లసత్పదవీ పతనమొందఁగా మింట మిలమిల లాడెడి మెఱపు కరణి
లక్ష్యసాధనకునై లఘుత నొందుచు నథఃపతనమ్ము నొందెడి బంతిరీతి

తే. ఐహికాస్థిర సుఖ లాలసాతురుండు ప్రబల మాయావశుండునై ప్రాణి యెందు
పవనహతిఁ జంచలతనాడు దివియవోలెఁ దెరలు భవదీయ పదభక్తి వఱలకున్న. 166

వ. అని నుతియించెననుచు నలవాఁడు రాక్షసు లా సురీ ప్రకృతిబద్ధులై మాయాపరవశులై
మడిసిరి. దేవతలు దైవీ ప్రకృతి నాశ్రయించి భవదీయమాయ నెఱింగి భజించి

యమృతపానం బొనర్చి యమర్త్యులై రని విష్ణు దేవతలకు హరి పీయూష విభాగం బొనర్చినవిధంబు పోతన నుడివె మరునాఁటిరాత్రి హరిం గనుగొని స్వామీ! వరాహావ తారంబున హిరణ్యాక్షుని నుండి ధరణిని బరిరక్షించిన కరణి మత్కృతిని రక్షింపవే యని తదవతార గథావిధానంబు నీ రీతి నాళుగతిఁ గావ్యగాన మొనర్పఁ దొడంగెను. 167

క. మును శ్రీ మద్వైకుంఠమ్మున నొకపరి రమనుగూడి పురుషోత్తముఁ డ
త్యనురాగ పారవశ్యమ్మున మన, సనకాది దివ్యమును లతిభక్తిన్. 168

చ. చని సేవింపఁగనెంచి రార్ద్రజలదశ్యామున్ గృపానోమునిన్
ఘనవైకుంఠ సుధాము భక్తజన మోక్షప్రాపకప్రోల్లస
ద్వినుతానేక పవిత్రనాముఁ జరణానిర్యాత గంగాపగా
వననిర్ధూత సమస్తభూతకృతపాపస్తోము నిష్కాముని౯ 169

సీ. రమణీయకాంచన రత్నకిరీటులు మణిమయకుండల మండితులును
కమనీయ వనమాలికాడోలికామోదరత విశాలోన్నతోరస్థ్సలులును
అంగుళీయక కంకణాంగదసందీప్తి సుదృఢ చతుర్బాహు శోభితులును
కౌశేయ కటినటత్కాంచీ గుణాన్వితుల్ నూపురమంజీర దీపితులును

తే. ద్వాదశోర్ధ్వపుండ్రాంచితతనులు వేత్ర దండ శంఖ చక్ర గదాస్త్రధరులు వరులు
నాత్తరోషాన లారుణితాంబకులును శార్ఙ్గధరు ద్వారపాలకుల్ జయవిజయులు. 170

క. వారిజనాభుని యనుపమ కారుణ్యామృతము గ్రోలఁగాఁ జను మునుల౯
వారింగని, చనవలదని వారించిరి జయవిజయుల వారితబలురై. 171

తే. మునులు ద్వారపాలురఁగని కినుకదనర మూఁడుపుట్టువుల్ కఱివేల్పుతోడ మిగులఁ
బగలఁదగిలి రేదిర్మ్మరులుగ జనించుఁడనుచు శపియించిరట సురల్ గనుచునుండ. 172

క. దితికశ్యపులకు వారలు సుతులుగ జన్మించి రివ మునూడునునెలయు౯
జతకనులఁజేయు వేలుపు సతతమ్మొకకంట వారి చర్యలెఱుంగన్. 173

సీ. క్రోధరసమ్మెల్లఁ గూడుగట్టె ననంగ మొగము జేగురువన్నె నెగడుచుంత
పారుష్యశార్యముల్ పదనుదీఱిన వనఁగోరలు పెలవుల మీఱి మెఱయ
క్రౌర్య దౌర్జన్యముల్ కరుడుగట్టిన వనఁ గండరాల్ బండమై నిండివెల్గ
కామాంధకార వృక్షమ్మూడ లొందెనాఁ బెడతలం బడి పల్లజడలు వ్రేల

తే. ఆశలాశావధులదాఁటె ననఁగ విపుల వివరయుతనాసికారంధ్ర విధము దనర
మొలిచెఁ గొమ్ములహమ్మమతల తలనన గల్లములమీన లావర్తగతులఁ దిరుగ. 174

తే. భూమికిం భారమయి దేవపుంగవులకుఁ గంటిలోఁ గారమయి ధర్మకాండములకుఁ
బిక్కలో బల్లెమయి కులపర్వతములు ముక్కు మొగ ఘూనివచ్చెనా రక్కసులయి. 175

వ. వచ్చిరందు ననుజన్ముండగు హిరణ్యాక్షుండు, 176

మ. హరిపేరు న్వినినంతఁ దిట్టు వరశాస్త్రామ్నాయ సద్గ్రంథముల్
వరుసం జీలిచి కుప్పవెట్టు గురుదేవ బ్రాహ్మణప్రాజ్ఞ ని
ర్జరసంఘమ్ములఁ జావఁగొట్టు మునిభార్యా శీల విచ్ఛేద నా
చరణప్రక్రియ దీక్షవట్టుఁ బ్రజ హింసంబెట్టు నెప్పట్టులన్. 177

ఉ. అక్షయ శక్తిసంపదలు నాయువునున్ సమకూరఁగా సరో
జాక్షుని గెల్వఁగాఁ ద్రిభువనాళిని నాలివిబోలె నేల ఫా
లాక్షుని వశ్యఁజేసి విధినారసి ఘోరతపమ్ము లా హిర
ణ్యాక్షుఁడొనర్చెఁ బొందెను వరాళి నరాళి తలంకఁ బెక్కులన్. 178

సీ. గుట్టలం బిడికిటం గొట్టి పిండియొనర్చు నుర్వి నిట్టట్టుల నూఁపివేయు
అర్కేందు బింబమ్ములాట బంతు లొనర్చు నూఁదివేయును మింట నుడుగణముల
తోయధిన్ గ్రోధాగ్నిఁ దుకతుక నుడికించుఁ గులగోత్రములఁ దన్ని కూలద్రోయు
గ్రహతారకావళిం గడగడ వడఁకించు దిక్పాలసమితిని ధిక్కరించు

తే. నీలగళ ఫాలనేత్రమో కాలయముని శూలగాత్రమో ప్రళయాబ్ధిఁ దేలియాడు
బెట్టిదవు సుడిగుండమో విన్నువిడుచు పిడుగుపిండమో యన భువి నడలుగొల్పు. 179

క. హరియఁట యసురాంతకుఁడఁట కరిరక్షకుఁడంట సర్వగతుఁడట సిరియున్
ధరణియు సతులఁట వానికి. ధరనే హరియింతు నతని దర్పమడంతున్. 180

వ. అంచు మహీమండలంబున్ రసాతలంబునన్ బడవేయఁద్రోయుచు, 181

చ. మగసిరి గల్గె నే నతఁడ మందత ముందుకురాఁడె నేఁ డిసీ
నగవు జనించు నే నతని నాతిని గోతినిఁ ద్రోయుచుంటిఁ దాఁ
దెగియెదనంచు బీతుగొని తేఁకువ మాలి మొగమ్ము దాఁచె నా
సొగసుకు నాల్గుచేతు లఁటె చూచుటకో యటుగాక పోరుకో. 182

క. స్వాయంభువమను వప్పు డహేయగతిఁ బ్రజాభివృద్ధి నెసఁగుట హరి నా
ప్యాయత యాచించెను గృపసేయవె నా ప్రజ వసింప క్షితితల మనుచున్. 183

తే. మనువు మనవిని విని కూర్మి వనజనాభుఁ డతని నాసావివరమంటి యంగుళప్ర
మాణ యజ్ఞవరాహమై మహి జనించి యంతలోనె దిగ్దంతి మాత్రాకృతిఁ గొనె. 184

తే. తొండమే లేని చిత్రవేదండ మిదియొ కరచరణయుతానంత నాగంబొ యిద్ది,
ఇద్ది శృంగవిహీన నందీశ్వరుండొ యని నుతింతురు బ్రహ్మాదులీ యాకృతిఁ గని. 185

క. త్వక్కున నాజ్యాహుతులున్ స్రుక్కునఁ దుండంబు నాస స్రువ మక్షులలో
దిక్కుల నెగయ స్ఫులింగము లక్కజమగు నీదు రూప మరసితిమి హరీ! 187

క. వేదమ్ములు నాలుగునుం బాదమ్ములు గాఁగ నాభిపద్మము క్లమముం
బోఁదోలు వాల రూప వినోద వ్యజనాకృతిన్ మనోహరతఁ గనెన్. 188

ఉ. శ్రీరమణీమణీ సరసచిత్త సరోరుహమిత్ర! నేఁడు నీ
కారణ సూకరాకృతిని గంటి మపారతపఃఫలమ్మనన్
ధారుణి నుద్ధరింపఁగదె దైత్యకులాంతక! నీ కివే నమ
స్కారములంచు శక్ర శివకంజ భవాదులు సన్నుతించుటల్. 189

చ. సరగున నా వరాహము రసాతలముం దగఁ జొచ్చి దైత్యము
ష్కరుఁ గని కండ్ల నిప్పుకలు గ్రుక్కుచు దేహము పొంగఁ బౌరుషాం
కురఖరకంటకత్వ మొనగూడ సటాచ్ఛటలన్ విదిల్చి యు
ర్వరమను ద్రివ్వి ఘుర్ఘురరవంబు దివంబు బగుల్పఁ బెల్చనన్. 190

చ. అసురనుదాఁక వాఁడు పరిహాసపు నవ్వులఁ గ్రూరదృష్టులన్
విస మొలుకంగ మీసపురిఁ బేనుచు ధీరత శీర్షమూఁపుచున్
వసుధ సముద్ధరించుటకు వచ్చితె సూకర! దోర్యుగంపు నా
నస యణఁగారు నీ కపటనాటకపుం బనిదీరు నంచునన్. 191

ఉ. బాహువు లప్పళించి గద పైకెగ రువ్వుచుఁ బూవటుల్ గొనన్
సాహసమొప్ప నుగ్రగతి సామును ద్రిప్పుచు ఘోరయుద్ధపుం
దాహము దీఱ నిష్ఠుర విధానము మీఱఁ గఠోరరావ స
న్నాహము గూఱ మొత్తెఁ గిటినాథు మహోజ్జ్వల ఫాలభాగమున్. 192

మ. కులభూభృ చ్ఛిఖరాగ్ర సన్నిభగదా ఘోరప్రహారాహతిన్
ప్రళయాదిత్య పటుప్రభావిభవ సంపన్మూర్తి తానై విశృం
ఖల లీలన్ ఖలదండతాడిత భుజంగప్రక్రియన్ రేఁగి పోత్రి
జ్జ్వలవజ్రేయ ఖురాహతిన్ జెఱకు టూఁచన్ బోలెఁ ద్రుంచెన్ గదన్. 193

క. లేలిహ్యా మానవహ్ని జ్వాలాయిత శూలమూని శక్రారి మహా
కాలాంతక సదృశాకృతిఁ గోలోదర పార్శ్వసీమ గుఱి నిడి యేయన్. 194

క. కాలానల కీలల నా భీలగతిన్ వచ్చు శూలవిధ మారసి హ
స్తాలంకృత చక్రమ్మున వ్యాళమ్మును దార్ఢ్యఁదేయ నటు హరి దునిమెన్. 195

తే. అంతఁ గ్రవ్యాదవిభుఁడు హతాశుఁడగుచు నోడు గఱచి పల్గొఱుకుచు నవని దన్ని
హీర నిష్ఠురముష్టి ప్రహారహతిని సమర హితకారి నసుర సంహారి నొంచె. 196

ఉ. అత్తఱిఁ బోతరించి తగ రదిప్రిని డీకొన డీలుపాటనన్
బొత్తుగలేక నిశ్చలత బొల్చినటుల్ హరి దైత్యుఁడేయఁ గిం
చిత్తు చలింపకా దనుజ సింధుర బంధుర కర్ణమూలమున్
దుత్తునియల్ బడన్ బ్రబల దుర్భర ముష్టిహతిన్ బగుల్చుటన్. 197

క. కొట్టుకొనఁ గాలుసేతులు నిట్టటుఁ బొరలుచును నెత్తుటేర్లు సెలవులన్
బిట్టు స్రవింపఁగ నార్చుచు గుట్టవలెన్ గూలెఁ గఱచికొని కొననాల్కన్. 198

ఉ. పర్వతశేఖరం బశనిపాత విఘాత విభిన్నశీర్షమై
యుర్వరఁ గూలు కైవడి మహోన్నతి నంబర చుంబిప్రోల్ల స
త్తర్వవతంస ముజ్జ్వలిత దావశిఖాహతి వ్రాలినట్లు పెన్
గర్వహతిన్ నిశాటుఁ డిల కాయము వీడె వరాహ దోర్హతిన్. 199

మ. మఖవారాహ కళేబరాయిత మహామంత్రానల ప్రోజ్జ్వల
చ్ఛిఖలన్ జ్ఞానవిహీన దైత్యపశువిచ్ఛిన్నాంగముల్ బంధకృ
న్నిఖిలాత్మీయ కళత్రి పుత్రమ మతాస్నేహాజ్య ధారాహుతుల్
సుఖ దుఃఖప్రద కర్మకాష్ఠ సమిధస్తోమమ్ముతో భస్మమై. 200

క. చవియె నజహరులు నెవ్వని గనుగొన బహుజన్మతపముఁగాన్కన్ నిడెద రా
వనజదళాక్షుని కరహతిఁ దను వీ గతిఁబాసె ననుచుఁ దను భువిఁబొగడన్. 201

వ. అంత నక్కోలంబు, 202

సీ. దంష్ట్రాగ్రముల మహిన్ ద్రివ్వను భూకళత్రాధర దంతక్షతాదు లనఁగ
ముట్టెతో ముసముస మూర్కొనుం బొరియల నానన సౌరభాఘ్రాణ మనఁగ
అబ్ధులన్నిటిఁ బల్వలాకృతిన్ గలఁచును నవనితో సరిగంగలాడు ననఁగ
భూతల శీతల పులినాళి నొత్తిల్లు క్ష్మాకుచాలింగన సౌఖ్యమనఁగ

తే. విశిత ఖరపుటపటలి, క్షోణి నటు ద్రివ్వ క్షితి సతిన్ గిలిగింతలుజేయు ననఁగ
రాక్షసాపహృతంబగు రమణిని నిజవశ మొనర్చుచు సంతోషవనధిఁ దేల్చు. 203

సీ. హిమవంతుఁ డీకిటి సమతగాంచఁగ లేక చలి చెమ్మటలు బుట్టి నిలిచిపోయె
ఐరావణమ్మీ మహాఘోణి సరిరాకవెల్లనై దంతముల్ వెడలబెట్టె
ఆదిశేషాహియు నా పోత్రితులగాక మట్టినంతయు నెత్తి గొట్టుకొనియె
నంది యీ కోలమునకు సాటిగనలేక కడుయాతనలుబడి గడ్డి గఱచె

తే. అందులకె తల్పగతిని గ్రిందయ్యె నొకఁడు నొక్కఁ దగ్రిజుఁ దలఁదాల్చె నొక్కఁడతని
పాదతీర్థమ్ము తలఁదాల్చెఁబాద తీర్థధారి నొక్కండు మోయఁగభారపడియె. 204

వ. అనఁగ నప్పుండి తేఁ దొప్పియుండ, 205

క. అది గని విజయధ్వానము లొదవఁగ గంధర్వగాన మొప్పఁగ నమరుల్
ముదితాంతరంగులై యే కొదలేక ప్రసూనవృష్టి గురిసిరి వరుసన్. 206

క. అచ్చరలయాట మెఱపుల మచ్చుగఁ దూర్యస్వరాత్తమర్ధళ ముఱుమై
హెచ్చఁగ నానందాశ్రువు లచ్చపువృష్టిగను సమ్మదాంబుద మొలసెన్. 207

వ. అని యప్పోతనార్యుండు మఱునాఁటి నిశి రాముఁగని స్వామీ ! ప్రహ్లాదబాధ లడఁచి హిరణ్యకశిపు నంతమొందింప స్తంభోద్భవుఁడవై వెలసితి వీవెకాదె నేఁడును మత్కృతి ప్రహ్లాదుం గాపాడుమని నిన్ బాడుదునని ప్రహ్లాదచరిత నాశుగతి నీ రీతి నభివర్ణింపందొడంగె. 208

క. నారదుఁ డొక్కట శ్రీమన్నారాయణ పాదపద్మ నవమధుర లసత్
సారామృతరత్నాకర పారగుఁడై చేరె దనుజభవనము నంతన్. 209

క. వచ్చిన మునిఁగని దనుజుం డచ్చెరువడి మ్రొక్కి మిగుల నాదరగతి నో
సచ్చరితా ! మీరీయెడ వచ్చుట కెది హేతువనఁగ వరముని పలికెన్. 210

చ. దనుజవరేణ్యా ! మీ కులము ధన్యతఁగాంచుఁ ద్రిలోకవంద్యుఁడౌ
తనయుఁడుపుట్టు భాగవతదామ మహోజ్జ్వలరత్న మాతనిం
గని మహితానురాగమునఁ గాన్క లొసంగగ నాదు దీవెనల్
గొని చనుదెంతు నేఁడనుచుఁ గూర్చొనె నారదమౌని పీఠికన్. 211

క. నేఁడే యా శుభసమయము బాడబులను సురల మునులఁ బ్రాణుల నెల్లన్
జూడంగవలయు దయతోఁ బీడం బెట్టెద విదేల పృథ్వీ జనమున్. 212

క. అన దనుజుం డను నిట్టులు మునివర్యా ! నే నొసంగు భూస్థలు లందున్
మనికి గల వీరు నాదగు పనుపును మన్నించ రెంత బాధాకరమౌ. 213

క. అన విని ముని దనుజుని గని యను మనమునఁ గినుకగొని మహారాజా ! నా
మనవిని వినుమన కెపుడు నవని నాదని జనజనని యెవని దొక్కనిదౌ. 214

ఆ. ఆకసమ్ముపైన నగ్నిహోత్రునిపైన వాయుదేవుపైన వారిపైన
నఖిల భూతకోటి యధికార మెట్లో భూమాతపైన స్వత్వమా తెఱంగె? 215

క. కావున సూనృత భూతదయా వాత్సల్యాదిగుణము లాభరణములౌ
భూవిభున కనుట దైత్యుం డీగతి వచియించు మౌని హితముల వినుచున్. 216

ఉ. మారుత మొక్క యూఁపుననె మాయమొనర్చును దీపకాంతి నా
మారుత మగ్నిరేఁగి పెనుమంటఁగ నేర్పడ నిట్టు వ్యాప్తిఁ జే
కూరుచు నాప్తమిత్రుఁడగు, క్షోణితలమ్మున శక్తిహీను పే
రాఱిచివైతు రల్లె బలి కర్పణసేతురు భాగ్యభోగ్యముల్. 217

ఆ. ముండ్లకంచె నుంచి పండ్లచెట్లను రక్షసలుపు కరణి సకల సంపదలను
గాచుకొనఁగ బలము గావలె నది యభేద్యమగునటులు మాయఁ దార్పవలతు. 218

ఆ. తాను ముందు పిదపఁ దత్త్వమ్మనెడి సూక్తు లాత్మసౌఖ్యకరము లవని నెందు
శాంత సత్య శౌచ శమదమా చరణలు దుర్బలత్వమునకుఁ దోడు సఖులు. 219

ఆ. కార్య సాధనమున ఘన జయమ్మొనగూర్చు కల్లలేని సత్యకల్పము లవి
ఆత్మసౌఖ్యమునకు ననుకూలపడునట్టి పూర్ణహింసయేని భూతదయయె. 220

ఆ. చచ్చు వెనుక స్వర్గసౌఖ్యమ్ము సమకూరుననుచు హితవులాడు నట్టి జనుఁడు
బుజ్జగించి మోసపుచ్చి విత్తముగొన భ్రమ జనింపఁజేయు పచ్చిదొంగ. 221

తే. హింస సర్వేశ్వరునకు ననిష్టమేని నాకు లలములు మేయుచు నలరు లేళ్ళఁ
బులికి నెంతేనిఁ బ్రేమంపు భుక్తి జేసి ఘనదయాళువు తా నెట్లు గాంచుచుండె. 222

తే. సృష్టిసేయు నీ మనుజుఁడె స్థితియొనర్చు నతఁడె లయమొనర్చును ప్రాణితతులనెల్లఁ
దనువుఁ దాల్చు పరబ్రహ్మమన వెలుంగు మనుజున కసాధ్యమిది యను మాటకల్ల. 223

ఆ. మీదు దేవరాజు వేదాంతశాస్త్రజ్ఞుఁడగుటొ నాదు పత్ని నపహరించె
శచియు నాదు భార్య సవతియైన నెఱుంగు వజ్రహతిని దెగును వజ్రమనుచు. 224

క. రక్కసి పల్కులు విని నగి యిక్కరణినిబల్కె మౌని యెఱుఁగుదు నే నే
యక్కొమలి విడిపించితి నిక్కముగాఁ దప్పు గెల్వనేరదు తప్పున్. 225

ఆ. ముల్లు పెఱికివేయ ముల్లు కావలెనని యగ్నితోడ నగ్ని నార్పవశమె ?
ఒక్క సూత్రమెప్పు డుపయోగపడదెందు సాధనమ్ము గొందుఱ్రి సమయమెఱిఁగి. 226

తే. నరు లెఱుగని రహస్యమెంతయు నిగూఢ విశ్వవిజ్ఞానకోశాన వెలయుచుండు.
ఉగ్గు నుప్పను భావాల నొప్పుబిడ్డ కెఱుఁగరానట్టి కావ్యార్థమెల్ల కల్ల. 227

క. సదసద్వివేక ముడిగిన మద శార్దూలంబు హింసమసలె నటంచున్
వదలవె హింస ? స్తసంధయుఁడు దెసమొలన్ మెలఁగ మన మటుల్ మననగునే ? 228

క. ఇరువురు వీ రిటు లనుకొన నరుదెంచిన దాసి కొమరు నవతరణంబొ
ఱెఱిఁగించె నసురవరుఁడున్ మురిపెమ్మునఁ జనియె దేవమునిఁ గూడి వెసన్. 229

ఉ. బాలకుఁ గాంచి నారదుఁ డపారముదంబుధి నీఁదులాడె ము
త్యాల సరాల యూయెలలఁ దారిచి దాదియు జోలఁబాడె నం
దాల నెలన్ లిఖించు శిశు దర్శనదీప్తి సురారి మోమునన్
బాలసముద్రిమం దలలభాతి వెలింగెను మందహాసముల్. 230

వ. అంతఁ గొంత కాలంబునకు, 231

క. హాటక పద్మాననమునఁ గోటివరాల్ గుప్పించు కొమరుని నగవుల్
మాటలు కని వినుచున్న నిశాటుంగని చిఱుత డిట్టులను బుడినుడులన్. 232

తే. ‘అలిని నాలాయనుని పలుడని వతింతు, కొత్తుదును కామకోపాలగోని దలచి’
అనిన నీ ముద్దుగీతి కర్ణామృతమని బాలు నెత్తి ముద్దాడి యిప్పగిదిఁ బల్కె. 233

తే. హరిని నారాయణుని బరుఁడని వచించి కొట్టునఁట కామకోపాల ఘోణిఁదలఁచి
ఘోణి పినతండ్రినిం బలిగొనె నటంచుఁ దెలిపెనెవఁడు వీని కటంచుఁబలికి మఱియు.

తే. అటపాటలఁ జేసెడి యాత్మజుఁగని యెత్తుకొని దానవేశ్వరుఁ డేదొయొక్క
పాటబాడుమి యనిన నబ్బాలకుండులావె చీయలి యని పాడఁబోవునంత. 235

ఉ. నోరునుమూసి చెక్కిళుల నొక్కుచు శ్రీహరి యంచు నింక నీ
సారి వచింతువేని నిముసమ్మున నాలుక చీల్చివేతు నీ
పేరు నెవారు పాఠమునుబెట్టిరి నీకు నిజమ్ము బల్కనే
వారికి వారి వారికి సవారిని గూరుతు నారకార్థమై. 236

మ. అని యుగ్రార్భటిఁ గాలమేఘుఁడయి బ్రహ్మాండంబు ఘూర్ణిల్ల గ
ర్జనొనర్పఁ సతి యడ్డువచ్చియనె, ‘నా జంభారితో నాలమున్
బొనరింతుఁ దగరావె ఛీ హరి’ యనంబోలుఁ భవత్సూనుఁ డా
టనిటుల్ వల్కుట సాజమెందుఁ బులిపొట్టన్ మేఁక జన్మించునే? 237

క. శ్రీకారము చీకాలము, టాకున్ తా, రాకులాలు, డాకుఁ దావ
ర్ణైకాదేశపు బాల! వ్యాకరణము మెచ్చుకొనని పండితుఁ డున్నే? 238

చ. అనవుఁడు దానవేశ్వరుఁ డహహ్హహ యంచు హసించి యిట్టు వ
ల్కెనె పువు బుట్టనే పరిమళించుఁగదే యని పొంగి బాలు న
క్కునఁ దగఁజేర్చి ముంగురుల గోళుల దువ్వుచుఁ జెక్కులద్ది ము
ద్దునిడి శిరంబు మూర్కొనుచు ధూర్జటి బ్రోచుత! వీని నెందనున్. 239

తే. అప్పుడపుడు నారదుఁడు తా నరుగుదెంచి గాన మొనరించు హరికథల్ గాఢభక్తి
వినుచుఁ బరవశుఁడై నీరు కనులనించు నిట్లు ప్రహ్లాదుఁడయ్యె నైదేండ్లవాఁడు. 240

వ. అంత నొకరేయి హిరణ్యకశిపుని యొడిఁ బ్రహ్లాదుండు నిదురించు తఱి, 241

మ. కలలో నేదియొ కాంచినట్లులికి చక్కఁ లేచు నే మయ్యెనాన్
హలినాలాయణుఁడేఁడి రమ్మనుచు మాయంబయ్యెనం చేడ్చె హా
తెలిసెఁ బాలకుఁగాంచి స్వప్నమున నెంతే భీతిలఁజేయు నే
పిలిపింతున్ దగు మాంత్రికుఁ గిటిని వే పీఁచమ్మడంతున్ దృటిన్. 242

వ. అని పల్కనంత, 243

ఉ. పంచశరద్వయస్కుఁడగు బాలుఁడు తండ్రియొడిన్ వసించి చే
లాంచల మంటి యాడుకొను చాస్యము రెప్పల నప్పళించి వీ
క్షించి స్మితావలోకములఁ జిందులు ద్రొక్క నమాయికత్వ మి
ట్లించువచించె దానవకులాగ్రణితోడ సుధామయోక్తులన్. 244

ఉ. కన్నులుమూసి నే జననిగర్భములోన నగాధ నిద్రలో
నున్న తఱిన్ స్వయత్నముల కూహలకందని సంకటస్థితిన్
గన్నుల రెప్పలట్టులుఁ బగళ్ళను రేల్ ననుబ్రోచు చక్రి యా
పన్నజనావనుం డెపుడు పజ్జనెయుండ భయ మ్మదేటికిన్. 245

క. ఇట్టులను సుతుని గోపముపట్టంగా లేక బిట్టు పలుగొఱుకుచు నా
కెట్టెటులోఁ గనబడు నీ బొట్టెని స్థితియంచు రుద్రుఁబోలు మొగముతో. 246

ఉ. కర్ణములంటి పిండుచు నెగాదిగ లాగుచు నీడ్చి రక్తపున్
వర్ణముగ్రమ్మ లెంపలను వాయఁగఁగొట్టుచు వంశనాశకా!
వర్ణనసేతువే స్వకులవైరిని నిన్ హతమార్చ నింక నే
నిర్ణయముం బొనర్తునన నిల్వుఁడటంచు నిటాడె భార్యయున్. 247

సీ. ఒక చెంపఁగొట్టఁ బాలొక చెంపనీరు నా ముకుపచ్చలాఱని ముద్దుబిడ్డ
విసమేని యమృతమం బొసఁగినఁ ద్రావఁగా వెఱవఁడు కీడుమేళ్ళరయలేఁడు
కొట్టినన్ మనలనె పట్టుకొం చేడ్చును ఎటకేఁగు వీని కింకెవరుదిక్కు
మనమునఁ బరులని మనవారలనియును నెఱుఁగఁ డజ్ఞాన మెంతైనఁగాని

తే. శత్రువన నెవ్వఁడో యింత మాత్రమెఱుఁగఁ డెవరు చదువఁగా నీ పాటలెపుడు వినెనొ
పిల్లచేష్టలుగదె యదె వల్లెవేయు దానికేల పట్టింపన దైత్యవరుఁడు. 248

తే. పిల్లఁడే వీఁడు నా పాలిపిడుగటంచు నవనిఁబడఁద్రోసి కన్గవ నగ్నిరాలఁ
గాంచి యెవఁడేని చెప్పెనా కాక నీకె తోఁచెనా కులపాంసనా! థూ! యనుచును 249

తే. ఎవఁడురా హరి వాఁడు తానెచటనుండు నేమి సేయురా! యన బాలుఁ డిట్టులనియె
నతఁడు విశ్వస్వరూపి సర్వాంతరస్తుఁ డార్తజన రక్షకుండు దయామయుండు. 250

తే. అనుట విని శివమెత్తి నట్లసురవరుఁడు పిచ్చిరేఁగి నట్టులు నిచ్చ వచ్చినటులు
బిట్టు తనచేతి కసిదీఱఁ గొట్టికొట్టి విసిఁగి వేసారె బాలుఁడు విస్మృతిగొన. 251

చ. పదపడి భార్గవుం బిలువఁబంచి కుమారకుఁ దెచ్చి యార్తిమైఁ
బదములపైచి స్వీయసుతభావనచేసి యొసఁని వీని నో
సదమలచిత్త! మా చదువు సంధ్యల నేర్పి ప్రబుద్ధుఁజేయవే
వదలిన వీఁడు చేతి కిఁకవచ్చుట దుర్లభమంచు నెంచెదన్. 252

తే. రాకుమారుఁ డేమి రా నున్నదోయని వెనుకముందుఁజూచు పనియెలేదు,
అమితశిక్ష నొసఁగుఁడనఁ, దల్లి. పసిబిడ్డ కనుల నోట భీతిగఱపుఁ డనెను. 253

తే. శిష్యుఁగనఁ బుత్రువలెఁ బ్రీతిసేయు గురువు గురునిఁగన సర్పమటు భీతిగొనును చట్టు
నయభయమ్ములఁ గ్రమశిక్షణమ్ము నొసఁగి శిష్యుఁ దనయంతవానిని జేయునొజ్జ. 254

క. అని వానిఁ బాఠశాలకుఁ గొనిచని చెవి నిల్లుగట్టుకొని రాక్షస వి
ద్యనుజెప్పి రసురగురువులు తన దారియె తా నతండు తలఁపఁ డితరముల్. 255

క. కొంచెము కనుచాటై రాత్రించర గురువున్నఁ జాలెఱిఁగిబడి నే పా
డించు హరిభజన, గురువది కాంచుచు నాపాదమస్తకము మండిపడన్. 256

ఆ. పాఠశాల వోయి భజనాలయమ్మాయె బాలురెల్ల రచట భక్తులయిరి
దైత్యవంశ గురుని తలమించె వ్యవహార మనుదినమ్ము గుండె యదలు హెచ్చె. 257

క. తిన్నెలపై మేల్ పొన్నల గున్నలపైఁ బచ్చిగడ్డి కుదుళుల నిసుకన్
వెన్నెల రాత్రుల నాడెడి చిన్ని కుమారకులఁ బిల్చుఁ జేసైగ నిటుల్. 258

ఉ, బాలకులార! యాటలును బాటలు చాలిఁక చాలు రండహో!
కాలనదీ ప్రవాహమున గంతులువెట్టు తరంగజాలమై
తేలెడి మీ శరీరములు తీరము ముట్టునొ మధ్య గిట్టునో
యేల యిటాలసింపఁ బరమేశు భజించి తరించుఁడీ వెసన్. 259

సీ. ఈ బొమ్మ రింటాడి యేఁగెడి మిము వోలె నీ యాత్మ మెయి వీడి యేఁగు నెపుడో
దాఁగురింతల దృష్టిదాఁచు కన్గుడ్డ యట్టులు మాయ మీ జ్ఞానములు హరించు
కందుక మ్మెగిరింప నందక చనునట్లు చంచలమనము చేజాఱి యుఱుకు
ఆలుమగఁడు పుత్రుఁడని యాడు మీ పోల్కి తాత్కాలికమ్మె బాంధవ్యమెల్ల

తే. ఉరక గోలీల వెంట మీ రుఱుకునట్లు దేహి కర్మచే లోకాలఁ దిరిగివచ్చు
మన నిజమ్మగు తలిదండ్రి మఱచి రాత్రి యంతులేనట్టి యీ క్రీడ లెంతవఱకు. 260

క. బాల్యముననే జనుస్సాఫల్యము సేయుఁడి మురారిఁ బాడి ముఖశశిన్
నైల్యమిడు మీసములు స్త్రీలౌల్యకు పల్వలజపంక లాంఛన మగుచున్. 261

సీ. కాంత కన్గవ, మాంసఖండార్థియై వచ్చు మత్స్య మీనరుఁడని మహికిఁ జూపు
సఖియ నవ్వుల దివ్వె శలభమై వీడు మూకాహుతి యగునని యపహసించు
పొలఁతి వాతెరతమ్మి పూవాసన కితండు బందియై యఱు మదభ్రమర మనును
సతి ప్రేమ వెదజల్లు సరసభాషలు వీని గానోపహత భుజంగమని చాటు

తే. యువతి చనుదోయి హరికిశో రోపవిష్ట నగ తటాప్త వక్రక్రీడనాభిరతుల
మరగు మదకరీంద్రంబయి మడియు నీతఁ డనుచుఁ దల తెత్తి శాసించు నన్నలార! 262

తే. కాకి బంగారమున పైఁడి కలిమి యెంతొ కుక్కగొడుగెండకై యనుకూలమెంతొ
నేతిబీరలో నుండెడి నేయి యెంతొ యరయ సంసారమున సారమంతె కలదు. 263

ఉ. నాదగు కోడిగూయని వినా తెలవాఱునెటంచు వీతమ
ర్యాద యొకర్తు గ్రుడ్డి ముసలవ్వ రవిం బెదరించినట్లు లీ
మేదిని నేనులేమి నిజమిత్ర కళత్ర సుపుత్రపౌత్ర భృ
త్యాదుల సాఁక దిక్కెవరయా యని యేడ్చును మానవుం డిలన్. 264

తే. నేనె విడిచిన నీ గుడి నేలఁ గూలు నెట్టులను గబ్బిలము బండపట్టునట్లు
ధరణి భరమెల్ల నా పైన నొరగుననుచు భావనమొనర్చి యారాటపడు నరుండు. 265

తే. తోఁచఁబడు దీపకళికామరీచిఁ గాంచి తాండవించెడి మిడుతలదండువోలె
నింద్రియగ్రామ ముపరమియించు రుచుల నాత్మ నిర్లిప్తగతి సాక్షియగుచుఁ గాంచు. 266

క. కావున బాల్యమె మనకిల శ్రీవిష్ణువుఁ గొల్వఁగా నుచిత సమయము మీ
రా వనజనయను నిఁక మీ భావంబునఁ దలఁపుఁడనుచుఁ బలుకు హరి నిటుల్. 267

సీ. వైకుంఠపురవాసు వరకోటి రవిభాసు జలధరదేహు నాజానుబాహుఁ
గౌస్తుభగ్రైవేయ కంకణాంగద భూషు మత్స్య కూర్మ వరాహ మధురవేషు
నుత సద్గుణ నికాయు ధృత పీతకౌశేయుఁ బ్రణతార్తిహరు ఖగపాలకచరు
శార్ఙ్గ శంఖరథాంగ సరసిజాంచితగాత్రు మహిత భూనీలా రమాకళత్రు
తే. శేషపర్యంకశయను రాజీవనయను గుందకుట్మలరదను బూర్ణేందు వదను
లలిత చంపకోన్నాసుఁగుండల విభాసు స్మితవిలాసు భజింతుము శ్రీనివాసు. 268

మ. అని హస్తాంబుజముల్ మొగిడ్చి హృదయ మ్మానంద బాష్పాంబు వా
హినియై బిట్టు కరంగిపాఱ హరియం దేకీభవం బొంది య
ర్ధనిమేల న్నయనాంబుజాతుఁడయి గాద్గద్యంబు దీపింప భ
క్తనిరూఢస్థితి బాహ్యమున్ మఱచి పుల్కల్దేరఁ దా నిట్లనున్. 269

క. బాలురము భక్తి దెలియము గోలల మేర్పఱచలేము కుడి యెడమల మా
పాలిచ్చు తల్లివలె మమ్మేలందగు నీవయై పరేశ! మురారీ! 270

ఆ. మాత శిశువు నగ్నివాతనున్ నూతనున్ బడఁగనీక బ్రోచు భారమూను.
తనయ జబ్బునొందఁ దల్లితానై మందు దినుచుఁ బథ్యగతుల మనుచుఁగాదె. 271

ఆ. తల్లి చంక నున్న తనయుని బరకాంత బలిమిఁగొనిన నచట నిలువఁడేడ్చు
దివిని నిన్ను బాపి భువి మాయ గొను పాప కేడ్పు దప్ప నింక నెచటి శాంతి. 272

క. పాలిచ్చు తల్లి వీవే పాలించెడి తండ్రి వాత్మబంధుఁడ వీవే
నీళుల ముంచెదొ లేదా పాలనె ముంచెదొ త్వదీయ భారము శార్ఙ్గీ. 273

క. అని వేడుచుఁ బ్రహ్లాదుఁడు తను జుట్టిన బాలురెల్లఁ దన్మయతగొనన్.
ఘన హరి భజనానందమ్మున నగుకొను నాడుపాడు మ్రొక్కున్ జొక్కున్. 274

సీ. ఒకట జీవేశ్వర యుగళమున్ హరి వేడుఁ గరతాళభజన నైక్యమ్మొనర్చు
శ్రీపతిం బాడుచుఁ జిందులిడుచు నాత్మ దుష్టభావనములఁ ద్రొక్కిపెట్టు
ఒకచోటఁ బూర్వజన్మ కృతాఘముల నెల్ల విష్ణుదర్శన బాష్పవితతి గడుగు
చక్రి నొక్కెడఁ గాంచి చక్షుయుగ్మము మూసి వెలికి మాయందోలి తలుపులిడును
తే. అవని నారాయణుని వినా యన్యుఁడెవఁడు లేఁడనినయట్టు లోకఁడె మాటాడుకొనును
తాను దనలోనె లేనట్లు మేన వ్రాలు దోమలను నీఁగలనునైనఁ దోలుకొనఁడు. 275

ఆ. బాలుఁ డొడలు మఱచి భక్తినాడెడి యాట నెలుఁగునెత్తి హరిని బిలుచు పాట
నసుర గురుఁడు తన్మయతఁ గాంచి యాలించి కొమరు దరిసి యిట్టులు మది నెంచు. 276

చ. పరసతులం గనుంగొనిన భావమునం దన తల్లులంచు నె
ప్డరయు నసత్యభాషణలు పల్కఁడు స్వప్నమునందు నెందు ని
ద్ధరణి సమస్తభూతముల ధర్మగతిన్ దనయట్ల కాంచు ని
ప్పరమ తపోధనుం డెపుడు పాడును వేడును గూడు నీశ్వరున్. 277

ఉ. చిన్నదె కాని యీ డితని చేష్టలు గాంచిన బ్రహ్మవేత్తలన్
మిన్నయితోఁచు మధ్య మిడిమేలపు జేఁడెటు దాపురించె నా
కన్నిటఁ జిక్కు వచ్చిపడె నర్భకు నేమన నోరు రాదు నా
పున్నెము పండి శిష్యునిగఁ బొందితి నీతని నేఁ దరించఁగన్. 278

ఆ. పుట్టి నేర్చుకొనెనొ పుట్టక నేర్చెనో యిట్టి బ్రహ్మవిద్య నీతఁడౌర!
యెన్ని యేండ్లు వచ్చి యేమి లాభము నాకు వీని కాలిధూళి కేనిఁ బోల. 279

ఆ. అనుచు దైత్యగురుఁడు తన శిష్యు కడఁ జేరి మనసునందు భక్తి మగ్నుఁడయ్యె
గురువు శిష్యుఁడయ్యె, గురువయ్యె శిష్యుఁడు గురువరునకుఁ బరముఁ గూర్చి తెలుప. 280

వ. అంత నద్దైత్యుండు, 281

మ. చదు వెచ్చోటికి వచ్చెనో సుతుని నొజ్జల్ బండటుల్ తొల్చుచున్
మది కెక్కించిన శాస్త్రపాఠముల నెమ్మోడ్కిన్ వివక్షించుఁ జూ
చెదనంచున్ బిలిపించె, బాలుఁ గొనివచ్చెన్ భార్గవుం డంతటన్
ముద మొప్పారఁగ దైత్యుఁ డాత్మజుని దాపుం జేర్చి తా నిట్లనెన్. 282

మ. దుడుకుం జేష్టల మానుకొమ్మనుచు నెంతో చెప్ప నాలింపమిన్
గొడుకా! నన్ విసిగించువాఁడ వగుటల్ కోపించితిన్ గార్శ్యమున్
బడసెన్ దేహము బెంగగొంటివాకొ నా బంగారుకొండా యటం
చొడిలోఁ జేరిచి చెక్కులన్ నిమిరి బిట్టోదార్చి ముద్దాడుచున్. 283

మ. ఇదొ యాచార్యులు చెప్పినట్టి నుడులం దేదేని నొక్కండు నె
మ్మది నీ ముద్దగు నోటితోఁ జదువు మీ మామయ్యనా నాతఁడే
పదముల్ బాడునొయంచు దైత్యగురుఁ డబ్బాలున్ నిరీక్షించుచోఁ
జెదరెన్ దృష్టులు గుండియ౯ దడ జనించెన్మై జ్వరం బేర్పడెన్. 284

ఉ. అంత సురారి రాజసుతుఁ డాదరమొప్పఁగ దండ్రి తోడ స్వో
దంత విశేష మిట్లు విశదమ్మొనరింపఁదొడంగెనయ్య ! నా
కెంతయుఁ బ్రేమతోఁ జదువులెల్లఁ బఠింపఁగఁజేసి రార్యులే
నింతకు ముఖ్య మీ చదువు లిన్నిటి సారము గుర్తెఱింగితిన్. 285

ఆ. కోటిచదువు లొక్క మాటలోఁ జెప్పెదఁ బరుల పీడనమ్ము పాతకమ్ము
నల పరోపకార మత్యంత పుణ్యమ్ము స్వాత్మతారకమ్ము శక్రవైరి. 286

ఉ. అంతటిలోనె దైత్యగురుఁ డడ్డమువచ్చి వచించె నిద్ది చా
లింతటితో మదీయవదనేరిత దానవరాట్ప్రశస్తి ది
గ్దంతిశిరో వినిర్దళనదక్షకఠోర కుఠారతుల్య దే
వాంతకదోఃప్రసార సువిహార మొకించుక చాటు పుత్రికా ! 287

క. అనఁ బ్రహ్లాదుండది విని తన గురువున కెఱఁగి వినయతత్పరమతియై
సనకాదికముని పోషకు మనమున ధ్యానించి గానమాధురిఁ జదివెన్. 288

సీ. చెండాడెదను నేను శ్రీనాథు శిరమూని హరి కిశోరము భాతి ననవరతము
పగలొనర్చెదఁ దమోభావమ్మునం జక్రిధారివర్తనలు స్వాంతమునఁ దలఁచి
తిరిగి జన్మింపని తెఱఁగు శ్రీహరిఁబట్టి రూపుమాపెదఁ గులోద్దీపనముగ
ఇవి యబద్ధములంచు నెపుడుదూఱెద విష్ణు వైకుంఠనగర దివ్యస్థలాల
తే. విష్ణు వెచ్చట లేఁడిల వెదకిచూడఁ దా నసురనాయకుఁడె జగత్త్రయవిభుండు
మజ్జనకు సంస్తవము వినామానవులకు హరిభజన మేల యని బోధపరతు నవని. 289
వ. అని చదువుటయు, 290
చ. అది విని దైత్యభర్త హృదయమ్మున నెంతయుఁ బొంగిపోయె స
మ్ముదమృత మల్లుబాఱ గురుమూర్తి ముఖాబ్జము విప్పె నంతఁ దా
నదనరు భావమేమి యనె నందనునారసి దేవవైరి, యా
పదములలోనె విష్ణువిభవ ధ్వనితార్థముఁ జూపె బాలుఁడు౯. 291

తే. అసురవరుఁడు బాలుని వికల్పార్థము విని కోపమంతయు బిగబట్టుకొనుచునుండ
గురువు విధిలేక తలఁ గొట్టుకొనుచునుండె క్షితిపుఁడసిదూసె నొజ్జకు చెమటపోసె. 292

చ. చిఱుతని గాంచిన౯ సరిగ జేనెఁడు జిట్టెఁడు లేఁడుగాని యీ
కరణిని నర్థముల్ పెడగఁ గల్పనముం బొనరించి చెప్పె మా

శిరములు నేలకుం బడఁగఁజేసె నిదేమన నేమి చెప్పుమున్
గురునకుఁ బంగనామములఁ గూర్చెడి శిష్యుఁడు వో బలే బలే! 293

ఆ. అనుచు వగచుగురుని యాపాదమస్తక మరసి కనుల నగ్ని గురియఁగాంచి
యొక్కపెట్టు దైత్యుఁ డులికిమేను బిండంబు లూడిపడఁగ విప్రుఁ డులికిపడఁగ. 294

చ. పటుతర నీతిశాస్త్రచయ పారగుఁజేసెద వీని నంచు ఛీ
కుటిలత నిచ్చకాల్ బలికి గుర్వభిధేయము బూని మాదు సొ
మ్ముటువలె నెంతొ కుర్రిఁగఁదిను చింటికి ముప్పగుదంచు నెంచ ని
న్నిటి కనుకూల శత్రుఁడవు నీవు పవిత్రుఁడ వెట్లు బాపఁడా! 295

క. తిని చెడనాడిన బ్రాహ్మణుఁ డనినన్ దలకిర్రింది నాగమద్దిర! స్వప్న
మ్మున నమ్మరాదతండనఁ దన వాకిలిఁ జేరనీయఁ దగదేవేళన్ 296

తే. ప్రభువు నిష్ఠురోక్తులు విని భార్గవునకుఁ దలయె నేలకుఁబడెను జిత్తమ్ముజెడెను
వెలవెలంబోయి మోముపైఁ గళలు దిగెను గూఁత వెడలకుండఁగ నోరు మూతఁబడెను.

చ. గడగడలాడఁ గాళ్ళు నిరుగన్నుల నశ్రువు లొల్కఁ బ్రాణముల్
పిడికిటఁబెట్టి భీతిగొని పెప్పెపె మెమ్మెమె యంచు వాక్యముల్
తడఁబడఁగా నొకట్లటులొ ధైర్యమొనర్చి యిటుల్ వచించె నా
యొడయుని పజ్జనొజ్జ కరయుగ్మము నల్పుచు జాలి గొల్పుచున్. 298

ఉ. ఏమని చెప్పువాఁడ దనుజేశ్వర! నీదు కుమారుతోడ నే
భూమిని లేని కష్టములు బొందితి నీ పెడతోవ మాన్పఁగాఁ
బ్రేమ వచించితిన్ భయముఁబెట్టితిఁ గొట్టితి వానిఁ బార్వతీ
స్వామి యెఱుంగు నేఁ బడినపాటులు భస్మహుతమ్ము లిమ్మెయిన్. 299

క. వెనుకను ముందును నరయక నను ననుమానించి తూలనాడితి వయయో!
మునుముందు నీకె తెలియును దనయుని లక్షణములెల్ల దనుజవరేణ్యా! 300

క. చెప్పుచుఁ జెప్పుచు నా తల నొప్పింగొనె నిట్టు లెన్ని నుడివినను నతం
డెప్పటి మార్గమెకాని యొకప్పుడు మనమాట తప్పియైన వినఁడుగా. 301

చ. ఇది విని దైత్యుఁడిట్టులను నిట్లొకొ దీనికి మందు నేనె పె
ట్టెదనిఁక మీర లాగుఁడు శఠించు వర్ణార్థము శస్త్రవైద్యమే
మొదటిది, ఇంటి దీపమని ముద్దిడ మీసలుగాలు మంచిగాఁ
దుదకొకసారి చెప్పెదను దోవకు వచ్చునొ లేక చచ్చునో. 302

క. కానిమ్ము చూతునని తన సూనుం గట్టెదుట నిల్పిచూడుమని యసిం
బూని ఝళిపించి యీ నుడి మానెదవా లేద యొక్కమాటం జెపుమా! 303

ఉ. మానెదొ లేదొ యన్న ననుమానముతో నను జూతువేలరా
మీనము మేషమంచు నిటు మిన్నని యెంచిన నే సహింప, మున్
దా నొక బంటుపంది యవతారము దాలిచి త్వత్పితృవ్యు ని
ర్వాణ మొనర్చు దానవవిపక్షు భజించుచు నన్గలంచెదే ? 304

మ. వధియించెన్ వినతండ్రి నల్లె నను జంపం జూచునోయంచు నా
విధవంగూర్చి తలంకుచుంటివఁటె యబ్బే యెంత యజ్ఞాన మే
నుధరం గల్గ భయమ్ము లెక్కఁడివి నన్నుం గెల్వలేఁ డింద్రుఁడే
నధికారిం భువి నేనె యీ సకల బ్రహ్మాండమ్ములం డింభకా ! 305

చ. అనవుడు రాకుమారుఁ డమరాంతకునిం గని పల్కెఁ దండ్రి ! యే
యనఘు జ్వలత్క్రుధానల మహార్చటధాటికి విష్టపత్రియ
మ్మును గనురెప్పపాటున సమూలము బూడిదయౌనొ నీవు నే
నన నిఁక యెంత, యెచ్చట మురాంతకుఁడీ వెచటన్ నృపాగ్రణీ ! 306

క. అధికార మజహరులకే యధికుం డిటు నతఁడె త్రిజగదధికారి, యిటే
నధికారి ననుకొనినయెడ నధికారివి నీకు నీవి యగుదువు జనకా ! 307

సీ. పుట్టక ముంగల పూర్వధామం బేదొ యెట నుండి యిటు వచ్చె నెఱుఁగలేఁడు
గిట్టినపిదప నీ గేహమ్ము విడి తాను జేరు దేశమ్మెదో చెప్పలేఁడు
మృతుఁడైన బాంధవుల్ బ్రిదికించుకొనలేఁడు చావు దప్పుకొనంగఁజాల డెపుడు
కంటితో వినలేఁడు కర్ణానఁ గనలేఁడు, ఎడమను గుడిసేసి నడపలేఁడు

తే. ముందువైపు మోఁకాలి కీల్ ముడువలేఁడు వెనుకవైపు మోఁచేతి కీల్గొనఁగలేఁడు
పరిమితాధికారము గల పురుగు నరుఁడు పరమపురుషుఁడ నేనంచుఁ బల్కనగునె ? 308

సీ. అవని యుక్తాయుక్త మరయఁగానీయక పరఁగు కామము కన్నఁ బగతుఁ డెవఁడు
స్వ పరనాశ వివక్ష సలుపఁగానీయక చంపు క్రోధము కన్న శత్రువెవఁడు
మానావమానాల మంటఁ గల్పఁగఁజూచు నంధమోహము కన్న నరి యెవండు
చిన్నపెద్దల గుర్తుజేయఁగా నీయని స్వమదోద్ధతిని మించు వైరి యెవఁడు

ఆ. ఇహపరమ్ములకు నహీన కీర్తికి నగ్గివెట్టు నమృతరూప విషములైన
వైరిషట్కమునకు వశమైన నీ గుండె పారతంత్ర్యమేల బాపలేవు. 309

ఆ. ఎదురెవండు నాకు నీ విశ్వమంతయు గెలిచికొంటిననుచుఁ బలికి తనదు
గుండెకాయ గెల్చుకొనలేని శూరుండు విశ్వవిజయి ననుట వెఱ్ఱిగాదె ? 310

ఆ. నీవు వేరె మరియు నే వేరె యను వేరుదనమె వైరవృక్షమునకు వేరు
స్వ పర భేదవృత్తి జనియింపఁ దను దానె వైరియగుచు ముందు వచ్చి నిలుచు. 311

ఆ. పరుఁడు వీఁడటంచుఁ బైఁబడి యొరు ధన ప్రాణ మానములను బాపు నరుఁడు
విశ్వమయత వెల్గు విష్ణు వొక్కఁడెయంచుఁ దెలిసికొనని వట్టి దేబెగాదె ! 312

సీ. అనవధికాశాదవానలోద్ధతి నార్ప వనధిజానాథు సేవనమె ఘనము
చంచల హృదయ ప్రశాంతి సాధింపఁగా నచలాంగనా మనోహరుఁడె గురుఁడు
అజ్ఞాన తిమిర సంహతి నివారింపఁగా నర్కేందునేత్రు విఖ్యాతిజ్యోతి
అస్థిరదేహ జన్మాద్యాపదలు బాప వైకుంఠవాసు ప్రాపణమె పణము
తే. సకల బాహ్యాంతరింద్రియచయ కృతాఘపంక ముడుగఁగా శ్రీవిష్ణుపదమె నదము
ఘోర సంసార భయదకూపార మీఁద సతము క్షీరాబ్ధిశాయి సంస్మరణ తరణి 313

క. పరుల మనమ్ముల నొంపక పరుల ధనము కాసపడుచు బ్రదుకక యెపుడా
పరమపదనాథుఁడగు శ్రీహరి వేఁడుమటన్న దనుజుఁ డలుకన్ బలుకున్. 314

క. కొడుకని దయఁగొనజాలన్ విడిచిన బొంగరమువోలె విహరింతువు నేఁ
గడు తాల్మిఁగొంటి చాలెక్కుఁడు బలుకకు నోరు మూసికొనుము మదాంధా ! 315

మ. అడియాసల్ వల దేరి నొంపవలదం చా ధర్మపన్నంబులన్
నుడువంగా వల దీవు నాకు నివి యెన్నో వచ్చుఁ బోరాడఁగా
నడుముల్ లేవమిఁ జేతఁగాని పలుకుల్ నానావిధాలౌర ! యీ
పొడి వేదాంతము లేడ నేర్చితివి పోపో వంశనాశంకరా ! 316

క. అన దనుజు వాదనకుఁ బుష్టి నొసంగఁగ దైత్యగురుఁడు డింభకుఁ గని యి
ట్లను "పితృ దేవోభవ" యన వినవె జనకు మించు దొడ్డవేలుపు గలఁడే ? 317

ఆ. ఈవు తండ్రివోలె నిందుపై దండెత్తిచనుటొ ధనము కొల్లగొనుటొ వారి
స్త్రీలఁ జెఱనుగొనుటొ, యీలీల హరిగిరి యనఁ బ్రపంచజేత వగుదొ యనిన. 318

క. ఆ గురువున కను డింభకుఁ డాగమశాస్త్రాదివేత్తలగు పెద్దలు మీ
రీగతిఁ బల్కుట వైద్యుఁడు రోగి కపథ్యంపుగూడు రుచియని యిడుటల్. 319

క. కాంతా కాంచనములు గన నెంతటివానికిని వెఱ్ఱి యెత్తించును ద
ద్భ్రాంతిని విడువఁ బ్రపంచమ్మంతటినిన్ గెల్చు యోధుఁడగుఁ గద స్వామీ ! 320

క. వెత లొనగూరిచెడి యశాశ్వతపుత్ర కళత్రవిత్త వసుధాలయ సం
గత కృతక సుఖముల ప్రాకృత దివ్యానంద పదవి కెనయగునె సుధీ ! 321

వ. తండ్రీ ! దేహం బస్థిరంబగు గేహంబు వంటిది. బాల్యంబు కేళీలౌల్యంబున నశించు. వయస్సు పయస్సువలెఁ బొంగి కుంగు. వార్ధకంబునైన సార్థకం బొనర్చుకొనెద మనుకొన సంసార బంధంబు సుదృఢమ్మై విస్తృతిం బొంది సందొసంగకుండు. ఆయువు శతవత్సరంబులుంట లే యదృష్టవంతునకో. ఐన నం దర్ధంబు నిద్రాగతి

వ్యర్థంబై చను. శేషార్థంబు ననర్థంబులగు బాల్యకైశోరంబు లజ్ఞానభావబంధురంబులై కర్తవ్యవిమూఢంబులై కడచును. తక్కుంగల పంచవింశతి వత్సరంబు లరిషడ్వర్గ పరవశుండై సురాపానంబువంటి దేహాభిమానంబు వదలక నిరంతర వ్యామోహకర కార్యలగు భార్యలన్ మమతాబంధ వివర్ధక చరిత్రులగు పుత్రులన్ ప్రేమపాశ బంధన మొనగూర్పు బంధువులను ననుకూల శత్రువులనఁదగు మిత్రులం దవిలి యిహమ్మె శాశ్వతమని పరంబు మఱచి భగవద్జ్ఞాన తిరోధానకారిణియగు మాయ ప్రయోగించు మోహపాశంబుల బద్ధుడై నిజకాయ వినిర్గత తంతుకూటంబులం జిక్కు కీటంబు పగిది విముక్తిమార్గంబున్ గనక మ్రగ్గు నందులకె భవబంధలతాలవిత్రంబగు శ్రీహరి రూప గుణ చరిత్రంబు గానం బొనర్చి తరింప నొప్పు. 322

తే. విశ్వకల్యాణకరుని భావించు మనము నిత్య సత్యస్వరూపు వర్ణించు వాక్కు
దీనజనపాలు పూజించు దివ్యకర్మ లేమి భూభార మతని కళేబరమ్ము. 323

సీ. వైకుంఠుఁ బొగడని వక్త్రమ్ము ఢక్కనా నది దేవళమ్ములో నదమొనర్చు
హరి పూజనములేని హస్తంబు దర్వినా నది యన్నపూర్ణ హస్తాయుధమ్ము
విష్ణుభక్తియె లేని విబుధుండు పశువన్న నది మహాదేవు వాహనము సతము
కంజాక్షునకుఁ గాని కాయంబు భస్త్రినా నది రాగిఁ గరఁగి దేవాకృతి నిడు

ఆ. చక్రి చింతలేని జన్మ బుద్బుదమన విష్ణు పాదవారి వెలయు నదియు
శ్రీపుఁ గనని కనులు శిఖిపింఛనేత్రమ్ము లనిన దేవసన్నిధి నవి యలరు. 324

ఉ. కాక పికస్వనాంతరము గావలెనే బధిరాగ్రగణ్యు, క
స్తోకమణి ప్రకాశమున క్షుల్లకకాచములోన భేదముల్
చీకునకేల, ఘోరభవసింధు ముఖాంతరవర్తి కెయ్యడన్
లౌకికపారమార్థిక విలక్షణలక్ష్యము లేల దేశికా! 325

క. అని గురున కెదురు మంత్రమ్మును జెప్పెడి తనయుఁగాంచి ముడివడఁగ బొమల్
కను లెఱ్ఱజేసి వడి దంతనిపీడన మడరబెడిసి దనుజుం డనియెన్. 326

క. మొనమొన్న నీవు చక్కఁగఁ గను దెఱచితొ లేదొ బుద్ధి గఱపెదు మాకే
ఘనముగఁ ద్వదుపన్యాసమ్మును గన శ్రుతిమించి రాగమునఁబడు నౌరా! 327

ఉ. వేసటఁబోక యొజ్జయను భీతి యొకించుకలేక చాలఁగాఁ
గూసెద విచ్చవచ్చినటు కూఁతలు దుర్మద! నోరు నింకనున్
మూసెదొ లేదొ చెప్పుమిదె మూఁడిన దాయువు, నీకు నాకునున్-
బాసె ఋణానుబంధ మిల బాలిశ! చాలిఁక నీ ప్రబోధముల్. 328

చ. చెడుగఁద పుట్టినాఁడ వెద జీల్చు వ్రణమ్మటు నాకు నింతకున్
గడుపని యేడ్చుచుంటి నొక కంట నదేమియొ వద్దువద్దనన్

దడమయివచ్చు నా వెతవృథా పరిదేవన మేమి లాభ మీ
కడుపున కోఁత కోర్చెదనుగాని సహింపను నీ ప్రలాపముల్. 329

తే. దనుజ హరుభక్తి నీ కెట దాపురించెఁగనిన చేతుల నిను జంపుకొనఁగవలసె
ననుచు నసినెత్తి చంపఁజేయాడ కుక్కి వడఁకి ధరఁ గూలెనదియు బాష్పములతోడ. 330

క. కని ప్రహ్లాదుఁడు పితతో నను నా యెడ నీకుఁ గల్గునట్టి దయ మహీ
జనహత్య నేలరాదా యనఘుల తలిదండ్రు లిట్లె యడలరె తండ్రీ! 331

తే. వ్యష్టికై పాటుపడ బిందువారి యగును నే సమష్టినంచు శ్రమింప నీరధియగు
నరయ స్వార్థమ్మనకును బరార్థమునకు నబ్ధికిని బిందువునకున్న యంతరమ్ము. 332

క, మును సతిని వజ్రి గొనిపుచ్చినఁగని పై నిప్పుకలను చెరిగితి వయయో!
ముని పత్నుల చెరగొన నా యనఘుల యెదరేఁగు ప్రళయమగుపడ దెట్టుల్. 333

క. విను మొరులఁ బ్రేమఁజూచినఁ దను దా ప్రేమించుకొనుటె తా నొరుద్వేషిం
చిన ద్వేషి తనకుఁ దానే తన మోమునఁజూపు విశ్వదర్పణ మెంచున్. 334

తే. పుత్రివాక్కు లాలించి యప్పొలసుదిండి యచ్చెరువు నొంది కోపము రెచ్చిపోవ
విడు టబద్ధము హరి నుతి వీఁడటంచు విసము నిప్పించి చంపహృద్వీథి నెంచి. 335

క. తెప్పించి విసముగిన్నియ నిప్పగిది వచించెఁజూడు మిది విషము తినం
జప్పునఁ బ్రాణము వోఁగల దిప్పటికిఁ హరిని విడుతొ యిల విడుతొయనఁ. 336

ఉ. దానవరాణ్మణీ! నను హతమ్మొనరించెడి వస్తు వీ భువిన్
గాని మరెందు నే నొకటి గల్గ దెవారును జంపలేరనఁ
నే నవినాశినెం, దిపుడు నీవు విసమ్మిడ నీయకున్ననుఁ
దా నయి మేనువీడు టిది తథ్య మిలంగల ప్రాణికెయ్యెడఁ. 337

తే. మధ్యవచ్చిన ప్రకృతి సంబంధమునకు శాశ్వతపుఁ జుట్టరికమేను జంపుకొనను,
కర్మవశమున నీ బందెఁ గట్టుబడితిఁ గడప విసమిచ్చు నీ వుపకారి వరయ. 338

తే. కాని తుదకొక్కనిముసమ్ము గడువునిమ్ము తనువు పరవశమంద సార్థకముజెంద
నాదు తమిదీఱ భజియింతు నళిననేత్రు మరణశిక్షిత కడకోర్కి మాన్యమెందు. 339

క. అనుచుఁ మిను గనుచున్ గనుగొన నానందాశ్రువృష్టి గురియఁ గరయుగ
మ్మును మోడ్చి జడీ భూతసుతనుఁడై తాదాత్మ్యమొంది ధ్యానించు నిటుల్. 340

క. గరుడుఁడు విష్వక్సేనుఁడు కరయుగ్మము మోడ్చి యుభయకక్ష్యల నిలువన్
వరసూరి గణము కన్నుల కఱవటి సేవింప నీలకాయముతోడన్. 341

క. శ్రీమద్వైకుంఠమ్మనఁ బాముపయిం బవ్వళించి పదకమలములన్
శ్రీమహిళ యొత్త నిత్యులు చామరములు వీవ వెలుఁగు చక్రిన్ దలఁతున్. 342

సీ. చిఱు చెమ్మటలతేమ శ్రీఖండ తిలకమ్ము కమ్మ కస్తురిఁగూడి కరఁగిజాఱ
విటలాంగణమ్మునఁ గుటిలాలకమ్ములు అటిటు గాలికి నాట్యమాడుచుండ
మకరకుండల దివ్యమణి మయూఖమ్ములు గండభాగముల నీరెండగాయ
నిర్మలాకర్ణాంత నేత్ర పద్మమ్ములు మహనీయ సత్కృపామధువు గురియ

తే. సదమలాంబుద గంభీరవదనసీమ మందహాస విద్యుల్లతల్ మఱగి వెలుఁగ
ఇందిరాసుందరిని భ్రమియింపఁజేయు సుందర ముఖారవిందు ముకుందుఁ గొల్తు. 343

శా. మాయాసూను కళత్రపుత్ర సుఖ సంపన్మందిరారామముల్
కాయాఖ్యాయిక పంజరాంగణ విహంగంబైన యీ హంస ము
క్ష్యేయంచున్ దివి లేచిపోవువఱకే చూపట్టు స్వప్నాలు, నన్
బాయంజాలవు నీవు దేవ! నిరతాపద్బాంధవా! మాధవా! 344

క. అని వేడుచు విసముంగొని తన వదనమునందు నగవు దనర గరుడవా
హను భక్తుల విసమదియే మొనరుచునని త్రావెఁ దండ్రి యొడలు వడంకన్. 345

తే. త్రావి మాధవ శ్రీపద ధ్యానమగ్నమానసుండయి మనియెడి సూనుఁగాంచి
విస మమృతమయ్యె నిదియేమి వీని కనుచుఁ గినిసి సుతుఁ జెవింబట్టి వాకిటనులాగి, 346

క. మురహరరూప వినోదున్ బరిహృత సంసారఖేదు భక్త్యున్మాదున్
గరగత నరహరిపాదున్ హరిభజనానందమోదు నా ప్రహ్లాదున్. 347

చ. కసిగొని చంపనెంచి యిరుగన్నుల నగ్నికణాలు రాలఁ బెన్
బుసగొను కాలసర్పమును బోని కరాళకరాగ్రమంటు నా
యసకృత భీకరోరుగద నాత్మజుఁడారయఁ బల్కె మింటిలో
విసరెద దీని క్రింద తలవెట్టి తలంపుమికన్ జనార్దనున్. 348

ఆ. రక్షసేయ శౌరి రానేల వైకుంఠమునకు నేన నిన్ను బనుచువాఁ
డెవ్వఁ డడ్డపడునొ యేను జూచెదఁగాక యనిన దనుజసూనుఁ డనియెనిట్లు. 349

వ. "వాసుదేవ స్సర్వమితి" యని తెలిసియు నస్మాదృశబద్ధ జీవులిట్లు భవన్నివాస మొక వైకుంఠమే యనిన నచటికి రా నరయవలెనె "అంతర్బహిశ్చతత్సర్వం" అని యెఱింగినఁ బ్రతి గృహద్వారము వైకుంఠద్వారముగాదె. ఇటనుండి యనాథవత్సలా! యని పిల్వఁ బరువిడిరావె. కాలకృత దేశకృత రూపకృత పరిచ్ఛేదరహితుండవగు సర్వాంతర్యామివని తెలిసియు నా నుండి వేఱుగానున్నట్లు దూరస్థుండవైన గతిఁ బిలువ వలెనే? తలంపులఁగల యలంతి విషయములనైన గుర్తెఱుంగుచు సర్వకాల సర్వావస్థలయందు భ్రుకుటింగల త్రికుటిస్థానమున వెలుఁగొందుచు నందులకు నందరాని వాఁడవై సహస్రారకమలమున విమలగతినున్న నిన్ను ఘూకం బస్తోక ప్రకాశ భాస్వరుండగు భాస్కరుం గనలేని చందంబున మాయాబద్ధ బుద్ధులగు మాదృశులు

కనఁగలరే యన వినుచు దనుజవర్యుండు లీలం గేలంగదప్రేల నాలమందలి శూలి
యపరావతార మన దిర్దిరం ద్రిప్పుచుఁ దద్ధ్వానంబున ఘనఘోంతరములు ఘూర్ణిల్ల
భూమండలం బల్లాడ దిక్కులు పిక్కటిల్లఁ దోయధులు కలంగ రవిశశిద్యుతులు తొలంగ
హాహాకారములు చెలంగ రెక్కల నెగసిపోవు దిక్కరీంద్రము భాతి హిమవన్నగంబు
రీతి రువ్విన జవసత్త్వంబుల రివ్వుమని పువ్వుగతి దవ్వుల నున్న ధ్రువమండలంబు
జేరం జనుటయు, 350

ఉ. దానికిఁ గ్రింద శీర్షమును దద్దయు వంచి హరిం దలంచి తా
మానుగఁ బాణియుగ్మమును మస్తకమం దిడి మ్రొక్కుచున్ హరే
దీనజనావనా ! యనుచు దీల్పడి బాష్పనిరుద్ధ గద్గద
స్వానగళంబునన్ నిలిచె సత్యత దైత్యకులార్భకుం డటన్. 351

క. ఒక్కట మరలెనుగద తా నక్కజపడ రక్కసుండు, హర్షింపఁ బ్రిజల్
పక్కివలె పచ్చి దానిని ముక్కున గీలించికొనుచుఁ బోయె నెదో యటన్. 352

తే. దారుణామోఘ ముద్గర తాడనముల మదగజవ్యూహ పాద సమ్మర్దనముల
భీకరవ్యాళ దంష్ట్రిని పీడనములఁ జావ డిదియేమి మాయయొ యీ వటుండు. 353

వ. అని దనుజపతి మనంబున ఘనంబగు చింత స్వాంతనొంద బాలకుండు హరిం దలంచి.

సీ. ఎవని సౌందర్యంపు నవరత్నఖనిలోన మన్మథుండన నొక్క మచ్చుపిసరు
ఎవని పావిత్ర్య మహిత సుధార్ణవములో జాహ్నవి యన నొక్క జలకణంబు
ఎవని లోకద్వితయ విభూతి విభవమ్మునందు భార్గవి వక్షహారరత్న
మెవనిదౌ సౌకుమార్య విశేషమున నోడి పాఁపతేఁడును గ్రిందుపడి యడంగె

తే. ఆతని సౌందర్య సౌకుమార్య ప్రపంచ పూత సౌశీల్య వాల్లభ్య పూర్ణమహిమఁ
బొగడ విధి శివ సనక సూరిగణ నిగమ జాలమే చాలదన నజ్ఞ బాలుఁడెంత ? 355

క. అని వేడు కొడుకుఁ గని తా నను నిట్టు లోహహో కుమార ! హరి యెచ్చట నె
ట్లని వేడఁ గానఁబడునో కనువిప్పి వచింపుమన్నఁ గని యతఁ డనియెన్. 356

క. 'ఇందుఁ గలఁ డందు లేఁడని సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన నందందే కలఁడు దానవాగ్రణి ! వింటే.' 357

క, అనవుడు దనుజుం డిట్లనె కనుచోటుల నెల్లఁ జక్రి గలఁడే యైనన్
దినుచోట నమియుచోటనె యన నగి ప్రహ్లాదుఁ డిట్టులనె జనకునితోన్. 358

క. మాతృమూర్తి సొబగుమై మాతృతతి తోడఁ దడిపినావు కాలఁ దన్నినావు,
అట్టి జనని నీకె యారాధ్య దేవతగాఁ దలంచి మ్రొక్కఁ గదఁగనేల ? 359

వ. అనునంత నద్దానవుండు తనయునిం గని యే యుపాయంబుల నీవు చావకుండుటకు
హేతువెద్దియన నబ్బాలుండు, 360

తే. తులము శిలనైన ముంచెడి జలము లెందు మొద్దు మ్రాఁకుల బరువుల ముంచఁగలవె
జీవనమ్మిడి తానె రక్షించునట్టి వానిఁ దేల్చక ముంచెడివారు గలరె. 361

క. అన విని దనుజుఁడు స్తంభమ్మున గలఁడే హరి యటంచు ముఖ మెఱ్ఱవడన్
గనుగ్రుడ్ల నిప్పు లురలఁగఁ దనయుని గని యడుగుటయు నతఁడు గలఁడనియెన్. 362

చ. కలఁడని చెప్పినంత వడిఁ గంబము నుద్ధతిఁ దన్నె దైత్యుఁ డా
యలఘుతర ప్రహారహతి నట్టిటు లూఁగెను సౌధరాజముల్
గలగలమంచు ద్వారముల ఘంటికలెల్లను మ్రోఁగె స్తంభముల్
ఫెళఫెళ గూలెఁ బర్విడిరి భీతిలి యంతిపురంపుఁ గాంతలున్. 363

మ. పదనిర్ఘాత సమప్రహారహతిచే బ్రహ్మాండభాండమ్ము బి
ట్టదరన్ స్తంభము చెక్కలయ్యె లయ రుద్రాకారముం బూని తా
నుదయించెన్ మహితార్భటిన్ నృహరి దైత్యోన్మత్త శుండాలదు
ర్మద మస్తిష్క విదారణోద్ధతిని శుంభత్క్రోధ సంరంభియై. 364

సీ. గర్వ నిర్భేదక గర్జారవమ్ముల శ్రుతిపుట పటలము క్షోభజెంద
హృదయవిదారకోన్మద తీక్ష్ణదృష్టుల మహిఁ బ్రాణితతియెల్ల మాడిపోవ
ప్రళయకారక సింహభయదాకృతుల తోడ దానవలోకమ్ము దద్దరిల్ల
కాలాహి దంష్ట్రాభకరపద నఖచేష్ట దైత్యేశు ప్రాణముల్ తల్లడిల్ల

తే. శూల నిభదంష్ట్రికల మధ్యవేల్లు జిహ్వ ప్రళయకాలానలజ్వాల పగిదిఁ గ్రాల
డింభకుని బ్రోవ దైత్యదిక్కుంభి నణఁచ జృంభగతి స్తంభమున జనించెను నరహరి. 365

చ. హరిఁగని దానవాధిపుఁ డహంకృతి యొప్పఁగ హుంకరించుచున్
గరగత ఖడ్గధార కెరగా నొనరింతును నిన్నటంచు భీ
కర పృథులాట్టహాసమున భీషణరోష కషాయితాక్షులం
జురచుర గాంచి పైకుఱికె శూరశిరోమణి నే నటంచునున్. 366

ఉ. వచ్చెడు దైత్యు నెత్తి హరి వారక యూరువులందుఁ జేర్చుచున్
హెచ్చెడి క్రోధవహ్ని గళ మించుక తుంచి మహోదరమ్మునున్
వ్రచ్చి మహోగ్రుఁడై కని యవార్యగతిం బరతెంచు రక్తముల్
జెచ్చెర శీర్షసీమ నభిషేక మొనర్పఁగ దర్ప మేర్పడన్. 367

ఉ. ప్రేవుల ప్రోవులం బెరికి భీకరలీలల వాని నన్నిటిన్
దావడముల్ ఘొనర్చి యఱుతన్ వడిఁ జేర్చి యసృగ్వసంతవ

ర్ణానిల రుదగ్రమూర్తియయి యాసురశీర్షము ద్రెంచివైచె నే
ర్పావహిలంగ దేవగణ మాకస మంటుచుఁ బొంగ నుద్ధతిన్. 368

ఉత్కళిక

అక్షియుగమ్మున నగ్నిగోళముల్
వీక్షణమ్ములను విలయ తాళముల్
భీషణ గర్జలఁ బిండములు చెదరె
ఘోషల విని దిక్కుంజరము లదరె
రక్తచందనపు రంగుల కాలిక
ప్రళయతాండవము సలిపెడి నాలిక
దొరలెను శిరమిలఁ బొరలెను మొండెము
ధరణిఁ గూలె రక్తపు మృద్భాండము
జ్వాలలఁ గనుగొని శలభపుదండు
పూలు ఫలాలని పోరపడుచుండు
ఆశానిలముల నతిగా వెలిఁగెడి
ద్వేషానలమునఁ ద్రెళ్ళు నరుఁడు చెడి
అంతరిక్షమును నంటగ నెగయుచు
గంతులువైచెడి గాలి పుల్లలో
నావ విధమ్మున నదితో నొరయుచు
పోవుచునుండెడి పూరిపుల్లలో
శ్రీమ యెవ్వరిదో శక్తి యెవరిదో
గమనము సాగెడి కాల మదెంతో
అధికారము లఁట యాయువు లంట
అభిమానాగ్నుల కాహుతు లంట. 369

వ. అట్లాగ్రహోదగ్రుండై యలరు హరిం గని యమరగణము, 370

క. వగ నొక్కఁడు మితిమీఱినఁ బగ నొక్కఁడు పోరఁ జేర వాంఛించిరి యీ
దుగ కార్యము లోకతతి సేయఁగనెంచి నృసింహరూప మందితి శార్ఙీ! 371

మ. కదనార్థమ్ము కరమ్ము నెత్తికొని చక్కన్ వచ్చు విధ్వంసకృ
న్మద మాతంగ బలాన్వితుం డొకఁడు యుష్మత్పాద పంకేరుహో
ద్యుదిత స్వాదు మరంద మంజురస పీయూషమ్ములం గ్రోలు ష
ట్పద మొక్కండని చంపఁ బెంప నిటు స్తంభమ్మందు జన్మించితే. 372

చ. గురుతతికిన్ బరాత్పరునకుఁ దలవంచి నమస్కరించుచో
సరియగు దారి గానఁబడు శౌరి పదమ్ములు జిక్కు నెందు నీ

నరున కటంచునున్ దనుజనందను వృత్తముచాటు నేత్రముల్
శిరమున కెక్కినంబడి నశించు ననుజ్ఞ ఖలదైత్యవృత్తముల్. 373

క. నరునకు నరరూపమ్ము నసురపశువున కెందు నే నసుర పశురూప
మ్మిరవుగఁ గనఁబడినట్టి ముకురరూపమ్మయ్యె నీదు గురురూపమ్ముల్. 374

వ. అనుటయు భార్గవి నరహరి యుగ్రరూపము నుపశమింపఁజేయ నిట్లని స్తుతించె, 375

తే. ఊర్ధ్వకాయమ్ము హరి రూపమొందియుండఁదగ నధఃకాయమది నరత్వమువహించె
నాఖ్యయం దీక్రమమ్ము నృహరియటంచు నేల తలక్రిందులయ్యె శ్రీలోల ! చెపుమ. 376

తే. రక్షణమొనర్చు పేరుపై రాజిలుఁగదె శిక్షణమొనర్చు పేర్ క్రిందుఁ జెలఁగుగాదె
యనుచు నరసింహ నామమ్ము లన్వయపడ నలరినాఁడ వీ పేర రమాధినాథ ! 377

వ. కావున రక్షణము గొప్పదగునను నంతఁ బ్రహ్లాదు దయంగాంచి రక్కసు నుక్కడ
గించి నృహరి యుగ్రరూపము విడిచి యంతర్ధానమ్ము నొందెను. 378

## ఆ శ్వా సాం త ము

క. శ్రీరమణీ వదనాంబుజ, చారుతరాపాంగహాస సౌందర్య మధు
స్వారస్యపాన మద విస్ఫారితసారంగ ! భూమిజాతానాంగా ! 379

ఉ. సుందరమూర్తి ! లోకనుత సూనృత ధర్మపథానువర్తి ! మ
ధ్యందిన భాస్కరోజ్వల మహద్యుతి సన్నిభసుప్రతాప శ
త్రుందమ దివ్యకీర్తి ! జనతోషకపాలన సత్క్రియా జగ
ద్వందితి చక్రవర్తి ! రిపువర్గ మనస్సమవర్తి ! రాఘవా ! 380

## అలసగతి వృత్తము

మదగజసమాన సుకుమార పదయానా !
మదన శరవీక్షణ రమా ప్రణయపానా !
వదన జితదర్పక సువర్ణ పరిధానా !
తదన తలభీమ ! ఘన కల్పతరుదానా ! 381

## గ ద్య ము

శ్రీమద్భరద్వాజగోత్ర పవిత్రాపస్తంబసూత్ర, ప్రథిత సూరిజనమిత్ర, బక్కయ్యశాస్త్రిపుత్ర
వాగేశ్వరీ సమాసాదిత, వైదేహీవర నివేదిత సరసకవితావిలాస, సహజ
పాండిత్యభాస, వరకవి విధేయ, 'వరదార్య నామధేయ ప్రణీతం
బైన పోతన చరిత్రమను మహాప్రబంధమ్మునందు
ఏకాదశాశ్వాసము.



శ్రీ ర స్తు.

శ్రీ వాగీశ్వర్యై నమః




## భక్తిగాథా నివేదనము - ఉత్తర భాగము

"ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"


రామ దేవ ! సురముని
నీరాజిత పూత పాద నీరజ సేవా !
ఘోరాజి విజితరాక్షస
వీర దశగ్రీవ ! సతత వితరణభావా ! 1

గీ. వర గజేంద్ర మోక్షణ కృష్ణచరితములివి యొంటిమిట్ట రామున కోరుగంటి సుకవి
విమలమతి నాళుగతి జెప్పె వీనినిఁ జవిగొనవె శ్రీరామ ! విధి శివ వినుతనామ ! 2

వ. అంత పోతనార్యుండు మరుసటి దినంబున నినకులమణిం గని ప్రభూ ! మకరి నోటం
జిూరి మరణ వేదనము నొందు మదేభపు టార్తధ్వని విని యాదుకొని రక్షించినతెఱంగు
నస్మత్కృతిని కృపామతిని రక్షింపవే దయాసముద్ర ! రామభద్రా ! యని తత్కథా
విధానం బాళుగతి నిట్లభివర్ణింపం దొడంగె, 3

క. జనవినుత ! సుధారాశిన్ మనియెఁ ద్రికూటాఖ్య నొందు మహీధరమందున్
దనరు మహారణ్యంబులు ఘన హరి కరి ఖడ్గగవయ ఖగమృగ వితతుల్. 4

ఆ. గండశైలములకుఁ గాళ్ళు వచ్చినవనఁ దనువుఁగొనిన యంధతమసములన
మత్తవారణంపు మొత్తమ్ము లొకపొద్దు మురిపె మొలయ వనులఁ దిరుగుచుండె. 5

మ. కరి సంఘంబులు బృంహితధ్వను లెసంగఁ రాకడల్ గాంచుచోఁ
దరువల్లీగణముల్ వడంకె నదరెఁ ధాత్రీసతిఁ గుండియల్
హరిదాస్యంబులు బొబ్బరిల్లె నలనల్లాడెఁ సరస్సీమ లీ
వరుసన్ దాము జడంబులే బెగడ నేపాటొందెనో చేతనల్. 6

మ. మదమాతంగ మొకండు కోటి కరిణీ మధ్యంగతుండై తమిఁ
వెదయైయున్న కరేణు సంతతుల వెన్వెంటన్ దగుల్కొంచు ను
న్మద వృత్తిన్ రమియించి నైజమహి భృన్మార్గమ్ముఁ దప్పెన్ బిపా
స దపింపన్ వదనమ్ము దూరగత కాసారంబు జేరం జనెఁ. 7

ఉ. శీతల వాతపోతములు చిందులు ద్రొక్కు పథమ్ములఁ సితా
బ్జాత నవోత్పల ప్రసవ సౌరభముల్ విహరించు బాట భూ
జాత ఘనాత పత్రముల ఛాయలకే వెరపొంది గ్రీష్మతీ
వ్రాతపముల్ తొలంగి చను నధ్వములఁ బయనింప నొక్కెడన్. 8

క. చారుధవళేందు కాంతశిలా రచిత వితర్దికా విలాస స్థలిలో
నీరజ సుమదళ శయ్యాగారమొ యనఁ దనరు నొక్క కాసారంబున్. 9

సీ. మత్స్య కర్కాటక మకర సమూహముల్ జలమాను మేష వృషహరి వితతి,
యంబు కుంభముల నొప్పారు కన్యారాశి దరుల క్రీడించు కిన్నర మిధునము
ఖల నిషాదగణంబు జల విహంగముల వేటాడు నధిజ్య శరాసనములు
నికటస్థ భూరుహ నివహ శాఖాముక్త ఫలతతిన్ దూఁచెడి యలలతులలు
తే. పద్మినీకాంత లేయాకు పరిటమాటు కుసుమకుచమధు స్తన్యమ్ము గ్రోలి వ్రాలు
నళులు వెలయ పుల్లాంభోరుహ ప్రతతులఁ దారకిత నభస్థ్సలియె కాసారమనఁగ. 10

వ. తత్సవిధ ప్రదేశంబులఁ గల సర్వంసహా కష్ట సహనశీలతకు నుపాయంబులన్ గట్టం బెట్టు పసరికపట్టుకోకలై యెల్లెడల నల్లుకొని యార్ద్రంబులున్ మార్దవంబులుఁ నేత్ర పర్వంబులు నగు పచ్చపచ్చని పచ్చికబయళుల యందమ్ములును,

తమ్ముల విభవమ్ములకు జీవనమ్మేని ధారవోయు నిష్కల్మషాంతరంగమ్మునం గల సత్సహోదరత్వమును నికటస్థతరు నివహమ్ములకును నుపరిస్థిత రవి శశి నయనమ్ములకును దర్పణ మ్మిడినట్లు దర్శితమ్మొనరించి నెమ్మదిపడి కడుపునిండినగతి నుండి మండుటెండల ధాకలకు వెండిరేకుల తళతళలీనుచు సాంధ్యరాగంబుల తామ్రపర్ణంబుల డంబు మీఱి చీఁకటిఁ బఱచిన వెలినీలి కోకలై కలవారి యింటిగతిఁ గళగళలాడుచు జలసమృద్ధిఁ దులదూఁగు కొలఁకులం గల కొలఁకులును,

కులసతులం బలెఁ గొలని నెలంతల గిలిగింతపెట్టి సలిలావగాహ మొనర్చి చలువలై మెలమెల్ల వచ్చు శాంతానిలవర్తనంబులకు బలే! యని తలలూఁపి ఫల పుష్పంబుల జలజల రాల్చి విలువ సేయు ఫలభూజంబులును,

జంబూ తరువారంబుల ఫలభారంబుల నిండు చూలాండ్రగు కొమ్మల వలె నున్న కొమ్మల నుండి తోయంబులం బడు ఫలనిపాతనిస్వనంబులు పాదపస్థిత శకుంత సంతాన గానతానమ్ములకుఁ దాళమ్ములు వేయ,

అమ్ములనేయు చందమ్మున జలాంతరాళమ్ముల నుండి మిలమిలలాడుచు నరుదెంచి యా ఫలంబుల నాస్వాదింప గుంపుగొను సౌదామినుల చందంబునఁ బాతర లాడు సంభళ్ళర డింభకంబుల యీఁతలును,

ఈతల వెలుంగు నీఁతచెట్లు శీతలహ్రదంబులోనికిఁ గోఁతకొడవండ్రవలె మ్రొగ్గుట నిగ్గు చువ్వల కుచ్చెల యంచుల బాఁకులంబోని వాని శాఖల జోలెలవోలె వ్రేలు గిజిగాండ్ర గూండ్ల ప్రతిబింబమ్ముల చెలువంబులును,

చెలువుని యెడంద నిశ్చలంబైనను నవిశ్వాసంబున నడుగడుగునకు ననుమాన పడుచు నరగడియయు విడువలేని యాత్మపత్ని విధంబున జోడుగల క్రొమ్మావి కోడెకాండ్ర నాత్మీయారుణతరుణ బాహువల్లి బంధమ్ముల బంధించి విడువని మల్లికాది వల్లి కామతల్లికలును,

తల్లిగల నెలవు లెఱుంగక కులాయమ్ముల నుండి వెలిం బరతెంచి యెఱంగొని యేప్రక్క నుండి యరుదెంచునో యని తలలెత్తి నలుదెసలు నిక్కినిక్కి కాంచుచు నీఁకలురాని ఱెక్కల నెగురవైచుచు లోవెలికి నడయాడుచు వెక్కివెక్కి యేడ్చు పసిబిడ్డల చందమ్మున గుండె వగిలి యుఱక నఱచు ముక్కుపచ్చలాఱని పిట్టపిల్లలును,

పిల్లలను ఱొమ్మునకు బిగియఁగట్టుకొని యిల్లిల్లు దిరిగి జోలె నింపుకొను కిరాతాంగనల తెఱంగునఁ బిట్టకూనలు పట్టువిడిపోనీక గట్టిగా నలముకొని పొట్టపై నతికికొనఁ జెట్టుకొమ్మలపై నిట్టట్టు గంతులిడి కాయకసరుల తిండిన్ బుక్కిళులు నిండఁగ దీరస్థిత భూరుహంబులపై విచ్చలవిడి విహరించు శాఖామృగ సంచయంబులును గల్గి వింత సంతసములఁ గొల్పు ననల్పమై వెలుంగు నా సరోవరంబున, 11

క. మదగజములు సలిలమ్ముల ముద మారఁగ ద్రావి గండములఁ జల్లుకొనున్
జదలునఁ జిమ్మను భూవారిదములు ప్రతివృష్టి దివిఁ గురియునేమొ యనన్. 12

క. తిరుగాడు నగమొ నాగమొ, దరణికి దిగివచ్చువారిదమొ వారణమో,
కరమో మృదువై వంగు శిఖరమో, గండజమదంబొ ఘన నీరంబో. 13

వ. అన నమ్మదగజేంద్రంబు గాటంపుఁ దమకంబున నన్నీటన్ దోఁగియాడఁ జని కని. 14

క. పిలుచున్ దన ప్రియకాంతల నిలుచున్ నీ రడుగుముట్టి నెఱి మంథనమై
కలఁచుఁగ బురదగ నీటఁ బెకలుచున్ బిసకాండములను గడు మోదమునఁగ. 15

ఆ. కరి కరేణుగణము లిరులట్లు తను జుట్టఁ గేలిసల్పె నా విశాలసరసి
జలములందుఁ దేలి జగవాగ్విరుద్ధతఁ బర్వతమ్ము లీఁదు పగిదిఁదోఁచె. 16

ఆ. కొండచిలువఁబోలు గొప్ప తొండమ్ముతోఁ గుండపోఁత నభము గురియునట్లు
చెవులు కంకణములఁ జేటలం జెరుగఁగన్ నీరుబీల్చి నభము నిండఁజిమ్మె. 17

ఉ. స్థాణుజటావిముక్త యగు జాహ్నవి నా నిభతుండ నీరముల్
బాణములై నభ మ్మెగసెఁబాతెడి పక్షులు నేలఁగూలె ని
ద్రాణములైన జంతు విసరమ్ములు చిందరవందరై వెసన్
శ్రేణులు గట్టిపాతె మొరసెన్ జడివానలు రుద్రవీణలై. 18

క. వినఁబడె ఘీంకృతి గర్జగమనియెన్ వారిదము భంగి మాతంగము, దా
నిని బరువిడు చంచలలై కనఁబడెఁ గరికలభదంత కాంతిచ్ఛటలున్. 19

ఉ. మందర భూధరమ్ము దధి మర్దనమున్ బొనరించుపట్ల ము
న్నుందు విసమ్ము బుట్టినటు మోహవశుం డిభరాజు ని
స్తులానంద సముద్ర సన్నిభమనందగు నా సరసిన్ జరింపఁగా 20
నం దుదయించె ఘోరిభయదాకృతి నక్రము భీతశక్రమై.

ఆ. దాని దాని దా నిదానమ్ముగాఁ గాంచి మ్రాని మీనొకాని మేనిఁదేల్చి
మకరమంచు నెంచక కరమ్ముసారించె నోరు దెఱచి నీటఁదూతె నదియె. 21

క. చురకత్తులఁబోల్ దంష్ట్రలు వరక్రకచముఁ గేరు పల్లువరుసల మధ్యన్
గఱ కాకుఱాయియైన మకరి నాలుక నారకపు ముఖద్వారమనన్. 22

ఆ. అస్య వివరమందు నగ్గికుంపటిలోని మంటలట్లు మెఱయు మకరి నాల్క
దారు సన్నిభంబు దంతావళపదంబు నంటుకొనియె మేన మంటలెక్క. 23

క. గిరిగిరి డీకొనినటు జలధరమున్ జలధరము గర్జఁ దలపడినట్టుల్
కరికిన్ మరియు మకరికి నొకరితో నొక్కరికిఁ బోరు ఘటియించె నిటుల్. 24

సీ. నక్రమ్ము వక్రమై నైజ వాలాగ్రమ్మునెత్తి చుట్టలుజుట్టి నిలిచి పోరు
ఝషము తా నొకమాఱు విషవహ్నికీలయై చరచర పారాడి సాము సేయు
మకరమ్ము కుండలమహితాకృతిని దాల్చి కాలిని గఱచి యుగ్రముగ వ్రేలుఁ
గుంభీర మొకసారి కుంభీనసాకృతిన్ గాళ్ళ బంధమువైచి కట్టివైచు

తే. మొసలి ముసల సన్నిభవాలమునఁ గవీంద్ర గండ తుండమ్ములన్ మోదుచుండు నుఱక
కంటక మ్మెగ్గు కాలిలోఁ గంటకమయి సైఁచఁగారాని బాధల నేఁచసాగు. 25

సీ. నాగమ్ము నగమయి నైజపాదాహతిన్ మకరికాయం బెక్కి మడియఁద్రొక్కు
ద్విరదమ్ము తా నజగరముఁ బోల్తొండమ్మునం జుట్టి మొసలిని నలిపిపెట్టు
వారణ మ్మొకతేప మారణాస్త్రంబులా కోరల నక్రమున్ జీరివైచు

తే. సామజకరమ్ము కాలపాశమ్ము కరణి మొసలి నురివైచి కుత్తుక పిసికిపెట్టు
నిభము బ్రహ్మాండభాండ సన్నిభతనదరి కుమ్ము గ్రాహమ్ముమై చిప్పకుదురు వెడల. 26

క. చెరలాడు త్రాఁచు లటులుఁ గరికరము మకరియురమ్ము కలియంబడుచుఁ
బురిపేనిన యట్టులు సంగర మొనరిచె వరుణపాశ కల్పాకృతులఁ. 27

ఆ. కాలమేఘనిభుఁడు గజరాజు గర్జించి పాదఘట్టనముల వసుధ యద్రువ
వడిగఁ దొండమెత్తి వనరాజి నుద్ధతి దెబ్బజఱచు దిశలు బొబ్బరిల్ల. 28

క. వడులై సుడులై తడలై గొడుగులగతిఁ బడగలెగయఁ గొలని జలాలన్
గుడగుడ బుడబుడ మను సడి బుడగలెగయుచుండె దొడ్డ భూకంపమనన్. 29

క. తరగల యొరపిడి నురువులు పరువు లిడఁగ రుధిరమిళిత పాథోరాశిఁ
వరదలు బురద లగుచు నా సరసియెడఁద సాంతమెంతొ సంక్షోభించెఁ. 30

క. అటు ద్రిప్పుచు నిటు ద్రిప్పుచుఁ బటుతర నిజ శక్తి యుక్తిఁ బౌరుషతతి ను
ధృటభంగిఁ బదములాగును గటగటపడు తనదు బలము గవ్వకు గామిన్. 31

క. అలసట నొలయక నిద్దురఁ దెలియక రాత్రింబవళ్ళఁ దీవ్ర క్రుధలఁ
స్థలచర జలచరములు వడిసలిపెఁ సమరము సహస్ర సంవత్సరముల్. 32

ఆ. బట్ట బిండినట్లు బలమెల్ల నశియించి పీనుఁ గట్టులయ్యె నేనుఁ గపుడు
రక్తమెల్లఁ ద్రావి రంజిల్లు మకరమ్ము నేకుఁబోయి మదపుటేనుఁగయ్యె. 33

ఆ. రాహుమొగముఁ జొచ్చు రాజట్లు గజరాజు మకరి నోటఁజిక్కి మసలవలసె
సమయబలము ముందు స్వబలమెంతయుఁ గల్గి యణఁగవలసివచ్చు నజునికై. 34

ఆ. ఘోరవారిచరము కోరాడి పోరాడి హస్తినిటు జితోస్మియనఁగఁ జేసి
కొఱుకరాని కొయ్యా కరిపదంబగుటచే నమలుటుడిగి యొక్క నిముసమాఁగె 35

ఆ. అజ్ఞతాంధకార మాకారమును దాల్చు కరణి కరి విభుండు గ్రాలుచుండ
మమత సమతగాంచు మకరితో నొప్పారి భవ సముద్రమటులు బరగె గొలను 36

ఆ. ఇంత వఱకు విభుని సంతసమ్మునఁ బాలుగొను కరేణుగణము కొంత సేపు
బాధ నభినయించి పయనించెఁ గరి గుండెపగుల నేడ్వజూచి బాధపడుచు 37

తే. ఈ రథ ప్రయాణమ్మున నిరుగు పొరుగు తరులతాదు లాప్తులగతిఁ దనదు వెంట
వచ్చునటు దోఁచుఁగాని యెవ్వరును రారు రథిని వెన్నంటియుండు సారథియొకండె 38

ఉ. అక్కరిమై బలమ్ముఁ జలమంతయు నంతమునొందెఁ బ్రాణముల్
జిక్కెను గాయమెత్తువడెఁ జేవ నశించెను ధైర్యమేగె నల్

దిక్కులు గాంచె 'రక్షకులు లేరిల నా'కని యెంచె 'నింక నా
దిక్కొక దేవుఁడే' యనుచు దివ్యమతిన్ దలపోసె నివ్విధిన్. 39

ఆ. "కనులు దెఱచి యిట్లు గాంచెడి స్వప్నమ్ము కనులుమూయ ముగియు గడియలోన
దొల్లియుంటి నెచల నెల్లివోదు నెటకు గలను గాంచువేళఁ దెలియనగునె? 40

శా. మూలం బెవ్వఁడు విశ్వభూతగణమున్ బుట్టింపఁ బోషింపఁ ను
న్మూలింపన్ సకలాంతరాత్ముఁడయి యే ముఖ్యుండు మిన్నట్లు ది
క్కాలాబాధితుఁడై వెలుంగు భువనాకారైక వృక్షాకృతిన్
మూలంబై కనరా దెవండు శరణంబున్ వేడుఁ దా యీశ్వరున్. 41

సీ. వాడిపోయిన సస్యవనరుహ సంతతిన్గాంచి పయోదమై కరఁగు నెవఁడు,
ఘణశాణములఁ దటిత్కరవాలముల నూరి దుర్భిక్షతామారి దునుము నెవఁడు,
వినువీధిలో నింద్ర ధనువునెక్కిడి క్షుధాద్యసుర సంహతిని వేఁటాడు నెవఁడు,
అర్కేందు నయన దివ్యాలోకనచ్ఛవిన్ ఘనత మోయవనికన్ గాల్చు నెవఁడు

తే. సాంధ్యరాగమ్ము నెఱపి యీ సకల భూతపుంజమున్ నెమ్మదిగ నిద్రబుచ్చు నెవఁడు
మలయపవన శీతల హస్తముల స్పృశించి ప్రాణికోటిని మేల్కొల్పు ప్రభు వెవండు. 42

క. ఈ రేడు జగములన్గల సారంబై, శృతు లెఱుంగఁజాలని మహిమా
పారంబై, పూసలలో దారంబయి యాత్మలంటి పొల్చెడి దేవా! 43

చ. నిశలుఁ బవళ్ళు సంసరణ నీరధిలోన షడూర్మిమాలికా
వశత నడంగి రాగరస వారి జెలంగెడి దారపుత్ర న
క్రశత మహోగళగ్రసిత రమ్య వివేకులరైన మాదృశుల్
పశువులు నీదు దర్శన సుభాగ్యము నొందఁగ నర్హులే ప్రభూ! 44

మ. అఘ మూలంబయి కర్మకాండమయి కామాకారశాఖా శిఫా
లఘు రూపంబయి భ్రాంతి పర్ణసుమనోలంకారమై వైషయీ
నిఘ సాద్యల్పఫలాఢ్యమౌ భవమహానీపాగ్ర మందుండి దే
వ! ఘనాపజ్జలధిన్ మునింగితిఁ గృపా పారీణ! రక్షింపవే. 45

చ. నిరుపమ నిర్వికార ధరణీ గురుభారనివార యోగి హృ
త్సరసిజ మిత్ర! భక్త భవసంగత బంధలతాలవిత్ర! మే
శరణ మిహోన్యథా నహిసుసత్వర మేహిపరేశ పాహి సం
హర మకరాకృతిం త్రిభువనాలయ! పాలయ మాం జగత్పతే! 46

ఉ. త్రాణ నశించె నా వశముదప్పెను దేహము, తావుదప్పె నా
ప్రాణము, లాత్మధైర్య మెడఁబాసెను, గన్నుల మూర్ఛగ్రమ్మె నీ

ప్రాణికి నీ వినా మరి యుపాయము సాయములేదు రావె గీ
ర్వాణపతీ! క్షమించినను రక్షణ సేయఁగదే కృపామతీ! 47

చ. పరమ కృపాధనా! ప్రణత భక్త జనావన! నీవు దక్క యే
శరణములేదు నా" కనుచు సామజమార్తిని దొండమెత్తి యం
బరమునుగాంచి దీనగతి మార్గముగానక "రావె యీశ్వరా:
వరద!" యటంచు నేడ్చెనట వర్తిలు కొండలగుండె నీరుగాన్, 48

ఆ. ఆర్చి యార్చి యార్చి యటుగాంచు నిటుగాంచు నాశలో నిరాశ నభినయించుఁ
గొండగుహలు వనులు కోనలా నిర్మదగతికి నేడ్చు నుఱక ప్రతిరవముల. 49

వ. అంత సామజం బాత్మలో హరి రాకను సందేహించుచు నిట్లు దలంపన్ దొడంగె. 50

క. "హరి రాక కల్ల, యిఁక యీ కరి జీవిత మిల్ల, యీ మకరి యాఁకటికై
యెర యనిన కొల్ల, ధర నెవ్వరికిన్ గావలె ననాద బాధ లవెల్లన్. 51

క. పిలిచినఁ బలుకరు, కాంచన్ వలనుపడదు, చనఁగరాదు వద్దకు లక్ష్మీ
లలనాధీశు లభాగ్యులఁ దిలకించెదరొక్కొ! వారి తీరది వేఱే. 52

క. కలఁడఁట చరాచరంబులఁ గలఁడఁట దశదిశల భక్త కల్పద్రుమమై
కలఁడు కలఁడనెడు మాటలు కలలో లేకున్న విలువగలవో తెలియన్. 53

ఆ. నిశియుఁ బవలు తోడునీడవై నీవు నా దండ నుంట లచ్యుతా! యెఱుంగ
జ్ఞానభాను ముఖము గనరాని యజ్ఞాన నిశి వసించి యెట్లు నీడ గనుదు. 54

ఆ. కనుల మూసి స్వప్నమును గాంచు బాలుండు మాత తనదు పక్క మనుటఁ గనఁడు,
కలవరించి భీతిఁ దెలివొంద నోదార్చు తల్లి యునికి యపుడు తెల్లమగును. 55

క. కలవు కల వీవు జగమను కలలో నున్నంత సేపు కనఁబడవేమో!
కలఁ గనఁబడు జనకుని వలెఁ గలయఁగ రమ్మనుచు మిన్ను గని యిటు లెంచున్. 56

తే. అంబరపుఁ దెర మఱుఁగున నలరునట్టి సూత్రధారివై లోనుండి జూతుమమ్ము;
ఇవల నటియించు పాత్రల కీవు మాకు నెపుడు గనరావు జగముల నేలు ఱేఁడ! 57

తే. నీవు గలవని వాయువుల్ నిఖిల దిశల గుసగుసలు వెట్టుచున్నట్లు గోచరించుఁ
దరువులెల్లను నిజమంచుఁ దలల నూఁపువిధము దోఁచుచునుండెనో విశ్వవిభుఁడ! 58

తే. అఖిల భూత జీవనదాతవైన యట్టి ఘనుఁడ వీ వనియో త్రిజగన్నివాస!
అంబుచయములు స్వీయ శుద్ధాంతరంగ దర్పణమ్మిడి చూపువిధమ్ము దోఁచు." 59

వ. అనుచుఁ దలంచి తత్సరోవర విరాజితంబై, 60

క. మలయజ పవన సుఖస్పర్శల నుయ్యేల లూఁగి మిత్రు చక్కిలిగింతన్
గిలకిల నగి యలికులపతిఁ గలసి రత మొనర్చు తరుణ కమలము నొండున్. 61

క. కని హస్తాగ్రమ్మునఁ బూవును గొని పైకెత్తి యేడ్చె మద్వాంతము జీ
వనగతిఁ బాసిన సుమనస్సున స్వమనశ్చిత్రపటముఁ జూపి యిటాడున్. 62

ఉ. "తమ్మి జలాల నుండ నమృతమ్మని కమ్మని తేనె సోన భృం
గమ్ములు ద్రావి యేగెఁ దమకమ్మున గంధవహుండు తావిమొ
త్తమ్మును దొంగిలించె స్వపదమ్యుతిగాంచిన వెన్కఁ నేఁటి నే
స్తమ్మిటు తొంగిచూడ వొకసారియు స్వార్థపర ప్రపంచతల్. 63

క. ఆపదఁ గడవఁగ నీ విరి నీ పదపూజల నొనర్ప నిలిచిన దిఁక నీ
వీ పూపు తావి సని రుచి లోపింపక మున్నె రమ్ము లోకాధారా! 64

ఉ. ఎచ్చటి నుంటివో సరసిజేక్షణ! నిన్నిటు పిల్చి పిల్చి నేఁ
జచ్చితి నోటిముత్తెములు జాఱునొ పల్కనఁ గొంప గాలుచోఁ
జిచ్చు నడంపఁ గూపమును జేడ్పడి త్రవ్వట నిన్ను బిల్వ"నం
చచ్చపు టార్తితో నుఱక యంబరముం బరికించు నాసమై. 65

ఆ. "నీవ రాకయున్న నిఖిల జగమ్ము లీశ్వరుఁడె లేఁడఁటంచుఁ బరిహసించు
నట్టి దుష్టవాక్కు లాలించుటకు మున్నె యరుగుదెమ్ము భక్తవరద!" యనుచు. 66

క. "వచ్చినఁ బ్రాణము దక్కను జచ్చినమై జిక్కు తడవుసల్పిన నిఁక నీ
యిచ్చ" యని వ్రాల దివి వినవచ్చెన్ గరి మొరలు సురలు పదటున బెదరన్. 67

క. శివుఁ డాలకించె సరసిజభవుఁడున్ వినె విశ్వమయతఁ బరఁగమి తా మిం
దెవ రాదుకొనకయుండిరి భువనమయుండైన విష్ణువును వినె నంతన్. 68

మ. "అల వైకుంఠపురంబులో నగరిలో నా మూల సౌధంబు దా
పల మందార వనాంత రామృతసరః ప్రాంతేందు కాంతోపలో
త్పల పర్యంక రమావినోదియగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము పాహి! పాహి! యనఁగు య్యాలించి సంరంభియై." 69

మ. "సిరికిన్ జెప్పఁడు శంఖ చక్రయుగమున్ జేదోయి సంధింపఁడే
పరివారంబును జీరఁ డభ్రగపతిన్ బన్నింపఁ డా కర్ణికాం
తర ధమ్మిల్లము చక్కనొత్తఁడు వివాదప్రోత్థిత శ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజ ప్రాణావనోత్సాహియై." 70

క. పోదు రెట కనుచుఁ బల్కెడి శ్రీదయితను బరిజనమును సేనన్ గీనన్
వాదమును వినోదమ్మను బోఁదోలి తటాన లేచిపోవఁ దొడంగన్. 71

చ. హరి వెనువెంట భార్గవి రమాంగన వెంబడి రాణివాస మా
పరిజనమంటి తార్క్ష్యుడు సుపర్ణుని వెంబడి శంఖ చక్రముల్

వరుసగ దండనాథుఁడును వారును వీరన నేల నింతకా
పరమపదంబె తాఁ గదలివచ్చెను జెచ్చెర నంతకంతయున్. 72

వ. అంత రమాదేవి శ్రీహరి త్వరితగతి నరసి యంతరంగంబున నిట్లని చింతించు. 73

సీ. పగ్గిల్లదు లెవరేని బాసవాల్ నెలఁతలన్ బీడించి సిలుగులు బెట్టిరేమొ
ముని ముగ్రిచ్చు లెవరేని పెనుమిన్కు మొత్తమ్ము గ్రుచ్చిలి మున్నీట మొత్తిరేమొ
యెఱచి దిండ్లెవరేని తెఱగంటిరాచవీ డొత్తుకొనంగ దండెత్తిరేమొ
బెట్టిదు లెవరేని చుట్టుకైదువు జోదు గలఁడేఁడ యని భక్తుఁ గలఁచిరేమొ

తే. యేమి మూఁడె నెవ్వరికి నిశ్లైచటి వఱకు నెందుకొఱకుఁ దా వేంచేయు నెఱుఁగలేను
నే నఁటంచును సిరిదొరసాని తాను నుఱుకు హరి వెంట మొగిలంటు మెఱపు కరణి. 74

వ. అంత నత్యంత దూరస్థంబై యుంట నస్పష్ట దృష్టంబగు హర్యాగమన దృశ్యంబుఁ
నాకలోకవాసులగు సురగరుడ కిన్నరకింపురుషాదిగణంబు లతి కుతూహలమనస్కులై
యవలోకించి పరిపరివిధంబుల నిట్లు భావింపం దొడంగెను. 75

సీ. అది వారిదం బొకో హరిశరీరం బొకో యనుచు నభస్సీమ నరయువారు,
అర్కబింబమ్మొకో యది రథాంగమ్మొకో యని యంతరిక్షమ్ము గనెడివారు,
అమలేందుదీపమో యది శంఖరూపమో యనుచు రోదసిని గన్గొనెడివారు,
తారకాకాంతియో తా వైజయంతియో తోఁచరఁటంచు మిన్ జూచువారు

తే. సూర్యచంద్రుల నొకమాఱు చూడఁగలమె ? మేఘ తారక లొకమాఱు మెఱయఁగలవె ?
కాదు సాయుధమాధవాగమన మిదియొ యనుచు సురలోకమెల్ల వాకొనెడివారు. 76

ఉ. నిక్కముగా నతండు మన నీరజనాభుఁడె కాంచనయ్యో నీ
పక్క రమాలలామ యటుపక్క సుదర్శన మల్లదో దిశల్
పిక్కటిలంగ బొబ్బరిలు భీషణ శంఖమదో ఖగేశుఁడే
దిక్కున కేగునో యితఁడు, దీనగతిన్ మొఱపెట్టి రెవ్వరో ! 77

క; అనుచుఁ మిన్ గనుచును నెమ్మనముల భక్త్యతిశయమ్ము మల్లడి గొనఁగా
దనుజారి సంతతులు తద్వినతాత్మజ తురగు నెఱిఁగి వినుతించి రిటుల్, 78

ఉత్కళిక

ఆహా ! యహో ! యహో ! యద్భుతము దృశ్యమ్ము
లూహల కతీతమను నుర్వీగత జనమ్ము
నభము పగిలినదేమొ పగ్రిభలు గగ్రిక్క రహించె
నిభదంత కాంతిఝరు లేకమై ప్రవహించె
ఛక్కుమని మెఱసె నలుదిక్కుల మొగమ్ములున్,

ఒక్కచో కరఁగెనో యుడు సమూహమ్ములున్
కోటిసూర్యులు నొక్కచోటనే పొడిచిరో
నీటగు తటిల్లతలు నృత్యముల నడచెనో
హరి నీలమణిహార నిరుపమ మరీచులో
యరునీలకంధి నట దుత్తుంగ వీచులో
హాటక విమానముల నమర సంతతులు తిగ
కోటి యొకచోట గుమిగూడికొని యాడె వగ
సరసాప్సరసలు మైమఱచి నాట్యమ్మాడఁ
బోరి పయ్యెదలు జాఱఁ బూలసిగ ముడివీడ
సురనరోరగ యక్ష వరకింపురుషదైత్య
గరుడ గంధర్వ తుంబురు నారదాదిత్య
వరులు విద్యాధరులు విరివానఁ గురిపించఁ
బరిమళ మిళిత శీతపవనములు సనుదెంచ
నతులగుచు 'నో న్నమో నారాయణాయ' యని
స్తుతులొనర్చుచు మ్రొక్కు సురలఁ గన్గొనఁడు విని
ఘన మనోవేగ కృత గమనమునఁ బయనించి
కనులందుఁ బ్రాణముల్ గల కరటిఁ ధిలకించి 79

చ. పరమ దయాళువై మకరిఁ బట్టి వధింపఁగ బంపె వేగ శ్రీ
హరి కర భీషణోరగ ఫణాగ్రమణి ప్రభలీను చక్రమున్
వర సురవైరినాశ పరిపాలిత శక్రమునైక కోటి భా
స్కర కిరణచ్ఛటాచ్ఛవి ధగద్ధగితాంబర చుంబి వక్రమున్. 80

మ. జలజాస్త్రం దరుదెంచునేమొ సుమనస్సంరక్షణార్థ మ్మనః
బ్రళయోగ్రానల భీకరాకృతుల చక్రస్వామి మిన్ వీడి త
త్థల కుంభీర కఠోర శీర్షమును వే ఖండించె నిండించె ది
గ్వలయాంతంబులఁ బాంచజన్య పృథుశంఖధ్వానముల్ శార్ఙ్గియున్. 81

మ. కర విభ్రాజిత పాంచజన్య ఘన శంఖస్వాన గర్జాకృతిన్
వర శోభావిల సత్సుదర్శన తటి ద్వారాప్తి నక్షీణ స
త్కరుణా మేఘక శేబరుండగుచు నక్రధ్వంసియై చక్రి స
త్వర మార్పెన్ బద బాధనొందు కరి హృత్తాపానల జ్వాలలః. 82

ఆ. కరిని హరియె కరుణఁ గాపాడుటల్ గని కరులు హరులఁ గాంచి వెఱపుమానె!
చక్రి మొకట మకరి సంహరించుటఁ గాంచి చక్రపదములంటె నక్రరాశి. 83

క. నిడు కేలఁ బదము బుడుకుచు మడువు వెలిం జేర్చె శౌరి మాతంగవిభున్
గడుభక్తి వెలయఁ గరి హరి యడుగుం దామరల నొక్క యరవింద మిడెన్. 84

వ. తొల్లి దేవతల శాపవశంబున మకర రూపంబుగొన్న హూహూనామ గంధర్వుఁడు తన మొదటి రూపంబు బ్రాపింప హరిని స్తుతించుచుండ, నగస్త్య శాపవశంబునఁ గరియోనిం బుట్టిన యింద్రద్యుమ్న మహారాజగు నా ద్విరదంబు నజహరామరులకు నలభ్యంబగు హరిస్వరూపంబున్ దిలకించి పులకించి యిట్లని యభినుతింపం దొడంగె, 85

కళిక

వేదము లెఱుఁగవదే పారంబున్ వేధ యెఱుంగం డేసారంబున్
ఘటఘటమున నిటు నటియించెడి పరు నటనసూత్రధరు నవపీతాంబరు
త్రిభువన సుందరు వనమాలాధరు నభయప్రదకరు నఘసముదయహరు
జలదదేహు నాజాను చతుష్కరు లలితాలకు సురలోచనతస్కరు
శంఖచక్రి ఘన శార్ఙ్గగదాధరుఁ గంకణ వలయాంగద వర నూపురు
హాటక రత్నకిరీట మకుటమణి కూట ఘటిత రవికోటి లసితఘృణిఁ
గటక రత్నరుచి పటల కనత్కరుఁ గటిసూత్ర శ్రీకలిత కళేబరుఁ
జందన చర్చిత జలజయుతోదరు సుందర విద్రుమశోభి సుమాధరు
నిందువదను సితకుందరదను కృత మందహసను మృదుమధుర వచనుసిత
నలిన నయను వర నాగశయను శ్రీచల దపాంగవశ సంవీక్షణు శ్రీ
ఖండ తిలక సంకలితఫాలు శ్రుతికుండల మండిత గురుకపోలు నతి
ధీరోదారు గభీరు మహాబల సారాకారు విశాలోరస్స్థల
పారి ప్లవదప్రతి కౌస్తుభమణీ హారపూర మోహనగళు ధరణీ
శ్రీరాజిత సుశ్రీవత్సాంక మనోరంజకు సుమనో వినుతాగమ
సారమార్గ సంచారునిన్ నిరాకారు విశ్వసాకారునిన్ బురా
కృతపుణ్య వశోన్నతి దర్శించితి గతి నీవే యని కరము నుతించితి
సతతము నిను నా మతిని దలంచితిఁ బ్రతికితి నురు భవభయముఁ దరించితి
కరి వరదా యను బిరుద మొసఁగి నిను సురసంఘంబులు స్తుతుల నొనర్చును
పరమపురుష యన హరి మరుగొందెను కరి కరేణు సంఘమ్ముల జెందెను. 86

క. గంధర్వుఁ డరిగెఁ దా నమృతాంధస్సీమలకుఁ దిగ్ధరు లాశ్చర్యమహా
సింధువుల మున్గ సురపుష్పంధయ వేణులు నివాళిఁ బట్టి నుతింపన్. 87

క. నరుఁ డీ కథఁ జదివిన విన వరదుఁడు వానిం జలాల వారాహంబై
ధర వామనుఁడై యటవిన్ నరహరియై రక్షసేయు నరక హరుండై." 88

క. అని వినఁజెప్పుచుఁ గవి నూ "యనఘా ! యిది యార్త భక్తి యాత్మార్పణమున్
బొనరించు గోపికావర వనితాజన భక్తిమౌని వంద్య" మ్మనియెన్. 89

ఆ. సుకవిఁగాంచి "దాని నొక యింత వినిపింపుఁ" డనుచు "స్వామి! కొందఱజ్ఞ జనులు
చక్రిగాథ లరసి జారుండు చోరుండఁ టండ్రువారి కేమి యనుట" లనెడి. 90

ఆ. వారిఁగాంచి సుకవిశౌరి సదవతార కావ్యకథలు భక్తసేవ్య సుధలు
వినుఁడటంచుఁ గుతుకమునఁ గృష్ణగుణగాన మహిమయెల్లఁ దెలుపు మధురఫణితి. 91

క. "మధుకైటభారి సుమహిత మధురాకృతిఁ దాల్చి కంసు మథియించుటకై
మధురాపురి నుదయించెను మధుమాస విలాసమత్త మధుపము భంగిన్. 92

క. బందె జనువొందె దేవకి! యందానక దుందుభికి రహస్యముగా శ్రీ
బృందావనిఁ గొనిపోఁబడి నంద యశోదలకుఁ గూర్మినందనుఁ డయ్యెన్. 93

సీ. మాపె వెన్నునిగని మహిరాక్షసుల పేరుమాపెను దేవకీమాత తాను;
పుట్టి యమున దాఁటఁబోవు చక్రికి నదిపుట్టి లేకయె త్రోవఁ బుట్టనిచ్చె;
పాపయై మందకుఁ బయనించు శార్ఙ్గికిఁ బాఁపతేఁడొక యాతపత్రమయ్యె;
ఆ నంద గృహమున హరి సేరినంతనె యానంద జలనిధు లవనిఁబొరలె.
తే. కొమరు ప్రాయంపు నెలఁతల కోర్కులూరఁ గొమరుఁబెనుకూర్మి నొడిఁజేర్చుకొనె యశోద
ఆలమందల రిపువర్గ మడలిపోవ నాలమందల నుత్సాహ మతిశయించె. 94

క. నందనుని గాంచి బ్రహ్మానందాంబుధి పొంగిపొరల నందుఁ డవశుఁడై
మందఁగల లేఁగటావుల వందలు వేల్ దానమొసఁగె వరవిప్రులకున్. 95

క. ఎన్నాళ్ళటి సుకృతమొ మా కన్నులుగల ఫలము వీనిఁ గాంచుటె యని వ్రే
యన్నుల మిన్నలు వెన్నునిఁ జెన్నుంగందొవలఁ బూజసేసిరి భక్తిన్. 96

తే. పల్లె జనమెల్ల నందుని యిల్లునిండెఁ బురుడునున్ జాతకర్మయు జరిగెనంత
బారసాల నొనర్చి కుమారునకును నామకరణమ్ము సేయు సన్నాహ మొదవె. 97

సీ. రాకిణి పింపిణీ రావి రేకయుఁగుప్పె కోరకొప్పుల తలం దారలీన
సరిగ పట్టెడగుండ్లసరము పూసలపేర్లు పాలిండ్లఁ దూఁగుటుయ్యేల లూఁగ
బిగువు నొడ్డాణముల్ బిళ్ళల మొలనూళ్ళు జవ్వాడు నడుముతో సరసమాడ
మట్టెలు పిల్లాండ్లు మరి వీర మద్దియల్ లావణ్యగతులకు లయలువేయ
తే. జిలుఁగు టద్దాల కుట్టుపోఁతలు వెలుంగు పూలయంచుల కుర్త్తంపు చోలములును
నీలి నింబోళి కెంపువన్నియల నలరు సరిగపట్టుంచు కోకల సవదరించి. 98

క. చిలుకలొ వలపుల మొలకలొ యలుకన్ వలరాయఁడేసి హరు నొంచిన పూ
ములుకులొ స్వర్లోకామృత గుళికలొ యన గోపికలును గోపాలునకున్. 99

క. తలయంటి నలుఁగుదీయుచు జలకమ్మాడించి తుడిచి శౌరికి రక్షా
తిలక మ్మిడి పొగవేసియుఁ బులిగోరిడి పురిటికూసమును దొడ్గి రాగిన్. 100

తే. పసిఁడి పట్టుపుట్టము గొల్ల పైటవేసికట్టె యేడువారాల నగల్ ధరించి
పచ్చిబాలింత నందుని పట్టమహిషి బావిలోఁ జేఁదవేయఁగా బయలుదేఱె. 101

సీ. పసుపు నలుంగుతోఁ బసగుల్కు నగుమోము బంగారు దివ్వె వెలుంగఁజేయఁ
గాటుక ల్దిద్దిన కలికి వాల్గన్నులు స్మరశిలీముఖపాళి సానఁబట్ట
సింధూరతిలక లాంఛిత మనోహరఫాల మరుణోదయ ప్రభల్ గురియుచుండ
మేలిముసుంగుతో మేలమాడెడి ముంగురులు నంబరస్థాబ్దముల రచింపఁ

తే. బాలచేఁపుల దడిసెడి పైఁటకొంగు వలుఁద నడికట్టు నిడి చేఁదవైచి నూత
సున్నపుంబూఁత శోభిలుచున్న కలశమందు నీరానివచ్చు నా నందసతిని. 102

ఆ. అరసి వదినె వరుస యగువారు ముందేగి దడిని గట్టినటులు దారినిల్చి
చేరనీము మగని పేరుజెప్పని వినాలోని కనిరి నగుచుఁ జానతోడ. 103

చ. తలుపుదరిం బ్రసూతజని దారినివేడెను వారు నవ్వి "లో
పలి కరుదెంచనీయఁగ నెవారి కుటుంబము మీర"లన్న న
వ్వాలయ విదెంపు కెంపులు మఱొక్కెడ దాల్చిని నీలిసొంపులుజ
గళకళలాడు దంతసితకాంతులతోఁ బెనఁగన్ నతాస్యయై. 104

క. అన్నుంగని చెవిప్రత్తుల విన్నావో లేదొ మఱల విను వదినే ! మా
యన్నయ్య పేరు జెప్పుమి నిన్నేగఁగనీయ మనుచు నెలఁతలు పలుకన్. 105

తే. అవనత సిరాన సిగ్గుతో నభిముఖముగఁ జూడనోడి భ్రమించు వాల్చూపుతోడ
మూసి నగు పిన్ననవ్వుతో మూఁగతనము వదలి పెదవిఁ గదల్చి తా నెదియొపలికె. 106

క. "సరె ! సరె !" యని రీవలిస్త్రీల్ "మఱల నుడువు"మనిరి యవలి మానిను లిట్లీ
యిరుతెగలు వాదులాడుట నరిగెను బాలెంతలోని కదె యదననుచుజ. 107

ఉ. బాలకుఁగాంచి నందుఁడు నపారముదంబుధి నోలలాడె ము
త్యాల సరాల తొట్టియలఁ దార్చి యశోదయు జోలఁబాడెఁ ద
త్ఫాలమునన్ మషీతిలక భాసురమై నెలమామ యందచం
దాలను లెక్కఁగూడె లలి స్తన్యని మజ్జనమాడె చెక్కిళుల్. 108

సీ. కలువ నీలపు వన్నెకలుముల జవరాలి వలపించు నీలి వెన్నెలలకొండ,
మహితేంద్రనీల సన్మణి మరీచీ సుధాబ్ధిని మధింప జనించు వెన్నముద్ద,
నెమిలి కన్నుల నీలినిగ్గులు వడెవైచికట్టు మేఘపువన్నె పట్టుకుచ్చు,
ఉదనిధి నీలిరం గుడికించి యంబరమ్మద్దగా మెఱయు నీలాంబుదమ్ము

తే. నిరతిశయ రూపలావణ్యనిధి సమస్త తత్వ కల్యాణగుణ మహోదధి యఁటంచు
జలదవృతభాను సమభావ్య సులభసేవ్యుఁ గొడుకుఁగని కృష్ణుఁడనుచుఁ బేరిడె యశోద. 109

సీ. లీలా విభూతి యీ భూలోక మంచిత డోలాయితమ్మయి తేలియాడ
నాశా చతుష్టయాకాశ స్వరూపమ్ము పాశాకృతులఁ గట్టువడుచువ్రేల
శేషుండు ధిషణా విశేషుండు సుకుమారవేషుండు పాన్పుగా వెలుగుచుండ
వేదముల్ ప్రజ్ఞావినోదముల్ పరతత్వవాదముల్ తగు జోలపాటగాఁగఁ
తే. బవలు రవి నిశల్ శశివేడ్కఁబైన వ్రేలఁగట్టు బంగారురంగారు పిట్ట లగుచుఁ
గాలు కేల్దాకి యటునిటుఁ గదలి యాడనాడు వటపత్రపుట శాయియైన బాలు. 110

క. దర్శించి హరి యని పదస్పర్శమ్ము నొనర్చి భక్తిభావ మెదఁ బరా
మర్శ మ్మొనరిచి బాహ్య స్పర్శమ్మనుమఱచి నందు పత్ని యిఁకెంచున్. 111

క. "తన కాలి బొటనవ్రేలున్‌గొని కేల ముఖానఁ జొనిపికొని నమలున్ ద
జ్జనితాంఘ్రి తీర్థముల నుదర నివాసత్సకల భూతరాజి తరింపన్. 112

శా. గోలీ లాటలనాడు నీ శిశువు భూగోశాది లోకాలతో
బాలోద్యత్కర సాలభంజికలగున్ బ్రహ్మేంద్ర రుద్రామరుల్
కాలున్నోట నిడంగ లాల యలుఁగై గంగాంబువుల్ బాలు గో
పాలుం డెక్కడి బాలుఁ డీతఁ డఖిల బ్రహ్మాండ పాలుం" డనున్ 113

ఆ. అనెడి యా యశోద నచటి వ్రేకాంతలు గాంచి నగుచు నిటువచించి "రెట్లు
కదల మెదలలేని కనలేని వినలేని పలుకలేని పాప బ్రహ్మమగును?" 114

వ. అనిన నయ్యశోద వారి నారసి యీ రీతిన్ బలుకం దొడంగె. 115

మ. "ధర సర్వత్ర వెలుంగు తేజ మెచటన్ దా నేగు వాచామగో
చరుఁ దద్వైతుఁడె వారిఁగాంచి పలుకున్ సర్వేంద్రియాతీతమై
గుఱుతింపం బడరాని తత్త్వమెవరిన్ గుర్తించు, లేదేని శ్రీ
వరుడౌ బాలకుఁడేమి చూడనడువన్ భాషింపనున్ జాలఁడే?" 116

క, ఇటు భక్తిన్ నుతియించెడి కుటిలాలక యెడఁద మాయగుప్పి హరియు నె
ప్పటి శిశురూపముఁ దాల్చెఁ గపటనాటక సూత్రధారి, పడతియు మమతన్. 117

క. తొట్టియ నిండాడెడి తన పట్టిన్ గొనియెత్తె యడ్డపాపగ నిడి లోఁ
బట్టంగరాని సంతసముట్టిపడన్ జెక్కుఁ జెక్కు నొరయుచుఁ గూర్మిన్. 118

క. తిన రా దొల్లననుచు విడువను రా దీ తియ్యమావి పండ్లెట్లని యా
తినరాని పండులోపల మను తీపిని గుర్తెఱింగె మానిని పేర్మిన్. 119

సీ. ఈ చిన్నినోటిలో నే తల్లి పరమాన్నముల నింపెనో యని ముద్దుగొనును,
ఈ ముద్దు ముచ్చట నే కవీంద్రుఁడో దివ్య కవితామృతము చిల్కఁగాయని విను,
ఈ నవ్వుకడలి యే యిందుబాలుని ప్రసవించునో యనుచు నవ్వించి మురియు,
ఈ కల్కిచూపుల నే కల్వ దాఁగురింతల నాడునో యని తవిలికాంచు

తే. గిలిగిలింతల నవ్వించి గిల్లి బొజ్జ బుజ్జుమన నూఁది ముద్దుల బుగ్గలద్ది
తలను వక్షము నలమి కౌఁగిలిని జేర్చి మూర్కొనుచుఁ బరవశతఁ గన్మాయునొకట. 120

క. పెరుఁగుట విఱుఁగుట నెఱుఁగని గురు గోత్రోధుండు వేణుగోపాలుఁడు ద
వ్వరహించు దృష్టి ననదై దరియుకొలఁది వృద్ధియగు విధమ్ముగఁ బెరుఁగన్. 121

శా. చేరం బిల్చును జందమామఁ గలువల్ చిత్రించుఁ గెంగేల మే
ల్తారంగంబులఁ ద్రిప్పి యెల్లరి యెడందల్ ద్రిప్పు నా వైపు నో
రూరన్ జప్పటలోనె యప్పములుసేయున్ డోలయై యూఁగు న
య్యారే బుద్ధుల గంగిరెద్దనుచు నయ్యబ్జాక్షి ముద్దాడుచున్. 122

చ. ముడిచిన వేణిలోని సుమముల్ మన నీయఁ దొకప్డుఁ డెల్లఁగా
నుడుపులనుండ నీఁడు వదనోల్లసితమ్మగుఁ గుంకుమమ్మును
న్దుడువని వేళ లేదనుచు తొందరజెందెడి తల్లి బిడ్డఁడే
పడెననఁ దాను దిట్టుకొని బాలుని లేపు నదెట్టి ప్రేమమో. 123

వ. అంత నొక్కనాఁడు, 124

క. "పిన్నీ! మన శ్రీకృష్ణుం డన్నము దినునట్టు లెంతొ యాప్యాయముగా
మన్ను దిను" ననుచు వెన్నుని యన్న వచించిన యశోద యాత్మజుఁ గనుచున్. 125

ఆ. "నేల నేల దినెదు? నే లేనివేళ గోపాల! పాలు పెరుఁగు గ్రోల" ననియె,
"నేల నేల దినుదు నాలుకన్ గను"మని చిన్నినోరు దెఱచె వెన్నుఁడంత. 126

ఉ. భూమియు నాకస మ్మఖిల భూతచయ మ్మదధుల్ తరుల్ గిరుల్
సోముఁ డహస్కరుం డజుఁడు చుక్కలు దిక్కులు దిక్కరీంద్రముల్
గ్రామములున్ ఘనాటవులు కాంతుఁడు తానును గో గణమ్ములున్
భూమిని బాలునోటఁ గని బాపురె! యంచుఁ దలంచు నీ గతిన్. 127

ఉ. ఎక్కడనుంటి నా కనుల నేమి కనుంగొనుచుంటి బాలకుం
డెక్కడ విశ్వభూవలయ మీ వదనమ్మన లోష్ఠతుల్యమౌ
టెక్కడ నిక్కమో కలయొ యేను యశోదనుగానొ చెప్పలే
నక్కట! విష్ణుమాయయొ ముఖాబ్దమునన్ భువనంపు ఛాయయో! 128

మ. తరమే కన్గొన విశ్వమందిర ముఖద్వారమ్మ్ము నే తన్ముఖాం
బురుహమ్మున్ భువనైక గర్భగృహమై పొల్పారు గర్భమ్మునున్
జిఱుతం డీతఁడె మామకాత్మజుఁడె నే నే వీని గర్భమ్ములోఁ
గర మొప్పారుదు విశ్వభూతతతికిన్ గన్నయ్య కన్నయ్యయే. 129

ఆ. ఈ యనంత గగన మెవ్వాని వక్త్రింబుమహియె వాని నోటి మట్టిపెల్ల
యతనిఁ దనయుడంచు నపచారపడు నందసతికి ముందు నెట్టి గతులుగలవొ. 130

ఉ. కొట్టితిఁ దిట్టితిన్ దనుజకున్ గడు భీతిలెనంచు పీఁపునున్
దట్టుచు ఫాలభాగమున నా పద ధూళిని రక్షబొట్టుగాఁ
బెట్టితి నోట నెంగిలిని బెట్టితి నెన్ని యఁటంచుఁ జెప్ప ని
ప్పట్టుల నే నొనర్చు ఘన పాతకరాశికి నంతముండునే. 131

క. నిరవద్య ! నిత్య వైభవ ! నిరవధికానేకరూపనిలయ ! నమస్తే !
హరి విశ్వరూప ! యన నాగరిత యెదఁ మాయబెరసెఁ గని సుతుఁ దనఁగన్. 132

వ. అంత బృందావనంబున గోపాలబాలకులం గూడి క్రీడావినోదంబులు సల్పుచు బల
రామకృష్ణులు, 133

సీ. తెలిదమ్మి మఱియు నిందీవర మ్మొకచోటఁ బలువిచ్చి నవ్విన పగిది మెఱసి,
యాతపదీప్తియుఁ శీతలచ్ఛాయయు వెనువెంట నుఱుకాడు విధముదోఁచి
హీరమ సారముల్ చారుకోటీరానఁ బొదిగించియుంచిన పోల్కి దెల్పి,
యరుణోదయప్రభ లసిత పర్వతపంక్తి నలమికొన్నట్టులు దలఁపఁజేసి

తే. మురిసి యీఁడాడు సమయానఁ బరువులెత్తు వేళలన్ వృక్షసీమల వెలయు తఱిని
నడరి మల్లయుద్ధక్రీడ లాడునప్పు డెందు రామకృష్ణులు కనువిందొనర్తు. 134

మ. తడవుం గానల నద్రిసానువులఁ గేదారమ్ములన్ బీడులఁ
గడుపుల్బన్ బులు మేపి గోగణములన్ గాళిందికిఁ జేర్చి నీ
రిడి మై నెల్లెడ మైలవోఁ గడిగి బిట్టీఁతఁ బడం ద్రోలి వెం
బడి వాలాంచల మంటి యీఁతవడు గోపాలుండు కీలారియై. 135

మ. సరి దూర్మిప్రకరాహతిఁ వికలితోత్సాహమ్ములన్ ధేనువుల్
శిర మాడించి శ్రుతుల్ విదిల్చి పొరి నక్షిద్వంద్వముల్ మూయుచున్
బరు వొప్పన్ బుసదీయుచున్ మొగములన్ బై కెత్తుచుఁ బోయి య
ద్దరిఁ జేరం జని యెండఁ గ్రాఁగుఁ బులినస్థానమ్ములన్ నిల్చుచుఁ. 136

శా. బాలవ్రాతముఁ గూడి చల్ది దిని గోపాలుండు మధ్యం దినా
భీలోష్మాతపతప్త గో నివహముఁ బేర్పేరునం బిల్చి త
త్కాళిందీతట భూరిభూమిరుహ శీతచ్ఛాయలఁ మందగాఁ
దోలున్ మోరల నెత్తివచ్చు పసి నెందుఁ గంగడో ల్దువ్వుచుఁ. 137

తే. క్ష్మారుహచ్ఛాయలందు దోమంధవృత్తిఁ గన్నులరమోడ్చి పడుకొను కడుపు లరసి
వటమహీరుహశాఖాధి వానియగుచు నంద తనయుండు వేణుగానమ్మొనర్చె. 138

క. మందానిలముల నాడెడి నందాత్మజు వేణుగాన నాదశ్రుతికిన్
బృందావని తల యూఁపెన్ నందులు నెమరాఁపె యమున నాట్యము చూపెఁ. 139

తే. తాలఁ గరఁగించు మురళీ స్వరంపు సొంపు గాన మాలింపఁజాలు వేర్కొంతలెల్ల
నుదధి సంగమ్ము నెదఁగోరు నదులఁ బోలి పరువిడుదురే నిరోధమ్ము సరకుగొనక. 140

శా. శ్రీ గోవింద పదారవింద యుగళీ సేవామృతా స్వాదనా
భోగాయత్త విమత్త చిత్తలయి తాముఁ గోపికా రూపముల్
నా గేహమ్మిది నా సుతుండితఁడు నా నాథుండు నా బాంధవుల్
నా గోవ్రాతము నా శరీరమను నానాత్వమ్మునే యేమఱెన్. 141

తే. దివ్యసుందర యమునానదీతటమ్ము తరుణవల్లవీ ప్రణయ నందనవనమ్ము
వల్లవీ వల్లికా ప్త యౌవనసుమమ్ము వలచి వలపించు చిలిపి గోపాలు సొమ్ము. 142

తే. ఆప్తగోపాల వదనబింబాధరమ్ము యఖిల గోపికా విరహజ్వ రౌషధమ్ము
గోపికానాథ గాథోప గూహనమ్ము క్షితిని రాధికాజన్మ వచ్చినఫలమ్ము. 143

సీ. గోలీల నాడును గో లీలఁ గూడును సౌలభ్య వాల్లభ్య సరణి మెఱయఁ
జెండాడు గోపులఁ జెండాడు పాపులన్ గైశోర వీరసంగతి దనర్ప
బొమ్మరమ్మును ద్రిప్పు బొమ్మర ముడి విప్పు నజ్ఞతా విజ్ఞత లవని వెల్గ
నెలఁతల న్వలపించు నెలతలం గల చెంచు మనుచు కామత్వ రామత్వ మెసగ
తే. నౌర! యణురూపమైన బ్రహ్మాండమనఁగ బీజమై కానఁబడు వృక్షరాజమనఁగఁ
గార్య కారణరూపుఁడౌ ఘనుఁ డనంగ బాలగోపాలుఁడే జగత్పాలుఁడయ్యె. 144

వ. అంత నిది గని ఘోష యందలి జఠరవల్లవీజనమ్ములు నవయువతులగు నందవ్రజ సుందరీ సందోహమ్మును గన్నుల వత్తు లిడుకొని కాంచుచుఁ గృష్ణసందర్శన కుతూహలాయత్తములగు వారి చిత్తముల నిరోధింప నిరంతర గృహకార్య సమ్మగ్నమాన మనస్కలుగా నియమింప నెంచుతరి. 145

సీ. పాలు గొల్వుమన గోపాలు గొల్చెదనని పరవశయగు గోపతరుణి యొకతె,
వెన్న నమ్ముమన నే వెన్ను నమ్ముదునని యొడలెఱుంగని గొల్లపడుచొకర్తు.
గోవిందు రాకుండ నావంకఁ గనుమన గోవిందుఁ గనినను గోపి యొకతె,
దధిఁ జిల్కుమన సం దుదధిశాయి దర్శించి ప్రేమఁ జిల్కవె యను లేమ యొకతె,
తే. బాన నిండి స్రవించినన్ భామ యొకతె పాలు పిదుకుచునే భూమి పాలొనర్చు
వెన్న పడినను ద్రచ్చుచు వెలఁది యొకతె కాఁచుటేమటి హరి రాక కాచుచుండు. 146

తే. క్రొత్త మీ చర్యలని మగల్ కోఁతవెట్ట నత్తలును నుక్కపాదాల నణఁచిపెట్టఁ
జేడియల చిత్తములు హరిఁ జిక్కవడెను బంధుతతి శౌరిఁ గననీని బంధమిడెను. 147

వ. వృద్ధగోపీజనంబులు తమ తరుణ గోపికా సమూహంబును హరి దరిం జేరనీక నిరోధించు ప్రయత్నంబులు విఫలంబులగుటఁ గుపితాంతరంగమ్ముల నందపత్నియగు యశోదాదేవి సన్నిధిం జని విన్నపంబు లొనర్పం దొడంగిరి, 148

క. "కన నున్న దింతెకాని యతనికిన్ దెలియనిదిలేదు ధర నొక విషయ"
మ్మని గోపికలు యశోదకు వినోదగతిఁ గృష్ణుచర్య వివరింతు రిటుల్. 149

క. "ఓ తల్లీ! మీ కృష్ణుని చేఁతలతో వశముగాదు చేడెలు పాలున్
న్నేతులు గొని చన నొక భాగోతము ! నీ తోడఁ జెప్పుకొన సిగ్గగునే. 150

ఆ. తరుణి యొకతె వెన్న పెరుఁగు లమ్ముచునుండ బంతి దాఁచితనుచుఁ బైఁట విప్పెఁ
జిన్నవాఁడె కొడుకు చిత్రింగుఁ డింక నింకెన్నియనుచుఁ జెప్ప మిట్టి పనుల. 151

ఆ. పడుచుదాని దాఁకి యొడికొంగుఁ దడవఁగా దగునె యన్న దొంగతనము మంచి
దగునె యంచుఁ గొమ్మ నదొ ! కోఁతి యని చూపి వెన్న దొంగిలించి వెడలిపోయె. 152

క. కమ్మ మడచి పామని మా యమ్మాయి పయంటఁ దెలియనట్లె విసరె నో
యమ్మో ! యన నది పామో ! యమ్మో ! యని కౌఁగిలించి యధరమ్మానెఁ. 153

ఆ. మొన్న బావి వద్ద నున్న మా దానిమ్మచెట్టు నెక్కి కూసెఁ జిలుకవోలెఁ
దానమాడుచున్న తరుణి పైఁ గనినంత మానమేగు కనకు మగువ యనియె. 154

ఉ. కోఁతి విధానఁ జెట్టు కొనగొమ్మల నెక్కుచుఁ బండ్లు కాయలుఁ
గోఁత యొనర్చి బొట్టె కిడెఁ గోడలు గర్భిణియంచు నుంచ మీ
వాతను గొట్టుకొంటిరన వానికిఁ జూలనె నెట్టులన్న నా
నాతి కడెట్టు లౌననియె నవ్వుదునా మఱి యేడ్తునా యిఁకఁ. 155

ఉ. ముందున కేగఁ గ్రుమ్మ వెనుబోయిన ఫెక్కునఁ దన్ను నౌర ! మా
మందను దొరయావు పెను మానిసినే దరిఁజేరనీదు నీ
నందను సాహసమ్ము గనినఁ మది ఝల్లను దాని కాళ్ళకుఁ
బందముపైచి పాల్ పితికి బాననునేనని త్రావె నవ్వుచున్. 156

క. కలవారి కొమరుఁడైనఁ గలమాన్నము గుడిపి యెంతొ గారాబముగాఁ
దలిదండ్రి నేతి లోపలి మొలకగ సాఁకవలె దుడుకుపోఁడిమి ముద్దే? 157

ఉ. మెండగు ధూర్తచేష్టలకు మెత్తని బుగ్గల నొత్తవేడుకొఁ
బండువుపేయు రూపున కపార కృపామతి యుప్పతిల్లు మీ
రెండవ పుత్రి సాటి యిఁక రెండవవాఁడు ప్రపంచమం దెవం
డుండఁ"డనఁ యశోద కుప్రిధయొప్పఁ గుమారుని బిల్చి యిట్లనుఁ. 158

వ. అంత నయ్యశోద వారి వాక్కుల విని యత్యంత మమాయికునివలె వర్తించు నంద
నందను మందలింపఁ దలంచి కుపితాంతరంగయై స్వపుత్రకుం గని, 159

క. పలుకవు గోపాలా ! యెందుల కను, బెత్తపులతాంగితో నీ పెండ్లిన్
సలిపెదనను, నాయనతోఁ దెలిపెదనను గనుల నీరు దిరుగ సుతునకున్. 160

సీ. గోపాల! యీ బేల కొంగు లాగితె యన నా బంతి నట దాఁచినది యనియెను
శ్రీకృష్ణ! యీమె నాశ్లేషించితే యనఁ బాముపామన భయంపడితి ననియె
మురళీధరా! దీని ముద్దుగొంటివె యన ముద్దున కౌక వెన్నముద్దను ననె
గోవింద! యీ లేమ నీవి విప్పితె యన ముడిదాఁచె నెదొ యని విడిచితిననె,

ఆ. కొట్టఁ జేయిరాక కోలఁ బాఱఁగవైచి కనులు దుడిచి తనయుఁ గౌఁగలించి
చిట్టితండ్రిపైన నెట్టినిందలు మోపినారలని యశోద యూఱడించె. 161

ఉ. "వ్రేలెఁడు లేఁడు వీనిపయి వేల యబద్ధములాడనౌనె యీ
బాలున కిన్ని నేర్పినది భామలు మీరె" యఁటన్న ముక్కుపై
వ్రేలును గీల్చి గోపికలు విస్మయమందిరి కుంది రిందులోఁ
గీలు నెఱింగి వృద్ధలును కిమ్మనకుండిరి మండి రాత్మలన్. 162

ఉ. ఒక్కఁడు మొల్కయన్న నితఁ డూరెడు నోళలఁ దెల్లవాఱు నా
చక్కని తండ్రి వీనిఁగని జారుఁడు చోరుఁడు కృష్ణుఁ డంచునున్
ముక్కులు మూతులున్ బొడిచి మోదమునందుచు నీ వ్రజాంగనల్
దిక్కులు నమ్ముచుండు రిఁక దిక్కెవ రేరికిఁ జెప్పగావలెన్, 163

ఉ. ఎక్కడలేని నింద వడనేల జనించితి నా కఁటంచునున్
జెక్కిటఁ జేయినూని తను చేష్టలుమాని విచారదృష్టిలోఁ
జిక్కి యశోద నిశ్వసనశీల విచిత్ర సుచిత్ర మట్టు లా
ప్రక్కనెయున్న కృష్ణుపయిఁ బల్మఱు నశ్రులఁ గ్రుమ్మరించుచోన్. 164

ఉ. గోపిక లెల్లరున్ నయనగోచరులైన మునీంద్రులైరి యా
రోపితవల్లవీ సురతరూపము జీవసమాధి సౌఖ్య సం
దీపకమయ్యెఁ జీర విడఁదీయుట లాత్మల జన్మముక్తికిన్
బ్రాపకమై కనంబడియె భామిని నొందిన దివ్యదృష్టిచేన్. 165

సీ. కొంగులాఁగిన నవ్వు గొల్లకన్నె యురాన మాయావరణమేగు మనసుఁగనియె
పామన వెఱచి శ్రీపతిపయిన్ బడు గోపి నఘభీతి హరిఁజేరు నాత్మఁగనియె
వెన్నని ముద్దాడు వెలఁదిలో భక్త్యుత బ్రహ్మానుభవ సుఖప్రాప్తిఁ గనియె
నీవి విప్పసుఖించు నెలఁతలో స్వమమతా గ్రంథిఁబాసిన ముక్తి ఘనతఁ గనియె

తే. రాగమద వీక్షలన్ బరీరంభణములఁ జుంబనమ్ముల గోపికాసురత నిరతిఁ
బ్రహ్మసాలోక్య సామీప్యపదవిఁ గాంచె విష్ణుసాయుజ్య సారూప్య విభవమరసె. 166

సీ, సురభి సంతానమ్ము శ్రుత్యంత విభ్రాజ దుపనిషద్రూపమ్ము లొంది యుండె
దోహనక్రియసల్పు దోగ్ధ గోపాలుండు జగదేక సద్గురుఁ డగుచుఁ దనరె

నకళంకదుగ్ధమ్ము లతుల గీతాజ్ఞాన పీయూషధారలై పితుకఁబడియె
నవ ఘటమ్ముల మంజునవనీత గోళముల్ వరభక్తహృదయ విస్ఫురణఁగాంచె

తే. దధియె నిశ్చలధ్యానంబు నిధిగమనియె తక్రి మదియె వైరాగ్య హృత్తత్త్వమయ్యె
ఘటసమూహమ్ము బ్రహ్మణ్య ఘటములయ్యె నఖిల ఫలభోక్తయై కృష్ణుఁ డారగించె. 167

ఆ. కనకవసన మంతఁ గాషాయమైతోఁచె వేణు వేకదండ విధి నెసంగెఁ
బ్రణవ మంత్రమయ్యె వంశీనినాదమ్ము కామి త్యాగదీక్ష స్వామి యయ్యె. 168

ఆ. సకల ధర్మములను సంత్యాగ మొనరించి యఖిల హృదయవాసినైన నన్ను
శరణ మొందుఁడేను సకలాఘములఁబాపి పరమొసంగువాఁడ వెఱవకుఁడనె. 169

వ. అంత యశోదదేవికి గోపికా వస్త్రాపహరణవృత్తమ్ము కన్నులం గట్టుచుండ, 170

సీ. శ్రీహరి పురుషుండు స్త్రీప్రాయ మితరమ్ములను శ్రుతిన్ మునులు వ్రేవనితలైరి
పాపమాలిన్యంబు బాపు విజ్ఞానైకరసము కాళింది నీరమ్ములయ్యె
మేను నేఁ గానను జ్ఞానసమ్మగ్నత విగతవస్త్రస్నాన విధిఁ దనర్చె
జ్ఞానము విడిచినఁ గల్గు దేహభ్రాంతి తిరిగి వస్త్రమ్ము లర్థించుటయ్యె

తే. సంగ రక్షకాహం మమతాభిమానములవి మానరక్షక హస్తములుగఁ జెలఁగె
నిరు కరములెత్తి యాచింపనిడు వలువలు జన్మ ముక్తిద దీక్షా వసనములయ్యె. 171

వ. అంత నొక్క దివసంబున, 172

చ. దధి మథియించి నందసతి తా నవనీతముఁ దీయకే పయో
దధివలెఁ బొంగు దుగ్ధఘట దర్పము నార్పఁగ లోనికేఁగి వే
సుధలను దింపివచ్చి యటుచూచి ధృతిన్ దలయూఁపె నెంతయున్
వ్యథితమనస్కయై కనియె బాలుని యా నవనీత చౌర్యముల్. 173

క. ఏమీ మన శ్రీకృష్ణస్వాములె ? మేల్మేలు వెన్న చౌర్యమ్మనఁగా
నేమో తెలియని చక్కని ధీమంతు లఁటన్నఁ దల్లి తెన్నారయుచున్. 174

క. ఉఱుకగసాగెను వ్రేఁకుల నిఱికిన వెన్నలను దినుచు నిటునటు గనుచున్
వెఱచిన మృగశాబక మనఁ జిఱుతఁడు నెన్నడల నుడులఁ జిడిముడి గదురన్. 175

సీ. ఫాలమ్ముపై మూఁగు నీలాలకలదాఁగు నాలోలభీత నేత్రాంచలములు
కుటిలాలకా మేఘపటలమ్ముపైఁ దేలి నటనమ్ముగావించు నమలియాఁక
చవిజూచు నవనీత సంజాతలాలాంబు సముపేతమై ముద్దొసంగు బొజ్జ
ధూళిస్రవంతిలోఁ దేలాడు సుశ్రోణికడఁజాఱు బంగారు గజ్జెపేరు

తే. వెఱపు వ్యత్యస్తపాదాబ్జ నృత్యములకుఁ దప్పతాళాలు నూపురధ్వని జెలంగ
బాలకృష్ణుండు వెన్నను గేలఁబూని నీలమేఘమ్మువలె నేగె బాలుఁగాంచి. 176

చ. సిగముడి వీడ నెన్నుదురు చెమ్మటలన్ జతగూడ ముంగురుల్
మొగమున నాట్యమాడ వలమూఁపునఁ బయ్యెద యూడహారముల్
జగడములాడ నెన్నడుము చన్గవకుం వడఁకాడఁ బూన్కిన
మ్మగువ తనూజుతోడ నతి మంజుగతిన్ బరువెత్తె నాతఁడున్. 177

చ తలుపులమాటు దాఁగుఁ దన తల్లి కనుంగొనలేక ముందువో
గిలకిల నవ్వసాగు. వడి కేరును నూయెలబల్ల కిట్టటున్
మలఁగుచు నేఁగు స్తంభములమాటున దాఁగుచు నీఁగు నెత్తువం
పులఁబడి లేవఁబోయి వెనుమోమును ద్రిప్పుచుఁగాంచు నంతలో. 178

చ. "నిలునిలు! కృష్ణ! చిక్కితివి నీ వెటకేగెద" వన్న మాతృ వా
క్కుల విని కన్నుల న్నులుముకొంచును గజ్జలభాష్ప వారితో
మలినములైన చెక్కుల క్షమాపరి చిహ్నితధూళి నందముల్
గొలిపెడు బోజ్జతో "జనని! కొట్టకె దొంగిల వెన్న నే" ననున్. 179

క. కొట్టకముందే యిటు దయబుట్టంగా నేడ్చు చిన్ని పుత్త్రుంగని నేఁ
గట్టెదను వీని నని యప్పట్టుల నునుపట్టుత్రాళ్ళ బంధితుఁజేయన్. 180

తే. కట్టఁజూచిన కొలఁదియుఁ బొట్ట పెరుఁగుఁ గట్టినం బొట్టసన్నమై కట్టు జాఱుఁ
గాల తతిఁ గట్టుబడని గోపాలబాలు బోలఁ గట్టెను భక్తిపాశాల జనని. 181

సీ. పాలతోఁబాటు పాపాల నాహరియించి పూతన యాత్మను బూతపఱచి
బండితోఁ గలుషముల్ బండి నేలంగూలఁ బదహతిం శకటుం స్వపదముఁ జేర్చి
గాలితోఁబాటు నఘాలినిన్ దునుమాడి ఖలుతృణావర్తున కలుషుఁజేసి
యమళార్జునముల సంయమిదత్త శాపమున్, వేరంట బోలుతో వేఱుపఱచె

తే. హరి కరస్పర్శ. సుకృతి పాపాత్ముఁడనక ముక్తి నొనరింపఁగల మహాశక్తిగలది
దర్భలంగోయు ఛురికయుఁ దలలఁగోయు నసియుఁ బరుసవేది స్పర్శఁ బసిఁడిగావె? 182

తే. భక్తి నిజమాతృ హస్తాల బంధితుఁడయి భక్తభవపాశ బంధ నిర్ముక్తిసేసె
సాలభంజిక యన లీల బోలు నీడ్చి సాలభంజకుఁడయ్యె గోపాలుఁడంత. 183

సీ. గిరి వజ్రమునమొత్త గిరి గోటిపై నెత్తి హరి గెల్చినట్టి శ్రీహరి యితండు
గోవత్స తతిదాఁచ గోవత్స తతిఁజేసి బ్రహ్మ గెల్చిన పరబ్రహ్మ మితఁడు
వనిఁ గాల్చివేయ నా వనికి జీవనమీయఁ గృష్ణవర్త్మను మ్రింగు కృష్ణుఁ డితఁడు
విషధరుకాళీయు విషహరం బొనరించి తలదన్నియాడు పెత్తల యితండు

తే. ఇంద్ర చతురాస్య పావకాహీంద్రులేని వాసుదేవ కటాక్ష దీప ప్రకాశ
పథములన్ నటించెడి శలభతతియంచు దేవతలకుఁ దెల్పిన దేవదేవుఁ డితఁడె. 184

క. ఘోరాసురులను హరి సంహార మ్మొనరింపఁ బంపి హతయత్నుండై
క్రూరుఁడు కంసుఁడు కడకక్రూరుని బంపించెఁ గృష్ణుఁగొని తెచ్చుటకై. 185

ఉ. సుందర వర్ణపర్ణ ఫలసూన వితాన నిషేవ్యమాణ గో
విందను సంప్రఫుల్ల దరవింద మరంద ఝరీ తరంగ ని
ష్యందను గుంజపుంజ సుమసంగత సుత్తమిళింద గోకులా
నందను బృందఁ గాంచె యదునాథ పవిత్ర పదాంకబృందమున్ 186

మ. అరవింద ధ్వజ శంక చక్ర కులిశాద్యాకార రేఖాల స
త్సరసీజాక్ష పదాంక మగ్న మధురస్వాంతుండు సద్భక్త భా
స్కరుఁ డక్రూరుఁడు దుష్టదూరుఁడు జను స్సంహారుఁ డుత్సాహియై
యరద మ్మెక్కి వనమ్ము చక్కి ముద మొప్పారన్ బ్రయాణింపఁగన్. 187

క. నందాత్మజ మందారము సుందరపద సుమపరాగ శోభితమై గో
బృందావన మొనరించుట బృందావనమయ్యె నిద్ది పృథ్వి నఁటంచున్. 188

క. హరి భక్తి పారవశ్య స్ఫురణన్నేత్రముల నశ్రుపూరము లూఱన్
గరణంబు మొద్దువారన్ గరముల ప్రగ్గములు జార గ్రామముఁ జేరన్. 189

సీ. అచటి తల్లులు పిల్ల లాఁకలి యనఁ గృష్ణకథ లల్లు పలుకులఁ గడుపు నింతు
రచటి స్త్రీల్ గళమందు హరికృష్ణ గోవింద యనుపేరు మణులపేరని ధరింతు
రచటి వృద్ధులు దారి నరుదెంచువేళఁ గృష్ణున కిడు దండమూఁతను బొనర్తు
రచటి తండ్రులు తనూజాళికి శ్రీకృష్ణపద సన్నిధి నొసంగి ముదము నింతు
తే. రుఱక వేయననేల యప్పురిని భూమి నరుగు చీమలున్ గృష్ణు చిత్తరువు దీయుఁ
బదిగ నాకాశమునఁ బాఱు పక్షిలేని గతులఁ గృష్ణనామాక్షరతతినె వ్రాయు. 190

వ. అని యచటి చరాచరంబులు హరిభక్తి భాసురంబులగుట లచ్చెరువుం గొని కనుచుఁ
జనుచుండ, 191

ఆ. స్యందనమ్ము నెక్కి చనుదెంచు నక్రూరు నరసి మురిసి వల్లవాంగనలును
బరమభక్తుఁడైన ప్రహ్లాదుఁ డీరూపు దాల్చి వచ్చెననుచుఁ దలఁచి రెడఁద. 192

క. అనుకొనుచు నరదమునకున్ వెనువెంటనె చనుచు వీరు విచ్చేయుటకే
ఘనహేతువు గల్గెనొ కనుగొననెంచిరి గోపికలును గుతుకము మీఱన్. 193

క. తా నక్రూరుఁడు కృష్ణ ధ్యానామృతపానమత్త తన్మయ సౌఖ్య
శ్రీనంది నందు నింటన్ శ్రీనాథుని రౌహిణేయు సేవించెఁ దమిన్. 194

ఉ. శ్రీపతి దేవదేవు సరసీరుహలోచను నీలవర్ణు న
ష్టాపదచేలు వేణుగుణ సంగత గానవిలోలు సంచల

ద్గోపద ధూళి ధూసరితకుంతలు బర్హాకృతావతంసు శ్రీ
గోపవధూ మనోహరుని గొల్చి భవమ్ముల డుల్చి యిట్లనెన్. 195

క. "మధురిపుఁ దోడ్కొనిరమ్మని మధురాపతి యరదమంపె మాధవ!'' యనుచున్
మధురగతి వినతి సల్పెన్ బుధ హృదయమ్ములకు నచ్చ మురహరి మెచ్చన్. 196

శా. గోపీమానస మండలప్రతతి నక్రూరుండు పెల్లుప్పెనల్
రేఁపన్ నిశ్వసనాళి నశ్రుకణవారిన్ నిర్భరాక్రందనా
లాపశ్రేణిని వేపథు స్ఫుటతటి ల్లావణ్య గాత్రాలి సం
ప్రాపించెన్ బెనుగాలివాన వ్రజరామా తీవ్ర దుఃఖాకృతిన్. 197

క. ఈ పురుషుం డక్రూరుఁడె గోపకులకుఁ బాపి హరిని గొనిచను ననుచున్
దీపికలు లేని నిశలై గోపిక లోపికలు మాని కుంది రెడందన్. 198

క. హరి సేవయె జీవన మా హరి విరహమె మరణమనెడి యబలల నిటు శ్రీ
హరికి నెడఁబాపి బ్రదుకుల హరియించుట లుచితమగునె యక్రూరునకున్. 199

క. శ్రీపతిని గాంచ నది యే పాపమొ పక్ష్మమ్ము లడ్డుపడు నెపుడనుచున్
దాపపడు వ్రజ విలాసిను లేపగిదిన్ హరిని విడిచి యెసఁగుదు రనుచున్. 200

శా. ఔరా! విశ్వమహీరుహ ప్రథిత మూలాధారమున్ మౌని హృ
త్సారాసార విచారమున్ నిగమ సంతానోల్ల సత్సారమున్
చారుత్వామృతపూరమున్ బగలె మా సంసారమున్ దోఁచి చె
ల్వారన్ దేరును నింపికొంటి హరి దివ్యాకార మందారమున్. 201

ఉ. శ్రీధర! నిన్ను కౌఁగిలిని జేర్పమి నీ సుమబాల జ్వాలయై
వేధయొనర్చు నీ మధుర వీక్షణ మానని చూపుతూపుగా
బాధను గూర్చు నిన్విడువఁ బ్రాణము శాతకృపాణమై చనున్
మాధవ! నీవు లేని భవనమ్ము వనమ్ముగఁ దోఁచు నేఁచునున్. 202

వ. ఇట్లరుగుచున్న హరింగని వ్రజవనితలు దుర్భర విరహానల దందహ్యమానమానసలై
మూర్ఛంగొనిరి. అచటి పశుపక్ష్యాదులును, 203

సీ. జంతు సంతాన సుస్వాంతమునకు నోడి పదధూళి తలఁదాల్చి పసుల గొల్చు
ఖగపింఛ పట చిత్రకళల కబ్బురమంది తలఁదాల్చుకొనె శిఖావలపు టీఁక
తృణనాళ విలసిత గుణములం గొనియాడి ముద్దాడు నేనాడు మురళిపాట
కీట సూత్ర సువర్ణకూటమ్ము నెద మెచ్చి కనకాంబరములోలె కట్టువడెను,

తే. అనుచు నీలిమబ్బులఁ గృష్ణుఁడని తలంచి చెలఁగి వృషభముల్ తలఁగుమ్మి చిమ్ముదుమ్ము
నెమిలి తలద్రిప్పి పురివిప్పి నృత్యమాడు వెదురు తలయెత్తి మొలకెత్తు వినురవళికి: 204

క. అనుటయు "హరి మధురాపురి జనె నేగతి ? నచట నేమి జరిగె ?" నఁటంచున్
విన నువ్విళు లూరెడి జనమును గని కవి పల్కెఁ మధురమోహన సూక్తిన్. 205

సీ. శీర్షావతంసిత శిఖిపింఛ దీప్తులన్ హరి శరాసన శోభదరుల విరియ
శిష్ట రక్షణ చణ స్మేరాననోదార దృష్టులు సత్కృపావృష్టి గురియ
మధ్యం దినోద్దండ మార్తాండ సమచక్రి కాంతిచ్ఛటన్ దటిద్గణము మెఱయ
హిమశైల పాషాణ హృద్విదారక శంఖ నిస్వాన ముఱుములై నింగి మొరయఁ

ఆ. గదనరంగమందుఁ గంసాఖ్య దావాగ్ని నడరు పొగల మంట లార్పనెంచి
నీల నీరదమ్ము నీరజాక్షకృతిఁ దాల్చి పోవుననఁగఁ దరలె హరియు. 206

క. హరి తేరు నగరవీథుల నరుగన్ సౌధాగ్రసీమ నలరు మృగాక్షుల్
చిఱునగవు కాంతులన్ శ్రీధరునకు హారతు లొసంగి దర్శించి తమిన్. 207

క. కలికి చూపులఁ గలువపూవులను జల్లి చిలిపినవ్వుల మేల్ముత్తెములను రువ్వి
రాగవశ చేతనముల శ్రీరాగ మడరఁ బదములం బాడి రువిద లిప్పగిది భక్తి. 208

సీ. కల్పాది సుమనస్సు కన్నీటి మున్నీటఁ బాటీనమై పుట్టి బాధ లుడిపెఁ
మానిత విబుధ విజ్ఞానాబ్ధి మథనానఁ గమఠమై యమృతపానము నొసంగె
నసుర గుర్వాశా మహాంభోధి నడుగంటు నుర్వరన్ గ్రోడమై యుద్ధరించె
రక్షోధిప ప్రజా ప్రహ్లాద హింసల నారసి నృహరియై హతమొనర్చె

తే. నబలులన్ బలి పైచేయి యగుచు నడఁప నడుగువడుగయి తలఁదన్ని యడుగు ద్రొక్కె
నృపతులెల్లరు మత్తులై కుపథగాములైన భార్గవరాముఁడై హతమొనర్చె. 209

క. అసమాస్త్రత రాఘవుఁడై యసమాస్త్ర వినష్టశీలు నసుర నృపాలున్
వసుధాసుత దుష్కాలున్ వసులోలు దశాస్య జాలు వధము నొనర్చెన్. 210

క. హింసాచారరిరంసు నృశంసున్ మాయా ప్రయోగ చతురకళా వి
ద్వాంసున్ హర్మ్యగ్రజ విధ్వంసు హరి జిఘాంసుఁ గంసుఁ బరిమార్చుటకై. 211

క. వచ్చెను శ్రీపతి దర్శనమిచ్చెను జన్మము తరించె నిపుడని మఱినాఁ
డెచ్చిన ముదమునఁ గంసుఁడు చచ్చెను జచ్చెనను పదముఁ జదివిరి జనముల్. 212

తే. కువలయా పీడగజమును గూల్చి పోరఁ గ్రూర చాణూర ముష్టిక వీరవరుల
మత్తమత్కుణమ్ములవోలె మహిని నల్చెఁ గుంభియుగళిని హరి యట్లు గూల్చె నాజి.

వ. అని యిట్లు పోతనార్యుండు భాగవత కథా సుధాసారంబు తోరంబుగా నిడి శ్రోతృజన
శ్రవణ పర్వం బొనర్చుచుండ, రుక్మిణిని శిశుపాలాదుల నుండి రక్షించిన తెరంగు
నాదగు భాగవతసతిని రక్షింపమని రుక్మిణీ కల్యాణ కథ నిట్లు వచించె. 214

చ. వినుడు విదర్భదేశమును వీరుడు భీష్మకుఁడేలు వానికిన్
దనయులు బుట్టిరైదుగురు తజ్జనపాలు గృహాంగణమ్ము తా
నినదిశఁ దోఁచునట్టి తరుణేందు కళా కలికా విలాసయై
మన జననమ్ము నొందెను రమామణి రుక్మిణి చిట్టిపట్టియై. 215

క. ఎత్తున కెత్తుగఁ బూవుల పొత్తిళలం దిడుచుఁ గూర్మి పోషించిరి యా
ముత్తెపు మొలకను బాలిక నత్తఱిఁ దలిదండ్రు లెంతొ యాప్యాయముగన్. 216

క. బాలిక సొగసుల కెల్లను నేలికయై తరుణ సరసహృదయమ్ములకున్
డోలికయై వలపుల పూమాలికయై యెదిగె నుడు రమణి పోలికయై. 217

తే. పావడను బైకి నెగఁద్రోఁచి పాదయుగళి బొమ్మ నుంచి జోక్కొడించి బొట్టుదిద్ది
అమ్మ ! యేడ్వకె 'హాళాళాళా హాయి' యంచుఁ బాడి పాలిచ్చి పాపను బండఁబెట్టు. 218

సీ. చిట్టికి జ్వర మేమి సేతు దుర్విధి యని హస్తాగ్రమున ఫాలమంటి వగచుఁ
జేయి చాటిడి సఖి చెవిలోన గోప్యమ్ము చెప్పు సమర్తాడె చిన్నదనుచు
నీడువచ్చిన పిల్ల నింట నెన్నాళ్ళుంతునని చెక్కిటన్ జేయి నునిచి గొణగు,
నింత నల్లనిబొట్టెఁ డిస్సియవ్వా ! బిడ్డ నిడనని ముక్కుపై నిడును వ్రేలు,

తే. అతిగ సంసార మొనరిచి యారితేఱెఁ బెద్దమానిసి యన బొమ్మ పెండ్లి సేయుఁ
జిత్రగతుల గుజ్జెనగూళ్ళు చిట్లుబెట్టి వండి వడ్డించు వియ్యాలవారిఁ బిలిచి. 219

ఆ. ముద్దు బొమ్మరిండ్లు ముంగల సంసారములకు మేల్మి పథకముల రచింప
సన్నబొమ్మరిల్లు సంసార మీఁదును బొమ్మ యిల్లు దీర్పు పొలఁతియయ్యె. 220

చ. అటు నిటు సాము సేయుఁ గుసుమాస్త్రుని చేతి కటారియై రహిన్
నటన మొనర్పఁ గిల్జడ నినాద మొనర్పఁగ నూపురాళి, ది
క్తటములఁ బర్వులెత్తుచును దాఁగురుమూఁతలఁ జెమ్మచెక్కలున్
బటుగతినాడు నెందు జతబాలల మాలలఁ బూలగుత్తియై. 221

చ. పరికిణి క్రిందు జాఱుతఱిఁ బైకెగలాగుచు మేని కూసమున్
బొరిఁబొరిఁ బైకిఁ బోవుతఱి బొట్టనవ్రేలునఁ గ్రిందు లాగి ముం
గురులను గోట మీటి పరుగుల్గొని యాటల మీరు గెల్వరై
తిరనుచు నవ్వు నూడి చని తేలెడి నూతనదంత కాంతులన్. 222

క. చిలుకల గిలిగింతల నిడుఁ బలుకుల రాయంచపిండు పదపదమునకున్
వలచెడి లలితపు గతులన్ నిలయం బెల్లెడల బాల నిధియై యాడున్. 223

సీ. కృష్ణుపై నోలి వర్ధిష్ణువౌ మోహాంధకార పాశాకృతిఁ గచము పెరిఁగె,
మురళీధరుని పైనఁ బెరిగెడి యనురాగగతిఁ గపోలముల రాగరుచి హెచ్చె,

చక్రిపై నెద మరల్ సరిక్రొత్తలవునన నూత్న వక్షోజకాంతులు వెలింగె,
ఫణిశాయిపై నున్న వలపుతీవలు ప్రాక నూఁగారు నల్లనై సాగిపోయె,

ఆ. హరిని గనని జీవితాశలు సన్నంబులయ్యె ననుచు మధ్య మల్పమయ్యె
ఇభవరదుని పీడ నితర వస్త్వభిలాష మందమనగ నడలు మందమయ్యె. 224

ఉ. ఓమనగుంట లాడుకొను నొక్కట నచ్చనగిల్లలాడు నా
కోమలి పూర్వమట్టు లుఱుకుల్ పరువుల్ గల యాటలాడఁగా
నేమియొ సిగ్గుజెందు ధరియించిన పయ్యెద చాటులో నెదో
యామని దెచ్చె నామె నవయౌవనముల్ నృపమందిర స్థలిన్. 225

క. రూపం బిరులోకంబుల దీపింపఁగజేయు రత్నదీపంబగు శ్రీ
గోపాలుని గుణవృత్తము పాపంబులు పాఱఁద్రోలుఁ బద సంస్పర్శన్. 226

క. భూపాలుని సన్నిధికే బాపం దరుదెంచెనేని బాలికఁ గని యా
గోపాలున కీ పడఁతికిఁ గాఁపుర మొనఁగూడ బాగుగా నుండుననున్. 227

క. హరిణాక్షి చిత్తమును శ్రీహరి రూపగుణాదు లెందు హరియించుట నా
హరు పత్ని వేడికొను మురహరుని మనోహరుని జేయుమనుచున్ వినతిన్. 228

క. శశిముఖిని రుక్మిణీమణిఁ బశుపాలున కిడఁగఁ దండ్రి భావించె నిరం
కుశుఁడైన రుక్మి చెలియలి శిశుపాలున కీయఁదలఁచెఁ జిత్తములోనన్. 229

ఆ. అతసి పల్కె వేదమనవలె నెల్లరు నెదురులేదు వాని కెందునేని;
అయ్యయైన జంకు నతనికి మాఱాడ వెయ్యిమాటలేల విభుఁ డతండె. 230

ఉ. వారిజనేత్రి కత్తఱి నుపాయము దోఁచెను బెంచికొన్న యా
కీరముఁ జేరఁదీసి నునుగేలను బక్షములంటి దువ్వుచున్
ద్వారక కేగి నా హృదయదర్పణమై చరియించి నా మనో
భారముఁ దీర్చి రమ్మనుచుఁ బంచెను బుల్గును రాయబారిగన్. 231

ఆ. అదియు నేగి యామె హృదయేశ్వరుని సౌధసీమఁ జేరి ముద్దుజిలుకు పలుకు
లాలపించి కృష్ణు నంసభాగ మ్మెక్కి చెలియరూపశీలముల వచించె. 232

శా. రాజీవాక్ష ! ప్రియంబు సెప్పెదను నా రాకేందు బింబాననన్
నేఁ జిల్కన్ నుతియింపఁజాలను భవానీ సాక్షి సాక్షాద్రమాం
భోజాతాక్షి త్రివిష్టపమ్ము విడి యీ భూలోకమున్ జేరె న
వ్యాజప్రేమను విష్ణువిగ్రహుని నిన్ బాయంగలే కున్కటన్. 233

చ. గొనబగు బాల్యసంపదలఁ గ్రొమ్మెఱుఁగారెడి చాన మేనిలోఁ
గనక లతావితాన నవకమ్మెగఁ బ్రాఁకుచుఁ బల్లవించఁగన్

వనిత శరీరమునఁ వలచివచ్చిన చిక్కని జవ్వనమ్ములో
మనసిజ నందనోపవన మాధవతల్ కుసుమించి మించెడిన్. 234

ఉ. మల్లియ మొగ్గలం బొదిగి మాలికలల్లు శుచిస్మితమ్ములన్
వెల్లని కల్వపూవు లరవిచ్చు సరాగ దృగంచలమ్ములన్
బల్లవకోమల ప్రభలు పర్విడు మోమునఁ గొల్లగొట్టుచున్
ముల్లెలుగట్టె న త్తరుణి మోహనకాంత వసంతశోభలన్. 235

ఉ. మారుత సంహతిన్ గురులుమారు శిరానఁ దురాయివెట్టు శృం
గార రసద్యుతుల్ కరుడుగట్టిన మేలివయస్సు వక్షమున్
ధీరతఁ జూపఁగా రతి పతిప్రణయామర రాజ్య చక్రమున్
జారు విలోలలోచన ఝషధ్వజ సంగతి నేలు లీలమై. 236

సీ. అలివర్గ మా లేమ యలకల కెనరామినగు పూలగర్భమ్మునఁ దలఁదూర్చు,
చంద్రుఁడా చెలి మోముచందమ్ము సరిరాక కార్శ్యాన లోలోనఁ గందిపోవు,
తమ్ము లా పడఁతి కందమ్ములుగా నెంచి తపనతోఁ జన్నీటఁ దప మొనర్చు,
బంతు లా యింతి చన్ బంతుల తులరాక పదకరాహతి నధఃపతన మొందు,

తే. మించు లా నవ్వుకాంతుల మించనెంచి వచ్చి దిక్కు కొక్కతె యయి పాటిపోవు,
రంభ యా కాంత యూరు విస్రంభములకు వెలితిఁగొని వట్టి మ్రానయి నిలిచిపోవు. 237

క. చెలి పలుకులు రససుధలన్ జిలుకును శ్రోత్రములు. మరుని చిలుకయుఁ దన త
ప్పుల నొప్పుకొనుచుఁ గలికిన్ దిలకించి భయాన ముక్కు నేలకురాచున్. 238

క. ఆ కలములు దిని కోకిలమూక తపమొనర్చి కానమునఁ జెలిపాటిన్
గాకయె నల్ల మొగమ్మయి దాఁకొనె, వీణియల కెంతొ తలవంపయ్యెన్. 239

క. పురుషోత్తమ ! నిన్నే సఖి వరియించినదింక నొక్క వరుఁడన పైశ్వా
నరున కిడఁదగిన హవి కుర్కురమున కిడుటని వచించుఁగుందు నెడందన్. 240

క, ఈ రీతి చిలుకపలుకులు నోరూరఁగ విని రమామనోహరుఁ డెలమిన్
గీరముఁగని యిట్టనె బంగారము నీ రాక మాకు కల్యాణకరీ ! 241

క. చిలుకా ! నీ పలుకులు సుధఁ జిలుకఁ జెలికి నా విదర్భచేరెద వివె పూ
విలుకాని ములుకులై నను గలఁపఁదెలిసె మరుని తేజగతులివె యనుచున్. 242

ఆ. మేఘ మణులలోన మెఱపు సూత్రముభంగి గుండెలోన దూసికొని చరింతు
వెపుడు పెండ్లి యనుచు నెదిరిచూతు నఁటంచుఁ జెప్పవమ్మ ! మీదు చెలికి ననుట. 243

క. హరి చందనతరు సుందరకరశాఖను వీడి యెగసి గగనపథాలన్
మరకతమాణిక్య ప్రభఁ గురియుచు శుక మరిగె త్వరగఁ గుండినపురికిన్. 244

క. అన్నాతియుఁ గీరమునకుఁ దెన్ను లెదిరిచూడఁ గనులఁ దెలవాఱె శుకం
బన్నెలఁత కేల వ్రాలుట మిన్నంటెను సంబరమ్ము మేరువు దొరకెన్. 245

క. "కాయా పండా చెలి! యే మాయెను నీ చనిన కార్య"మన విని హరి య
ప్యాయత నిటువల్కెను నేఁ బోయిన పని పండుగాకపోవునె చెలియా! 246

వ. అని హరి స్వరూపం బిట్లని యభివర్ణింపం దొడంగె, 247

క. రూపున మన్మథుఁడే యన నా పురుషోత్తముఁడు వాని యయ్యు పవిత్ర
ప్రాపక మందాకిని యన గోపాలుని యెడమకాలి గోటికి సరియె. 248

ఆ. మేఘమణులలోని మెఱపుసూత్రము భంగి గుండెలోన దూసికొని చరింతు
వెపుడు పెండ్లియనుచు నెదిరిచూతు నఁటంచుఁ జెప్పుమనియెఁ జక్రి చెలియ! నీకు. 249

చ. అన విని నింగివ్రాంగి నగియాడుచుఁ జిల్కను ముద్దుగొంచు ని
ట్లనియెనె మాధవుండు నిటులాడెనె నిక్కవమా యఁటంచు బు
ల్గనుఱక గుచ్చి గ్రుచి యడుగున్ దనివింగొని పారవశ్యతన్
గనులనుమూసి ధన్యతను గాంచితినంచుఁ దలంచు నెమ్మదిన్. 250

చ. ఇటువలెఁ గొన్ని మాసతతులేగె సమాకృతులౌచుఁ గన్యకున్
బటుగతి ముందు ద్రోసికొనివచ్చె వివాహముహూర్త మద్ది రే
పటికొక వారమున్నదన బ్రాహ్మణు నంచిత సత్యసంధు సం
కట సమయాప్తబంధు నుపకారగుణామృత సింధు నొక్కనిన్. 251

ఉ. చేరఁగఁ బిల్చి యాతని కశేషసమాదర బుద్ధిమై నమ
స్కారమొనర్చి మజ్జనక కల్పులు దాఁపక మేల చిత్తజా
కారుని ద్వారకాపతిని గాంచి పరిస్థితిఁదెల్పి పెండ్లి సం
భారముతోడ రమ్మనుచుఁ బల్కరె మీ కృపనింతఁ జిల్కరే! 252

ఆ. అనిన విప్రుఁ డామె కథయమ్మనిడి నీవు చింత సేయ కనుచుఁ జెప్పి తాను
ద్వారకను గుఱించితరలె నా దివసమె తరుణి కోర్కెనిండఁ దపముపండ. 253

వ. చని దవ్వులనుండి ధగద్ధగిత మను నా నగరి సొగసుంగని పొగడె నిట్లు, 254

సీ. పాలుగార్చుచునుండెఁ బ్రాకారకుడ్యముల్ క్షీరాబ్ధిశాయి యాస్తికతఁ దెల్ప,
మణితోరణాలు నీలిమల నీనుచుండెను నేఁ గృష్ణుతో నున్న నెలవు ననఁగ,
వెండి బంగరు గ్రక్కుచుండె సౌధచయమ్ము శ్రీనాథునునికి యీ సీమ యనఁగ,
వడి గోపురాలఁ దిర్గెడి గాలి చక్రమ్ములిది చక్రిపాణి యాస్పదమనంగ,

తే. కామధేనువు లగుచు గోగణములలరు నిదియె గోపాల భూపాల నదనమనఁగ
భూతలస్వర్గ మనిపించు పురవిభూతి కాఁపురము హరి కిది ద్వారకాపురమన. 255

క. నిలయాంత స్థితలలనాకల వీణాక్వణిత మధురగాన వికాసన్
జలదంబర చుంబి మహోజ్జ్వల హైమధ్వజవిలాస సౌధోద్యానన్. 256

క. ద్వారవతిన్ జేరంజని ద్వారముకడ నిలిచి కొలుచు దౌవారికులన్
జీరి తన యాగమనము సుదారుండగు హరికి దెల్పఁదగ నర్థించెన్. 257

వ. అంత సగ్నిద్యోతనుఁడు హరి సెలవుగొని యచటి యింతులను వింతలను గొంతవడిఁ గాంచుచును గంతు జనకుని శుద్ధాంతమ్మునకుఁ జనుచుండ రణవిజిత నృప మకుట మణిగణ విరచితానేక తోరణమ్ములు సెలంగఁ దనూకృతారి శిరోవేష్ట చీనాంబర కృతకేతనంబులు వెలుంగ నిహతశత్రు మద దంతావళ దంతావలి వినిర్మిత శుద్ధాంతాలయాంతర్భాగమ్మున శరచ్చంద్రుని బురుణించు దరహసిత సుందరవదనారవిందము పండు వెన్నెలలుగాయ, ననవరతము భక్తకోటిపైఁ బఱపు నాకర్ణాంత కరుణాకటాక్ష వీక్షణమ్ములు సెందిందిరంబులగు చెందొవలుబూయ, నేలాలవంగ ఘన సారక్రము కాన్విత ఫణిలతాదళవీటికాయుత వక్త్రాంతస్థితములౌ మొల్లమొగ్గలనేలు పల్లువరుస లెల్లెడల నెత్తావిగల యత్తరువులరాయ, నీలిమన్ సజల జలదంబులపై దాడిసేయు శిరీషసుమసుకుమారశరీర మిందీవర సుందరీ సందోహదృష్టి దోషార్హముగాకుండ నందమగు చందన చర్చల సందుగొందుల దాఁగియాడ, తప్తకార్తస్వర మరీచీ ప్రవాహ మున నొప్పు కనకాంబర మరుణ చరణాబ్జమ్ముల ధర సేయలేక ముత్తెంపు గుత్తులఁ జిత్తుపఱచు నఖతారకాగ్రమ్ములఁ బొరింబొరి వ్రాలి బ్రతిమాలుగతి వ్రేల, హరియై నరత్వమునొందు పరత్వమున కచ్చెరువడి ముచ్చిచేసిన బొమ్మలో యన నిల్చి హరియుగ్మమెమ్మె తలదాల్చి స్వర్ణపీఠి నిడెనో యన నంచితకాంచన సింహాసనమ్మ నధివసించి మేరుశిఖరింగోరాడు కోడె మేఘమన నొప్పుచు నెత్తమ్ముల చిత్తమ్ముల మొత్తములకన్న మెత్తనౌ నత్తనువల్లి కొత్తుకొనిపోదుమని భీతిగొని వెనుక వెనుకకుఁ జనుగతి నారగినంతనె బురులై కుర్రింగుచుఁ గ్రొత్త జిల్లేడుప్రత్తి దూర్పఁబడి పుత్తడి జల్తారు చిత్తరువు గూర్పఁబడి గుత్తులై పొదుగఁబడు నా రుద్రిపురువులకుఁ బొత్తౌనఁ గూర్చు నుత్తమజాతిమఖుమలు మెత్తాలలోఁ దేలియాడు భక్తహృత్తాపహారకున కిరువంకలఁ జామరయుగ్మము పరులవలనఁ బరిశ్రమఁ బొరయనీకుండఁ గరముల నిరోధించునట్టు లిటునటు నూఁగ, నా సైగలఁ ద్రోసిపుచ్చలేక యనిలంబును బ్రశాంత గతినె సేవింప దద్వాతాయనమ్ముల కనులు తలకెక్కినవారిని బరిహసించుగతి కేకి పింఛాక్షులు తలనెక్కి యెగసియాడ రోచిష్ణుండౌ కృష్ణు నా పాదాగ్రము తిలకించి పులకించి దరిసి మైమఱచి గద్దియడిగ్గి కరములుమోడ్చి నమస్కరించి మనసు హరించు హరిని సేవించి మొగముపైఁ బెండ్లికల లగుపడెడినంచు దీవించి యర్ఘ్యాసనంబుంచ నద్దాన నాసీనుండై యలరు తఱిసనియె హరి. 258

ఉ. "పావనమయ్యె గేహము శుభప్రదమౌ భవదీయ పాదరా
జీవ రజఃకణాంక సువిశిష్టితమౌటఁ గృతార్థుఁడన్ భవ

త్సేవన భాగ్యమబ్బె"నని శ్రీహరి బాడబు నర్హరీతి సం
భావనసేసి భక్తిమెయి పాద సమర్చ నొనర్చి యిట్లనున్. 259

ఉ. "ఏవర వస్తులబ్ధిని నిహీన వినశ్వర భాగ్యభోగ్యముల్
భావమునన్ గణింప రల బ్రహ్మవి దగ్రిణు లాత్మతృప్తులై
యా విధి మీ ముఖాంబురుహమందు నవాప్త సమస్తకామసు
శ్రీ వికసించు లోకశుభ సిద్ధియెకాదె ద్విజేప్సితంబనన్. 260

క. ఓ శంభుతేజ ! నీదు మహాశాంతత నిత్యతృప్తి కాదర్శమ్మీ
యా శాంతరాశముల యటు లాశాపాశముల కెందు నవధులు గలవే ? 261

తే. భూసురాగ్రిణీ ! మీదు నివాస మహిమ వ్యాధి దుర్భిక్ష తస్కర బాధలుడిగి
నెగడు నేనాడు ? దాని మన్నిం( దెవండు ? యానతిత్తురె మీ వచ్చినట్టి పనియు. 262

వ. అని యిట్లు హరి యనినంత సతతవేదవిద్యాభ్యాసుండును, బ్రహ్మకళాపూరిత ముఖ వికాసుండును, మృదుమందహాసుండును, బ్రహ్మన్వాయపయఃపారావారరాకాశశాంక పదవీభాసురుం డగు నా భూమరుం డింతకుమున్ను రాచిలుక రసమ్ముచిలుక మంజుల కలస్వనమ్ముల( బలికిన పలుకులు తల(పునకు( దెచ్చి వైదర్భీ సందేశము వైదర్భీ రీతుల విన్నవించె నిట్లు, 263

సీ. నీ యనంగాకృతిన్ గానమిన్ గనుల్ వలవల కన్నీరు వడపుచుండె
నీ సుధాధరమాన నేరక యోష్ఠమ్ము లూర్పుల( దుకతుక నుడుకుచుండె
నీ సమాశ్లేష సన్నిధి లభింపక యెద ఘనతర విరహాగ్ని( గ్రాగుచుండె
నీ కల్కి పల్కుతేనియల( గ్రోలమి శ్రవః పుటములు దాహార్తి( బొక్కుచుండె
తే. నాదు యౌవన వనజగన్నాథు( డరయ హరి యగునుగాని గోమాయు వగునదెట్లు
నాదు సౌందర్య సామ్రాజ్యనాకమునకు( బతియొ గోపాలు( డగుగాని పతిత నరు(డె. 264

ఉ. వీరు(డనంచు( జేది పృథివీపతి నన్గొననెంచు మన్మన
స్సారస సంగత ప్రణయసార మరంద మిళిందరూపు( డో
శ్రీరమణుండు, చారుతులసీవన మీ నవయౌవనమ్ము నో
రూరు లలాయశేఖరున కోపునె గోపకుమారు దండనన్. 265

చ. ఎవని పదాబ్జతోయముల నీశ్వరుభంగి మునుంగుచున్ ఘనుల్
భవభయపంకముక్తి( గొని భాసిలువారలొ వారి యట్లు మా
ధవ ! భవదంఘ్రివారిరుహదాస్య ముపాస్యమటంచు నెంచు నన్
సవిధము జేర్ప వేని వెయి జన్మల నీ పదచింత( గ్రుంకెదన్. 266

ఆ. అంతిపురములోన నలరు నన్ గొనిపోవు తరుణమందు నడ్డుదవులువారి(
జంపవలయునంచు సంశయమొదవ నుపాయ మొండు గలదు తోయజాక్ష ! 267

తే. పెండ్లియగుటకు ముందు మా పెద్ద లెందు పురము వెలి నున్న నగజాత పూజసేయఁ
బంపువార లప్పట్ల నో పద్మనాభ! నియతిఁ గొనిపొమ్ము రుక్మిణి నీదె సొమ్ము. 268

వ. అనుచు నా సందేశమ్ము వినిపించి పరిణయ ముహూర్తంబు నెఱిఁగించి పదంపడి
యమ్ముదిత లావణ్యం బిట్లని వర్ణించె, 269

శా. బంగారమ్మున రంగులద్దు మెయి నా పల్గట్టు ముత్యాల చే
ర్లం గన్మెచ్చు మెఱుంగువెట్టు సుధలొల్కన్ మోవి తాఁ గెంపు నో
శ్శం గూడన్ రుచు లూరఁజేయ నయనోల్లాసంబు మేల్జాతిర
వ్వం గన్విం దిడు వంకదిద్దునెఱి చెల్వం బింద్రనీలాలకున్. 270

తే. పద్మరాగాళిఁ దలఁదన్ను పదతలములు రౌప్యకాంతుల నెగఁజిమ్ము రమణి నఖము
లౌర! నవరత్న భూషల కాభరణము లిదెడి లక్ష్మినిఁ దలఁపించు నింతి రూపు. 271

ఆ. వాసుదేవ! నీవు ప్రత్యక్ష వైకుంఠవాసుఁడవె కదయ్య వాస్తవముగ
నీకుఁ గన్యకామణికి రుక్మిణికి నీడుజోడుఁ గలిసె గురువుతోడు సుమ్ము! 272

క. కుండినపురి విచ్చేయుము ఖండనమునఁ జేది ధరణి పాద్యసురతతిన్
దండించి రుక్మి గర్వము ఖండించి విదర్భ సుతను గైకొనుము హరీ! 273

ఉ. ఆ సుదతీలలామ భవదాశయముల్ వినఁగోరు నన్న, నో
భూసురవర్య! మీ వచనముల్ తలఁదాల్చెద నడ్డవచ్చు క్రూ
రాసురశక్తులన్ నుఱిమియాడెదఁ జేదియఁ దెచ్చెదన్ మదో
ద్భాసిత హస్తిమస్తకము వ్రచ్చి మణుల్గొను మేల్ హరిక్రియన్. 274

క. అనుచున్ భూసురునకు హరి ఘనతర భుషాంబరాదికము లిడి మీద
ర్శనభాగ్య మ్మెనగూడుట లనఘా! కల్యాణకరములని వినుతించెన్. 275

క. సుతునకు భయపడికుండిన పతియుం దన సుతను జేది పాలున కొసఁగన్
మతి నెంచి పరిణయాలంకృతి నతి రమ్యత నొనర్పఁ గృతులను బంచెన్. 276

ఉ. విచ్చిన పూలతోఁటలయి వింతగతిన్ ధ్వజతోరణావళిన్
రచ్చలు రాజమార్గములు రాజిలె భూషల సంబరంబులన్
ముచ్చటగా నలంకరణముం గొను ప్రీలయి సౌధరాజముల్
పచ్చలఁ గెంపులన్ రవల బంగరు రంగుల వెల్గె నల్గడల్. 277

ఉ. అంధతమిస్రపుష్ట భయదాటవులన్ జతఁగూడు ఛాద్మనన్
సింధువు ఘోర నక్రతిమిశ్ళంగి తిమింగిలసంగియై నటుల్
బంధుజనాప్తమిత్ర పరివారగణమ్ములు వెంటరా జరా
సంధక దంతవక్త్ర నిజసైన్యయుతుండయి వచ్చెఁ జైద్యుఁడున్. 278

క. వచ్చెను జైద్యుఁడు స్వాగతమిచ్చె మహీపాలుఁ డుచితహితసత్కారం
బచ్చువడ, రుక్మిణికి మది హెచ్చెను హరి రానిచింత లెదిగెను వంతల్. 279

చ. అరిగెనొ లేదొ భూమిసురుఁ డచ్యుతుఁ డొల్లమి తెల్లమయ్యెనో
పరుఁడగు రుక్మి దీని విని బాడబునిన్ జెఱఁబెట్టెనో రమా
వరదుఁడు రాఁ డదేటికి, వివాహము రే పెటుఁ జేరనోపు నె
వ్వరి ననసేమి నా నుదుటి భాగ్యము చక్కఁగలేమి నింతకున్. 280

వ. అని పరితపించు రుక్మిణికి రుక్మి యాజ్ఞానుసారంబుగా శిశుపాలుని యాగమనం
బెఱింగించి, యభ్యంగనమ్మొనర్చికొని యఖిలాభరణభూషితవై చేతో మోదంబునన్
నూతనవధూ స్వరూపంబున నలరవలయునని యభ్యర్థించిన నప్పువ్వుఁబోఁడి గోపాల
విరహతాపానల వివశయగుచు సఖీజనంబులం గని, 281

సీ. శ్రీగంగ జనకుని స్నేహార్చ లేనిమై నభ్యంగనమ్మేల యని తపించు
సకలార్థము లొసంగు శౌరిఁ జేపట్టని మణిభూషలేలని మదిఁ గలంగు
జలదవర్ణుని గాంచ జాలని కండ్లఁ గజ్జల మేల యనుచు నశ్రులను విడుచు
సుమన స్సుసేవ్యు పాదముల వంగని తలన్ విరులేల యని జడం దుఱుముకొనదు

తే. అక్షయాన్నస్వరూపుని యధర మాననట్టి నోట నన్నం బేలయనుచుఁ దినదు
వేడ్క మురళీధరుని పాట వినని శ్రుతుల గానమేల యనుచు వీణఁ గాన దెపుడు. 282

వ. అంత రుక్మిణిం గని చెలులు, 283

తే. తెలుపిఁగొనక మేఘంబులు గురియుచుండ విడక వడగాడ్పు లెప్పుడు విసరుచుండు
నకట ! తలకిర్రింపులయ్యె నీ ప్రకృతి యందుర్రి బాష్పతతుల నిట్టూర్చెడి పడఁతిఁ గాంచి.

సీ. కొమ్మపైఁ గోయిలకూఁతలె వినరావు పరువంపుటామని మురిపె మేల
ముద్దైన తామరల్ ముకుళించఁబోవెందు శాంతనిశిథినీ సమయమేల
అమలశరజ్జ్యోత్స్న హసియించదేవేశ వరపూర్ణచంద్రవైభవ మదేల
ప్రసవమంజరి సహవసతియే వలదను గాలిమేపరి యందమేల యనుచు

తే. అఖిలమున్ రోసి ప్రియ విరహార్తిఁగుందు కన్యకామణి రుక్మిణిఁగాంచి చెలులు
సరసవాక్కుల శీతోపచర్యసేతు రామె నా చర్యలే యివి యనుచు గొణఁగ. 285

తే. ఇంతలో విప్రుఁ డరుదెంచె నింతికపుడె సగము ప్రాణమువచ్చెనో సాధ్వి ! కృష్ణుఁ
డరుగుదెంచుచున్నాఁడని నంతలోనె యట్టె యెగిరిగంతిడె నుబ్బు నాఁపలేక. 286

క. వచ్చెను గృష్ణుఁడు నినుఁ గడుమెచ్చెను భూషాంబరములు మిక్కుటముగ నా
కిచ్చెనన మీ ఋణమ్మెమిచ్చినఁ దీరదని మ్రొక్కులిడె రుక్మిణియున్. 287

వ. అంత మరునాఁ డుదయమ్మున, 288

ఉ. వచ్చె రమావిభుండుఁ గడువైభవ మొప్పఁగ రౌహిణేయుఁడుం
జెచ్చెరఁ దోడునీడయయి చెంతఁ జెలంగ భటవ్రజంబులున్
హెచ్చిన విక్రమోద్ధతి నుపేంద్రుని గొల్చెడి నిర్జరాళియై
మచ్చిక వెంటనంట రథమత్తగజాశ్వ చమూసమేతుఁడై. 289

ఉ. నీలనభమ్ము జీల్చుకొని నృత్య మొనర్చెడి ప్రావృడబ్ద శం
పాలతికాంగ నా కృతుల బాల యలంకృత చేల త్యక్తరా
జాలయవేల దీప్త సకలాభరణ ద్యుతిజాల తాను దు
ర్గాలయ గర్భశాలకు మహావిభవమ్ముల గ్రాల నేఁగుచోన్. 290

సీ. రహిమీఱ భేరీమురజ శంఖమర్దలతూర్యనిస్వాన సందోహమడర
నిరతవృద్ధసువాసినీ దత్తమంగళ నీరాజన ప్రభానివహమెసఁగఁ
గనకాభరణ దీప్త కన్యాంగనాధృత పూర్ణకుంభద్యుతిపూర మొల్క
భువనమోహన కళాపూర్ణ రంభాబింబ దేవదాసీ నాట్య సేవలలర

తే. వేడ్కఁ సౌధాగ్రములు పుష్పవృష్టి గురియ ఛత్ర చామర రాజలాంఛనము లొప్ప
రథ గజాశ్వ పదాతివర్గములు నడువ నాలయముఁజేరె రాజమరాలబాల. 291

వ. చేరంజని యా కాత్యాయనిం గని. 292

క. అమ్మా ! నిను నెదనమ్మతి నమ్మాధవుఁ బతిని సేయుమమ్మా ! నిన్నున్
నమ్మి చెడినట్టివారలు నమ్మక యిల బాగుపడిన నరులుం గలరే. 293

క. మారుని బ్రదికించితివి కుమారునివలెఁ జూచి, నీ కుమారుఁడు తానుం
నూరిండ్ల మొదలుగావుత ! మారమణియు మారమణిని మఱువం గలదే. 294

క, అనుచుం దుర్గాసతి పూజనమును నత్యంత భక్తిసలిపి తిరిగి తాఁ
జనుదెంచి వీథి నెల్లెడఁ గనుగొని శ్రీకృష్ణుఁ గూర్మి కడలు కొనంగం. 295

క. చూచెను జూపుల వలపులుబూచెను దరహాసరుచులఁ బూ సౌరభముల్
వీచెను విద్యుద్వల్లులు దోఁచెను యువ హృదయములను దోచెను బేర్మిన్. 296

తే. బాల పెదవిఁ గదల్పఁ బల్వరుసతీరు లందముల మూటవిప్ప ముత్యాలపేరు
నాతి క్రీఁగంటఁగను వీక్షణములచాలు దివ్యసౌందర్య సరసిలోఁ దేలు మీలు. 297

ఆ. జలదమందుఁ జిక్కు సౌదామినీ లత కరణిఁ దరుణి మెఱసె హరి యెడందఁ
బసిఁడిలోనఁ గట్టువడిన నీలము భాతిఁ జెలువ యెడఁద శౌరి చిక్కువడెను. 298

ఆ. జనములోనఁ జొచ్చి శత్రుసైన్యము వ్రచ్చి వనితఁ గొనెడి దనుజవైరి తాను
జలధిఁ గలఁతవెట్టి యిల నుద్ధరించెడి ఘన వరాహరూపి యన వెలింగె. 399

ఆ. రథము మందరముగ రాజన్య జలనిధి మధనపఱచి జయము మధుర సుధగ
సైన్యమునకుఁ బంచి, సరసిజాలయ గాఁగ హరి విదర్భ తనయ నపహరించె. 300

వ. అట్టి హరిం గాంచి రుక్మి, 301

ఆ. దొంగతనము నీకు తోఁబుట్టు వెఱుఁగుదున్ వెన్నతోడ నేర్చుకొన్న విద్య
వెన్నముద్దగాదు వెలఁది యియ్యది యింక నరిగె దెచటికనుచు నుఱికె పైకి. 302

ఆ. ఉఱికివచ్చు రుక్మి నొడిచి తేరునఁ గట్టి సతి మొగమ్ముఁ జూచి శౌరి తాను
శిరము దఱుగు టుడిగి శిఖఁ దఱిగి యొకింత విడిచిపెట్టి తనదు వీడుఁ జేరె. 303

సీ. అడుగులం బారాణి యలముకొన్నట్టులు పసుపు కుంకుమ కడపల వెలింగె
తనువున మధుపర్కమును ధరించినయట్లు భవనముల్ వర్ణలేపములఁ దనరె
ఉరమునఁ బూసరుల్ మెఱయుచున్నట్టులు రమ్యతోరణముల రచ్చలలరె
మోముపైఁ బెండిలిబొట్టు పెట్టినయట్లు గోపుర కలశముల్ కొమరు మిగిలె
తే. ధ్వజము లమరె బాసికములు దాల్చినట్లు పురవరమ్మొక పెండ్లికూఁతురుగ నలరె
నపుడు గోధూళికాలగ్న మగుటఁ దెల్పఁ దారకలు ముత్తియపు టక్షతలుగ వెలసె. 304

తే. విజయలక్ష్మిని లక్ష్మిని వెంటఁ గొనుచువచ్చె హరి యని పౌర సువాసినులును
హారతుల నిచ్చి తూర్యవాద్యములు మ్రోఁగ స్వాగత మొసంగి రెంతొ వైభవము మీఱ.

చ. వనితను శౌరి రాక్షస వివాహమునన్ గొనితెచ్చె శూలియున్
వనజభవుం డమర్త్యులును వాసవముఖ్యులు యాదవాదులున్
మునిజనముల్ త్రిలోకములు మోదమునన్ సుమవృష్టిఁ గప్పుచున్
వినుతినొనర్చ సంతతము విశ్వహితం బొనగూడ వేడుకన్. 306

తే. కాంక్ష రుక్మిణీకల్యాణ గాథఁ జదువ నుర్విజన సంతతికి శుభాభ్యుదయ మొదవుఁ
గన్యకలు నాపద తొలంగి మాన్యుఁడైన వరునిఁ గూడి సుఖింతు రవార్యగతులు. 307

వ. అని పోతనార్యుం డాశుగతి హరి యవతారగాథా విశేషంబుల యోగివర్యుం డాదేశించిన ప్రకారము సప్తరాత్రపర్యంతము పూర్తియొనర్చె నంత జనంబులు ఘనంబుగ సంతోషవార్ధిఁ దోఁగాడి కవివర్యుని ప్రతిభావిశేషంబులం గొనియాడి తద్రచిత భాగవతకోశంబు భద్రగతిఁ బ్రాప్తించుఁ గాత యని దాశరథిని బ్రార్థించి నిజగృహంబులకుం జనిరి. 308

## ఆశ్వాసాంతము

క. రామా! రఘుకుల జలనిధి సోమా! సోమక సురారి సూదన భీమా!
భీమాగ్రజాభినుతపద తామరస! రసస్వరూప! దశరథనామా! 309

చ. నరసిజనేత్ర ; సత్యగుణసారచరిత్ర ! రమాకళత్ర : సుం
దరసుకుమార మార నిభదర్శితగాత్ర : మహాపవిత్ర : మ
ద్దురిత లతాలవిత్ర ! భవదుస్తర దుఃఖ తమః ప్రసుప్తహృ
త్సరసిజమిత్ర ! వార్ధి ఘనదర్ప విశోషకపత్ర ! రాఘవా ! 310

మాలిని

ఫణిరచిత శయానా ! వైనతేయైకయానా !
యినశశి కృతనేత్రా ! హృద్యనీలాబ్దగాత్రా !
కనదఘహర గంగా ! కామపుత్రాప్తసంగా !
వినుత సగుణసారా ! వీక్ష్య నైర్గుణ్యపూరా ! 311

గద్యము

శ్రీమద్భరద్వాజగోత్ర పవిత్రాపస్తంబసూత్ర, ప్రథిత సూరిజనమిత్ర, ఏకామ్రయ్యశాస్త్రిపుత్ర వాగేశ్వరీ సమాసాదిత, వైదేహీవర నివేదిత సరసకవితావిలాస, సహజ పాండిత్యభాస, వరకవి విధేయ, 'వరదార్య నామధేయ ప్రణీతంబైన పోతన చరిత్రమను మహాప్రబంధమ్మునందు ద్వాదశాశ్వాసము.

సంపూర్ణము.



# ప్రమాదముల పట్టిక



| పు. | ప. | పా. | దోషము | పరిష్కృతము |
| --- | --- | --- | --- | --- |
| పీఠిక | | | | |
| 7 | 44 | 1 | నాంధ్రిఛందోనంతు | నార్యాఛందోన తు |
| 11 | 11 | 5 | కోలచలమల్లినాథ సద్గురువరేణ్య | మహితగురునికోలాచలమల్లినాథు |
| 12 | 81 | 2 | బుధులు పామరులనకన్ | బుధులఁ బామరులనొగిన్ |
| ప్రథమ ఆశ్వా. | | | | |
| 8 | 67 | 3 | కావ్యసంతతుల సంలిఖయించుగాన | నవ్యదివ్యకృతి సంతతులల్లిఖించు |
| 22 | 193 | 3 | యేరినడుంగుట | యెవ్వరివేడుట |
| 22 | 193 | 4 | తామవిదెల్యనేర్చునే | యయ్యవితా మెఱుంగునే |
| 38 | 149 | 1 | సంతపియింప | సారెఁ దపింప |
| 50 | 20 | 2 | సత్తపనిర్వహణబుద్ధి | సత్తపమునుమనుచుబుద్ధి |
| 51 | 281 | 5 | ప్రియునితనుమనోవాక్యత్రికరణ | వరునితనుమనోవాక్యత్రికరణ |
| 59 | 68 | 1 | (వచనము విస్మృతమైనది) | వ॥ మరియు |
| 59 | 69 | 4 | డిప్పగిదియేగెనుకొన్నిదినమ్ము లిర్వురన్ | డిర్వురికినేఁగెను గొన్నిదినమ్ము లీగతిన్ |
| 63 | 105 | 34 | గూడిపాడుయ్యేల | ఁబాడుమేలుయ్యేల |
| 72 | 187 | 3 | స్వంతపుటింటి బంటుతమిసంగ | సొంతపుటింటి బంటుతమిశోభి |
| 76 | 233 | 2 | యడుగుసనదు | జరుగదడుగు |
| 79 | 263 | 2 | నాప్రాణి | నాయెద |
| 83 | 305 | 1 | గొనివచ్చిచెల్లె | గొనిచెల్లెలమ్మ |
| 84 | 318 | 1-2 | వశముగాకనుదల | వివశచేతనఁ దల |
| 88 | 11 | 1 | మైగలయామలకల్ యొయారముల్ | మైమలకల్ మనసొనొయారముల్ |
| 90 | 23 | 1 | బూలఁబండ్లనాకులనమ్మా | బూవులాకులమ్ముకొనెడి యా |
| 92 | 46 | 3 | నివ్వటిలానవేమ | నివ్వటిలున్ స్వవేమ |
| 94 | 64 | 1 | రూపుగొన్నరటంచు | రూపుఁ గాంచిరటంచు |
| 97 | 84 | 3 | దరముగాదికఁ జాఁలననాల్కరాదు తానినుఁడు | దరముగాదికఁ జాలుననంగనాల్క రాదినుఁడు |
| 99 | 106 | 1 | అనుకొనితిగాని | అనుచుభావింతునది |
| 99 | 107 | | (వచనము-విస్మృతమైనది) | వ॥ అయినను బెనుపయనంపుటిడుమల సుడివడియున్న మిమ్ముఁ శ్రమపెట్టజాల నెల్లియుల్లమురంజిల్లఁజేయుమొల్లంపు కవితల వినవలతుననియనిపిమరునాఁడా సమయంబునకెయదే ప్రదేశమున కవి పుంగవుల నవలోకించి మివుల గౌరవంబున. |

| పు. | ప. | పా. | దోషము | పరిష్కృతము |
|---|---|---|---|---|
| 105 | 159 | 4 | యచ్చెరుగొంటినొక్కటఁ | విస్మితబుద్ధినుంటినేఁ |
| 109 | 195 | 4 | స్మృతిమాఱు పల్కకఁ | స్వైరమాట లేటికిఁ |
| 110 | 203 | 2-3 | దానటువలెన్దేహమ్మొయైమారకఁ లోహంబందున | నావిటుఁడు, దా దేహంబుగామారదే లోహంబందొవి |
| 115 | 245 | 1 | చేయిమెదలుపఁజాలేమొ | చేయిమెదలుపఁ గానేమొ |
| 115 | 248 | 2 | అమరియుండొక | అననొప్పునొక |
| 115 | 149 | 2 | పరిటయంచును పంటగఱచి | చెఱఁగంచుముని పంటగఱచి |
| 119 | 261 | 10 | చెదురు నలకములు | చెదురు భ్రమరములు |
| 123 | 289 | 8 | కొండగమిపై దండువెడలిన | ధరగిరులపై దాడివెడలిన |
| 124 | 11 | 15 | మంజుకుంజుము | వననికుంజము |
| 124 | 11 | 72 | అనుకొంటినివ్యయుని | అనుకొనినే నవ్యయుని |
| 129 | 327 | 2 | ముదితత్రపాప్రణయహతుల | ముదితప్రణయత్రపాహతుల |
| 130 | 339 | 4 | విం,దంచుఁ శిరాలూఁగఁ | వా, రాలించి యూఁగొట్టఁగఁ |
| 130 | 343 | 1 | యిప్పు డమరుడై తినేనెన్ని | యైతినమరుఁడను నేఁడిదెన్ని |
| 132 | 361 | 1 | ప్రభువుసన్నిధులు సేవకునకగును | ప్రభుసన్నిధులుభృత్యువశముగావు |
| 132 | 361 | 2 | ఫలములమరు | ఫలమమరదు |
| 133 | 361 | 3 | యగును | కాదు |
| 133 | 361 | 4 | శ్రీహరికారుణ్యసిద్ధిజిక్కు | శార్ఙ్గికారుణ్యాప్తిసాధ్యపడదు. |
| 135 | 387 | 1 | తోవెంచెడినెవని బ్రదుకు తుది దినములదానే | ప్రోవెంచెడినెవని బ్రదుకు ముగియు దినములిల్లే |
| 136 | 393 | 4 | బంగరుమంగళహారతిత్తునే | బంగరుహారతిబట్టి కొల్తునే |
| 141 | 21 | 2 | నొకభరద్వాజమునుమీదినుండిత్రిప్పి | ఁగాభరద్వాజమునుమీదుగానుద్రిప్పి |
| 153 | 123 | 2 | మొలయ | దీప్తి |
| 170 | 297 | 4 | సంలిఖయింపఁగ | చైత్య వినిర్మితికేమి |
| 174 | 5 | 1 | మాలతిమల్లికలెల్లనవ్వుచుఁ | మాలతిమల్లెయునల్లనవ్వుచుఁ |
| 174 | 7 | 4 | డోలాయితసుగాత్రి పాలాశసుమ వక్త్రితరుణాబ్జనేత్రిసౌందర్యధాత్రి | పంకజాయతనేత్రపాలాశసుమవక్త్రి లావణ్యధాత్రి డోలత్సుగాత్రి |
| 175 | 20 | 4 | గలాదుదాని నెటులా | యిదాలకించియెటులా |
| 176 | 26 | 1 | కవివరులు దెస్గు తెలయించియు | కవులాంధ్రిమందు నెలయించియు |
| 180 | 74 | 4 | యనమహ,,యంచు | యనమ,, యఁటంచు |
| 186 | 120 | 4 | వ్రాతు | గూర్తు |
| 187 | 120 | | ఈపద్యముపిదప నీప్రక్కవచన ముండవలయును | వ॥ అనిపల్కి |
| 187 | 134 | 1 | తేజవిలాస | కాంతివిలాస |
| 187 | 134 | 2 | స్మేరశారదనవాంబుజిముల్వికసింప | స్మేరకోరకితనవ్యసుమమ్ములువిప్ప |
| 191 | 172 | 1 | శ్రీహరివిరచిత | శ్రీహరివ్రాసిన |
| 192 | 182 | 1 | వారలనున్న బేరి | వారలలోన బేరి |

| పు. | ప. | పా. | దోషము | పరిష్కృతము |
|---|---|---|---|---|
| 201 | 39 | 1 | మండుకపోయెడి | మండిపడుచునుండెఁ |
| 204 | 68 | 1 | పీవిచటినుండే యూరికిఁత్రోవ | పీవెచటికి యిల్వెడియాత్రోవ |
| 222 | 209 | 4 | వెన్కనవర్పవచ్చునే | చోనవరింపవచ్చునే |
| 226 | 248 | 4 | బుగలాదె | బగునొక్కొ |
| 227 | 254 | 34 | ఁజాలవియెల్లన్ | నయ్యవియెల్లం |
| 227 | 254 | 34 | మందయానేమనన్ | మందయాయేమనన్ |
| 231 | 296 | 2 | భామలగుండెలన్ | భామలహృత్పుటిన్ |
| 233 | 316 | 2 | సవిశదముగ | సవిస్తరముగ |
| 236 | 342 | 1 | తేదాపెయెతంఁడికెఱుకలేనటు వచ్చెన్ | కాదుపీత యెఱుంగనట్లుగా సుతవచ్చెన్ |
| 238 | 5 | 2 | కొకులకెగఁబ్రాకిమేఁకలాకులను దినును | ఒడ్డులకునెక్కియాబడ్డలొకటమేయు |
| 242 | 47 | 2 | తానొగిశ్రీనాథుఁడగుఁగుచేలుఁ తఁడగున్ | శ్రీనాథుఁడుదానగును కుచేలుఁడ తఁడగున్ |
| 243 | 58 | 1 | రాజాస్థానసుకవినై రాజిలుటన్ | రాజాస్థానసుకవిగ్రాజిలుటన్ |
| 244 | 64 | 1 | కాదనకన్ హరియిచ్చు | కంజదళాతుడొసంగు |
| 247 | 91 | 2 | చెకవివరుండు | చికవియనిపెను |
| 254 | 166 | 2 | సంస్థానభూపాలుఁడో | ధాత్రీసతీనాథుఁడో |
| 256 | 174 | 2 | భృంగినొప్పసంగీనుడుల్ | ప్రేనీనుడుల్ వోలునే |
| 258 | 196 | 3 | అన్నమునీళ్లనడ్గుటయెయాలును బిడ్డనుకండ్లజూతుమే | అన్నమునీళ్లకున్మరియునాలుకుబిడ్డకు నోచుకొందుమే |
| 260 | 216 | 1 | దమినిఁబయఁటాకుకొంగులో | దమినిఁబయఁటాకుచాటునం |
| 260 | 221 | 1 | పోలికనొక్కొక్కమొగ్గపలు విప్పెను పూ | పోలికఁబలువిప్పెనొకొకమొగ్గయపుడె పూ |
| 264 | 262 | | వ॥ అంత పోతనార్యుండతనింగాంచి యిట్లనియె | |
| 266 | 284 | 3 | చిఱుతనిగాంచిపెంచి | చిరుతలనింకగాంచి |
| 268 | 306 | 1 | ప్లవంగకరగుర్వీకంపిత | ప్లవంగప్లవగీవిస్ఫారిత |
| 274 | 27 | 2 | కనుసనొకఁడు | గుంజుపై గూర్చుండిగోకుకొనుచునోటవెదొ కొట్టుకొనునని యెగురునొకడు |
| 280 | 88 | 2 | మశకమొకలెక్క | చీమగతియదెంత |
| 284 | 134 | 1 | అడ్డుగలాదె | అడ్డెదియుండు |
| 285 | 143 | 2 | మహదనుగ్రహము | గుర్వనుగ్రహము |
| 293 | 218 | 3 | నీడయదేమొకాని పుడమిన్ | నీడయదేమొకాని ధరణిన్ |
| 297 | 256 | 3 | శ్రీభూమిసతులువశీకృతలగు | క్షితియుమాసతివశీకృతలగుదురు |
| 317 | 31 | 4 | జేఁజిక్కెనింకేమనన్ | స్వాధీనమయ్యెన్డమిన్ |
| 319 | 51 | 12 | బాచరణీయంబని బమ్మెరకు | నుడివెననిచెప్పిశ్రీనాథుండు, బమ్మెరకు |
| 23 | 86 | 3 | మొందుదెచ్చి | మున్గ్రహించి |

| పు. | ప. | పా. | దోషము | పరిష్కృతము |
|---|---|---|---|---|
| 331 | 17 | 2 | భూపాలశిరములతోఁబాటు | తోడిఱేండ్లశిరాలతోఁబాటు |
| 332 | 28 | 1 | యొడ్డు | ప్రక్క |
| 333 | 48 | 1 | గలిపించుపెనుకాలజలధిలోన | కల్పించుఘనకాలకంధిలోన |
| 337 | 75 | 1 | అంగదరాయబారిదనుజాధిపుఁ గాంచి మదాంధ | అంగదుఁడంత దౌత్యకరణార్థము వేఁజని దైత్యుఁగాంచి |
| 337 | 80 | 2 | స్పర్శించగారాని | స్పర్శచేయగరాని |
| 344 | 143 | 1 | సంచరియింపగరాగవేగ | సంచలనస్థితిఁగూడరాగ |
| 345 | 153 | 4 | లయమ్ములనిల్చుననాది మాయవో! | ధృతిఁ బ్రయళయమ్ములనిల్చుమాయవో |
| 351 | 211 | 4 | కూర్చునె నారదమౌని | కూర్చొని యెఁ సురమౌని |
| 357 | 278 | 1-2 | బ్రహ్మవేత్తలన్మిన్నయితోఁచు | భక్తకోటిలోమిన్నగఁదోఁచు |
| 360 | 305 | 2 | విధవంగూర్చివడంకుచుంటి వణెయబ్బే | యధముంగూర్చివడంకుచుంటివణెయయ్యో |
| 370 | 6 | 2 | ధాత్రీసతీగుండియల్ | ధాత్రీసతీప్రాణముల్ |
| 370 | 6 | 2 | రాకడల్ గాంచుచో | వచ్చుధాకఁగనఁ |
| 374 | 41 | 4 | వేడుదాయీశ్వరుఁ | వేడుదుఁదత్ప్రభుఁ |
| 396 | 250 | 3-4 | పారవశ్యతంగనులనుమూసి | పారవశ్యముంగనికనుమ్రోడ్చి |
| 396 | 255 | 4 | వడిగోపురాలదిగ్రెడిగాలి చక్రముల్ | తిరిగెడిగోపురోపరిగాలిచక్రముల్ |

# తప్పొప్పుల పట్టిక

## పీఠిక

| తప్పు | ఒప్పు | పు. | ప. | పా. |
|---|---|---|---|---|
| పద్మా | పద్మ | 1 | 6 | 2 |
| మేఖు | మేఘు | 4 | 19 | 1 |
| వుత్పత్తి | వ్యుత్పత్తి | 3 | 13 | 1 |
| డుగచు | డగుచు | 7 | 45 | 2 |
| కొంచి | కొంచె | 8 | 49 | 1 |
| నత్కళా | సత్కళా | 8 | 51 | 3 |
| నిజయ | విజయ | 9 | 58 | 5 |
| కొట్టి | కొట్ట | 10 | 64 | 3 |
| కోకిలా | కోకిల | 11 | 69 | 4 |
| నాయకా | నాయికా | 11 | 71 | 1 |
| నున్న | సున్న | 11 | 73 | 3 |
| లక్ష్త్రి | లక్ష్మ | 12 | 77 | 1 |
| జేప్పె | జెప్పె | 12 | 79 | 4 |
| తత్కువ | తక్కువ | 12 | 85 | 6 |
| సమ్మోన | సమ్మోహన | 14 | 106 | 1 |
| నిద్రబోవు | నిద్రపోవు | 14 | 125 | 5 |
| సాతు | సాక్షా | 15 | 116 | 1 |
| నస్మద్ర్య | నస్మద్ర్వ | 15 | 116 | 2 |
| డిలవేల్పు | డిలువేల్పు | 15 | 117 | 2 |
| దినగఐదు | దినఁగనైదు | 16 | 125 | 5 |
| నిశ్చత | నిశ్చిత | 17 | 126 | 4 |

## కావ్యకథాభాగము — ప్రథమాశ్వాసము

| తప్పు | ఒప్పు | పు. | ప. | పా. |
|---|---|---|---|---|
| ఖ్రిస్తో | ఖ్రిస్టో | 2 | .... | .... |
| రమ్గ | రమ్ణ | 2 | 2 | 3 |
| నంతను | నంతయు | 2 | 3 | 2 |
| గొంకక | కొంకక | 4 | 35 | 1 |
| ధరిత్రినందు | ధరిత్రియందు | 6 | 47 | 1 |
| నఖిల | యఖిల | 6 | 49 | 1 |
| జ్ఞానభక్తి | జ్ఞానపూర్ణ | 6 | 50 | 1 |
| తానాతఁడున్ | గానాతఁడున్ | 10 | 88 | 4 |
| లలిత | లలితా | 10 | 89 | 1 |
| మనుస్జనమ్ము | మనుజ్జనమ్ము | 10 | 90 | 4 |
| బావఁడున్ | బాపఁడున్ | 12 | 106 | 4 |

| తప్పు | ఒప్పు | పు. | ప. | పా. |
|---|---|---|---|---|
| యామె | నామె | 13 | 110 | 2 |
| వ్రేనలి | వేనలి | 16 | 141 | 1 |
| వలయుమ్ము | వలయమ్ము | 18 | 156 | 2 |
| పుల్ల | ఫుల్ల | 23 | 204 | 3 |
| ధరువి | ధరుని | 26 | 15 | 1 |
| లపని | లవని | 26 | 23 | 2 |
| యొద్దయని | యొద్దనని | 32 | 88 | 2 |
| లొనగి | లొసగి | 37 | 142 | 2 |
| నయస్జవ | నయజ్జప | 37 | 142 | 4 |
| యిలవేల్పు | యిలువేల్పు | 37 | 143 | 1 |
| అసుచున్ | అనుచున్ | 37 | 143 | 1 |
| సంతపయింప, | సారెఁదపింప | 38 | 149 | 1 |
| యోడి | యొడిని | 38 | 152 | 1 |
| పరిట | పయఁట | 38 | 152 | 1 |
| ఐద్యము | పద్యము | 39 | 161 | 2 |
| కాగ | గాక | 41 | 175 | 1 |
| పొట్టిన | పొట్టన | 48 | 252 | 2 |
| పరబృతములు | పరభృతములు | 50 | 266 | 2 |
| దుర్ధాంత | దుర్దాంత | 52 | 284 | 1 |
| కౌతిక | ఁగౌతుక | 55 | 17 | 1 |
| మేలులుబాలు | మేలులువాలు | 55 | 17 | 1 |
| ఏలనని | ఏలయని | 55 | 18 | 4 |
| నాదరింప | యాదరింప | 55 | 25 | 1 |
| అసజావని | అసచావని | 56 | 29 | 4 |
| చవుకులలో | చవికెలలో | 56 | 34 | 1 |
| జుట్టులం | జుట్టలం | 60 | 83 | 3 |
| జాలిలన్ | జాలెడిన్ | 62 | 94 | 4 |
| తఫస్వి | తపస్వి | 63 | 109 | 4 |
| నంధిత | సంధిత | 64 | 114 | 3 |
| కార్పికాళి | కార్మికాళి | 64 | 117 | 3 |
| యరుగు | నరుగు | 70 | 168 | 1 |
| చాలుచాలనన్ | చాలునాకనన్ | 71 | 181 | 4 |
| న్వప్రభువుల | స్వప్రభువుల | 76 | 239 | 1 |
| సయ్యోద | పయ్యెద | 77 | 243 | 3 |
| నాప్రాణి | నాయెద | 79 | 263 | 2 |

| తప్పు | ఒప్పు | పు. | ప. | పా. |
|---|---|---|---|---|
| ముత్త్రైర | ముత్త్రైదు | | | |
| యామె | వామె | 79 | 264 | 2 |
| నంత | నత్త | 79 | 268 | 2 |
| జొప్పడి | జొప్పడిన | 83 | 310 | 2 |
| యుద్దముల | యద్దముల | 84 | 323 | 2 |
| భోతిక | భౌతిక | 85 | 331 | 1 |
| మంటచున్ | మంటుచున్ | 88 | 14 | 1 |
| జెలుచున్ | జెలుచన్ | 88 | 14 | 2 |
| ఫాదము | పాదము | 92 | 45 | 2 |
| నర్తిలఁ | వర్తిలఁ | 92 | 49 | 3 |
| నడుగంద | నడుగంద | | | |
| కుందెన్ని | వదియెన్ని | 93 | 55 | 4 |
| నిలిచ | నిలిచి | 97 | 85 | 2 |
| సుధా | సుధా | 98 | 98 | 3 |
| అలఘూర్మి | అలఘూర్మి | | | |
| న్వన | స్వన | 101 | 125 | 1 |
| పూజ్యత | పూజ్యత | 102 | 128 | 4 |
| బతిని | బలిని | 102 | 132 | 5 |
| రాజిం | రాజిన్ | 103 | 142 | 2 |
| కాపున | కావున | 105 | 158 | 1 |
| వారిద్ధోరణి | వారివాగ్ధోరణి | 105 | 161 | 2 |
| శ్రీవిష్టు | శ్రీవిష్ణు | 106 | 175 | 2 |
| పేయదే | సేయడె | 107 | 175 | 4 |
| నభయ | సభయ | 109 | 197 | 4 |
| దీవ్రాసన్య | దీవ్రాసహ్య | 109 | 200 | 1 |
| వినంబు | విసంబు | 109 | 200 | 4 |
| దొడ్టి | దొడ్డి | 110 | 208 | 1 |
| నాసరస | దాసరస | 111 | 210 | 2 |
| యచిన | యనిన | 112 | 226 | 2 |
| గజ్జలు | గజ్జెలు | 113 | 233 | 1 |
| జీవముబడె | జీవమువడె | 118 | 256 | 2 |
| గ్రోళ్ల | గోళ్ల | 119 | 260 | 14 |
| గలుప | గలువ | 119 | 262 | 2 |
| విషాదా | విషణ్ణా | 120 | 267 | 1 |
| నగును | నగును | 121 | 281 | 6 |
| శిఖ | శిఖి | 126 | 303 | 3 |
| చాలిఁక | చాలును | | | |
| యెక్కువ | మిక్కిలి | 128 | 321 | 2 |
| అళికా | అళికిన్ | | | |
| శిరోజముల్ | శిరోజముల్ | 129 | 320 | 4 |
| నీరుని | వీరుని | 132 | 353 | 1 |
| కటికాచిన | కంటికాచిన | 132 | 353 | 4 |
| గాసం | గానం | | | |
| బోయెను | బోయెను | 134 | 378 | 4 |
| వ్రాలు | వ్రాలు | | | |
| దెక్కరణిని | చెక్కరణిని | 136 | 389 | 5 |
| స్మనమ్మునకు | న్మనమ్మునకు | 136 | 393 | 2 3 |
| కేనన | కేసన | 137 | 402 | 2 |
| చాతురి | చాతురి | | | |
| యొప్పారు | నొప్పారు | 139 | 4 | 2 |
| రూవటి | రూపటి | 140 | 8 | 4 |
| దివిన్ | దిఃని | 142 | 24 | 2 |
| విచ్ఛేద | విచ్ఛేద | 142 | 32 | 2,3 |
| ముంవ | ముఁప | 144 | 45 | 3 |
| సభమందు | నభమందు | 144 | 48 | 2 |
| గాంచకన్ | గాంచమిన్ | 147 | 71 | 4 |
| తటిచ్చటలు | తటిచ్ఛటలు | 148 | 80 | 2 |
| గాసాహి | గన్సాహి | | | |
| త్యంబు | త్యంబు | 150 | 93 | 3,4 |
| కేమందును | కీమందుని | 151 | 98 | 3 4 |
| యెవరలా | యెవరునీ | 151 | 101 | 2 |
| నిమూఢ | విమూఢ | 152 | 113 | 1 |
| కవీంద్రునొట | కవీంద్రుడొట | 153 | 114 | 4 |
| చుహాకవి | మహాకవి | 153 | 115 | 1 |
| రాజునైతి | రాజనైతి | 154 | 127 | 4 |
| ఘడియెనె | గడియనె | 158 | 169 | 4 |
| కనులమున్ | కనులనున్ | 158 | 171 | 4 |
| చోయిదో | చోనిదో | 158 | 175 | 3 |
| గొమ్మ్యనఁ | గొమ్మనఁ | 159 | 186 | 3 |
| రాఊసి | రాక్షసి | 160 | 194 | 2 |
| నిల్లును | యిల్లును | 161 | 210 | 2 |
| అందులకె | అందుకె | 161 | 210 | 2 |
| కైనాచరించు | కైయాచరించు | 162 | 221 | 2 |
| బ్రబ్బు | బ్రబ్బు | 163 | 230 | 2 |
| యాఱంగ | యాఱఁ | | | |
| గ్రట్టి | గట్టి | 163 | 234 | 2,3 |

| తప్పు | ఒప్పు | పు. | ప. | పా. |
|---|---|---|---|---|
| తులడోడన్ | తులతోడన్ | 164 | 237 | 1 |
| గాసిలబోకని | గాసిలరాదని | 165 | 254 | 4 |
| వొట్టన | పొట్టన | 167 | 275 | 3 |
| కల్ఫ | కల్వ | 169 | 290 | 2 |
| బోద్ధ | బౌద్ధ | 170 | 310 | 3 |
| వయ్యెద | పయ్యెద | 174 | 4 | 3 |
| వలెన్నీని | పలెన్వీని | 175 | 20 | 3 |
| కలితునగుచు | కలితుడనయి | 176 | 25 | 1 |
| యప్రాజ్ఞ | యాప్రాజ్ఞ | 176 | 25 | 2 |
| మొత్తపు | మొత్తము | 178 | 53 | 4 |
| ముఖ్మ | ముఖ్య | 178 | 56 | 2 |
| యనమ | యనమ | | | |
| హోయంచు | యటంచు | 180 | 74 | 4 |
| దుపమాద్మ | దుపమాద్య | 180 | 75 | 1 |
| కిలవేల్పు | కిలువేల్పు | 182 | 86 | 34 |
| నరుదెంచ | నరుదేర | 185 | 113 | 2 |
| పద్గెముల | పద్యముల | 185 | 116 | 4 |
| సర్ఘ్యమిడు | సర్ఘ్యమిడు | 186 | 124 | 1 |
| యానుకృతి | నానుకృతి | 186 | 125 | 2 |
| సేసెను | సేసిరి | 188 | 141 | 2 |
| యతివ | యతివ | 190 | 158 | 2 |
| మనస్థురై | మనస్కులై | 192 | 179 | 3 |
| యుగుచు | యగుచు | 194 | 202 | 1 |
| ఏముఙ్ | ఏమునఙ్ | 199 | 21 | 3 |
| టసుకకు | టననక | 199 | 22 | 3 |
| కులునిడుదని | కులిడెదనని | 200 | 32 | 2 |
| శ్రీఘ్రి | శీఘ్రి | 202 | 45 | 2 |
| గోఫురా | గోపురా | 203 | 55 | 2 |
| అడ్డగించి | అడ్డగించి | 204 | 60 | 4 |
| సొండనెన్ | పొండనెన్ | 204 | 64 | 4 |
| సదస్సమా | సరస్సమా | 207 | 91 | 2 |
| వితాంత | నితాంత | 207 | 91 | 3 |
| ప్రతభా | ప్రతిభా | 208 | 97 | 2 |
| నానాసూన | నానానూవ | 210 | 116 | 1 |
| బయన | బయన | | | |
| ముకనయి | మునకయి | 211 | 133 | 2 |
| ధన్యంగనెన్ | ధన్యతంగనెన్ | 214 | 152 | 4 |
| బద్ధుండై | బద్ధుతై | 215 | 158 | 18 |

| తప్పు | ఒప్పు | పు. | పు. | పా |
|---|---|---|---|---|
| శత్రుఘ్నుల | శత్రుఘ్నుల | 216 | 158 | 4 |
| నొఁర్చుటయు | నొనర్చుటయు | 216 | 158 | 17 |
| దేతత | దేవత | 216 | 158 | 31 |
| నినిమ్మనవి | నిమ్మనవి | 218 | 168 | 4 |
| కెన్నిమొ | కెన్నియొ | 218 | 170 | 3 |
| వసుద | వసుధ | 218 | 173 | 2 |
| వానిగాను | జ్ఞానిగాను | 220 | 190 | 1 |
| గతినియొ | గతియొ | 220 | 191 | 3 |
| కెంపాదవఁ | కెంపెదుగఁ | 220 | 193 | 2 |
| గూర్చు | గూర్చు | | | |
| కొఁటిరో | కొండురో | 220 | 194 | 3 |
| కొంచరుగం | కొంచుఁజనం | 222 | 205 | 4 |
| నొల్పెడి | వొల్పెడి | 222 | 207 | 4 |
| నీయెురపీడి | నాయెురపీ | 222 | 209 | 2 |
| సాంపా | సాంప | | | |
| రాయిక | రాయిక | 223 | 217 | 5 |
| నిశితాశిన్ | నిశితాసిన్ | 223 | 220 | 2 |
| చాలయొప్పు | చాలనొప్పు | 223 | 226 | 2 |
| చత్రులన్ | శత్రులన్ | .224 | 233 | 2 |
| నజీవ | సజీవ | 225 | 237 | 1 |
| బొనరింతునో | బొనరించునో | 225 | 238 | 3 |
| మహాత్మ్య | మాహాత్మ్య | 225 | 242 | 3 |
| మందయా | మందయా | | | |
| నేమనన్ | యేమనన్ | 227 | 254 | 4 |
| రాజేంచ్రుని | రాజేంద్రుని | 230 | 287 | 2 |
| జయాభారతి | జయభారతి | 232 | 304 | 2 |
| మరియు | మురియు | 233 | 313 | 1 |
| శద | దశ | 233 | 313 | 1 |
| ఁగవియఁ | ఁగవియుఁ | 235 | 333 | 2 |
| భూమపాలు | భూమిపాలు | 238 | 11 | 2 |
| కనకప్పష్టి | కనకవృష్టి | 239 | 18 | 1 |
| సల్పె | సల్పె | 240 | 28 | 4 |
| శాంతివిశ్వము | కాంతివిశ్వము | 241 | 37 | 3 |
| భాప్ప | బాప్ప | 243 | 50 | 4 |
| కవినై | కవిగ | | | |
| రాజిలు | నాగ్రజిలు | 243 | 58 | 1 |
| యొసంగతి | యొసంగితి | 244 | 65 | 3 |
| తనకై | తనకై | 246 | 76 | 1 |

